# బీళ్ళు దున్నేరు

రచన:

మైఖేల్ షొలొఖోవ్



అనువాదం:

మహీధర కృష్ణమోహన్



విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.





MIKHAIL SHOLOKHOV

# Virgin Soil upturned

VISALAANDHRA PUBLISHING HOUSE,

VIJAYAWADA.



# మైఖేల్ షొలొఖోవ్

# బీళ్లు దున్నేరు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# రచయిత



మైఖేల్ షాలాఖోవ్

# బీ ళ్లు దు న్నే రు

## ఒకటో ప్రకరణము

### ఆ గం తు కు డు

అది 1930 వ సంవత్సరం; జనవరినెల. ఒకరోజు సాయంకాలం గుఱ్ఱపు రౌతు ఒకడు 'స్టెప్పీ' (పచ్చిక బయలు) నుంచి గ్రిమాచీలాగ్‌కు పోవు బాటవెంబడే వస్తున్నాడు. ఆవూరి పొలిమేరలో ప్రవహిస్తూన్న ఏటి వార గుఱ్ఱాన్నాపి, క్రిందికి ఉరికేడు. గుఱ్ఱం రొమ్మంతా నిరంతరాయంగా కురుస్తూన్న మంచుతో నిండివుంది. బాటకి రెండువైపులానున్న చెట్లగుబురుల్లోంచి చంద్రుడు తొంగిచూస్తూన్నాడు. అప్పటికప్పుడే బాగా రాత్రి పడడంచేత ఆప్రాంతమంతా నిర్మానుష్యంగా వుంది. ఏటి అవతల ఎక్కడో కుక్క మొరిగిన ధ్వని వినిపించింది. దూరాన్నుంచి వెలుతురు మినుకు మినుకుమని కనిపిస్తూంది. రౌతు నెమ్మదిగా ఊపిరి తీసుకుని, సావధానంగా చేతి 'గ్లోవు' ఊడతీసి, సిగరెట్టు వెలిగించేడు. జీను సరిచేసి, జీనుక్రింద చెయ్యిపెట్టి చెమటలు కక్కుతూన్న గుఱ్ఱపువీపు ఆవిరికక్కుతూంటే చూసి తృప్తిచెందేడు. ఒక్కమాటు నిదానించి గభాలున గుఱ్ఱంమీదికి ఉరికి ప్రవాహంలోనికి నడిపించేడు. గుఱ్ఱపుడెక్కలు నీళ్ళలోని గులకరాళ్ళమీద పడి గలగల ధ్వని చేస్తున్నాయి. ప్రవాహంలో నడుస్తూ నీళ్ళుతాగడానికి గుఱ్ఱం మెడ వంచింది. కాని, రౌతు కళ్లెం బిగలాగి తరట పెట్టడంచేత, పక్కలు ఎగరేస్తూ నెమ్మదిగా అవలిఒడ్డు ఎక్కసాగింది.

సమీపంలో మనుష్యుల అలికిడి, స్లెడ్జిబండి లాగుతూన్న చప్పుడు విని, రౌతు కళ్ళెం బిగలాగేడు. గుఱ్ఱం చెవులు రిక్కించి ధ్వని వినబడిన

వైపు చూసింది. రౌతు రొమ్ముమీది వెండిపొదిగిన పతకాలు, జీనుముందరి భాగపుగుబ్బ. చంద్రకాంతిలో తళతళ లాడేయి. కంగారుపడుతూ, కళ్ళెం వదిలేసి కోసక్ టోపీ ముఖంమీదికి లాక్కొని. గుఱ్ఱాన్ని పరుగెత్తించేడు. ఎదురుపడ్డ మనుష్యులు దాటిన తరువాత గుఱ్ఱపువేగాన్ని తగ్గించేడు; కాని, టోపీని మాత్రం తియ్యలేదు.

గ్రామంలోకి వచ్చినతర్వాత దోవలో ఎదురుపడిన ఒకస్త్రీని పిలిచేడు:

"యాకోవ్ ఆస్త్రోనోవ్ ఇల్లు ఎక్కడ?"

"అంటే....యాకోవ్ లూకుచ్ కామా?"

"అవును....అతనే."

"అదిగో! ఆ కనిపిస్తూన్న పూరిల్లు చూసేవూ....ఆచెట్టుకి ఎదురుగా; అదే అతని యిల్లు"

"సరే, తెలిసింది. సెలవు."

విశాలంగావున్న ఆపూరింటియెదుట గుఱ్ఱం దిగి, కళ్లెం చేతపుచ్చుకొని నడిపిస్తూ ఆవరణలోపలికి వెళ్లేడు. చేతిలోనున్న కొరడాతో తలుపు మీద చప్పుడు చేస్తూ,

"యాకోవ్ లూకుచ్! తలుపు తీస్తావా?" అని కేక వేసేడు.

నెత్తిమీద టోపీలేకయే, కోటుఒకటి పైన వేసుకొని ఆయింటి యజమాని తలుపుతీసి గుమ్మంలో నిలబడి, కొంతసేపు అకొత్తగా వచ్చిన వ్యక్తిని నిదానించి చూసి గడపదాటి వచ్చేడు.

"ఎవరు మీరు?"

"లూకుచ్! ఇంకా గుర్తుపట్టలేదూ నన్ను? ఈ రాత్రికి ఇక్కడ ఆగుతాను. గుఱ్ఱాన్ని కట్టడానికి మంచి స్థలం ఏదేనా వుందా?"

"కామ్రేడ్! నేను మిమ్మల్ని గుర్తుపట్టలేకుండా వున్నాను. జిల్లా కమిటీనుంచి వచ్చేరనుకుంటాను. అవునా?....లేక వ్యవసాయ డిపార్టుమెంటు తాలూకా? మిమ్మల్ని ఎక్కడనో చూసిన జ్ఞాపకంవుంది."

ఆ ఆగంతుకుడు చిరునవ్వు నవ్వుతూ ముఖమును కప్పియున్న కోసకు టోపీ తీసివేసేడు.

"పోలోవిట్సీవ్‌ను ఎరుగుదువా ?"

ఆమాట వినగానే యాకోవ్‌లూకుచ్ నిర్ఘాంతపోయేడు. ఎవరేనా వున్నారేమోనని కంగారుతో నలుదిక్కులా చూసేడు.

"చిత్తం, తమరా। ఎక్కడనుంచి దయచేసేరు ? గుఱ్ఱాన్ని కట్ట డానికి శుభ్రమైన సాల వుందిలెండి. ఇప్పుడే అక్కడ కట్టేయిస్తాను. తమరు ఎంతసేపటినుంచి...." అన్నాడు నెమ్మదిగా.

"ఇప్పుడే. గట్టిగా మాట్లాడకు. మీ యింట్లో కొత్తవాళ్లు ఎవరేనా వున్నారా ?"

ఆ రౌతు చేతులోని కళ్ళెం లూకుచ్ చేతికిచ్చేడు. మెడజాపి తల కొంచెం పైకియెత్తి, వెనకకాళ్ళు నెమ్మదిగా ఈడుస్తూ ఆ గుఱ్ఱం లూకుచ్ వెంబడే వెళ్ళింది. తబేలాలో ఇంకో గుఱ్ఱం వుండడం పసికట్టి సకిలిం చింది. లూకుచ్ కళ్ళెం తీసేడు. గుఱ్ఱం మేత ప్రారంభించింది.

"టంగులు కొంచెం వొదులుచేసేడు. గుఱ్ఱం చల్లబడ్డ తరువాత తియ్యవచ్చు జీను;" అంటూ యాకోవ్ లూకుచ్ గుఱ్ఱం నడ్డిమీద ఒక గుడ్డ కప్పేడు. గుఱ్ఱం చాలా అలసి యుండడంచూసి, అతడు తన అతిధి చాలా దూరాన్నుంచి వచ్చియుంటాడని ఊహించేడు.

"యాకోవ్ లూకుచ్। పాడి, పంట బాగావున్నాయా ?"

"ఆ-వాటికి లోటులేదు. కొంతసేపయినతరువాత నీళ్లుపెట్టి గడ్డి వేస్తాను: ఇప్పుడప్పుడే తొందరలేదు. లోపలికి రండి.... ఇప్పుడు మిమ్మల్ని ఏమని పిలవాలో నాకు తెలియకుండావుంది. పూర్వపు పేర్లతో పిలవడానికి కొత్తగా వుంది ఎందుచేతనో."

"పోనీ-చిన్నప్పుడు మా తలిదండ్రులు పెట్టిన పేరుతో పిలు: ఆ పేరు మరచిపోలేదనుకుంటాను. ఏం-మరచిపోయేవా?" అతిథి తబేలా వదిలి బయటికి వచ్చేడు. లూకుచ్ నెమ్మదిగా అతనివెనక బయలుదేరేడు.

"ఎలా మరిచిపోగలను? మనం ఇద్దరం కలిసి జర్మను సైన్యాన్ని చావకొట్టి తరిమేవాళ్ళం. ఆ ఆఖరు యుద్ధంలో మనం........అలెగ్జాండర్! అప్పుడప్పుడు మీరు జ్ఞాపకం వచ్చేవారు. నోవోరొసిస్కులో మనం విడి పోయినతరువాత మళ్ళీ మీ సంగతే తెలియలేదు. కోసక్కులతో కలిసి మీరు టర్కీకి వెళ్ళిపోయి వుంటారనుకున్నాను."

ఇద్దరూ మాట్లాడుకుంటూ వంటయింట్లోకి వెళ్ళేరు. ఆ కొత్తగా వచ్చిన వ్యక్తి నెత్తిమీది టోపీతీసి, క్రౌర్యాన్ని వెలిగక్కే ఆ చిన్న నీలి కళ్ళతో గది నాలుగుమూలలా కలయచూసేడు. అక్కడే బల్లమీద కూర్చుని యున్న ఇంటి యజమానురాలిని చూసి కుశలప్రశ్న వేసేడు. ఆమె ముక్త సరిగా సమాధానం చెప్పి, "కొత్తగావచ్చిన ఈయన ఎవరు? మేము అత నిని ఎట్లు గౌరవించాలి?" అని అడుగుతూన్నట్లు లూకుచ్ కళ్ళలోకి చూసింది.

"వెళ్ళి భోజనం సిద్ధంచెయ్యి" అని భార్యకు ఆజ్ఞాపించి అతిథితో కూడ విశాలంగా అందంగా వున్న ఒక గదిలోకి వెళ్ళి, బల్లమీద కూర్చు న్నాడు. ఆ అతిథి భోజనంచేస్తూ వాతావరణస్థితిని గురించి, పూర్వ స్నేహి తుల్ని గురించి మాట్లాడేడు. భోజనం ముగించివచ్చి, ఆతడు ఒకమూల ధూళితో కొట్లాడుతూన్న సిలువదగ్గరికి వెళ్ళి, మోకరించి ప్రార్థించేడు. "లూకుచ్, నాకోసం చాలా శ్రమపడ్డావు. ఇప్పుడు నీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి."

లూకుచ్ తన భార్యకేసి వెళ్ళిపొమ్మన్నట్లుగా చూసేడు. ఆమె త్వరగా బల్ల శుభ్రపరచి వెళ్ళిపోయింది.

# రెండో ప్రకరణము

## డే వి డో వ్.

పార్టీ డిస్ట్రిక్టుకమిటీ సెక్రటరీ కొంచెం మందకొడి మనిషి. ఆఫీసు గదిలో బల్లముందు కూర్చుని, పక్కన నిలబడియున్న దేవిడోవ్‌ను కొంత సేపు నిదానించి చూసి, అతడు తెచ్చిన డాక్యుమెంట్లు తిరగెయ్యడం ప్రారంభించాడు.

బయట గాలి హోరుమని వీస్తూంది. ఒక గుంజకు కట్టబడ్డ గుర్రము సడ్డిమీద పిట్టఒకటి వాలి పొడుస్తూంది. గాలి విసురుకి ఎగర కొట్టబడి తిరిగివచ్చి గుర్రముమీద వాలి, విజయగర్వంతో మెడయెత్తి నలువైపులా చూసింది. ఆకాశంమీద మేఘాలు వేగంగా పరుగెత్తుతూన్నాయి. క్రిందకూడ ఎండ, నీడ ఒకదాని నొకటి తరుము కెడుతున్నాయి. కిటికీలోనుంచి చూస్తే, దూరంగా 'డాన్' నది, దానివెనుక అరణ్యము, ఆ వెనుక మంచుతో కప్పబడి తెల్ల తెల్లగా కనిపిస్తూన్న పర్వతాలు....ప్రకృతి బహు సుందరంగా వుంది.

"అయితే జబ్బుచెయ్యడంచేత ఇంతవరకు మీరు రాస్టోవ్‌లోనే వున్నారన్నమాట; సరే....ఈ ప్రాంతాల్లో సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణావశ్యకతను గురించి ప్రచారం చెయ్యడానికని పంపబడిన 8 మంది మూడురోజుల క్రిందట వచ్చేరు. మేమంతా సమావేశం అయేము. సమిష్టి వ్యవసాయక్షేత్రాల ప్రతినిధులంతా వారిని కలుసుకొని మాట్లాడేరు." సెక్రటరీ ఏదో ఆలోచిస్తూ క్రింది పెదవి కొరికేడు. "ఇక్కడ పరిస్థితులన్నీ చాలా విషమంగా వున్నాయి. ఈ జిల్లాలో 14.8%ను మాత్రం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేర్చడం అయింది. వీటిలో చాలాభాగం సమిష్టిగా వ్యవసాయం చేసుకొనడానికి ఏర్పరచబడ్డ చినచిన్న సంఘాలు మాత్రమే.

కులకులు (పెద్దరైతులు) ఎవ్వరూ ఈ దరికేనా రావడంలేదు. పన్ను కూడా చెల్లించడం లేదు. ఇటువంటి సమయములో మనకి ఎంతమందివున్నా అవసరమే: 43 మంది ప్రచారకుల్ని పంపమని వ్రాస్తే 9 మందిని మాత్రం పంపించి వారితోనే సరిపుచ్చుకోమన్నారు" ఆ మిడిగుడ్లతో మళ్ళీ దేవిడోవ్ కేసి చూసేడు.

"కామ్రేడ్! మీరు తాళాలు బాగుచేస్తుంటా రన్నమాట. బాగానే వుంది. అయితే—మీరు ప్యూటిలోవ్ కర్మాగారంలో ఎంతకాలంనుంచి పని చేస్తున్నారు సిగరెట్టు కాలుస్తారా?"

"సైన్యాల్ని విడిగొట్టేసినప్పటినుంచీ కూడాను; అప్పుడే 9 ఏళ్ళు అయింది." అంటూ దేవిడోవ్ సిగరెట్టుకోసం చెయ్యిజాపేడు. అతని ముంజేతిమీది పచ్చబొట్టు చూసి, సెక్రటరీ చిరునవ్వుతో.

"మీరు నౌకాదళంలో పనిచేసినట్టున్నారే"

"అవును."

"మీ చేతిమీద ఆ పచ్చచూసి అనుకున్నాను."

"ఏదో—అప్పుడు చిన్నతనం. వేస్తూంటే మాట్లాడక ఊరుకున్నాను" దేవిడోవ్ కోపంతో చొక్కా చెయ్యి క్రిందికి తీస్తూ "దీనికేం గాని. పన్ను వసూళ్ళ విషయం చూద్దురూ ముందు."

సెక్రటరీ మౌనంగా వూరుకున్నాడు. పెదవులమీది అర్థంలేని చిరునవ్వు మాయం అయింది.

"కామ్రేడ్! మీరు జిల్లాకమిటీ ప్రతినిధిగా ఈ రోజుననే బయలుదేరి వెళ్ళండి. రీజియనల్ కమిటీ కొత్తగా యిచ్చిన సూచనలు ఎరుగుదురుకాదు? .... ఎరుగుదురా! సరే. వెంటనే మీరు గ్రిమాచీ గ్రామసోవియటుకి వెళ్ళండి, ఇప్పుడు ఏ మాత్రం ఆలస్యం చెయ్యడానికి వీలులేదు. అక్కడికి వెళ్ళిన తరువాత విశ్రాంతి తీసుకొనవచ్చునులెండి.

నూటికి నూరుపాళ్లు—భూమి సమిష్టి వ్యవసాయక్షేత్రాల క్రిందికి తీసుకొని రావలసిన బాధ్యత మీది. అక్కడ నామమాత్రంగా ఒకసంఘం వుందిగాని, అంతగా పనిచేయడంలేదు. ఇప్పుడు మనం బ్రహ్మాండమైన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఏర్పాటు చెయ్యాలి. త్వరలోనే ఒక ప్రచారకదళం మీ సహాయానికి అక్కడికి పంపిస్తాను. మీరు వెళ్ళి వెంటనే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఏర్పాటుచేసి, జాగ్రతగా, నేర్పుతో, భాగ్యవంతుల్ని అణగ త్రొక్కాలి. గ్రామంలోని బీదరైతుల్ని, మధ్యరకపు రైతుల్ని, పూర్తిగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో సభ్యులుగా చేర్చండి. తరువాత 1930 లో సమిష్టిగా సేద్యం చేయదలచిన భూమికి పెట్టుబడి కొరకు కొంత 'ఫండు' ధాన్యం రూపంగా వసూలు చెయ్యండి. ఈ పని అంతా చాలా జాగ్రత్తగా చెయ్యాలి. సామాన్య రైతులతో ఆట్టే విరోధ పడకండి. గ్రిమాచీలాగ్ లో ముగ్గురు సభ్యులతో మన పార్టీశాఖ ఒకటివుంది. దాని శెక్రటరి, గ్రామసోవియటు అధ్యక్షుడుకూడ చాల చురుకైనవాళ్ళు. పూర్వం 'రెడ్ పార్టిజాన్ దళాల' లో పనిచేసేరు. ఇంక నేను చెప్పేదేముంది–పరిస్థితుల్ని బట్టి మీకు తోచినట్లు పనిచెయ్యండి. వాళ్ళకి రాజకీయ పరిజ్ఞానం తక్కువ అవడంచేత అప్పుడప్పుడు పొరపాట్లు చెయ్యచ్చు. ఏ విషయంలోనైనా మీకు సలహాగాని, సహాయంకాని కావలసివస్తే జిల్లా కార్యాలయానికి రండి; ఇంకా ఆ గ్రామానికి ఇక్కడికి టెలిఫోను సౌకర్యాలు లేవు. ఆ వూళ్ళోని పార్టీ శెక్రటరీ 'ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్' బిరుదాన్ని పొందేడు. కొంచెం కోపిష్ఠి; మోటుదనం ఎక్కువ". శెక్రటరీ ఎదటి బల్ల మీద తన వేళ్ళతో టకటక వాయిస్తూ, డేవిడోవ్ ఇంకా అక్కడే వుండడం చూసి మళ్ళీ ప్రారంభించేడు.

"ఇంకొక్క విషయం చెప్పడం మరచిపోయేను; ప్రతిరోజు ఎప్పటివార్తలప్పుడు నాకు తెలియచేస్తూండండి. అక్కడనున్న మన వాళ్ళని కొంచెం అదుపు ఆజ్ఞలలో వుంచండి. ఇప్పుడు మీరు నిర్మాణ

శాఖకి వెళ్ళి మరీ వెళ్ళండేం! జిల్లా ఎగ్జిక్యూటివ్ కమిటీ తాలూకు గుప్తాలు మీకు సప్లయి చెయ్యమని తెలియచేస్తాను. మీరు వెళ్ళిన పని నూటికి నూరుపాళ్ళు సాధించుకు రావాలి. ఈ 18 గ్రామ సోవియటులను కలిపి ఒక బ్రహ్మాండమైన సమిష్టి వ్యవసాయక్షేత్రం ఏర్పాటు చెయ్యాలి."

"భాగ్యవంతుల్ని అణచడంలో కొంచెం నేర్పుగా ప్రవర్తించ మన్నారు. ఆ విషయం కొంచెం వివరంగా చెప్పండి."

"చెప్పడానికేముంది?" శెక్రటరీ గర్వంగా చిరునవ్వు నవ్వేడు. "భాగ్యవంతులు రెండు రకాలు. ధాన్యరూపంగా ఇయ్యవలసినదంతా చెల్లించేవారు కొందరు: మూర్ఖపు పట్టుదలతో ఏమియు చెల్లించనివారు కొందరు. ఈ రెండవ రకపు భాగ్యవంతుల్ని ఏమి చెయ్యాలో తెలుస్తూనే వుంది. ఏమీ సంశయించకుండా ధాన్యపు వసూలు చట్టం 107 వ ఆర్టికిల్ ప్రకారం మాడ్చిపారెయ్యడం. కాని, మొదటిరకపు కులకుల్ని ఏమి చెయ్యాలీ అన్నదే కొంచెం ఆలోచించవలసిన విషయం. వీరి విషయంలో ఏంచేస్తే బాగుంటుందంటారు?"

"చెయ్యడానికేముంది? మళ్ళీ అదనపుపన్ను విధించడం."

"అబ్బే! కామ్రేడ్, అదేమీ సరియైన విధానం కాదు. దానివల్ల మన గొయ్యి మనమే తవ్వుకున్న వాళ్ళం అవుతాం. ప్రజలకి మనమీద వున్న గౌరవం నశిస్తుంది. ఇల్లాచేస్తే సామాన్య రైతులు ఏమనుకుంటారు? వాళ్ల 'సోవియటు ప్రభుత్వం చేసీపని యిది! ఏదో విధంగా రైతులందర్నీ నాశనం చేస్తారు.' అనుకుంటారు. రైతు సమస్యల్ని ఉపేక్షాభావంతో చూడక, జాగ్రత్తగా ఆలోచించి, వారిని మనవైపుకి తిప్పుకొనడానికి ప్రయత్నించాలి.' అని కామ్రేడ్ లెనిన్ చెబుతూంటే, వారిమీద అదనపుపన్ను విధించమంటారు మీరు. అవన్నీ చిన్నతనపు చేష్టలు. వాటివల్ల లాభంలేదు."

"ఏమిటి? చిన్నతనపు చేష్టలా!" దేవిడోవ్ ముఖం జేవురించింది. "అయితే మీ వుద్దేశ్యం ప్రకారం 'స్టాలిన్' అవలంబించిన విధానం తప్పు అన్నమాట."

"నే చెప్పినదానిలో స్టాలిన్ విషయం ఏముంది?"

"ఈ మధ్య స్టాలిన్, మార్క్సిస్టు........అదేదో కాన్ఫరెన్సు జరిగి నప్పుడు....భూమి సమస్యను గురించి మాట్లాడిన ఉపన్యాసం చదివేను.... వారిని ఏమని పిలుస్తారు? నోట్లో ఆడుతూంది...."

"అగ్రేరియనులనా?"

"ఆ! అది! మరచిపోయేను."

"సరే. తర్వాత విషయం కానియ్యండి."

"ఆ ఉపన్యాసం అంతా 'ప్రవదా' లో పడింది. ఆ పత్రిక ఒక్కసారి తెప్పించండి."

సెక్రటరీ 'ప్రవదా' తీసుకు వచ్చేడు. దేవిడోవ్ గబగబా పేజీలు తిరగెయ్యడం మొదలెట్టేడు.

అతడు నవ్వుతూ దేవిడోవ్ ముఖంకేసి చూసేడు.

"ఆ! ఇదిగో! వినండి చదువుతాను...."దేశములోని భూమి అంతా కాకుండా, కొంత భాగము మాత్రమే సమిష్టివ్యవసాయ క్షేత్రాలుగా ఏర్పాటు చేయుటకు ప్రయత్నించినంత కాలము, మనం భాగ్యవంతుల్ని అణగ త్రొక్కలేము." ఇంకా యిక్కడ ఏమన్నాడంటే, "కాని ఇప్పటి పరిస్థితు లన్నీవేరు. భాగ్యవంతుల నిరోధకశక్తిని నాశనంచేసి ఆవర్గం పూర్తిగా అంతరింప చెయ్యడానికి అవకాశం కలిగింది మనకి." చూసేరా-ఇక్కడే మన్నాడో? 'వర్గాన్ని అంతని' అని అన్నాడు. తెలియలేదు? ఇంత స్పష్టంగా చెప్పినపుడు అదనపు పన్ను ఎందుకు విధించకూడదు? అదనపు పన్ను విధించడమే కాదు, నేలనెట్టి రాసెయ్యాలి వాళ్ళని."

శెక్రటరీ పెదవులమీది చిరునవ్వు పోయింది. ముఖం గంభీరత దాల్చింది.

"సమిష్టివ్యవసాయక్షేత్రాలలో చేరిన బీదరైతులచేత, మధ్య రకపు రైతులచేత ధనిక వర్గాన్ని అంతని అంతరింపచెయ్యాలి." అన్నాడు. అంతే కాదు? కానియ్యండి."

"ఊఁ! మీరు...."

"ఊఁ లేదు; ఆలేదు." శెక్రటరీ అతి కోపంతో అన్నాడు. మాట కూడా కొంచెం తడబడింది. "మీరిచ్చే సలహా ఏమిటి? పిడుగుకి బియ్యానికి ఒకటే మంత్రం అన్నట్లు పన్ను చెల్లించినవారిమీద చెల్లించనివారి మీద కూడ ఒకే విధంగా చర్య తీసుకుంటారన్నమాట. అదీగాక 14.8% భూమి మాత్రం సమిష్టి వ్యవసాయక్షేత్రాలుగా ఏర్పడి సామాన్యరైతులు ఇప్పుడిప్పుడే సమిష్టివ్యవసాయక్షేత్రాలలో సభ్యులుగా చేరుతూన్న ఈజిల్లాలోనా ఆవిధానం అవలంబించడం? స్థానిక విషయాలు తెలియకుండా, ఎక్కడినుండోవచ్చిన మీబోటివారంతా...." శెక్రటరీ ఉద్రేకాన్ని ఆపుకొని నెమ్మదిగా చెప్పడం ప్రారంభించేడు.

"ఏవో పెద్దపెద్ద ఊహలు మనస్సులో నుంచుకొని పైకి తమ యిష్టం వచ్చినట్లు మాట్లాడుతూంటారు...."

"సరే. ఆ...."

"ఒక్కసారి ఆగండి— మధ్య అడ్డంరాక. భాగ్యవంతులమీద అటువంటి చర్య తీసుకోవలసిన అవసరంవస్తే, రిజియనల్ కమిటీనుంచి 'ఏవిధంగానైనా సరే ధనికవర్గాన్ని నాశనం చెయ్యండి.' అని వాళ్ళు తెలియచెయ్యనే తెలియచేస్తారు. అప్పుడు మిలీషియా సహాయంతో వారినందర్నీ అణచి పారెయ్యచ్చు. కాని అంతవరకు పన్ను చెల్లించనివారిని మాత్రం 107 వ ఆర్టికల్ ప్రకారం దావాచేసి తగినచర్య తీసుకొనడం చాలు."

"అయితే-బీద రైతులు, సామాన్యరైతులు, కూలీలు మొదలైన వారు ధనికవర్గాన్ని నాశనం చెయ్యడానికి అంగీకరించరంటారా? వారంతా పెద్దరైతుల పక్షం వహిస్తారనా మీవుద్దేశం?"

శెక్రటరీ డ్రాయరు తాళం వేసేడు.

"నాయకులు చెప్పినదానికి మీయిష్టం వచ్చినట్లు అర్థం చెప్పచ్చును. కాని, ఈజిల్లాకు నేను, జిల్లా కమిటీ బ్యూరోమాత్రమే జవాబుదారీ. మీరు మా నీతి ననుసరించి పనిచెయ్యవలసిందే కాని మీ ఇష్టం వచ్చినట్లు పని చెయ్యడానికి వీలులేదు. అవతల నాకు చాలాతొందర పనులున్నాయి. ఇంక మీతో కూర్చుని మాట్లాడడానికి తీరుబడిలేదు." అంటూ శెక్రటరీ లేచి నిలబడ్డాడు.

డేవిడోవ్ ముఖం జేవురించింది. పెదవులు చలించేయి. కాని, కోపం అణచుకొని నెమ్మదిగా,

"నేను పార్టీ అనుసరించమనిన నీతి అనుసరిస్తాను. దాపరికం ఎందుకు? నిర్మొహమాటంగా చెప్తున్నాను, మీరు అనుసరించమనిన విధానం తప్పు. రాజకీయ దృష్ట్యా అది సరియైనది కాదు. ఈవిషయం ఘంటాపదంగా చెప్పగలను" అన్నాడు.

"మంచి చెడ్డల విషయముతో మీకు అవసరంలేదు. మీరు నేను చెప్పిన ప్రకారం నడచుకొని తీరాలి. దానిలోని లోపాలకి జవాబుదారీనాది. ఇంక ఆవిషయం కట్టిపెట్టండి."

టెలిఫోనుగంట గణగణ మోగింది. శెక్రటరీ రిసీవరు తీసుకొని చెవిదగ్గర పెట్టుకొన్నాడు. ఇతరులెవరో ఇద్దరు ముగ్గురు లోపలికి వచ్చేరు. డేవిడోవ్ నిర్మాణశాఖ ప్రధానాధికారిని కలుసుకొనడానికి వేగంగా వెళ్ళిపోయేడు.

"మితవాద ధోరణిలో పడ్డాడు.........ఏమీ అనుమానంలేదు." అనుకున్నాడు, ఆఫీసు వదలి వెళ్ళిపోతూ. "స్టాలిన్ యిచ్చిన ఉపన్యాసం వారందరికి చదివి వినిపిస్తాను. రౌతు మెత్తనయితే గుర్రం మూడు కాళ్ళ మీద నడిచిందని, నీమెత్తదనం చూసి పెద్దరైతులు అంతకంతకు లొంగని స్థితికి వస్తూన్నారు. రిజియనల్ కమిటీ ఆఫీసుకు వెడితే వాళ్లు నువ్వు చాలా సమర్థుడవని చెప్పేరు. ఏం లాభం? పెద్దరైతుల్ని ఒక్కడిని కూడా లొంగతియ్య లేకపోయేవు, ఒక్కడూ ఇవ్వవలసిన ధాన్యంఇవ్వకుండా మాట్లాడక కూర్చున్నాడు. ప్రజాసామాన్యాన్ని కూడగట్టుకొని, వాళ్ళని ఎందుకు అభివృద్ధి మార్గానికి నడిపించడం లేదు?" శెక్రటరీతో మాట్లాడుతూన్నట్లు భావించుకొంటూ వెడుతూన్నాడు: ఎవరితోనైనా మాట్లాడుతూన్నంత సేపు ఏవిషయంతోచక, తరువాత ఒంటరిగా తనలోతను ఆలోచించుకొనే సమయంలో అనేక నూతన విషయాలు మనస్సుకి తట్టడం మామూలు. శెక్రటరీతో మాటలాడుతూన్నంత సేపు - ఉద్రేకంచేత తొట్రుపాటుపడి ఏవిషయం తోచక మొదటి మాటనే పట్టుగు కూర్చున్నాడు. "అప్పుడు శెక్రటరీతో నెమ్మదిగా మాట్లాడి ఉండవలసింది." అల్లా ఆలోచించుకుంటూ పరధ్యాన్నంగా వెడుతూ, బజారులో మంచుపడి తెల్లగానున్న పేడ కడిమీద అడుగువేసి జారిపడ్డాడు.

"అంతటితోచాలించి వెళ్ళిపోయేవు. లేకపోతే మెత్తగాతన్ని ఒదిలిపెడుదును." అనుకున్నాడు గట్టిగా. పేడలో జారిపడి తనలోతను మాట్లాడుకొంటూన్న దేవిడోవ్‌ను దోవనుపోతూన్న ఒకయువతిచూసి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. లేచి బట్టలు దులుపుకొని దేవిడోవ్ వెళ్ళిపోయేడు.

అతడు తిన్నగా తనబసకివెళ్ళి సూట్‌కేసు తీసుకొన్నాడు. అతడు లెనిన్‌గ్రాడ్‌లో బయలుదేరినప్పుడు రెండుజతల గుడ్డలు, మేజోళ్లు, స్క్రూడ్రైవర్లు, రెంచిలు, ఇంకాచేతికి దొరికిన ఇతరసామానులతో పెట్టి నింపేడు వాటిలో బట్టలుతప్ప మిగిలినవన్నీ అనవసరమే. పెట్టిలోవున్న

ఈసామాను విషయం జ్ఞాపకం వచ్చేటప్పటికి అతనికి నవ్వువచ్చింది. "వీటి అవసరంకూడా తప్పకుండా వస్తుంది" అనుకున్నాడు. సమిష్టివ్యవసాయ క్షేత్రంలో ఏట్రాక్టరేనా మరమ్మతు చెయ్యవలసి వచ్చినప్పుడు. అప్పటి కప్పుడు మనకి ఎక్కడ దొరుకుతాయి? కాని అక్కడ ట్రాక్టరు లేన ట్టుందే: అ-నురేం భయంలేదు నేను అగ్గనైజరుగా జిల్లాఅంతటా తిరుగుతూం టాను కాదూ; సమిష్టి వ్యవసాయక్షేత్రంలో పనిచేసే ఏకమ్మరివానికేనాయిస్తే కళ్ళకద్దుకొని పుచ్చుకుంటాడు" అని నిశ్చయించి సూట్‌కేసు స్లెడ్జిబండిలో పడేసేడు.

బాగాబలిసియున్న జిల్లాఎగ్జిక్యూటివ్ కమిటీగుఱ్ఱాలు స్లెడ్జిబండితో నిమిషంలో ఊరుదాటేయి. కొంతదూరం వెళ్ళేటప్పటికి దేవిడోవ్ చలిభరిం చలేకపోయేడు. చిరిగిపోయిన బూట్లలోంచి చలిగాలిదూరి, కాళ్ళుకొంకర్లు పోతూన్నాయి. టోపీబాగా ముఖంమీదికి లాక్కొని, చొక్కాబిగించుకొని, ముణిచిపెట్టుకొని కూర్చున్నాడు. జిల్లాముఖ్యపట్టణాన్నుంచి గ్రిమాచీలాగ్ 17 మైళ్లువుంది. అంతా గుట్టల మయం. కనుచూపుమేర ఎటు చూసినా మంచుతో కప్పబడిన బీటిభూములే కనిపిస్తున్నాయి. బాట కిరు ప్రక్కల కొట్టేసిన చెట్ల మొదళ్ళతోటి. ముళ్ళరుప్పలతోటి నిండివుంది.

శరీరం వేడిఎక్కడానికి దేవిడోవ్ బండిదిగి వెనకభాగం పట్టుకొని పరుగెత్తసాగేడు. కొంతసేపయిన తరువాత బండిలోకి ఉరికి కాళ్లుముడుచు కొని కొంతసేపు కునికేడు. బండి కుదుపుకి అప్పుడప్పుడు కళ్లుతెరచి చూసి మళ్ళీ పడుకుంటూన్నాడు.

చలి పక్కలువంచేస్తూంది. దేవిడోవ్ లేచి కూర్చున్నాడు. పొద్దు బాగా వాలిపోయింది. ఎటుచూసినా కనుచూపుమేరవరకు వ్యాపించియున్న సైబీరియాస్టెప్పీ మంచుతో కప్పబడి తెల్లటిబట్ట పరచినట్లుంది. బాటకి పక్కగా బూడిదవర్ణపు నక్క ఒకటి వెనక కాళ్ళమీద కూర్చునివుంది. స్లెడ్జిబండి చూడగానే ఒక్క గంతేసి అతివేగంగా పరుగెత్తిపోయింది.

దేవిడోవ్ గ్రిమాచీలాగ్ చేరేటప్పటికి సాయంకాలం అయింది. గ్రామసోవియటు ఆఫీసు ఆవరణలో చాలా స్లెడ్జిబళ్లు ఆగివున్నాయి. ఏడు-ఎనమండుగురు కోసక్కులు చుట్టలు కాలుస్తూ వరండామీద కూర్చున్నారు. నురగలు కక్కుతూ వెళ్ళి గుఱ్ఱాలు వాళ్ళముందు ఆగేయి.

"ఏమండీ! తబేలా ఎక్కడ?" అని అడిగేడు. దేవిడోవ్ వారిలో ఒక కోసకుయువకుడు "కామ్రేడ్! అదిగో ఆపూరిల్లు కనిపిస్తూందిచూసేరూ, అదే తబేలా." అన్నాడు.

"బండి అక్కడికి పోనియ్యవోయ్" అని బండివానికి చెప్పి బండి దిగి చలికి కొంకరించుకుపోయి జివ్వున లాగుతూన్న దవడలు వేడియెక్కడానికి చేతులతో రుద్దుతూ బండివెనుక బయలుదేరేడు. ఉత్తర రష్యనుల వలె యాసగా మాట్లాడుతూన్న ఈతడెవడో పెద్ద వుద్యోగస్తుడై వుంటాడని అనుకొని ఆ కోసక్కులు అతని వెనుకనే బయలుదేరేరు.

సాలలోంచి ఉచ్చ, పేడ, కలగతొక్కిన చిన్న ప్రవాహంవస్తూంది. బండివాడు గుఱ్ఱాల్ని ఆపేడు. దేవిడోవ్ గుఱ్ఱాల్ని విప్పసాగేడు. కోసకులు అతని చుట్టూచేరి, వింతగా చూస్తూన్నారు. బుగ్గమీసాలనిండా పట్టుకొనియున్న మంచు తుడుచుకుంటూ.

"కామ్రేడ్! దగ్గరికి వెళ్ళకండి; గుఱ్ఱం తన్నుతుంది" అన్నాడు.

దేవిడోవ్ తోకపట్టా తీసి, తొస్సిపళ్ళు కనిపించేటట్లుగా నవ్వుతూ అతనికేసి తిరిగేడు.

"తాతా! గుఱ్ఱపుదళంలో పనిచేసినవాణ్ణి నేను. ఈ గుర్రాన్ని లొంగతియ్యలేకపోను."

"పన్నొకటి ఊడిపోయింది—ఏ గుర్రమేనా తన్నడంచేత కాదకదా," అన్నాడు నల్లగావున్న ఒకకోసక్కు. మిగిలిన వాళ్ళంత విరగబడి నవ్వేరు. కాలరు సర్దుకుంటూ దేవిడోవ్ పరిహాసంగా—

"అబ్బే!- వెనక ఒకసారి తప్పతాగి గంతులెయ్యడంలో విరిగి పోయింది. అదీ ఒకందుకు మంచిదే అయింది. ఆడాళ్ళకి ఇప్పుడు నేను కరుస్తాననే భయంపోయింది. ఏమంటావు, తాతా?" అన్నాడు.

ఈ విధంగా వాళ్ళంతా కొంతసేపు వేళాకోళంగా మాట్లాడుకుంటూ నవ్వుకున్నారు.

దేవిడోవ్ వారందరికీ తలొక సిగరెట్టు యిచ్చి, తనొకటి వెలిగించి, గ్రామసోవియటు ఆఫీసువైపు బయలుదేరేడు.

"అధ్యక్షుడు, పార్టీ సెక్రెటరీ కూడ అక్కడే వున్నారు" అన్నాడు, దేవిడోవ్ వెనకవస్తూన్న ముసలి కోసక్కు. మిగిలిన కోసక్కులందరూ రెండువమ్ముల్లో సిగరెట్లుకాల్చి అవతలపారేసి వాళ్ళుకూడా బయలుదేరేరు. కొత్తగా వచ్చిన అతడు సాధారణముగా అక్కడికి వచ్చు అందరివలె బండిదిగి డాక్యుమెంటుకేసు చంకబెట్టుకొని పక్కనున్న వాళ్ళకేసి కన్నెత్తి కూడా చూడకుండా తిన్నగా లోపలికి పోకుండా—ఎంతో అనుభవం ఉన్నవానివలె జీను విప్పడంలోను, గుర్రాన్ని జాగ్రత్త పెట్టడంలోను, బండివానికి సహాయం చేసి, అందరితోను చాల కలిసికట్టుగా మాట్లాడడం చూసి ఆ కోసక్కులు ఆశ్చర్యపోయేరు.

"కామ్రేడ్! బండివాడు చేసుకొనే పనికి మీరు సహాయం చెయ్యడం ఎందుకు? ఉద్యోగస్తులు చెయ్యవలసినపని కాదది. ఏమంటారు?" అని నల్లకోసక్కు పట్టలేక అడిగేడు.

"ఇది మాకు చాలావింతగా వుంది." అన్నాడు ముసలికోసక్కు. దేవిడోవ్ ఏదో చెప్పబోయేడు, కాని అతనికి అవకాశం ఇవ్వకుండానే, రాగిమీసాల కోసక్కు, సుత్తితో పనిచెయ్యడంచేత కాయలు కాచియున్న దేవిడోవ్ చేతులకేసి చూపిస్తూ.

"ఏం- అంత ఆశ్చర్యం ఎందుకు? అతను కమ్మరి" అన్నాడు.

"కాదు తాళాలు చేసేవాడిని." అన్నాడు దేవిడోవ్. "కాని మీరంతా నాతో కూడా సోవియటుకి వస్తూన్నారెందుకు?"

"మీరు ఇక్కడికి ఎందుకు వచ్చేరో అని. రైతులు బకాయిపెట్టిన ధాన్యపన్ను వసూలు చెయ్యడానికా?" అన్నాడు ముసలి కోసక్కు వరండా దగ్గర ఆగి.

"సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఏర్పరచే పనిమీద."

ఆమాట వినగానే ముసలికోసక్కు వరండా దగ్గరనుంచి గబగబా బయటకి వెళ్ళిపోయేడు.

సరంబీచేసిన ఆగది తోళ్ళు ఎండబెట్టిన వాసన వేస్తూంది. గదిమధ్య డ్రాయరు దగ్గర ఆజానుబాహుడొకడు దేవిడోవ్ కేసి తిరిగి, నిలబడి ఉన్నాడు. అతని బూడిదరంగు చొక్కామీద 'ఆర్డర్ ఆఫ్ ది రెడ్‌బేనర్' అని వ్రాయబడియున్న ఎర్రటి రిబ్బను గుచ్చబడివుంది. 'ఇతడే పార్టీ సెక్రటరీ అయివుంటాడు.' అనుకున్నాడు, దేవిడోవ్.

"జిల్లాకమిటీ పంపించిన ప్రతినిధినినేను" అని దేవిడోవ్ తననితనే పరిచయం చేసుకున్నాడు. "కామ్రేడ్। మీరు పార్టీ సెక్రటరీ కాదూ?"

"అవునండి. నేనే సెక్రటరీని. నాపేరు నగుల్నోవ్. సోవియటు అధ్యక్షుడు ఇప్పుడే వస్తాడు." అంటూ దేవిడోవ్ దగ్గిరికి వచ్చేడు. సాధారణంగా గుర్రపురౌతులందరి కాళ్ళవలెనే అతనివి కూడా దొడ్డికాళ్లు, విశాలమైన వక్షస్థలం, అందమైనకళ్లు, తీర్చిదిద్దినట్లున్న కనుబొమలు, అన్నీ బాగానేవున్నాయి. కాని విపరీతంగా పైకి తోసుకుపోయిన ఆ చిన్నముక్కు ముఖానికి అందవికారం తెచ్చింది.

గొఱ్ఱెచర్మంతో చేసిన టోపీ నెత్తివెనక పెట్టుకొని, సైనికులు ధరించు చిన్నజాకెట్టు తొడిగి, కోసకు ట్రౌజర్లను చివర మేజోళ్ళలో బిగించి, కుదిమట్టంగావున్న ఒకవ్యక్తి ప్రక్కగదిలోంచి వచ్చేడు.

" ఇతనే సోవియటు అధ్యక్షుడు— ఆంద్రీ రజ్మట్నోవ్" అన్నాడు నగుల్నోవ్.

అధ్యక్షుడు చిరునవ్వుతో ఉంగరాలు తిరిగి బొద్దుగానున్న మీసం సవిరించుకొని డేవిడోవ్‌కేసి చెయ్యిజాపేడు.

"ఎవరు మీరు? జిల్లాకమిటీనుంచి వచ్చిన ప్రతినిధులా? ఆ—మీ డాక్యుమెంట్లు....మకార్! అవి నువ్వు చూసేవుకాదూ? అయితే మీరు సమిష్టి వ్యవసాయ క్షేత్రాల విషయమై వచ్చేరనుకుంటాను." అతను కను రెప్పలార్పుతూ ఆ నీలికళ్ళతో డేవిడోవ్ కేసి చూడ్డం మొదలెట్టేడు.

డేవిడోవు బల్లదగ్గర కూర్చుని, కమ్యూనిస్టుపార్టీ రెండు మాసముల లోపుగానే దేశములోని భూమిఅంతా సమిష్టి వ్యవసాయ క్షేత్రములుగా ఏర్పాటు చెయ్యవలెనని నిశ్చయించినదని చెప్పి, ఆమరునాడే గ్రామము లోని కోసక్కులను, ఇతర Active Workers ను పిలిచి సమావేశం చేస్తే బాగుంటుందన్నాడు.

నగుల్నోవు స్థానిక విషయాల్నిగురించి, ముఖ్యంగా సమిష్టి వ్యవ సాయము ఏర్పరచు ఉద్దేశముతో స్థాపించిన గ్రిమూచీ అసోసియేషనును గురించి చెప్పేడు. అతడు మాట్లాడినంతసేపు రజ్మట్‌నోవు శ్రద్ధగా వింటూ మధ్యమధ్య తనుకూడా అందుకుంటోచ్చేడు.

" ఇక్కడి భూములన్నీ సమిష్టిగా సాగుబడి చేయించడానికి ఒక అసోసియేషను ఏర్పరచేను " నగుల్నోవు తొట్రుబాటుగా చెప్పసాగేడు. "కామ్రేడ్! నేను చెప్పేది వినండి. దీనివల్ల ప్రభుత్వానికి నష్టమేగాని లాభంలేదు. సమిష్టి వ్యవసాయక్షేత్రం అని పేరేకాని అంతకంటే మరేమి లేదు. మొత్తం 18 మంది సభ్యులు వున్నారు. వారంతా గర్భదరిద్రులే. ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రం ప్రారంభించేటప్పటికి ఆ 18 మందికి కలిసి 4 గుర్రాలు, ఒకకాడి ఎడ్లుమాత్రం వున్నాయి. పోషింపబడవలసినవాళ్లు

107 గురు, ఇటువంటి పరిస్థితులలో దానిని జయప్రదంగా నడపడం ఎల్లాగ చెప్పండి. వ్యవసాయానికి కావలసిన యంత్రాలు, పశువులు, మొదలయినవి కొనడానికి కావలసిన సొమ్ము ప్రభుత్వంనుంచి దీర్ఘ వాయిదాల మీద తీర్పు పద్ధతిని అప్పుగా తీసుకోవచ్చును. కాని దీర్ఘ వాయిదాలలో నయినా ఆఅప్పు ఏవిధంగా తీరుస్తారు? పోనీ ప్రభుత్వం ఇచ్చిన సొమ్ముతో ట్రాక్టరు కొన్నా బాగానేవుండును. కాని, అవికొని ఇయ్యరు. ఇంక పశువుల్నికొని, వాటితో వ్యవసాయంచేస్తే అంతలాభంవుండదు. ఇంకోవిషయంకూడాను: అసలు వీళ్లు సమిష్టివ్యవసాయ క్షేత్రాల్ని సరిఅయిన పద్ధతులమీద నడిపించడంలేదు. నేనయితే ఈపాటికి వీళ్ళందర్నీ మూట ముల్లె కట్టించి బయటికి తోలేసి వుందును. ఎంతసేపూ ఇచ్చినంతవరకు అప్పుపుచ్చుకొనడం తప్ప, దానిని సద్వినియోగంచేసి, సమిష్టివ్యవసాయక్షేత్రం అభివృద్ధిచెయ్యడంలేదు. ఇంత అప్పు పుచ్చుకొని 'ప్రభుత్వం అప్పు ఇస్తూంది-ఇయ్యనీ; వాళ్ళుయిస్తామంటూంటే వద్దనడం ఏమి? గోచీకూడాలేని మనదగ్గరనుంచి వాళ్లు వసూలు చేసేదేముంది?' అని వాళ్ళుఊహిస్తూన్నారు. ఇంక అసోసియేషన్ ఆట్టే కాలంనిలవదు. ప్రతిరైతును సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేర్చడమే సరి యయినపద్ధతి. అదేకనక కొనసాగిననాడు స్వర్గం అంటూ వేరే ఎక్కడో వుండదు. కాని, ఒక్కచిక్కువుంది. ఈ కోసక్కులు శుద్ధమొద్దులు; చెబుతే వినరు; వాళ్ళకితోచదు. ఇలాటివాళ్ళందర్నీ వెనకముందు చూడకుండా...."

"ఈ అసోసియేషనులో మన పార్టీమెంబర్లు ఎవరేనా వున్నారా?" అన్నాడు దేవిదోవ్.

"లేరు." అన్నాడు నగుల్నోవ్. "నేను 1920 సంవత్సరంలో ఒక కమ్యూన్‌లో చేరేను. క్రమంగా దానిలోని సభ్యులు కొంతమంది విడిపోవడంచేత అది రద్దయిపోయింది. నా ఆస్థిఅంతా ఆకమ్యూన్‌కి ఇచ్చేసేను. స్వంత ఆస్థి అంటే నాకు కిట్టదు. అందుచేత నాపశువులు ఇతరపరికరాలు అన్నీ కూడా మరియొక కమ్యూన్‌కి యిచ్చేసేను. ఆకమ్యూన్ ఇంకా పని

చేస్తూంది. ఇప్పుడు నాకు, నాభార్యకు ఏమీలేదు. ఇంక రజ్మెట్‌నోవ్ విషయం: పాపం- అతనికి భార్యలేదు. ఒక ముసలితల్లిమాత్రం వుంది. అతను కనక చేరినట్లయితే వాళ్లు 'వీడు వీసంఎత్తు పనిచెయ్యడుకదా- పైగా ముసలమ్మనికూడా మనకి అంటగట్టేడు, మేపమని.' అంటారు. అందుచేత సాధ్యమైనంత దూరంగా వుండడం మంచిది. మూడవపార్టీమెంబరుఇప్పుడు ఇక్కడవుండడంలేదు. అతనికి ఒకచెయ్యిలేదు. యంత్రంలోపడి తెగిపోయింది. ఈఅసోసియేషన్‌లో చేరడానికి అతనికి ఇష్టంలేదు. 'పోషించడానికి ఆ వున్నవాళ్లుచాలు. పైగా నేకూడాఎందుకు, దండుగ?' అంటాడు."

"అవును ఆ అసోసియేషన్ పరిస్థితులేమీ బాగులేవు." అన్నాడు రజ్మెట్‌నోవ్. అర్కాష్కా లోసీవ్ దానికి అధ్యక్షుడు. అతనికి దానిని మేనేజ్ చెయ్యడం తెలియదు. అటువంటివాడు అధ్యక్షుడు అవుతూంటే చేతులు ముడుచుకొని చూస్తూ, మనని కానట్లు ఊరుకొనడం మనదే తెలివితక్కువ. అసలు అతడు అధ్యక్షుడుగా రాకుండా చెయ్యవలసింది."

'ఏం? ఎందుచేత?' అనిఅడిగేడు దేవిడోవ్ ఏవో కాగితాలుతిరగేస్తూ.

"అతను ప్రతివస్తువు తిరిగి లాభానికి అమ్ముతూంటాడు. అతని దగ్గరనున్న పెద్దలోపం అది. అసోసియేషన్ ధ్వంసం అవడానికి అదే ముఖ్యకారణం. మంచిపశువుల్ని అభివృద్ధిచెయ్యడం కోసం అసోసియేషనుకి మంచి ఆబోతు నొకదాన్ని కొన్నారు. లోసీవ్‌కి ఆ ఆబోతును మార్చి, మోటారు సైకిలు కొనాలని తోచింది. ఈ విషయం మాకు చెప్పకుండా ఎల్లాగో ఆ అసోసియేషన్ మెంబర్లచేత అంగీకరింపజేసి, వెంటనే ఆబోతును అమ్మేసి, మోటారుసైకిలు కొన్నాడు. ఈవిషయం మాకు తెలిసింది. కాని అంతా అయిపోయిన తరువాత మేముమాత్రం ఏం చెయ్యగలం? పోనీ, అదేనా ఉపయోగించేరా- అదీలేదు. ఒక్కడికీ దాన్ని నడిపించడం తెలియదు. అందుచేత దాన్ని కొన్నచోటుకి తిరిగి పంపేసేరు. అక్కడ మెకానిక్కులు దానిని పరీక్షించి, 'ఈపాటికి దీనిని మూల పారెయ్యచ్చు. బాగుచేస్తే అసలు ఖరీదుకంటె ఎక్కువౌతుంది—లాభంలేదు' అన్నారు. దాల్లో

కొన్ని భాగాలు పోయేయి. అవి ఈప్రాంతాలలో ఎక్కడా దొరకవు. అసోసియేషనుకు యాకోవ్‌లూకుచ్ ఆస్ట్రొనోవ్‌ను అధ్యక్షుడుగా ఎన్నుకోవలసింది. అతడు చాలా తెలివైనవాడు. క్రేస్నొడార్‌నుంచి కొత్తరకపు గోధుమవిత్తులు తీసుకువచ్చి నాటేడు. ఎంతఎద్దడి సంవత్సరం అయినా అవి పంటజబ్బు ఇవ్వవు. అతడు వేసవిలో భూమి మెత్తగా దున్ని అట్టేపెట్టడంచేత అందరి భూములకంటె బాగా పండుతాయి. మంచిరకపు పశుజాతిని కూడా అభివృద్ధిచేస్తున్నాడు. కాని పన్నుకి తొందరపెడితే మాత్రం కొంచెం మూలుక్కుంటాడు ఇవ్వడానికి. ఏమయితేనేం-వ్యవసాయంలో మంచినేర్పరి. వ్యవసాయశాఖవారు అతనికిఒకసర్టిఫికెట్టు కూడాఇచ్చేరు." అన్నాడు రజ్మెట్నోవ్.

"అబ్బో! అతడు పైకి అల్లాపుంటాడుకాని తోడేలువంటివాడు. ఎంతసేపూ తనవాగే చూసుకుంటాడు. విరిగిన వేలుమీద ఉచ్చకూడా పొయ్యడు" అన్నాడు నగుల్నోవ్,

"ఆ విషయంలో అతన్ని ఏమీ అనడానికి వీల్లేదు. అలా అయితే ఇంతకాలం దాగుతుందా ?" అన్నాడు రజ్మెట్నోవ్.

---

## మూడో ప్రకరణము

### కుట్ర.

కెప్టెన్ పొలోవిట్సేవు యాకోవులూకుచ్‌ఆస్ట్రొనోవును కలుసుకొన్న రాత్రి వారిద్దరు చాల పొద్దుపోయేవరకు మాట్లాడుకుంటూనేవున్నారు. యాకోవు చాలా తెలివైనవాడనీ, జిత్తులమారిఅనీ గ్రీమాచీలో అందరు ఎరుగుదురు. అయినప్పటికి ఆరోజులలో దేశమంతటా ప్రతివారినీ అల్లకల్లోల

పరుస్తూన్న రాజకీయ వాతావరణం అతనిమీద విరుచుకు పడడం మాన లేదు. ఆరోజు రాత్రిమొదలు అతని జీవితం దినదినగండాలతో ప్రారంభం అయింది.

రాత్రి భోజనం అయిన తరువాత లూకుచ్ ఒక కర్రపెట్టి మీద కూర్చుని వెనుకటి విషయాలన్నీ చెప్పసాగేడు.

"అలెగ్జాండర్! పూర్వం ఆరోజుల్లోవున్న కులాసాయేలేదు ఇప్పుడు. కోసక్కులు వ్యవసాయాల్లో కొంచెం లాభాలుతిని కోలుకుంటున్నారనుకుం టూంటే- మళ్ళీచూడండి- పన్నులు ఎంత పెంచివారో, మీప్రాంతాలలో ఎల్లా వున్నాయి పరిస్థితులు? అక్కడ సమిష్టివ్యవసాయక్షేత్రాల గొడవ ఏమీ లేదూ,"

"అయ్యో! లేకపోవడం ఏమిటి! ప్రతిచోటా వుంది."అని అతిథి ముక్తసరిగా సమాధానం చెప్పి, లూకుచ్ ముఖంకేసి పరిశీలనగా చూడ సాగేడు.

"ఇంకా ఈగొడవ ఇక్కడ ఒక్కచోటే అనుకున్నాను. దేశమం తటావుందీ?" అన్నాడు లూకుచ్. "నాకథచెబుతాను, వినండి. 1920 సం॥ రంలో మన సైన్యాలు ఓడిపోతూంటే నేను తిరిగి వచ్చేసేను. నాసామా నంతా ఆరెండుగుర్రాలతోసహా నల్లసముద్రందగ్గర విడిచిపెట్టి వట్టిచేతులతో వచ్చి, నా చుట్టుగుడిసెలో ప్రవేశించేను. అప్పటినుంచీ, రాత్రి పగలు అనక రెక్కలు ముక్కలయిూలా పనిచేసేను. మొదటిసారి కామ్రేడ్సు పొల్లు కాయలు కూడా మిగల్చకుండా అంతా పట్టుకుపోయేరు. అది మొదలు నన్ను ఈవిధంగా ఎన్నిసార్లు చేసేరో లెక్కలేదు. కాని వాళ్ళు తీసుకొన్న ప్రతిసారి, రసీదులు మాత్రం ఇస్తూవచ్చేరు. అందుచేత వాళ్ళు చేసిన అన్యా యాలు మరచిపోదం అనుకున్నా ఆరశీదులు చూడగానే మళ్ళీ జ్ఞాపకం వస్తూన్నాయి." లూకుచ్‌లేచి గోడనున్న అద్దం వెనకనుంచి కాగితాల కట్ట

ఒకటి పైకితీసేడు. "ఈకట్టంతా ఆబాపతే: ఇది 1921వ సంవత్సరంలో తీసుకొన్న వాటికి రశీదు. అప్పుడు ధాన్యం, కోళ్లు, వెన్న, తోళ్లు, మాంసం సమస్తం ఇచ్చేసేను. ప్రత్యేకం వ్యవసాయపు పన్నుకి రశీదులు ఇవిగో. ఇవి అన్నీ ఇన్స్యూరెన్సు పన్నులకి రశీదులు. ఒకటేమిటి- మేతలేక చావ డానికి సిద్ధంగావున్న పశువులకి, ఇల్లువదలి పారిపోకుండా వున్నందుకు మాకుకూడా పన్నుకట్టేరు. ఇప్పటికప్పుడే అమాంబాపతు ఒకసంచి రశీదులు పోగుపడ్డాయి. అలెగ్జాండర్ అనిసిమోవిచ్: ప్రభుత్వం మాటిమాటికి నేను కష్టపడి సంపాదించినదంతా దోచేస్తూంది. మళ్ళీ నేను కూడపెడు తూనే ఉన్నాను. నాదగ్గర మంచి ఎడ్లజత ఒకటి ఉండేది. అందులో ఒక ఎద్దును మంచి ఖరీదుకు అమ్మేసేను. నాభార్యలాలూకు కట్నమిషను అమ్మేసి మళ్ళీ ఎద్దునుకొన్నాను. 1925వ సంవత్సరం నాటికి ఇంట బుట్టిన దూడలు ఎదిగి, అవి ఒకకాడిఎడ్లు కలిసినచ్చేయి. అప్పటికి మొత్తం 2జతల ఎడ్లు, 2 ఆవులు ఉండేవి. అయినప్పటికి ప్రభుత్వం నావోటురద్దుచెయ్యలేదు"

"గుర్రాలు ఏమీలేవూ- నీకు?"

"ఒక్కొక్క విషయమే వస్తున్నా: ఉండండి. ఒక రైతు దగ్గర నుంచి చిన్న ఆడగుర్రపుపిల్ల నొకదాన్ని కొన్నాను. ఆరోజుల్లో మా గ్రామానికంతకీ అదొక్కటే గుర్రం, క్రమంగా ఎదిగి, మంచిగుర్రం అయింది. నేను ఇంతవరకు ఎక్కడా అటువంటి గుర్రం చూడలేదు. ఒక జిల్లా వ్యవసాయ ప్రదర్శనంలో దానికి సర్టిఫికేటు కూడా వచ్చింది. అగ్రి కల్చరల్ ఇనస్పెక్టర్లు చెప్పే విషయాలన్నీ శ్రద్ధగావిని, చేతనయినంత వరకు వాటిని ఆచరణలో పెడుతూ దున్నడం, విత్తులు చల్లడం, ఊడ్చడం, అన్నీ సకాలంలో చేస్తూ, అతిశ్రద్ధగా వ్యవసాయంచేసేను. పంటవిష యంలో, నా చేల తరవాతే, మిగిలిన వాళ్ళవందరివీకూడా. వేసవిలోనే మెత్తగా నాలుగుచాళ్ల తోలి అట్టేపెట్టి, లొలకరించగానే, విత్తులు చల్లే

వాడిని, అందరికంటె ముందుగా. ఈ ప్రాంతాలలో నాకంటె బాగా వ్యవసాయం చేసేవాడులేడు. వ్యవసాయశాఖవారు నా సామర్థ్యానికి మెచ్చుకొని సర్టిఫికేటు ఇచ్చేరుకూడాను. అది ఒకసారి చూడండి."

అతిథి యాకోవ్‌లూకుచ్ చూపించినవైపు చూసేడు. ఒక సిలువ ప్రక్కన అద్దముకట్టిన ఒక సర్టిఫికేటు వ్రేలాడుతూంది. దానిదగ్గరే సోవియట్ కమేండరు వొరోషిలోవ్ ఫొటో ఉంది,

"ఆఁ–అదే, వాళ్ళుయిచ్చిన సర్టిఫికేట్. నేను పండించిన గోధుమలు రాష్ట్రంలోని వ్యవసాయడిపార్టుమెంటు అధికారులు కూడా చూసి చాలా మెచ్చుకున్నారు." లూకుచ్ సగర్వంగా చెప్పసాగేడు. "మొదట నేను తిరిగివచ్చిన కొత్తలో 12 ఎకరాలు మాత్రం వ్యవసాయం చేసేను. క్రమంగా 20, 40, 60, చివరకు 70 ఎకరాల వరకూ కూడా వ్యవసాయం చెయ్యగలిగేను. ఇంతభూమీ కూడా నేను, నా భార్య. కొడుకు, కోడలు కలిసి చేసేవాళ్ళం. అదును రోజుల్లోమాత్రం ఒకటి, రెండుసార్లు కూలివాడిని పెట్టేవాడిని. ఆ రోజులలో సోవియటు ప్రభుత్వం ప్రతిరైతును ఎంత భూమి చెయ్యగలిగితే అంత, సేద్యం చెయ్యమని ప్రోత్సహించింది. ఆరోజులలో అహర్నిశలు నిద్రాహారాలుకూడా మాని, యెంత కష్టపడి పని చేసేనో ఆ భగవంతుడికే తెలియాలి. అలెగ్జాండర్ అనిసిమోవిచ్ ! మీరు నమ్మరారో లేదోకాని- ఇప్పుడు చాలా భూమి సేద్యం చెయ్యడానికి భయంగా వుంది. ఎందుచేతనంటారు ? 70 ఎకరాలు దున్నితే నన్నుకూడా కులకులలో జమకడతారు. మా సోవియటు అధ్యక్షుడు ఆంద్రీరజ్మత్నోవ్ మూలంగా వచ్చింది ఈ చిక్కు అంతా. అతను 'యాకోవ్‌లూకుచ్ ! నువ్వు ఎంత భూమి దున్నగలిగితే అంతాదున్ను, మన సోవియటు ప్రభుత్వానికి ఇప్పుడు ఆహార పదార్థాలకి చాల చిక్కుగావుంది. నీవంటి ఉత్సాహంగల రైతులే చెయ్యాలి ఏం చేసినా' అనేవాడు. 70 ఎకరాలభూమి స్వంతంగా చేసుకుంటూన్న నన్ను కులకులలో జమకట్టి సర్వనాశనం చెయ్యడానికి

చూస్తాంది సోవియట్ ప్రభుత్వం. ఆ భగవంతుడి ఆజ్ఞ ఎల్లావుందో తెలియదు."

"సమిష్టివ్యవసాయ క్షేత్రాలలో చేరడానికి మీ వూళ్ళో వారెవరేనా ముందుకు ఉత్సాహంగా వస్తూన్నారా ?" అని అడిగేడు, అతిథి చేతులు వెనక్కి కట్టుకొని మంచందగ్గర నిలబడి.

"సమిష్టివ్యవసాయ క్షేత్రంలోనా ? ఇంతవరకు దాన్లోచేరమని వాళ్లు బలవంత పెట్టడంలేదు మమ్మల్ని. కాని రేపు బీదకోసక్కులంతా చేరి మీటింగు చేస్తారుట. సాయంకాలం వాళ్ళందరితోను చెబుతూ వెళ్ళేరు. ఈ విషయాన్ని గురించి క్రిస్టమస్‌పండుగుల నాటినుంచి చెబుతూనే ఉన్నారు, అందర్నీ చేరమని. కాని ప్రతివాళ్లు మేముచేరం అంటే మేము చేరం అన్నారు. ఎవడేనా తెలిసికూడా గోతులో దిగుతాడా? వాళ్లు మళ్ళీ ఏదో కొత్తయెత్తు యెత్తుతూన్నట్లుంది. పైనుంచి యెవడో కొత్తవాణ్ణి తీసుకు వచ్చేరు, మమ్మల్ని అందర్నీ సమిష్టివ్యవసాయ క్షేత్రాలలో బలవంతంగా చేర్పించడానికి. ఇది మా అంతానికే వచ్చింది. ఇంతకాలం కష్టపడి సంపాదించుకొన్న ఆస్థి-చూసేరా అస్తమానం పనిచెయ్యడంచేత చేతులు ఎల్లా కాయలుకాచేయో-ఎద్లు, ఆవులు, గుర్రాలు, కోళ్లు, ధాన్యం, భూములు, చివరకు ఇల్లుకూడా వాళ్ళకిచ్చేయ వలసిందే. ఈవేళ ఆస్తి ఇమ్మన్నారు- రేపు పెళ్ళాన్నే ఇమ్మంటారు. ఏమంటారు- అలెగ్జాండర్ అనిసిమోవిచ్! మీరు చెప్పండి. పశువులు గుర్రాలు, ధాన్యం, మొదలైన నా ఆస్తిఅంతా ఇచ్చేస్తాననుకోండి. ఇంకొకడు తన నల్లులుపట్టిన పాత మంచము ఒకటిస్తాడు. అంతకంటె ఇతరమైన ఆస్తి ఏమీలేదని; మేమంతా ఎంతఆస్తి ఉంటే అంతా ఇచ్చి, వచ్చిన లాభం సరిగా పంచుకోవాలి. ఇది న్యాయమేనా ? దీనివలన నాకు నష్టంకాదూ ? ఒకడు తన జీవితమంతా ధారపోసి 10 ఎకరాల కొంద్ర సంపాదించటానికి ప్రయత్నించవచ్చు. నేను

నాకు ఇష్టమైన మరియొక.........ఇదిగో! మనం యెన్నివాగినా లాభం లేదు. చూడండి!" లూకుచ్, పేకలు కోసేస్తారన్నట్లుగా అభినయించేడు. "ఇంక ఆ గొడవ కట్టిపెడదం. ఇప్పుడేం చేస్తున్నారు, మీరు? ఏదేనా ఉద్యోగమా?"

అతిథి యాకోవ్‌లూకుచ్ దగ్గరగావచ్చి ప్రక్కనే బల్లమీద కూర్చుని సిగరెట్ వెలిగించేడు.

"లూకుచ్! నువ్వు నా దళంలో పనిచేసేవు. ఎకటేరిండొనార్‌నుంచి మనం వెనక తిరిగి పారిపోతున్నప్పుడు సోవియటు ప్రభుత్వాన్ని గురించి అక్కడి కోసక్కులకి ఏమని చెప్పేనో జ్ఞాపకం ఉందా? 'ఒరేయ్ కమ్యూనిస్టులు మిమ్మల్ని నేలపెట్టి రాసేస్తారు. జాగ్రత్త! వాళ్ళ చేతులలో పడితే మళ్ళీ తప్పించుకోవడం అసంభవం. చెయ్యికాలిన తర్వాత ఆకులు పడితే లాభంలేదు.' అని చిలకకిచెప్పినట్లు చెప్పేను." కొంతసేపు నిశ్శబ్దంగా ఉన్నాడు. ఎందుకో తనలో తనే నవ్వుకున్నాడు. "నేను ఎంత చెప్పేనో అంతా జరిగింది. మన సైన్యాలన్నీ చెదిరిపోయినా నేను 'నొవోరొసిస్కు' లోనే ఉండిపోయేను. మనకి సహాయంచేస్తామన్న వాలంటీర్లు, విదేశప్రభుత్వాలు కూడా దగాచేసేరు. అటువంటి పరిస్థితులలో మనం ఏం చెయ్యగలం? నెమ్మదిగా బోల్షివిక్ సైన్యాలలో చేరేను. నన్ను స్క్వాడ్రన్ కమేండరుగా నియమించేరు. పోలండు యుద్ధరంగానికి వెళ్ళే ముందు సైన్యాధికారులను పరీక్షించి, వారిలో ద్రోహులను తొలగించడానికి ఒక కమీషను ఏర్పాటు చేసేరు. ఆ కమీషను నన్ను నా ఉద్యోగాన్నుంచి తొలగించి, అరెస్టుచేసి, విచారణకి రివల్యూషనరీ ట్రిబ్యూనల్‌కి పంపించింది. క్రామేడ్సు, బహుశా నన్ను కాన్సెన్ట్రేషను క్యాంపుకి పంపించడమో, కాల్చెయ్యడమో చేసిఉందురు. ఎందుకో తెలుసునా? మా ఊరువాడొకడువచ్చి నాకు వ్యతిరేకంగా, 'పొటెలోక్కోవ్‌ను చంపిన హంతకులలో నేను ఒకడనని' చెప్పేడు. కాని, విచారణకి తీసుకొని వెడుతూంటే,

దోవలో తప్పించుకొని పారిపోయేను....చాలాకాలం మారుపేరుతో, రహస్యంగా ప్రవేశం చేసేను. 1922 వ సంవత్సరంలో మళ్ళా చేరేను. నేను ఒక్క తెలివైన పనిచేసేను. బోల్షివిక్ సైన్యాలలో కమేండరుగా పనిచేసినట్లు తెలియజేసేటందుకు వెనకటి డాక్యుమెంట్లన్నీ జాగ్రత్తచేసేను. అప్పటినుంచీ, జీవితం నెమ్మదిగా ఒడుదుడుకులు లేకుండా లాక్కొస్తూన్నాను. క్రమంగా నన్ను 'డాన్ ఛెకా' (గూఢచారిదళం) యొక్క రిజియనల్ పొలిటికల్ బ్యూరోలోకి తీసుకున్నారు. కాని నెమ్మదిగా దానిలో నుంచి తప్పుకొని స్కూలు మేష్టరుగా చేరేను. మొన్న మొన్నటిదాకా దానిలోనే ఉన్నాను. కాని ఇప్పుడు.........ఇప్పుడు చేసే పనివేరు. ఏదో పని మీద ఉస్టు-ఖోపరస్క్ జిల్లాకి వెడుతూన్నాను. పూర్వస్నేహితుడవు కనక ఒకసారి చూసివెడదామని వచ్చేను."

"మీరు మేష్టరీ చేస్తున్నారన్నమాట. అయితే.......మీరు చాలా పుస్తకాలు చదివిఉంటారు. ప్రపంచ విషయాలన్నీ బాగా తెలుస్తాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలంటూ మొదలెట్టేరు వీళ్లు; దీని పర్యవసానం ఎల్లా తేలుతుందంటారు?"

"పర్యవసానం ఎల్లా తేలుతుందని అడిగేదేమిటి! కమ్యూనిజమే. మళ్ళీ ఎల్లాటి కమ్యూనిజమో తెలుసునా? ఏమీ కత్తిలేని కమ్యూనిజం. కారల్ మార్క్స కమ్యూనిస్టు మేనిఫెస్టో మొదలయిన గ్రంథాలు చాలా చదివేను. సమిష్టివ్యవసాయక్షేత్రం అని చెప్పి చివరకేం చేస్తారో తెలుసునా? ఎవరికీ కూడా స్వంతఆస్తి అనేది లేకుండా ఒక్కపశువుల్నేకాదు, చివరకు నీపిల్లల్ని కూడా తీసుకుపోయి ప్రభుత్వమే పోషిస్తుంది. ప్రతి వస్తువు సమాజపరమవుతుంది. పిల్లలు, భార్య మొదలు ఇంట్లో వాడుకొనే ప్రతివస్తువు కూడా అంతే. నీకు ఏ పిండివంటయినా, ఏకోడిమాంసం కూరేనా, తినాలనిఉన్నా కాని సాగదు. కలో, అంబలో వాళ్ళు ఏదిపెడితే

అదితిని సంతృప్తిపొందాలి. ఏవిధమయిన స్వతంత్రమూ లేకుండా బానిసల లాగ చాకిరీచేస్తూ పడిఉండాలి"

"అది నాకు ఇష్టం లేకపోతే?"

"నీకు ఇష్టం ఉందా, లేదా? అని అడిగిచెయ్యరువాళ్లు."

"అంటే?"

"నేను అన్నదే!"

"చాలా బాగుంది."

"నేనో ప్రశ్న అడుగుతాను. ఆవిధంగా నువ్వు జీవించగలవా?"

"ఉహూ-జీవించలేను."

"అల్లా అయినట్లయితే, చేతులు ముడుచుకొని కూర్చుని లాభం లేదు; ఆవిధానం నాశనం చెయ్యడానికి పోరాడాలి."

"అలెగ్జాండర్! ఆప్రయత్నాలన్నీ ఇదివరకే అయేయి. ప్రాణాలకి తెగించి పోరాడేం....దానివల్ల సాధ్యంకాదు. కలలోకూడా నమ్మను నేను"

"ఇంకోసారి ప్రయత్నించిచూడు," పొలోవిట్సీవ్ గడియవేసి ఉన్న తలుపుకేసిచూసి, ఇంకా దగ్గరగా చేరేడు. "దీనిలో నువ్వు తప్పకుండాచేరుతావని నిన్ను కూడా లెక్కవేసుగున్నాము. మన ఈ జిల్లాలో కోసక్కులంతా తిరుగుబాటుకి తయారవుతున్నారు. 'రెడ్ఆర్మీ'లో పనిచేస్తూన్న సేనానాయకులతోను, మాస్కోతోను, ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతున్నాయి. పెద్ద పెద్ద కర్మాగారాలలో పనిచేస్తూన్న ఇంజనీర్లనుకూడా చాలామందిని మన వైపుకి తిప్పేసేము. ఇంతేకాదు. విదేశాలనుంచి మనకి కావలసినంత సహాయం వస్తుంది. మనం అందరం దేశం నాలుగుమూలలా ఒక్కసారి తిరుగుబాటు లేవతీస్తే, విదేశ ప్రభుత్వాల సహాయంతో రేపు తొలకరినాటికి డాన్ పరగణాఅంతా ఒక్కకమ్యూనిష్టుకూడా లేకుండా చెయ్యగలం. నీ

భూమి నువ్వు స్వయంగా దున్నుకొని, స్వేచ్ఛగా జీవించగలుగుతావు. ఆగు, నేను చెప్పడం పూర్తిఅయిన తరువాత మాట్లాడు. మన వుద్యమం అంటే అభిమానం వున్నవాళ్ళు ఈజిల్లాలో చాలమందివున్నారు. అటు వంటివారినందర్నీ మనం ఏకం చెయ్యాలి. 'ఉస్టు-భోపరస్కా' జిల్లాకి వెళుతూన్నది అందుకోసమే; నువ్వుమాతో చేరుతావా? అప్పుడే మన జిల్లాలో 300 మందిచేరేరు. డుబ్రొవిస్కా, పెస్కోవాయ్, టుష్యాన్స్కా, మొదలయిన గ్రామాలలో మన సంఘానికి శాఖలు ఏర్పాటు అయేయి. ఈ వూళ్ళో కూడా అటువంటి సంఘశాఖ ఒకటి యేర్పాటు చెయ్యాలి. ఇప్పుడు చెప్పు-నువ్వు ఏమి చెప్పదల్చుకున్నావో."

"ఈవూళ్ళో సమిష్టివ్యవసాయ క్షేత్రాల్లో చేరడానికి ఎవరికీ యిష్టం లేదు. ధాన్యపు...."

"ఒక్కసారి ఆగు. ఇప్పుడు ప్రజల సంగతికాదు మనం మాట్లాడు తూన్నది; నీసంగతి చెప్పు."

"ఇటువంటి విషయం వెంటనే, ఏమీ ఆలోచించుకొనకుండా నిశ్చ యించడం ఎల్లాగ? ఇదేమైనా సామాన్యవిషయం కనకనా?"

"ఆలోచించు. ఒక్కసారిగానే అన్నిగ్రామాలలోనూ కూడా తిరుగు బాటు లేవతీస్తాము. జిల్లాముఖ్యపట్టణం ముట్టడించి, మిలీషియాని, కమ్యూ నిస్టుల్ని, వేరు వేరుగా యెదిరించి నాశనం చేసి, వశపరుచుకుంటాము. ఇంక మనకి అడ్డేమీ వుండదు."

"కాని, మనకి ఆయుధాలు ఎక్కడినుంచి వస్తాయి?"

"ఎక్కడినుంచో వస్తాయి. నీదగ్గరకూడా ఏమీ ఆయుధాలు లేకుండా వుండవు."

"గుర్తుగా ఇక్కడెక్కడో పాతిపెట్టే ననుకుంటాను. ఆస్ట్రియన్ మోడల్.........."

"మనం ప్రారంభంచేస్తే చాలు, వారం రోజులలో విదేశాలనుంచి ఓడలమీద తుపాకులు, ఫిరంగులు కావలసినన్ని వస్తాయి. విమానాలు కూడాను, తెలిసిందా?"

"అయినా, నన్ను స్థిమితంగా ఆలోచించుగో నియ్యండి. వెంటనే చేరమనిబలవంత........"

"సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో చేర్చినట్లు బలవంతంగా ఎవర్నీ చేర్పడంలేదు మేము; చేరడం, చేరకపోవడం నీయిష్టం, కాని, లూకుచ్! ఈవిషయం రెండోసారి ఆలోచించడానికి [illegible] సుమా!"

"నేను ఎవరితోనైనా చెబుతానని భయపడనక్కరలేదు. కాని ఇది చాల ప్రమాదకరమైన పని. అందుచేత సాధకబాధకాలు ఆలోచించుకొని మరీ చేరుతానన్నాను. ఇంతకీ, నాకు ముసలితనం వచ్చింది." రెండు నిముషాలు మాట్లాడకుండా వూరుకున్నాడు. "ప్రభుత్వంకనక భాగ్యవంతుల్ని మాటిమాటికి ఏదోరూపంగా దోచుకొనకుండా వున్నట్లయితే, ఈ పాటికి ఈవూళ్ళో వాళ్ళందరికంటె ధనవంతుణ్ణి అయివుందును. నేనొక్కడిని అందులోకి దిగుతే........"

"నువ్వు ఒక్కడివే దిగడంఏమిటి?" కెప్టెన్ లూకుచ్ మాటకడ్డం వచ్చేడు.

"సరే, నేను చేరుతాను; బాగానేవుంది.కాని, మిగిలినవాళ్ళ మాటేమిటి? వాళ్ళంతాకూడా ఈవుద్యమంలో చేరుతారా?"

"ప్రజలంతా గొర్రెలమంద లాంటివాళ్ళు. నడిపించేవాళ్లు ఉండి, ఎల్లానడవమంటే అల్లా నడుస్తారు వాళ్లు. నీమాట ఖాయమేనా?"

"అలెగ్జాండర్! నావుద్దేశం........"

"ఊరికే నీళ్లు నమలక, అవును, కాదు అని రెండు ముక్కల్లో తేల్చెయ్యి."

"ఆలోచించుకొనడానికి కొంచెం వ్యవధి ఇయ్యండి. ఏసంగతి రేపు వుదయం చెబుతాను."

"నీకు నమ్మకస్తులని తోచిన కోసక్కులతో కూడ మాటలాడు. సోవియటు ప్రభుత్వంమీద కసితీర్చు కొనడానికి ప్రయత్నిస్తూన్న వాళ్ళ నందర్నీ నెమ్మదిగాచేర్చు" అంటూ పొలొవిట్సేవ్, అప్పుడే ఆజ్ఞలుఇవ్వడం ప్రారంభించేడు.

"ప్రతివాడికీ సోవియటు ప్రభుత్వంమీద గుర్రుగానే వుంది."

"కాని నీకొడుకు మాట ఏమిటి?"

"ఆవుతోపాటే దూడకూడా. నేను ఎటువైపుంటే మావాడుకూడా అటువైపే."

"అతను మంచివాడేనా, మనం నమ్మవచ్చా?"

"ఆ విషయంలో మీరు సందేహించ నవసరంలేదు. సరియైన కోసక్కు" అన్నాడు లూకుచ్ సగర్వంగా.

లూకుచ్ ఒకపెద్దరగ్గు, దానిపైన ఒక గొర్రెచర్మం పరచి, పొలొవిట్సేవ్‌కి ఒకమంచి గదిలో పక్క ఏర్పాటు చేసేడు. పొలొవిట్సేవ్ బూట్లనుమాత్రం తీసి, ఆదుస్తులతోనే పడుకొని నిద్రపోయేడు.

మరునాడుదయం వెలుతురురాకముందే యాకోవ్ నిద్రనుండి లేచి, వరండాదగ్గర, ఒకచిన్న గదిలో నిద్రపోతూన్న ఎనుబదేండ్ల ముసలితల్లి దగ్గరకు వెళ్ళేడు. పొలోవిట్సేవ్ వచ్చిన పనినిగురించి క్లుప్తంగా చెప్పేడు. ఆమె నిశ్శబ్దంగా వింటూ కూర్చుంది.

"అమ్మా! నీ ఆశీర్వచనం కోసం వచ్చేను" అని సాష్టాంగపడి నమస్కారం చేసేడు.

"నాయనా ! లే: శత్రువుల నెదిరించు. భగవంతుడు నీకు సహాయం చేస్తాడు. వాళ్లు చర్చులు కూడా మూ సస్తూన్నారు........మతగురువుల్ని వాళ్ల బ్రతకనిచ్చేలా లేరు........వాళ్ళని నాశనం చెయ్యి"

ఆ రోజు ఉదయం యాకోవ్ అతిథిని లేపేడు.

"చేరడానికే నిశ్చయించేను. ఇక పైని నేను చెయ్యవలసిన పని ఏమిటి?"

"ఇది పూర్తిగా చదివి అడుగున దస్కతు చెయ్యి" పౌలోవిట్స్ లోపలి జేబులోనుంచి ఒక కాగితం పైకితీసేడు. యాకోవ్ ఆకాగితం తీసుకున్నాడు.

"భగవంతుడు మనపక్షాన్న ఉన్నాడు. కోసక్కునైన నేను నాజన్మ భూమియైన డాన్ పరగణాను దాస్యబంధములనుండి విడిపించుటకు బద్ధ కంకణుడనయితిని. క్రిస్టియన్ మత నాశకులును, రష్యను ప్రజాపీడకులును అయిన కమూనిస్టు బోల్షివికులను నాశనము చేయుటకు పై అధికారుల ఆజ్ఞల ప్రకారము నాసర్వస్వము ధారపోసి, కంఠములో కొనఊపిరిఉన్నంత వరకు పోరాడుటకు నిశ్చయించితిని. పై అధికారుల యొక్కయు, సేనాధిపతుల యొక్కయు ఆజ్ఞలను సర్వవిధముల అనుసరిస్తాను. రష్యను సనాతన మాతృభూమియొక్క స్వాతంత్ర్య బలిపీఠముమీద నాసర్వస్వము అర్పణ చేసెదను."

## నాల్గో ప్రకరణము

### గ్రామ సమావేశము.

గ్రామాచీలోని బీదకోసక్కులు, Active workers కలసి మొత్తం 22 గురు వరకు సమావేశమయేరు. అందరు నిశ్శబ్దంగా ఉన్నారు. దేవిదోవ్ గొప్ప వక్త కాకపోయినప్పటికి అతని ఉపన్యాసం మొదటి నుంచీచాలా శ్రద్ధగా వింటూన్నారు.

"కామ్రేడ్సు! నేను 'రెడ్ ప్యూటిలోవ్వర్క్సు'లో పనిచేసే కూలీని. మన కమ్యూనిస్టుపార్టీ నన్ను ఈ ప్రాంతములో సమిష్టి వ్యవసాయ క్షేత్రములు నిర్మించుటలోను, జలగలవలె రక్తము పీల్చి, మనల్ని పిప్పిచేస్తున్న భాగ్యవంతుల్ని నాశనము చేయుటలోను మీకు సహాయం చెయ్యడానికి పంపించింది. ఎక్కువగా నేను చెప్పవలసినది ఏమీలేదు. మీరంతా ఒక సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరి భూమిని, పశువులు మొదలైన మీ ఆస్తిని సమాజపరం చెయ్యాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడం యెందుకు? ప్రస్తుతంవరకు మనం ఉన్న నికృష్ట పరిస్థితులలో యింక ఉండలేముకనక. ఇప్పుడు మనం తిండిలేక ఎందుకు మాడవలసి వస్తూందోతెలుసునా? పండిన పంటఅంతా కొద్దిమంది భాగ్యవంతులు పొంతప్లవేసి [illegible]తూన్నారు. వాళ్ళదగ్గరనుంచి ఆపంట అంతా మనం బలవంతంగా స్వాధీనం చేసుకొనవలసివస్తూంది. ఇప్పుడున్న మన ఈదరిద్రం పోవాలంటే ఇంకా ఎక్కువభూములు దున్నాలి. కాని పూర్వకాలపు మొద్దునాగళ్ళతో ఇప్పటికంటె హెచ్చుభూమి దున్న డానికి అవకాశంఉందా? లేదు. మరి మనం ఏంచెయ్యాలి? ట్రాక్టర్ల నుపయోగించాలి. ఇక్కడ మీ డాన్ ప్రాంతంలో ఒక్క అరకతో ఎంత భూమి సేద్యంచెయ్యగలరో నాకు తెలియదు...."

"కట్టిన నాగలి విప్పకుండా రోజంతా దున్నితే, 30 ఎకరాల వరకు వ్యవసాయం చెయ్యొచ్చు." అని ఒక కులకు సమాధానం చెప్పేడు.

"అబ్బా! 30 ఎకరాలే! గట్టిభూమి అయితే?" అని ఇంకొక కోసక్కు అడ్డుప్రశ్న వేసేడు.

"అథమం 3 జతల ఎడ్లైనా ఉంటేకాని అంతభూమి దున్నడానికి సాధ్యంకాదు. ఇక్కడ ఉన్నవాళ్ళలో ఒక్కడికీ బలమైన ఒకజత ఎడ్లు లేవు. కొద్దిమంది భాగ్యవంతుల చేతుల్లో ఉన్నాయి అవి అన్నీ." అంది ఒక ఆడది.

"అసలువిషయం అదికాదు! తెలియనిదే ప్రతీదానిలోనూ కలగ చేసుకోక నోరుమూసుకో!" అన్నాడు ఒకకోసక్కు.

"నాకుకాదు, ఇంటికి వెళ్ళి నీ పెళ్ళానికి చెప్పు, నోరు మూసు కోమని" ఆమె జవాబు చెప్పింది.

"ట్రాక్టరుతో మీరెంతదున్నగలరు?" అని అడిగేడు ఇంకో కోసక్కు.

దేవిడోవ్ సద్దు అణిగేవరకు ఊరుకొని, తరువాత "మన ప్యాటి లోవ్ వర్క్సులో తయారయిన ట్రాక్టరయినట్లయితే ఆ 30 ఎకరాలు ఒక రోజులో దున్నేస్తుంది." అన్నాడు.

సభ్యులంతా ఆశ్చర్యపడ్డారు.

"అబ్బా. 30 ఎకరాలే!" అన్నాడు ఒకకోసక్కు.

దేవిడోవ్ కంగారుచేత ఆరిపోయిన పెదవులు తుడుచుకొని మరల ప్రారంభించాడు.

"ఆ ట్రాక్టర్లని సాధారణరైతులు ఎవరూ కొనలేరు. కొనినా ఉప యోగంకూడా ఉండదు. అందుచేత ఒకట్రాక్టరు కొనాలంటే చాలామంది

రైతులు కలసి కొనాలి. ఒకటి, రెండు ఎకరముల చిన్న చిన్న భూఖండాల్ని ట్రాక్టర్లతో దున్ని వ్యవసాయం చేయడంవలన ఏమీ లాభంలేదు. పైగా వీలుకూడాలేదు. అది ఎంతసేపూ పెద్ద పెద్ద భూఖండాల్ని దున్నడానికే ఉపయోగిస్తుంది. బీదవానికి ఏనుగును ఇస్తే ఎంత ఉపయోగిస్తుందో, అట్లే సాధారణ రైతుకి ట్రాక్టరుకూడా అంతే ఉపయోగిస్తుంది."

"అంతకంటెకూడా కనిష్టం" అని వెనక బెంచీలమీదనుంచి ఎవడో బొంగురు గొంతుకతో అన్నాడు.

"అందుచేత ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి?" అని దేవిడోవ్ పై మాటలు ఏమీ వినిపించుకోకుండా మొదలుపెట్టేడు. "కమ్యూనిస్టుపార్టీ దేశంలోని రైతులందర్ని సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోనికి ఆకర్షించి, వాటిద్వారా ట్రాక్టర్లను ఉపయోగములోనికి తెచ్చి, ప్రజల దరిద్రము పోగొట్టడానికి నిశ్చయించింది. కామ్రేడ్ లెనిన్ చచ్చిపోయేముందు 'దేశములోని రైతుల దరిద్రం పోవాలంటే సమిష్టివ్యవసాయక్షేత్ర నిర్మాణం జరగాలి. లేకపోతే, రైతులు ఇంకా అధోగతిపాలవుతారు. కులకులు బీదరైతుల రక్తమాంసాలు పీల్చి పిప్పిచేస్తారు' అని చెప్పేడు. అందుచేత మీరంతా లెనిన్ చూపించిన మార్గం అనుసరించాలి. కూలీలు, బీదరైతులు కలసి సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ఏర్పాటుచేసుకుంటే పెద్దరైతుల్ని అతి సులభంగా నాశనం చెయ్యగలుగుతారు. నేను చెప్పేదానిలో అతిశయోక్తి ఏమీలేదు. ఇంక అసోసియేషన్ విషయం చూడండి. మన అసోసియేషన్ ఇంకా ప్రారంభస్థితిలోనేవుంది. దానివల్ల నష్టమేకాని లాభంలేదు. అందుచేత ఈ అసోసియేషన్, సమిష్టి వ్యవసాయక్షేత్రంలో కలిపేస్తే వీలుగా ఉంటుంది. క్రమక్రమంగా సాధారణ రైతులుకూడా........"

"ఒక్కసారి ఆగండి—మీ మాటలకి అడ్డంవచ్చేను" అంటూ అసోసియేషన్‌లో పూర్వం సభ్యుడుగానున్న దెమ్కా–ఉషాకోవ్ లేచాడు, మెల్లచూపు చూస్తూ.

" ముందు అనుజ్ఞతీసుకొని తరువాత మాట్లాడాలి. అంతేకాని ఎవరి యిష్టం వచ్చినట్లు వారు లేచి మాట్లాడడానికి వీలులేదు" అని దేవిడోవ్ ప్రక్కన కూర్చొనియున్న నగుల్నోవ్ మందలించేడు.

" అడక్కుండా లేచి మాట్లాడుతూన్నందుకు క్షమించండి. అసోసియేషన్‌వల్ల నష్టమేకాని లాభంలేదని, మన సోవియటు ప్రభుత్వానికి ఇది గుదిబండలావుందని అంటే, అది ఎవరి లోపమంటారు ? ముష్టివాళ్ళవలె మేము ప్రభుత్వం ఇస్తూన్న అప్పులవల్లనే బ్రతకడానికి కారకులెవరు ? అసోసియేషన్ అధ్యక్షుడయిన అర్కాష్కాయే దీనికి ముఖ్యకారకుడు. ప్రతి చిన్న విషయంలోను పీకులాడి బేరంచేసే అతని స్వభావంమూలాన్నే ఇంతవరకు వచ్చింది."

" మంచీ చెడ్డా లేకుండా నోటికి వచ్చినట్లల్లా పేలకు " అని హాలు మూలనుంచి ఒకకీచుధ్వని వినిపించింది. అర్కాష్కా వంగి సభికుల్ని తప్పించుకుంటూ సభావేదిక దగ్గరకు దారి తీసేడు.

" అవసరం అయినట్లయితే ఆ విషయం ఋజావు చేస్తాను" అని డెమ్కా ఎదురుకున్నాడు. రజ్మట్నోవ్ బల్లమీద గుద్దుతూ, గోల చెయ్యవద్దని సభికుల్ని కోరేడు. కాని ఆమాటలు వినిపించుకొనకుండా డెమ్కా అర్కాష్కావైపు తిరిగేడు "లేదని బొంకుతే ఎక్కడికిపోతుంది– చేసినపని ! 'చెరపడానికి చేటపెయ్యాచాలు.' మావంటివాళ్ళు ఎంతమంది ఉంటే మాత్రం ఏం లాభం, నీవంటివాడు ఉన్న తరువాత. మొదటినుంచీకూడా అసోసియేషన్ పాడుచెయ్యడానికే చూసేవు నువ్వు. మాతో ఎవరితోను ఆలోచించకుండా ఆబోతును ఇచ్చేసి, ఎందుకూ పనికి రాని మోటారుసైకిలును పుచ్చుకోలేదూ నువ్వు ? గుడ్లు పెడుతూన్న జాతైన కోడిపెట్టల్ని అమ్మి వాటికి........"

" ఇందులో ఒక్కటీ నిజంలేదు. అంతా అబద్ధమే !" అని అర్కాష్కా తనని సమర్థించుకున్నాడు.

"మూడు గొర్రెల్ని, ఒకఆవును యిచ్చి, పాతబండి ఒకటి తీసుకొనడానికి కారకుడవు నువ్వుకాదూ? నువ్వు ఏపనిచేస్తే బాగుపడింది?" అంటూ దెమ్కా చప్పట్లు కొట్టేడు.

"ఏమిటిది; కోడిపుంజుల్లా అల్లా పోట్లాడుకొంటున్నారు?" అన్నాడు నగుల్నోవ్.

"కొంతసేపు మాట్లాడడానికి అవకాశం ఇయ్యండి నాకు." అని ఆర్కాష్కా వేదికదగ్గిర నిలబడి, ఎర్రటిగడ్డం గుప్పెటలోకి తీసుకొని, ఏదో మాట్లాడబోయేడు. ఇంతలో దేవిడోవ్ అతనిమాటకి అడ్డంవచ్చి "దెమ్కా ఉషాకోవ్ మాట్లాడటం పూర్తిఅవనియ్యండి మధ్య అడ్డురాక. సరే, వాగానే వుంది. కామ్రేడ్సు! మీ దరిద్రం పోవాలంటే, సమిష్టి వ్యవసాయక్షేత్రాల్ని నిర్మించి వాటిద్వారా.........."

"ఈ విషయమై మీరు ఇన్నిసార్లు చెప్పనవసరంలేదు. మనః పూర్వకంగా మేమంతా సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో చేరుతాము." అన్నాడు, తలుపువగ్గిర కూర్చున్న Red Partisan పావెల్ లుబిష్కిన్.

"సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో మేమంతాకూడా చేరడానికి సిద్ధముగా ఉన్నాము." అంటూ ఇంకొకడు లేచేడు.

"మనం ఇంతక్రితమే సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ఏర్పరచుకొని ఉన్నట్లయితే, దరిద్రం ఇంతకాలం ఉంటుందా?"

"అయితే—ఒకటుంది. దాన్ని సరియైన పద్ధతులమీద నడిపించాలి" అన్నాడు లుబిష్కిన్ గట్టిగా. అతడు కుర్చీకోంచి లేచి, తలమీది నల్లటి ఉన్నిటోపీ తీసి చేతితో పట్టుకొని దగ్గరున్న తలుపుని జేరబట్టాడు.

"మీరు సోవియటు ప్రభుత్వం తరఫున, మాలో ప్రచారం చెయ్యడానికి వచ్చినట్లు తోస్తూంది. కాదూ? సోవియటు ప్రభుత్వ నిర్మాణం

కోసం పాటుబడ్డవాళ్ళం—మేము, అది పడిపోకుండా, సమస్తం ధారపోసి, దాన్ని నిలబెట్టినవాళ్ళం—మేము. సమిష్టివ్యవసాయక్షేత్రం అంటే మాకు తెలుసు. అది కావాలని కోరేవాళ్ళలో మేమే మొదటివాళ్ళం. మాకు కావలసిన యంత్రాలు ఇయ్యండి. ఇంక ఏమీ అవసరంలేదు." అతడు పిడికిలి బిగించి చెయ్యి పైకి ఎత్తేడు. "ట్రాక్టర్లవల్ల చాలాలాభం వుంటుం దని మాకు తెలుసును. అయితేమాత్రం ఏం లాభం? మాకు సరిపడినన్ని యంత్రాలు మీరు తయారుచెయ్యడంలేదు. అందుచేత వెనుకటిమాదిరిగానే ఒకచేత మేడితోక పట్టుకుని రెండవచేతితో కళ్ళనీళ్ళు తుడుచుగుంటూ జీవితాలు గడిపేస్తున్నాము. మీరు సమిష్టి వ్యవసాయక్షేత్రాల విషయమై ఈ ఉద్యమం ప్రారంభించకముందే, రైతుల అభివృద్ధికి తగినంత శ్రద్ధ తీసుకొనవలసినదని సోవియటు ప్రభుత్వాన్ని కోరుతూ ఒక మహజరు పెట్టేము. సోవియటుప్రభుత్వం వచ్చినతరువాత కూడ కొన్ని సంవత్స రముల వరకు మా పరిస్థితులు వెనుకటి మాదిరిగానే వుండేవి. ఇవ్వవలసిన పన్నులు ఇచ్చెయ్యడం—మాదరిద్రమూ, మేము మిగలడం. ఎల్లకాలమూ ఈవిధంగానే ఉండేటట్లయితే ఈసోవియటు ప్రభుత్వం వచ్చినలాభంఏమిటి? అంతర్యుద్ధంలో మనం గెలిచేము. బాగానేవుంది; కాని తరువాత విషయం ఏమిటి? తిరిగి వెనకటి మాదిరిగానే భూమి వున్నవాడు దున్నుకొని బ్రత కడం, లేనివాడు.........వాళ్ళంతా ముష్టికి బయలుదేరాలా? లేకపోతే దుడ్డు కర్ర చేతపుచ్చుకొని, దారులుకాచి సోవియటు ప్రభుత్వాన్నే దోచుకోవాలా? భాగ్యవంతులు వెనుకటి మాదిరిగానే భూములు అమరకము చేసుకొనియు, కూలీలను పెట్టి పనిచేయించుకొనియు జీవిస్తున్నారు. 1918 వ సం॥రంలో ఎంతో వ్యయప్రయాసలకోర్చి తీసుకొని వచ్చిన విప్లవానికి ఫలితం ఇదేనా? అసలు విషయం మీరు మరచిపోయినట్లు తోస్తుంది. మేము కనక 'ఎందు కొరకు ఇంతత్యాగం చేసేము' అని అడుగుతే శరీరం కూడా కష్టపెట్టకొన వలసిన అవసరంలేకుండా సౌఖ్యంగా జీవించే పెద్ద పెద్ద ఉద్యోగస్తులు,—

వారు చెప్పిన ప్రతిదానికి వెనక తాళంవేస్తూ వారివయ సంపాదించుకొన దానికి ప్రయత్నంచేసే భావదాస్యులు వెనక వెనక నవ్వుతూండగా—'దానిని గురించి మీరు అంతగా చెప్పవలసిన అవసరంలేదు. మాకు ఆమాత్రం జ్ఞానంవుంది.' అని సమాధానంచెబుతారు. మేము ఇటువంటి వాళ్ళని అనేక మందిని చూసేము. క్రెడిటుమీద కొని, లేక ధాన్యం తీసికొని కొని ఒక ట్రాక్టరు ఇయ్యండి. ఎటువంటిదో ఎరుగుదురా? ఇప్పుడు మీరు చెప్పేరే. అటువంటిదే; ఒకటోరకం ట్రాక్టరు. ఇది మాకేమీ వుచితంగా ఇవ్వడం లేదు; ఎందుకో ఎరుగుదురా?" అంటూ అతను, చిరిగి మాసిపోయివున్న ట్రౌజరు గుండీలు తీస్తూ తిన్నగా దేవిడోవ్ దగ్గరికి వెళ్ళి, చొక్కాపైకి లాగి గడ్డంకింద నొక్కిపట్టి, పొట్టమీద, తొడలమీదనున్న పెద్ద పెద్ద గాయపు మచ్చలు చూపించేడు.

"ఈ గాయాలన్నీ నేను ఎందుకు తిన్నానంటారు?"

"నీకేమీ సిగ్గులేదూ? ట్రౌజర్లు పూర్తిగా తీసిపారెయ్యి కొంతకొంత తియ్యడం ఎందుకు?"అంది డెమ్కాఉషాకోవ్ ప్రక్కన కూర్చున్న ఎనీషా.

"నీకు అల్లా బాగుంటే మొదటనే సలహా ఇచ్చి వుండవలసింది; పాపం" డెమ్కా మెల్లచూపుచూస్తూ తిరస్కారంగా అన్నాడు.

"ఎనీషా! అనవసరంగా వాగక నోరుముయ్యి! నా గాయాలు ఒక శ్రామికుడికి, చూపించడానికి సిగ్గుపడవలసిన పనిలేదు. ఈవిధంగానే జీవితం గడపవలసివస్తే గాయాలు కప్పడానికి ఈచింకిరిగుడ్డలుకూడా వుండవు. ఇప్పటికే గుడ్డలన్నీ చిరిగి పీలికలు అయిపోయేయి. పగలు ఆడపిల్లలు ఈ గాయపు మచ్చలూ, నన్నూ చూస్తే హడలిపోతారు." వెనక బెంచీల మీద నున్నవారు నవ్వడం మొదలుపెట్టేరు. సభలో గోల బయలుదేరింది. లుబిష్కిన్ సభికులకేసి తీవ్రంగాచూసేడు. క్రమంగా సభలోసద్దు అణిగింది.

"కాన్‌స్టిట్యూషనల్ డెమాక్రాట్లతో యుద్ధంచేసినది భాగ్యవంతులు. బీదలు అనే రెండువర్గాలు వుండటానికేనా? భాగ్యవంతులు అజీర్ణంచేసే లాగ తెగతిని బలుస్తూంటే, గంజినీళ్ళకుకూడా ముఖంవాచి మేమున్నాము. కామ్రేడ్! ఇది అబద్ధమా? మకార్! నేను ఇల్లా నిర్మొఖమాటంగా అంటు న్నానని కష్టంగావుందా? సాధారణంగా ఎప్పుడోకాని మాట్లాడనే మాట్లా డను. మాట్లాడడం అంటూ వస్తే ఇలాగే మాట్లాడుతాను."

"బాగానేవుంది. కానియ్యండి." దేవిడోవ్ తలఊపేడు. "ఈ యేడు నేను 8 ఎకరాల భూమిమాత్రం సాగుచేసేను. ముగ్గురు పిల్లలు, ఒక కుంటి చెల్లెలు, రోగిష్టి భార్యని నా ఒక్క చేతిమీదా పోషించాలి. రజ్మట్నోవ్! ఈ యేడు ఇవ్వవలసిందంతా చెల్లించేసేను కాదూ?"

"ఆ-ఇచ్చేవుకాని-దాన్నిగురించి అంతగా పొగడుకోనక్కరలేదు."

"పొగడుకుంటే తప్పులేదు! పెద్దరైతు ఫ్రోల్ ఇచ్చేడా? సాధారణంగా ఇవ్వవలసినదంతా ప్రభుత్వానికి చెల్లించేడా? చెల్లించలేను"

"కోర్టువారు అతనికి జుల్మానావిధించి వసూలుచేసేరు."రజ్మట్నోవు చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

అప్పుడు దేవిడోవుకు జిల్లాకమిటీ శక్రటరీ మాట జ్ఞాపకం వచ్చి, "ఇప్పుడువుండవలసింది, నువ్వు." అనుకున్నాడు.

" అయితేమాత్రం అతనికి పోయినదేముంది. మళ్లీ తొలకరించ గానే నాబోటివాళ్ళని నలుగుర్ని కూలికి పెట్టుకొనడానికి తయారవుతాడు." అంటూ లుబిష్కిన్ చేతిలోనున్న నల్లటి వున్నిటోపీ దేవిడోవ్ కాళ్ళమీద పడేసేడు. సమిష్టి వ్యవసాయక్షేత్రాల్ని గురించి మాదగ్గర వర్ణించడం ఎందుకు? ఈ భాగ్యవంతుల్ని అందరిని గొంతుకలు నులమండి-మేమంతా సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో చేరడానికి సిద్ధంగా వున్నాం. వాళ్ళ సాధన సంపత్తంతా మాకియ్యండి. అప్పుడు మనం అందరం హెచ్చుతగ్గులు

లేకుండా సమానంగా వుండేటందుకు అవకాశం కలుగుతుంది. ఇప్పుడు ఓ వైపున మీరు వేదికలెక్కి గొంతులుపోయేటట్లు 'భాగ్యవంతుల్ని నాశనంచెయ్యాలి.' అని బల్లలుగుద్ది వుపన్యాసాలు యిస్తూనేవున్నారు — అవతల వాళ్లు రోజురోజుకు భాగ్యవంతులవుతూనే వున్నారు, మాబోటి వాళ్ళందర్నీ పీల్చి పిప్పిచేస్తూ."

"ఆ క్రోల్ సంపత్తిఅంతా మీకిచ్చినట్లయితే నిముషంలో దానికి బదులు ఒక విమానం కొనుక్కొనివస్తాడు, అర్కాషా" అని డెమ్కా అందుకున్నాడు.

"హ్హా-హ్హా-హ్హా-హ్హా"

"ఓః అందుకేమీ సందేహంలేదు. అంతపనీ చెయ్యగలడు."

"చూసేరా! ఇంతమందిలో నన్ను ఎల్లా అవమానం చేస్తున్నారో" అంటూ అర్కాషా లేచేడు.

"అబ్బా! ఊరుకోండి. చెవులు తడకలు కడుతూన్నాయి."

"ఒకరి తరవాత ఒకరు మాట్లాడకూడదూ—కుక్కల్లా పోట్లాడక పోతే!"

కొంతసేపటికి దేవిదోవ్ వాళ్ళని అందర్నీ మాట్లాడకుండా చెయ్య గలిగేడు. "ఇదే మనపార్టీయొక్క నీతి." అన్నాడు అతడు. "మీరు అందరు ఆనీతిని అర్థంచేసుకోలేక అనవసరంగా కంగారుపడుతూన్నారు భాగ్యవంతుల్ని నాశనం చెయ్యండి. వాళ్ళ ఆస్తిఅంతా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకి దఖలు చెయ్యండి. ఏమోయి! క్రామేడ్ లుబిష్కిన్, టోపీ టేబిలుక్రింద అనవసరంగా పారేసేవు. ఇంకా దాని అవసరం వుంది నీకు భూములను అమర్చుకొనడం, కూలీలను పెట్టుకొనడం, ఇకపైని మన ఎంతమాత్రం సహించి ఊరుకోకూడదు. మనం ఇంతవరకు మ అవసరం కోసం భాగ్యవంతుల్ని చూసీచూడనట్లు వూరుకొనవలసి వచ్చిం

సమిష్టి వ్యవసాయక్షేత్రాలకంటె వాళ్ళే ఎక్కువ పంట పండిస్తూన్నారు. కాని ఇకపైని వాళ్ళని అల్లా అని ఊరుకోకూడదు. గోటితో పోయేదాన్ని గొడ్డలితో నరకవలసివస్తుంది. ఈ విషయమై కామ్రేడ్ స్టాలిన్ ' పెద్ద రైతుల ఆస్తి అంతా లాగెయ్యండి. ఆ ఆస్తిఅంతా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలవశం చెయ్యండి ' అని చెప్పేరు. మీరంతా యంత్రాలు కావాలని ఆందోళన చేస్తున్నారు. మన ప్రభుత్వం ఈ సంవత్సరం సమిష్టి వ్యవ సాయాభివృద్ధికి 50 కోట్ల రూబుళ్ల మంజూరు చేసింది. ఈ విషయం మీకు తెలుసునా ? ప్రస్తుతం మన కర్తవ్యం ఏమిటి ? సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు నిర్మించడం. తరువాత, మనకి కావలసిన యంత్రసామగ్రికోసం ప్రయత్నం చెయ్యడం. కాని మీరు గుఱ్ఱం కొనకముందే జీను బేరం ఆడుతున్నారు. ఏం ? నవ్వుతారెందుకు ? నేను చెప్పేది అబద్ధమా ?"

" లుబిష్కిన్‌కి అడావిడి ఎక్కువ. "

" మేమంతా సమిష్టివ్యవసాయ క్షేత్రాలలో చేరుతాం. "

" మా పేర్లు తీసుకోండి. మేమంతా ఇప్పుడే చేరుతాం."

" నడిపించేవాడు లేక ఊరుకున్నాం. లేకపోతే పెద్దరైతుల్ని ఈపాటికే నాశనం చేద్దుం."

"సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో చేరదలచినవాళ్ళంతా చేతులు పైకి ఎత్తండి." అన్నాడు నగుల్నోవ్. 33 చేతులు లెక్కపెట్టేరు. పరధ్యా న్నంగా ఒకడు రెండుచేతులూ కూడా ఎత్తేడు పైకి.

ఉక్క భరించలేక దేవిడోవ్ కోటువిప్పి కుర్చీకి తగిల్చి, చొక్కా బొత్తాలుకూడ ఊడతీసి జేబురుమాలుతో విసురుకుంటూ, చిరునవ్వుతో సభికులందరు నిశ్శబ్దంగా వున్న తరువాత మాట్లాడవచ్చునన్నట్లుగా కూర్చున్నాడు.

"మీ అందరికి వర్గచైతన్యం వుంది: బాగానే వుంది. సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో చేరడం ఒక్కటే మీపని అనుకుంటున్నారేమో. అది ఒక్కటే కాదు. ఇంకా చాలాపనివుంది. మన సోవియటు ప్రభుత్వం బీద రైతులమీదనే ఆధారపడివుంది. మీ అంతట మీరు సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో చేరడమేకాకుండా, 'చేరుదమా-వద్దా' అని సంకోచిస్తూన్న బీద రైతుల్ని కూడా చేర్పవలసిన బాధ్యత మీమీదే వుంది."

"ఇష్టం లేనివాళ్ళని చేర్చడం ఎల్లా? వాళ్ళేం పశువులా ఏమిటి—ఇష్టంవున్నా లేకపోయినా మెడమీద కాడి పెట్టి తోలడానికి:" అన్నాడు ఆర్కాషా.

"వాళ్ళకి నచ్చచెప్పి చేర్పించాలి. ఒక్కర్ని కూడా ఒప్పించి చేర్చలేకపోతే, మీకు ఎన్ని విషయాలు తెలిసివుంటేమాత్రం లాభం ఏముంది? రేపుకూడా మళ్ళీ ఒక మీటింగు ఏర్పాటుచేద్దాం. అప్పుడు సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణవిషయంలో ఓట్లు తీసుకొనేటప్పుడు అనుకూలంగా మీరు ఓటు చెయ్యడమే కాకుండా, మీదగ్గరనున్న వారినికూడా ప్రోత్సహించండి. ఇంక ఆ విషయం కట్టిపెట్టి పెద్ద రైతుల విషయం ఆలోచిద్దాం. వాళ్ళనందర్ని ఉత్తరకకేషియాలో ఎక్కడా ఉండకుండా తరిమివెయ్యాలని ఒకతీర్మానం Pass చేద్దామా?"

"ఆ-మా అందరికి అంగీకారమే."

"ఈ చుట్టుప్రక్కల ఎక్కడా వుండకుండా తరిమెయ్యాలి."

"తరమడమేగాదు; తరిమి నాశనం చెయ్యాలి." అని ఛలోక్తిగా అని దేవిడోవ్ రజ్మట్నోవ్ వైపు తిరిగి ఈవూళ్ళోవున్న పెద్దరైతుల జాబితా తయారుచేసి చదవండి. అప్పుడు 'వాళ్ళందరు పెద్దరైతు లవడం చేత వారి ఆస్తులు జప్తుచేసి, దేశములోనుంచి వెళ్ళగొట్టా'లని స్థిరపరుద్దాం" అన్నాడు.

ఆంద్రీ రజ్మటోవ్నోవ్ డాక్యుమెంటు కేసులోనుంచి ఒక కాగితం పైకి తీసి దేవిడోవ్ చేతికిచ్చేడు.

" 'ఫ్రోల్ డెమాస్కోవ్' మనం విధించబోయే శిక్షకి ఇతడు అర్హుడేనా?" అని అడిగేడు దేవిడోవ్.

వెంటనే అందరూ చేతులెత్తేరు. ఓట్లు లెక్కపెట్టేటప్పుడు ఎవరో చటుక్కున చెయ్యి దించెయ్యడం చూసి దేవిడోవ్ "దీనికి నువ్వు వ్యతిరేకుడవా?" అని అడిగేడు.

"నేను వోటు చెయ్యడంలేదు" అని కొంచెం అమాయకుడులా కనిపించే, ఆ చెయ్యి దించేసిన కోసక్కు జవాబు చెప్పేడు.

"ఏం? ఎందుచేత?" అని అడిగేడు దేవిడోవ్.

"అతడు మా ఇరుగుపొరుగువాడు. అప్పుడప్పుడు నాకు సహాయం కూడా చేస్తూంటాడు. అందుచేత అతనికి వ్యతిరేకంగా ఓటు చెయ్యడం నాకు ఇష్టంలేదు."

"వెంటనే సభలోంచి వెళ్ళిపో!" అంటూ నగుల్నోవ్ లేచేడు.

"కామ్రేడ్! అంత తొందరపాటు ఎందుకు? మీరు కూర్చోండి." అని దేవిడోవు అడ్డంవచ్చేడు. "వెళ్ళిపోకండి; ఇల్లారండి. మీకష్టసుఖాలు పూర్తిగా తెలియచెయ్యండి. డెమాస్కోవ్ పెద్దరైతు అవునంటారా, కాదంటారా? మీ ఉద్దేశ్యం ఏమిటో చెప్పండి."

"మీరు చెప్పేది నాకేమీ అర్థం అవడంలేదు. నేనేమీ చదువుకోలేదు. ఈసభలోనుంచి నన్ను వెళ్ళిపోనివ్వవలసిందని కోరుతున్నాను."

"అల్లాకాదు. డెమాస్కోవ్ మీకు ఏవిధమైనసహాయం చేస్తున్నాడో చెప్పండి."

"దున్నుకొనడానికి అప్పుడప్పుడు ఎడ్లని ఇస్తూంటాడు, అవసరమైనప్పుడు ధాన్యం బదులు యిస్తూంటాడు. నావంటి వాడికి అంతకంటె కావలసినది ఏమిటి? కాని అంతమాత్రంచేత నేను దేశద్రోహిని కాను........ సోవియట్ల మీద నాకు సంపూర్ణమైన అభిమానం వుంది."

"ఆయన తరపున నిలబడమని మిమ్మల్ని అడిగేడా; ధనసహాయం కాని మరి యే యితర సహాయం కాని చేస్తూంటాడా? మీరు భయపడవలసిన అవసరంలేదు. నిజంచెప్పండి."

ఇంతలో రజ్మట్నోవ్ "డెమాస్కోవ్ ఏమి ఇచ్చాడో చెప్పెయ్యి" అని వెటకారంగా నవ్వేడు.

"ఆతను నాకేమీ ఇవ్వలేదు; ఇస్తానని వాగ్దానమూ చెయ్యలేదు. ఆ విషయం మీ అందరికి తెలియనే తెలుసును."

"టిమోఫీ! అబద్ధం ఆడుతున్నావు నువ్వు. నీకు కొంత లంచం ఇచ్చి అతనివైపు తిప్పుగున్నాడు. అందుచేత నువ్వు అతనిని సమర్థిస్తూన్నావు." అని ఎవడో వెనకబల్లమీద కూర్చున్నవాడు అందిచ్చేడు.

"మీ ఇష్టం వచ్చినట్లు అనండి........"

"ఏమండీ మీరు సోవియటు ప్రభుత్వం తరపునా, లేక భాగ్యవంతుల పక్షమా? ఒక్కముక్కలో తేల్చెయ్యండి! బీదవాళ్ళలో పుట్టి ఆవర్గానికిఅప్రతిష్ఠమాత్రం తేకండి."

"అనవసర విషయాలు చర్చించడంతో కాలం అంతా వృధా చేస్తున్నారు." అంటూ లుబిష్కిన్ విసుక్కున్నాడు.

"ఒకజత పాతబట్టలు, తాగడానికి ఒక వొడ్కాసీసా, యిస్తే మీ పక్షానికి తిరుగుతాడు. టిమోఫీ! నిన్నుచూస్తే తలనొప్పి వస్తూంది నాకు"

టిమోఫీ బోర్షేవ్‌కి ఎటుతప్పించుకోడానికి అవకాశం లేకపోయింది.

"నేను ఎప్పుడూకూడా ప్రభుత్వపక్షమే. కాని ఇందాకా పొరపాటు పడ్డాను."

తిరిగి రెండవపర్యాయం ఓట్లు తీసుకొన్నప్పుడు అతడు కూడా చెయ్యి ఎత్తేడు; కాని అయిష్టత ముఖంలో స్పష్టంగా కనిపిస్తూనేవుంది.

దేవిదోవ్ నోటుబుక్కుతీసి "టిమోఫిదోర్లేవ్ కూలీ అయినప్పటికీ భాగ్యవంతుల పక్షం. అతనిని ఒకకంట కనిపెట్టి చూస్తుండాలి."అనివ్రాసు కున్నాడు.

తరువాత మరి నలుగురిపేర్లు చదివారు. సభికులందరు ఏకగ్రీవంగా వాళ్ల 'భాగ్యవంతులని' ఓటు చేసేరు. దేవిదోవ్ మళ్ళీ చదివేడు:

"టిటాక్ బొరోడిన్"

"ఇతనికి అనుకూలగా ఎవరేనా ఉన్నారా ?" అన్నాడు.

ఎవ్వరూ మాట్లాడలేదు. రజ్మట్నోవ్, నగుల్నోవ్‌లు ఒకరి ముఖం కేసి ఒకరు చూసేరు. లుబిష్కిన్ నుదుటిమీది చెమట తుడుచుకుంటూ నిలబడ్డాడు.

"ఎవరిమట్టుకువాళ్లు మాట్లాడక ఊరుకున్నారు ఎందుచేత ?" అని దేవిదోవ్ సభికులందరి ముఖాలవంక కలయచూసేడు. కాని ఎవ్వరూ మాట్లాడకపోవడంచేత పక్కనున్న నగుల్నోవ్‌కేసి చూసేడు.

"చూసేరా !" నగుల్నోవ్ నిశ్చయంగా చెప్పడం మొదలెట్టేడు. "ఈ బొరోడిన్—అతనిని సాధారణంగా మేము టిటాక్‌అని పిలుస్తుం టాము. 1918 వ సంవత్సరంలో మాతో కూడా బోల్షివిక్ సైన్యాలలో ఐచ్ఛికభటుడుగా చేరేడు' ఇతని తండ్రి ఒక బీదకోసక్కు. ఇతడు చాలా ధైర్యసాహసాలతో యుద్ధంచేసి చివరకు గాయపడ్డాడు. ఇతని ధైర్య సాహసాలకి మెచ్చి ప్రభుత్వం ఇతనికి ఒక వెండి గడియారం బహుమతిగా ఇచ్చింది. కామ్రేడ్ ! ఈవిధంగా ఇతడు అందరిచేత మంచివాడని

అనిపించుకున్నాడు. సైన్యము వదలి ఇంటికి వచ్చినతరువాత, రాత్రిం బగళ్లు విడవకుండా కష్టపడి పనిచేసి క్రమంగా డబ్బు కూడబెట్టడం మొదలెట్టేడు. మేమంతరము ఎన్నివిధాల చెప్పినా వినక, ఒంటిగుడ్డతో సంవత్సరం పొడుగునా కాలక్షేపం చేసి, క్షవరం చేసుకొనడానికైనా ఒక్కడబ్బు ఖర్చుపెట్టక పైసదగ్గరనుంచి కూడబెట్టటం మొదలెట్టేడు. అతనికి 3 జతల ఎడ్లు వున్నాయి. ముగ్గురు జీతగాళ్ళని పెట్టుకొని ఆ 3 జతల ఎడ్లతోటి రాక్షసుడులా పనిచేసేడు. అతనికి ఒక చిన్న మిల్లు ఉండేది. అది అమ్మేసి, పెద్దఇంజను ఒకటి కొని, నూనెమిల్లు నడిపించడమే కాకుండా, పశువుల వర్తకంకూడా సాగిస్తూండేవాడు. తను కడుపునిండా తిండితినకపోవుట సరిగదా-పైగా తన జీతగాళ్ళనికూడా జీతం ఇవ్వడానికి ముప్పుతిప్పలు పెడతాడు వాళ్ళచేత 24 గంటలూ గూడ పని చేయించుగుంటాడు. అనేకసార్లు గ్రామసోవియటు సంఘం, కమ్యూనిష్టు పార్టీలద్వారా చెప్పిచూసేము. కాని ఏమీ లాభంలేకపోయింది. 'టిట్! ఈ వ్యాపారం మానెయ్యి. మన సోవియటు ప్రభుత్వానికి అడ్డు రాకు. అంతర్యుద్ధకాలంలో అనేక యుద్ధరంగాల్లో విప్లవద్రోహులతో యుద్ధంచేసి, సోవియటు ప్రభుత్వానికి సహాయం చేసేవు. నీ వ్యాపారం మానకపోతే నీమీద చర్య తీసుకోవలసివస్తుంది.........' అని అనేకసార్లు చెప్పేము. కాని ఇవి ఏవీ కూడా అతని తలకి ఎక్కలేదు. తెలిసియుండి కూడా పెద్దపులినోట్లో చెయ్యి పెడతానంటూంటే ఏం చెయ్యగలం? మేము మళ్ళీ పిలిచి అంతర్యుద్ధంలో మేమనుభవించినబాధలు, చేసిన త్యాగం అన్నీచెప్పి, అతనితో చాలా తర్కవితర్కాలు చేసేము. అప్పటికీ వినకపోతే, తుదకు 'పెట్టుబడిదారుడవయి, విప్లవవ్యతిరేకుడ వయేవంటే నాశనం చేసేస్తాము సుమా' అని కూడా బెదిరించేము. కాని ఏమీ లాభం లేకపోయింది."

"ఈ అనవసరపు గొడవంతా ఎందుకు ?" అన్నాడు దేవిదోవ్ విసుబుతో.

"ముఖ్యవిషయాలే చెబుతూన్నాను. ఇంతకంటె తగ్గించి చెప్పడం నా సాధ్యంకాదు. ఇన్నివిధాల నచ్చచెప్పినా అతని బుద్ధికి ఎక్కలేదు. 'సోవియటుప్రభుత్వం, పంటలు వృద్ధి చెయ్యవలసిందని హెచ్చరిస్తూంది. ఆ ప్రకారమే నా శక్తికొలది నేను పండించడానికి ప్రయత్నిస్తూన్నాను. అందువల్ల ఏమీ తప్పులేదు. కొద్దిమంది కూలీలను కూడ పెట్టుకొనవచ్చు నని ప్రభుత్వం అంగీకరించింది. నాభార్య ఆడవాళ్ళకు వచ్చే జబ్బుతో బాధపడుతూండడంచేత. కూలీలను పెట్టుకోవలసి వచ్చింది. మొట్టమొదట నేనూ దరిద్రుణ్ణే. క్రమంగా నా స్వశక్తిచేత ఆస్తి సంపాదించుకున్నాను. వెనక నేను యుద్ధం చేసిందికూడా ఇందుకే. తీర్మానాలు Pass చేసి. కాగి తాలు నలుపుచెయ్యడంతప్ప మీరు వీసం ఎత్తుపనేనా చెయ్యరు. నావంటివాళ్లు కష్టపడి పనిచేసి పంటలు పండించడంచేతనే ఇంతవరకు సోవియటు ప్రభుత్వం నిలిచి వుంది. లేకపోతే యీపాటికే కూలిపోను అని సమాధానం చెబుతూండేవాడు. అందుచేత ఇక గత్యంతరంలేక అతని ఓటింగుహక్కు తొలగించేము. వెంటనే అతడు జిల్లాఅధికారులకి. మాస్కోకి అర్జీలు పెట్టేడు. కాని అక్కడనున్న అధికారులందరూకూడ చిరకాలానుభవం కలిగిన బోల్షివికులవడంచేత. ఒకప్పుడు ఎంతత్యాగము. సేవ చేసి ఉన్న ప్పటికి, వాడు ద్రోహంచేస్తే శత్రువుగా పరిగణించి. వానిని దయాదాక్షిణ్యాలు చూడక అణిచివెయ్యాలి' అనే విషయం అనుభవంమీద తెలుసు కొన్నవారు అవడంచేత. అతని అర్జీలన్నీ బుట్టదాఖలు చేసేరు."

"ముఖ్యమైన విషయాలు ఏవో చెప్పి ముగించండి."

"అయిపోవచ్చింది. వోటింగుహక్కు పోయినప్పటికి అతను పూర్వపు పద్ధతులేమీ మార్చుకోలేదు. కూలీలను పెట్టుకోవడం మాత్రం...."

"అసలు విషయం వదిలేసి ఈఅనవసరపు గొడవఅంతా ఎందుకు?" అని దేవిదోవు నగుల్నోవు కేసి చూసేడు.

"ఎవరిమటుకు వాళ్ళే, మాట్లాడక ఊరుకోడానికి కారణం ఇదే! టిటాక్‌ను గురించి మీకు అన్ని విషయాలు వివరంగా చెబుతూన్నాను."

దేవిడోవు పెదవులు బిగించేడు. ముఖం నల్లబడింది.

"ట్రాట్స్కీని ఏం చేసేము చెప్పండి?—ఈవిషయాలన్నీ ఎందుకు చెప్పడం నాకు? అతడు ఒకప్పుడు గొప్పత్యాగం చేసేడు; మనం ధన్య వాదాలు అర్పించవలసిందే. కాని ఇప్పుడు భాగ్యవంతుడయేడు, దేశానికి ప్రజలకి శత్రువు అయేడు; అతన్ని నాశనం చెయ్యవలసిందే! ఈమాత్రం దానికి ఇంత ఉపోద్ఘాతం ఎందుకు?"

"కామ్రేడ్! ఇదంతా అతనిమీద జాలిచేతకాదు చెప్పడం........"

"బొరోడిన్ భాగ్యవంతుడవడంచేత, అతనిని నాశనం చెయ్యడానికి అంగీకరించేవాళ్ళు ఎంతమంది?" దేవిడోవు సభికులవంక చూసేడు. నెమ్మదిగా ఒకరి తరువాత ఒకరు—అందరూ చేతులెత్తేరు.

మీటింగు అయిపోయింది. దేవిడోవును ఆరాత్రి తనయింటికి రమ్మని నగుల్నోవు పిలిచేడు. "రేపు ఉదయం మీకు బస ఏర్పాటు చేస్తాను." అన్నాడు నగుల్నోవు డేవిడోవుతో కలసి సోవియట్ ఆఫీసు దాటివెడుతూ. ఒకరిపక్క ఒకరు నెమ్మదిగా మంచుమీద నడిచి వెడుతూన్నారు. సన్నని స్వరంతో నెమ్మదిగా నగుల్నోవు చెప్పడం మొదలెట్టేడు.

"కామ్రేడ్, మీరు భూమి అంతా కూడా సమిష్టి వ్యవసాయక్షేత్రాల కిందికి తీసికొని రావాలని చెప్పినప్పటినుంచి, నాకు చాలా ఉత్సాహంగా ఉంది. చిన్నతనంనుంచీ కూడా నాకు స్వంత ఆస్తి అంటే కిట్టదు. మార్క్సు. ఏంగిల్సులు చెప్పినట్లు, ఈ ప్రపంచములో ఈ దుస్థితి కంతకీ ఈ ప్రత్యేకపు ఆస్తి కారణం. సోవియటు ప్రభుత్వం వచ్చిన తరువాతకూడ

ప్రజలు ఇంకా ప్రత్యేకపు ఆస్తులు పోగుచెయ్యడం మానడంలేదు. అదొక అలవాటైపోయింది. ఇప్పుడే ఇల్లా అనిపిస్తూంది. జారు ప్రభుత్వపురోజుల్లో ఎంత ఘోరంగా ఉండేవో! ఆ విషయం తలుచుకోడానికి కూడా భయం వేస్తుంది. మాతండ్రి ఒక కోసక్కు. కుటుంబం చాలా పెద్దది. అంతాశ్రమ పడి పనిచేసేవాళ్లు. ఆస్తికూడా బాగా ఉండేది. 4 జతల ఎడ్లు, 5 గుర్రాలు ఉండేవి. 300 ఎకరముల భూమి ఉండేది. పెళ్ళిఅయిన అన్నగార్లుముగ్గురు ఉండేవారు. ప్రత్యేకపు ఆస్తిఅంటే అసహ్యంకలిగించిన ఆవిషయం ఇంకా జ్ఞప్తివుంది. ఒకరోజున మాపక్క ఇంటివాళ్ళ పందిఒకటి వచ్చి మాదొడ్లో పడి, బంగాళాదుంపలు బుర్దగించి తినెయ్యడం మొదలెట్టింది. మా అమ్మ వచ్చి దడిగుమ్మముచాటున నిలబడి, నన్ను పందిని తోలమంది. నేను వెళ్ళి పందిని తరిమేను. అది పారిపోతూంటే మా అమ్మ సలసలలాడుతున్న తారు దానిమీద పోసింది. అబ్బ! ఆతారు పడడంతోటే, అంతమేరతోలుగు ఊడిపోయింది. అది వేసవికాలం. క్రమంగా ఆపుండు పెద్దదై పుచ్చి పురుగులు పట్టింది. ఆఖరుకి అది చచ్చిపోయింది. మేము ఆ పందిని చంపేసి నప్పటికి ఆపంది స్వంతదారుడు మాట్లాడక ఊరుకున్నాడు. తరువాత ఒక వారం రోజులకి పొలంలో మా గడ్డివాము అంటుకొనిపోయింది. అది ఎవరు అంటించేరో మాతండ్రికి తెలిసింది. వెంటనే కోర్టులో దావా పడేసేడు. అదే పేచీలకి ప్రారంభం. ఒకరిని చూస్తే ఒకరికి కిట్టేదికాదు. ప్రతిరోజూ ఏదో ఒక చిన్న విషయానికి పొట్లాడుకుంటూండేవారు. ఈ విధంగా 5 సం॥లు గడిచింది. ఒకరోజున హఠాత్తుగా అతని కొడుకుని ఎవరో పొడిచి చంపేసేరు. అనేక కారణాలనిబట్టి, ఆ చంపిన వాళ్ళు మా అన్నలే అయివుంటారని ఊహించేను. పోలీసులు వచ్చి, ఆచోకీ తీసేరు. కాని ఏమీ తేలలేదు. అందుచేత తప్పత్రాగి కొట్టుకొనడంలో చచ్చిపోయేడని వ్రాసుకొని వెళ్ళిపోయేరు. కాని ఆరోజు మొదలు మావాళ్ళమీద నాకు అసహ్యం గలిగి, ఇల్లు వదలి వెళ్ళిపోయేను. ఒక

మిల్లులో కూలీగా చేరి జీవితం గడుపుతున్నాను. ఇంతలో యుద్ధంలో చేరవలసి వచ్చింది. జర్మనులు ఎడతెరపిలేకుండా కాలుస్తూన్న ఫిరంగిగుళ్ల నాపక్కనపడి బద్దలై పొగలేస్తూంటే, కందకాలలో నిలబడి ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకొని, ఇక్కడ నేను యుద్ధం చెయ్యడం ఎందుకు? ఇదంతా ఎవరి ఆస్తి రక్షించడంకోసం? అని ఆలోచిస్తూండేవాడిని. అక్కడ యుద్ధరంగాలలో కూడ అనేకమంది, ఈ యుద్ధాలన్నీ ఎవరి లాభంకొరకో, ఈయుద్ధాలు లేకుండా ఉండాలంటే ఏం చెయ్యాలో, బోధిస్తూండేవారు. అవి అన్నీ విని కొంతకాలానికి నేను బోల్షివిక్కుని అయిపోయేను. తరువాత అంతర్యుద్ధంలో అనేకమంది ద్రోహుల్ని ఈచేతితో వెనకముందు ఆలోచింపకుండా చంపేశాను. చివరికి ఒక యుద్ధంలో దెబ్బ తగిలి, అప్పటినుంచి మూర్ఛరోగం పట్టుకుంది. కాని, ఇది చూసేరూ." అంటూ ఒక పతకం చూపించాడు. సంతోషంచేత కంఠం పులకించింది. "ఇది చూస్తే వెనుకటి అంతర్యుద్ధపు రోజులు జ్ఞాపకం వస్తాయి."

"అవును కాని—కామ్రేడ్! బొరోడిన్‌ను మీరు బాగా ఎరుగుదురా?"

"ఆహా ఎరగకేమి! మేమిద్దరం చాలా స్నేహంగా ఉండేవాళ్ళం; కాని అతనికి ప్రత్యేకపుటాస్తిఅంటే విపరీతమైనఆశ. అందుచేత ఆవిషయాన్ని గురించి మేము అస్తమానం వాదోపవాదాలు చేస్తుండేవాళ్ళం. 1920 సం॥లో డోనెట్సుబేసిన్‌లో జరిగిన యుద్ధంలో వందలకొలది యుక్రేనియనులు చచ్చిపోయి గుట్టలు గుట్టలుగా పడిపోయిఉన్నారు. ఆరాత్రి టిటాక్ బస్తాలలో ఏవోకట్టి తీసుకువచ్చేడు. అక్కడ ఆబస్తాలన్నీ తిరగపోసేటప్పటికి తెగకొట్టిన 8 కాళ్ళు క్రిందపడ్డాయి. 'నీకేమి మతిపోలేదుకదా?' అని అడిగేడు ఒక కామ్రేడ్. "వెంటనే వాటిని తీసుకొని అవతలకిపో!" అన్నాడు. అప్పుడు టిటాక్, "చచ్చిపోయినవాళ్ళకి ఈబూట్లు ఎందుకు ఉపయోగిస్తాయి? ఈ 4 జతల బూట్లుఉంటే నాకు అథమం 10 సం॥లు

అయినా గడచిపోతాయి." అన్నాడు. అతడు ఆరాత్రి అంతా కూర్చుని స్టౌవగ్గర వాటిని వెచ్చబెట్టి జాగ్రత్తగా బూట్లు అన్నీ విప్పి దాచుకొన్నాడు. ఆకాళ్ళు తీసికొనిపోయి గడ్డికింద పారేసి తిరిగివచ్చి ఆ కాళ్ళనన్నిటిని గొయ్యితీసి పాతిపెట్టేనని చెప్పేడు. ఈ విషయం నాకు అప్పుడే కనక తెలిసినట్లయితే వెంటనే కుక్కని కాల్చినట్లు కాల్చి చంపేసిఉందును. అతని కామ్రేడ్లు ఆవిషయం చెప్పకుండా దాచేరు. తరువాత కొంతకాలానికి తెలిసి అతన్ని అడిగేను. అతడు 'ఆహా—నిజమే. ఇంకోవిధంగా బూట్లు వచ్చేలా కనిపించలేదు. చలిచేత ఆకాళ్లు బిగుసుకొనిపోయి ఉండడంచేత బూట్లు ఊడిరాలేదు. అందుచేత నాకత్తితో కాళ్ళు తెగకొట్టి తీసుకునిరావలసి వచ్చింది. శుభ్రమైన బూట్లు వృథాగా పోతూంటే చూసి ఊరుకోలేకపోయాను' అన్నాడు. "ఇదిగో! ఇదే మాఇల్లు" నగుల్నోవ్ ఒక ఇంటి ఆవరణలోపలికి వెళ్ళి తలుపుతట్టేడు.

## అయిదో ప్రకరణము

## ఆం(డ్రీ రజ్మటోన్నోవ్.

ఆం(డ్రీ రజ్మటోన్నోవ్ 1913 వ సం॥లో సైన్యంలో చేరేడు. అప్పటి నియమముల ప్రకారం సైన్యంలో చేరు ప్రతి కోసక్కు గుఱ్ఱమును, సైనిక దుస్తులను తెచ్చుకొనవలసివచ్చేది. కాని రజ్మటోన్నోవ్ గర్భదరిద్రుడు. తండ్రి చచ్చిపోయేటప్పటికి అతనికి సంక్రమించిన ఆస్తి అంతా, త్రుప్పు పట్టియున్న తాతలనాటి కత్తి ఒక్కటే. అందుచేత గ్రామస్తులంతా కలసి అతనిని కోసక్కు సంఘపు ఖర్చుమీద సైన్యంలో చేర్పించుటకు నిశ్చయించి, ఒక గుఱ్ఱపుతట్టు. దానిమీదకి కావలసినసామాను, రెండు పెద్ద కోట్లు, రెండుజతల ట్రౌజర్లు, బూట్లు కొనియిచ్చి "ఆం(డ్రీ! నిన్ను

సైన్యంలోకి పంపించడానికి అయేఖర్చు అంతా మనసంఘం భరించి పంపి స్తూంది. తరతరాలనుంచి ప్రసిద్ధిచెందిన మన కోసక్కు పౌరుషం నిల పెట్టు. జారుచక్రవర్తి సేవలో ప్రాణాలు అర్పించడానికి కూడా వెను తియ్యకు." అని చెప్పి పంపించేరు.

ఆంద్రీ సైన్యంలో చేరిన కొద్ది నెలలకే యుద్ధం ప్రారంభంఅయింది జారుచక్రవర్తియొక్క సామ్రాజ్యాన్ని విస్తరింపచెయ్యడానికి.—కొద్దిజీతా నికి జీవితమును అమ్ముకొన్న ఆంద్రీ—ఒక యుద్ధరంగంలోనుంచి మరి యొక యుద్ధరంగంలోకి తిరుగుతూ, నిరంతరం యుద్ధంచేసేడు. ఆయుద్ధ ములో అతడు చూపిన సాహసానికి, 3 సైంటు జార్జిపతకాలు బహూక రింపబడ్డాయి. ఈ సైంటు జార్జిపతకాలకి ఇచ్చే అదనపు జీతం ఇంటికి పంపించేవాడు. ఆంద్రీ పంపించిన ఈ సొమ్ములోనే అతని భార్య, ముసలి తల్లి జీవితం గడిపేవారు.

యుద్ధం సమాప్తి కావస్తూంది. ఆంద్రీ వున్న 11 వ డాన్‌కోసక్కు రెజిమెంటు యుద్ధరంగంనుంచి వెనుకకు వచ్చి విశ్రాంతి తీసుకుంటూంది. ఆంద్రీ భార్య కూలిచేసి మిగుల్చుకున్న సొమ్ముతో టిక్కట్టుకొని యుద్ధ రంగంలో ఆంద్రీని కలుసుకొని అతనితో కొన్నిరోజులు సౌఖ్యంగా గడి పింది. ఆరోజులు వారికి నిమిషాలవలె గడిచాయి కొద్దిరోజుల తరువాత ఆమె స్వగ్రామం బయల్దేరి వెళ్ళిపోయింది. అక్కడ 9 నెలలు నిండిన తర్వాత వర్షాకాలం వెళ్ళిపోయేముందు సుఖప్రసవమై ఆంద్రీ పోలికగల కుమారుణ్ణి కంది.

1918 సం॥లో ఆంద్రీ స్వగ్రామమైన గ్రిమాచీలాగ్‌కు తిరిగి వచ్చేడు. చిమికిపోతూన్న నాగలి మరమ్మత్తుచేసి, 5 ఎకరాల భూమి దున్ని, విత్తులు చల్లేడు. ఆపని పూర్తిఅయిన తరువాత ఒక రోజుఅంతా కొడుకుని ఎత్తుకుని ముద్దాడుతు కాలక్షేపం చేసేడు. ఎప్పుడూ తీక్షణంగా

వుండే అతను కొంచం విచారంగా వుండడం చూసి అతని భార్య "ఆంద్రీ! మళ్ళీ నన్ను ఒంటరిగా విడిచిపెట్టి. సైన్యంలోకి వెళ్ళిపోతున్నారా?" అని అడిగింది. "అవును; రేపు బయలుదేరాలి; దోవలో తినడానికి ఏదైనా చేసిపెట్టు" అన్నాడు.

ఆ మరునాడుదయం అతను, మకార్ నగుల్నోవ్, అటమాన్ రెజిమెంటులోని, లుబిష్కిన్, టిట్ బరోడిన్, ఇంకా ఎనమండుగురు యితర కోసక్కులు కలసి అతనిగుడిసెముందర సమావేశమయారు. వారంతా గుఱ్ఱాలు ఎక్కి బయల్దేరి. గ్రామందాటి గుఱ్ఱపుడెక్కల తాకుడుకు లేస్తూన్న ధూళిలో క్రమంగా అదృశ్యమై పోయారు.

కొమన్‌ష్కా దగ్గర ఆంద్రీ మిగిలినవాళ్ళతో విడిపోయాడు. వొరోషిలోవ్ డివిజనులో పనిచేస్తూన్న మరియొకనితో కలసి, మరోజవిస్కీ మీదుగా జారిట్జిన్‌కు వెళ్ళిపోయాడు. మకార్‌నగుల్నోవు, లుబిష్కిన్ మొదలైనవాళ్ళంతా ఒరోనియోజ్‌వైపుకు వెళ్ళేరు. మూడునెలలు అయిన తరువాత ఒక షెల్లుబద్దలయి ఆంద్రీకి చిన్నగాయం తగలడంచేత వైద్య శాలలో చేరవలసివచ్చింది. అక్కడ అతనిపరిచయస్తుడు ఒకడు కని పించి, పొడిల్‌కోవు డిటాచ్‌మెంటు హతమైపోయిన తరవాత. గ్రిమాచీ లాగ్‌లోని కోసక్కులు కొందరు, ఆంద్రీ బోల్షివిక్కులతో చేరినందులకు, అతనిభార్య ఇవ్డాకియాకుద భయంకర ప్రతీకారము సలిపేరనియు, ఆమె ఆ అవమానం భరించలేక ఆత్మహత్య చేసుగుందనియు చెప్పేడు.

* * * *

శీతకాలం. డిశంబరునెల. పొగమంచు దట్టంగా వ్యాపించివుంది. గ్రిమాచీలాగ్‌లోని ఇళ్లు, చెట్లు, నేల, అంతాకూడా మంచుతో కప్పబడి ఎటుచూసినా తెల్లగా కనిపిస్తూంది: గ్రామానికి వెనక కొద్దిదూరంలో ఉన్న గుట్టలవెనక యుద్ధం జరుగుతూంది. ఫిరంగులమ్రోత ప్రతిధ్వని

స్తాంది.........సాయంకాలం అయింది. నురగలు కక్కుతూన్న గుర్రాన్ని
గాడు తీయిస్తూ ఆంద్రీ గ్రామంలోకి వచ్చేడు. ఆతనికి ఈరోజుకు కూడా
ళ్ళకి కట్టినట్టు ఆ వెనుకటి సంగతులన్నీ.........కర్రలతో కట్టిన దడి
కలుపు విరిగిపోయింది. అతను ఒగరుస్తూ కళ్లెము బిగించి గుర్రమును
వరణ లోపలికి నెమ్మదిగా పోనిచ్చేడు. అతని తల్లి గుడిసెలోనుంచి
పరుగెత్తి వచ్చింది.

విచారాన్ని వెలిగక్కే, దిక్కులేని ఆ ముసలితల్లిని చూడగానే ఆంద్రీ కళ్ళ నీళ్లు తిరిగేయి.

"అయ్యో! ఆంద్రీ! అది మనల్ని వదలిపెట్టి వెళ్ళిపోయిందిరా– నాయనా.........!"

ఆంద్రీ ఏమీ మాట్లాడకుండా గుర్రం దిగి, కళ్ళెం దడి రాటకు చుట్టబెట్టి తిన్నగా లోపలికి వెళ్ళేడు. లోతుకుపోయి నిర్జీవంగా వున్న కళ్ళతో వంటయిల్లు ఉయ్యేల కలయచూసేడు.

"చంటిపిల్లాడేడీ ?"

బట్టతో ముఖం కప్పుకొని అతనితల్లి వెక్కి వెక్కి ఏడవ సాగింది.

"అసలు జరిగిన విషయం ఏమిటో చెప్పకుండా ఏడుస్తే ఎల్లాగ."

"చంటిపిల్లాడినేనా దక్కించుకో లేకపోయాను. ఎవ్డొకియా చచ్చి పోయిన వారంరోజులకి వాడుకూడా పొలివచ్చి చచ్చిపోయాడు."

"ఏడవకు.........ఏం చేస్తాం.........ఎవ్డొకియాను చెరిపిన వాడెవడు ?"

ఎనిఖీ దెవ్యట్కిన్ క్రిందపడేసి ఈడ్చుకొనిపోయి.........చేతిలో నున్న కొరడాతో నన్ను కొట్టి బయటికి గెంటేసేడు. మిగిలిన వాళ్ళంతర్నీ ిల్చేడు. తెల్లటి ఆ చేతులమీద, శరీరం అంతటాకూడా వాళ్ళ ఇష్టం

వచ్చినట్లు కొట్టేరు. బయటికి వచ్చేటప్పటికి దెబ్బలచేత శరీరం అంతా కదుములు కట్టి నల్లబడిపోయింది.........ఒక్క కళ్లు........".

"వాడు ఇంటిదగ్గర ఉన్నాడా, ఇప్పుడు?"

"లేడు, పారిపోయేడు."

"వాళ్ళవాళ్ళెవరేనా ఉన్నారా ఇంటిదగ్గర?"

"భార్య, తండ్రి వున్నారు, ఆంద్రీః వాళ్ళని చంపకు. ఎవళ్ళో చేసిన దానికి వాళ్ళేంచేస్తారు.........".

"నాకు నీతులు నేర్పుతున్నావా, నువ్వు?" అన్నాడు కనుబొమలు ముడేస్తో. కోపంచేత శరీరం వణికింది. తొడుక్కొనియున్న పెద్దకోటు, షర్టు లాగిపారేసేడు. పక్క ఎముకలన్నీ బయలుపడి వున్నాయి. మనిషి పాలిపోయేడు. నడుముకి బిగించబడియున్న తాబేటికాయ తీసి అంచు కరిచి పెట్టి నీళ్ళుత్రాగి లేచేడు. తల్లివైపు తిరగకుండగనే "అమ్మా! చచ్చిపోయేముందు నాతో ఏమైనా చెప్పమందా?" అని అడిగేడు.

ఆమె ఒక మూలకు వెళ్ళి క్రైస్తు సిలువ వెనుకనుంచి ఒక చిన్న కాగితం ముక్క తీసుకొనివచ్చి ఇచ్చింది.

"నా ప్రియమైన ఆంద్రీ! ఆ దుర్మార్గులు నన్ను అతిక్రూరంగా హింసించేరు. మీమీద నాకుగల అచంచలప్రేమ చూసి సహించలేక ఆ విధంగా ప్రతీకారంచేసి తృప్తిపొందేరు. బహిరంగంగా, అందరిలోనూ.........తలుచుగుంటే ఒళ్లు గగుర్పొడుస్తూంది.........భయంకరమైన అవమానం పొంది ఇంకా జీవించడానికి నాకు ఇష్టంలేదు. ఆంద్రీ! ఈ రాత్రులన్నీ కంటిమీద కునుకేనా లేకుండా ఎంత విచారించానో ఆ భగవంతుడికే తెలుసును. కన్నీళ్ళతో తలగడా అంతా తడిసిపోయింది. మీ రాకకి ఎదురు చూస్తూ, రోజులు లెక్కపెడుతూ అనేకవిధాల ఆలోచిస్తోండేదానిని. కాని ఆ ఆలోచనలన్నీ ఆలోచనలుగానే ఉండిపోయేయి. మళ్ళీ ఈ కళ్ళతో

మిమ్మల్ని చూస్తాననే ఆశ పోయింది. మన ఇరువురం సౌఖ్యంగా గడిపిన ఆ రోజులు. ఈ లోకంలో కాను సరిగదా పరలోకంలోకూడ మరుపుకు రావు. ఇక్కడ నేను విచారపడవలసినవాళ్ళు ఎవరూలేరు—మీరు, మన బిడ్డతప్ప. కొద్దికాలమైనా మన ఇద్దరం కలిసి సుఖంగా గడపలేక పోయేమని మాత్రం నా మనస్సు బాధిస్తూంది. కాని, అయిపోయిన దానికి విచారిస్తే ఏం లాభం? మీరు మళ్ళీ పెళ్ళిచేసుకొన్నట్లయితే, మన బిడ్డనిమాత్రం జాగ్రత్తగా, చూడమని చెప్పండి. ఈ దిక్కులేని బిడ్డని మీరు ఎల్లా చూస్తారో! నా బట్టలు మా చెల్లెలికి ఇయ్యమని చెప్పండి, మీ అమ్మతో. అది ఈ మధ్య పెళ్ళిచేసుకొంటే, అవసరం అవుతాయి ......"

ఆంద్రీ వెంటనే గుర్రంమీదపడి డెవ్యాట్కిన్ ఇంటివైపుకి పరుగెత్తేడు. అక్కడ గుర్రంమీదనుండి ఉరికి, కత్తిదూసి ఇంట్లోకి జొరపడ్డాడు. తలనెరసి, నడ్డికూడా కొంచెం వంగియున్న డెవ్యాట్కిన్ తండ్రి, ఆంద్రీని చూడగానే భయంచేత కాళ్లు తడబడ్డాయి. నిలువునా క్రింద కూలబడ్డాడు.

"ఆంద్రీస్టిఫినోవిచ్" అంటూ, అతను ఆంద్రీపాదాలముందు నేలమీద ఒరిగేడు.

"నీ కొడుకు చేసినదానికి ప్రతిఫలం నువ్వు అనుభవిద్దువుగాని! ఎవ్వడొచ్చి నిన్ను రక్షిస్తాడో చూస్తాను. నీ క్రీస్తుని ప్రార్థించుకో" అని గర్జిస్తు, ఎడమచేతితో ఆ ముసలివాని జుట్టుపట్టుకొని బరబరా లోపలికి ఈడ్చుకొనిపోయేడు. ఈ గందరగోళం అంతాచూచి అతనిభార్య పొయ్యిదగ్గర సొమ్మసిల్లి పడిపోయింది. అనికీడెవ్యాట్కిన్ భార్యమాత్రం ఏడుస్తూ ప్రక్కనేవున్న పిల్లల్ని అందర్నీ రెండుచేతులలోను పోగుచేసి, ఆంద్రీ ఉన్న చోటికి పరుగెత్తుకొని వచ్చింది. ముసలివానిని చంపెయ్యడానికి ఆంద్రీ కత్తిఎత్తేడు. ఇంతలో చీమిడికారుతూ మడ్డిఓడుతూన్న పిల్లలు ఏడుస్తూవచ్చి ఆంద్రీ కాళ్ళమీద పడ్డారు.

"వాళ్ళందర్నీకూడా చంపిపారెయ్యి. వాళ్ళంతా ఆతనికీ పిల్లలే! వాళ్ళతోపాటు నన్నుకూడా చంపిపారెయ్యి" అని భార్య ఏడుస్తో, చొక్కా- బొత్తాలు లాగిపారేసి, ఎండిపోయి వేళ్లాడుతూన్న గుండెలతో తిన్నగా ఆంద్రీ దగ్గరికి వెళ్ళింది. చిన్నా, పెద్దా – పిల్లలందరు ఏడుస్తో ఆంద్రీ కాళ్ళకి చుట్టుగున్నారు. ఆంద్రీ చేతిలోనున్న జుట్టువదలి వెనకకు తప్పు గున్నాడు. కత్తి ఒరలోపెట్టి, తూలుతూ వాకట్లోకి వచ్చేడు. డెమ్యాట్కీ-న్ తండ్రికూడా, కళ్ళనీరుకారుస్తూవచ్చి, ఆంద్రీ కాళ్ళమీద పడ్డాడు. ఆంద్రీ నిరసనతో వెనుకకు తప్పుకొన్నాడు.

"అదృష్టం బాగుంది.............ఆ పిల్లలు...."

తర్వాత మూడురోజులవరకు ఆంద్రీ ఇంట్లోనుంచి బయటకు రాలేదు. ఏడుస్తూ, వోడ్కా-త్రాగుతూ, మతిపోయిన వానివలె అల్లాగే పడి వున్నాడు. రెండవరోజు రాత్రి, ఎవ్డొకియా ఉరిపెట్టుకొని చచ్చిపోయిన పాక అంటించేసేడు. నాలుగవ రోజున వాడిపోయి, వికారముగానున్న ముఖముతోవచ్చి తల్లిదగ్గర సెలవు తీసుకొన్నాడు. ఆమె కొడుకు తల గుండెల కదుముకొని రెండు అశ్రుబిందువులు రాల్చింది.

రెండు సంవత్సరాలు అయిన తరువాత ఆంద్రీ పోలిషు యుద్ధరంగం నుంచి ఇంటికి తిరిగి వచ్చేడు. ఒక యేడాదిపాటు ఎగువ డాన్‌పరగణాలో ఆహారపదార్థాలు పోగుచేసే దళంలోచేరి తిరిగేడు. అక్కడినుంచి ఇంటికి వచ్చిన తరువాత వ్యవసాయం చేసుగుంటూ, అక్కడే ఉండిపోయేడు. తల్లి ఎన్నిసార్లు పెళ్ళిచేసుకోమని చెప్పినా, ఏమీ సమాధానం చెప్పకుండా ఊరుకొనేవాడు. కాని, చివరకు ఒకరోజున నిర్బంధించి అడిగింది.

"ఆంద్రీ! ఇంకనువ్వు పెళ్ళిచేసుకొనకపోతే వీలులేదు. నాకు — వెనకటి బలంలేదు. ఇక్కడ చెంబు అక్కడ పెట్టలేకుండా ఉన్నాను. ఎవంటివాడిని పెళ్ళిచేసుకొనడానికి ఎవళ్ళు ఇష్టపడరు? ఎవర్ని చేసుకోవా లనిఉందో చెప్పు!"

"నాకు పెళ్ళిచేసుకోవాలనిలేదు. ఇంతటినుంచి ఆ మాట నా దగ్గర తలపెట్టకు."

"ఏమాట అంటే ఆదేకాని కొంచెం ఆలోచన, మంచి, చెడ్డ ఏమీ లేదా ఏమిటి! చూడు! జుట్టు అప్పుడే ఎల్లా నెరిసిపోతోందో! ఇంకా ముసలితనం వచ్చిన తరువాతా ఏమిటి పెళ్ళి చేసుకొనడం? పెద్దవాళ్లు ఎందుకు చెబుతున్నారో అని కొంచెం ఆలోచించాలి. ఎన్నాళ్ళనుంచో మనమల్ని ఎత్తుకోవాలని ఉంది. కాని ఆమాత్రం మొహమానాది! మనమలకి ఉంటాయని, పేజోళ్లు కుట్టి సిద్ధంచేస్తున్నాను. వాళ్ళకి నీళ్ళుపోయడం అంటే సరదా నాకు. ఈ ఆవుని పాలు పితుకలేక చస్తున్నాను, కోడలువస్తే ఈ భారం తగ్గుతుందని చూస్తూన్నాను." అని కళ్ళనీళ్లు పెట్టుకుంది. "ఏం పుణ్యం చేసుగుంటే దొరికేదో యెంత చెప్పినా వినని కొడుకు! వేపుకు తినేస్తున్నాడు. ఎన్ని చెప్పినా బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడడు."

ఆంద్రీ టోపీతీసికొని ఇంట్లోంచి వెళ్ళిపోయేడు. అతని తల్లి అంతటితో ఊరుకోక ఇరుగుపొరుగు ఇళ్ళకు వెళ్ళి, వాళ్ళతో చెప్పడం మొదలెట్టింది.

"ఎవ్వాకియా పోయింది. ఇఁక నేను ఎవరినీ పెళ్ళిచేసుకొన దలచుకోలేదు." అని ఆంద్రీ తల్లితో ఖండితంగా చెప్పేసేడు. అందుచేత క్రమంగా ఆంద్రీమీది కోపం, చచ్చిపోయిన కోడలుమీదికి తిరిగింది.

"ఆ ముండ మావాడికి మందుపెట్టింది. ఉరిపోసుకొని బలవంతంగా చచ్చి, పిశాచమై మావాణ్ణి పీక్కు-తింటూంది. ఇంక ఎవరినీ పెళ్ళి చేసుకోనంటాడు. తల్లిప్రాణాన్ని నేను బ్రతికిఉండి, వాడు ఒంటరిగా వుంటూంటే చూస్తూ ఊరుకోగలనా! మీరు చెప్పండి! మొన్న నా కళ్ళయెదుట ఎదిగిన వాళ్ళంతా మనమల్ని, మునిమనమల్ని ఎత్తుగుంటున్నారు. ఇన్నేళ్ళు వచ్చినా నాకు మనుమలు లేకపోవడంచేత నలుగురిలోను తలఎత్తుకొని

తిరగడానికి సిగ్గేస్తూంది. ప్రతీవాళ్లు, చిలకల కమపులా ఉండడం ఏమిటి — నే నొక్కఁతెను తోడు దిక్కేనా లేకుండా ఒంట్రెంబుడతలా వుండడం ఏమిటి! నా ఖర్మం కాకపోతే!" అని కనిపించిన వాళ్ళందరితోనూ చెబుతూండేది.

ఆ సంవత్సరమే ఆంద్రీ, నొవోచెర్కాస్ యుద్ధంలో చచ్చిపోయిన సార్జెంటు 'మైకేల్ పొయూర్కోవ్' భార్యతో తిరగడం మొదలెట్టేడు. అప్పటికి ఆమెకి 40 ఏళ్లు నిండేయి. కాని దృఢమైన శరీరము, అందమైన ముఖము చూస్తే, అంత వయస్సువున్న దానివలె కనిపించదు.

అక్టోబరునెలలో ఒకరోజున ఆంద్రీ ఆమె యిల్లు నేస్తున్నాడు. సాయంకాలం మసకచీకటివేళ ఆమె అతనిని ఇంట్లోకి పిలిచింది. త్వరగా ఒక కప్పు సూప్ తీసుకొనివచ్చి అతనిదగ్గర టేబిల్‌మీద పెట్టింది. బుటే దారిపనిచేసిన శుభ్రమైన తుండుగుడ్డ ఒకటి తీసుకొనివచ్చి అతని తొడల మీద కప్పి, యెదట మరియొక కుర్చీలో కూర్చుంది. ఆంద్రీ సూప్ తింటూ, తుమ్మెదరెక్కల్లా నల్లగా దట్టంగాఉన్న ఆమెజుట్టు, అందమైన ఆమె ముఖం చూడడం మొదలెట్టేడు. ఆమెకూడా తదేకదృష్టితో ఆంద్రీ కేసి చూస్తూ, "ఇంకొక కొంచెం తీసుకురానా?" అని అడిగింది.

"నాకోసం అనవసరంగా శ్రమపడుతున్నావు" అని మీసం సవరించుకొని, మళ్ళీ సూప్ తినబోతున్నాడు. మెరీనా అతనికి ఎదురుగా కూర్చుని ఆంద్రీవైపు చూస్తూంది. ఆమె చూపుల్లో ఒకవిధమైన ఉద్వేగం, ఆశ కనిపిస్తున్నాయి. ఆంద్రీ, తెల్లటి ఆమె మెడమీద రక్తనాళాలు ఉబికివుండడం చూసేడు. అతని మనస్సుకి ఏం తోచిందో, వెంటనే స్పూన్ అక్కడ పెట్టేసేడు.

"అదేమిటి?" అంది ఆశ్చర్యంతో.

"ఏమీలేదు. కావలసినంత తిన్నాను; ఇంక అక్కరలేదు. రేపు ఉదయాన్నే వచ్చి మిలిగినపని పూర్తి చేసేస్తాను."

మెరీనా చిరునవ్వు నవ్వుతూ లేచి, అతని దగ్గరకు వచ్చి, వెనక నుంచి ఆతనిమీదకు వంగి,

"నీకు ఇష్టమైతే ఈ రాత్రికి నాతోకూడ ఇక్కడ ఉండకూడదూ?" అంది నెమ్మదిగా.

"ఉంటే ఉండవచ్చు—దానికేం"

"నాకోరిక నువ్వు అంగీకరిస్తావనుకోలేదు......" అంటూ ఆమె ప్రక్కనే వెలుగుతూన్న కొవ్వువత్తి ఆర్పేసి, పక్క సవరించి, వీధితలుపు గడియ వేసింది.

"నీలో కోసకు లక్షణాలేవీ లేవు. వట్టి పిరికివాడవు."

"ఏం, అల్లా అంటున్నావేమి?" అన్నాడు ఆండ్రీ, కొంతవరకు విప్పిన బూట్లు వదిలేసి

"నేను చెప్పేదాల్లో అబద్ధం ఏమీలేదు. నువ్వు అందరివలెనే మామూలుగానే ఉన్నావు! అందుకేమీ లోపంలేదు. కళ్ళలోకూడ చురుకుదనం కనిపిస్తుంది. కాని ఆడదానిదగ్గరకూడా నీ కోరిక వెల్లడించలేనంత పిరికివాడవు. ఇంత పిరికివాడవు నువ్వు యుద్ధంలో సైంటు జార్జి పతకాలు సంపాదించేవంటే ఆశ్చర్యంగా ఉంది." అంది అస్పష్టంగా—తలపిన్నులు పళ్ళతో పట్టుకొని జుట్టు దువ్వుకుంటూ. "మా మిష్కాని ఎరుగుదువా నువ్వు? నాకంటె కొంచెం పొట్టి. నువ్వు సరిగ్గా నా యెత్తే వున్నావు. అయితే......అంత సాహసం యెక్కడా చూడం. అతన్ని నేను ప్రేమించింది కూడా అందుకే. పేచీ వచ్చిందంటే వెనక తియ్యడం అంటూలేదు — ఎదటివాడు ఎంతబలమైన వాడయినా! చివరికి ఆ చొరవే ప్రాణాలుతీసింది."

మెరీనా భర్తతో కలిసి సైన్యంలో పనిచేసి, అతనిచావు స్వయంగా చూచిన కోసక్కులు చెప్పిన విషయాలన్నీ ఆండ్రీకి జ్ఞాపకం వచ్చేయి. అతడు తన అధీనములోనున్న కొద్దిమంది సైనికులుతో, బోల్షివిక్ కాపలా

సైనికులమీద అతాత్తుగా దాడులు సలుపుతూండేవాడు. ఒకదాడిలో బోల్షివిక్ కాపలా సైనికులు లూయిస్ మరఫిరంగితో వాళ్ళని చెదరగొట్టి, తరిమి పట్టుకొనడానికి నలుగురు అశ్వికుల్ని పంపించేరు. ఆ గంద్రగోళములో మిగిలిన సైనికులనుంచి, మైకేల్ పొయారొక్కోవ్ విడిపడిపోయేడు. వెనుక నుండి తరుముకొనివస్తూన్న నలుగురు బోల్షివిక్ సైనికులలో ముగ్గురుని కాల్చి చంపేసేడు. వెనకనుంచి వాళ్లు కాలుస్తూన్న గుళ్లు తగలకుండా అతి చాకచక్యముతో గుర్రాన్ని పరుగెత్తిస్తున్నాడు. కొద్దిసేపటిలో అతడు శత్రువులకు చిక్కకుండా పారిపోయివుండును. కాని ఆ గుర్రము కాలు ఒక నెరియలోపడి ఇరుకుకొనిపోయి క్రింద పడిపోవడంలో మైకేల్ పొయారొక్కోవ్ కాలు ఒకటి విరిగిపోయింది. ఇంతలో వెనుకనుంచి తరుముకొని వస్తూన్న మిగిలిన బోల్షివిక్ సైనికుడు అతనిని కాల్చి చంపేసేడు.

ఈ విషయాలన్నీ జ్ఞప్తికి వచ్చి ఆంద్రీ చిరునవ్వు నవ్వేడు. మెరీనా నిట్టూర్పు విడుస్తూ ఆంద్రీని దగ్గరిగా లాక్కొని పడుకుంది. ఒక అరగంట అయిన తరువాత వెనుకటి తరహాయి సంభాషణ సాగించేరు.

"మిషాక్కని, అతని ధైర్యసాహసాలు చూసి ప్రేమించేను........ నిన్నుకూడా ప్రేమిస్తున్నాను........కాని ఎందుకో నాకే తెలియదు." అంది అతని కళ్ళల్లోకి చూస్తూ. తూర్పు తెల్లవారుతూందనగా ఆమె "నేతపూర్తి చెయ్యడానికి రేపు ఉదయం వస్తావా" అంది.

"ఏం? ఎందుకురాను."

"పోనీ — మానెయ్యి."

"ఎందుచేత?"

"ఇల్లు నెయ్యడం నీకు బాగా చేతనవునే: 'ఖూకర్' కూడా నీకన్న నయం." మెరీనా నవ్వింది. "అయితే నిన్ను పిలవడానికి ఒక కారణం వుందిలే. ఈవంక పెట్టనిదే ఎందుకొస్తావు నువ్వు ఇక్కడికి? నీచేత

నెయించడం చేత వెనుకటి గోడు కాస్తా కూడా పోయింది. ఇల్లంతా మళ్ళీ నేయించాలి."

రెండురోజులు పోయిన తరువాత 'ఛూకర్' వచ్చి, ఆంద్రీ రెల్లు అంతా చిక్కుచేసి పాడుచేసినందుకు విసుక్కుంటూ ఆ ఇల్లంతా మళ్ళీ నేసేడు.

ఆంద్రీ ఆ రోజు మొదలు ప్రతి రాత్రి మెరీనావద్దకి వస్తూయుండే వాడు. ఆమెఆంద్రీకంటె 10 సంవత్సరాలు పెద్దది అయినప్పటికీ ఆమెమీద ఆంద్రీకి విపరీతమైన ప్రేమ కలిగింది.

ఈవిషయం క్రమంగా గ్రామం అంతటా పొక్కింది ఎవరికి తోచి నట్లు వాళ్లు అనేక విధాల చెప్పుగున్నారు. "ఆఖరుకి ఇంతకాలం వుండి ఆ ముసిలిముండని చేరతీసేడు, ఎవరేనా వింటే సిగ్గుపడాను" అని ఇరుగు పొరుగువాళ్ళందరితోను చెప్పిఏడ్చింది ఆంద్రీతల్లి. కాని క్రమంగా దానికే సంతృప్తిపడి ఊరుకుంది. ఆంద్రీ చాలా కాలంనుంచి అంత క్రితంవరకు న్యూరా అను ఒక యువతితో సరసాలాడుతూ కలిసి తిరుగు తూండేవాడు. కాని మెరీనాతో పరిచయం ఏర్పడినప్పటినుంచి, న్యూరా కంటపడకుండా తప్పించుకొని తిరగడం మొదలెట్టేడు. ఒకరోజున అతను పొలంలో రుప్పలు కొడుతూండగా న్యూరా వచ్చింది. ఆమెను చూడ గానే ఆంద్రీ వెలవెలపోయేడు.

"ఆంద్రీ! ఎవత్తెనో ఒకముసలిదానిని పెళ్ళిచేసుగున్నావుట కాదూ నువ్వు?" అంది వణుకుతూన్న పెదవులతో; కళ్లు చెమ్మగిలేయి.

"ఊపిరి పీల్చడానికి కూడా తీరుబడి ఉండడంలేదు" అంటూ ఆంద్రీ సంభాషణ మార్చడానికి ప్రయత్నించేడు.

"ఇంతకాలం తిరిగి ప్రయత్నం చేసినా, ఆముసలిదేగాని, పడుచు పిల్ల లెవరూ దొరకలేదూ నీకు?"

"నేను మాత్రం పడుచువాడినా ఏమిటి - చూడు!" అని నెత్తిమీది టోపీ తీసి అక్కడక్కడ నెరుస్తూన్న జుట్టు చూపించేడు.

"కాని, నిన్ను నేను ప్రేమించాను. ఆవిషయం నీకు తెలిసే ఈ నాటకం ఆడేవు. నాదే బుద్ధితక్కువ. సరే! వెడతాను." అని మళ్ళీ వెనక తిరిగి కూడా చూడకుండా వెళ్ళిపోయింది. మకార్ నగుల్నోవ్ "ఆంద్రీ! నాకేమి నచ్చలేదు. మెరీనాని పెళ్ళి చేసుగుంటే నీకు స్వంత ఆస్తి పోగు బడుతుంది. కమ్యూనిస్టుపార్టీ మెంబరువై యుండి, ఇన్నికబుర్లూ చెప్పి, చివరకు ఇదా నువ్వు చేసేపని! నేను వేళాకోళానికి చెప్పడంలేదు, కొద్దిరోజుల్లో నీకే తెలుస్తుంది ఆవిషయం. ఏం, తెలియదూ?" అని హెచ్చరించేడు.

"ఆంద్రీ! మెరీనాని శాస్త్ర ప్రకారం పెళ్ళైనా చేసుకో." అంది ఒక రోజున ఆతని తల్లి.

"శాస్త్రోక్తంగా పెళ్ళిచేసుకోకపోతే పనికిరాదా?" అన్నాడు ఆంద్రీ.

మెరీనా 20 సంవత్సరముల యువతిలావుంది. ప్రతి అవయవం లోనూ యవ్వనం తొణికిసలాడుతూంది. ప్రతిరోజు, రాత్రి ఆంద్రీ వచ్చి నది మొదలు మరునాడు ఉదయం బాగా ఎండ వచ్చేవరకు అతన్ని వది లేదికాదు. ఆమెకు వెనుకటి యవ్వనపు రోజులు వచ్చినట్లుంది. ఆతనికి రకరకాల సిల్కు దుస్తులు కుట్టించి ఇస్తూ, అతని ప్రవర్తన కనిపెడుతూ యుండేది. క్రమంగా, ఆంద్రీ తనని వదలిపెట్టి వెళ్ళిపోతాడేమోనని భయం కూడ కలిగింది మెరీనాకి. అందుచేత ప్రతి మీటింగుకు వెళ్ళి అతడు ఏ పడుచు పిల్లతో కలసి తిరుగుతూన్నాడో, ఏ యువతిమీద కన్నేసి చూస్తున్నాడో అని అదే పనిగా పరిశీలించడం మొదలెట్టింది. ఆంద్రీ ఇదంతా చూసి చిన్నపుచ్చుకొని ఆమెను తిట్టేడు. అప్పటికీ వినకపోతే అనేకసార్లు కొట్టేడు. కాని ఏమి చేసినా లాభం లేకపోయింది; చివరకు విసుగెత్తి ఊరుకున్నాడు. ఆంద్రీని సంతోష పెట్టడానికి చచ్చిపోయిన తనభర్త దుస్తు

లన్నీ యిచ్చింది. అంతవరకు అతడు ఎన్నడూ, అంత ఖరీదైన బట్టలు కట్టుకొనక పోవడంచేత, ఉప్పొంగిపోయి, సార్జెంటు ట్రౌజర్లు, పొట్టిగా బిగువుగానున్న చొక్కాలు తొడుగుకొని, తిరుగుతూండేవాడు.

ఆంద్రీ మెరీనాకు వ్యవసాయపు పనులలో సహాయంచేస్తూ, వేటకి వెళ్ళి, ఏనుప్పినో, కుందేలునో చంపి తీసుకొనివచ్చి ఇస్తూండేవాడు. మెరీనాకి ఆంద్రీ తల్లిమీద క్రోధంవున్నప్పటికి, ఆమెతో పేచీపడక, ఆంద్రీ వేటాడి తెచ్చిన మాంసం ఆమెకి కూడా పంపిస్తూ, మంచిమాటలతో కాల క్షేపం చేస్తూండేది.

వ్యవసాయంలో మొగవక్షత అక్కరలేకుండగనే ఆమె సమస్తం స్వయంగా చేసుకోగలదు. ఆమె, అమాంతంగా, రెండవవాళ్ళసహాయం అవసరం లేకుండా పెద్ద పెద్ద బరువులు ఎత్తుకొనడం, కొడవలి చేతపుచ్చు కొని వంచిన నడుము ఎత్తకుండా, ఒక్కతె, ఇద్దరిపని చెయ్యడం ఆంద్రీ చాటునుండి చూసి, ఆమె బలానికి నవ్వుకొనేవాడు. మొత్తంమీద మెరీనా చాలా బలమైన మనిషి.

సంవత్సరాలు గడిచిపోయేయి. ఆంద్రీకి మెరీనామీద ప్రేమ నాటు కొని స్థిరపడింది. అప్పుడప్పుడు మొదటిభార్య జ్ఞాపకం వొచ్చినా వెనుకటి వలె విచారపడేవాడుకాడు. ఒకపర్యాయము ప్రాన్సు ప్రవాసమువెళ్ళిన అనికీ డెవ్యాట్కిన్—పెద్దకొడుకు కనిపించేడు. అతను అచ్చంగా తండ్రిపోలికే. అతనిని చూడగానే ఆంద్రీ తెల్లబోయేడు. కాని తరువాత, తరువాత సంసార చిక్కులలో పడి క్రమంగా ఆధోరణి పోయింది.

బీదరైతుల సమావేశం పూర్తిఅయిన తరువాత ఆంద్రీ తిన్నగా మెరీనా ఇంటికి వెళ్ళేడు. లోపలగదిలో రాట్నం తిప్పుతూన్న చప్పుడు విని పిస్తూంది. లోపలికి వెళ్ళేటప్పటికి చిన్న మేకపిల్ల గంతులువేస్తూంది.

ఆంద్రీ చిరాకుతో ముఖంచిట్లించి " ఒకసారి రాట్నం ఆపేద్దూ! " అన్నాడు.

మెరీనా రాట్నం ఆపేసి, బద్ధకంతో నడ్డి విరుచుకొంది.

"మీటింగు విశేషాలేమిటి?"

"భాగ్యవంతుల ఆస్తులన్నీ జప్తు చెయ్యడానికి నిశ్చయం అయింది. రేపే పని ప్రారంభిస్తాము."

"ఆ! నిజంగానే!"

"బీద రైతులంతా సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరేరు"

ఆ బట్టలతోనే పక్కనవున్న మంచంమీద పడుకొని మేకపిల్లని పట్టుకొన్నాడు.

"నువ్వుకూడా దరఖాస్తు పెట్టు రేపు, సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేరడానికి."

" దరఖాస్తు ఏమని? "

"సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేర్చుకొనమని"

ఎదుటనున్న రాట్నం దూరంగా గెంటిపారేసింది.

"నీకేదేనా మతిపోయిందా ఏమిటి? ఎందుకూ చేరడం?"

"మెరీనా! అనవసర వాగ్వాదం ఎందుకు? ఏమైనా సరే, నువ్వు చేరక తప్పదు. లేకపోతే అందరూకూడా మెరీనాని మాత్రం దూరంగా అట్టేపెట్టి మిగిలినవాళ్ళని అందరిని చేరమంటూన్నానని ఆక్షేపిస్తారు. ఆ మాటమాత్రం నేను సహించలేను."

"ఏమైనాసరే నేనుమాత్రం చేరదల్చుకోలేను. ఆపైన నీ ఇష్టం" అంటూ లేచింది.

"అయితే, మనం విడిపోవలసివస్తుంది."

"బెదిరిస్తావా ఏమిటి?"

"బెదిరించడం లేదు నేను. అంతకంటె గత్యంతరంలేదు."

"సరే, నాకు ఉన్న ఒక్క ఆవునీ తీసుకొని చేరుతాననుకో. మళ్ళీ మనకి ఏంవస్తుంది, దానివల్ల? పాలులేకుండా మనం ఎల్లాగ గడుపుతాము?"

"సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరిన వాళ్ళందరు ఆపాలన్నీ సమంగా ఎవరికి కావలసినవి వాళ్ల తీసుకోవచ్చు"

"అయితే ఆడవాళ్ళనికూడా అంతేనా? అందుచేతనేలావుంది నన్ను విడిచిపెడతానని బెదిరిస్తూన్నావు."

"నీకూ మంచిదేకాదూ అల్లాచేస్తేను? అనేకమందితో ఉండచ్చు." ఆంద్రీ చేతిలోని మేకపిల్లను నేలమీద పారేసి, ఊలురుమాలు బుజము మీద వేసుకొని, టోపీ చేతపుచ్చుకొని "ప్రతి చేతకాని వెధవ, సమస్తం తెలిసినట్లు వాదించి ప్రాణం విసిగించేస్తూన్నాడు. ఆఖరికి మెరీనాకూడా ఎదిరిస్తూందే! సమిష్టివ్యవసాయక్షేత్రాలలో చేరడాన్ని గురించి రేపుజరిగే గ్రామస్తుల సమావేశంలో పర్యవసానం ఏమని తేలుతుందో. భాగ్యవంతులకి బాగా ఒత్తిడి కలగచేస్తే తిరగపడతారు." అనుకుంటూ కోపంతో ఇంటికి వెళ్ళిపోయేడు.

చాలా సేపటివరకు నిద్రపట్టక ఇటు, అటు దొర్లుతూనే ఉన్నాడు. అతనితల్లి పడుకొన్న తరువాత పనిమీద రెండుసార్లు లేవడం చూస్తూనే పడుకున్నాడు. కొంతసేపటికి ఒక కోడి అదేపనిగా కుయ్యడం మొదలెట్టింది. ఆంద్రీకి వ్యవసాయ పునర్నిర్మాణాన్ని గురించిన అనేక విషయాలు బుర్రలోగిర్రున తిరిగిపోయేయి. దేవిదోవ్ తొందరపడి, ఏదో పొరపాటు పనిచేసి, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరుదమా-వద్దా అని ఊగిసలాడుతున్న మధ్యరకపు రైతుల్ని బెదరకొడతాడేమోనని భయపడ్డాడు. కాని, ఇంతలో-కుదిమట్టంగా దృఢంగాఉన్న అతని విగ్రహం, తెలివితేటలు ఉట్టిపడేముఖం ఆచురుకైనకళ్ల కళ్ళకి కట్టినట్లు కనిపించేయి. లుబిష్కిన్ మీటింగులో మాట్లాడుతూంటే వెనకవైపున దేవిదోవ్ నగుల్నోవ్‌కేసి

తిరిగి, "చూసేరా. అతనికి సరియైన శిక్షణ ఇస్తే అతడు వృద్ధిలోకి వచ్చి మనకి చాలా ఉపయోగిస్తాడు. మీరు అశ్రద్ధచేసి ఊరుకున్నారు. ఇక మీద అయినా ఊరుకోక అతని విషయంలో శ్రద్ధ తీసుగోవాలి" అని అన్న మాటలు చెవుల్లో ప్రతిధ్వనించేయి. ఈమాటలు జ్ఞాపకం రావడంతోటే ఉత్సాహంతో అతడు తొందరపడి లేనిపోని చిక్కులు తెచ్చేరకం కాదు. మకార్‌ను మాత్రం అదుపులో ఉంచాలి. లేకపోతే ఉద్యమంజోరుగా సాగుతూన్న సమయంలో పుద్రేకంపట్టలేక తొందరపడి, వ్యవహారం అంతా పాడుచేస్తాడు. సారథ్యం ఆతనికిస్తే, కింద, మీద చూడకుండా రథం ఎక్కడో బోల్తాకొట్టించేస్తాడు. మకార్......టిటాక్.... .. రేపు........" క్రమంగా అతనికి తెలియకుండగనే నిద్ర ఆవహించింది. పెదవులమీది చిరునవ్వు, సూర్యరస్మికి మంచు కరిగిపోయినట్లు కరిగి అదృశ్యమైపోయింది.



## ఆరో ప్రకరణము

## ఉ ద్వా స న

మరునాడుదయం, దేవిదోవ్ సోవియటు ఆఫీసుకు వచ్చేటప్పటికి 8 గంటలయింది. అప్పటికప్పుడే 14 గురు బీదరైతులు అతనికొరకు ఎదురుచూస్తూ కూర్చునియున్నారు.

"సూర్యోదయం అయినప్పటినుంచి, 'మీరు ఎప్పుడు వస్తారా' అని ఎదురుచూస్తూన్నాము."

"ఇప్పటికే ప్రొద్దు ఎక్కింది. ఇంక ఏమీ ఆలస్యం చెయ్యడానికి వీలులేదు." అన్నాడు ముసలి ఛూకర్.

దేవిడోవ్ వచ్చినరోజు సాయంకాలం, ఆడవాళ్ళు కట్టుకొనే తెల్లటి గొర్రెచర్మంతో చేయబడ్డ దుస్తులు ధరించి అతనితో పరిహాసంగా మాట్లాడిన ముసలివాడు, ఈ ఘూకరే. ఘూకర్ అంత క్రితంవరకు దేవిడోవ్‌ను ఎరగకపోయినప్పటికి, అతిపరిచయంగా మాట్లాడడం మొదలెట్టేడు. దేవిడోవ్ సోవియట్ ఆఫీసుకు వచ్చేటప్పుడే ఘూకర్ "ఇప్పుడు చెయ్యవలసిన పనినిగురించి అతడు, నేను కలసి ఆలోచించాలి. రెండురోజులక్రితం "అతడు నన్ను కలుసుకొని అనేక విషయాలు చర్చించేడు. పూర్వ పరిచయంచేత మేము ఒకరినొకరు వేళాకోళం చేసుకొన్నా, ముఖ్యమైన విషయాలు వచ్చినప్పుడుమాత్రం తీవ్రంగా ఆలోచిస్తాము. నాలాగే అతడు కూడా వేళాకోళం మనిషి." అంటూ కోతలు కోసేడు,

దేవిడోవ్, ఘూకర్ వేసుకొన్న దుస్తులనుబట్టి అతన్ని ఆనవాలు పట్టి, "ఆ! తాతా దోవలోకి వొస్తున్నావు నువ్వు! అల్లా వుండాలి! రెండు రోజులక్రితం నేను సమిష్టి వ్యవసాయక్షేత్రం ఏర్పాటు చెయ్యడానికి వచ్చేనని వినగానే కంగారుపడి వెళ్ళిపోయేవు. అల్లాంటివాడవు నువ్వు ఇప్పుడు సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరడానికి అందరికంటె ముందే నడుంకట్టి సిద్ధం అయేవు" అన్నాడు. ఘూకర్‌కి కోపం వచ్చింది. "మొన్న ఆగడానికి తీరుబడిలేక వెళ్ళిపోయేను. అంతకంటె మరేమీలేదు." అని, సణుగుతూ అక్కడినుంచి వెళ్ళిపోయేడు.

అక్కడికి చేరిన కోసక్కులందరు, రెండు దళాలుగా విడిపోయి మొదటి దళం మెరకవీధికి, రెండవదళం పల్లపువీధికివెళ్ళి, భాగ్యవంతుల ఆస్తులు స్వాధీనం చేసుకొనడానికి నిశ్చయం అయింది. దేవిడోవ్ నగుల్నోవ్‌ను మొదటిదళంతో వెళ్ళమని చెప్పగా అతడు నిరాకరించాడు. అనుమానంతో దేవిడోవు నగుల్నోవుకేసి చూడసాగేడు. నగుల్నోవు కంగారుపడి అతనిని దూరంగా రమ్మని సౌజ్ఞచేసేడు.

"మొదటిదళంతో వెళ్ళనన్నా రెందుచేత మీరు?"

"రెండవదళంతో పల్లపువీధికి వెడతాను."

"ఎక్కడికయితే ఏమి ?"

మకార్ పెదవులు కొరుకుతూ, ముఖం పక్కకి తిప్పుకొని,

"ఎక్కడికయినా .... అంతే .... మీకు ఏదయినా ఒకటే. కాని ఫ్రోల్ దెమాస్కోవ్ కొడుకు టిమోఫీకి నా భార్యకి సంబంధం వుంది. నేను అక్కడికి వెడితే ఈ విషయం ఏదో వస్తుంది. అందుచేత వెళ్ళడం నాకు ఇష్టంలేదు. నేను రెండోదళంతో వెడతాను. మొదటిదళంతో రజ్మట్నోవ్ వెడితే బాగుంటుంది." అన్నాడు.

"కామ్రేడ్ ! అక్కడికి వెడితే ఏదో మాట వస్తుందని భయపడుతున్నారా ! సరే ! మీ యిష్టం ; బలవంతంలేదు. నాతోకూడా రెండో దళంతో రండి."

ఇంతలో, ఉదయం నగుల్నోవ్ భార్య కణతమీద చూసిన గాయం సంగతి జ్ఞాపకం వచ్చింది అతనికి. "ఆవిడని కొట్టి గాయపరచినది మీరేనా ? కొడుతూంటారా ఏమిటి మీరు ?"

"కాదు ; నేను ఎప్పుడు కొట్టను."

"ఎవరు మరి ?"

"అతడే."

"ఎవరు అతడు ?"

"టిమోఫీ, ఫ్రోల్‌కొడుకు."

"అబ్బా ! అంతటివాడా ! రండి వెడదం. ఆ విషయం తరువాత ఆలోచిద్దాం." అన్నాడు దేవిడోవ్ కోపంగా.

నగుల్నోవ్, దేవిడోవు, లుబిష్కిన్, ఛూకర్ ఇంకొక ముగ్గురు కోసక్కులు కలిపి బయలుదేరేరు. పై సంభాషణ జరిగిన తరువాత దేవిడోవు నగుల్నోవుల మనస్సులు ఎల్లాగో ఉన్నాయి.

"ఎక్కడినుంచి ప్రారంభం చేద్దాం ?" అన్నాడు దేవిడోవు.

" 'టిటాక్' దగ్గరనుంచి." అన్నాడు మకార్.

మాట్లాడకుండ, నిశ్శబ్దంగా వీధులవెంట వెడుతూన్నారు. వీళ్ళ వైపు, కిటికీలలోనుంచి ఆడవాళ్ళు తొంగిచూడడం మొదలెట్టేరు. కొంత మందిపిల్లలు పోగయి, అల్లరిచేస్తో వీళ్ళవెనక బయలుదేరేరు. కాని లుబిష్కిన్ పడికర్ర ఒకటి ఊపలాగి, వాళ్ళని తరుముకొని వెళ్ళేటప్పటికి నాలుగువైపులా పారిపోయేరు. వాళ్ళందరు టిటాక్ ఇంటిదగ్గరికి వచ్చేటప్పటికి "సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయముగా ఉపయోగించుకొనడానికి బాగుంటుంది ఈ ఇల్లు. మంచి విశాలంగా వుంది. దొడ్లోవున్న పాకలలో పశువుల్ని, గుర్రాల్ని కట్టుకొనడానికి వీలుగావుంది" అన్నాడుమకార్.

ఆ ఇల్లు చాలా విశాలంగా ఉంది. 1922వ సంవత్సరపు కరువు రోజులలో టిటాక్ ఒక ఆవుని, 4 బస్తాల ధాన్యం ఇచ్చి, కొద్దిమారములో నున్న 'టుబన్‌స్కోయ్' అనే ఊళ్ళో ఒకనిదగ్గర కొన్నాడు; ఆ ఇల్లు, కాని ఆకుటుంబం అంతా నాశనం అయిపోవడంచేత, అంత చవకగా కొనినప్పటికి, టిటాకును అడిగేవాడెవడూ లేకపోయేడు. అతను ఆ ఇల్లంతా ఊడపీకి, సామాను గ్రిమాచీకి మోసుకొనివచ్చి అక్కడ ఇల్లు కట్టుకున్నాడు. దొడ్లోమాడల్ని కట్టుకొనేటందుకు పాకలు, తబేలా మొదలైనవి వేసేడు. వీధి గోడమీద 'టి. కె బొరోడిన్. 1923' అని చెక్కి ఉంది.

దేవిడోవ్ ఇంటికేసి పరీక్షగా చూసేడు. అందరికంటె ముందుగా నగుల్నోవ్ ఆవరణదాటి లోపలికి వెళ్ళేడు. మనుష్యుల అలికిడి వినగానే గాదిపక్క పడుకొనియున్న పెద్ద బూడిదరంగు కుక్క ఒకటి బరువైన ఇనుపగొలుసు ఈడుస్తో పరుగెత్తుకొని వచ్చింది. గొలుసు రెండవవైపు ఒక రాటకు కట్టి ఉండడం చేత, ముందుకురాలేక వెనక కాళ్ళమీద లేచి మొరుగుతూ, గొలుసుతెంపుకొని మీద ఉరక డానికి ప్రయత్నించింది. కాని

గొలుసు చాలా బలంగా ఉండడంచేత సాధ్యపడక గొలుసు ఈడ్చుకుంటూ తబేలావైపు వెళ్ళిపోయింది.

"అది మీదపడితే, మళ్ళీ ఒదిలిపెట్టదు." అనుకుంటూ ఛూకర్ దృష్టి అంతా ఆ కుక్కమీదే ఉంచి, అపాయం వస్తే తప్పించుకొని పారి పోవడానికి వీలుగా వుండేటట్లు దడి దగ్గర నిలబడ్డాడు.

మిగిలినవాళ్ళంతా తిన్నగా లోపలికి వెళ్ళి, వంటయింట్లో ప్రవేసిం చేరు. సన్నంగా, పొడుగ్గా వున్న టిటాక్ భార్య దూడకి నీళ్లపెడుతూంది. హఠాత్తుగా వీళ్ళందరు లోపలికి రావడంతోటే అనుమానపడి వాళ్ళవైపు కోపంగా చూసింది.

"టిటాక్ ఇంటిదగ్గర వున్నాడా?" అని అడిగేడు నగుల్నోవ్.

"లేరు."

"ఎక్కడికి వెళ్ళేడు?"

"నాకు తెలియదు." అని నిరసనగా సమాధానం చెప్పింది.

"మేము ఇక్కడికి ఎందుకు వచ్చినది మీకు తెలిసే ఉంటుంది. మీరు ........"అంటూ ఛూకర్ ఇంకా ఏదో చెప్పబోతూండగా నగుల్నోవు అతనికేసి ఎర్రమారి చూడ్డంచేత మాటపూర్తి చెయ్యకుండా, గుటకలు మింగుతూ అక్కడే బెంచీమీద చతిగిలబడ్డాడు.

"గుర్రాలన్నీ తబేలాలోవున్నాయా?" అన్నాడు నగుల్నోవు ఏమీ ఎరగనట్లు.

"ఆ—వున్నాయి."

"ఎద్లు?"

"లేవు. అంతపరీక్షగా అడుగుతున్నారెందుకు?"

"మేము చెప్పడానికి వీలులే........"అని ఛూకర్ మళ్ళీ ఏదోచెప్ప బోతున్నాడు. లుబిష్కిన్ విసవిసా వచ్చి, అతని మెడ పట్టుకొని వరండా లోకి గెంటేసేడు.

"అయితే ఎడ్లు ఏమయేయి?" అంటూ నగుల్నోవు మళ్ళీ అడిగేడు.

"ఎక్కడికో తోలుకుపోయేరు."

"ఎక్కడికి?"

"ఏమో! నాకు తెలియదు."

నగుల్నోవు దేవిడోవుకు సౌజ్ఞచేసి బయటికి వెళ్ళిపోయేడు. ఛూక ర్ని దాటివెడుతూ, పిడికిలి బిగించి బెదిరిస్తూ "మాట్లాడమనినదే అనవస రంగా వాగక నోరుముయ్యి" అని దేవిడోవ్ వైపుతిరిగి "మనం చేసిన ప్రయత్నం అంతా వృథా అయింది. ఆ ఎడ్లని ఎక్కడిక తోలుకుపోయేడో చూడాలి యిప్పుడు, వాటిని మనకి దొరకకుండగా చెయ్యడుకదా అని అనుమానంగా వుంది నాకు" అన్నాడు.

"పోనీ ఆ ఎడ్లు దొరకకపోతే........"

"ఏమిటి?" అని నగుల్నోవు ఆందోళగా అన్నాడు. "ఈ వూరి మొత్తం మీద అటువంటి ఎడ్లు లేవు. మనం చెయ్యియెత్తుతేకూడ అందవు కొమ్ములు. అంతయెత్తయినవి. అశ్రద్ధచేసి వొదిలెయ్యడానికి వీలులేదు. ఎల్లాగయినా టిటాక్ను, యెడ్లను పట్టుకోవాలి."

నగుల్నోవ్ లుబిష్కిన్ లు కొంతసేపు ఏదో గుసగుసలాడి దొడ్లో దూడలపాకవైపు వెళ్ళేరు. దూడలపాక, దొడ్డి అంతాచూసేరు. 5 నిముషా లయినతరువాత లుబిష్కిన్ దూడల్నికట్టే గుంజ వూడపీకి కుక్కని బయ టికి దూరంగా తరిమేసేడు. నగుల్నోవు తబేలాలోనుంచి మంచి యెత్తరి అయిన గుర్రమునొకదానిని బయటికి తీసుకువచ్చి నిలబెట్టేడు. నోట కళ్లెం తగిలించి, జూలుపట్టుకొని జీనులేనిగుర్రము మీద యెగిరి కూర్చున్నాడు.

"మకార్! అడక్కుండా పరాయివాళ్ళసొత్తు నీ యిష్టంవచ్చినట్లు తీసి కొనిపోవడం ధర్మమేనా?" అని కేకవేస్తూ టిటాక్ భార్య వరాండా మీదికి

పరుగెత్తుకొనివచ్చింది. "ఇంటికి తిరిగివచ్చినతరువాత ఆయనతో చెప్పక పోతే అను: ఈ సారితో యేదోతేలిపోతుంది."

"అట్టే వాగకు. టిటాక్ యిక్కడ వుంటే ఈపాటికి నేనే తేల్చేసి వుందును. కామ్రేడ్ దేవిడోవ్! ఒక్కపర్యాయం యిల్లావస్తారా?"

నగుల్నోవు ప్రవర్తన ఏమీ అర్థం అయింది కాదు దేవిడోవ్‌కి. ఏమీ మాట్లాడకుండా అతని దగ్గిరికి వెళ్ళేడు.

"అదిగో! ఆ మూల కళ్ళంలోనుంచి రోడ్డు మీదికి ఎడ్ల గిట్టల జాడలు కనిపిస్తున్నాయి." అని నగుల్నోవు చెయ్యి జాపి చూపించేడు. "టిటాక్ మనం వొస్తామన్నవిషయం గ్రహించి వాటిని అమ్మడానికని యెక్కడికో తోలుకొనిపోయేడు. బళ్ళన్నీ పాకలోనేవున్నాయి. టిటాక్ భార్య అబద్ధం ఆడుతూంది. మీరు 'కొచీటోవు' ఆస్తి జప్తుచేస్తూండండి. నేను'టుబన్‌స్కోవు' వైపు వెడతాను. అతను తప్పకుండా అక్కడికేవెళ్ళి వుంటాడు. గుఱ్ఱాన్ని తోలడానికి చిన్న జువ్వ ఒకటి అందుకోండి."

నగుల్నోవు కళ్ళంలోనుంచి ఎడ్లజాడ వెంబడినే గుఱ్ఱాన్ని పోనిచ్చేడు. కొంతదూరం వెళ్ళేటప్పటికి, ఎడ్లగిట్టల జాడలు, పక్కనే కనిపిస్తూన్న గుఱ్ఱపు డెక్కల ఆనవాళ్లు అదృశ్యం అయేయి. అక్కడినుంచి నగుల్నోవు 'టుబన్‌స్కోవు' వైపుకు మళ్ళేడు. దోవలో అక్కడక్కడ మంచుదిబ్బలమీద పేడపిసళ్లు, వెనకటిమాదిరిగానే జాడలు కనిపించడం చేత, టిటాక్ ఎడ్లను తోలుకొనివెళ్ళినమార్గం అదే అయివుంటుందని, నిశ్చయించి గుఱ్ఱాన్ని వేగంగా పోనిచ్చేడు. సుమారు ఒక మైలుదూరం వెళ్ళిన తరువాత వాగు ఒకటి అడ్డం వచ్చింది. వెనుకటిజాడలు మాయమయేయి. మంచు దట్టంగా పడడంచేత కనిపించడంలేదేమోనని, గుఱ్ఱందిగి పరిశీలనగా చూసేడు. కాని, ఆ తెల్లటి మంచుమీద ఎక్కడా జాడలు కనిపించలేదు. వాగులోపల 'కాటుక పిట్ట' నడిచివెళ్ళిన జాడలు మాత్రం స్పష్టంగా

కనిపిస్తున్నాయి. విసుక్కుంటూ మళ్ళీ గుఱ్ఱం యెక్కి, నెమ్మదిగా వచ్చిన దోవనే నడిపిస్తూ, నలువైపులా చూస్తూ బయలుదేరేడు. కొంతదూరంపో యేటప్పటికి జాడలు మళ్ళీ కనిపించేయి. అందుచేత అతడు రోడ్డువదలి ఓట్లోంచి రోలుకువెళ్ళివుంటాడని వూహించి, గుఱ్ఱాన్ని వేగంగా పోని చ్చేడు. కొంతదూరం వెళ్ళినతరువాత, టిటాక్ గుట్టల మధ్యనుంచి 'పైస్కావాయ్' గ్రామం వైపు తోలుకొనివెళ్ళేడని కనిపెట్టి, 'ఎవరో స్నేహితులదగ్గిరికి వెడుతూండివుంటాడు.' అనుకుంటూ జాడ వెంబడే గుఱ్ఱాన్ని పోనిచ్చేడు. గుట్టలమీదుగా వెడుతూండగా కొద్దిదూరంలోనున్న లోయ దగ్గిర పేడ కనిపించడంచేత గుర్రాన్ని ఆపేడు. పేడ అంతక్రి తమే వేసినట్లు వుంది. నగుల్నోవు గొర్రె చర్మపు దుస్తులలోని రివాల్వరు తడిమి చూసుగున్నాడు. అక్కడినుంచి గుర్రాన్ని లోయకేసి తిప్పేడు. ఒక అరమైలు దూరం పోయినతరువాత దూరమున ఆకులు రాలిపోయి వున్న ఓకుచెట్ల తోపువారనుంచి, ఒకడు గుర్రమునెక్కి, ఎడ్లను తోలు కొని వెడుతూవుండడం చూసేడు.

"ఏయ్! ఆగు! ఆగు!" అని గట్టిగా కేకవేసేడు నగుల్నోవు. టిటాక్ కళ్ళెం బిగిస్తూ, నలువైపులా చూసి, నోట్లో సిగరెట్టు పారేసి, గుర్రాన్ని యెడ్లముందుకు పోనిచ్చి "ఎందుకు ఆగమన్నావు?" అన్నాడు.

నగుల్నోవు వేగంగా ముందుకువచ్చి కలుసుకున్నాడు. టిటాక్ ఆతనికేసి చూస్తో నిలబడిపోయేడు.

"ఎక్కడికి వెడుతున్నావు?"

"వీటిని అమ్మడానికి వెడుతున్నాను. మకార్ ! నీదగ్గిర దాచడం ఎందుకు?" టిటాక్ చీవి, బొద్దుగా పెరిగి యెర్రిగానున్న మీసాలు తుడు చుకున్నాడు. గుఱ్ఱాలు ఒకదానినొకటి చూసి సకిలించేయి. వాళ్ళిద్దరు ఒకరి కొకరు ఎదురుగా గుఱ్ఱాలమీదే కూర్చున్నారు. చలిగాలి తగిలి నగుల్నోవు

ముఖం ఎఱ్ఱపడింది. కోపంగావున్నాడు. టిటాక్ మాత్రం పైకి గంభీరం గాను శాంతంగాను కనుపిస్తున్నాడు.

"ఎడ్లని వెనుకకు మళ్ళించి ఇంటికి తోలుకొనినడు" అని ఆజ్ఞా పించేడు, నగుల్నోవు గుఱ్ఱాన్ని అదలిస్తూ.

టిటాక్ కొంచెంసేపు అనుమానించేడు. కళ్ళెం వేళ్ళకి చుట్టపెడుతూ విచారంగా తలపైకెత్తివేసి, రెప్పలు వాల్చి, అర్ధనిమీలిత నేత్రాలతో, స్వంతంగా వడికి తయారుచేసుగున్న ముతకకోటుతో, టోపీ చెవులను కూడ కప్పునట్లు పెట్టుకొనిన అతడు కునికిపాట్లు పడుతూన్న డేగలా వున్నాడు. "కోటులోపల ఆయుధం ఏదయినా వున్నట్లయితే యింతచులకనగాచిక్కక పోయివుండును." అనుకొంటూ, నగుల్నోవు కదలకుండా, నిశ్చలంగా కూర్చునియున్న టిటాక్ కేసి చూస్తూన్నాడు. కాని, టిటాక్ ఏమి ఆలో చించుకున్నాడో, నిద్రనుంచి మేల్కొన్నవానివలె, హఠాత్తుగా ఎడ్లని అద లించి వెనక్కి మళ్ళించేడు.

"నా ఆస్తి అంతాకూడా లాగేసుగుంటారా? నన్ను భాగ్యవంతులలో చేర్చి నాశనం చేస్తారా?" అన్నాడు టిటాక్ నుదురుకూడా కప్పియున్న టోపీ అంచుకిందనుంచి చూస్తూ.

"ఇంతవరకు స్వేచ్ఛగా నీ యిష్టం వచ్చినట్లు చేసేవు. ఇకపైని నీఆటలు సాగవు." అన్నాడు నగుల్నోవు కోపం పట్టలేక.

టిటాక్ గుట్టలదగ్గరకు వచ్చేవరకు వూరుకున్నాడు.

"అయితే, నన్ను ఏంచేద్దం అని—మీ వుద్దేశ్యం?" అన్నాడు.

"ఈ జిల్లానుంచి వెళ్ళగొట్టేస్తాం. నీ కోటుకింద అక్కడ ఎత్తుగా వుంది ఏమిటి?"

"తుపాకీ" అని నగుల్నోవుకేసి చూసి కోటు విప్పేడు. నాటురకపు తుపాకీ వొకటి కనిపించింది

"అది ఇల్లా యిచ్చెయ్యి." అంటూ మకార్ చెయ్యి జాపేడు. కాని టిటాక్ మాట్లాడకుండా తుపాకి కోటులోపలదాచేసేడు. "అయితే ఇదంతా నాకోసం కాదన్నమాట." పొగాకు వెయ్యడంచేత గారపట్టియున్న పళ్లు ఇకిలిస్తూ నవ్వేడు. నగుల్నోవు కేసి తీక్షణంగా, చులకనగా చూసేడు. "ఆస్తే కాకుండా ఈ తుపాకికూడా పుచ్చేసుగుంటారా? భాగ్యవంతులందరు తుపాకులు జాగ్రత్త చేసేరని పత్రికలన్నీ రాస్తూనేవున్నాయి. నిజంకూడా అంతే. ఆస్తి పోతేపోయింది—ఈ తుపాకితో వేటాడేనా జీవిస్తారని తోచక్కరలేదూనీకు?" నవ్వుతూ తల పంకించేడు. నగుల్నోవు తుపాకి స్వాధీనం చెయ్యమని టిటాక్‌ను బలవంతపెట్టకుండా వూరుకున్నాడు. 'ఊళ్ళోకి వెళ్ళనీ; నీ పనిచెబుతాను' అనుకున్నాడు.

"వీడు తుపాకితో తిరుగుతున్నాడెందుకు!' అని ఆలోచిస్తూన్నావా ఏమిటి! ఇది యుక్రేనియా విప్లవం అణిచేసి, తిరిగివచ్చేటపుడు తీసుగు వచ్చేను. నీకు జ్ఞాపకంలేదూ? అప్పటినుంచి అల్లాగే ఒకమూలపడేసి వుంచడంచేత త్రుప్పుపట్టింది. ఎందుకేనా అవసరం వస్తుందని ఈమధ్యనే త్రుప్పు దులిపి బాగుచేసేను. నువ్వు భాగ్యవంతులందరిని నాశనంచెయ్యడానికి ప్రయత్నాలు చేస్తూన్నావని నిన్ననే తెలిసింది. ఈరోజుననే ప్రారంభిస్తావని తెలుస్తే నిన్నరాత్రే తోలుకొనిపోయివుందును........"

"ఎవరు చెప్పేరు నీకు?"

"ఒకరు చెప్పేదేమిటి! ఎవరినోటవిన్నా అదేమాట. అందుచేత రాత్రి నా భార్యతో ఆలోచించుకొని ఈ ఎద్లు స్నేహితులు ఎవరివగ్గరేనా భద్రపరచడానికి నిశ్చయించుకొన్నాము. తుపాకీకూడా మీకు దొరకకుండా ఎక్కడేనా దాచవచ్చునని ఉద్దేశించి తీసుకొనివచ్చేను: ఈపాటికే ఎక్కడైనా దాచేసి వుండవలసింది. అశ్రద్ధచేసేను. ఇంతలో నువ్వు వచ్చేసేవు. చూడు! చెయ్యి లాగుతూంది కూడాను" అన్నాడు. ఉల్లాసంతో, వికటంగా కళ్లు చిగిలిస్తో, తన గుర్రాన్ని నగుల్నోవు గుర్రం మీదికి పోనిచ్చేడు.

"టిటాక్! తరువాత వేళాకోళం చెయ్యచ్చులే. ముందు ఇంటికినడు."

"అల్లాకాదు—ఏమైనాచేస్తే యిప్పుడే చెయ్యాలి. నామటుకులోపం లేకుండా ఇంత ఆస్తి సంపాదించుగున్నాను. ప్రభుత్వాన్ని అన్ని విధాలా సమర్థించాను. అటువంటిది యిపుడు నన్ను నాశనం చేస్తున్నారు." అతని కంఠం రుద్ధమై పోయింది. అది మొదలు అతను మళ్ళీ మాట్లాడలేదు. కాని మకార్‌ని ముందుపోనిచ్చి, కళ్ళెం బిగించి క్రమక్రమంగా అతను వెనక పడడం ప్రారంభించాడు. కాని టిటాక్ వెనకవుంటే ఏమి చేస్తాడో అన్న భయంతో మకార్ కూడ గుర్రాన్ని నెమ్మదిగా తోలడం ప్రారంభించేడు. ఎడ్లు చాలదూరం ముందు వెళ్ళిపోయేయి.

"తొరగానడు. తొరగానడు" నగుల్నోవు టిటాక్‌ని తొందర పెడుతూ జేబులోని రివాల్వరు చప్పుడు చేసేడు. టిటాక్ సంగతి అతనికి బాగా తెలుసును. "నావెనక ఉండడానికి వీలు లేదు. అఠాత్తుగా కాల్చడానికి చూస్తూన్నావేమో. అదేమీ లాభం లేదు."



## ఏడో ప్రకరణము

## ఆ క్ర మ ణ

ఆంద్రీ రజ్మట్నోవ్ దళం ఫ్రోల్ డెమాస్కోవు ఇంటికి వెళ్ళే టప్పటికి వాళ్లు మధ్యాహ్నం భోజనాలు చేస్తూన్నారు. టేబిలు దగ్గర, వయస్సు మళ్ళి, రోగంతో తీసుగుంటూన్న ఫ్రోల్, స్థూలంగా, గంభీరంగా నున్న అతని భార్య, 22 ఏళ్ళ వయస్సుగల టిమోఫీ అను అతని కొడుకు, పెళ్ళియీడు వచ్చిన కూతురు కూర్చుని వున్నారు.

టిమోఫే అచ్చంగా తల్లిపోలికే. మంచి అందమైనవాడు. కొంచెం పొడగరి. మూతి తుడుచుకొంటూ బల్లదగ్గరనుంచి లేచి, "ఈ వేళ పెద్ద లంతా వచ్చేరు! దయచెయ్యండి." అని పక్కనవున్న కుర్చీలకేసి చెయ్యి జాపి ఆహ్వానించాడు.

"కాలోచితానికి తీరుబడి ఎక్కడ!" అంటూ ఆండ్రీ రజ్మటోన్నొవు దాక్యుమెంటు కేసులోనుంచి ఒక కాగితం పైకి తీసేడు. "డెమూనోక్కవు; మొన్న పేదరైతులంతా సమావేశమై మీ స్థిర చరాస్తులన్నీ స్వాధీనము చేసుకొని, మిమ్మల్ని ప్రవాసమునకు పంపించాలని తీర్మానించేరు. మీ భోజనం త్వరగా ముగించండి; ఈ లోపుగా ఆస్తిజాబితా తయారుచేస్తాం"

"ఏమిటీ...... ఎందుకు?" ఫ్రోల్ చేతిలోని స్పూన్ క్రిందపారేసి లేచి నిల్చున్నాడు.

"మీవంటి భాగ్యవంతుల్ని అందరిని తొలగించడానికి నిశ్చయించేము." అన్నాడు, డిమాక్ఉషాకోవ్.

ఖరీదైన తోలుతో ముడవబడిన ఫెల్టుబూట్లు కిరకిర చప్పుడుచేస్తూ, ఫ్రోల్ పక్కగదిలోకి వెళ్ళి ఒక కాగితం పట్టుకొని వెంటనే తిరిగివచ్చేడు.

"రజ్మటోన్నొవ్! ఇదిగో నా సర్టిఫికెట్టు. దీనిమీద నువ్వు స్వయంగా దస్కతు చేసేవు."

"ఏమిటా సర్టిఫికెట్టు?"

"నే నివ్వవలసిన ధాన్యం అంతా ప్రభుత్వానికి చెల్లించినట్లు"

"నువ్వు ధాన్యం చెల్లించడానికి, దీనికి సంబంధంలేదు."

"అయితే, నా ఆస్తి స్వాధీనం చేసుకొని, నన్ను ఇంట్లోనుంచి గెంటెయ్యడానికి కారణం ఏమిటి?"

"గ్రామంలోని పేదరైతులంతా అల్లా నిశ్చయించేరు. ఆ విషయం మొదటే చెప్పేను."

"అల్లా చెయ్యమని ఎక్కడా శాసనం లేదు. ఇది పట్టపగటి బంది పోటు. స్వయంగా జిల్లా ఎగ్జిక్యూటివు కమిటీకిపోయి చెప్పుగుంటా, నాన్నా! జీను ఎక్కడవుంది" అన్నాడు, టిమోఫీ.

"జిల్లా ఎగ్జిక్యూటివు కమిటీకి వెళ్ళదల్చుకుంటే నడిచివెళ్లు. గుఱ్ఱాన్ని మాత్రం ఇయ్యం." ఆంద్రీ అక్కడవున్న బల్ల అంచుకు ఆని కూర్చుని, కాగితం పెనిసిలు పైకితీసేడు.

కోపంచేత ఫ్రోలు శరీరం వణకసాగింది. ముక్కుపుటా లదిరేయి. హఠాత్తుగా నిల్చున్నచోటనే కూలబడిపోయేడు. నాలిక తడబడింది. "పిశాచాలు! దోచుకోండి! తడిగుడ్డలతో గొంతుకలు కోసేరకం. చంపెయ్యండి మమ్మల్ని" అని మూలిగేడు.

"నాన్నా! లే! దేవుడు చూస్తాడులే!" ఏడుస్తూ అతని కూతురు ఫ్రోల్ జబ్బపట్టుకొని లేవతీసింది. అతడూ—కొంచం స్థిమితపడి, బల్లమీద పడుకొని డెమ్కా ఉషాకోవ్, మైకేఫ్ ఇగ్నటినోవ్‌లు, చెబుతూంటే రజ్మట్నోవు రాస్తూండడం చూస్తూన్నాడు.

"ఒక ఇనుపమంచం. మూడు తలగడాలు, రెండు కంబళ్లు"

"రెండు పట్టిమంచాలు"

"వంటసామగ్రితోనున్న 'కప్‌బోర్డు' ఒకటి. వివరంగా ఆ సరకుల పేర్లు చెప్పాలా ఏమిటి! చచ్చేం!"

"పన్నెండు కుర్చీలు. ఒకసోఫా."

"పియానో ఒకటి."

"నా 'పియానో' మాత్రం నేనివ్వను." అన్నాడు టిమోఫీ—డెమ్కా చేతుల్లోని పియానో లాక్కుంటూ.

"దూరంగావుండి మరీ మాట్లాడు, లేకపోతే చంపేస్తాను." అని డెమ్కా గర్జించేడు. "ముసలమ్మా! పెట్టెల తాళంచెవులన్నీ యిల్లాపారెయ్యి"

"అమ్మా! ఏమయినా సరే—తాళంచెవులుమాత్రం యివ్వకు. చేత నయితే పెట్టెలు బద్దలుకొట్టి తీసుకువెళ్ళనీ."

"వాటిని బద్దలు కొట్టడానికి అధికారంవుందా మనకి?" అన్నాడు మూగడైమిడ్. అతడు సాధారణంగా ఎప్పుడోకాని మాట్లాడడు. మాటా మంతీ లేకుండా, తనపని తను చేసుకొనడం, తీరికసమయాలలో మిగిలిన కోసక్కులతో కూర్చున్నా, మాట్లాడకుండా చుట్టకాలుస్తూ, వాళ్ళు చెప్పు కొనేమాటలు వింటూండడం-మీటింగులకు వెళ్ళినా మాట్లాడక ఏమూలనో కూర్చోవడం అతనికి మామూలు. అందుచేత ప్రజలు అతనిని 'మూగ డైమిడ్' అని పిలుస్తారు. అతనికి ప్రజలంతా మాట్లాడుకొనేది అనవ సరంగా కనిపిస్తుంది. గడబిడ ఏమాత్రమూ కిట్టదు అతనికి. అందుచేత గ్రామంతో సంబంధంలేకుండగా దూరంగా ఒక చిన్న గుడిసె వేసుకొని కష్టపడి పనిచేసుకొని జీవిస్తాడు. ఆ ప్రాంతంలో అంతటి బలవంతుడెవడూ లేడు, కాని దురదృష్టవశాత్తు, అతనికి జీవితం పొడుగునా అన్నీ నష్టాలే. మొదట ఐదేళ్ళ వరకు ఫ్రోల్ డెమాస్కోవు దగ్గిర కూలిపనిచేసేడు. తరువాత పెళ్ళి చేసుకొని, కౌలుకొంద్రలుచేయడం మొదలెట్టేడు. వరుసగా రెండేళ్లు పైరు కుప్పమీద వుండగా ఎవరో అంటించేసేరు. అందుచేత అతని శ్రమఅంతా వృధాఅయింది. తరువాత కొద్దిరోజులకు అతనిభార్య, "రెండేళ్ళనుంచి నీతో కాపరం చేస్తున్నా. నాతో ఒక్కసారికూడా నోరువిప్పి మాట్లాడలేదు. ఇంకనేను నీతో వుండను. నీదగ్గర వుండీ కంటె అడవిలో వుంచేనయం. అక్కడ, ఆఖరికి ఏ జంతువుల అర్పు లేనా వినిపిస్తాయి. ఇక్కడ వుంటే యింక పిచ్చికూడా యెత్తేలావుంది" అని అతనిని వదలిపెట్టి వెళ్ళిపోయింది.

మొదట డైమిడ్మీద చాల ప్రేమగా వుండేది. "డైమిడ్! నాతో నైనా మాట్లాడు. ఒక్కమాట మాట్లాడుతే చాలు." అని బ్రతిమాలి ఏడు స్తొండేది. దానికి సమాధానంగా డైమిడ్ చిరునవ్వు నవ్వి వూరుకొనేవాడు.

కాని, డైమిద్ మోసగాడనీ, ఎవరు యెన్ని చెప్పినప్పటికీ స్వతంత్రంగా ఆలోచించి బుద్ధికి యెంతతోస్తే అంతా చేస్తాడనీ వాడుక. కొంతవరకు అది నిజం అయితే అవనూవచ్చు.

ఎన్నడూ మాట్లాడని డైమిద్ మాటవినిపించగానే ఆంద్రీ తల యెత్తి చూసేడు.

"అధికారం వుందా అంటావా?" డైమిద్‌ను అంతక్రితం యెన్నడూ చూడనట్లు ఆశ్చర్యంగా చూసేడు.

"ఆయనకి అధికారం వుంది."

బాగా చిరిగిపోయిన బూట్లతో, పెద్దపెద్ద అంగలువేస్తూ, డైమిద్ పెట్టెలువున్న గదిలోకి వెళ్ళేడు. ద్వారబంధం కమ్ములు పట్టుకొని గది గుమ్మానికి అడ్డంగా నిలబడ్డ టిమోఫీని మెడపట్టుకొని గెంటేసి, చిందర వందరగా నేలమీద పడియున్న సామాను తొక్కుకుంటూ తిన్నగా పెట్టెల దగ్గిరికి వెళ్ళేడు. అక్కడ కూర్చుని, పెట్టెకివేసియున్న తాళంకప్ప పట్టుకొని తిప్పి, ఘడియ విరిచి లాగేసేడు. ఆర్కాషా డైమిద్ బలానికి నిర్ఘాంతపోయి, "అంత బలం నాకుంటే బాగుండును." అనుకున్నాడు.

ఆంద్రీ వ్రాసిన లిస్టు ప్రకారం సామానంతా దొరకలేదు. గదిలో నుంచి డెమ్కా వుషాకోవ్, ఆర్కాషా, ఆంద్రీ దళంతోకూడా వచ్చిన ఆవ్డై వెసిలీసా' అను యువతి ఒకరికంటె ఒకరు గట్టిగా చెబుతున్నారు.

"ఆడవాళ్ళు తొడుక్కొనే వున్నికోటు ఒకటి."

"3 జతల కొత్త బూట్లు."

"ఒక అరతాను గుడ్డ."

"ఆంద్రీ! ఈసామానంతా ఒక బండిమీద వెళ్ళడం కష్టం. రెండు పట్టుబట్టలు, గౌనులు యింకా చాలా వున్నాయి."

ఆంద్రీకూడా లేచి గదిలోకి వెళ్ళేడు. ఇంతలో బయటవసారామీద నుంచి' ఫ్రోల్ కూతురు ఏడుపు, ఇంకొక స్త్రీ కేకలు ఇగ్నటియోనక్ మాటల సందడి వినిపించి గభాలున తలుపులు తెరిచేడు.

"ఏమిటి, ఈ గొడవ?"

కళ్ళ నీళ్ళు కారుస్తూ, ఒకమూల చేతులు ముడుచుకొని, ముందుకు వంగి ఫ్రోల్ కూతురు ఏడుస్తోంది. ఆమె తల్లికూడ అక్కడేతిరుగుతూ ఇగ్నటియోనక్‌ను తిట్టిపోస్తోంది. కందగడ్డలా ఎర్రబడ్డ ముఖంతో ఇగ్నటియోనక్ చిరునవ్వు నవ్వుతూ ఫ్రోల్‌కూతురు తొడుగుకొనిన చొక్కా పట్టుకొని లాగుతూన్నాడు.

"ఏమిటిది?.........నీకేమేనా మతిపోయిందా?" అంటూ అసలు విషయం తెలుసుకొనకయే, అతికోపంతో ఇగ్నటియోనక్‌ను వెనక్కి గెంటేసేడు. అతడు వెల్లకితలా పడిపోయేడు. "చాలాబాగుంది." అని ఆంద్రీ గర్జించేడు. "అక్కడ మేముసామానులు జప్తుచేస్తోంటే, ఈమూల నువ్వు ఆడపిల్లల్ని బలాత్కారం చేస్తోన్నావా? కోర్టులో దీనికి సమాధానం చెబుదువుగానిలే........"

"ఆగండి! అసలు విషయం ఏమిటో తెలుసుగోకుండా తొందరపడకండి" ఇగ్నటియోనక్ కంగారుతో లేచినిలబడ్డాడు. "ఆడపిల్లల్ని బలాత్కరిస్తున్నానా? చూడండి! ఎనిమిదిచొక్కాలుతొడిగి తొమ్మిదవది తొడుగుతూండగా అడ్డగిస్తే ఇదా మీరు అనేది?"

అప్పుడు, హాలులో గంద్రగోళం జరుగుతూన్న సమయములో ఎవ్వరు చూడకుండాఫ్రోల్ కూతురు ఇంట్లోని విలువైన బట్టలన్నీతీసుకొని పోయి ఒకదానిమీద ఒకటి తొడుక్కుందని. ఆంద్రీగ్రహించేడు. చొక్కాలు గౌనులు అడావిడిగా ఒకదానిమీద ఒకటి తొడిగేసుకొని గడ్డిబొద్దులా నిలబడి పైచొక్కా బొత్తాలు పెట్టుగుంటూంది. కన్నీళ్ల చారలుకట్టి, దీనంగాఉన్న ఆమెముఖంచూడగనే ఆంద్రీకి జాలికలిగింది. "తొడుక్కున్న

వేవో తొడుక్కుంది అవి లాక్కోకు. కాని ఆమిగిలినవేమీ ఇక్కడ వుండ నియ్యక తీసుకొనిపో." అని తలుపువేసి లోపలికి వచ్చేసేడు.

మరికొంతసేపటికి ఇంట్లోని వస్తువులన్నీ జాబితా తయారుచేసి, ఒక చోటికి చేర్చడం పూర్తి అయింది.

" ధాన్యపుకొట్టు తాళంచెవులు కూడా ఇచ్చెయ్యి. " అని ఆంద్రీ అడిగేడు.

ఫ్రోల్ ముఖం మాడిపోయింది. "మాదగ్గర లేవు"అంటూ చేయి తిప్పేడు.

" వెళ్ళి తాళం బద్దలుకొట్టెయ్యి." అని ఆంద్రీ డైమిడ్‌కి ఆజ్ఞాపించేడు. ఒకమూలపడియున్న గొడ్డలి తీసుకొని, డైమిడ్ బయలుదేరేడు. రెండువీశల బరువైన ధాన్యపుకొట్టు తాళం బద్దలు కొట్టేటప్పటికి డైమిడ్‌కి వొళ్ళంతా ముచ్చెమటలూ పోసేయి.

"జాగ్రత్త! తలుపు కమ్మికి దెబ్బ తగలనియ్యకు. ఇప్పుడది మనసొమ్ము. పాడుచెయ్యకు." అన్నాడు, డెమ్కా చెమటలు కక్కుతూన్న డైమిడ్‌తో.

ధాన్యపుతూకం ప్రారంభం అయింది. "ఈధాన్యం ఇప్పుడే తీసుకుపోతే బాగుంటుందేమో, ఇక్కడినుంచి. ధాన్యం బాగుచెయ్యడానికి జల్లెడ కూడా సిద్ధంగా ఇక్కడేవుంది." అన్నాడు ఇగ్నటియోనక్ సంతోషంపట్టలేక. అంతా పకపకా నవ్వేరు.

"వంద బస్తాపైగా వుంటుంది." అన్నాడు డెమ్కా లోపలికి దిగి ధాన్యం తోడుతూ. గుప్పెడు గింజలు తీసి, చేతితోతూస్తూ, "గింజమంచి తూకంగా ఉంది. బంగారంవంటిధాన్యం. పనమీద బాగా ఎండకపోవడంచేత కొంచెం ముక్కవాసన మాత్రం వేస్తూంది" అన్నాడు. ఆర్కాష్కా ఇంకొకనితో కలసి దొడ్లో పచారుచేస్తున్నాడు. ఎర్రటి గడ్డం నిమురుకుంటూ,

పేడలో కనిపిస్తూన్న అరగని జొన్నగింజలు. చూపిస్తూ "బాగాపని చేసే యంటే చెయ్యవూ: జొన్నలు, ఉలవలు తెగతిని: గడ్డి అయిపోతుందని భయంతో, రెండేసి పరకలు వేసి పొద్దస్తమానం కట్టిపెట్టి, పని చెయ్య మంటే ఎల్లా చేస్తాయి మన ఎడ్లు!" అన్నాడు.

ధాన్యపుకొట్టు దగ్గరనుంచి నవ్వులు పరిహాసాలు వినిపిస్తూన్నాయి. ధాన్యపుగాలి ఎగురుతూంది. అక్కడినుండి ఆంద్రీ ఇంట్లోకి వెళ్ళేడు. తల్లీ, కూతురు వంటసామానంతా సంచిలో వేసి మూటకడుతూన్నారు. కాళ్ళను బూట్లు లేకుండా ఫ్రోల్ గుండెలమీద చేతులు వేసుకొని బెంచీ మీద చచ్చిపోయినట్లు పడి వున్నాడు. ఆంద్రీని చూడగానే టిమోఫీ అస హ్యంతో వెనక తిరిగి కిటికీలోనుంచి బయటకి చూస్తూనిల్చున్నాడు.

ఆంద్రీ గదిలోకి వెళ్ళేటప్పటికి డైమిడ్ కూర్చుని ఉన్నాడు. ఆతని కాళ్ళకి, అంతక్రితం ఫ్రోల్ తొడుగుకొనియున్న కొత్తఫెల్టు బూట్లు ఉన్నాయి. పెద్దస్పూన్‌తో బౌల్చిలోని తేనెతీసి నోట్లో పోసుకొని తాగుతూ న్నాడు. కళ్ళు సంతోషాన్ని వెలిగ్రక్కుతూన్నాయి.

---

## ఎనిమిదవ ప్రకరణము

### ప్ర తి ఘ ట న

నగుల్నోవ్ టిటాక్‌ను తీసుకొని ఊళ్ళోకి వచ్చేటప్పటికి రెండు ఝాములయింది. ఈలోపుగానే దేవిడోవ్ ఇద్దరు భాగ్యవంతుల ఆస్తులను జప్తుచేసి వారిని కుటుంబాలతో సహా బయటికి వెళ్ళకొట్టేడు. తరువాత టిటాక్ ఇంటికి తిరిగివచ్చి, లుబిష్కిన్ సహాయంతో ధాన్యంతూకం వేసి,

బస్తాలలోకి పట్టేడు. పనికిరాని అడుగుధాన్యం పోగుచేసి ధూకవ్ గొర్రెలకు పోస్తోంచే టిటాక్ కనిపించేడు.

బొరోడిన్ గుఱ్ఱాన్ని దొడ్లోకి పోనిచ్చేడు. బొత్తాలు ఊడిపోయిన అతని కోటు గాలికి ఎగురుతూంది. నెత్తిమీద టోపీకూడా లేదు. అతడు తిన్నగా కళ్ళంవైపు దారితీసేడు.

"టిటాక్! ఆగు! చెప్పినమాట వినకపోయేవంటే ఇప్పుడే బేడీలు వేయిస్తాను." అని కేక వేసేడు నగుల్నోవ్.

మకార్ చాలా కోపంగా ఉన్నాడు. టిటాక్ తిరిగివస్తో ఆతని చేతిలోని తుపాకీ నగుల్నోవ్ చూడకుండా ఎక్కడో పారేసేడు. ఊళ్ళోకి వచ్చిన తరువాత నగుల్నోవ్, "నీదగ్గరతుపాకీ ఇచ్చేస్తావా- బలవంతంగా అయినాసరే నీదగ్గిరనుంచి ఎల్లాగా లాక్కుంటాం." అన్నాడు.

"ఈవేళాకోళాలు కట్టిపెట్టు" టిటాక్ నవ్వేడు. " నాదగ్గర తుపాకీ ఉందని కలగన్నావేమో."

తీరాచూసేటప్పటికి టిటాక్ దగ్గిర తుపాకీ లేకపోయింది. ఆతుపాకీ కోసం వెనక్కి వెడితే లాభం ఉండదు; యేరుప్పలలో పారేసేడో వెతికి పట్టుకొనడం అసంభవం. అందుచేత తన తెలివితక్కువకి తననే నిందించుగుంటూ, నగుల్నోవ్ ఈవిషయం యావత్తు దేవిడోవ్‌కి తెలియచేసేడు.

వెంటనే దేవిడోవ్ టిటాక్ దగ్గిరికి వచ్చి, "మీదగ్గిరవున్న తుపాకీ ఇచ్చెయ్యండి. మీ బాగుకోరి చెబుతూన్నాను." అన్నాడు.

" అసలు నాదగ్గిర తుపాకీయే లేదు. ఇదంతా నగుల్నోవ్ కల్పించి చెప్పేడు, నామీద కోపంచేత." టిటాక్ నవ్వేడు.

" మిమ్మల్ని అరెస్టుచేసి, ఖైదులో ఉంచవలసివస్తుంది, జాగ్రత్త"

" అరెస్టు చేస్తారా నన్ను ,"

"అవును. అరెస్టుచేస్తాం. ఇంక ఏంచెయ్యాకలం చెప్పండి! ఇంత వరకు మీరు చేసిన పనులు జ్ఞప్తికి తెచ్చుకొనండి! ప్రభుత్వానికి ధాన్యం బకాయిపెట్టేరు. ఇంతక్రితమే మీరు...."

"నన్నే!" 'మీదకు ఉరుకుతాడా' అన్నట్లు ముందుకివంగి తీవ్రంగా అన్నాడు.

ఇంక కోపం అణుచుకోలేకపోయేడు! అంతవరకు అతనిలో అణగి వుంచిన కోపం దేవిడోవ్ మాటలతో ఒక్కసారి ఉప్పొంగింది. ఎదర నిలబడియున్న దేవిడోవుని గెంటేసి, పరుగెత్తుకొని వెళ్ళి క్రిందపడియున్న ఇనపసీల చేతపుచ్చుకొన్నాడు. దేవిడోవ్ సహాయంకోసం నగుల్నోవు, లుబిష్కినులు పరుగెత్తుకొనివచ్చేరు. ఇదంతా చూసి ఘాకర్ వెనుతిరిగి చూడకుండా వీధిలోకి పరుగెత్తేడు. ఆ కంగారులో చీలమండలవరకు వ్రేలాడుతూన్న కోటు కాళ్ళకి అడ్డుపడి, "అయ్యో! హత్య! హత్య! సహాయం రండి" అని అరుస్తూ చాపచుట్టగా క్రింద పడిపోయేడు.

దేవిడోవ్ మీదికి వస్తున్న టిటాక్‌ని ఎడమచేతి గుత్తిపట్టుకొని ఆపేడు. కాని, టిటాక్ కుడిచేతనున్న ఇనుపసీలతో దేవిడోవ్‌నెత్తిమీద సత్తువకొలది ఒక్కదెబ్బ కొట్టేడు. దేవిడోవు కళ్లు చీకట్లు కమ్మేయి. కాళ్ళు తేలిపోయేయి. కాని నిలతొక్కుకున్నాడు. నెత్తిమీది గాయములో నుంచి రక్తము కారి కళ్లు మూసుకుపోయేయి. టిటాక్ చెయ్యివదలేసి రెండుచేతులతోను కళ్లుమూసుకున్నాడు. ఇంతలో టిటాక్ కొట్టిన రెండవ దెబ్బతో క్రింద పడిపోయేడు. వెంటనే లుబిష్కిన్ టిటాక్‌ను కౌగలివేసి పట్టుకున్నాడు. అతన్ని విదల్చిపారేసి టిటాక్ అతివేగంగా కళ్ళంవైపు పారిపోయేడు. నగుల్నోవు అతనిని తరుముకొనిపోయి గుమ్మందగ్గిర అందుకొని రివాల్వరుమడమతో ముచ్చిలిగుంటమీద ఒక్కదెబ్బ కొట్టేడు.

లుబిష్కిన్, నగుల్నోవ్‌లు తన భర్తను పట్టుకొనడానికి పరుగెత్తడం చూసి, టిటాక్ భార్య గాదిదగ్గరకు పరుగెత్తుకొనివెళ్ళి, కుక్కని

వదిలేసింది. భయంచేత వెర్రికేకలువేస్తోన్న ఘూకర్‌ని చూడగానే కుక్క అటువైపు పరుగెత్తి, తెల్లటి అతని కోటుమీద పళ్ళతో కరచి, లాగడం మొదలెట్టింది. కోటునుంచి పింజపింజలుగా దూది, అనేకసంవత్సరాలనుంచి ఆశ్రయించియున్న దుమ్ము ఎగరడం మొదలెట్టింది. ఘూకర్ గభాలునలేచి కుక్కని కాలుతో తన్ని కోటు వదల్చుకొనడానికి ప్రయత్నించేడు. కాని కుక్క వదలకుండా, ఇంకా గట్టిగా కరచిపెట్టి వెనక్కి లాగడం మొదలెట్టింది. కొంతసేపటికి ఘూకర్ అతి ప్రయత్నంమీద 4, 5 గజముల దూరములోనున్న దడివరకు ఈడ్చుకొని వెళ్ళి వడికర్ర ఒకటి లాగేడు. కుక్క పట్టువదలి మొరుగుతూ పారిపోయింది. కాని, పారిపోయేముందు ఒకకొన కాళ్ళతో త్రొక్కిపట్టి రెండవకొన నోటకరచిపెట్టి సత్తువకొద్ది లాగడంలో కోటు నిలువునా రెండు చీలికలయిపోయింది.

కుక్క పారిపోవడంతోటే ఘూకర్‌కి కొంతధైర్యం చిక్కింది

"మకార్! ఆ రివాల్వరు ఈలాఇయ్యి. ఈ కుక్కని, దీని యజమానురాలినికూడా కాల్చిపారేస్తాను." అని అర్చేడు.

ఈలోపుగా లుబిష్కిన్, మకార్ కలిసి దేవిడోవ్‌ను చేతులమీద ఇంట్లోకి తీసుకొనిపోయి, నెత్తిమీద గాయం తగిలినచోట జుట్టు కత్తిరించేసేరు. ఇంకను నల్లటి రక్తం ఏకధారగా కారుతూనేవుంది. లుబిష్కిన్ పాకలోనున్న స్లెడ్జిబండి ఒకటి పైకి తీసుకొనివచ్చి గుర్రాలని పూన్చేడు. నగుల్నోవ్ త్వరగా ఒక ఉత్తరం వ్రాసి లుబిష్కిన్‌కి ఇచ్చేడు.

"జిల్లా పోలీసుశాఖాధికారికి,

"కామ్రేడ్ జఖరింకో! [ఓగ్పూశాఖకి జిల్లాప్రతినిధి] మోసగాడు; విద్రోహి, పెద్దరైతు అయిన 'టిటాక్ కాన్‌స్టాంటినోవిచ్ బొరోడిన్, అనే ఇతనిని మీ స్వాధీనం చేస్తూన్నాను. ఇతని ఇంటికి పోయి ఆస్తిని స్వాధీనం చేసుకుంటూండగా, ప్రభుత్వంచేత ఇక్కడకు పంపబడిన

కామ్రేడ్ డేవిడోవ్‌నెత్తిమీద ఇనుపకడ్డీతో రెండుసార్లు కొట్టి ఆతనిని చంపడానికి ప్రయత్నించేడు.

అంతే కాదు. ఇతనివద్ద నాటురకపు తుపాకీ ఒకటి చూసేను. ఆ సమయంలో మేమిద్దరం ఒక కొండవారనే నడిచి వస్తూన్నాము. అప్పుడే లాక్కొందుకు ప్రయత్నిస్తే పరిస్థితులు ఏలాగపరిణమిస్తాయో అనీ, తరువాత తీసుకొనవచ్చుననీ ఊహించి ఊరుకున్నాను. కాని దోవలో ఎక్కడనో నా కంటబడకుండా దానిని దాచేసేడు. అది దొరకిన తరువాత, దానిని సాక్ష్యంకోసం మీయెదుట దాఖలుచేస్తాను.

"మకార్ నగుల్నోవ్."

అఖిల రష్యన్ కమ్యూనిస్టుపార్టీయొక్క గ్రెమాచీలాగ్‌శాఖకి కార్యదర్శి.
మెంబర్ ఆఫ్ ది ఆర్డర్ ఆఫ్ ది రెడ్‌బేనర్.

వారిద్దరు టిటాక్‌ని స్లెడ్జిబండిలోకి ఎక్కించేరు. కొంతసేపటికి అతడు మంచినీళ్ళు కావాలని, ఒక్కసారి నగుల్నోవును తీసుకొనిరమ్మని కబురంపేడు.

మకార్ వసారామీదికి వచ్చి,

"ఏంకావాలి?" అని కేకవేసేడు.

"మకార్! జాగ్రత్త! జ్ఞాపకంఉంచుకో." సంకెళ్లు చప్పుడయేలా బొరోడిన్ చేతులు ఊపుతూ కేకపెట్టేడు.

"మళ్ళీ మనం కలుసుకొనకపోము. ఇప్పుడు నన్ను అథఃపాతాళానికి తొక్కేసేవు. దీనికి తగిన ప్రతీకారం చేసి తీరుతా! ఆ ప్రతిక్రియ ఏమిటో తెలుసునా? హత్య. నిన్ను ఖూనీచెయ్యకపోతే నాకు మారుపేరు పెట్టు."

"పోరా, ద్రోహి! నువ్వు చేసేదేమిటి?" అంటూ నగుల్నోవ్ చెయ్యి ఊపేడు.

బండి కదిలివెళ్ళిపోయింది.



# తొమ్మిదో ప్రకరణము

## వి ష య ని ర్ధా ర ణ.

జప్తు చేసిన 'గెయీవ్' ఆస్తి అంతా బళ్ళమీద 'టిటాక్' ఇంటికి చేర్చి, రోజంతా విశ్రాంతి లేకుండా పనిచేసి అలసియున్న బీదకోసక్కులను ఇళ్ళకు పంపేసి, రజ్మట్నోవు సోవియటు ఆఫీసుకు వచ్చేటప్పటికి కను చీకటి పడుతూంది.

చీడీలు ఎక్కుతూంటే గదిలో ఒకమూల వెలుగుతోన్న దీపం కని పించింది.

రజ్మట్నోవు తలుపులు తోసుకొని గదిలోకి వెళ్ళేడు. నోటుపుస్తకం చూస్తోన్న దేవిడోవ్ తలుపుచప్పుడు విని, తెల్లటిగుడ్డతో కట్టబడియున్న తలఎత్తి చూసి చిరునవ్వు నవ్వేడు.

"కామ్రేడ్ రజ్మట్నోవు! రండి! ఈ వేళ భాగ్యవంతుల దగ్గిర నుంచి స్వాధీనం చేసుకొన్న ధాన్యం మొత్తం ఎంతో లెక్కచూస్తూన్నాం. మీరు వెళ్ళినపని ఎంతవరకు అయింది?"

"అంతా బాగానే అయింది. కాని తలకి కట్టుకట్టేరెందుకు?"

దీపం వెలుతురు కళ్ళకి తగలకుండా కాగితం అడ్డంపెడుతూ నగు ల్నోవు "టిటాక్ కొట్టేడు ఇనుపఖడ్డీ పుచ్చుకొని. అతన్ని అరెస్టుచేసి పోలీసు స్టేషనుకి పంపించేము." అన్నాడు.

"ఒక్కనిమిషం ఆగండి. ఆ విషయాన్ని గురించి తరువాత చెబు తాను." అంటూ దేవిడోవు పక్కనవున్న పూసలచట్రం టేబులు మధ్యకి లాగేడు. "నూటపదిహేను కలపండి, అయిందా? నూటఎనిమిది......"

"ఆగండి ! నింపాది." అంటూ నగుల్నోవు పూసలు . లెక్క పెడుతోన్నాడు.

ఆంద్రీ పెదవులు చెలిస్తూన్నాయి. ఆందోళనతో వాళ్ళవైపు చూస్తూ "ఇంపటినుంచి నేను కలగచేసుకోను." అన్నాడు.

"ఏమిటి కలగచేసుగోకపోవడం ?" అన్నాడు, నగుల్నోవు పూసల చట్రం పక్కకితోస్తూ.

"ఈ భాగ్యవంతుల ఆస్తులు జప్తుచేసి, వాళ్ళని ఇళ్ళలోనుంచి బయటికి గెంటెయ్యడం నా వల్లకాదు. ఏం, అల్లా చూస్తావెందుకు ? మతి పోయిందా ఏమిటి ?"

"తాగి వచ్చినట్లు అల్లా మాట్లాడుతున్నా రేమిటి ?" అన్నాడు దేవిడోవు కోపాన్ని వెలిగ్రక్కుతూన్న ఆంద్రీ ముఖంకేసి చూస్తూ. అసలు విషయం ఏమిటో చెప్పండి. మీ ఉద్దేశ్యమేమిటో బోధపడడంలేదు."

"నేను ఇంతవరకు ఎప్పుడు, అమాయకులైన పిల్లల్ని చంపడం నేర్చుకోలేదు. యుద్ధంలో సంగతి వేరు అక్కడ కత్తి పుచ్చుకొని శత్రువుల్ని, మనకి తోచినవాళ్ళని చంపుతాము........మీ ఇష్టం ; మీరు ఏమి చేసుకొన్నాసరే. నేను మాత్రం కలగచేసుకోను." అతని కంఠస్వరం అంతకంతకు తీవ్రమయింది. నిట్టూర్పు విడిచి హఠాత్తుగా కంఠస్వరం తగ్గించి నెమ్మదిగా చెప్పడం ప్రారంభించేడు.

"అది న్యాయం అంటారా, హంతకుడిని అనుకుంటున్నారా నన్ను ? నాకుకూడ హృదయం అనేది వుంది. ఇదివరకు చేసినదిచాలు ........" మళ్ళీ గట్టిగా అరుస్తూ చెప్పడం మొదలెట్టేడు. "గెయీావ్‌కి పదకొండుగురు పిల్లలున్నారు. మేము వాళ్ళని బయటికి గెంటేసేటప్పుడు ఎంతదీనంగా ఏడ్చేరు ! ఆ ఏడుపు చూచి నా గుండెలు నీరయిపోయేయి. అంతమందిని బయటికి గెంటేసి, నిలువ నీడకూడా లేకుండా చేసేము

ఆ దృశ్యం చూడలేక లోపలికి వెళ్ళిపోయేము. ఆడవాళ్ళ ముఖాలమీద కత్తివేస్తే నెత్తురుచుక్కలేదు. అతని కోడలు మూర్ఛ ...... పిల్లలు........ అప్పా ! మీకు మాత్రం........"

"ఆ ఏడ్చేది ఏదో గట్టిగా యేడు ! బరువు తగ్గుతుంది." అన్నాడు నగుర్నోవ్, ఆంద్రీకేసి చూస్తో.

"ఏడుస్తోనే వున్నాను. పాపం, పుణ్యంఎరిగని పసిపిల్లలు...." ఆంద్రీ కంఠం రుద్ధమైపోయింది. నోరు తెరచి వెనుదిరిగి బల్లనానుకొని నిలబడ్డాడు.

అంతా నిశ్శబ్దం.

దేవిడోవ్ నెమ్మదిగా లేచి నిలబడ్డాడు. ఆంద్రీ దగ్గరికి వెళ్ళి, అతని జబ్బపుచ్చుకొని తనవైపుకి త్రిప్పుకొన్నాడు. భారంగా ఊపిరిపీలుస్తో, ఆంద్రీ ముఖంలోకి చూస్తో మాట్లాడడం మొదలెట్టేడు.

"వాళ్ళకోసం విచారిస్తున్నారు........వాళ్ళని దయతలచాలంటారు. వాళ్ళు మనల్ని ఏమేనా దయదల్చేరా ? మనపిల్లల కన్నీళ్లు చూసి శత్రువులు ఎన్నడేనా ఏడ్చేరా ? వాళ్ళ క్రౌర్యానికి బలియైన వాళ్ళ అనాథ శిశువుల్ని చూసి ఒక కన్నీటిబొట్టుకూడా రాలేదేవాళ్ళకి ! సరే ! ఒక్క విషయం చెబుతా, వినండి. ఒకపర్యాయం సమ్మెలో పాల్గొన్న నేరమునకు మా తండ్రిని సైబీరియా ప్రవాసానికి పంపించేరు. నలుగురు పిల్లల్ని పోషింపవలసిన భారం మా అమ్మమీద పడింది అందరికంటె నేనే పెద్దవాణ్ణి. తొమ్మిదేళ్ళుకూడా నిండాలేవు. ఒక్కపూటకూడా గడచీఎత్తులేదు. అందుచేత ధనసంపాదనకోసం మా తల్లి........నాకేసి చూడండి !........ మేము ఆకలిచేత చచ్చిపోకుండా, ఇంత గంజేనాపోసి ప్రాణాలు నిలబెట్టడానికి, సిగ్గు చంపుకొని వీధులవెంట బయలుదేరి వెళ్ళేది. తిరిగి, తిరిగి, ఎవరినోకూడా తీసుకొని ఇంటికి వచ్చేది. అప్పుడు మేమంతా ఒకచే

గదిలో వుంటూండేవాళ్ళం. ఆ గది సన్నంగా, తల ఎత్తితే అటక నెత్తికి తగులుతూ, సొరంగంలా వుండేది. మా కుటుంబానికి అంతకి ఒకటే మంచం. అందుచేత నేను మిగతా ముగ్గురుపిల్లలతోను నేలమీద పడుకొనే వాడిని. ఒక చిన్నతెర అడ్డంకట్టి వాళ్లు ఆ మంచంమీద పడుకొనేవారు ........నేను తొమ్మిదేళ్ళ కుర్రాణ్ణి........ఆమెతోకూడా వచ్చేవాళ్ళు తప్ప త్రాగి ఒళ్లు తెలియని స్థితిలో వచ్చేవారు. పిల్లలు ఏడవకుండా నేను ఊరుకోపెట్టవలసి వచ్చేది....... మా కళ్ళనీళ్లుచూసి ఎవరేనా జాలిపడ్డారా? కామ్రేడ్! వింటున్నారా? ఆ విధంగా సంపాదించిన కొద్ది అణాలను మరునాడుదయం తీసుకొని వెళ్లేవాడిని........" దేవిడోవు పళ్ళు పటపట కొరుకుతూ చెయ్యిఎత్తేడు. "మా ప్రాణాలు నిలబెట్టుకొనడానికి, ఆ డబ్బుతో ఇంత రొట్టె కొనుక్కొని తినేవాళ్ళం...." హఠాత్తుగా బల్లమీద గుద్దేడు. "అటువంటి క్రూరుల్ని రాక్షసుల్ని ఎల్లా దయదలుస్తావు?"

మళ్ళీ అంతా నిశ్శబ్దంగా వున్నారు. దేవిడోవు గదిలో పచారు చేస్తున్నాడు. ఆంద్రీ మాట్లాడక వూరుకున్నాడు. కొంతసేపటికి దేవిడోవు వెనుకనుంచి ఆంద్రీ జబ్బలు పట్టుకొని, బల్లమీద కూర్చోపెట్టి. పక్కని తను కూడా కూర్చున్నాడు.

"మీ మనస్సు చెదిరిపోయింది. విచారిస్తూవచ్చి "నేను పనిచెయ్యను ........పిల్లలు........జాలి, అని అనడంలో అర్థంలేదు. మీరు ఆ ఉద్దేశ్యం మార్చుకుంటారా? మంచిచెడ్డలు తర్కించండి. భాగ్యవంతుల ఆస్తులు జప్తు చేసి. వారిని ప్రవాసం పంపించడం అన్యాయం అంటారా? మళ్ళీ ఆలోచించండి. అధికసంఖ్యాకుల అభివృద్ధి సౌఖ్యములకు ఆటంకముగానున్న కొద్దిమంది భాగ్యవంతులను తొలగించి...... ఇంతటి మంచిమైనా ఈ అన్యాయం జరగకుండా చెయ్యడం మన విధి! ఈ గ్రామంలో సోవియటు ప్రభుత్వపు ప్రతినిధులుగానున్న మీకునేను చెప్పవలసి రావడం విచారకరమైన విషయం." దేవిడోవ్ లేని నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు. "ఈ భాగ్య

వంతుల్ని అందర్ని తెల్లసముద్రములోని సొలోవ్కీ ద్వీపానికేకాదు, నర కానికి పంపించినా దోషంలేదు. ఎక్కడికి పంపినా చచ్చిపోరు; మరేమీ భయంలేదు. ఒళ్ళు వంచి కష్టపడి పనిచేస్తే ఇంత తిండిపారేస్తాం. నూతన సమాజ స్థాపన జరిగిన తరువాత మన శ్రామిక వర్గం ఆ భాగ్యవంతుల సంతానానికి సరియైన శిక్షణనిచ్చి సన్మార్గానికి తిప్పుతారు. భాగ్యవంతులు బీదలు అనే భేదం నశించిపోతుంది." జేబులోనుంచి సిగరెట్టుపెట్టె తీసేడు. కాని వేళ్ళు వణుకుతూ పట్టు తప్పియుండడంచేత చాలాసేపటివరకు సిగ రెట్టు తియ్యలేకపోయేడు.

దేవిడోవ్ మాట్లాడుతూన్నంతసేపు, నగుల్నోవ్ ముఖం క్రోధం చేత ఎర్రబడిపోయింది. శరీరం అంతా చమట గుమ్మపోసినట్లు పోసింది. ఇంతసేపు కూడ ఆంద్రీ రెప్ప వాల్చకుండా నగుల్నోవ్ ముఖంకేసి చూస్తో న్నాడు. అంతలో అకాత్తుగా ఆంద్రీ నిలబడ్డాడు. నగుల్నోవుకూడా కుర్చీ వెనక్కి గెంటేసి లేచి నిలబడ్డాడు.

"ద్రోహీ! శ్రామికవిప్లవం ఎల్లానడిపిస్తూన్నావు నువ్వు? వాళ్ళని చూసి జాలిపడుతున్నావా? చూడు........వేలకొలది ముసలివాళ్ళని,. ఆడ వాళ్ళని, పిల్లల్ని వరసగా నిలబెట్టి, విప్లవంకోసం వాళ్ళందర్ని కాల్చెయ్యా లని చెప్పు నాతో, నమరు-బెమరు లేకుండా, మరతుపాకితో అంతమందిని వరుసబెట్టి కాల్చి చంపేస్తాను" అని గర్జించేడు నగుల్నోవ్.

"కాల్చడం చాలించి కూర్చోండి ఒక్కసారి." అన్నాడు దేవిడోవ్ తొట్రుపాటుతో.

దోవలో అడ్డం ఉన్న కుర్చీ విసిరిపారేసి ఆంద్రీ నగుల్నోవు మీదికి ఉరికేడు.

"ఒళ్లు తీట వదులుస్తాను, రా!" అన్నాడు, నగుల్నోవ్.

అతని ఎడమచెయ్యి కత్తిఒరకోసం, కుడిచెయ్యి కత్తిపిడికోసం వెతికేయి.

ఆంద్రీ కంఠలుతిరిగి బలిసియున్న మకార్‌ని కౌగలివేసి పట్టుకున్నాడు.

"ఇతనికి ఒళ్లు తెలియడం లేదు. మీరువచ్చి పట్టుకోండి." అన్నాడు మకార్ దేవిడోవుతో.

*　　　*　　　*　　　*

వారు ముగ్గురూ స్కూలు దగ్గరికి వచ్చేటప్పటికి, మీటింగుకు వచ్చిన జనంతో హాలంతా కిటకిటలాడుతూంది. లోపల స్థలం లేకపోవడం చేత గుమ్మందగ్గిర ఆడవాళ్లు పిల్లలు అంతా ఒకరినొకరు తోసుగుంటూ నిలబడివున్నారు.

బద్దలయిన పెదిపులమీద కరుడుకట్టిన రక్తంతో పాలిపోయిన ముఖంతో, అంపరికంటె ముందుగా నగుల్నోవ్ వచ్చేడు. జనంఅంతా ఒత్తిగిలి లోపలికి దోవయిచ్చేరు. అతని వెనక దేవిడోవ్ వచ్చేడు. అతన్ని చూడగనే గుసగుసలు బయలుదేరేయి.

"దేవిడోవ్ ఇతనేనా!" ఒక యువతి అతన్ని వేలెత్తిచూపిస్తూ అడిగింది.

"ఆ ఓవరుకోటు తొడుక్కున్న ఆయన..........అంత ఎక్కువ పెద్ద వాడుకాడు..."

"అయితే ఏమి! మంచి ఎముకపుష్టి ఉన్నవాడు. అతనిమెడ తెగ బలిసి దున్నపోతు మెడలా ఎల్లాఉందో చూడు. ఇంకాదాగా మేపమని మనదగ్గరికి పంపించేరు అతన్ని." గుండ్రటి నీలికళ్ళతో చూసి నవ్వుతూ అంది ఒకయువతి.

"చూడండి, చేతులెంత బలంగా ఉన్నాయో! కౌగలించుకున్నాడంటే పక్కఎముకలు విరిగిపోవలసిందే!" అంది నటాలియా, కనుబొమలు తిప్పుతో.

"పాపం. మన నటాలియాకి మొగుడు లేకపోవడంచేత, ఎవడేనా మొగాడు కనిపించడం తడవు—ఎంతసేపూ అదే దృష్టి." అని ఒక యువకుడు ఎత్తిపొడిచేడు.

"ఎవరో కొట్టినట్టున్నారు. నెత్తిమీద. కట్టుకట్టి ఉంది."

"తలపోటుచేత అల్లా కట్టుకున్నాడేమో."

"కాదు. టిటాక్........"

"ఏమర్రా! పరాయి మొగాడివైపు అల్లా చూస్తారెందుకు గుడ్లు మిటకరించి? నాకంటె అందంగా వున్నాడా?" అని ఒక కోసక్కు పకపక నవ్వుతూ చుట్టూవున్న ఆడపిల్లల్ని చేతులు జాపి పోగుచేసి. గోడవైపుకి నొక్కేడు. అంతా నవ్వుతూ, అరుస్తూ, ఆ కోసక్కుని గుద్దుతూ, జుట్టు లాగుతూ నానాగల్లంతూ చేసేరు.

దేవిడోవ్ గుమ్మం దగ్గిరికి వచ్చేటప్పటికి ఉక్కచేత చెమట పోసింది. జనంలోనుంచి చుట్టపొగ లేస్తూంది. వోడ్కావాసన గుప్పుమని కొడుతూంది. ఆడవాళ్లున్న చోటునుంచి సెంట్లవాసన, కొత్త బట్టలవాసన వేస్తూంది. ప్రజలంతా పట్టుమీద తేనెటీగలలాగ దగ్గరగా కూర్చున్నారు.

దేవిడోవ్ వేదిక ఎక్కుతూ, "ఆడవాళ్ళు చాలా మోటుతనంగా వ్యవహరిస్తూన్నారు" అన్నాడు. వేదికమీద రెండు స్టూలు దస్కులు మాత్రం వున్నాయి. దేవిడోవ్ నగుల్నోవులు కూర్చున్నారు రజ్మత్నోవ్ సభ ప్రారంభం చేసేడు. కొంతసేపు ఉపన్యాసం చెప్పి, "పార్టీయొక్క జిల్లాకమిటీ ప్రతినిధియైన కామ్రేడ్ దేవిడోవు, సమిష్టివ్యవసాయ క్షేత్రాలని

గురించి వివరంగా చెపుతారు. ఇంతటితో నేను విరమిస్తున్నాను." అని ముగించి కూర్చున్నాడు.

హాలంతా నిశ్శబ్దంగా వుంది. దేవిడోవ్ సర్దుకుంటూ నెమ్మదిగా లేచి నిల్చున్నాడు. ఒక అరగంటవరకు వుపన్యాసం చెప్పేటప్పటికి గొంతుక బొంగురుపోయింది. సభికులందరు నిశ్శబ్దంగా వింటున్నారు. శుభ్రమైన గాలి రావడానికి తగినన్ని కిటికీలు లేకపోవడంచేత, ప్రజలు క్రిక్కిరిసి కూర్చోవడంచేత ఉక్కపోసి గాలి పీల్చడంకూడా కష్టంగా వుంది. వేదికమీదనున్న రెండు లాంతర్ల వెలుగున, ముందువరుసలో కూర్చున్నవారి ముఖాలమీద చెమట స్పష్టంగా కనిపిస్తోంది. దేవిడోవ్ ఉపన్యాసం ఇచ్చినంతసేపూ ఎవ్వరూ అడ్డుప్రశ్నలు వెయ్యలేదు. కాని ఉపన్యాసం ఆపి మంచినీళ్ళగ్లాసు అందుకొనేటప్పటికి సభ్యులు ప్రశ్నలవర్షం కురిపించేరు.

"ప్రతి వస్తువు సమాజపరం చెయ్యబడుతుందా ?"

"ఇళ్ళవిషయంలో ఏమిచేస్తారు ?"

"ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రాలు తాత్కాలికమా—లేక స్థిరంగా వుంటాయా ?"

"సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరక ఎవరి భూములువారు స్వంతంగా సేద్యం చేసుకొనేవాళ్ళని ఏం చేస్తారు ? వారిభూములు ప్రభుత్వము వశపరచుగుంటుందా ?"

"భోజనాలుకూడా అంతా కలిసేనా ?"

దేవిడోవు ఆ ప్రశ్నలన్నింటికి సంక్షిప్తంగా, పూర్తిగా సమాధానం చెప్పేడు. వ్యవసాయ సంబంధములైన విషయాలు వచ్చినప్పుడు నగులోనివు. రజ్మట్నోవులు సహాయం చేసేవారు. తరువాత సమిష్టివ్యవసాయ క్షేత్రంయొక్క 'కాన్స్టిట్యూషనల్ డ్రాఫ్టు' చదివి వినిపించేడు. సభ్యులు ఇంకా

ప్రశ్నలు వేస్తోనే వున్నారు. నక్క చర్మంతో చేసిన మూడుమూలల టోపీ పెట్టుకొని, నల్లటి గొర్రెచర్మం కప్పుకొన్న ఒక కోసక్కు మధ్యవరుస లలోనుంచి లేచి నిలబడి కొంతసేపు మాట్లాడడానికి అవకాశం ఇమ్మని కోరేడు.

"నేనుకూడా సాధారణ కుటుంబీకుడనే. నేను చెప్పేది ఏమిటంటే —సమిష్టివ్యవసాయ క్షేత్రం ఏర్పరచడం అనేది మంచి ఆలోచనే; అందు కేమీ సందేహంలేదు. కాని ఇంకా మనం ఆలోచించవలసిన విషయా లనేకం వున్నాయి. 'అంతాసిద్ధంఅయింది. ఇంక మనం అనుభవించడమే తరువాయి' అనే ఉద్దేశ్యంతో మనం సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడ మంత తెలివితక్కువపని ఇంకొకటి వుండదు. ప్రభుత్వంచేత ఇక్కడికి పంపబడిన మన కామ్రేడ్ మన మందరం కలిసిపనిచేసినట్లయితే చాలా లాభం వుంటుందని అంటున్నాడు. కామ్రేడ్ లెనిన్ కూడా ఇదే అభిప్రా యమును అనేకచోట్ల వ్యక్తపరిచేరని కూడా చెబుతున్నారు కాని ఈ కామ్రేడ్ ప్రతినిధికి వ్యవసాయవిషయమై ఏమీ అనుభవం లేనట్లు తోస్తోంది. ఆఖరుకు మేకతోక పట్టుకోడం కూడా తెలియదనుకుంటాను. మొదటినుంచి ఫ్యాక్టరీలలో పనిచేసియుండడంచేత, ఆయనకు వ్యవసాయ సంబంధమైన అనుభవంలేదంటే దాన్లో ఆశ్చర్యంలేదు. ఆ కారణంచేతనే ఆయన అంచనాలో కొద్ది పొరపాట్లు కనిపిస్తోన్నాయి. నా ఉద్దేశ్యప్రకారం ప్రజలందరిని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ఈ క్రిందివిధంగా చేర్చాలి. తగినన్ని పశువులువుండి బాగా కష్టపడి పనిచేసేవాళ్ళ నందరను ఒకదాని లోకి, బీదవాళ్ళ నందరను ఒకదానిలోకి, ధనికుల నందరను ఒకదానిలోకి చేర్చి మిగిలిన సోమరిపోతులనందరిని సెటిల్మెంటులలోకి పంపించి పని నేర్పాలి. అందరిని గుదిగుచ్చి ఒకేసమిష్టివ్యవసాయ క్షేత్రంలోకి చేర్చడం శుద్ధ తెలివితక్కువ పని; ఉపయోగంకూడా ఏ మాత్రము వుండదు. మన వాళ్లు ఏదో సామ్యంచెబుతారు—అల్లావుంటుంది, ఆకాశంలో ఎగిరే

హంసని, నీళ్ళలో తిరిగే చేపని, కదలకుండా పడియుండే రాయిని ఒకదాని కొకటి ముడివేసినట్లు ఉంటుంది."

సభికులు నవ్వేరు. వెనక బల్లమీద కూర్చున్న ఒక యువతి బాధ చేత గట్టిగా అర్చింది. వెనువెంటనే మరొకవ్యక్తి "ఆ అల్లరిచేసేది ఎవరు అక్కడ? మీకేమీ మంచి- చెడ్డ ఏమీలేదు? ఇది మీ పడకగది అనుకు న్నారా ఏమిటి, సరసాలు ఆడడానికి?" అని కేకేసేడు.

నక్కచర్మం టోపీ పెట్టుకొనిన కోసక్కు జేబురుమాలుతో ముఖం తుడుచుకొని మళ్ళీ ప్రారంభించేడు. "రైతు ఎడ్లలో మంచివాటిని ఏరి ఏవి ధంగా జతలు ఏర్పాటుచేస్తాడో, అల్లాగే మనంకూడ ప్రజలలో ఏరకానికా రకం వేరేవేరే ఏర్పాటు చెయ్యాలి. తెలివైనరైతు, సమానమైన బలం, ఎత్తు ఉన్నవాటినే జత చేస్తాడు. ఒకమంచి ఎద్దుని-ఒక బక్కఎద్దుని జత చేస్తే ఏమవుతుంది? బలమైన ఎద్దు ముందుకు లాగుతూంటే, బక్కఎద్దు వెనక ఈడ్చిగిలపడుతుంది. అందుచేత ఈ బక్కఎద్దు మూలాన బలమైన ఎద్దుకూడా ఆగిపోవలసివస్తుంది. అటువంటి వాటితో పని ఎల్లా సాగు తుంది? మన కామ్రేడ్, ఒక్క భాగ్యవంతులుతప్ప మిగిలిన గ్రామం యా వత్తు ఒక సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరాలన్నారు. దాని పర్యవసానం ఏమవుతుంది? పైన చెప్పినదే!"

లుబిష్కిన్ లేచి, కోపంగా, ఉపన్యాసకుని వైపు తిరిగేడు.

"కుజ్మా! మహాకోస్తున్నావు సొరకాయ కోతలు.... మేము అంత ఆడవాళ్ళం కాము, నువ్వుచెప్పే వాటికన్నిటికి 'ఊఁ' కడుతూ, దోమలు దూరేలా నోరుతెరుచుకొని కూర్చోడానికి!" అంతా నవ్వేరు. "ఈ మీటిం గుకు వచ్చినవాళ్ళంతా శుద్ధచవటలని ఊహిస్తూన్నావేమో." ప్రజలువిరగ బడి నవ్వుతూ గొల్లుమన్నారు. నగుల్నోవు పెదవులమీదికి కూడా చిరు నవ్వు పాకింది. లుబిష్కిన్ పెద్దగొంతుకతో, అంత గొడవలోనూ కూడా ఖంగుమని వినిపించేలా మళ్ళీ అందుకున్నాడు;

"ఇదంతా నీ స్వబుద్ధి కాదు; ఎవడో చెప్పిపెట్టేడు నీకు."

సభలో పెద్ద గడబిడ బయలుదేరింది. రజ్మట్నోవ్ లేచి, అతికష్టం మీద సద్దుబాటు చేసేడు. చాలా సేపటివరకు కేకలు వినబడుతూనే ఉన్నాయి.

"వీడికికూడా ఏ మాత్రమో చెయ్యి తడి అయినట్లుంది."

"చూస్తారేం—బుర్ర పేలగొట్టక!"

నికోలాయ్ఉష్నియా అనే సాధారణరైతు ఒకడు లేచి, మాట్లాడడానికి అనుమతి కోరేడు.

"ఇంక వాదనలు అవసరంలేదు. అనుసరించవలసిన విధానం స్పష్టంగా కనిపిస్తూంది," అని నగుల్నోవ్ హెచ్చరించేడు.

"ఆవిషయం నిర్ధారణగా ఎల్లా చెప్పగలరు? ఆ విధానం నాకునచ్చకపోవచ్చు! మీ ఉద్దేశాలకి ప్రతికూలంగా మేము మాట్లాడకూడదా? నా వుద్దేశం ఇది. సమిష్టివ్యవసాయక్షేత్రంలో తప్పకుండా చేరాలనే నిర్బంధం వుండకూడదు. ఇష్టం అయిందా చేరడానికి, లేకపోతే బయట ఉండిచూడడానికికూడ అవకాశం యియ్యాలి. మేము దానిలో చేరకుండా, బయటనే వుండి, అది ఎంతవరకు జయప్రదంగా నడుస్తుందో చూస్తూంటాము. బాగుంటే ముందుముందు చేరుతాము."

"ఆ 'మేము' ఎవరు?" అని అడిగేడు దేవిదోవ్.

"రైతులనే ఉద్దేశ్యంతో మాట్లాడేను."

"మీ విషయం మీరు మాట్లాడండి; అంతేగాని అందరి విషయం మీ కెందుకు. ఎవరి అభిప్రాయం వాళ్ళే చెబుతారు."

"నా విషయమే నేను చెబుతూంట. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాళ్ళు ఏ విధంగా జీవిస్తారో చూస్తాను. బాగుంది అని తోస్తే, నేనుకూడా చేరుతాను: లేదా, అనవసరంగా చేరడం ఎందుకు? మంచిది కాదని తెలిసికూడా చేరే మూర్ఖుడు వుంటాడా........"

"నిజం చెప్పేవు !"

"మేమంతా కొంతకాలం పోయిం తరువాత, బాగుంటే చేరుతాము."

"ఆ-ముందు చేరేవాళ్లు ఎల్లాంటి నూతనజీవితం గడుపుతారో గడప నివ్వండి !"

"నిజంగా చెబుతోన్నాను—తప్పకుండా చేరండి ! వాళ్లో చూసే టందుకు ఏముంది ?"

"తరువాత అఖవట్కిన్ మాట్లాడుతాడు. అఖవట్కిన్, రా." అన్నాడు డబ్బొప్నోవ్.

"నా స్వవిషయం చెబుతోన్నాను నేను. మా అన్నదమ్ములం ఇద్దరంకూడ కలిసి వుంటున్నాము. కాని మాలో మా ఇద్దరికే సఖ్యతలేదు ! మొదట ఆడవాళ్లు పొమ్మలాడుకుని వైరం పెంచేరు. క్రమంగా వాళ్ళ మూలాన్న నాకూ, మా అన్నకూకూడ పడిందికాదు. ఇప్పుడు మీరు ఈ గ్రామస్తుల్ని అందరినీకూడా ఒక్క-చోటకి పోగుచెయ్యాలని చూస్తున్నారు : అది అసంభవం. మనస్పర్థలు పేచీలు ఇంకా ఎక్కువ అయి పోతాయి. 'ఇవాన్ నా ఎడ్లచేత పొద్దు అస్తమానమూ పనిచేయించేడు, వాడి గుర్రాలకి నేను తక్కువ గడ్డివేస బాగా మేపలేదు' అని ప్రతీ విషయంలోను పేచీలు వస్తాయి. ప్రతిరోజూ అరకలు తోలుకుపోయినప్పుడు కొట్టుగుంటూంటారు. ఈ పేచీలకోసం అని మిలీషియాని ఇక్కడ స్థిరంగా ఉంచవలసిన అవస్థకూడా వస్తుంది. ఒకడు ఎక్కువ పనిచేస్తాడు. ఒకడు తక్కువ పనిచేస్తాడు. ఫ్యాక్టరీలో అయినట్లయితే 8 గంటలు పని చేసి, తరువాత ఒక్క-నిముషంకూడా ఆగకుండా చుట్ట కాల్చుగుంటూ వెళ్ళిపోతాడు...."

"మీరు ఎప్పుడేనా ఫ్యాక్టరీలో పనిచేశారా ?"

"లేదు. కామ్రేడ్ దేవిదోవ్ ! కాని నాకు తెలుసును."

"ఫ్యాక్టరీలో పనిచేసే కూలీలను గురించి మీకు ఏమీ తెలియదు. అటువంటప్పుడు ఫాక్టరీలను గురించి, ఆ కూలీలను గురించి, ఉన్నవి, లేనివి నాలుగు కల్పించి చెప్ప శ్రమపడకండి! భాగ్యవంతులుకూడా కూలీలనిగురించి, 'ఆ-వాడికేమి! కష్టపడి పనిచేసి ఏ రోజు తిండి ఆ రోజు సంపాదించుకుంటాడు; హాయిగా, నిర్విచారంగా బ్రతుకుతాడు. మన కంటె వాడేనయం అంటాడు, అల్లా ఉంది మీరు చెప్పేమాట!"

"సరే, ఆ విషయం మనం ఎత్తుకోవడం మానేద్దాం; నియమ ప్రకారంగా అతని పని అయిపోయిన తరువాత వెళ్ళిపోతాడు. కాని మనం, ఝామురాత్రివుంది అనగానే మన్నదానికి బయలుదేరాలి. పగలల్లా దున్ని రాత్రి అయిన తరువాత ఇంటికి వస్తాము. రోజల్లా పనిచేసి వుండడంచేత ప్రాణం విసుగెత్తి ఉంటుంది. అయినా కాని ఎడ్లకి మేత వెయ్యడానికి రాత్రి 4, 5 సార్లు లేవాలి. అందుచేత నిద్రకూడా ఉండదు. ఎడ్లని బాగా మేపకపోతే మరునాడు అరక కడితే లాగవు. సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరి నేను బాగా పనిచేస్తాననుకోండి, మన 'కోలీజా' వంటివాడు పనిచెయ్యకుండా ఏ చెట్టుకిందో బట్టపరుచుకొని పడుకుంటాడు. బీదవాళ్ళు ఎప్పుడూ సోమరితనంగా వుండవనీ, అది అంతా భాగ్యవంతులు కల్పించిచెప్పే వట్టి కబుర్లని, చెప్పే సోవియటు ప్రభుత్వం మాటలలో నిజం ఎంతమాత్రం లేదు. ఎక్కడో ఎందుకు—మన 'కొలీజా' ని చూడండి. నెగడు దగ్గర కూర్చుని చలికాగడంతప్ప అతడు మరో పని చెయ్యడు. తిండి లేకపోతే ఉపవాసాలేనా చేస్తాడుకాని పనిమాత్రం చెయ్యడు. అటువంటి సోమరిపోతుతో కలసి నేను పనిచెయ్యడం ఎల్లాగ? నేను సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరను."

"కొంద్రాట్ మైడనికోవ్ మాట్లాడతాడు, మైడనికోవ్! లే."

అంత పొడుగు, పొట్టి కాకుండా మధ్యరకంగావున్న ఒకకోసక్కు వెనక వరసలలోనుంచి నెమ్మదిగా వేదిక దగ్గరికి బయలుదేరేడు. బూడిద

రంగుకోటు తొడుక్కున్నాడు. బుడెన్నీఅశ్వికసైనికులు ధరించే, వెలిసి పోయిన టోపీ పెట్టుకున్నాడు. వేదిక ఎక్కి సభికులవైపు తిరిగి ట్రౌజరు జేబులు వెతుకుతోన్నాడు.

"ఉపన్యాసం చదువుతావా ?" డెమ్కాఉషాకోవ్ నవ్వుతూ అడిగేడు.

"టోపీ తీసిపారెయ్యి !"

"కంఠతా వల్లించేటట్లున్నాడు !"

"ప్రతి చిన్నవిషయం కాగితంమీదికి ఎక్కిస్తాడు !"

"చదువుకున్నందుకు ఫలితం ఏమిటి మరి !"

మైడనికోవ్ చిన్న నోటుబుక్కుతీసి తొందరగా పేజీలు తిరగెయ్యడం మొదలెట్టేడు.

"అల్లాగే, నవ్వుతూండండి. ఆ నవ్వు పూర్తి అవకుండానే ఏడవ వలసి వస్తుందేమోకూడాను." అన్నాడు కోపంతో. "నాకు అవసరమైన ప్రతివిషయం 'నోట్' చేస్తాను. చదువుతాను వినండి. ఇంతవరకు అనేక మంది ఉపన్యాసాలిచ్చేరు. కాని అసలు విషయం ఎవరూ ఎత్తుగోలేదు. మనం ఎటువంటి జీవనం గడుపుతున్నామో ఒకసారి ఆలోచించండి...."

దేవిడోవు అతని ఉపన్యాసం శ్రద్ధగా వినడం మొదలెట్టేడు. ముందరి వరసలలో కూర్చున్నవారి ముఖాలమీద చిరునవ్వు కనిపిస్తూంది.

"మాకు అట్టే ఎక్కువ భూమిలేదు. క్రిందటి సంవత్సరం 12 ఎకరాల భూమి దున్నేను, నాకు ఒక జత ఎడ్లు, ఒక గుర్రం, ఒక ఆవు మాత్రం వున్నాయి. మా కుటుంబం—నేను, నాభార్య ముగ్గురు పిల్లలు కలసి—మొత్తం అయిదుగురం. ఇంతమందిలోను పనిచేసేవాడిని నేను వొక్కడినే ! ఆ 12 ఎకరాలలోను 90 పూడుల గోధుమలు, 18 పూడుల బార్లీ, 23 పూడుల ఓట్లు పండేయి. మాకు సం॥కి 60 పూడులు వుండాలి. కోళ్లు మొదలయిన వాటికి 10 పూడులు, ఓట్లన్నీ గుఱ్ఱానికి వుండాలి.

ఇంక మిగిలేది 38 పూడులు. పూడు వకరూబులు పది కోపెక్కుల చొప్పున అవి అన్నీ అమ్మితే 15 రూబుళ్ళు వస్తాయనుకోండి" అతని ముఖంలో విచార రేఖలు కనిపిస్తూన్నాయి. కంఠస్వరం తీవ్రం అయింది. "ఈ 56 రూబుళ్ళతోను మా కుటుంబానికి కావలసిన బట్టలు, బూట్లు, సబ్బులు మొదలైనవన్నీ వస్తాయా ? ఏం మాట్లాడరేం ? ఈ విధంగా జీవితం గడపగలమా ? పంటలు బాగున్న కాలంలోనే జీవితం గడపడం ఇంత దుర్భరంగా వుంటే, పంటలు పూర్తిగా పోయినప్పుడు మనస్థితి ఎల్లావుంటుందో ఆలోచించండి ? ఏవో కల్లబొల్లి మాటలు చెప్పి మోస గించి సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరకుండా చేస్తోన్న వీళ్ళని ఏంచేసినా పాపంలేదు. ఇప్పుడు మనం బీదతనం క్రిందిమెట్టులో వున్నాం. అంత కంటె తక్కువ మెట్టు లేనేలేదు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరితే మన యీ బీదతనం పోవాలికాని అంతకంటె పోయేటందుకు ఏమీలేదు."

"కోండ్రాట్ ! చెప్పు ! అల్లా సిగ్గువచ్చేలా బుద్ధిచెప్పు వాళ్ళకి." అంటూ లుబిష్కిన్ సంతోషంతో అన్నాడు.

"ఓ, చెబుతాను ! కూర్చుని వినమను ! మీ దృష్టి ఎంతసేపూ. మీ ఆవు, పూరి గుడిసె దాటి ప్రసరించదు. గుడిసెలో ఖరీదైన వస్తువు ఒక్కటైనా వుండదు. నడికొప్పుమీద ఆకులుకూడా వుండవు. కాని, అది నాదని మాత్రం సంతోషిస్తూంటారు. కమ్యూనిస్టుపార్టీ మిమ్మల్ని నూతన జీవితం లోకి తీసుకొని వెడుతూంది' అప్పుడే పుట్టిన లేగదూడని దాని తల్లి పొదుగుదగ్గరికి తీసుకొని వెడితే, పాలు తాగక, ఇటు-అటు గింజుకున్న ట్లుగావుంది ప్రస్తుతం మీ అవస్థ. నేను ఈ రోజుననే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేర్చుకోవలసిందని దరఖాస్తు పెడుతూన్నాను. ఇతరులనుకూడా చేరవలసిందని సలహా యిస్తున్నాను. కాని, చేరతల్చుకోనివాళ్లు చేరేవాళ్ళకి అడ్డురావద్దని మాత్రం కోరుతూన్నాను."

రజ్మటోన్నోవు లేచి నిలబడ్డాడు.

"సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడాన్నిగురించి చాలా చర్చ జరిగింది. ముందు చేయవలసిన కర్తవ్యం మీకు తెలిసేవుంటుంది. ఇప్ప టికే చాల పొద్దుపోయింది. దీపాలుకూడా ఆరిపోతున్నాయి. సమిష్టి వ్యవ సాయక్షేత్రంలో చేరడానికి అంగీకరించేవా రెవరో చేతులెత్తండి. కుటుంబ యజమానులే యెత్తాలి. మిగిలినవాళ్ళ అవసరంలేదు."

అక్కడికి వచ్చిన 217 గురు కుటుంబ యజమానులలో 67 గురు మాత్రం చేతులెత్తేరు.

"వ్యతిరేకు లెవరేనా వున్నారా ?"

ఒక్కరుకూడ చెయ్యి యెత్తలేదు.

"మీరు సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యులుగా చేరరన్నమాటేనా" అని దేవిడోవు అడిగేడు. "అయితే కామ్రేడ్ మైడియనోవు అన్నదాల్లో అతిశయోక్తి లేదు."

"మాకు దాని అవసరంలేదు." ఒక స్త్రీ కంఠస్వరం వినిపించింది.

"మైడియనోవు మాకు ఆదర్శమా యేమిటి ?"

"మా తండ్రి తాతలు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరకుండగా బ్రతకలేదూ ?"

"బలవంతంగా చేర్చడానికి మాత్రం ప్రయత్నించకండి !"

ఈ కేకలన్నీ అణిగిపోయిన తరువాత చీకటిగానున్న వెనక వరస లలోనుంచి ఎవరిదో తీవ్రమైన కంఠధ్వని వినిపించింది.

"మమ్మల్ని బలవంతంగా చేర్చడానికి ప్రయత్నిస్తున్నావేమో. జాగ్రత్త! మొన్ననే టిటాక్ నిన్ను రేవునెత్తిబద్దలయేలా కొట్టేడు. ఈ సారి మేము మిగిలినపని పూర్తిచేస్తాం, జాగ్రత్త ........"

దేవిడోవు ఉలికిపడి లేచి నిలబడ్డాడు. అంతటా, నిశ్శబ్దంగా వుంది. ఒక్క నిముషం నోట మాటలేకుండా విస్తుపోయి చూస్తూనిలబడ్డాడు.

"ద్రోహీ! టిటాక్ కొట్టిన దెబ్బ బాగా తగలలేదు? నీవంటి దుర్మార్గులంతా ఒక్కడుకూడ మిగలకుండా నాశనం అవడం నేనుచూస్తా, చావుకి పెడుస్తాననుకుంటున్నావేమో! కలలోకూడ అనుకోకు! అవసరం వచ్చిందంటే పార్టీకోసం, నా పార్టీకోసం, కూలీలకోసం నా రక్తంఅంతా ధారపోస్తాను. నీ వంటి కార్మికశత్రువుల్ని, మానవపిశాచాలని, ప్రపంచములో ఎక్కడా నామరూపాలు లేకుండా చెయ్యడానికి నా కంఠంలో ప్రాణం వున్నంతవరకు పోరాడుతాను."

"ఎవరు, అల్లా అన్నవాళ్లు?" నగుల్నోవు కూర్చునే, తలఎత్తి చూస్తూ అడిగేడు.

రజ్మట్నోవు వేదికమీదనుంచి క్రిందికి వురికేడు. వెనుక వరసల్లో వకబల్ల కిరకిరలాడిన చప్పుడయింది. ఇరవైమందివరకు లేచి గోలచేస్తూ బయటికి వెళ్ళిపోయేరు. మధ్యవరసలలో వున్నవాళ్ళుకూడా కొందరు లేవడం మొదలెట్టేరు. ఎవరో కిటికీ అద్దపుతలుపులు బద్దలుకొట్టేసేరు. కిటికీలోంచి చల్లటిగాలి రయ్యిమని వీచింది.

"ఫ్రోల్ కొడుకు టిమోఫీకాదూ?"

"వాళ్ళని వెంటనే గ్రామంలోనుంచి తరిమెయ్యండి!"

"అతనుకాదు. అకిమ్కా. టుబ్యాన్స్కోనుంచి వచ్చిన కోసక్కులు కూడా కొంతమంది ఇక్కడ వున్నారు."

"లంజకొడుకులు! ఏరీ! పట్టుకోండి!"

అర్ధరాత్రివరకు మీటింగు జరుగుతూనే వుంది. సమిష్టివ్యవసాయ క్షేత్రానికి అనుకూలంగాను, ప్రతికూలంగాను, అనేకమంది, కంఠాలు బొంగురుపోయిలాగ గంభీరంగా ఉపన్యాసాలు యిచ్చేరు. సభలో అక్కడక్కడ రెండుకక్షలవారు వాదనముదిరి చేతులు కలపడంవరకు వచ్చింది. మైదనికోవ్ సన్నిహితబంధు వొకడు అతనికోటు అడ్డంగా చింపిపారేసేడు.

దానితో ఇద్దరూ కొట్టుకొనడానికి సిద్ధంఅయేరు. డెమ్కా-ఉషాకోవ్, ముందువరసలలో కూర్చున్న సభ్యులమీదనుంచి రెండుఉరకలలో దాటి, మైడనికోవ్‌కి సహాయంచేయడానికి పరుగెత్తివచ్చేడు. ఇంతలో దేవిడోవ్ వచ్చి రెండువైపులవాళ్ళని విడతీసేడు. డెమ్కా, చిరిగిపోయిన మైడని కోవ్ కోటుచూపిస్తో ఇల్లా అన్నాడు :

"కోంమ్రాట్! ఎన్నిరోజులు శ్రమపడితే మళ్ళీ ఇటువంటికోటు సంపాదించగలవో ఆలోచించు........"

"అతనివిషయం తరువాత చూడవచ్చు. ముందు నీ భార్యకి...."

"అటువంటి వేళాకోళాలు కట్టిపెట్టండి. లేకపోతే బయటికి పంపిం చెయ్యవలసి వస్తుంది."

మీటింగు మొదలుపెట్టినది మొదలు ఇంతవరకు మూగడ్డైమిడ్ ఈ అనవసరపు గొడవ వినబడకుండా చెవులమీదుగా కోటుకప్పుకొని వెనక వరసలలో ఒక బెంచీకింద పడుకుని నిద్రపోతున్నాడు. మేజోళ్ళు కుడుతూ మీటింగుకివచ్చిన ఆడవాళ్ల కొంతమంది సూదులు, ఊలువుండలు క్రింద జారవిడిచి వరండామీద గోడని జేరబడి కునికిపాట్లు పడుతున్నారు. చాలా మంది అంతక్రితమే ఇళ్ళకి వెళ్ళిపోయేరు. సమిష్టివ్యవసాయక్షేత్రానికి అనుకూలంగా మాట్లాడడానికి ఆర్కాడీ మళ్ళీలేచి యేదోమాట్లాడబోయేడు. కాని అంతవరకు గట్టిగా అర్చియుండడంచేత కంఠంపోయి మాట సరిగా వచ్చిందికాదు. కంఠంముడి సవరించుగుంటూ, చెయ్యిఎత్తివిసురుతూ నిల్చు న్నచోటనే కూర్చుని, వుద్రేకంపట్టలేక, ప్రతికక్షియైన 'నికోలాయ్ అఖవ ట్కిన్'తో, సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణం పూర్తి అయిన తరువాత అతనివంటివాళ్ళగతి ఏమవుతుందో అభినయించేడు. ఒక బొటనవ్రేలు గోరుమీద మరియొకటి పెట్టి 'చిటికుక్క' మనిపించేడు. నికోలాయ్ తిడుతో లేచిపోయేడు.

# పదో ప్రకరణము

## ఎ డ బా టు

మైదనికోవ్ మీటింగునుంచి ఇంటికి వచ్చేటప్పటికి రాత్రి బాగా పొద్దుపోయింది. ప్రకృతంతా నిశ్శబ్దంగా వుంది. కీచురాళ్ళ రొజమాత్రంవిని పిస్తోంది. తిన్నగా, కోంద్రాట్ దొడ్లోని దూడలపాకలోకి వెళ్ళేడు. ఎడ్ల ముందు గడ్డి లేకపోవడం చూసి గుప్పెడు గడ్డిపరకలు వాటిముందర వేసేడు. కాని, మరునాడుదయం వాటిని సమిష్టివ్యవసాయక్షేత్రానికి తోలి పెట్టాలన్న విషయం జ్ఞప్తికి వచ్చి, సందెడుగడ్డి తీసుకొని వచ్చి వాటి ముందు వేసేడు.

"ఈరోజుతో మన బాకీ తీరిపోయింది.........ఎహెయ్, తిరుగు! నాలుగు సంవత్సరాలనుంచి, ఒకళ్ళకొకళ్ళం కష్టపడి పనిచేసేము. కాని ఏంలాభం? మీరు నేను కూడ ఒక డొక్క మాడుతూనే వున్నాము కాని– ఒకరికీ కడుపునిండా ఇంత తిండిలేదు. సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేరుతే మీరు, నేనుకూడ హాయిగా జీవించవచ్చునని ఆశగావుంది. నేను చెబు తూన్నదంతా తెలిసినట్లు, అల్లా తల ఊపుతున్నావెందుకు?" అంటూ చిట్టి మూర వేసియున్న ఒకఎద్దు ముట్టిపట్టుకొని పైకెత్తి, నెమరువేస్తూన్న దౌడలు రెండు చేతులతోను పట్టుగున్నాడు. 6 సంవత్సరాలక్రితం తను ఆ ఎద్దుకోసం రాత్రింబగళ్లు ఎల్లా కనిపెట్టుకొని కూర్చున్నది జ్ఞాపకం వచ్చింది. 'కోంద్రాట్' కాని, దూడల్ని కాచేవాడుకాని లేనప్పుడు ఆ ముసలి ఆవు పొల్లింది, కాని అది చూలుతో వున్న లక్షణాలేమీ కనుపించ లేదు. "ఇంకా చూలుతో వున్నట్లు తోచదు. అప్పుడే ఒట్టిపోయి 2 నెల లయింది. వెధవగొడ్డు." అని కోంద్రాట్ దానిని చూసినప్పుడల్లా అనుకుం టూండేవాడు. కాని నెలరోజులకు ఈనుతుందనగా, నవంబరునెలలో,

చూడుతోవున్న లక్షణాలు కనుపించసాగేయి. ఆ శీతకాలపు రాత్రులలో ఆవు ఎప్పుడు ఈనుతుందోనని, మెలకువ వచ్చినప్పుడల్లా లేచి చూస్తూం డేవాడు. ఆ యేడు చలి పక్కాలు ఒంచేసింది. దూడని వెయ్యగానే చూసి జాగ్రత్త పెట్టకపోతే చలికి కొంకరించుకొని చచ్చిపోతుందేమోనని భయంతో ఘడియఘడియకు వచ్చి, ఆవు ఈనిందేమోనని చూస్తూండే వాడు. ఆ రోజుల్లో అతనికి కంటిమీద కునుకు కూడా ఉండేదికాదు. ఆఖ రుకు ఒకరోజు వుదయం అతనిభార్య 'ఆనా' గబగబావచ్చి "........ఈ రాత్రి తప్పకుండా ఈనేస్తుంది." అంది.

ఆరోజు సాయంకాలం అవకుండానే రాత్రిభోజనం చేసేసి, కోం డ్రాట్ సిద్ధంగా కూర్చున్నాడు. ఎప్పుడు అవసరం వస్తుందోఅని లాంతరు ఆర్పెయ్యకుండా వుంచేడు. ఆరాత్రి ఆవుని ఏడుసార్లు చూసివచ్చేడు. ఆఖ రుకు తెల్లవారుఝామున ఎనిమిదో పర్యాయం దూడలపాకలోకి వెడు తూంటే ఆవు అర్పు వినిపించింది. ఆతురతగా పాకలోకి వెళ్ళేడు. అప్పటి కప్పుడే ఆవు మావి వెయ్యడానికి సిద్ధంగావుంది. ఎఱ్ఱటిదూడ ఒకటి చలికి గజగజ వొణుకుతూ, ఆవు పక్కన నేలమీద పడుకొని తలఎత్తిచూస్తూంది. మావి తింటే పాలివ్వదనే నమ్మకం అతనికి కూడా వుండడంచేత ఆవుకి అందకుండా మావి దూరంగా తోసేసి, లేగదూడ నెత్తుకొని ఇంట్లోకి తీసు కొనిపోయేడు.

"కోడెదూడేః" అన్నాడు కోండ్రాట్ సంతోషంతో.

'ఆనా' క్రాస్ చేసింది. "దేవుడు మనయందున్నాడు. మన అవ సరం గుర్తించి కోడెదూడనే ఇచ్చేడు"

అప్పటికి కోండ్రాట్‌కి ఒక్కటే కోడెదూడ వుంది. ఇంకొక్క కోడెదూడ వుంటే, ఎదిగి రెండేళ్ళనాటికి అక్కరకువస్తాయని ఇంకోదూ దని కొన్నాడు. క్రమంగా ఆ రెండుదూడలు ఎదిగి పెద్దవయేయి. కోం

డ్రాట్ వాటికి సరిపోయేటంత బండి ఒకటికొని, అదునురోజుల్లో దుక్కి-దున్నుకుంటూ, తీరికరోజుల్లో బండిపని చేసుగుంటూ, కాలక్షేపంచేసేవాడు.

ఆ ఎద్దును చూసేటప్పటికి కోండ్రాట్‌కి కంఠంలో ఏదో అడ్డుపడ్డట్టు అనిపించింది. కళ్ళనీళ్లు తిరిగేయి. మాట్లాడకుండా అక్కడినుంచి వెళ్ళిపోయేడు. ఆరాత్రి అతనికి నిద్ర పట్టిందికాదు. చుట్టకాలుస్తూ, ఏదో ఆలోచిస్తూన్నట్లు పరధ్యానంగా పడుకున్నాడు.

"చివరికి ఈ సమిష్టివ్యవసాయక్షేత్రం ఎల్లా పరిణమిస్తుందో, ఎటువంటి చిక్కులు వచ్చినా, వెనుతియ్యక, తలపెట్టిన పని చివరకంటా కొనసాగించాలని, నాలాగ, అంతా పట్టుదలగా పనిచేస్తారా, ఇంటపుట్టి పెరిగిన దూడల్ని, ఈరోజు వదిలేసి, ఇతరుల చేతిలో పెట్టడం అంటే మనస్సుకి చింతగానే వుంది. అయితేమాత్రం-తప్పుతుందా? స్వంత ఆస్తిమీద వుండే మమకారాన్ని చంపుకోవాలి. ఆ విషయం ఇంక తలంపుకేనా రాకుండా చెయ్యాలి!" అతని భార్య పక్కని గుఱ్ఱుపట్టి నిద్రపోతూంది. కోండ్రాట్ చీకట్లోకి చూస్తూన్నాడు. కాని అతనికళ్ళకి దృష్టిలేదు. "అయితే ఈ మేకపిల్లల్ని, గొఱ్ఱెల్ని ఏమిటి—చెయ్యడం, వాటిని వెచ్చగావుండేచోట వుంచి జాగ్రత్తగా చూస్తుండాలి. మిగిలినవాటితో కలిసిపోతే, వాటిని ఆనవాలుపట్టి వేరుచెయ్యకలమా' ఆవుల విషయం ఏమిటో? వీట్లనన్నిటిని పోషించడం ఎల్లాగ? కొన్ని చచ్చిపోవచ్చు. కొన్ని రోజులు పోయినతరువాత ఎవరిమట్టుగువారు భయపడి ఒక్కొక్కరే తప్పుగుంటే? ఈ ఊరు వదలి ఎక్కడికెనా లేచిపోవలసింది నేను. ఇప్పుడు ఉన్నది కాస్తా కూడా తుడిచిపెట్టుగునిపోతుంది." అని ఈవిధంగా అతను ఆ రాత్రంతా ఆలోచిస్తూనేవున్నాడు

తెల్లవారుఝామున కొంచెం కలతనిద్రపట్టింది. ఆ నిద్రలోకూడా ఈవిషయాన్ని గురించిన కలలే! సమిష్టివ్యవసాయ విధానములోని ముఖ్యసూత్రం అతనికి బోధపడలేదు. చివరకు అతికష్టంమీద స్వంతఆస్తిమీద వుండే ప్రేమపాశాలు తెంపేసేడు.

మరునాడు పుదయం, భోజనం అయినతరువాత, సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరేటందుకు దరఖాస్తు రాస్తోకూర్చున్నాడు. తప్పులు రావడం చేత రెండు మూడు కాగితాలు చింపేసి. చివరకు:

"కమ్యూనిస్టుపార్టీయొక్క గ్రిమాచీ గ్రామశాఖకు కార్యదర్శియైన కామ్రేడ్ మకార్ నగుల్నోవ్ కి—

"దరఖాస్తు"

"మధ్యతరగతి రైతునయిన కోండ్రాట్ క్రిస్టోఫరోవ్ మైదనికోవ్ అను నేను, నా భార్య పిల్లలతోను, ఆస్తిఅంతతోను, సమిష్టివ్యవసాయ క్షేత్రంలో సభ్యుడుగా చేరదలచితిని. కనుక నన్ను దానిలో చేర్చుకొని నూతన జీవితం గడిపేఅవకాశం కలుగ చెయ్యవలెనని కోరుతున్నాను. ఆ నిబంధనల నన్నిటిని నేను అంగీకరించుచున్నాను."

"కె మైదనికోవ్."

అని వ్రాసేడు.

"చేరడానికే నిశ్చయించేరా?" అంది అతని భార్య.

"అవును."

"దూడల్ని కూడా తీసుగువెడతారా?"

"ఆ-తీసుకువెడతాను. పిశాచంలా అల్లా చూస్తావెందుకు? నీకుఇష్టం లేనట్టుంది! నీకు నచ్చచెప్పడానికిపడ్డ ఈ కంఠశోషఅంతా వృధాఅయిందీ! ఎంతతోస్తే అంతేకాని, పైవాళ్ళు ఏమిచెప్పినా, వినడం అంటూ లేదు."

"కోండ్రాట్! అవు విషయంతప్ప నాకూ ఇంకో విచారంలేదు. చేరడం నాకూ ఇష్టమే. కాని ఆ ఒక్కవిషయం తల్చుగుంటేమాత్రం ఎందుకో తెలియదు—విచారంగా వుంటుంది." అని నవ్వుతూ, చేతిలో గుడ్డతో కళ్ళనీళ్ళు ఒత్తుగుంది. ఇదంతాచూసి 'క్రిష్టష్కా' అను నాలుగు సంవత్సరాల వయస్సుగల వారిపిల్లకూడ ఏడవడం మొదలెట్టింది.

కోండ్రాత్, ఆవుని, ఎడ్లని వీధులోకి తోలి, ఒక గుఱ్ఱం ఎక్కి, వాటిని నీళ్లుపెట్టడానికి ఏటికి తోలుకువెళ్ళేడు. అవి నీళ్లుతాగి ఇంటికి మళ్ళేయి. కాని కోండ్రాత్ వాటిని అడ్డంకొట్టి, సోవియట్ ఆఫీసువైపు మళ్ళించేడు.

ఆడవాళ్లు కిటికీలలోను, గుమ్మములలోను నిలబడి కోండ్రాత్ వైపుకి ఆశ్చర్యముగా చూడసాగేరు. కోసక్కులు వాకళ్ళలో దడులను ఆనుకొని నిలబడి చూస్తోన్నారు. అంతమంది అతనివైపు చూడ్డంచేత అతని శరీరం బరువెక్కినట్లుతోచింది. కాని మలుపు తిరిగేటప్పటికి సోవియట్ ఆఫీసు యెదుట వీధిఅంతా గుఱ్ఱాలు, ఎడ్లు, ఆవులు, గొఱ్ఱెలు మొదలైనవాటితో నిండి వీధిఅంతా కోలాహలంగాఉంది. పక్కసందులోనుంచి లుబిష్కిన్, ఆవు కొమ్ములకి తాడుపోసి బలవంతంగా లాక్కొస్తూన్నాడు. వెనకనుంచి మెడలోతాడుతో దూడ ఒకటి వస్తోంది.

"పీటితోకలు అన్నీ కలియకట్టి తోలుకుపోదం." అని లుబిష్కిన్ వేళాకోళంగా అన్నాడు. కాని, ఎందుకో అతనుకూడా చీకాకుగానే ఉన్నాడు. క్రిందిదౌడమీదతగిలినదెబ్బ కొద్దిగా రక్తంచిమ్ముతూంది.

"ఆదెబ్బ ఏమిటి?"

"రహస్యం ఎందుకు! నా భార్యకంటె ఎవరున్నారు? ఆవుని తోలుకొని వస్తూంటే, తోలుకువెళ్ళడానికి వీలులేదని అడ్డంవచ్చింది. కాని నేను వినకపోవడంచేత దెబ్బలాటలోకి దిగింది. నమ్ముతావో లేదోకాని పళ్ళెం ఒకటి తీసుకొని మీదికి వచ్చింది. దానితో నాఒళ్లు మండిపోయింది. 'ఆ! బోల్షివిక్కునికొట్టే సాహసంవుందీ నీకు!' అంటూ చేతిలోవున్న కర్రతో ఒళ్ళట్టినన్ని కొట్టేను........"

గ్రామసోవియటు ఆఫీసునుంచి వాటినన్నిటిని టిటాక్ యింటికి తోలుకువెళ్ళేరు. ఇదంతాచూసి, అంతవరకు 'చేరుదామా-వద్దా' అని ఆలో

చిస్తోన్న మరిపంద్రెండుగురు కోసక్కులు ఆ ఉదయమే దరఖాస్తులు పెట్టి పశువుల్ని తోలుకొని సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేరడానికి వచ్చేరు.

ఇద్దరు పనివాళ్ళ సహాయంతో నగుల్నోవ్, ఆ పశువులనన్నిటిని కట్టుటకు వీలగునట్లు పాకలు బాగుచేయించి, గుంజలుపాతి, కావలసిన యేర్పాట్లన్నీ చేసేడు. గ్రిమాచీలాగ్‌లో ఏర్పాటు చేయబడ్డ మొట్ట మొదటి సమిష్టి పశుశాలలు ఇవే.

## పదకొండో ప్రకరణము

### జప్తు.

కోండ్రాత్, లుబిష్కిన్‌తో కలసి, గోతులు తవ్వి రాటలుపాతుతూన్నాడు. లుబిష్కిన్ నెత్తిమీదనున్న నల్లటి టోపీకిందనుంచి చెమట కారుతూంది. ఒగరుస్తోనే, అతడు వంచిననడుము ఎత్తకుండా పనిచేస్తోన్నాడు. కొంతసేపటికి పనిఅంతా పూర్తిఅయింది. బయట నిలబడియున్న 28 జతల ఎడ్లని తోలుకువచ్చి ఆపాకల్లో కట్టేసేరు. వాటివెనక చెమటకితడిసి ఒంటిని అంటుకొనిపోయిన కాకిట్వీల్లు చొక్కాతో నగుల్నోవ్ వచ్చేడు.

"మకార్, 10 నిముషాలు పనిచేసేవో, లేదో-అప్పుడే నీశరీంఅంతా చెమట ఓడుతూ ఎల్లావుందో చూడు. చొక్కానుంచి చెమట పిండవచ్చు. ఈమాత్రంపనికే అలసిపోతే నువ్వు పని ఏం చెయ్యగలవు?" అన్నాడు లుబిష్కిన్. "చూడు! నేనెల్లా పనిచేస్తానో! గునపం పుచ్చుగున్నానంటే రాళ్ళుకూడా వణకాలి. టిటాక్‌దేకాదూ యీగునపం? బాగా వుంది. ముందు ఆ కోటు తొడుక్కో. లేకపోతే చలిగాలి తగిలి జబ్బుచేస్తుంది."

నగుల్నోవ్ కోటు తొడుక్కున్నాడు.

"వెనక యుద్ధంలో విషవాయువు తగిలినప్పటినుంచి, ఏమాత్రం పనిచేసినా ఒగర్పువస్తోంది. ఇక్కడపనిఅంతా పూర్తి అయినట్లుందే, బాగుంది! ఇప్పుడు చూడు! వరసగా ఇన్నిపశువుల్ని కడ్తేస్తే కల కల లాడుతూ ఎల్లావుందో!" అంటూ నగుల్నోవ్ సంతృప్తిని వెలిగక్కేకళ్ళతో ఎడ్లకేసి చూసి అన్నాడు.

పాకలలో ఖాళీలేకపోవడంచేత, ఆవుల్ని బయట కడుతూన్నారు. ఇంతలో రజ్మట్నోవు, డెమ్కావచ్చేరు. ఆంద్రీ, నగుల్నోవు భుజంమీద చెయ్యివేసి కొంచెం పక్కకి తీసుకొని వెళ్ళేడు:

"మకార్! నిన్నటి సంగతి మనస్సులో ఉంచుకోకు. పసిపిల్లల ఏడ్పులు వినేటప్పటికి మావాడు జ్ఞాపకంవచ్చి, మనస్సులో ఒకవిధమైన బాధ కలిగింది."

"ఇల్లాంటివాడవు—నువ్వు ఎందుకు పనికివస్తావో నాకు తెలియకుండా వుంది."

"నావిషయంలో వెనకటిలా లేవు నువ్వు; నీముఖం చూస్తే స్పష్టంగా తెలుస్తోంది."

"ఇంక ఆవిషయం కట్టిపెట్టు—చంపుకుతినక. ఎక్కడికి-బయలుదేరేవు? పశువులికి గడ్డిలేదు. కొంచెం తెచ్చివేద్దాం. దేవిదోవ్ ఎక్కడా కనిపించడంలేదు-ఏంచేస్తూన్నాడు?"

"ఆయన, ఆర్కాష్కా కలిసి సోవియట్ ఆఫీసులో దరఖాస్తులు చూస్తూన్నారు. నేను వెడుతూన్నాను.........నిన్నటి పని ఇంకా కొంచెం తరువాయి వుంది. సిమన్‌లెప్షినోవ్‌ని వెళ్ళగొట్టి ఆ స్తిని స్వాధీనం చేసుగోవాలి."

అక్కడినుంచివచ్చి, మళ్ళీ నిన్నటిలా ప్రారంభిస్తావేమో" అన్నాడు నగుల్నోవ్ నవ్వుతూ.

"దానికేంకాని—నాతోకూడా ఎవరిని తీసుకొనివెళ్ళను? యుద్ధ రంగంలో ఉన్నట్లు అంతా అడావిడిగా ఎల్లావున్నారో చూడు! పశువుల్ని తోలుకొని వస్తున్నారు; గడ్డితీసుగొస్తూన్నారు; కొందరు అప్పుడే ధాన్యం కూడా తీసుగొస్తున్నారు. వాళ్ళని అందర్నీ వెనక్కి పంపించేసేను. ధాన్యం విషయం, ఈతొందర అణిగిన తరువాత చూడచ్చు. నాతో వచ్చేటందుకు ఎవరు సిద్ధంగావున్నారు?"

"కోండ్రాట్ మైదనికోవ్ వున్నాడు. కోండ్రాట్! ఒక్కసారి ఇల్లారా! చైర్మన్‌తో కూడావెళ్ళి, లెప్షినోవ్ ఆస్తి జప్తుచేసి స్వాధీనం చేసుకొనడంలో ఆయనకి సహాయంచెయ్యి. ఏం, ఆలోచిస్తున్నావు? వెళ్ళడానికి ఇష్టంలేదా ఏమిటి?"

"ఇష్టం లేకేమి? తప్పకుండా వెడతాను" అన్నాడు.

డెమ్కా ఉషాకోవ్, కోండ్రాట్, ఆంద్రీ కలసి బయలుదేరేరు— రజ్మట్నోవు కోండ్రాట్‌కేసి చూస్తూ,

"విచారంగా ఉన్నావేమి-సంతోషంగా వుండవలసినసమయంలో? చూడు, ప్రశాంతంగావుండే గ్రామజీవనంలో ఎంత సంచలనం కలిగిందో, గ్రామంఅంతా రేగిన తేనెపట్టులా వుంది." అన్నాడు.

"సంతోషించడానికి ఏమివుంది ఇప్పుడు; కష్టాలన్నీ ఇంకా ముందున్నాయి" అన్నాడు కోండ్రాట్.

"ఏం?"

"చల్లికరోజులలో తెలుస్తుంది. అంతవరకు ఎందుకు? ఇప్పుడు నేను వస్తుంటే ముగ్గురు మాత్రం పనిచేస్తున్నారు. ఒక డజనుమంది వరకు చల్లగా చెట్టునీడని కూర్చుని చుట్టలు కాలుస్తున్నారు........"

"ఆ - అంతా ఈరోజే ప్రారంభంకనక ఊరుకున్నారు కాని - పని చెయ్యక ఏం చేస్తారు! ఎంత సోమరిపోతు అయినా తిండిలేకపోతేసరి. చచ్చినట్లు పనిచేస్తాడు."

కొంతదూరం వెళ్ళేటప్పటికి, ఒకమలుపులో బోల్తాపడిపోయిన బండి ఒకటి కనిపించింది. గడ్డిమోపులన్నీ చిందరవందరగా పడిపోయి వున్నాయి. బండి గసిగలు విరిగిపోయేయి. ఎడ్లు పక్కనే పచ్చగడ్డిపరకలు పీక్కుతింటున్నాయి. సమిష్టివ్యవసాయక్షేత్రంలో సభ్యుడుగాచేరిన సిమన్ కృజనోవ్కా ఆఖరికొడుకు చెదిరిపడియున్న గడ్డిపరకలు నెమ్మదిగా పోగుచేస్తూన్నాడు.

"అప్పే! కూర్చునిడేకుతూ అపని ఏమిటి! నేను నీ వయస్సులో నలుగురు చేసేపని ఒక్కడిని చేసేవాడిని. ఇల్లాగే పనిచెయ్యడం! ఏది, రాగోలు కర్ర ఇల్లా ఇయ్యండి." అంటూ డెమ్కా ఉషాకోవు నవ్వుతూన్న అతని చేతిలో రాగోలుకర్ర తీసుకొని, ఒకపట్టుతో, మంచిబలువుమోపు గడ్డి పైకి ఎత్తేడు.

"ఎందుచేత బోల్తాపడింది?" అని అడిగేడు కోంట్రాట్.

"ఆమెట్టమీదినుంచి వేగంగా వస్తో పడిపోయింది."

"సరే! తొందరగా వెళ్ళి గొడ్డలిఒకటి తీసుగురా. 'డానిట్ సోక్కావు' ఇంట్లో వుంది, అక్కడికి వెళ్ళు."

వారుముగ్గురు బోల్తాపడియున్న బండితిరగతీసేరు. విరిగిపోయిన గసిగలు బాగుచేసి మళ్ళీ దిగకొట్టేరు. డెమ్కా గడ్డిమోపులన్నీ బండిమీద జాగ్రత్తగా అమర్చి, తాళ్లువేసి బిగకట్టేడు.

"కృజనోవ్కావు! చూసేవా ఎడ్లు గడ్డిఅంతా తొక్కేసి ఎల్లాపాడుచేసేయో? దూరంగా తోలి కొంచెం గడ్డివేసి మేపాలికాని ఏకంగా గడ్డిమీద ఒదిలేస్తారా!"

క్రృజనోవ్ నవ్వి, ఎడ్లనుకట్టి బండితోలుకుపోతూ, "ఈగడ్డి సమిష్టి వ్యవసాయక్షేత్రానిది కాని మనది కాదుకదా. అందుచేత అది ఎల్లా పోతే మాత్రం మనకెందుకు?" అన్నాడు నెమ్మదిగా.

"చూసేవా! ఆ వెధవ ఏమంటున్నాడో!" అన్నాడు డెమ్కా కోంద్రాట్ కేసి చూస్తూ.

వాళ్ళు లెష్షినోవ్ ఇంటికి వెళ్ళి జప్తు ప్రారంభించిన కొద్దిసేపటికే ఆ ఇంటిదగ్గిర ౬0 మంది వరకు పోగయ్యేరు. వాళ్ళలో చాలామంది ఇరుగు పొరుగు కోసక్కు స్త్రీలే. కొద్దిమంది కోసక్కులుకూడా వున్నారు. లెష్షినోవ్‌ని ఇల్లు వదలి వెళ్ళిపొమ్మనగానే సాపిట్లో మూగియున్న ప్రజలలో గుసగుసలు బయలు దేరేయి.

"ఇదంతా చూడగా పట్టపగలు దోపిడీలావుందే! కష్టపడి ఆస్తిసంపాదించుగున్నందుకు ఫలితంగా—ఇప్పుడు ఆ ఆస్తిఅంతా లాక్కొని ప్రవాసం పంపిస్తున్నారు చూడు!"

"చాలా అన్యాయం........"

"పాపం! అతన్ని చూస్తే జాలేస్తోంది."

"జాలెయ్యదూ—యెవరికొచ్చినా కష్టం ఒకటే!"

"వెనక ఇతను త్రిఫోనోవ్ ఆస్తి అంతా వేసుగోలేదూ-బాకీక్రింద! అప్పుడేమేనా మంచిచెడ్డలు ఆలోచించాడా!"

"చూడు, ఎల్లా ఏడుస్తూన్నాడో!"

"ఎన్నికొంపలు కూల్చేడురా, వీడు! ఇల్లా అవవలసిందే వీడికి. మంచిపని జరిగింది."

"ఒకళ్ళకి కష్టంవస్తే చూసి సంతోషించడం మంచిపనికాదు. ఈ వేళ అతను అయేడు... రేపు మనం అవచ్చు"

"మనదగ్గిర ఏమేనా వుంటేకాదూ యిలా అవడానికి! వొస్తే ఎవరి దేనా మనకి రావాలికాని మనదగ్గిరనుంచి పోయేదేమి లేదు."

"మొన్న వేసవిలో కోతకోసుగునే యంత్రం రెండు రోజులు అద్దెకి యిచ్చి, 10 రూపాయలు గూబలపిండి వసూలుచేసేడు. అప్పుడు మన మీద ఏమైనా దయతల్చేడా?"

లాష్టిపోవ్ బాగా డబ్బున్నవాడే. యుద్ధంనాటికే అతడు బాగా డబ్బు పోగుచేసేడు. దొంగవస్తువులు కొనీ, హెచ్చువడ్డీకి అప్పులిచ్చీ, వాటిక్రింద వాళ్ళ ఆస్తులువేసుకొనీ ధనవంతుడయేడు. ఆ చుట్టుప్రక్కలనున్న దొంగ లందరితోను అతనిక లాలోచీవుందని ప్రతీతి. గిప్సీ గుఱ్ఱపుదొంగలు గుఱ్ఱాలని యెత్తుకువచ్చి యితనికి అమ్మడం మామూలు. అతడు ఆ గుఱ్ఱాల నన్నిటినీ జారిట్జిన్, టాగన్‌రాగ్, ఉరియపిన్స్క్ మొదలైన చోట్లకి తోలుకొనిపోయి అమ్మేసేవాడు. సంవత్సరానికి రెండు మూడు సార్లు దగ్గిరబస్తీకి వెళ్ళి, కాగితపునోట్లు బంగారుమొహర్లుగా మార్చి తెచ్చి, దాచుకొనేవాడు. 1912 వ సం॥లో ఒకసారి ఇతనిని దారికాచి దోచుకొన డానికి ప్రయత్నం జరిగింది. కాని లెష్టినోవ్ ఒక్కడూ చేతిలోనున్న కఱ్ఱతో వాళ్ళనందరిని ఎదిరించి తప్పించుకొని పారిపోయేడు. ఏవస్తువైనా సరే- కంటబడడం తడవు - వెంటనే ఎత్తుకొనిపోయి యింట్లో వేసుకొనే వాడు. ఎప్పుడు దొంగతనం చేసినప్పటికీ అతిజాగ్రత్తగా రెండోకంటివాడికి తెలియకుండా చేసేవాడు.

కాని ఒక్కసారిమాత్రం - ఎవరివో ధాన్యపుబస్తాలు ఎత్తుకొనిపోయి అమ్మెయ్యడానికి పట్నానికి తీసుకొనిపోతూండగా- దొరికిపోయేడు. అది యినా ఎప్పుడో అతని చిన్నతనంలో. ఈ పాపాలన్నీ పోవడానికి ప్రతి రోజు చర్చికి వెళ్ళి, కొవ్వువత్తి వెలిగించి, క్రీస్తుయెదుట రెండులెంపలు వాయించుకొని పశ్చాత్తాపపడి వెంటనే కొవ్వువత్తి ఆర్పేసి జేబులోవేసు

కొని వచ్చేస్తూండేవాడు. అంత జాగ్రత్తగా వాడడంచేత ఆ ఒక్క కొవ్వు వత్తి సంవత్సరం వరకు సరిపోయేది. ఈ లోభత్వం, దేవునిమీద అశ్రద్ధ చూపి ఎవరేనా ఆక్షేపిస్తే, "దేవుడికి మనమాత్రం తెలివి లేకపోలేదు! దీపం పెట్టడానికి మనం ఎంత డబ్బు ఖర్చుచేసేమో చూడడు దేవుడు. ఆ పని భక్తిశ్రద్ధలతో చేసేరా లేదా అని చూస్తాడుకాని!" అని సమాధానం ఇస్తుండేవాడు.

ఊళ్ళో జరుగుతూన్న సంగతులన్నీ, అతనికి ఎప్పటికప్పుడు తెలుస్తూనేవున్నాయి. తన ఆస్తికూడా స్వాధీనం చేసుకొని గ్రామంలో నుంచి వెళ్ళగొట్టడానికి నిశ్చయించేరని తెలియగానే, ఖరీదయిన వస్తువు లన్నీ స్నేహితుల దగ్గిర, బంధువులదగ్గిర దాచేసేడు. అందుచేత రజ్మ ట్నోవ్ వచ్చి, ఆస్తి అంతా వదిలి కట్టుబట్టలతో గ్రామం వదలి వెళ్ళి పోవలసిందని చెప్పినప్పటికి ఏమీ కంగారుపడలేదు. సామాను జాబితా తయారు చెయ్యడంలోకూడ వాళ్ళకి సహాయపడ్డాడు. ఇదంతా చూసి ఏడుస్తున్న ముసలి భార్యకేసి తిరిగి,

"ఏడవకు. మనం పడుతూన్న యీ కష్టాలన్నీ భగవంతుడికి తెలుసును. ఎక్కడ యేమిజరుగుతున్నా, ఆ దయామయుడు కనిపెడు తూనే వుంటాడు."

"అన్నీ కనిపెడతాడుకాని నీ వున్నికోటు ఎక్కడదాచేవో మాత్రం కనిపెట్టడనుకుంటాను; అంతేనా?" డెమ్కా వెటకారంగా అతని కంఠ స్వరం అనుకరిస్తూ అన్నాడు.

"ఉన్నికోటేమిటి?"

"క్రిందటి ఆదివారం నువ్వు చర్చికి వెళ్ళేటప్పుడు తొడుక్కొన్నది."

"నేనెప్పుడూ అలాంటి కోటు తొడుక్కోలేదే?"

"నువ్వు తొడుక్కొని వెడుతూంటే నా కళ్ళారా చూసేను. అది ఇప్పుడు యెక్కడో దాచేసేవు."

"ఇదిగో! డిమెంటీ! భగవంతుడు సాక్షిగా చెబుతూన్నాను. అసలు నాకు అటువంటి కోటు లేనేలేదు."

"దేవుడంటూ వుంటే నిన్ను తగినట్లు శిక్షిస్తాడులే."

"ఆ ఏసుక్రీస్తు సాక్షిగా—నువ్వు పొరపాటు పడుతున్నావు" అంటూ లప్షినోవు క్రాస్‌చేసేడు.

"అబద్ధం ఆడి యింకా - పాపం యెందుకు మూటకట్టుగుంటావు." డెమ్కా కళ్ళుచికిలిస్తూ ప్రజలకేసి చూసేడు.

"నేనేమీ అబద్ధం ఆడడంలేదు-ఘంటాపథంగా చెప్పగలను."

"ఆ కోటు దాచేసినందుకు భగవంతుడి దగ్గిర సమాధానం చెబుదువుగానిలే."

"ఏమిటీ! నా స్వంత కోటు కోసమా!"

"ఆ! అది దాచి నందుకు."

"దేవుడుకూడా నీవంటివాడే అనుకున్నావా ఏమిటి? అతనికి యిటువంటి విషయాలు అక్కర్లేదు. అసలునాకు కొత్తఉన్నికోటు లేందే? నావంటి ముసలివాడితో పరిహాసం ఆడడానికి సిగ్గు లేదూ నీకు?"

"విత్తనాలకోసం వెనక నీ దగ్గిర 20 కుంచాలు తీసుకుంటే తిరిగి 30 కుంచాలు తీసుగున్నావు జ్ఞాపకంలేదూ? అందుకు నువ్వు కొంచెమైనా సిగ్గుపడ్డావా?" అని అడిగేడు కోంద్రాట్. బయట చేరిన ప్రజల గోలలో అతని మాటలు స్పష్టంగా వినిపించలేదు. కాని లాప్షినోవ్ అతనిపై పుతిరిగి,

"కోంద్రాట్! మీనాన్న చాలా మంచివాడు. మహానుభావుడు-చచ్చి స్వర్గాన వున్నాడు........అతన్ని చూసేనా నువ్వు యీ అన్యాయానికి వొడిగట్టకుండా వుండవలసింది. పవిత్రగ్రంథంలోకూడా, 'శత్రువైనాసరే పడిపోయినవాడిని కొట్టకు' అనివుంది. కాని, నువ్వు చేసేవని యేమిటి! నీకు

20 కుంచాలు ఇచ్చి 30 కుంచాలు వసూలు చేసేనన్నావు. ఎప్పుడు, భగవంతుడు యేమయేడు, అతడు చూస్తూనేవుంటాడు."

"ఆ 20 కుంచాలధాన్యం యిచ్చేసి. వూరుకోవాలని! దురాశాపాతకపు ముండాకొడుకులు!"అని హృదయావేదన. క్రోధం వెలిగ్రక్కుతూయేడ్చింది.

"ఏడవకు. ఏసుక్రీస్తుకే బాధలు తప్పలేదు. ఇంక మనబోటివాళ్ళకి రావడంలెక్కా." అంటూ లాప్షినోవ్ చొక్కా చేతితో కళ్లు వొత్తుగున్నాడు. బయట జనంలో సద్దు అణిగింది. ఈ దృశ్యం చూసి ఆడవాళ్ళు కళ్ళనీళ్ళు పెట్టుగున్నారు. రజ్మట్నోవు తన వ్రాతపని ముగించి లాప్షినోవువైపు తిరిగి "లాప్షినోవ్ ! యింక నువ్వు యిక్కడినుంచి వెళ్ళిపోవాలి. కళ్ళనీళ్లు పెట్టుగుంటే యేమీ లాభంలేదు. ఇంతవరకు నువ్వు అనేకమందికి అపకారం చేసేవు. దానికి తగిన ప్రతీకారం భగవంతుడు చేస్తాడని చేతులు ముడుచుకొని కూర్చోకుండా యిప్పుడు మేమే చేస్తున్నాం. ఒక్క నిమిషంకూడా నువ్వు యిక్కడ వుండడానికి వీలులేదు. వెళ్ళిపో." అని తీవ్రంగా అన్నాడు.

లాప్షినోవు టోపీ నెత్తినిపెట్టుకొని. వెర్రికొడుకుని చెయ్యిపట్టుకొని నడిపించుగుంటూ బయటకు వచ్చేడు. వాకట్లోవున్న జనంఅంతా ఒకర్ని ఒకరు తోసుగుంటూ అతని వెనుకపడ్డారు. లాప్షినోవు వాకట్లోకివచ్చి మోకరిల్లి నాలుగు వైపులకు తిరిగి క్రాస్ చేసేడు.

"చాలులే! యీ పాటికి లేచి దయచెయ్యి!" అని వసారాలో నుంచి రజ్మట్నోవు కేకవేసేడు.

బయటచేరిన జనంలోనుంచి మళ్ళీ కూతలు, కేకలు బయలుదేరేయి.

"చిన్నప్పటినుంచీ వున్న యిల్లు, వాకిలి సమస్తంవదలి వెళ్ళిపోయేటప్పుడేనా కడసారి సెలవు తీసుగోనియ్యి!"

"అంద్రీ! యింత అన్యాయం కూడదు. కాటికి కాళ్ళుజాపుకొని వున్న ముసలిముండాకొడుకుని నువ్వు........"

"ఇటువంటి దుర్మార్గపు బ్రతుకు బ్రతికిన తరువాత యింకా కాటికి కాళ్లజాపి వుండడం యెందుకు? — రెండుకాళ్ళతోను కాటికి గబగబా పాకాలికాని—" అన్నాడు కోంద్రాట్.

చర్చికాపలాదారైన 'గ్లాడినోవ్' అనే ముసలికోసక్కు "ఎలాగైనా ప్రభుత్వం మెప్పు పొందుదాంఅనా? నీవంటి వాడిని కొరడా పుచ్చుకొని వీపుబద్దలయీలా కొట్టాలి" అన్నాడు.

"ఏమిటో మహాపేలుతూన్నావు, నోటికివచ్చినట్లల్లా. వాళ్ళు కొంచెం దగ్గరవుంచుకొని మరీమాట్లాడుతూండు." అన్నాడు కోంద్రాట్.

లాప్షినోవ్ సాష్టాంగపడి క్రాస్‌చేసి, గుంపులోనున్న ఆడవాళ్ళకేసి తిరిగి అందరికి వినబడేటట్లు గట్టిగా చెప్పడం ప్రారంభించేడు.

"మీ అందరికి వందనాలు. ఈ గ్రామానికీ, నాకు ఋణం తీరిపోయింది. శెలవుతీసుగుంటున్నాను. భగవంతుడిచ్చిన ఆయురారోగ్యాలతో ... అంతా నా ఆస్తి సుఖంగా అనుభవించండి. ఈ రోజువరకు నేను యెవ్వరికీ అన్యాయం చెయ్యలేదు....మీ...."

"చాటుగా దొంగవస్తువులు కొంటూండేవాడిని." అని దెమ్కా వసారా మీదినుంచి అందిచ్చేడు.

"కష్టపడి చెమటోడ్చి సంపాదించేను కాని దొంగతనం అనేది మా ఇంట వంట యెక్కడా లేదు."

"అనేకమంది కొంపలు తీసేను. కనిపించినవన్నీ యెత్తుకుపోయేను....కానీ! మెడలు వంగతీసి వాళ్ళట్టినన్ని గుద్దుతే రోగం వదిలిపోను."

"అటువంటివాడికి ఆఖరికి ముసలితనం వచ్చేటప్పటికి........"

లాప్షినోవును చూసి జాలేసి, ఆడవాళ్ళు యెగపీలుస్తూ జేబురుమా ళ్ళతో కళ్లుతుడుచుకోసాగేరు. ఇంతలో రజ్మటోవ్నేవు గబగబ వచ్చి లాప్షి నోవుని జబ్బపట్టుకొని "ఏమిటి ఈ వుపన్యాసం యిక్కడ? నువ్వు...." అని యింకా యేదో అనబోతున్నాడు. ఇంతలో వరండామీద డెమ్కా నిలబడి యున్న చోటనుంచి గంద్రగోళం బయలుదేరింది. లాప్షినోవు భార్య వంట యింట్లోనుంచి ఒకచేత బాతుగుడ్లువున్న ఒక బుట్టను, రెండవచేత ఒక బాతును పట్టుకొని పరుగెత్తుకొని వస్తూంది. డెమ్కా ఆమె చేతిలోని బుట్టను సునాయాసంగా లాగేసి, బాతునుకూడ లాక్కొనడానికి ప్రయత్ని స్తున్నాడు. కాని, ఆమె రెండుచేతులతోను బాతును గట్టిగా పట్టుగుంది.

"దిక్కుమాలిన ముండాకొడకా! దూరంగా పో." అని అరుస్తూ తిట్టసాగింది.

"సమిష్టి వ్యవసాయక్షేత్రపు బాతు నువ్వు తీసుకొనివెళ్ళడానికి వీలు లేదు." అంటూ డెమ్కా మెడజాపి చూస్తున్న బాతుని కుతుకదొరకపుచ్చు కున్నాడు. లాప్షినోవు భార్య బాతుకాళ్లు గట్టిగా పట్టుకుంది. బాతుకోసం వాళ్ళిద్దరు కాళ్లు ఒకరు మెడ ఒకరు పట్టుకొని లాగడం మొదలెట్టారు.

"నా బాతుని యిచ్చెయ్యి. నీమంప తెగ."

"నేనివ్వను."

"దీన్ని ఒక్కదాన్ని తీసుకుపోనీ. ఎందుకు ఏడిపిస్తావు"

"ఇది సమిష్టివ్యవసాయక్షేత్రానిది. నువ్వు తీసుకువెళ్ళడానికి యెలా వీలు?" అన్నాడు డెమ్కా ఒగరుస్తూ; "తొలకరినాటికి గుడ్లు పెట్టడం ప్రారంభిస్తుంది. అర్చి చచ్చినా సరే దీన్నిమాత్రం తీసుకువెళ్ళనివ్వను."

వరండా మెట్లమీద నిలబడియున్న లాప్షినోవు భార్య మెట్లని తన్ని పెట్టి లాగడం ప్రారంభించింది. బాతు మొదట కొంతసేపు అర్చింది. కాని డెమ్కా లాగడంలో మెడ గట్టిగా నొక్కుకుపోవడంచేత అర్పు మానేసి

రెక్కలు తటతట కొట్టుకొనడం మొదలు పెట్టింది. వీళ్ళిద్దరు లాగడంలో తలప్రాణం తోకకి వచ్చింది. డెమ్కా బాతును లాగెయ్యడానికి సిద్ధంగా వున్నాడు. ఇంతలో బాతు మెడ కుతుకలోకి వూడివచ్చింది. దానితో లాప్షి నోవు భార్య మెట్లమీద నుంచి క్రిందికి దొర్లిపోయింది. బలంకొలదిలాగు తూండడంచేత అవూతానికి డెమ్కా కూడ వెనకనున్న బుట్టమీద పడ్డాడు. బుట్టలోని గుడ్లన్నీ చితికి పచ్చడై పోయేయి. ఇదంతా చూస్తూ బయట నిలబడియున్న జనం గొల్లుమన్నారు. లాప్షినోవు కంగారుగాలేచి టోపీ సద్దుకొని కొడుకుని తీసుకొని వీధులోకి పరుగెత్తేడు. మెట్లమీదినుంచి క్రిందికి దొర్లడంచేత లాప్షినోవు భార్యకి బాగా దెబ్బ తగిలింది. నెమ్మదిగా లేచి బట్టసలుపుకొని రెక్కలు కొట్టుకొంటూన్న బాతుమొండెం అందుకో టానికి చెయ్యిచాపింది; కాని ఇంతలో పక్కని తారటలాడుతూన్న కుక్క ఒకటి రక్తంకారుతూన్న బాతుని చూడగానే ఒక్క ఉరుకున దానిమీదపడి నోటకరచుకొని పారిపోయింది. అక్కడ చేరిన పిల్లలంతా కేకలేస్తూ దాని వెంటబడి తరుముకు పోయేరు.

---

## పన్నెండో ప్రకరణము

## హత్య.

గ్రిమాచీలాగ్ లోని వెనుకటి ప్రశాంతత పోయింది. రాత్రిం పగళ్లు కోసక్కులు, ప్రక్క సందులలోను, యిళ్ళలోను చేరి సమిష్టివ్యవసాయ క్షేత్రాన్ని గురించి చర్చిస్తున్నారు. నాలుగు రోజులు వరుసగా సాయంత్రం మీటింగులు పెట్టి, తెల్లవారుఝామున కోడికూసేవరకు చర్చలు సాగించేరు.

ఆరోజుల్లో విశ్రాంతి లేకుండా పనిచెయ్యడంచేత నగుల్నోవ్ చిక్కి శల్యం అయిపోయేడు. దేవిడోవ్ మాత్రం పైకి వెనుకటివలెనే వున్నాడు.

కాని మనసులోని ఆరాటం ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. అతని మీద రజ్మట్నోవ్‌కి ఒకవిధమైన గురి ఏర్పడింది. అహంభావంతో చిరునవ్వు నవ్వుతుంటూ, ఆంద్రీ పశుశాలలు తనిఖీచేస్తూ. గ్రామం అంతటా తిరుగుతూ మేనేజిమెంటు కమిటీ యెన్నుకొనే వరకూ తాత్కాలికాధ్యక్షుడుగా నియమింపబడ్డ అర్కాడీతో "మన సమిష్టివ్యవసాయక్షేత్రాన్ని ఆదర్శప్రాయంగా నడపాలి. తరువాత ఒక్కొక్కరే వచ్చి చేరికేం చేస్తారు." అంటూండేవాడు.

దేవిడోవ్ జిల్లాకమిటీకి ఒక వార్తావహుని పంపించి సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరవలసిన వారిలో 32% రైతులు మాత్రమే చేరేరనీ, తీవ్రమైన వొత్తిడి కలిగించి మిగిలినవారిని కూడ జేర్చడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయనీ తెలియజేసేడు.

ఇళ్ళనుంచి వెళ్ళగొట్టబడిన భాగ్యవంతులు వారివారి బంధువుల ఇళ్ళకి స్నేహితుల ఇళ్ళకి చేరేరు. ఫ్రోల్ తన కొడుకు 'టిమోఫీ'ని రిజియనల్ ప్రాసిక్యూటరు దగ్గిరికిపంపి, వెనక బీదకోసక్కుల మీటింగులో వోటు చెయ్యడానికి నిరాకరించిన బోర్షేవ్ ఇంటికివచ్చేడు. ఆయింట్లోనే గ్రామములోని భాగ్యవంతులు, యితరులు కొంతమంది చేరడం ప్రారంభించేరు. పగటివేళ ఒకళ్లూ-యిద్దరూ చొప్పున విడివిడిగా సోవియట్ అధికారుల కంట పడకుండా దొడ్డిదోవనీ, పక్కసందుల్నీ పడివచ్చి జేరుతూండేవారు. డేవిడ్ గెయీవ్, లాప్షినోవ్ మాత్రం ప్రతిరోజూ తప్పకుండా వస్తుండేవారు. యాకోవ్ లూకుచ్ ఆస్ట్రొవ్నోవు యెవరేనా చూస్తారేమోనను భయంచేత అప్పుడప్పుడు అతిరహస్యంగా వస్తూండేవాడు. సమిష్టి వ్యవసాయ క్షేత్రం అంటే యేమాత్రమూ కిట్టని మధ్యరకపు రైతులు నికోలాయ్ లుష్నియా వంటివాళ్లు గూడ కొందరు వస్తుండేవారు. ఇక్కడికి వచ్చేవారిలో బోర్షేవు కాక యింకొక యిద్దరు బీద కోసక్కులు మాత్రం వున్నారు. వారిలో

వాసిలీ అటమంచుకోవు ఒకడు; సన్నంగా జువ్వలా వుంటాడు. నికీటా ఖ్రాపోవు రెండవవాడు. ఇతడు పూర్వం జారుప్రభుత్వ కాలంలో ఫిరంగి సైన్యంలో పనిచేసేడు. అంతర్యుద్ధకాలంలో సైన్యంలో చేరకుండా తప్పించుకొని తిరిగేడు. కాని 1919 వ సం॥లో విప్లవ వ్యతిరేకులతో జేరి 'కల్నల్ అస్టిమోవు' నాయకత్వము క్రింద బోల్షివిక్ సైన్యాలతో పోరా డేడు. అందుచేత చీదకోసక్కు అయినప్పటికి సోవియటు ప్రభుత్వం అతనిని శత్రు భావంతోనే చూస్తూ వచ్చింది. గ్రిమాచీలోని ముగ్గురు వ్యక్తులు: యాకోవ్ లూకిచ్ ఆస్ట్రోవునోవు, అతనికొడుకు, లాష్టినోవులు ఇతను అస్టిమోవు సైన్యంలో కలిసి విప్లవ వ్యతిరేకులకు చిహ్నమైన తెల్లటి బాడ్జీ ధరించి 1920వ సం॥లో బోల్షివిక్ సైన్యములకుఓడి పారిపో తుండగా చూసేరు. మరియొకపర్యాయం కుషివ్కా రైల్వే డిపోలోని కూలీలను, ఖ్రాపోవు మరి ముగ్గురు కాల్మిక్ కోసక్కులు కలిసి అరెస్టుచేసి విచారణ కొరకు అస్టిమోవు దగ్గరకు తీసుకొని పోతూండగా చూసేరు.....
అంతర్యుద్ధం పూర్తి అయిన తరువాత ఖ్రాపోవు 'నొవోరోసిస్క్'నుంచి తన స్వగ్రామమైన 'గ్రిమాచీలాగ్' చేరేడు. తను విప్లవ వ్యతిరేకులతో చేరి పనిచెయ్యడం లాష్టినోవు, ఆస్ట్రోవునోవులు స్వయంగా చూసేరని తెలుసు కొన్నాడు. విప్లవ వ్యతిరేకుల నందరను, సోవియటు ప్రభుత్వం దయా దాక్షిణ్యాలు లేకుండా తీవ్రంగా అణిచేస్తూన్న రోజులవి. కాటాబస్తా అమాం తంగా రెండోవాడి సహాయంలేకుండా ఎత్తుకొన గలిగినంత దారుఢ్యవంతు డైనప్పటికి ఖ్రాపోవు విషపు నవ్వు నవ్వుతూండే లాష్టినోవు ఎదుట పడ్డా డంటే గజగజ వణకి పోయేవాడు. అతడు లాష్టినోవుకి తప్ప యింకెవరికి అంత భయపడడు. ఎప్పుడైనా లాష్టినోవు యెదురు పడినపుడు ఖ్రాపోవు దీనంగా,

"బాబూ, నా ప్రాణాలు మీ చేతిలోవున్నాయి. యేం చేసినా మీదే భారం" అంటుండేవాడు.

"నికీటా, నీకేమీ భయంలేదు, నేనుమాత్రం క్రైస్తవుడినికానా? క్రీస్తు 'ఇరుగు పొరుగు వారినికూడ దయతో చూస్తూండు' అని చెప్పేడు; కలలోకూడా నువ్వు అటువంటి భయం పెట్టుగోకు. నాలుక కోసినా నా నోట అబద్ధంమాటరాదు. చెప్పడం ఒకటి చెయ్యడం ఒకటి—మా ఇంటా వంటాకూడా లేదు కాని నువ్వు ఒక్కఉపకారం చేసిపెట్టాలి.................. ఏ మీటింగులోనైనా — యెవటివాడు పచ్చగాఉంటే చూసి ఓర్వలేని అసహ్యాష్టులు కాని.—లేక ప్రభుత్వమే అవచ్చు—నన్ను ఎదుర్కొన్నపుడుమాత్రం కొంచెం మాట సహాయం..........................ఎవరు తవ్వుకొన్న గోతిలో వాళ్ళే పడతారులే-ఏమంటావు! అయినా ఎందుకయినా మంచిదని చెబుతున్నాను. ఇంకో చిన్నవిషయం వుంది: అదును రోజుల్లో కొంచెం సహాయం చెయ్యమని అడుగుదం అనుకుంటున్నాను. మా వాడిని నువ్వు యెరుగుదువుకదా—అవధ్యుడు—యెందుకు అక్కరకురాడు. పోనీ కూలీని పెడదం అంటే—మనబోటి సామాన్య సంసారులం భరించలేం."

లాప్షినోవు, నికీటాఖ్రాపోవుచేత నా నా వెట్టిచాకిరి చేయించుకుంటూండేవాడు. ఖ్రాపోవు యింటికి వెళ్ళి కుర్చీలో కూలబడి "యెంతకాలం వీడికి యిల్లా వెట్టిచాకిరి చెయ్యడం? ఎప్పుడో ఖూనీ చేసేస్తా!" అనుకుంటూండేవాడు.

యాకోవు లూకుచ్‌కికూడా 'తను ఏమి కోరినా ఖ్రాపోవు చేతనయినంతవరకు చేస్తాడని' తెలుసును. కాని 'లాప్షినోవు' లా కాకుండా మంచి మాటలు చెప్పి. చల్లచల్లగా చేయించుకుంటూండేవాడు. అతడు వెనక తిరగగానే ఖ్రాపోవు పళ్ళుకొరుకుతూ, "దొంగ ముండాకొడుకులు యిద్దరూ యిద్దరే! మీ రిద్దరూ చావాలి—నా ప్రాణం సుఖపడాలి—" అనుకొనేవాడు.

పొలోవిట్సీవు యింకా యాకోవ్‌లూకుచ్ యింట్లోనే వుంటున్నాడు. యాకోవులూకుచ్ అతనికి తనతల్లి పడుకొనే గది ఖాళీచేసి యిచ్చేడు.

పగలల్లా ఆ గదిలో మంచంమీద కాళ్లు స్టౌ వైపు పెట్టుకొని కాచుకుంటూ. వదలకుండా సిగరెట్టుమీద సిగరెట్టు కాలుస్తూ, యేదో ఆలోచిస్తూ పడుకొని ఉండేవాడు. రాత్రి పూరు మాటుమణగిం దనగానే పిశాచంలా యిల్లు అంతా తిరుగుతూండేవాడు. అప్పుడప్పుడు బొచ్చుకోటు తొడుగుకొని, సిగరెట్టు ఆర్పేసి, రహస్యంగా, నెమ్మదిగా దొడ్లో పాకలోనున్న తన గుర్రాన్ని చూడడానికి వెడుతుండేవాడు.

ఒకరోజు రాత్రి కన్ను-కన్ను కానరానంత అంధకారములో పొలోవిట్సీవు పాకలోంచి గుర్రమును బయటకు తీసుకొనివచ్చి, యెక్కడికో యెక్కి వెళ్ళిపోయేడు. అతడు తిరిగి వచ్చేటప్పటికి తూర్పు తెల్లవారవచ్చింది. గుర్రం చెమటతో తడిసి ముద్దయిపోయింది. పక్కలు యెగరేస్తూంది. ఉండిఉండి ఆపాదమస్తకం వణికిపోతూంది. ఆ వుదయం పొలోవిట్సీవ్ లూకుచ్‌ని పిలిచి "రాత్రి మా వూరికి వెళ్ళి వచ్చేను. అక్కడ నా కోసం వెతుగుతున్నారు. కోసక్కులంతా తిరుగుబాటు చెయ్యడానికి సిద్ధంగా వున్నారు. ఆజ్ఞకోసం యెదురు చూస్తున్నారు." అని చెప్పేడు

తరువాత కొద్ది రోజులకే డేవిడోవు గ్రామస్తులందరను సమావేశపరచి, సమిష్టి వ్యవసాయ క్షేత్రమువల్ల కలుగు లాభములను గురించి చెప్పేడు. ఆ సభలో పొలోవిట్సీవు సలహా ననుసరించి యాకోవ్ లూకుచ్, గ్రామస్తులందరు తప్పక చేరవలెననియు, దానివల్ల అనేక లాభము లున్నవనియు గంభీరోపన్యాసము యిచ్చి తను వెంటనే సభ్యుడుగా చేరేడు. అతను చేరడం చూచి ఆ రోజు సాయంకాలము లోపుగా మరి 30 మంది చేరేరు.

ఆ రోజున సభలో సమిష్టి వ్యవసాయ క్షేత్రంవల్ల చాలా లాభాలు వున్నాయని చెప్పేడు. కాని మరునాడుదయం రహస్యంగా, సమిష్టి వ్యవసాయ క్షేత్రములో చేరుటకు ఇష్టంలేని కోసక్కుల దగ్గరకువెళ్ళి, వారిని

చేరవద్దని చెప్పడం మొదలెట్టేడు. డబ్బు ఆశ వున్నవాళ్ళకి డబ్బు యిచ్చి, కొంతమందికి వోడ్కా వాళ్ళు తెలియకుండా పోయించి తనవైపు తిప్పుకున్నాడు.

"మీ అందరికంటె ముందుగా నేనే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరాలి. లేకపోతే నన్నుకూడ భాగ్యవంతులలో జమకట్టి వెంటనే నా ఆస్తి అంతా స్వాధీనం చేసుకుంటారు. అంతేగాని మీరు చేరడం అనవసరం. ఎడ్లని చూసేరా—వాటి మెడకి కాడి తగిలించి యెల్లా చాకిరీ చేయించుకుంటున్నారో ? అలాగే మిమ్మల్నిగూడ నిర్బంధించి చాకిరీ చేయించుగుంటారు." అంటూ తన మామూలు పాఠం వల్లించేడు. ఆడవాళ్ళనిగూడ సమాజపరం చేస్తారనీ, కుటుంబవిచ్ఛేదం చేస్తారనీ దేశం అంతటా రైతులు తిరుగుబాటు చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారనీ, తోచినట్లు కల్పించి చెప్పి కొత్తవారిని యిద్దరిని రహస్యసంఘంలో చేర్చి యింటికి వెళ్ళిపోయేడు.

అంతా సవ్యంగానే జరిగిపోతూంది. యాకోవ్‌లూకుచ్ సుమారు 30 మందిని రహస్యసంఘంలో సభ్యులుగా చేర్చేడు. ఇంతలో హఠాత్తుగా అనుకోని విపత్తు ఒకటి సంభవించింది. ఒకరోజు సాయంకాలం యాకోవ్‌లూకుచ్ మామూలుగా బోర్షేవు యింటికి వెళ్ళేడు. అప్పటికప్పుడే అక్కడ చాలమంది సభ్యులు పోగయేరు. గదిలో వెచ్చగా వుండడంకోసం బోర్షేవు నెగడుకి పుల్లలు తగులుస్తున్నాడు. బల్లలమీద ఫ్రోల్, లాప్షినోవు, గెయీవు, నికోలాయ్‌లుష్నియా, వాసిలీ అటమంచుకోవ్, ఖాప్రోవు మొదలయినవాళ్లు కూర్చుని వున్నారు. అప్పుడే పట్నంనుంచి తిరిగి వచ్చిన ఫ్రోల్ కొడుకు టిమోఫీ ద్వారబంధము నానుకొని నిలబడి 'పబ్లికు ప్రాసిక్యూటరు' తన ఫిర్యాదు విచారించుటకు బదులు, అరెస్టు చెయ్యడానికి సిద్ధపడడం మొదలైన విషయాలు చెబుతున్నాడు. లూకుచ్ రాగానే టిమోఫీ హఠాత్తుగా చెబుతున్న విషయం ఆపేసేడు.

"టిమోఫీ ! అతడు మనవాడే. నువ్వేమీ భయపడ నవసరంలేదు. అని ఫ్రోల్ కొడుకుని హెచ్చరించేడు.

టిమోఫీ అక్కడ జరిగిన విషయాలన్నీ సాంతంగా చెప్పేడు. కళ్ళు తళ తళ లాడుతున్నాయి.

"పరిస్థితులన్నీ మనకి వ్యతిరేకంగా వున్నాయి. వాళ్ళకి శత్రువులని తోచిన వాళ్ళందరిని తీవ్రంగా అణచేస్తున్నారు. ఇప్పుడు దేశంలో యే దయినా తిరుగుబాటు వచ్చిందంటే, నేనుకూడా తక్షణం బయలుదేరి యీ కమ్యూనిస్టుల్ని అందర్నీ నాశనం చేద్దును."

"ప్రభుత్వం వొత్తిడి, నిర్బంధం చాలా తీవ్రంగానే యున్నాయి ; కాని యింతకంటె అధ్వాన్నం అవకపోతే అదీ ఒక సుగుణమే." అన్నాడు లూకుచ్.

"ఎంతవరకు అవాలో అంతవరకూ ఇదివరకే అయింది—గోచీకి, మిక్కిలి దరిద్రం వుందా" అన్నాడు ఫ్రోల్ కోపంతో.

"నీ ఆస్తి నీకు భద్రంగానే వుంది—నీకేం? ఎటొచ్చీ ఆస్తి అంతా పోయి చిప్ప చేతికొచ్చిన వాళ్ళం మేము. మొన్న మొన్నటి వరకు మనం యిద్దరం సమాన స్థితిపరులుగా వుండేవాళ్ళం. ఇప్పుడు నీకు కొంత ఆస్తి పోయినా తిండికి గుడ్డకి లోటులేదు. మా దగ్గరనుంచి మాత్రం వంట వండుకొనే గిన్నెసహా లాక్కున్నారు."

"ఆ విషయంకాదు. ఇంకో విషయం ఏదో ఆలోచిస్తున్నాను."

"ఏమిటది ?"

"మళ్ళీ యుద్ధం వస్తుందేమోనని."

"ఆ మాత్రం అదృష్టం కూడానా ! యుద్ధంవస్తే యింక మనకి కావలసినదేముంది ! భగవంతుడికి మ్రొక్కుతున్నాను.... .... ...."

"1919 సంవత్సరంలో 'వియోషన్‌స్కా' లో ప్రజలు తిరుగుబాటు చేసేరు చూసేవు ; అల్లా చేతికి అందినదల్లా పుచ్చుకొని తయారవుతాము."

"నా కసితీరా కమ్యూనిస్టుల్ని చిత్రవధ చేస్తాను."

అంతర్యుద్ధంలో కంఠానికి దెబ్బ తగలడం చేత కీచుకంఠం అయిపోయిన అటమంచుకోవ్, చీమండలా సన్నని గొంతుకతో "ప్రజలు యింక యేమాత్రం ఓర్వలేని స్థితికి వచ్చేరు. ఆయుధాలు లేకపోతే గోళ్ళతో రక్కి పళ్ళతో పీకి చంపుతారు" అన్నాడు.

యాకోవులూకుచ్, చుట్టుప్రక్కల అన్ని జిల్లాలలోను అశాంతి ప్రబలుతూంవనీ కొన్నిచోట్ల కోసక్కులు కమ్యూనిస్టుల్ని పట్టుకొని సంచులలోకట్టి నీళ్ళలో పారేసి-కాళ్ళు చేతులు ఒక్కొక్కటే తెగగొట్టి చంపేసి అనేక విధాల చిత్రవధలు చేస్తున్నారనీ, డాన్ నదీ తీరాన కొన్ని జిల్లాలలో 'స్త్రీలని అందరు సమానంగా అనుభవించాలి'అని చట్టాలుచేసేరనీ, కమ్యూనిస్టులు సంసార స్త్రీలనందరిని మానభంగం చెయ్యడానికే యీ చట్టాలన్నీ చేస్తున్నారనీ, తొలకరి నాటికి విదేశ ప్రభుత్వాలు రిష్యా మీదికి దండెత్తి వస్తాయనీ, అక్కడ వున్నవాళ్ళందరు నమ్మేటట్లుగా చెప్పేడు. ఆ విషయాలన్నీ నమ్మకస్తుడైన ఒక సేనానాయకుడు వారం రోజులక్రితం అవూరు వచ్చినపుడు తనకి తెలియ జేసేడని చెప్పేడేకాని, అతడు యింకా తన యింట్లోనే వున్న సంగతిమాత్రం చెప్పలేదు.

అంతవరకు మౌనంతో వింటూ కూర్చునియున్న ఖాప్రోవు "యాకోవులూకుచ్! మనంఅంతా తిరుగుబాటుచేసి యీప్రాంతంలోని కమ్యూనిస్టుల్ని అందరిని చంపేస్తామనుకో, తరువాత? మిలీషియా వచ్చినా వోడించేస్తాం. కాని ప్రభుత్వం సైన్యాలు తీసుకువచ్చి దింపుతే? వాళ్ళతో యుద్ధం చెయ్యడానికి మనల్ని నడిపించేవాడెవడు? మన వంటివాళ్ళు యెంతమంది వుంటే మాత్రం యేం లాభం— సమర్థులైన ఆఫీసర్లు, సేనానాయకులు లేకపోయిన తరువాత?" అన్నాడు.

"సమయం వచ్చిందంటే అంతా సమకూడుతారు. బోల్షివిక్ సేనా నాయకులకంటె సమర్థులైనవాళ్లు, యుద్ధవ్యవసాయంలో తల నెరసినవాళ్లు, అనేకమంది మనపక్షాన పోరాడడానికి సిద్ధంగా వున్నారు. బోల్షివిక్ సేనా నాయకులు యెల్లాంటి వాళ్లో యెరుగుదువా? యెక్కడివాకానో యెందుకు, మన మకార్ సగుల్స్కీని చూడు. అమాంతంగా మనిషిని నిలువునా చంపెయ్యగలడు అంతమాత్రంచేత సైన్యాలు నడిపించడం చేతనవుతుందా? సేనానాయకుడికి యెంత అనుభవం, తెలివితేటలు, నేర్పు, వుండాలి?" అన్నాడు.

"కాని—మనకి ఆఫీసర్లు యెక్కడినుంచి వస్తారు?"

"ఇకమైని దేశంలో పడతారు." లూకుచ్ కొంచెం గాభరా పడ్డాడు.

"నికీటా! 'యెక్కడినుంచి వస్తారు!,' అని నన్ను వేపుకుతినేస్తున్నావు. నాకేమైనా జ్యోతిషం వచ్చుననుకున్నావా, వాళ్లు యెక్కడినుంచి వస్తారో చెప్పడానికి?"

"ఏ విదేశాల నుంచో వస్తారు. ఎక్కడినుంచి వస్తే మనకెందుకు, మనపని మనకు అవాలి కాని." ఫ్రోల్ ముందురాబోయే విప్లవం, అప్పుడు శత్రువులమీద తాము జరిపే భయంకర ప్రతీకారము మనస్సులో చిత్రించుకుంటూ సంతృప్తితో పెద్ద వుచ్ఛ్వాస్వ తీసుకున్నాడు.

ఖ్రాపోవు లేచి నిలపడ్డాడు. దట్టంగా పెరిగియున్న యెర్రటి గడ్డం నిమురుకుంటూ వినేవారి మనస్సులకి గాఢంగా నాటేటట్లు మాట్లాడ్డం మొదలెట్టేడు;

"సరే! యెక్కడినుంచి వస్తేమాత్రం నాకెందుకు.........కాని కోసక్కులు వెనకటంత మూర్ఖులు, అజ్ఞానులు కారు. వెనుక తిరుగుబాటు చేసినందుకు ప్రభుత్వం బహుకూర్రంగా శిక్షించింది. ఇంక యెన్నడూ, వాళ్ళు తిరుగుబాటు చెయ్యరు. క్యాబాన్ కూడా తిరుగుబాటులో పాల్గోము.........,,

యాకోవ్‌లూకుచ్ నవ్విన నవ్వు మూతికూడ కప్పేసిన అతని బూడిదవర్ణపు గడ్డంలోనే అంతరించిపోయింది.

"ప్రజలంతా ఒక్క రాత్రిమీద లేచి తిరుగుబాటు చేస్తారు. క్యూబాన్ అంతా నామరూపాలు లేకుండా నేలమట్టంచేసి పారేస్తారు. ఇంతవరకు అణచి యుంచబడిన వారందరు మరుక్షణంలో తిరగబడి శత్రువుల్ని నేల రాసేస్తారు." అని యాకోవు ధీమాగా అన్నాడు.

"మీరు లక్ష చెప్పండి, నాకేమీ నమ్మకం లేదు. నేను ప్రభుత్వం మీద తిరుగుబాటు చెయ్యదల్చుకోలేదు. నా సలహా అడిగిన వాళ్ళకి కూడ తిరుగుబాటు చెయ్యవద్దనే చెబుతాను. లూకుచ్! ప్రజల్ని తిరుగుబాటు చెయ్యమని చెప్పడంవల్ల లాభంలేదు. రాత్రి మీయింటికి వచ్చిన ఆఫీసరు ఎవరోకూడ తెలియదు నీకు. అటువంటి వాళ్ళమాటలు నమ్మడం మంచిది కాదు. సుఖంగా జీవిస్తున్న మనల్ని తిరుగుబాటు చెయ్యమని ప్రోత్సహించి వ్యవహారం చెయ్యి దాటిపోగానే చల్లగా తప్పుకుంటాడు. తరవాత బాధ పడేవాళ్ళం మనం. క్రిందటి యుద్ధంలో యేమయింది? మనచేత సోవియటు ప్రభుత్వంమీద తిరుగుబాటు చేయించేరు. ఆదరా బాదరాగా మనల్నే ఆఫీసర్లుగా కూడా తరఫీదు చేసేరు. వారుమాత్రం యుద్ధరంగం వెనుక నిలబడి పడుచు పిల్లలతో కులాసాగా కాలం గడిపేరు. చివరకి యుద్ధం ముగిసిన తరువాత తిరుగుబాటు జేసినందుకు నష్టపడినవాళ్ళు ఎవరు? నొవొరోసిస్కులో బోల్షివిక్కులు చేతికందిన 'కాల్మిక్'ల నందరిని కోసి వోదెలు పెట్టేరు. ఆఫీసర్లు, యితరతిరుగుబాటు నాయకులు మాత్రం వోడలెక్కి కడుపులో చల్ల కదలకుండా జాగ్రత్తగా విదేశాలకి చేరుకున్నారు. డాన్ సైన్యాన్ని అంతనీ తరిమి తరిమి గొర్రెలమంద తోలుకు వచ్చినట్లు 'నొవొరోసిస్క'కు తోలుకు వచ్చేరు. ఆ తిరుగుబాటు నాయకులు యేమయేరు? మిమ్మల్ని యింకొక విషయం అడగ దల్చుకున్నాను. రాత్రి మీ యింటికి వచ్చిన పెద్దమనిషి యున్నాడే—అతడు యింకా మీ యింట్లోలేడూ? దొడ్లో

పాకలోకి నీవు బాల్చీతో నీళ్ళు తీసుకు వెడుతూంటే అనేకసార్లు చూసేను. 'లూకుచ్ యెందుకో అక్కడికి నీళ్లు తీసుకు వెడుతున్నాడు? నీళ్లు తాగడానికి అక్కడేమీ లేవే.' అనుకున్నాను. అంతట్లో గుర్రం సకిలింపు వినబడింది." క్రమంగా అస్ట్రోవ్నోవు ముఖవైఖరి మారుతూ చివరకి నెత్తురు చుక్క కూడా లేనట్లు తెల్లపోవడం ఖాప్రోవు చూసి లో లోపల సంతోషిస్తూ నిలబడ్డాడు. అక్కడవున్న అందరి ముఖాలలోను ఆందోళన, ఆతురత వ్యక్తం అవుతూంది ఖాప్రోవు సంతోషం కంఠ పూర్తి అయింది.

"మా యింట్లో ఆఫీసరెవడూ లేడు." అన్నాడు లూకుచ్ తీవ్రంగా. "నీకు వినబడిన ఆ సకిలింపు మాగుర్రానిదే. ఆ పాకలోవున్న పందికి పొయ్యడానికి కుడితి తీసుకు వెళ్ళేను, కాని నీళ్లు యెప్పుడూ తీసుకు వెళ్ళలేదు."

"నీ గుఱ్ఱం సకిలింపు నాకు గుర్తే; ఆ కబుర్లు నాదగ్గిర చెప్పకు. పోనీ- ఆ గొడవ నాకెందుకు? ఇంతటినుంచి నేను మాత్రం మీతో కలిసి రాను." ఖాప్రోవు టోపీ పెట్టుకుని చుట్టూ చూసి, గుమ్మం వైపు బయలుదేరేడు. ఇంతలో లాప్షినోవు చేతులు చాపి దోవకి అడ్డంగా నిలబడ్డాడు.

"ద్రోహీ! వెళ్ళి ఇక్కడ జరిగినదంతా తెలియచేస్తావా? డబ్బుకి ఆశపడి వాళ్ళతో జేరేవా" నువ్వు వెనక 'కాల్మిక్'లతో కలసి ప్యూనిటివ్ పటాలాలలో పనిచేసేవని తెలియచేస్తాం—జ్ఞాపకం ఉంచుకో........"

"ఒరేయ్, ముసలిపీనుగా! ఇంకా బెదరించి వుపయోగించుకోడానికి చూస్తున్నావురా!" ఖాప్రోవు పిడికిలి బిగించి లాప్షినోవు గడ్డం యెత్తుయెత్తేడు. "మొట్టమొదట నావిషయంతోనే ప్రారంభిస్తాను; నేను 'కాల్మిక్' ప్యూనిటివ్ దళాల్లో పనిచేసేను. శిక్షించండి.' అని చెప్పేస్తాను. కాని మీ విషయం కూడా ఆలోచించుకోండి. ఒరే! ముసలినక్కా! నువ్వు........"

అంటూ పెద్ద నిశ్వాస వదలేడు. "ఇంతవరకూ జలగలా నా రక్తం పీల్చి, పిప్పి జేసేరు. ఇప్పుడు తగిన ప్రతీకారం చేస్తాను"

అతడు లాప్షినోవు ముఖంమీద ఒక్క గుద్దు గుద్ది, అక్కడే నిలువునా కూలిపోయిన అతని వంక తిరిగేనా చూడకుండా గుమ్మము దాటి గభాలున తలుపువేసి వెళ్ళిపోయేడు. టిమోఫీ బోర్షేవు ఒక బాల్చీ తీసుకు వచ్చి లాప్షినోవు ముందు పెట్టేడు. అతి నెమ్మదిగా లేచి కూర్చుని బాల్చీ మీదికి వంగేడు. గది అంతటా నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్దంలో లాప్షినోవు సన్నటి మూలుగు, బాగాయెవిగిపోయివున్న అతని గడ్డంమీదనుంచి రక్తపు బొట్లు బాల్చీలోకి పడుతున్న ధ్వని స్పష్టంగా వినిపిస్తున్నాయి.

"ఏమీ అనుమానం లేదు. వెళ్ళి చెప్పేస్తాడు." అన్నాడు కులక్ గెయావు. నికోలాయ్‌లుష్నియా గభాలునలేచి వెడుతున్నాననేనా చెప్పకుండా టోపీ పెట్టుకునేటందుకుకూడ వ్యవధిలేకుండా గబగబా వెళ్ళిపోయేడు. అతని వెనుక అటమంచుకోవు లేచి కీచు గొంతుకతో "వెంటనే మనం అంతా ఇక్కడనుంచి చెదిరిపోవాలి. లేకపోతే పట్టుబడి పోతాం" అంటూ వెళ్ళిపోయేడు.

చాల సేపటివరకు యాకోవులూకుచ్ మాట్లాడకుండా అల్లాగే కూర్చుండి పోయేడు. కంఠానికేదో అడ్డుపడినట్లు అనిపించింది. అతనికి ఊపిరిపీల్చడంకూడా భారం అయింది రక్తం తలలోకి వేగంగా ప్రవహించ సాగింది. నుదుటిమీద చిరు చెమటలు పోసేయి. కొంతసేపటికి లేచి నిలబడ్డాడు. అప్పటికప్పుడే చాలమంది వెళ్ళిపోయేరు. నెమ్మదిగా బయలుదేరి వెడుతూ టిమోఫీవైపు తిరిగి "నాతోకూడా రా!" అన్నాడు.

మారు మాటాడకుండా టిమోఫీ కోటు తొడుక్కొని, టోపీ చేత పుచ్చుకొని యాకోవ్ వెనక బయలుదేరేడు. రాత్రి బాగా పొద్దుపోవడం చేత గ్రామం అంతా మాటు మణుగుతూంది.

"ఎక్కడికి వెడుతూన్నాం" అన్నాడు టిమోఫీ.

"మా యింటికి"

"ఎందుకు?"

"చెబుతా, అది దాటనీ."

సాహసించి యాకోవ్లు యూకుచ్ సోవియటు ఆఫీసు దగ్గరనుంచే దోవ తీసేడు. ఆఫీసులో కూడా ఎవరూ లేరు. చీకటి కొట్లాడుతూంది. వారిద్దరు యాకోవు యింటిని సమీపించేరు. యాకోవు ఆవరణ గుమ్మం దగ్గర ఆగి టిమోఫీ కోటు స్పృశించేడు.

"ఇక్కడ కొంచెం సేపు ఆగు. నేను మళ్ళీవచ్చి పిలుస్తాను."

"ఆ—అల్లాగే."

యాకోవు తలుపు తట్టేడు. అతని కోడలువచ్చి తలుపుతీసి "మీరేనా —యెవరో అనుకున్నాను." అంది.

"అవును" అంటూ తలుపు ఘడియవేసి తిన్నగా పొరోవిట్స్వివు వున్న గది గుమ్మందగ్గరకు వెళ్ళి తలుపుమీద చప్పుడు చేసేడు. లోపల నుంచి గంభీరమైన ధ్వని వినబడింది.

"ఎవరు వారు?"

"నేనండి—అలెగ్జాండర్ అనిసిమోవిచ్! లోపలికి రావచ్చా?"

"ఆ—రావచ్చు."

పొలోవిట్స్వివు కిటికీకి యెదురుగానున్న టేబులుముందు కూర్చుని యేదో వ్రాసుకుంటున్నాడు. గదిలోవాళ్ళు వీధిలోకి కనబడకుండ కిటికీకి అడ్డముగానల్లటితెర వేళ్ళాడుతూంది. వ్రాస్తూన్న కాగితంమీద చెయ్యి అడ్డంగా పారేసి యాకోవు లూకుచ్ వైపు చూస్తూ,

"ఏమిటి విశేషాలు! పనులన్నీ సవ్యంగా జరుగుతూన్నాయా?" అన్నాడు.

"ఏంబాగులేదు. ఇప్పుడే వొక విషయం జరిగింది.........."

"ఏమిటి ? త్వరగా చెప్పు !" పొలోవిట్సేవు మెరుపులా లేచి నిలబడ్డాడు. వ్రాస్తున్న కాగితాలు జేబులో కుక్కేసి, తొందరగా చొక్కా బొత్తాలు పెట్టుకొని, కందగడ్డలా యెర్రబడిన ముఖంతో, మాటుకాచి వురకడానికి సిద్ధగావున్న పులిలా ముందుకి వంగి నిలబడ్డాడు.

యాకోవు లూకుచ్ కంగారుతో తడబడుతూ బోర్షేవు యింట్లో జరిగినదంతా చెప్పేడు. పొలోవిట్సేవు లూకుచ్‌కేసి తీవ్రంగా చూస్తూ నిశ్శబ్దంగా అంతా విన్నాడు. పళ్ళుకొరుకుతూ, పిడికిళ్ళు బిగించి హఠాత్తుగా–తుపానులా–లూకుచ్‌మీద విరుచుకుపడి నోటికివచ్చినట్లల్లా తిట్టేడు.

"ఏమిరా–గాడిదా, నీకేమేనా బుద్ధివున్న పనేనా ఇది ? నన్ను నాశనం చెయ్యదల్చుకున్నావురా ? ఇంత శ్రమపడి మేము చేసినపని అంతా ధ్వంసం చేస్తావా ? నీ అజాగ్రత్తవల్ల అంతపనీ నాశనం అయిపోయింది. మొదట నీకు యేమని చెప్పేను ?—మాట్లాడవేం ? ముందుగా ఒక్కొక్కళ్ళనే పరీక్షించి చూసి మరీ చేర్చమని చిలక్కి చెప్పినట్లు చెప్పేనే ! ఇన్ని చెప్పినా చివరకు కార్యం అంతా తగలేశావు. శుద్ధ మూర్ఖుడులా ప్రవర్తించేవు." అసలే భయపడుతూ వచ్చిన లూకుచ్. కొయ్యబారిపోయేడు. "ఇప్పుడు యేం చేద్దాం ? ఖ్రావోవు యీపాటికి యీ విషయం అంతా చెప్పి వుంటాడా ? బెల్లంకొట్టిన రాయిలా మాట్లాడవేం ! ఈలాంటి మూర్ఖుడిని యెక్కడా చూడలేదు ! చెప్పలేదూ ! అక్కడనుంచి తిన్నగా యెక్కడికి వెళ్ళేడు ? అతనితోకూడా వెళ్ళి చూసేవా ?"

"లేదు..................వెళ్ళలేదండి. ఇప్పుడు వెళ్ళాలి." అన్నాడు యాకోవు లూకుచ్ చేతులు నలుపుకుంటూ, కన్నీటిచుక్క ఒకటి కొలికిలోనుంచి తొంగిచూసి క్రిందికి జారిపోయింది. పొలోవిట్సేవు పళ్ళు కొరుకుతూ నిలబడ్డాడు.

"ఆడదానిలా యేడుస్తావెందుకు, ఇప్పుడేదో తగిన ప్రతిక్రియ చెయ్యాలి కాని.........నీ కొడుకు యింట్లో వున్నాడా ?"

"తెలియదు.........కూడా యింకొకర్ని తీసుకువచ్చేను."

"ఎవర్ని?"

"ఫ్రోల్ కొడుకుని"

"ఆ! ఆతన్ని యెందుకు తీసుకువచ్చేవు?"

ఇద్దరి కళ్ళు కలిసేయి. ఆ చూపులో ఒకర్ని వొకరు అర్థం చేసుకున్నారు. యాకోవు లూకుచ్ కళ్లు మరల్చుకొని, "అతడు నమ్మతగినవాడేనా?" అని అడిగిన పొలోవిట్సోవుకి సమాధానంగా తలవూపేడు. వెంటనే పొలోవిట్సోవ్ గోడనున్న గొర్రెబొచ్చు జాకట్టు అందుకొని, తలగడాక్రింద శుభ్రముగా తుడిచి భద్రము చేయబడిన పిస్టలు తీసేడు.

జాకెట్టు బొత్తాలు పెట్టుగుంటూ పొలోవిట్సోవు యుద్ధరంగంలో మాదిరిగా, తొందరగా, క్లుప్తంగా ఆజ్ఞలు యివ్వడం మొదలెట్టేడు.

"గొడ్డలి తీసుకు రా; అడ్డుదోవని నడు; యెంత సేపట్లో వెళ్ళగలం?"

"అట్టే దూరం లేదు. యేడెనిమిది యిళ్ళ అవతల."

"కుటుంబం యేమేనా వుందా?"

"ఒక భార్యమాత్రం వుంది."

"అతని యింటి చుట్టూ యిళ్లువున్నాయా?"

"ఒకవైపు కాళీస్థలం. రెండవవైపు ప్ర్యోటు"

"సోవియటు ఆఫీసు యెంతదూరం వుంది?"

"యెక్కడో, దూరంగా వుంది........"

"సరే, నడవండి!"

లూకుచ్ గొడ్డలి తీసుకురావడానికి లోపలికి వెళ్ళేడు. పొలోవిట్సోవు యెడమ చేతితో టిమోఫీ జబ్బ పట్టుకొని "నేను యేది చెబితే అది మీరు మాట్లాడక వెంటనే చేసెయ్యాలి! మనం అక్కడికి వెళ్ళిన తరువాత నువ్వు మాడుకంఠంతో సోవియటు ఆఫీసు కాపలావాడిననీ డాక్యుమెంట్లు తీసుకు వచ్చేనని కేకెయ్యి. ఎలాగయినా అతనే తలుపుతీసి బయటకు వచ్చేటట్లు చెయ్యాలి."

"కామ్రేడ్, మిమ్మల్ని .............. యేమని పిలవాలో అర్థం అవడం లేదు............ఈ ఖాస్రోవు చాలా బలమైనవాడు. జాగ్రత్తగా వుండకపోతే, యే ఆయుధం లేకుండానే మన ముగ్గుర్నీ కలిపి........" అంటూ వొకదానికొకటి పొందిక లేకుండా చెప్పడం మొదలెట్టేడు.

"ఉస్—మాట్లాడకు!" అంటూ పొలోవిట్సోవు అతని మాటకి అడ్డం వచ్చి లూకుచ్వైపు చెయ్యి జాపి "అది నా చేతికిచ్చి దోవ చూపించు." అన్నాడు.

అతడు గొడ్డలి ట్రౌజరు బెల్టులో పెట్టి కనబడకుండా పైని గొర్రె బొచ్చు జాకెట్టు కప్పేసేడు.

ముగ్గురు నిశ్శబ్దంగా పక్క సందులోంచి బయలుదేరేరు. ఒడ్డు—పొడుగు, మంచి బందోబస్తుగా రాక్షసుడులా నున్న పొలోవిట్సోవు ముందు 'టిమోఫీ' వూనాపిలా కనిపిస్తున్నాడు.

అతడు పొలోవిట్సోవు ప్రక్కని నడుస్తూ అతని ముఖంకేసి చూడ సాగేడు; కాని ఆచీకట్లో అతనికి యేమీ కనిపించిందికాదు.

నెమ్మదిగా ముగ్గురు [illegible] దడిలోనుంచి దూరి, బయలులోకి వచ్చేరు.

"ఒకరి అడుగు జాడల్లో ఒకరు నడవండి: యెంత వెతికినా ఒక్క అడుగు జాడకంటె యెక్కువ కనుపించదు." అని పొలోవిట్సోవు నెమ్మదిగా ఆజ్ఞాపించేడు.

ఆ తెల్లటి మంచుమీద వొకరి వెనుక వొకరు నిశ్శబ్దంగా తోడేళ్ళలా బయలుదేరేరు. ఖాపోర్సివ్ యింటిచుట్టూవున్న దడిగుమ్మందగ్గరకి వచ్చిన తరువాత యాకోవులూకుచ్ వెనక తిరిగి చూసేడు.

పౌలోవిట్సేవ్ గుమ్మం వైపు చూపిస్తూ నెమ్మదిగా "వెళ్ళి పిలు" అన్నాడు. అతనన్న మాట టిమోఫీకి వినపడకపోయినప్పటికి అతని హస్త చాలననిబట్టి గ్రహించి గొళ్ళెం పట్టుకొని చప్పుడు చేసేడు. తనవెనుక నల్లటి వున్నిటోపీ పెట్టుకొనిన వ్యక్తి గొర్రె చర్మపు జాకట్టు బలవంతంగా లాగి చింపేసినట్టని వినిపించింది. టిమోఫీ మళ్ళీ రెండవసారి తలుపు చప్పుడు చేసేడు. మనుష్యుల అలికిడివిని వాకట్లోపడియున్న నాగలిక్రింద నుంచి బయటికివచ్చిన గజ్జిపట్టిన చిన్నకుక్క వొకవానిని చూచి యాకుచ్ హడలిపోయేడు. కాని చలిచేత కొంకరించుకొనిపోయి మొరగడానికి కూడా వోపికలేక, తోక ముడుచుకొని ముడ్డివంచి నెమ్మదిగా మూలు గుతూ, మరో మూలకి పోయి పడుకుంది.

* * * *

ఖాప్రోవు యెంత ఆలోచించినా ఒక నిశ్చయానికి రాలేకపోయేడు. ఆఖరికి తిరిగి తిరిగి యింటికి వచ్చేడు. చల్లగాలిలో తిరిగి రావడంవల్ల మనస్సు కొంచెం కలత తేరింది. భార్య బలవంతం మీద భోజనం దగ్గర కూర్చుని కొంచెం యెంగిలి పడి లేచేడు.

"మేరియా, పుచ్చకాయ వుంటే తినేద్దును యిప్పుడు."

"వోడ్కా యెక్కువగా తాగడంచేత తలనొప్పిగా వుందా!" అంది ఆమె నవ్వుతూ.

"లేదు. అసలు యీవేళ వొక్కసారి కూడ తాగలేదు. వెనక నేను ప్యూనిటివు దళంలో పనిచేసేనని ఒప్పుదయాన్నే వెళ్ళి ప్రభుత్వానికి తెలియ చేస్తాను. ఎంతకాలం యిలాగ మనస్సులో బాధపడుతూ వుండడం?"

"మంచి ఆలోచనే! ఈ వేళ ఉదయాన్నుంచీ యిలా వున్నారేమి? నాకేమీ అర్థం కావడం లేదు మీ వరస."

ఖాపోర్రివ పక్కమీద వొళ్లు వాల్చేడు నిద్ర పోవడానికి. నికీటా నవ్వుతూ వచ్చి అతని రెండు చెంపలమీద చేతులువేసి మీదకు వంగి "నా కోసం చేసుకున్న రొట్టెలున్నాయి; రెండు తినకోడదు? లేకపోతే యేదేనా చేసిపెట్టమంటే చేసి పెడతాను" అంది.

కాని భార్య యెన్ని చెప్పినా వినకుండా ఆలోచిస్తూ పడుకున్నాడు. "ముందు నా సంగతి చెప్పి తరువాత ఆస్ట్రోవునోవు సంగతికూడా చెప్పేస్తాను. నాతోపాటు వాళ్లూ అనుభవిస్తారు; కాని నాకు యేమిశిక్ష విధిస్తారు? సాధారణంగా మరణశిక్ష విధించరనుకుంటాను. నాలుగైదు సంవత్సరాలు శిక్ష వేస్తే వూరల్ పర్వతాలలో చెట్లు నరకడమో యేదో పనిచేసి తిరిగివస్తాను. అంతటితో స్వేచ్ఛగా వెనకటి రహస్యం వెల్లడి అవుతుందేమోననే భయం లేకుండా జీవించవచ్చు. వీళ్ళందరికీ వెట్టిచాకిరీ చెయ్యడం తప్పిపోతుంది. ఏమీ దాచకుండా అంతా పూసగుచ్చినట్లు చెప్పేస్తాను. తరువాత వాళ్ళ యిష్టం వచ్చినట్లు చేస్తారు. ఈ విషయం జరిగి చాలాకాలం అవడం చేత అట్టే యెక్కువశిక్ష విధించరనుకుంటాను. ఏమైనా సరే—అంతా చెప్పేస్తాను. స్వయంగా నేను యెవర్నీ చంపలేదు. అంతమటుకు నిజం.... సైన్యం వదలి పారిపోయినవాళ్ళని, కొంతమంది బోల్షివిక్కులను మాత్రం కొరడాలతో బాదేను. అపుడు నాకు యీ మాత్రం ప్రపంచజ్ఞానం వుంటే ఆ పని చెయ్యకపోదును."

క్రమంగా కునుకు పట్టింది. కొద్ది సేపటికే తలుపు చప్పుడుకి మెలకువ వచ్చింది. 'ఇంత రాత్రివేళ వచ్చి తలుపు తట్టేవారెవరా?' అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో మళ్ళీ తలుపు చప్పుడయింది. కంగారుపడుతూ లేచి దీపం వెలిగించడానికి అగ్గిపెట్టెకోసం వెతుకుతున్నాడు. అతని భార్యకు మెలకువ వచ్చి,

"మళ్ళీ యేదేనా మీటింగు వుందా? దీపం వెలిగించకండి. రాత్రీ పగలూ వకటే గొడవ. విశ్రాంతి లేకుండా........అంతకంతకి యీపిచ్చి మితిమీరిపోతూంది" అంది నెమ్మదిగా.

నికీటా సావిట్లోకి వచ్చేడు.

"ఎవరు వారు?" అన్నాడు.

"నేను నికీటా.........సోవియటు ఆఫీసునుంచి."

ఆ మాట వినగానే నికీటా కొంచెం గాభరాపడ్డాడు.

"నేను: 'నికోలాయ్‌కుజునోక్క'ని. ప్రెసిడెంటు గారి దగ్గరనుంచి నోటీసు తీసుకువచ్చేను. మిమ్మల్ని వెంటనే సోవియట్ ఆఫీసుకి రమ్మన్నారు."

"ఆ కాగితం తలుపు సందులోంచి లోపలికి పడెయ్యి"

ఒక్క నిముషం వరకు బయట నిశ్శబ్దంగా వుంది. తెల్లవూలుటోపీ క్రిందనుంచి రెండు కళ్లు మెరుస్తూ తీక్షణంగా చూసేయి. టిమోఫీ ఏమి చెప్పడానికి తోచక తొట్రుపడ్డాడు. కొంతసేపటికి "ఆ కాగితంమీద దస్కతు చెయ్యాలి. తలుపు తియ్యి" అన్నాడు టిమోఫీ.

అతనికి లోపల ఖాప్రోవు అడుగుల చప్పుడు వినబడింది. ఘడియ తీసిన చప్పుడుకూడ వినిపించింది మరో నిముషానికి.

ఆ చీకట్లో ఖాప్రోవు విగ్రహం గుమ్మంలో కనబడింది. మరు క్షణంలో పొలోవిట్సోవు గడపగుమ్మంమీద యెడమకాలు వేసి, వూతం తీసుకొని గొడ్డలి మడమతో ఖాప్రోవు నుదురుమీద శక్తికొలది వొక్క దెబ్బ కొట్టేడు.

ఖాప్రోవు కిక్కురుమనకుండా క్రిందకూలబడి నెమ్మదిగా వెనక్కి పడిపోయేడు.

"లోపలికొచ్చి తలుపు మూసెయ్యండి" అన్నాడు పొలోవిట్స్కీవు తొందరగా. గొడ్డలి చేత దృఢంగా పట్టుకొని, సావిడి లోపలితలుపు తెరిచేడు. మంచం వున్న మూలనుంచి "నికీటా! కాలికి యేదేనా తగిలి పడిందా యేమిటి. అంత చప్పుడయింది? వారెవరు?" అని వొక స్త్రీ ఆతురతగా అడిగింది.

పొలోవిట్స్కీవు గొడ్డలి వదిలేసి చేతులు చాపి మంచం వైపు పరుగెత్తేడు.

"అయ్యో. యేమర్రోయ్: దొంగలు.... ... రండి!"

చీకటిలో టిమోఫి కాలికి గుమ్మం తగిలి ముందరికి తూలి పడ్డాడు. లోపల యెవరో మూలుగుతూ పెనగులాడుతూన్న ధ్వని వినపడింది. ఆతనికి. పొలోవిట్స్కీవు ఆమె మీదపడి ఆమె మాట్లాడడానికి వీలు లేకుండా తలగడతో గట్టిగా ముఖము మూసేసి. రెండుచేతులూ కలిపి ఒక తుండుగుడ్డతో కట్టెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు: అతని మోచేతులు వడిలేస్తున్న మెత్తటి ఆమె గుండెలమీదనుంచి పక్కలకి జారిపోయేయి. ఆతనినుంచి విడిపించుకొనడానికి పెనగులాడడంలో, ఆమె వెచ్చటి శరీరము. భయం చేత వేగంగా కొట్టుకొంటూన్న హృదయం అతను 'ఫీ'లయేడు. అతనికి వుద్రేకం కలిగి క్షణమాత్రం మనస్సు చలించింది. తలగడ క్రిందకి చెయ్యి పోనిచ్చి. బలవంతంగా ఆమెనోరు విడతియ్యడానికి ప్రయత్నించేడు. అతని రాక్షస బలంముందు ఆ పెదవులు బద్దలై రక్తము చిమ్మి క్రమంగా లొంగిపోయి దోవ యిచ్చేసేయి. పొలోవిట్స్కీవు ఆమె జాకెట్టు గుండెల పైకి లాగేసి వుండచేసి నోట్లో అంగుడు వరకు కుక్కేడు. దానితో అంత వరకు వినబడుతున్న ఆమె మూలుగు కూడ అంతరించింది.

అతడు టిమోఫీని ఆమెదగ్గర నిలబెట్టి. తిరిగి సావిట్లోకి వచ్చేడు.

"అగ్గిపెట్టె వెయ్యి" అన్నాడు.

యాకోవు లూకచ్ ఒక అగ్గిపుల్ల గీసేడు. ఆ వెలుగులో పొలోవిట్సేవు ఖ్రాపోవు మీదికి వంగిచూసేడు. వెల్లకితలా పడివున్నాడు. ముఖం వొక పక్కకి పడిపోయింది. ఇంకా వూపిరి పీలుస్తున్నాడు కాని వొకసారి త్వరగాను వొకసారి ఆలస్యంగాను, నిలకడ లేకుండా అసమాన అవకాశాలలో పీలుస్తున్నాడు ఊపిరి వదలినపుడల్లా మీసాలమీదనుంచి కారుతున్న రక్తం అక్కడ మడుగు కట్టినట్లుంది. అగ్గిపుల్ల ఆరిపోయింది. పొలోవిట్సేవు ఖ్రాపోవుకి యెక్కడ దెబ్బ తగిలిందోనని తడిమి చూసేడు. కనుబొమలమధ్య యెముక వొకటి విరిగిపోయి జవజవలాడింది. ఆ ప్రదేశం అంతా పొంగి యెడమగుడ్డును మూసేసింది.

"నన్ను వెళ్ళిపోనియ్యి .........రక్తం చూస్తే వాంతి వొస్తూంది." అన్నాడు యాకోవు లూకచ్ నెమ్మదిగా. అతని శరీరం వణుకుతూంది. కాళ్ళలో నిలబడేటందుకు కూడా శక్తి లేకపోయింది. కాని పొలోవిట్సేవు అతని మాటలు వినిపించుకోలేదు.

"గొడ్డలి తీసుకురా—మంచందగ్గర వుంది. కొంచెం నీళ్ళుకూడా కావాలి" అన్నాడు.

ముఖంమీద నీళ్ళు చల్లగానే ఖ్రాపోవు కొంచెం తేరుకున్నాడు. పొలోవిట్సేవు మోకాలుతో అతని గుండెలమీద తొక్కిపెట్టి సన్నని కంఠంతో "తెలియచేసేవా ? ద్రోహీ !" చెప్పు, అని యాకోవ్ లూకచ్ వైపు తిరిగి "అగ్గిపుల్ల వెయ్యి !" అన్నాడు.

అగ్గిపుల్ల వెలుతురులో కళ్ళు సగము తెరచియున్న ఖ్రాపోవు ముఖం కనిపించింది. యాకోవు చేతులు, వాటితోపాటు వెలుగుతున్న అగ్గిపుల్లకూడ వొణికేయి పుల్ల పూర్తిగా కాలిపోయి మంట యాకోవు వేళ్ళు అందుకుంది. కాని అతనికి బాధ అనిపించలేదు. వెనకటి ప్రశ్న రెట్టించి అడిగి సమాధానం రాకపోవడంచేత అతని చేతివేళ్లు పట్టుకొని వెనక్కి

వంగ తీసేడు. ఖాప్రోవు మూలుగుతూ హఠాత్తుగా బోర్లపడి లేవడానికి ప్రయత్నించేడు. పొలోవిట్సీవు పళ్ళుకొరుకుతూ మళ్ళీ అతనిని తిరగతియ్యడానికి ప్రయత్నించేడు. కాని ఖాప్రోవు ఆతనికి లొంగక నెమ్మదిగాలేచి యెడమచేతితో, దగ్గరనే నిలబడియున్న లూకుచ్ నడుమునున్న పటకా పట్టుకొని, కుడిచెయ్యి పొలోవిట్సీవు మెడకి చుట్టేసి పట్టుకున్నాడు. అతడు పీకి నొక్కెయ్యకుండా పొలోవిట్సీవు తల ముందుకువంచి, గడ్డం గుండెల కానించి, "దీపం—దీపం—త్వరగా వెలిగించు;" అన్నాడు. ఆ చీకట్లో అతనికి గొడ్డలి చేతికి దొరకలేదు.

టిమోఫీ వంటయింటి గుమ్మంలోంచి తొంగిచూస్తూ.

"ఏయ్, నిన్నే అల్లామాట్లాడదు. గొడ్డలివాయతో పక్కయెముకల క్రింద తెగ్గొయ్యి" అని సలహా యిచ్చేడు.

పొలోవిట్సీవు గొడ్డలి చేతికి తీసుకొని, అతి కష్టంమీద ఖాప్రోవు పట్టు విడిపించుకొని, రెండుదెబ్బలు కొట్టేడు. ఖాప్రోవు క్రిందపడిపోయేడు. పొలోవిట్సీవు పళ్ళు కొరుకుతూ, వొక కాలితో అతని తల త్రొక్కి పట్టి, గొడ్డలితో నరికి తలను మొండెంనుంచి వేరుచేసేడు. చిమ్మన గొట్టంలోనుంచి చిమ్మినట్లు రక్తం బయటకు చిమ్మింది. అతడు లూకుచ్‌ని గుమ్మములోనుంచి లోపలకు లాగి వీధితలుపులు బిగించి, చిన్న గొంతుకతో "పిరికిపందలా వున్నావే నువ్వు! దాన్ని లేవకుండా గట్టిగా తల అణచి పట్టుకో. ఖాప్రోవు మన విషయం ప్రభుత్వానికి తెలియచేసేడో లేదో ఆమెనడిగి తెలుసుకోవాలి. టిమోఫీ! నువ్వు కాళ్లు పట్టుకో."

బంధింపబడియున్న ఆమెమీద పొలోవిట్సీవు నిలువుగా పడుకున్నాడు. అతని దగ్గరనుంచి చెమటవాసన ముక్కుబద్దలయ్యేలా వేస్తోంది.

"నీ మొగుడు సాయంకాలం యింటికి వచ్చేక, సోవియటు ఆఫీసుకేనా యెక్కడికేనా వెళ్ళేడా?" అని అడిగేడు.

ఆ మసక చీకట్లో కళ్ళనీరు కారుస్తూ, బిత్తర చూపులు చూస్తున్న ఆమె కళ్ళలోకి చూసేడు. చిరాకుతోచి ఆరుబయట గాలిలోకి వెళ్ళి విశ్రాంతి తీసుకోవాలనిపించింది ఆమె మాట్లాడక పోవడంచేత వెంటనే తేల్చెయ్యాలని, ఆమె చెవులవెనుక గట్టిగా నొక్కేడు. కొంతసేపు పెనగులాడి ఆ బాధ భరించలేక మూర్ఛపోయింది. కొద్దిసేపటికి మెలకువ వచ్చి పుప్పితో తడిసి మొద్దుబారిపోయిన నోటిలో గుడ్డ నాలికతో బయటికి తోసేసింది; కాని కేకలేసి మేదపకుండా వెక్కుతూ నెమ్మదిగా.

"అంతా చెప్పేస్తాను! యేమి దాచను! నన్నుమాత్రం బాధ పెట్టకండి!" అంది.

పక్కనే నిలబడియున్న యాకోవు లూకుచ్‌ని గుర్తుపట్టి, "లూకుచ్! యెందుకు నన్ను బాధపెడతారు! వొదిలెయ్యండి!" అంది భయంతో దీనంగా.

ఆమె మాట్లాడకుండా పొలోవిట్సేవు నోరు మూసేడు. ఎలాగేనా ప్రాణాలు దక్కించుకోవాలనే ఆశలో, రక్తం చిమ్ముతున్న పెదవులతో అతనిచెయ్యి ముద్దుపెట్టుకుంది. ప్రాణాలంటే యెంతతీపి! విపరీతంగా భయపడిపోయింది; పాపం!

"ఏం-మాట్లాడవేం? ఎక్కడికేనా వెళ్ళేవా, లేదా?"

లేదన్నట్లుగా తలతిప్పింది. యాకోవ్ లూకుచ్ అతనిచెయ్యి పట్టుకొని,

"నీ..........మీ..........అలెగ్జాండర్ అనిసిమోవిచ్!" అన్నాడు తడబడుతూ. "దాన్ని వొదిలెయ్యండి! భయపెడదం. యెన్నడూ చెప్పదు! ఎన్నడూ చెప్పదు."

పొలోవిట్సేవ్ అతన్ని దూరంగా గెంటేసేడు. ముంజేతితో ముఖం తుడుచుకున్నాడు. "రేపు చెబుతుందా! ఆడది, అందులోనూ కోసకుజాతి, నమ్మడానికి వీలులేదు. నావంటి ఆఫీసరుకి చిన్నతనం........చావనీ! చూడకుండా కళ్ళుమూసేస్తాను........" అనుకున్నాడు.

ఆమె తొడుగుకొనిన షర్టునే లాగి ముఖం కప్పేసేడు. నడివయస్సు లోనుండి అంతవరకు సంతానము లేకపోవడంచేత అందంగా, దృఢంగా వున్న ఆమె అవయవాలు వొక్కనిమిషం అతని దృష్టి నాకర్షించేయి. ఒక కాలుజాపి పక్కకి వొత్తిగిలింది. ఆ గుడ్డివెలుతురులో పొలోవిట్సేవ్ ఆమె గుండెలు నిగనిగలాడుతూ వుప్పొంగడం, క్రమంగా చిరుచెమటలు పొయ్యడం గుర్తించేడు. "దాని ముఖం యెందుకు కప్పేనో అప్పుడే తెలుసుకుంది. చావనీ!" పొలోవిట్సేవు గొడ్డలి యెత్తి వొక్క దెబ్బతో కంఠం నరికి పారేసేడు.

యాకోవ్ లూకుచ్ ఆమె శరీరం గిలగిల కొట్టుకోడం చూసేడు. ఆమె శరీరాన్నుంచి యేకధారగా ప్రవహిస్తున్న రక్తపువాసన భరించలేక పోయేడు. సావిట్లోకి వచ్చేటప్పటికి వాంతివచ్చి, పేగులలోపల వున్న దంతా కక్కిపోసేడు.

పొలోవిట్సేవు తప్పతాగినట్లు తూలుతూ బయటికి వచ్చేడు,

ఎదుట దడిమీద పేరుకొనియున్న మంచుమీద వంగి పీల్చేడు. అక్కడినుంచి వారు ముగ్గురు తిన్నగా వీధులోకి వెళ్ళిపోయేరు. టిమోఫీ మాత్రం నెమ్మదిగా నడుస్తూ, వారికి వెనకపడి, మలుపుతిరిగి స్కూలు వైపునుంచి వస్తున్న 'ఎకార్డియన్' చప్పుడు విని, ఆ వైపుకి వెళ్ళి పోయేడు. స్కూలుదగ్గిర కొంతమంది పోగయి, పాటలు పాడుతూ నాట్యం చేస్తున్నారు. చుట్టూ గుండ్రముగా నిలబడి వింటున్న పడుచుపిల్లల మధ్యనుంచి తోసుకొని లోపలికి వెళ్ళి, 'ఎకార్డియన్' వాయిస్తున్న వానిని అది యిమ్మని అడిగేడు.

"టిమోఫీ! ఒక్కసారి గిప్సీనాట్యం ఆడు." అని అడిగింది వొకత్తె.

అతను 'ఎకార్డియన్' అందుకుంటూంటే జారి కింద పడిపోయింది. మళ్ళీ తీసుకొనడానికి ప్రయత్నించి మళ్ళీ వదిలేసేడు. అతనివేళ్ల పట్టు

తప్పిపోయేయి. చివరకు ఎల్లాగో ఎకార్డియన్ పట్టుకొని వాయించడానికి ప్రయత్నించేడు కాని, చేతులు స్వాధీనం అవక దానిని తిరిగి యిచ్చేసేడు.

"ఎక్కడో పీకలదాకా యెక్కించి వస్తున్నాడు." అంది ఒక యువతి.

"చూడు, తాగినవాడులా లేడూ!"

"ఆ వాలకం చూడు యెలాగవుందో!"

వాళ్ళంతా వొక్కొక్కళ్ళే అతని దగ్గిరనుంచి తప్పుకున్నారు. అంతవరకు ఎకార్డియన్ వాయించినవాడే, దానిమీదపడ్డ మంచు తుడిచేసి, గిప్సీ నాట్యం వాయించడం మొదలెట్టేడు. ఉలియానా అఖపాటినా అనే వొక యువతి నాట్యం చెయ్యడం మొదలెట్టింది. "తెల్లారేవరకూ, యిక్కడే వుంటాను. ఆచోకీతీసినా, నావిషయం యెవరూ ఆలోచించరు." అనుకుంటూ బయలుదేరి, తప్పతాగినట్లు నటిస్తూ, ఒరి అరుగుమీద కూర్చున్న వొకతె దగ్గరికి తూలుతూ వెళ్ళి, ఆమె కాళ్ళమీద తలపెట్టి, "తలలో పేలున్నాయి, కుక్కుడూ" అన్నాడు.

యాకోవ్ లూకుచ్ కడుపులోదంతా వెళ్ళిపోయేదాకా కక్కుకొని, యింటికి రాగానే తన గదిలోకి వెళ్ళిపోయి పడుకున్నాడు. అతడు పొలోవిట్సీవ్ శుభ్రంగా చేతులు కడుక్కొనడం, ఆనీళ్లు పారపొయ్యడం, గదిలోకి వెళ్ళడం అన్నీ వింటూనేవున్నాడు. ఆ గదిలోనుంచి పొలోవిట్సీవ్ బయటికి వచ్చేటప్పటికి అర్ధరాత్రి దాటింది. లూకుచ్ భార్యని లేపి పళ్ళరసం యిమ్మని అడిగేడు.

తాగడం పూర్తయింది. యాకోవ్ లూకుచ్ పడుకొని యిది అంతా చూస్తూనే వున్నాడు. బాగా ముగ్గిన "పియర్" పండు వొకటి తీసి పీల్చుకొని తినేసి, తరువాత సిగరెట్టు ముట్టించి, గుండెలమీద వాయించుకుంటూ బయటికి వెళ్ళేడు. కొంతసేపటికి గదిలోకివచ్చి, అప్పటికికూడా, యింకా

వేడిగానున్న 'స్టౌ' మీద కాళ్ళు కాచుగున్నాడు. వాతపు నొప్పులచేత, యెంతసేపయినా తనివితీరక, అల్లా కాచుగుంటూండడం అతనికి మామూలు. మాతృదేశ రక్షణకోసం. మహో ఘనత వహించిన చక్రవర్తి గారి సేనలోచేరి పనిచేస్తూ 1916 వ సం॥ శీతకాలంలో 'బగ్' నదిని దాటుతున్నపుడు ఆ చలికి కాళ్ళు కొంకరించుకొనిపోయినప్పటినుంచి ఆ వాతపు నొప్పులు కలిగేయి.



## పదమూడో ప్రకరణము

### స్టాలిన్ సమిష్టి వ్యవసాయక్షేత్రం.

డేవిడోవ్ 'గ్రిమాచీ' వచ్చి వారం రోజులయింది. ఆ వారంరోజులలో అనేక విషమ సమస్యలు యెదుర్కొన్నాయి అతన్ని. అతడు ప్రతీ రోజూ పగలల్లా సోవియట్ ఆఫీసులోనో 'టిటాక్' యింటిలో పెట్టబడిన సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయంలోనో పనిచేసి. బసకి వచ్చినతరువాత కొంతసేపు సిగరెట్టు కాలుస్తూ గదిలో పచారుచేసి 'ప్రవదా'; 'మొలాట్' మొదలైన పత్రికలు చదివి. తిరిగి ఆలోచనా ప్రపంచంలో పడిపోయేవాడు. సమిష్టివ్యవసాయక్షేత్రాన్నిగురించి. క్రితంరోజు జరిగిన విషయాలని గురించి కలిగే ఆలోచనలకి అంతేవుండేదికాదు. చివరకు విసుగెత్తి, ఆ ఆలోచనలో నుంచి తప్పుకొనడానికి, 'పూ్యటీలోవ్‌వర్క్స్' లోని తన షాపుని ఆ స్నేహితుల్ని, అక్కడ తనుచేసే పని జ్ఞాపకం చేసుకొనేవాడు. తను యిక్కడికి వచ్చిన యీ కొద్దికాలంలోను అక్కడ అనేక మార్పులు జరిగివుంటాయనీ. తన స్నేహితులంతా తనని, యిక్కడికి వచ్చేముందు ఇచ్చిన ఆ వుపన్యాసాలనీ కూడ మరిచిపోయి వుంటారని మనస్సుకి తట్టినప్పుడు కొద్దిగా విచారం కలిగింది. అతని ఆలోచనలన్నీ మళ్ళీ అరాత్తుగా

'గ్రిమాచీలాగ్' మీదికి తిరిగేయి. గ్రిమాచీలాగ్ వచ్చేముందుకూడా అతనికి గ్రామసీమలతోను అక్కడ వుండే ప్రజలతోను పరిచయం వుండేది: కాని అప్పుడు వర్గ కలహముకోని వివిధశక్తుల్ని, వాటి గమనము, పరస్పర సమ్మిశ్రితమయిన విషమఘట్టములు, స్పష్టంగా అవగతంకాలేదు. ప్రభుత్వము సమిష్టి వ్యవసాయక్షేత్రములో చేరినవారికందరికీను అనేకవిధాల సౌకర్యములు కలుగజేస్తున్నప్పటికీ, సాధారణ రైతుల్లో హెచ్చుభాగము, తీవ్రమైన ప్రతికూలత కనబరుస్తూ దానిలో చేరకపోవడానికి కారణం గోచరించిందికాదు. గ్రిమాచీ ప్రజలయొక్క మనోగతాభిప్రాయాలను, వొకరితో నొకరికి గల అవినాభావసంబంధాలను, అర్థంచేసుకోలేకపోయేడు. పూర్వం బోల్షివిక్ సైన్యాలలో పనిచేసిన టిటాక్, ఇప్పుడు భాగ్యవంతుడై ఆ ప్రభుత్వంపైదే శత్రుత్వం వహించేడు. వీనకోసకు అయిన 'టిమోఫీ జోర్షేవ్' బహిరంగముగా భాగ్యవంతుల పక్షం వహించేడు. తెలివయిన వాడు, భాగ్యవంతులలో జమకట్టదగినవాడు అయిన ఆస్త్రోవ్నోవ్, ధైర్యముగా ముందుకువచ్చి సమిష్టివ్యవసాయక్షేత్రంలో సభ్యుడుగా చేరుతే- నగుల్నోవు అతనిని అనుమానించి బయటికి గెంటెయ్యడానికి చూస్తున్నాడు. దేవిదోవు మనోవీధిలో గ్రిమాచీలాగ్ ప్రజలందరు గిర్రున తిరిగిపోయేరు. అతనికి గ్రిమాచీ ప్రజలకి మధ్య అగోచరమైన వొక తెర అడ్డు రావడంచేత, వారిని పూర్తిగా అర్థం చేసుకోలేకుండా వున్నాడు. ఒకదానికొకటి పొందికలేక చిక్కుపెడుతున్న గ్రిమాచీ విషయాలన్నీ అర్థం చేసుకొనడానికి తీవ్రప్రయత్నాలు చేస్తూన్నా సాధ్యంకాక అంతకంతకి చిక్కుపడిపోతున్నాయి.

ఇంతలో ఖాప్రోవుని అతని భార్యని హత్యచేసి, పత్తా దొరకకుండా పోవడంచూసి, వీటికన్నిటికి మూలకారకులెవరో వుండి వుంటారని వూహించేడు. వాళ్ళశవాలు రెండూ కనుగొనబడిననాటి వుదయం దేవిదోవు, రజ్మట్నోవు, నగుల్నోవులతో చాలసేపు మాట్లాడేడు. కాని

వాళ్లకూడ యేమీ చెప్పలేకపోయేరు. ఖాబ్రోవు ఆ వూళ్ళో బీదకోసక్కులలో వొకడు. పూర్వం విప్లవప్రతికూల సైన్యాలలో పనిచేసేడు. గ్రామంలో యేవిషయంవచ్చినా కలుగచేసుగోడు, లాష్టినోవుని ఆశ్రయించి వెనక తిరుగుతుంటాడు. దొంగతనమే హత్యలకు కారణమై వుంటుందని వూహిం చేరు; కాని అతని యింటిలో సామానంతా యెల్లా వున్నది అల్లాగే వుండడంచేతను, అసలు హత్యచేసి యెత్తుకుపోదగినంత విలువైన సామాను యేమీ లేకపోవడంచేతను ఆ ఊహ సరియైనది కాదని తోసే సేరు; చివరకు యేవిషయం నిర్ధారణ చెయ్యలేక రజ్మట్నోవు.

"దీనికంతకి కారణం వొక ఆడది అయివుంటుంది. ఇతను యెవరి భార్యతోనో వెడితే, వాళ్లు చంపేసివుంటారు." అన్నాడు.

నగుల్నోవు యేమీ మాట్లాడలేదు; అతని మనస్సుకి యేదితట్టితే అది సబబు. సందర్భంలేకుండా వాగడానికి యిష్టపడడు. కాని డేవిడోవు, భాగ్యవంతు లెవరికో యీ హత్యతో సంబంధం వుండి వుంటుందని, వారినందరిని వెంటనే గ్రామంలోనుంచి బయటికి గెంటెయ్యాలని చెప్ప గానే నగుల్నోవు అతనిని సమర్థించేడు.

"ఖాబ్రోవుని, వాళ్ళే యెవరో చంపేసివుంటారు. దానిలోయేమీ అను మానంలేదు. ఆ ద్రోహుల్ని అందర్నీ వెంటనే ఉత్తరధృవ ప్రాంతాలకి ప్రవాసం పంపించెయ్యాలి!" అన్నాడు.

రజ్మట్నోవు నవ్వి బుజాలు కుదిపేడు.

"వాళ్ళందరినీ ప్రవాసం పంపించెయ్యాలి, దానిలో అనుమానం యేమీ లేదు." అన్నాడు రజ్మట్నోవు. "సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేరవద్దని రైతులలో దుష్ప్రచారం చేస్తున్నారు. కాని వాళ్ళే ఖాబ్రోవుని హత్యచేసే రన్నది సబబుగాలేదు. అతడు వాళ్ళతో యెప్పుడూ కలిసిలేడు. లాష్టినోవు వెనకమాత్రం తిరుగుతూ అతనికి పనిచేస్తుండేవాడు; కాని కావలసిన తిండి

పారేస్తున్నపుడు చెయ్యడంలో ఆశ్చర్యం యేముంది? కడుపు కక్కుర్తి చేత. లాష్షినోవు దగ్గిరికి వెళ్ళేడు. ఊళ్ళో యేంజరిగినా, అది భాగ్యవంతులు చేసి వుంటారని వాళ్ళ నెత్తినిరుద్దడం భావ్యంకాదు. దీనికంతకీ కారణం ఆడది; తరువాత మీయిష్టం."

జిల్లా పట్నంనుంచి, వొక యిన్వెస్టిగేటింగు ఆఫీసరు; వొక డాక్టరు వచ్చేరు. రెండు శవాలనీ పంచాయతీచేసి ఖ్రాప్రోవుయింటి పక్కవాళ్ళని క్రాసుపరీక్ష చేసేరు. కాని ఆచోకీయేమీ దొరకలేదు. ఆ మరునాడు ఫిబ్రవరి 4 వ తారీఖున సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల సాధారణ సమావేశంలో గ్రిమాచీలాగ్ భాగ్యవంతుల నందరిని కుటుంబములతో సహా ఉత్తర కాకేషియా పరగణాలలో యెక్కడా వుండకుండా వెళ్ళగొట్టాలని వొక రిజల్యూషన్ ప్రతిపాదించి యేకగ్రీవంగా ఆమోదించేరు. ఆ సమావేశములోనే పావెల్ లుబిష్కిన్, ఆర్కాడీ, దేవిడోవ్, డెమ్కాఉషాకోవ్, లూకుచ్ లను సమిష్టి వ్యవసాయక్షేత్ర పాలకవర్గంగా ఎన్నుకున్నారు. నగుల్నోవ్ యెదిరించినప్పటికి, దేవిడోవ్ రజ్మట్నోవులు తీవ్రంగా సమర్థించడంచేత యాకోవ్ లూకుచ్ కూడ పరిపాలకవర్గంలోకి ఎన్నుకోబడ్డాడు. జిల్లా కమ్యూనిస్టుపార్టీ సిఫారసు చెయ్యడంచేత దేవిడోవ్ అధ్యక్షుడుగా యెన్నుకోబడ్డాడు.

తరువాత సమిష్టి వ్యవసాయక్షేత్రానికి పేరు పెట్టడానికి కొంతసేపు చర్చ జరిగింది. అందరు మాట్లాడిన తరువాత రజ్మట్నోవ్ లేచేడు, మాట్లాడడానికి.

"రెడ్ కోసక్కు, అనే పేరు పెట్టడానికి నేను అంగీకరించను. ఇంతవరకు ఆ పేరు పెట్టినది యేదీ అభివృద్ధిలోకి రాలేదు; పైగా దాన్లో జీవంకూడా లేదు. పూర్వం కూలీలు వాళ్ళపిల్లల్ని 'కోసక్కు' అని భయపెడుతూండేవారు. కామ్రేడ్స్, మన సమిష్టి వ్యవసాయక్షేత్రానికి కామ్రేక్

స్టాలిన్ పేరు పెట్టవలసినదని వుపపాదిస్తున్నాను. ఆయనని గురించి నేను యెక్కువ చెప్పవలసిన పనిలేదు. మనం యే ఆదర్శంకోసం, భార్యాపిల్లల్ని వదలి, ప్రాణాలనికూడా లక్ష్యపెట్టక రక్తప్రవాహాలలో యీదులాడి పోరాడేమో, ఆ ఆదర్శసిద్ధికోసం, కామ్రేడ్ స్టాలిన్ యెన్ని ఆటంకాలు కలిగినప్పటికి ధైర్యంతో యెదుర్కొని దేశాన్ని ముందుకు నడిపిస్తున్న సంగతి మీరందరు యెరిగినదే."

ఆంద్రీ వుద్రేకంచేత కంపించేడు. కళ్లు కొంచెం చెమ్మగిల్లేయి. మళ్ళీ కొంచెం తమాయించుకొని మాట్లాడడం మొదలెట్టేడు.

"కామ్రేడ్స్. కామ్రేడ్ యూసఫ్‌విస్సారినోవిచ్ స్టాలిన్ చిరకాలము జీవించుగాక ! ఆయన గౌరవార్ధం మనం అంతా నిలబడి టోపీలు తియ్యాలని ప్రతిపాదిస్తున్నాను."

సభ్యులంతా లేచి నిలబడ్డారు; బట్టతలలు నిగనిగలాడేయి, జడలు కట్టిన అనేకరంగుల జుట్లు బయలుపడ్డాయి. రజ్మట్నోవు మళ్ళీ ప్రారంభించేడు.

"ఆపేరు పెట్టడానికి మీరంతా అంగీకరిస్తారని వూహిస్తున్నాను. మేమంతా 'జారిట్జిన్' రక్షిస్తున్నప్పుడు కామ్రేడ్ స్టాలిన్ ఫిరంగి గుళ్ళకి కూడ వెరవక యుద్ధరంగంలోకి వచ్చి స్వయంగా సైన్యాలని నడపడం నేను ప్రత్యక్షంగా చూసేను. ఆ రోజుల్లో ఆయన, వొరోషిలోవ్ రివల్యూషనరీ మిలిటరీ కౌన్సిలు సభ్యులుగా వుండేవారు: కాని యేమీ ఆడంబరం లేకుండా సాధారణ వస్త్రాలే ధరించేవారు. సైన్యాలని పరీక్షించేటపుడు, యుద్ధరంగంలోను కూడ, మాకందరికి, పిరికితనం లేకుండా ధైర్యంగా నిలబడడం........"

"రజ్మట్నోవ్ ! అవసరంలేని విషయాలు మాట్లాడుతున్నారు మీరు." అని దేవిడోవ్ అతని ఉపన్యాసానికి అడ్డువచ్చేడు.

"అవసరంలేని విషయాలా? సరే. క్షమించండి. కాని మన సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి ఆయన పేరు పెట్టాలని కోరుతున్నాను."

"ఆ విషయం మాకందరికీ తెలుసును. నామట్టుగు నేను, ఆయన పేరు పెట్టాలనేవాళ్ళలో వొకణ్ణి" అన్నాడు దేవిదోవు. "కాని ఆ పేరు పెట్టినతరువాత మనం ఆ పేరుకి అగౌరవము రాకుండా చూడాలి. ఆ పేరే కనక పెట్టేటట్లయితే యీ జిల్లాలోవుండే మిగిలిన సమిష్టివ్యవసాయ క్షేత్రా లన్నిటికంటె అభివృద్ధిలో వుండేటట్లు చెయ్యాలి."

"దానికి మాకందరికి అంగీకారమే అని" ఛూకర్ లేచేడు.

"అప్పననుకోండి." రజ్మటోన్నివు చిరునవ్వు నవ్వేడు.

"కామ్రేడ్స్, సోవియట్ అధ్యక్షుడిగా నేను కామ్రేడ్ స్టాలిన్ పేరు కంటె మంచిది లేదని చెబుతున్నాను. నన్ను అడిగేటట్లయితే అన్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకి కూడ 'స్టాలిన్' పేరు పెట్టాలని చెబుతాను. మన కమ్యూనిస్టుపార్టీ ఆయనని సమర్థించడమేకాక, అటువంటి మహామహుడు పార్టీలో వున్నందుకు గర్విస్తుందికూడాను. అంతకంటె మంచిపేరు ఎంత వెతికినా దొరకదు. ఉదాహరణకి చెబుతున్నాను. 1919 సంవత్సరములో ట్సారిన్ నదిమీద టొపోల్కా అనే గ్రామం దగ్గరనున్న ఒక వంతెనను మన సైన్యాలు ఆక్రమించడం చూసేను........"

"అదిగో, మళ్ళీ వెనకటి సంగతులన్నీ యెత్తుకున్నారు." అన్నాడు దేవిదోవు విసుగుగా.

"ఆపేస్తానులెండి. ఈ విషయంమీద సమ్మతులు తీసుకుందాము. కాని ఆ వెనుకటిరోజులన్నీ తలుచుగున్నప్పుడు హృదయం వుప్పొంగుతుంది. ఎంతసేపూ ఆ విషయాల్ని గురించి మాట్లాడాలని వుంటుంది." అని రజ్మటోన్నివు నవ్వుతూ కూర్చున్నాడు.

సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి 'స్టాలిన్' పేరు పెట్టడానికి. యేక గ్రీవంగా అంగీకరించడంతో సభ ముగిసింది.

* * * *

దేవిడోవు యింకా నగుల్నోవు యింట్లోనే వుంటున్నాడు. రాత్రులు అతను పడుకొనే బల్లకి, నగుల్నోవు దంపతులు పడుకొనే మంచానికి వొక చిన్న తెరమాత్రం అడ్డుగా వుంది. దాని ముందు గదిలో ఆ యింటి యజమాని, పిల్లలులేవి వొకవిధవ వుంటున్నారు. తనుకూడా అక్కడే వుండి మకార్‌కి యిబ్బంది కలుగచేస్తున్నానని దేవిడోవు యెరుగును. కాని అంతవరకు పనుల తొందరచేత, వేరే వొకయిల్లు తీసుకొనడానికి తీరుబడి లేకపోయింది. నగుల్నోవు భార్య లుకిరియా మొదటినుంచీ దేవిడోవుని అతిపరిచయంగా చూడ్డం మొదలెట్టింది. కాని అతనికి, లుకిరియా టిమోఫీతో తిరుగుతూందని తెలిసినప్పటినుంచి, ఆమెమీద ద్వేషభావం యేర్పడింది; వారితో వుండడానికి కూడా మనస్కరించిందికాదు. దేవిడోవు లుకిరియాతో మాట్లాడకపోయినప్పటికి, ఆమె కనబడినప్పుడుమాత్రం తల బిమూలగాపెట్టి తీవ్రంగా చూస్తుండేవాడు. ఆమె 25 యేళ్ళకంటె యెక్కువ వున్నదానిలా కనబడదు. ఆ నల్లటి కళ్ళు. తీర్చిదిద్దినట్లున్న కనుబొమలు, గుండ్రనిముఖము. మొత్తంమీద ఆమె అందంగానే వుంటుంది. ఎప్పుడూ కలకలలాడుతూ సరదాగా వుంటుంది. చిరునవ్వు తొణుకాడుతుండే ఆ పెదవులలోంచి తెల్లటి ముందరిపళ్ళు కనిపిస్తూనే వుంటాయి. నడకతీరులో కూడా అందం వుంది. వేషభాషల్లో మిగిలిన కోసక్కు స్త్రీలలాగే వున్నా వారికంటె కొంచెం శుభ్రంగాను, పొందికగాను వుంటుంది.

ఒకరోజు వుదయాన్నే దేవిడోవుకి తెరపక్కనే మకార్‌మాటలు వినబడ్డాయి. "నా జాకెట్టుజేబులో యేదోవుంది తీసుగో" అన్నాడు. సైమియన్ వూరికి వెడుతూంటే యేదో తెచ్చిపెట్టమన్నావుట; నిన్న సాయం

కాలం పూరినుంచి తిరిగివచ్చిన తరువాత నీకు యిమ్మని చెప్పి నాచేతి కిచ్చేడు."

"మకార్, నిజమే?" నిద్రమత్తు బాగా వదలని ఆమెస్వరం సంతోషంచేత వణికింది. ఆమె తొడుగుకొనిన ఆ షర్టుతోనే, పక్కమీదనుంచి వురికి గోడని వేళ్లాడుతున్న బొచ్చుజాకెట్టు అందుకుంది. ఆ జేబులోనుంచి, టేపు చుట్టబెట్టి కట్టే మామూలురకపు మేజోళ్లు కాక పట్నవాసపు స్త్రీలు ధరించే అందమైన కొత్తరకపు మేజోళ్ళు పైకితీసింది. దేవిదోవుకి యెదుట నున్న అద్దంలో ఆమె విగ్రహం స్పష్టంగా కనిపిస్తూంది. లుకిరియా వాటిని పరిశీలనగా చూస్తూ నిలబడింది. ఆమె చెక్కిళ్లు యెర్రబారడం, కళ్లు సంతోషాన్ని వెలిగ్రక్కుతూండడం. దేవిదోవు అద్దంలో చూసేడు. ఆ నల్లటి మేజోడు వొకటి తొడిగి, బిగువుగా, కాలికి సరిపోయియుండడం చూస్తూ సంతోషంతో దేవిదోవువైపు తిరిగింది. బొత్తాలు లేకపోవడంచేత షర్టు చెదిరిపోయి. యౌవనాన్ని వెలిగ్రక్కుతూ చలిస్తున్న ఆమె గుండెలు బయలుపడ్డాయి. అప్పుడే ఆమె వెనకనున్న దేవిదోవును చూసింది. ఎడమ చేతితో షర్టు రెండు అంచులు గుండెలమీదికి లాగిపట్టుకొని, నవ్వుతూ అతని కళ్ళలోకి చూసింది. "నేను యెంత అందంగా వున్నానో చూడు" అని ఆ కళ్లు ఆహ్వానించేయి.

దేవిదోవుసిగ్గుపడి బల్లమీద వెనక్కిపడి తెరచాటుకి మరుగుపడ్డాడు. బల్ల కిరకిరలాడింది. నుదురుమీదికి పడ్డ జుట్టు వేళ్ళతో వెనక్కి దువ్వుతూ "ఛీ! తనకేసి పరకాయించి చూస్తున్నాననుకుంటుంది. కొంపతీసి,-తనమీద కన్నేసేననుకుంటుందేమో" అనుకున్నాడు.

"పరాయి పెద్దమనుషుల దగ్గిర, వొంటిమీద బట్ట వుందోలేదో కూడ చూసుగోకుండా ఆ నిలబడడం బాగులేదు." మకార్ అసంతృప్తితో సణిగేడు. దేవిదోవు దగ్గు విని.

"ఆయనకి కనిపించదు." అని లుకిరియా జవాబు చెప్పింది.

"కనిపిస్తుంది." తెర వెనక దేవిడోవు మళ్ళీ దగ్గేడు.

"కనిపించేటట్లయితే, తనివితీరేలా చూసి సంతోషించండి" అని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పి షర్టు సవరించుకుంది. "మకార్ ! యిప్పుడు కొత్తవాళ్ళు యెవరూలేరు. ఒకరోజు రెండురోజులు కాని యెల్లకాలం అంతేనా !" ఆమె నవ్వుతూ వెళ్ళి పక్కమీద పడింది.

ఉదయం భోజనంఅయి దేవిడోవు, నగుల్నోవులు యిద్దరూ బయలుదేరేరు. ఇల్లు దాటగానే దేవిడోవు సంభాషణ ప్రారంభించేడు.

"మీభార్య ప్రవర్తన యేమీబాగులేదు."

"ఆ విషయంతో మీకు సంబంధంలేదు" నగుల్నోవు దేవిడోవు వైపు చూడకుండా మామూలుగానే సమాధానం చెప్పేడు.

"ఆ విషయంతో మీకు సంబంధం వుంది ! ఈపేళే నా బస యింకో చోటికి మార్చేస్తాను. ఆ ప్రవర్తన చూస్తే నాకు కొంచెం చిరాకుగావుంది. మీవంటివాళ్ళు ఆమెని యిష్టంవచ్చినట్లు తిరగనిచ్చి, నలుగురిలోను చులకన అవడం బాగులేదు. మీ నోటితో మీరు, ఆమె టిమోఫీతో తిరుగుతూందని చెప్పేరు."

"అయితే పట్టుకొని చావకొట్టమంటారా ?"

"కాదు. సన్మార్గానికి తిప్పడానికి ప్రయత్నించాలి ! ఇదిగో ! నేను కమ్యూనిస్టుని; మనస్సులో యెంతతోస్తే అంత, కుండ బద్దలు కొట్టినట్లు ముఖంమీద అనేస్తాను. అంతేకాని మనస్సులో పెట్టుకొని కుళ్ళేరకంకాదు. నేనేకనక అయినట్టయితే వొళ్ళట్టినన్ని కొట్టి, మళ్ళీ దాని ముఖంకేసికూడా చూడకుండా గెంటేసి వుందును. ఆమె ప్రజల యెదుట మిమ్మల్ని చులకన చేసి అపకీర్తిపాలు చేస్తుంటే, మీకు చీమకుట్టినట్లుకూడా లేదు; నోరు మూసుకొని చేతకానివానివలె చూస్తూ వూరుకున్నారు. ప్రతిరోజు రాత్రి అంత పొద్దుపోయేవరకు ఆమె యెక్కడికి వెడుతుంది ? మనం మీటింగు

నుంచి బాగా పొద్దుపోయి వచ్చేటప్పటికి కూడా యింటికి రావడంలేదు. ఏమైతే నాకెందుకు. మీ కుటుంబవిషయాలలో యింతటినుంచి నేను కలగ చేసుగోదల్చుగోలేదు........"

"మీకు పెళ్ళి అయిందా ?"

"లేదు పెళ్ళిచేసుకొని మీరు అనుభవిస్తున్న యీ సౌఖ్యం చూసిన తరువాత, చచ్చేవరకు ఎప్పుడూ పెళ్ళి చేసుగోకూడదనిపిస్తుంది."

"స్త్రీ పురుషుడి స్వంతఆస్తి అన్నట్లు మాట్లాడుతున్నారే."

"ఓహోహో ! పెద్ద అనార్కిస్టులా మాట్లాడుతున్నారే ! స్వంత ఆస్తి ! ఇప్పుడు కూడా స్వంతఆస్తి లేకుండా చెయ్యడం యెల్లాగ ? వెన కటివలెనే కుటుంబంకూడా వుంది యిప్పుడు. కాదూ ? కాని మీరు........ అర్థమైనవాళ్లు మీ భార్యవెనక చిత్తకార్తె కుక్కల్లా తిరుగుతుంటే........ సహనం అనే పేరుతో అవినీతి వ్యాపింపచేస్తున్నారు. పార్టీసమావేశంలో యీ విషయం తప్పకుండా చర్చకి పెడతాను. రైతులకి మార్గదర్శులైన మీవంటివారి కార్యాలకి హద్దు యేర్పరచాలి. అహా ! యెటువంటి ఆదర్శం."

"అయితే. వెళ్ళిపోయి చంపేస్తాను !"

"చాలా గొప్పపని చేస్తారు."

"అల్లా అయేటట్లయితే వినండి........యింక ఆ విషయం వొదిలె య్యండి, ప్రస్తుతం మటుకు." అంటూ మకార్ నడుస్తూ నడుస్తూ, అతా త్తుగ ఆగిపోయేడు. "నాకు యెల్లాతోస్తే అలాచేస్తాను; కాని యిదికాదు సమయం. ఇది యీవేళ, నిన్నటినుంచి జరుగుతున్నది కాదు; అది నాకు పరిపాటయిపోయింది........ కొద్దికాలం వోపికపట్టండి తరువాత చూద్దాం. దానిమీద నాకు విపరీతమైన ప్రేమ లేకపోతే చాలాకాలంక్రిందటే తగిన కట్టుదిట్టం చేసివుందును. ఎక్కడికి వెడుతున్నారు, సోవియటు ఆఫీసుకా ?" అని సంభాషణ మార్చేడు.

"కాదు. అస్త్రోవ్‌నోవ్ యింటికి వెడుతున్నాను. వాళ్ళయింటికి వెళ్ళి ఒక్కడ తీరుబడిగా మాట్లాడాలని తోచింది. అతను వ్యవసాయంలో చాలా నేర్పరి. సమిష్టివ్యవసాయ క్షేత్రానికి మేనేజరుగా యేర్పాటు చెయ్యాలని వుంది నాకు. యీ విషయంలో మీ వుద్దేశం యేమిటి? మన సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని అభివృద్ధిలోకి తీసుకురావాలంటే మంచి తెలివితేటలు, సమర్థత వున్నవాడిని మేనేజరుగా యేర్పాటు చెయ్యాలి. ఆ లక్షణాలన్నీ అస్త్రోవ్నోవులో వున్నాయి."

నగుల్నోవ్‌కి విపరీతమయిన కోపం కలిగింది.

"మీకు, ఆంద్రీకి, అస్త్రోవునోవు మీద యింతగురి యెందుకు యేర్పడిందో నాకు అర్థం కాకుండావుంది. నేను యెన్నడూకూడా అస్త్రోవునోవుని మేనేజరుగా చెయ్యడానికి అంగీకరించను. అతన్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి తరిమేస్తాను. రెండు సంవత్సరాలనుంచి అదనపు పన్ను కూడా కడుతున్నాడు. ద్రోహి! వాడిరోజులింకా దగ్గరకు రాలేదు; యుద్ధానికి పూర్వంనుంచీకూడా భాగ్యవంతుడుగా వున్నవానిని సమిష్టివ్యవసాయ క్షేత్రపు మేనేజరుగా చేస్తారా?"

"అతడు తెలివైన వ్యవసాయదారుడు. భాగ్యవంతుల తరఫున మాట్లాడుతున్నాననా మీ వుద్దేశ్యం?"

"తేనెపట్టు పిండినట్లు యెప్పటికప్పుడు పిండకుండా వున్నట్లయితే యీపాటికి గొప్ప భాగ్యవంతుడయి వుండేవాడు."

ఎంతసేపు మాట్లాడినా సమాధానానికి రాలేక వొకరిమీద వొకరికి అసంతృప్తితో విడిపోయేరు.

# పద్దానుగో ప్రకరణము

## మేనేజరు నియామకం.

చలికి నేలంతా రాయిలా బిగుసుకు పోయింది. స్టెప్పీలో పెద్ద పెద్ద సుడులు లేచి గాలిలో ఆడుతూ కళ్ళకి మిరుమిట్లు గొల్పుతూంది. గాలిచేత మంచు యెగిరిపోయినచోట్ల భూమి చలికి పెద్ద బీటలు తీసిపోయింది. నది గట్లమీదనున్న 'పాప్లార్' చెట్లు వెండిపూత పూసినట్లు మంచుతో తెల్లగా కనిపిస్తున్నాయి.

రాత్రి తెల్లవార్లు పశువులు దొడ్లల్లో తిరుగుతూనే వున్నాయి. తెల్లారేటప్పటికి పశువుల కొట్టాలు వొక్క గడ్డిపరక కూడా లేకుండా ఖాళీగా నాకేసినట్లున్నాయి. చలి యెక్కువగా వుండడంచేత గొర్రెపిల్లలు, మేక పిల్లలు యిళ్ళలోనే వుంటున్నాయి. రాత్రి నిద్రపోయేముందు ఆడవాళ్ళు వాటిని చంకబెట్టుకొని తల్లుల దగ్గరకు తీసుకొనివచ్చి పాలు తాగడం అయినతరువాత మళ్ళీ యిళ్ళల్లోకి తీసుకుపోతున్నారు. అర్థరాత్రులు నక్షత్రాలు మినుకు మినుకుమంటూ ఆ నిర్మలాకాశమూ, నిశ్శబ్దంగా చలనం లేకుండావున్న ఆ ప్రకృతీ చూస్తే ప్రపంచం నిర్జీవం అయిపోయిందా అనిపిస్తుంది. వుండి వుండి స్టెప్పీలో యెక్కడో తోడేలు అరుపుమాత్రం వినిపిస్తూంది.

ఆ నిశీథ నిశ్శబ్దంలో పాలు చేపువచ్చి, ఆడగుర్రం సకిలిస్తే ఆ ధ్వని అనేక మైళ్ళ దూరం వరకు వినిపిస్తూంది.

ఫిబ్రవరి నెల........

తెల్లవారుఝామున, నిర్మలమైన ఆకాశము, చలిచేత కొంకరించుకొనిపోయిన ప్రకృతీకూడ నిద్రపోతున్నాయి.

నిశీథం సూర్యుడు వస్తూన్నాడేమో అనే భయంతో వెల వెల పోతూంది.

ఇళ్ళ కిటికీ సందులలోనుంచి అప్పుడే వెలిగించిన నెగడు వెల్తుర్లు కనిపిస్తున్నాయి.

ఫిబ్రవరి నెల .........

ఇంకా తెల్లారలేదు. యాకోవులూకుచ్ యింట్లోవాళ్ళందర్నీ లేపేడు. ఆడవాళ్లు స్టౌ వెలిగించేరు. లూకుచ్ కొడుకు సైమియన్ కత్తులు పదును పెట్టేడు. కెప్టెన్ పొలోవిట్సేవ్ కాళ్ళనున్న పూలు మేజోళ్లు మీద చింకి గుడ్డలు దాగా చుట్టపెట్టి, వాటిపయిన ఫెల్టు బూట్లు తొడిగేడు. సైమియన్, అతడూ కలసి గొఱ్ఱెల దొడ్లోకి వెళ్ళేరు. యాకోవులూకుచ్‌కి మొత్తం 17 గొఱ్ఱెలూ, 2 మేకలూ వున్నాయి. వాటిలో చూడుతో వున్నవేవో యీనినవేవో సైమియన్‌కి బాగా గుర్తే. అతడు ఆ చీకట్లోనే పొట్టేళ్ళు, గొఱ్ఱెలు, మేకలు వేటికి వాటిని విడతీసి, వొక్కొక్కదాన్నే పట్టుకొని లాక్కొస్తున్నాడు. తెల్లటి టోపీ ముఖంమీదికి లాక్కొని సిద్ధంగా నిలబడి యున్న పొలోవిట్సేవు వొక పొట్టేలు కొమ్ములు పట్టుకొని క్రింద పడతోసేడు. మళ్ళీ పైకి లేవకుండా దానిని కాళ్ళతో తొక్కిపెట్టి, మెడలు వెనక్కి వంగతీసి కత్తితో కంఠంముడి కోసి చంపేసేడు.

యాకోవు లూకుచ్ వొక్క వ్యవసాయంలోనే కాక అన్ని విషయాలలోనూ కూడ గట్టివాడే. అతడు తన గొఱ్ఱెల మాంసం, బోల్షివికు సైనికులు కాని, పారిశ్రామిక కూలీలుకాని తినడానికి యిష్టపడలేదు. వాళ్ళంతా లూకుచ్‌మీద పన్నులు, అదనపు పన్నులు విధించి 10 సం॥ నుంచి అతను భాగ్యవంతుడవకుండా కృంగతీస్తున్న సోవియట్ ప్రభుత్వానికి మూలస్తంభాలు. సోవియట్ ప్రభుత్వము. 'యాకోవులూకుచ్'లు వొకరి కొకరు గర్భ శత్రువులు. దీపంచూస్తే పిల్లలు దాన్ని అందుకొన డానికి గబ గబ పాకినట్లు. యాకోవు అతని జీవితంలో వొక్క నిముషం కూడా వృథా చెయ్యక ధనంకూడ బెట్టడానికి పాకులాడేడు. విప్లవంనాటికి

ఆతని ఆశయాలు ఫలోన్ముఖానికి వచ్చేటట్లు కనిపించేయి. అతని కొడుకుని 'నొవోఛెర్కాస్' జంకర్సు స్కూలులో చదివించాలని అనుకొనేవాడు. చిన్న 'ఆయిల్‌మిల్' కొనాలనే వుద్దేశ్యముతో క్రమంగా డబ్బు కూడపెట్టడం మొదలెట్టేడు. నలుగురు కూలీలని పెట్టి వ్యవసాయం విరివిగా సాగించాలని కలలుగంటూ, ముందు తనకు కలుగబోయే పుష్కలస్థితిని తలుచుకొని ఆ సంతోషం పట్టలేక యెగిరి గంతులు వేసేవాడు. చిల్లర కొట్టు నొకదానిని పెట్టాలని, తరువాత యే దివాలాతీసిన కోసక్కు జమీందారు దగ్గరనుంచో చవుకగా వొకమిల్లు కొనాలని ఉవ్విళ్ళూరుచుండేవాడు. ఊహాప్రపంచంలో యాకోవు లూకుచ్ నిరంతర కృషిచేత మొద్దువారియున్న శరీరము, చవుకదారు కోసక్కు ట్రౌజర్లు, జాకట్లు తొడుగుకున్న తనని అందమైన నాజూకైన శరీరముమీద సిల్కు ట్రౌజర్లు, ఫెల్టుబూట్లు, తొడుగుకొని పొట్టమీద బంగారపు గొలుసు వ్రేలాడుతూ, సమస్త సౌఖ్యాలు అనుభవిస్తున్నట్లు చిత్రించుకొనేవాడు. అతని కొడుకు సైన్యములో కల్నల్‌గా పనిచేస్తూ చదువుకొనిన పెద్దకుటుంబములోని యువతిని పెళ్ళి చేసుకొంటాడు. అతనిని తీసుకొని రావడానికి యాకోవు లూకుచ్, సాధారణ బండీ కాకుండా మంచి ఖరీదయిన మోటారుకారునే తీసుకు వెడతాడు..................యాకోవు లూకుచ్ స్వప్నాలకి అంతే వుండేది కాదు. ఇంతలో విప్లవం వచ్చి దేశం అల్లకల్లోలమైపోయింది. కాని యాకోవు లూకుచ్ దానివల్ల నష్టపడలేదు. స్వతహాగా తెలివైనవాడు, జిత్తులమారి అవడంచేత అరాజకం వస్తుందని ముందే గ్రహించి, వెంటనే దీపం వుండగానే యిల్లు చక్కపెట్టుకున్నాడు. అతడు 1914 సం॥లో కొన్న ఆవిరియంత్రం అమ్మేసి మూడువందలరూబుళ్ళ బంగారం, వొక తొలుసంచినిండా వెండి కుండలోపెట్టి పాతేసేడు. పశువులు, గొర్రెలు మొదలైన జంతువులనన్నిటిని అమ్మేసి, తనకి కావలసినంత భూమి మాత్రం సేద్యంచేసి మిగిలింది బీడుగా వదిలేసేడు. అంతా సిద్ధంచేసుకొని

గుర్చున్నాడు. రెల్లుపొదల్లోంచి తుపాను వెళ్ళిపోయినట్లు విప్లవము, అంతర్యుద్ధము, కరువులు అతనిమీదనుంచి వెళ్ళిపోయేయి. తుపాను వస్తే మహావృక్షాలు వేళ్ళతో కూడా తెగి క్రింద కూలిపోతాయి. కాని రెల్లు మొక్కలు మాత్రం తుపాను వెళ్ళిపోగానే పైకి లేస్తుంది. కాని పాపం — యాకోవు లూకుచ్ మళ్ళీ పైకి లేవడానికి వీలులేకపోయింది. అందు చేతనే సోవియట్ ప్రభుత్వం అంటే అతనికి తీరని ద్వేషం. అతని పని పిట్టను పీకిని గిత్తమాదిరి అయిపోయింది. సంపదలు పోగుచేసే అవకాశాలు, వాటితోపాటు శరీరానికి మైకం కలిగించే ఆ సంతోషముకూడా పోయేయి. అందుచేత పొలోవిట్సేవు, అతనికి భార్యాపుత్రులు లందరికంటె కూడ సన్నిహితుడయ్యేడు. వీరైతే పొలోవిట్సేవు పక్షాన్ని జేరి సోవియట్ ప్రభుత్వాన్ని నాశనంజేసి జీవితాదర్శాన్ని సాధించాలి, లేదా యీ ఆస్తికూడా వదలి మామూలు కూలీలాగ జీవించాలి! ఈ రెండూ వదలి మూడో మార్గం యేదీలేదు. లూకుచ్‌కు మొదటి మార్గమే మంచిదని తోచింది.

అందుచేతనే యాకోవు లూకుచ్ 'స్టాలిన్' సమిష్టివ్యవసాయ క్షేత్రపు మేనేజిమెంటు కమిటీలో సభ్యుడై యుండియు 14 గొర్రెలని చంపేస్తున్నాడు. "ఆ కుక్క పొలోవిట్సేవు కాళ్ళదగ్గర రక్తం యెలా కతుకుతూందో! నా గొర్రెలనన్నిటిని చంపి యీ కుక్కకేనా పారేస్తాను కాని, వొక్క గొర్రెనికూడా సమిష్టివ్యవసాయ క్షేత్రానికి యిచ్చి, పెరిగి పిల్లల్ని పెట్టనిచ్చి సోవియట్ ప్రభుత్వానికి వుపయోగపడడానికి మాత్రం వొప్పుకోను." అనుకున్నాడు లూకుచ్. పొలోవిట్సేవు చెప్పిన ఆలోచన కూడా బాగుంది. "నువ్వు నీ పశువుల్ని చంపేసెయ్యి. బోల్షివిక్కులికి యేమీ అంకనియ్యకు. పశువులన్నీ సంరక్షణ లేక చావనీ; అధికారం మనచేతి లోకి వచ్చినతరవాత కావలసినన్ని సంపాదించుకోవచ్చు. అమెరికా, స్వీడను దేశాలనుంచి మేలుజాతి పశువుల్ని పంపిస్తారు. కనబడినవన్నీ నాశనంచేసి తిరుగుబాట్లుచేసి కమ్యూనిస్టులకి వూపిరాడకుండా చెయ్యాలి! యాకోవు లూకుచ్ చింతపిక్కలాంటి నీ గుర్రం పోతుందని విచారించకు.

గుర్రాలనన్నిటిని సమాజపరం చెయ్యడంకూడా వొకందుకు మంచిదే; వానివల్ల ముందుముందు మనకి సులువు, లాభము కూడ వుంది. మనం తిరుగుబాటుచేసి వొక గ్రామాన్ని స్వాధీనం చేసుకున్నప్పుడు యింటింటికి తిరిగి గుర్రాలను వెతకనక్కర లేకుండా, తిన్నగా సమిష్టి వ్యవసాయ క్షేత్రపు లాయాలలోకి వెళ్ళి గుర్రాలనన్నిటిని బయటకి తీసుకవచ్చి యెక్కి వెళ్ళిపోవడానికి వీలుగా వుంటుంది." ఓహో! యెంతటి ఆలోచన! ఇంతటి దూరాలోచనతో సలహా యిచ్చేవాడు లూకిచ్‌కి అయాచితంగా దొరికేడు.

పొలోవిట్సేవ్. సైమియన్ గొర్రెల్ని చంపి తోళ్ళు వొలుస్తుంటే లూకిచ్ పక్కని నిలబడి చూస్తున్నాడు. లాంతరు వెలుతురులో తెల్లటి గొర్రె చర్మం నిగనిగలాడుతూంది. వాళ్ళిద్దరూకలసి తోళ్లు సునాయాసంగా వొలిచేస్తున్నారు. తలక్రిందికి వ్రేలాడుతూ, చర్మం పొట్టవరకు తిరగతీసి లాగేసియున్న మొండెంవైపు పక్కనే క్రిందబడి దొర్లుతూన్న తలవైపు, చూసేటప్పటికి యాకోవు లూకిచ్ కాళ్ళు తడబడ్డాయి హఠాత్తుగా ఖాప్రోవు భార్య భయంతో వణుకుతూ నెమ్మదిగా "లూకిచ్! ఎందుకునన్ను యిలాగ బాధ పెడతారు? వదిలెయ్యండి." అనడం జ్ఞాపకం వచ్చింది, తోలు లాగేసినచోట నీలిగాను, యెర్రగాను కనిపిస్తున్న మాంసపు ముద్దలు, పైకి వుబికియున్న కండరాలతోను, భయంకరముగాయున్న గొర్రె మొండెమువైపు అయిష్టంతో చూసేడు. ఆ రక్తపువాసనకి మళ్ళీ వెనక వచ్చినట్లే వాంతి రాబోయింది.

"చూ... కళ్ళు తిరిగిపోతున్నాయి.........వాసనకి పేగులు కడుపులోనుంచీ......"అని నసుగుతూ బయటికి వెళ్ళిపోయేడు.

"ఇక్కడ నిలబడి యిదంతా చూడమని యెవరేనా బ్రతిమాలేరా నిన్ను? మేమిద్దరం చెయ్యగలం యీ పని!" పొలోవిట్సేవు నవ్వి, ఆ రక్తపు చేతులతోనే సిగరెట్టు తీసి వెలిగించేడు.

ఉదయం భోజనాల వేళకి అతికష్టంమీద ఆ పని పూర్తి అయింది. వొలిచిన తోళ్ళన్నీ చాటుగా గదిలో ఆరబెట్టారు. ఆడవాళ్ళిద్దరు బలిసిన గొర్రెమాంసం కూర తయారు చేసేరు ఉదయం భోజనానికి. పొలోవిట్సేవ్ గదిలోకి వెళ్ళి లోపల తాళం వేసుకున్నాడు. కేబేజి పులుసు, గొర్రెమాంసం కూర తీసుకువెళ్ళి అతని గదిలో పెట్టేరు. అతని భోజనం అయినతరువాత యాకబ్ కోడలు ప్లేట్లుతీసి గది బాగుచేసి బయటికి వచ్చింది. ఇంతలో బయట తలుపు తీసిన చప్పుడు వినబడింది.

"నాన్నా! దేవిదోవ్ వస్తున్నాడు!" అని సైమియన్ పరుగెత్తి వచ్చి తండ్రితో చెప్పేడు. యాకోవ్‌లూకుచ్ నిర్ఘాంతపోయేడు. కత్తి వేటువేసిన ముఖంలో రక్తపుచుక్క లేదు. దేవిదోవ్ పంచవార నిలబడి బూట్లమీది మంచు దులుపుకుంటున్నాడు. నిలబడి దగ్గి, పెద్ద పెద్ద అంగలు వేస్తూ వచ్చేడు.

"నా పని అయిపోయింది!" అనుకున్నాడు యాకోవ్ లూకుచ్.

పిశాచం ముండాకొడుకు యెలా నడుస్తున్నాడో! ప్రపంచం అంతా తనదే అయినట్లు! స్వంతయింట్లో మసలుతున్నట్టు. ఏమీ సందేహం లేదు. ఈ వేళతో నాపని ఆఖరు! నికీటా ఖ్రాప్రోవుని హత్య చేసినందుకు నన్ను అరెస్టు చెయ్యడానికి వస్తున్నాడనుకుంటా. ఆచోకీ తీసేడు; దొంగ లంజ కొడుకు!"

తలుపు తట్టిన చప్పుడు ఆ వెంటనే వొక కంఠస్వరం వినబడ్డాయి.

"లోపలికి రావచ్చా?"

"రండి!" అని యాకోవ్ లూకుచ్ అనబోయేడు. కాని నోటమాట రాలేదు.

దేవిదోవ్ వొక్క నిమిషం ఆగి తలుపు తెరిచేడు. లూకుచ్ బల్ల మీదనుంచి లేవలేదు.—లేచి నిలబడడానికి కాళ్లు స్వాధీనం తప్పేయి.

వణుకుతూన్న కాళ్ళబూట్ల మడమలు నేలకి తగిలి చప్పుడవకుండా పైకి కాళ్లు యెత్తవలసివచ్చింది.

"కామ్రేడ్ ! క్షేమమా?"

"కామ్రేడ్, తమరు క్షేమమా ?" లూకుచ్, అతని భార్యకూడ వొక్కసారిగా అన్నారు.

"మంచు విపరీతంగా కురుస్తూంది........"

"అవును, బాగా కురుస్తూంది."

"ఈ మంచువల్ల దేనికీ నష్టం లేదనుకుంటాను. నష్టం వుందంటారా ?" అంటూ దేవిడోవ్ జేబులో చెయ్యిపెట్టి వొక జేబురుమాలు పైకి తీసేడు. ఉతికి యెంతకాలం అయిందోకాని మాసిపోయి నల్లగా తోలులావుంది అది గుప్పెట్లో వుండచేసి దాల్లో చీదేడు.

"కామ్రేడ్ ! లోపలికి రండి" యాకోవు లూకుచ్ ఆహ్వానించేడు.

"ఈలాగ వున్నాడెందుచేత చెప్మా ?" ఆస్ట్రోవునోవు వాలకం అతని వణుకు చూసి దేవిడోవ్ ఆశ్చర్యపోయేడు.

"రై చేలకి నష్టం వుందంటారా ?" అని దేవిడోవ్ అడిగేడు.

"వాటికేమి నష్టం వుండకూడదు..............మంచు బాగా కప్పేసింది. గాలి దెబ్బకి మంచు యెగిరిపోయినచోట మాత్రం కొంచెం జబ్బుయిస్తుం............"

"నెమ్మదిగా యీ మాటా ఆమాటా మాట్లాడి, హఠాత్తుగా 'ఖ్రాపోవుని ఖూనీ చేసినందుకు నిన్ను అరెస్టు చేస్తాను.' అంటాడేమో ! బహుశా పొలోవిట్సేవు యిక్కడ వున్నట్లు తెలిసిందేమో. సోదా జరుగుతుంది !" అనుకున్నాడు. యాకోవు లూకుచ్ భయం వదలి ముఖం కొంచెం తెరిపిని పడింది. నుదుటిమీద చెమటపోసి దట్టంగా పెరిగిన గడ్డంలోకి జారుతూంది.

"అంతా కలిసి కొంచెం ఫలహారం తీసుకుందాం. రండి, ఆపైగదిలో కూర్చుందురుగాని."

"యాకోవ్ లూకుచ్! మీతో మాట్లాడడానికి వచ్చేను. మొన్నటి మీటింగులో సమిష్టి వ్యవసాయక్షేత్రంమీద మీరు చెప్పిన వుపన్యాసం చాలా బాగుంది. కాని వొక్క, 'లేబర్ ఆర్గనైజేషన్' విషయంలో మాత్రం మీరు కొంచెం పొరపాటుపడ్డారు. మిమ్మల్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మేనేజరుగా యేర్పాటు చెయ్యాలని అనుకుంటున్నాం. వ్యవసాయంలో మీకు చాలా నైపుణ్యము, అనుభవమూ వుందని విన్నాను."

"ఇల్లా నిలబడ్డారేమిటి! లోపలికి రండి. 'గషా'! 'టీ' సిద్ధం చెయ్యి, 'కేవేజిసూప్' మీకు ఇష్టమేనా? లేకపోతే పుచ్చకాయలు వున్నాయి. మీ యిష్టం రండి. మీకు తోచివచ్చేరుకాని, మీ యెత్తు బంగారం యిస్తేమాత్రం వస్తారా. ప్రజల్ని దరిద్రంలోనుంచి లేవనెత్తడానికి వచ్చిన మహాపురుషులు ......" యాకోవు సంతోషంతో వుక్కిరి బిక్కిరి అయిపోయేడు. నడ్డిమీదనుంచి పెద్ద బరువేదో దింపేసినట్లు అనిపించింది. నేను శాస్త్రీయ పద్ధతులమీద వ్యవసాయం చేయడం నిజమే. వ్యవసాయంలో వాళ్ళ తండ్రి తాత లందరి పద్ధతినే అనుసరించే యీ కోసక్కు లందరికీ నూతన మార్గాలు నేర్పాలి. వాళ్ళు యెలాగ దున్నుతారో చూడండి. నేలపైన గోకి డెల్లులు తిరగతీస్తారు! వ్యవసాయ శాఖవారు నాకొక 'సర్టిఫికేటు' యిచ్చేరు. సైమియన్! అద్దం కట్టించిన ఆ 'సర్టిఫికేటు' తీసుకురా. పోనీ, అవసరం లేకులే మేమే వెడతాం, అక్కడికి."

'సైమియన్'కి సైగచేసి యాకోవ్ లూకుచ్ దేవిడోవుతో కలిసి మిద్దెగదిలోకి వెళ్ళేడు. తండ్రి వుద్దేశ్యం గ్రహించి సైమియన్, పొలోవిట్సేవ్ వున్న గదికి తాళ్ళం వెయ్యడానికి వసారాలోకి వెళ్ళేడు. గదిలోకి తొంగిచూసి లోపల యెవరూ లేకపోవడానికి ఆశ్చర్యపోయేడు. అక్కడి

నుంచి సావిడ్లోకి వెళ్ళేడు. పొలోవిట్సీవు కాలి బూట్లు లేకుండా వొక్క పూలు మేజోళ్ళు మాత్రం తొడుగుకొని మిద్దెగదిలోకి వెళ్ళే గుమ్మంలో నిలబడి సందులోనుంచి తొంగి చూస్తున్నాడు. అతడు సైమియన్‌ని చూడగానే వెళ్ళిపొమ్మని సంజ్ఞచేసి తలుపుసందుదగ్గిర చెవి పెట్టి వింటు న్నాడు. "గుండెలు తీసిన బంటు" అనుకుంటూ సావిడి వదలి వెళ్ళి పోయేడు సైమియన్.

ఆ హాలు శీతకాలంలో వుపయోగించరు. ఒకమూల గంజాయి విత్తులు రాశి పోసి వున్నాయి. గుమ్మందగ్గిర ఆపిలుపళ్లు నిలువచేయబడ్డ పీపా పడివుంది. పొలోవిట్సీవు ఆ పీపా వంచమీద కూర్చున్నాడు. అక్కడ కూర్చుంటే దేవిడోవ్, యాకోవుల సంభాషణ బాగా వినిపిస్తుంది. చలిచేత పొలోవిట్సీవు కాళ్లు కొంకర్లు పోతున్నాయి. కదలకుండా కూర్చుని, తలుపు అవతల మాట్లాడుతూన్న దేవిడోవ్ మాటలు శ్రద్ధగా వింటున్నాడు. "అస్తమానూ వెధవ మీటింగుల గొడవే! వీలుంటేనా..........ఈ తక్షణం.........." పొలోవిట్సీవు పళ్ళు కొరుకుతూ గుప్పెళ్లు బిగించి గుండెలకి అదుముకొన్నాడు.

తలుపు అవతలనుంచి యీ మాటలు వినిపిస్తున్నాయి:

"కామ్రేడ్! అసలు కిటుకు అది. పూర్వంలాగే వ్యవసాయం చేస్తే లాభం లేదు. పంటలు యెలాగ పండుతున్నాయో చూసేరా! ఎకరం పుట్లు పండుతే గొప్ప. ఒక్కొక్కప్పుడు పండినపంట పెట్టుబడికే సరిపోవడం లేదు. మా చేలు చూడండి! మనిషి అడ్డపడితే కదలటానికికూడా వీలుండదు. చేలో నిలబడి చెయ్యెత్తుతే వెన్నులు అందకుండా యెదిగిన సంవత్సరాలు కూడా యెరుగుదును నేను. కురిసిన మంచు అంతా యెక్కడికీ పోకుండా చేలల్లోనిలకట్టడమే కారణం. అంతకంటె మరేమీలేదు. సూర్యాక్రాంతం మొక్కలు చలిమంట కాగడానికి వుపయోగిస్తాయని వేళ్ళలోకి

కోసేస్తే యెలాగ? వేసవిలో పిడకలుచేసి జాగ్రత్తపెట్టుకునే శ్రద్ధ వొక్కడికి కూడా లేదు. సోమరితనం బలిసి పోయింది. సూర్యాక్రాంతం పంటమాత్రం కోసుకుని మొక్కల్ని అట్టేపెట్టేస్తే కురిసిన మంచు అంతా యెక్కడికీ పోకుండా వాటిని అంటిపెట్టుకుని వుంటుందని, గాలి మంచుని యెగరకొట్టకుండా అడ్డుగాకూడ వుంటుందని కూడ వీళ్ళకి తెలియదు. అటువంటి భూమి వేసవికాలం దున్ని విత్తులుచల్లితే యెంత పంట పండమంటే అంత పంటా పండుతుంది. మంచు నిలగట్టకపోతే అదంతా వృధాగా పోయి, నేలకి సత్తువ వుండదు. మనకి పంట వుండదు."

"అవును మీరన్నమాట నిజమే."

"మన సోవియట్ ప్రభుత్వం నాకువూరికే యివ్వలేదు. సర్టిఫికేటు. గొప్ప చెప్పుకోడం కాదు కాని—వ్యవసాయంలో నాకు వున్న అనుభవం యీ చుట్టుపక్కల యెవరికీ లేదు. గవర్నమెంటు వ్యవసాయ నిపుణులు చెప్పేవాటిలో కూడ అక్కడక్కడ కొద్ది లోపాలున్నప్పటికీ, నేర్చుకోవలసినది చాలావుంది: నేను వ్యవసాయ విషయాల్ని గురించి వ్రాసే పత్రిక ఒకటి తెప్పిస్తున్నాను. అందులో వొకడు చేల నిండా మంచు లేకపోయినట్లయితే నేల బీటలుతీసి మొక్కల వేళ్ళన్నీ తెగి చచ్చిపోతాయనివ్రాసేడు."

"ఆ! అలాగా. ఈ సంగతి నేను యెప్పుడూ వినలేదు."

"అది అక్షరాలా నిజం. పరీక్షచేసి చూసేనుకూడాను. కొన్ని మొక్కలు తవ్విచూస్తే వాటి పిల్లవేళ్ళన్నీ తెగిపోయి వున్నాయి! ఆహారం తీసుకొనే వేళ్లు లేకపోతే మొక్క చావక యేంచేస్తుంది? రక్తనాళాలు కోసేస్తే మనిషి చావడూ? ఆలాగే మొక్కలు కూడాను."

"నిజమే యాకోవులూకుచ్, మీరు చెప్పేవాటిలో వొక్కటికూడ అసత్యం లేదు. చేలలో మంచు నిలకట్టాలి. వ్యవసాయ సంబంధమైన పత్రిక లేవో తెప్పిస్తున్నానన్నారు, అవి వొక్కసారి యియ్యండి. చదివి మళ్ళీ యిచ్చేస్తాను. ఇప్పుడు మీదగ్గర వున్నాయా?"

"అవి నీకు అక్కర్లేదు ఉపయోగించవు" అనుకున్నాడు పొలోవిట్సోవు. "వాటిని చదవడానికి నీకు వీలుండదు. నీ రోజులు దగ్గర పడ్డాయి." అతను తనలో తనే నవ్వుకున్నాడు.

"శీతకాలం బీళ్ళలో మంచు నిలకట్టడం యెల్లాగ?" యాకుబ్ మళ్ళీ మొదలెట్టేడు. "దానినికూడా ఆలోచించాను 'బ్రష్‌వుడ్' తో దడికట్టడం కంటె సులువైన పద్ధతి యేదీ కనిపించలేదు."

"సరేలెండి. మూడల పాకలు వెచ్చగా వుండడానికి యేం చెయ్యాలంటారు? చవకలో తేలిపోవాలి; తెలిసిందా?"

"దానికి పెద్ద ఆలోచన యేముంది? చుట్టూ దడికట్టి మట్టిపూత పూయించడం; లేకపోయినట్లయితే రెండువరసలని దడులుకట్టి ఆ ఖాళీలో యెండిన పేడ వెయ్యడం"

కాళ్ళు నొప్పి పట్టడంచేత సులువుగా కూర్చోడానికి పొలోవిట్సోవు కొంచెం కదిలేడు. అడుగున పీపా దొర్లిపోవడంచేత గభాలున కింద పడిపోయేడు.

"ఏదో పడినట్లు చప్పుడయింది. యేమిటది?" అన్నాడు దేవిడోవు.

"పిల్లి యేదో కింద పడతోసి వుంటుంది. శీతకాలంలో ఆ సావిడి ఉపయోగించం. ఆసావిట్లో గంజాయి విత్తులున్నాయి చూద్దురుగానిరండి."

పొలోవిట్సోవు గభాలునలేచి, తన గదిలోకి వున్న ద్వారం తెరిచి, లోపలికి వెళ్ళి తలుపు వేసేసుగున్నాడు. తలుపు గ్రంథులన్నిటిలోను నూనె వెయ్యడంచేత యేమీ చప్పుడవలేదు.

దేవిడోవు, ఆస్ట్రోవునోవు బాగా వుపయోగిస్తాడని సంతోషిస్తూ, పేపర్లకట్ట వొకటి చంకనిపెట్టి, యింట్లోనుంచి బయటికి వచ్చేడు. ఇల్లాంటి వాడు చేతిలో వుంటే గ్రామం గ్రామం అంతా సంవత్సరంలో మార్చెయ్యవచ్చు. కష్టపడి పనిచేస్తాడు. తెలివితేటలున్నాయి; పైగా చదువుకున్నవాడు.

మేనేజరు పదవికి తగినవాడు. మకార్ యితనిని అనుమానించవానికి కారణం తెలియకుండా వుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి వుపయోగిస్తాడు. సందేహం లేదు." అనుకుంటూ డేవిడోవు సోవియట్ ఆఫీసుకి వెళ్ళిపోయేడు.



## పదిహేనో ప్రకరణము

### జంతు వధ.

యాకోవు లూకుచ్ ప్రోత్సాహంచేత, గ్రిమాచీలాగ్‌లో ప్రతివాళ్లు రాత్రులందు రహస్యంగా పశువులు, గొర్రెలు, పందులు, కోళ్ళు మొదలైన వాటినన్నిటిని చంపడం ప్రారంభించేరు. చీకటి పడ్డదిమొదలు తెల్లారేవరకు రాత్రి అంతా యేదో వొకదాని అరుపు వినిపిస్తూనే వుంది. వీరు, వారు అని భేదం లేకుండా సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాళ్లు, చేరనివాళ్ళు కూడ చంపుతూనే యున్నారు. గొర్రెలు, పందులు మొదలయిన వాటినే గాక పాడి పశువుల్ని, యెడ్లనికూడ చంపేస్తున్నారు. రెండు రోజుల్లో గ్రిమాచీలాగ్‌లోని సగం పశువులు నశించేయి. పేగులు, యెముకలు, నోట కరచుకొనిపోతున్న కుక్కలే యెక్కడ చూసినా. 18 నెలల నుంచి కోఆపరేటివ్ స్టోర్సులో పడియున్న 50 బస్తాల వుప్పు యీ రెండు రోజుల లోను ఖర్చయిపోయింది. "మనవి కావు, చంపెయ్యండి." "చంపక అట్టే పెడితే మాంసపు పన్ను పేరుచెప్పి యెల్లాగా తీసుకు పోతారు వీటినన్నిటిని." "సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరిన తరువాత మాంసం దొరకదు. కడుపునిండా తినండి" అనుకొనేవాళ్ళే యెవర్ని చూసినా. చిన్న పిల్లలు మొదలు ముసలివాళ్ళ వరకూ ప్రతివాళ్ళు పొట్టలు విచ్చేలా తిన్నారు

మాంసం. పండుగులలోను, చచ్చిపోయినవాళ్ళ ఆత్మశాంతి రోజులలోను తిన్నట్లు తెగతిని కడుపు నొప్పిచేత బాధ పడ్డారు.

ఘూకర్ తన ఆవుమాడని మొదటిరోజురాత్రే చంపేసేడు. దూలానికి వేళ్ళాడతీస్తే చర్మం సులువుగా తీసెయ్య వచ్చునని భార్య, అతడు కలసి ఆశవానికి తాడుపోసి వేళ్ళాడతియ్యడానికి ప్రయత్నించేరు. బాగా బలిసిన ఆ మాడని యెత్తడంలో ఘూకర్ భార్యనడుము బెణకడంచేత వారం రోజులవరకు 'మమచికా' చేత నడ్డి తోమించుకొనవలసి వచ్చింది. భార్య నడ్డి బెణకడంచేత ఆమరునాడు ఘూకర్‌కి వంట తప్పిందికాదు. ఆశచేత ఆ మాంసం తెగతిన్నాడు. దానితో అజీర్ణంచేసి కడుపుబ్బి బాధపడుతూ 24 గంటలూ పొద్దో సూర్యక్రాంత మొక్కలలోనే కూర్చుని వుండేవాడు. అతని యింటిప్రక్కనుంచి వెళ్ళేవాళ్లు యెప్పుడుచూసినా ఘూకర్ టోపీ ఆ సూర్యక్రాంత మొక్కలలో కదలిక లేకుండా అల్లా కనిపిస్తూనే వుండేది. ఉండి ఉండి ఘూకరు అరాత్తుగాలేచి బాధతో మూలుగుతూ, వీధివైపేనా చూడకుండా యింట్లోకి వెడుతూండేవాడు. కాళ్ళు యీడ్చుకుంటూ నెమ్మదిగా గుమ్మంవరకూ వెళ్ళి, అక్కడ యేదో జ్ఞప్తికి వచ్చినట్లు అరాత్తుగా వెనక తిరిగి మళ్ళీ సూర్యక్రాంత మొక్కలలోకి వచ్చి కూర్చునేవాడు.

ప్రజలంతా పశువుల్ని చంపేస్తున్నసంగతి రజ్మటోన్నోవుకి రెండవ రోజు సాయంత్రం తెలిసింది. వెంటనే అతడు దేవిడోవు బసకి పరుగెత్తేడు.

"సావకాశంగా కూర్చున్నారా?" అని అడిగేడు.

"చదువుకుంటున్నాను." చేతిలోనున్న చిన్న పచ్చఅట్ట పుస్తకం పేజీ తిరగేస్తూ దేవిడోవు చిరునవ్వు నవ్వేడు. "ఈపుస్తకంచదువుతూ కూర్చుంటే యింకతిండికూడా అక్కర్లేదు." అతడు తొస్సికనిపించేలా పకపకానవ్వేడు.

"నవలలు చదువుతున్నారా? అవతల గ్రామం అంతా........"

"నవలా యిది? మతిలేదా యేమిటి!" దేవిదోవు విరగబడి నవ్వుతూ రజ్మటోన్నొవుని తనకియెదురుగా బల్లమీద కూర్చోపెట్టి ఆపుస్తకం అతని చేతికి యిచ్చేడు. ఇది రాష్ట్రోవు పార్టీకమిటీ సభ్యులకి ఆంద్రీవు యిచ్చిన రిపోర్టు. పెధవ నవలలు దీనిముందు యెందుకు పనికివస్తాయి! నిజం! యేమీ తోచక పుస్తక చదవడం మొదలెట్టేను. అంతే; ఆ ధోరణిలో ఆకలి కూడా మరచిపోయేను. చాలా చలిగా వుందే!" అతడు జేబుల్లో చేతులు పెట్టి వంట యింట్లోకి వెళ్ళేడు.

"నేను చెప్పేది వింటారా, వినరా?" రజ్మటోన్నొవు కోపముతో గట్టిగా అడిగేడు.

"ఆ–యిదిగో వస్తున్నా! ఒక్క నిముషం."

వంట యింట్లోనుంచి 'కేబేజి సూప్' మూకుడు చేత పట్టుకొనివచ్చి కూర్చున్నాడు రజ్మటోన్నొవు కేసిచూస్తూ పెద్ద రొట్టెముక్క నోటితోకొరికి నమలడం ప్రారంభించేడు. మూకుడులోనున్న 'కేబేజిసూపు' లో పచ్చగా తేలుతూన్న గొర్రె మాంసపు కొవ్వు, యెర్రగానున్న మాంసపు ముక్కలు కనిపిస్తున్నాయి.

"సూప్ లో మాంసం వేసేరా యేమిటి?" ఆంద్రీ మూకుడుకేసి చూపిస్తూ అడిగేడు.

ఉక్కిరిబిక్కిరి అయేటట్లు నోటినిండా రొట్టె వుండడంచేత, మాట్లాడడానికి వీలులేక బుర్ర వూపేడు, దేవిదోవు.

"మాంసం యెక్కడిది?"

"నాకు తెలియదు; కాని యెక్కడిది అయితే మన కెందుకు?"

"వాళ్ళు అప్పుడే గ్రామంలోని సగం జంతువుల్ని పైగా పంపేసేరు"

"ఎవరు?" దేవిడోవు యింకొక రొట్టెముక్క విరిచేడు.

"ఇంకా యెవరని అడుగుతున్నారా? సమిష్టి వ్యవసాయ క్షేత్రపు చైర్‌మన్! యీ లోకంలో లేరా మీరు? మీ సమిష్టి వ్యవసాయ క్షేత్రపు రైతులు వారి పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు. వాళ్ళే కాదు. గ్రామం లోని రైతులందరూను! క్రిందు, మీకు తెలియక రక్తం చవిచూసిన పెద్ద పులుల్లా యెడ్లనికూడా చంపేస్తున్నారు."

"మీటింగులో మాట్లాడుతూన్నట్లు అంత గట్టిగా అరుస్తారెందుకు? అదో దురలవాటు." దేవిడోవు రొట్టె, సూప్ కలిపి నోట్లో వేసుగున్నాడు. "జరిగినదంతా నెమ్మదిగా చెప్పండి, యెవరు చంపుతూన్నదీ, యెందుకు చంపుతూన్నదీ"

"ఎందుకు చంపుతున్నారో నేనెల్లా చెప్పగలను?"

"అనవసరంగా అరుస్తూ చప్పట్లు చరుస్తారు. నేను కళ్ళు మూసుకుని 1919 నాటి ఆ వెనుకటి సంగతులన్నీ శాంతముగా జ్ఞప్తికి తెచ్చుకోగలను."

"ఇంకొక నిమిషానికి మీరుకూడా అరవడం మొదలెడతారు."

రజ్మట్నోవు తనకు తెలిసినంతవరకూ, ప్రజలు జంతువుల్ని చంపడంవిషయం తెలియజేసేడు. దేవిడోవు క్రమంగా రొట్టె నమలకుండానే తినెయ్యడం మొదలెట్టేడు. అతనిలో పరిహాసభావం పోయింది.

"వెంటనే వెళ్ళి 'జనరల్ మీటింగు' జరుగుతుందని ప్రజలకందరికి తెలియ చెయ్యండి" అని ఆజ్ఞాపించేడు. "నగుల్నోవుని యిక్కడికి.... ....పోనీలెండి. నేనే వెడతాను అక్కడికి."

"జనరల్ మీటింగు దేనికి?"

"ఎందుకా? జంతువుల్ని చంపకూడదని తెలియచెయ్యడానికి. అటువంటివాళ్ళ సభ్యత్వాలు రద్దుచేసి, కేసులు పెడదాం. చూసీచూడనట్లు వది

చెయ్యవలసిన విషయం కాదిది. ఇదంతా కులకల ప్రోత్సాహం. ఈ సిగరెట్టు తీసుకొని కాల్చి చూడండి. ఇందాకటినుంచి యీ విషయం మరచిపోయేను. చూసేరా," దేవిదోవ పెదవులమీద చిరునవ్వు తళుక్కుమంది. కళ్లు సంతోషాన్ని వెలిగక్కుతున్నాయి. అతడు పెదవులు కదల్చకపోయినా, సంతోషం ముఖంలో తాండవం ఆడుతూనేవుంది.

"ఈ రోజునసనే, నాకు లెనిన్ గ్రాడు నుంచి బంగీవొకటి వచ్చింది. స్నేహితులు పంపేరు........" వుత్సాహంచేత ఎర్రబడ్డ ముఖంతో వంగి, మంచం కిందనుంచి, చిన్నపెట్టివొకటి యివతలకి లాగి మూత తెరిచేడు. సిగరెట్టు పెట్టెలు, బిస్కట్టు ప్యాకట్లు, చక్కపని చేసిన సిగరెట్టు కేసు, ఇంకా అనేక వస్తువులు చిందరవందరగా పడివున్నాయి.

కామ్రేడ్సు నన్ను మరిచిపోలేదు. చూడండి, యెన్ని వస్తువులు పంపించారో..........ఇవి లెనిన్‌గ్రాడ్ సిగరెట్లు. చాకలెట్లు కూడా పంపేరు. చూసేరా, నాకు యెందుకు అవి? ఏవరికేనా పిల్లలకి పంచిపెట్టేస్తాను........ కాని అదికాదు విషయం, అసలు మనకి పంపించేరు, అదీ మనం చూడవలసింది. ఏమంటాడు, అంతేనా, జ్ఞాపకార్థం యీ వస్తువులన్నీ పంపుతూ వాటితో వొక పుత్తరం కూడా పంపేరు.... .. ...."

దేవిదోవ కంఠస్వరంలో యెన్నడూలేని నెమ్మది తొణుకాడుతూంది. ఆంద్రీ శాంతము, సంతోషము మూర్తిభవించియున్న యీ కామ్రేడ్ దేవిదోవ్‌ని యిదివరకు చూడలేదు. దేవిదోవ తత్తరపాటంతా రజ్మత్నోవ్‌ని ఆవహించింది.

"సరే, బాగానేవుంది. మీరు చాలా గొప్పవాళ్ళు. అందుచేతనే మీ స్నేహితులు యివి అన్నీ పంపించేరు. కాని యివిఅన్నీ కలసి వొక రూబులు' ఖరీదేనా వుంటాయా?"

"ఖరీదు యెంత అని కాదు మనం చూడవలసినది. నేనున్నాను చూసేరా, తల్లి, తండ్రి, భార్య, పిల్లలు లేని యేకాకిని. ఇప్పుడు యీ పార్శిలు వచ్చింది చూడండి! యెంత సంతోషంగా వుంటుంది? ఈ వుత్తరంమీద యెంతమంది సంతకాలు చేసేరో చూడండి." దేవిదోవు వొకచేతితో సిగరెట్టు పెట్టితీసి రెండవ చేతితో అనేక సంతకాలు వున్న వొక వుత్తరం పట్టుకున్నాడు. అతని చేతులు వణికేయి.

రజ్మబోన్లోవు లెనిన్‌గ్రాడు సిగరెట్టు వెలిగించి యిల్లా అడిగేడు.

"ఈ బస వీలుగా వుందా? ఇంటి యజమానురాలు మంచిదే అనుకుంటాను, కామా? గుడ్డలు వుతగడం యేం చేస్తున్నారు? మా యింటికి తీసుకువచ్చి పడెయ్యండి. మా అమ్మ వుతికిపెడుతూంటుంది. లేకపోయినట్లయితే యిక్కడివాళ్ళని యెవరినేనా యేర్పాటుచేసుకోండి. మీరు తొడిగిన ఆ షర్టు చూడండి. గొడ్డుతోలులా యెలావుందో. అంటించినా అంటుగోదు."

దేవిదోవు ముఖం యెర్రబడింది.

"అవును, యేదో చూడాలి. నగుర్నోవు యింట్లో వున్నంతకాలమూ యేమి చెయ్యడానికీ కూడా వీలులేకపోయింది. చిరిగిపోయిన బట్టలు కుట్టుకొనడం, వుతగడంకూడా నేనే చేసుగుంటూండేవాడిని. యిక్కడికి వచ్చినప్పటినుంచి వొక్కసారికూడా సబ్బుపట్టించి బట్టలు శుభ్రంగా వుతుగుకోలేదు. అందుచేతనే యిల్లా వున్నాయి............ఈ వూళ్ళో కొట్లలో యెక్కడా సబ్బు దొరకలేదు. ఈ పక్కని వున్న ఒకామె నడుగుతే, ఆమె 'సబ్బు యివ్వండి, వుతిగిపెడతాను' అంది. బట్టల సబ్బు పంపించమని లెనిన్ గ్రాడ్‌లో మా స్నేహితులకు వుత్తరం వ్రాయాలి. ఈ బస అంత పాడుగాలేదు. పిల్లల గొడవ యేమీలేదు. స్థిమితంగా కూర్చుని చదువుకోడానికి వీలుగానే వుంది........"

"మీ బట్టలు మా అమ్మకి యివ్వండి. ఆవిడ పుతుకుతుంది. మొగ మాట పడకండి. మా అమ్మ చాలా మంచిది."

"ఏదో వొకటి చేస్తాను. మీరు వ్యసనపడకండి. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి మంచి స్నానాలయిల్లు వొకటి కట్టించాలండి, బాగుండదు? కొద్దిరోజులలో చూడాలి. ముందు మీరువెళ్ళి మీటింగువిషయం చూడండి. వెనక నేనుకూడా వచ్చేస్తున్నాను."

రజ్మట్నోవు సిగరెట్టు పూర్తిచేసి వెళ్ళిపోయేడు. డేవిడోవు కొంత సేపు పెట్టిలో వస్తువులు యిక్కడవి అక్కడ, అక్కడవి యిక్కడ సర్ది వొక్క నిట్టూర్పు విడిచేడు. తరువాత బూడిదరంగు 'స్వెట్టరు' కాలరు సరిచేసి, చెదిరియున్న నల్లటి జుట్టు దువ్వుకొని బయటికి వెళ్ళడానికి సిద్ధమయేడు.

దోవలో నగుల్నోవు యింటిదగ్గర ఆగి అతనిని కేకేసేడు. నగుల్నోవు కనుబొమలు ముడేసి అతనినుంచి దృష్టి తప్పించి చూస్తూ బయటికి వచ్చేడు.

కుశల ప్రశ్నలు అయిన తరువాత డేవిడోవు, "ప్రజలు పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు." అన్నాడు.

"ఒక్కడికి కూడా పట్టుమని పదిరూపాయిల ఆస్తిలేదు. ఇంతోటి ఆస్తి ప్రభుత్వానికి వశపరచవలసి వస్తుందేమోనని యీ అడావిడి అంతా. మధ్యతరగతి ప్రజలు పడుతున్న ఆందోళనకి అంతేలేదు." నగుల్నోవు భార్య వైపు తిరిగి "లుకిరియా! నువ్వు యిక్కడ వుండకు. వెళ్ళి యీ యింటి ఆవిడ దగ్గర కూర్చో" అన్నాడు.

లుకిరియా విచారంతో యింట్లోకి వెళ్ళిపోయింది. గ్రిమాచీలోని భాగ్యవంతు లందరితోబాటు, టిమోఫీకూడ ప్రవాసానికి వెళ్ళినప్పటినుంచి, ఆమె విచారంగానే వుంటూంది. ఎప్పుడూ కలకలలాడే ఆమెలో ఆ వెనకటి సంతోషమే లేదు. టిమోఫీ వియోగం సహించలేక క్రుంగిపోతూంది!

వాడు వూరు వదలి వెళ్ళిపోతూంటే నడివీధిలో, అందరూ చూస్తూంటే సిగ్గేనా లేకుండా వాడికోసం గోల పెట్టావు. ఇంకా వోర్పు వహించి వుండడం నా చేతకాదు; ఇంతవరకూ నా మెడకి గుదిబండలా వున్నావు. ఈ అనవసరపు బరువెందుకు? తోసి పారేస్తాను. తెలిసిందా?" అన్నాడు.

"ఆ తెలిసింది." అని చెప్పి వూరుకుంది లుకిరియా.

ఆ రోజు సాయంకాలం నగుల్నోవు దేవిడోవులు యీ విషయాన్నిగురించి రహస్యంగా మాట్లాడుకున్నారు.

"మకార్! మీ భార్య దుర్నడత అంతకంతకి మితిమీరుతూందే! నిన్న యేమిచేసిందో చూసేరా! ప్రజలలో తల యెత్తుకొని తిరగగలరా మీరు?" అని నిలవతీసి అడిగేడు దేవిడోవు.

"మళ్ళీ ఆ వెనకటి గొడవలన్నీ........"

"ఛీ! వెర్రిమొద్దు! యింతకంటె చిన్నపోతయినా నయం." దేవిడోవు ముఖం యెర్రబడింది. నుదురుమీది రక్తనాళాలు వుబ్బొంగేయి.

"మీతో మాట్లాడడం కష్టం." నగుల్నోవు గదిలో పచారు చేస్తూ వేళ్ల మెటికలు విరిచి తనలో తనే నవ్వుకున్నాడు. " 'అరిన్కాక్రాస్టు ట్రాట్స్కీయిస్టు. నిలకడ లేనివాడు.' అని తిట్టడంతో మాట్లాడటం ప్రారంభిస్తారు. నా భార్యమీద నాకు యెటువంటి వుద్దేశ్యం వుందో, యింత అపకీర్తి సహించి యెందుకు వూరుకుంటున్నానో మీకు తెలుసును. నా మనస్సు మారిపోయిందని మీకు చెప్పనే చెప్పేను. మీకు యెప్పుడయినా గొర్రె తోకచూస్తే ఆశ్చర్యం కలిగిందా?"

"లేదు." దేవిడోవు నెమ్మదిగా సమాధానం చెప్పేడు. నగుల్నోవు సంభాషణ మార్చేసి అర్థంలేని ప్రశ్నలు వెయ్యడంచూసి ఆశ్చర్యం కలిగింది.

"నాకు మాత్రం ఆశ్చర్యం కలిగింది. గొర్రెకి తోక వుపయోగం ఏమి వుందా అని. అదనపు బరువు తప్ప యేమీ లాభంలేదు. ఎద్దు, గుర్రం

ఆఖరుకి ముక్కకూడా దాని తోకవల్ల కొద్దిగానయినా వుపకారం పొందు తూంది. గొర్రెకి 8 పౌన్ల బరువయిన తోక యిటు అటు ఆడించడానికి తప్ప యీగల్ని తోలుకొనడానికి కూడ వుపయోగించదు. ఉపయోగం లేక పోవడం సరేకదా పైగా దానినిండా బుద్ధగుణుజులు దూరి పీకుతూంటే బాధగాకూడా వుంటుంది."

"ఈ తోకల్ని గురించి యీ వుపన్యాసం యెందుకు?" అన్నాడు దేవిడోవు.

నగుల్నోవు సమాధానం చెప్పకుండా మళ్ళీ ప్రారంభించేడు.

"గొర్రెకి తోకలేని కొరత తీర్చడానికి పెట్టినట్టు తోస్తుంది ఆ మొంపి ముక్క. అది అనుపయోగమేకాని దానిబదులు అక్కడ యింకొకటి యేమి పెడతాము? గొర్రెకి తోక అనుపయోగమైనట్లే, నా భార్యకూడా నాకు అనుపయోగం. నేను ప్రపంచ విప్లవంకోసం యెదురు చూస్తున్నాను: అదే నా జీవిత పరమావధి. నా భార్య తినడానికేకాని యింక యెందుకూ పనికిరాదు. నా దోవకి అడ్డుకూడాను. కాని ఆడది లేనిదే అసలే సాగదు. నేనూ మనుష్యుడనే. జబ్బుచేస్తే చాకిరీ చెయ్యడానికీ, యింకా యితర అవసరాలు తీర్చడానికీ వుపయోగిస్తుంది. నేను కనక తృప్తి పరచలేకపోయి నట్లయితే వెళ్ళిపోవచ్చు! ఒకసారి ఆమెతో 'నువ్వు నీ యిష్టం వచ్చిన వాళ్ళతో తిరగవచ్చు. నా అభ్యంతరం లేదు: కాని నా కళ్ళయెదుట కాకుండా రహస్యంగా వుంటూండు. అంతేకాని నీ యిష్టం వచ్చినట్లు అడ్డమైన వాళ్ళతోనూ తిరిగి ఆ ఆనవాళ్ళతో నా దగ్గరకి వచ్చేవంటే మాత్రం వొళ్లు వొలిచేస్తాను. జాగ్రత్త' అన్నాను. కామ్రేడ్ దేవిడోవు! ఈ గొడవలన్నీ మీకు తెలియవు. నా భార్య చెడు ప్రవర్తనకి నేను యేమి చెయ్యగలను? అది మన యిద్దరికీకూడ సమాధానం చెప్పగలదు. కూలీవర్గానికి శత్రువైన వొక భాగ్యవంతునితో తిరగడమే కాకుండా, వాడు వెళ్ళిపోతుంటే సిగ్గేనా లేకుండా యేడ్చిన దీనిని యెవరు అడ్డ

వచ్చినా సరే నా యింట్లోనుంచి తరిమెయ్యక మానను. ఎటువంటి పని చేసినా కొట్టడానికిమాత్రం నా మనస్సు వొప్పదు. మీరే కనక అయిన ట్లయితే బాపకొట్టి వుండరు కామా? ఆటువంటప్పుడు కమ్యూనిస్టునని చెప్పుకొనే మీకు, పూర్వికాలపు వాళ్ళకి యేమి తేడావుంది? పూర్వపువాళ్లు బానిసలను ఉప్పుమూటలా కొనుక్కొందేవారు. విషయం యిది. మీరు యింక నుంచి ఇటువంటి మాట యెన్నడూ నావగ్గర యెత్తకండి. ఆటువంటి విష యాలలో యొకరి సలహా నాకు అవసరం లేదు. భార్య చాలాతీవ్ర సమస్య. దానికి ఆమె మీద ఆధారపడి వుంటుంది." నగుల్స్కి పరధ్యాన్నంగా చెప్పేడు. మళ్ళీ తీవ్రంగా మాట్లాడడం మొదలెట్టేడు. "ఈదేశ సరిహ ద్దులు తీసి పారెయ్యనియ్యండి: అప్పుడు అందరికంటె ముందుగా నేనే విదేశ స్త్రీలను మీ యిష్టం వచ్చినవాళ్ళని పెళ్ళి చేసుకోనండి. అని బయలు దేరుతాను. అప్పుడు ప్రపంచములోని యీ వేర్వేరు జాతులన్నీ కలిసిపోయి వొకడు తెలుపు, యింకొకడు పసుపు, మరియొకడు నలుపు అనుభేదము, తెల్ల జాతివాడు మిగిలిన వాళ్ళకంటె గొప్పవాడనుకొనే అహంభావము నశించి పోతాయి. ప్రతివాళ్ళు యెండలో శ్రమపడి పనిచేయడంజేత బలిష్ఠ ములైన వొకేరంగు శరీరాలతో వుంటారు; రాత్రులు సాధారణంగా యిలాగ ఆలోచిస్తూ యుంటాను........"

"మకార్! మీరు కల్పనా ప్రపంచంలో విహరిస్తుంటారు." దేవి దోవ్ అసంతృప్తితో అన్నాడు. మిమ్మల్ని నేను అనేక విషయాల్లో అర్థం చేసుగోలేకుండా యున్నాను. జాతి విభేదాలు........అది నిజమే నను కోండి. కాని మిగిలిన విషయాలు........ Problems of existence లో మాత్రం మీతో యేకీభవించలేను. సరే ఆ విషయాలన్నీ మనకెందుకు? ప్రస్తుత విషయం చూద్దాం. ఈ వేళనుంచి మీ యింట్లో మకాం యెత్తేస్తు న్నాను."

దేవిదోవ్ బల్లకిందనున్న సూట్‌కేసు యువతులకి లాగేడు. వాట్లో వున్న పనిముట్లు గలగలలాడుతూంటే ఆ పెట్టె తీసుకొని బయటికి వెళ్ళి పోయేడు. నగుల్నోవ్ అలనిపోగూడా కొత్తగా తీసికొన్న జన ఫీవెమో నోవ్ యింటికి వెళ్ళేడు. అక్కడికి వెళ్ళేటప్పుడు వాడు కొంకచివ్వరికలను గురించి మాట్లాడుకున్నారు. ఏడిమోటు వారి పరస్పర సంబంధాలలో యే పేచీ లేకుండా సాఫీగా గడపడం ప్రారంభమయింది.

అందుచేతనే దేవిదోవ్ గ్రామస్థులు పశువుల్ని చంపుతున్నారని చెప్పడానికి వచ్చినప్పుడు నగుల్నోవ్ ఎనభాల్య రోజులు వ్యాపోయిన తరువాత సరదాగా మాట్లాడడం మొదలెట్టేడు.

"పశువుల్ని అన్నిటిని చంపేస్తున్నారు, ద్రోహులు!" అన్నాడు నగుల్నోవ్. వాళ్ల మాంసం తెగతిని కడుపు నొప్పిలోనైనా బాధ పడడానికి అంగీకరిస్తారు కాని, పశువుల్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి యివ్వడానికి మాత్రం అంగీకరించరు. మనం వొక సమావేశం యేర్పాటుచేసి ఆసభలో 'పశువుల్ని చంపేవారిని కాల్చి చంపడానికి అనుమతి యివ్వవలసిందని' వొక రిజల్యూషను ప్యాసు చేద్దాం."

"ఏమిటీ?"

"కాల్చి పారేద్దాం. వాళ్ళని కాల్చి పారెయ్యడానికి యెవరి అనుమతి తీసుకోవాలి? పీపుల్సు కోర్టుకి అధికారం లేదనుకుంటాను. ఉందా? ఇద్దర్ని కనక చంపినట్లయితే, మిగిలినవాళ్లు కళ్ళుతెరచి దోవకి వస్తారు. ఇటువంటి పరిస్థితులలో మనం యేమి దయా దాక్షిణ్యాలు లేకుండా కౄరంగా ప్రవర్తించాలి "

దేవిడోవ్ నెత్తిమీది టోపీ బల్లమీద పడేసి గదిలో పచారు చెయ్యడం మొదలెట్టేడు. అతని కంఠస్వరంలో అసంతృప్తి, అనిశ్చయము ప్రతిఫలిస్తున్నాయి.

"మళ్ళీ మీరు తప్పు దోవ తొక్కుతున్నారు. అది వట్టి దుడుకు తనం అనిపిస్తుంది. మకార్! మళ్ళీ ఆలోచించి చూడండి. ప్రజలు వాళ్ళ పశువుల్ని చంపుకుంటే మీరు నిజంగా వాళ్ళని కాల్చి చంపగలరా? అటు వంటిపనిచేస్తే సమర్థించుకోడానికి మనకేమీ చట్టాలు లేవు. సెంట్రలు ఎగ్జి క్యూటివు కమిటీ తీర్మానము ప్రకారంకూడా 'రెండు సంవత్సరముల ఖైదు, భూమిని స్వాధీనం చేసుకొనడం, ప్రవాసం పంపడం' తప్ప మరేమీ చెయ్యడానికి వీలు లేదు. మీరు యేకంగా చంపి పారెయ్యడానికి అనుమతి కోరు తున్నారు! నిజంగా మీరు .. ...."

"ఏమిటి నేను" నేను ఆ రకంక చెందినవాడిని కాను. ఆ స్తమానూ ప్లానులు వేస్తూ ఆలోచిస్తూనే వుంటారు. కాని ముందు ముందు మనం దుక్కి దున్నడం యెలాగ? ప్రతీవాళ్లు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరే ముందే యెడ్లని చంపివేసినట్లయితే యేం పెట్టిదున్నుతారు?" నగుల్నోవు పెద్దపెద్ద అంగలువేస్తూ దేవిడోవు దగ్గరికివెళ్ళి అతని బుజంమీద చెయ్యి వేసేడు. తన బుజాల దగ్గరకు వచ్చిన దేవిడోవు కేసి చూస్తూ.

"సైమియన్! మిమ్మల్ని చూస్తే విచారంగా వుంది. ఇంత చవట బుర్ర అయిపోయింది యెందుచేత మీది ? ఈ సం॥రం చల్లికలు ఆగిపో యాయి అంటే యెంత యిబ్బంది పడాలో తెలుసునా? ఆవిషయం గ్రహిం చలేదూ మీరు? దీనికి మూలకారకులను యిద్దరు ముగ్గుర్ని కాల్చి చంపేస్తే చాలు! భాగ్యవంతుల్ని కాల్చి పారెయ్యాలి! ఇది అంతా వారిప్రోత్సాహమే! పై వుద్యోగస్థుల అనుమతి పొందాలి." అన్నాడు.

"ఛీ! నోరుముయ్యి!"

"ఇదిగో! మళ్ళీ మొదలెట్టేరు!" నగుల్నోవు తలవాల్చేడు. మళ్ళీ హఠాత్తుగా తల యెత్తి పెద్ద కంఠస్వరంతో, "వాళ్లు అందరూ పశువుల్ని నాశనం చేసేస్తున్నారు. అంతర్యుద్ధంలో మాదిరిగా అతి క్లిష్ట పరిస్థితులు

వచ్చేయి. శత్రువులు నలుమూలలా చెలరేగుతున్నారు. మీరు? మీ వంటి మందకొడి మనుష్యుల మూలంగానే ప్రపంచ విప్లవానికి అనుకూల పరిస్థితు లన్నీ వృధా అయిపోతున్నాయి. ఇటువంటివాళ్లు ప్రపంచ విప్లవం తీసుగు వస్తారన్నది వట్టిమాట. ప్రపంచం అన్ని మూలలా భాగ్యవంతులు మన సోదర కూలీలను చిత్రవధ చేస్తున్నారు; రెడ్ చైనీయుల్ని నాలుగు మూలలనుంచి క్రమ్మి నాశనం చేసేస్తున్నారు; నల్లవాళ్ళని నేలపెట్టి రాసేస్తు న్నారు. అటువంటి వర్గ శత్రువుల్ని మీరు యిక్కడ దయ తలుస్తామం టారు. ఎవరేనావింటే సిగ్గుకూడాను. భయంకర అవమానం! భాగ్యవం తులచేత అణచివెయ్యబడుతున్న యితర దేశములలోని మన సోదరులవి తలుచుగుంటే, నారక్తం ఉడికిపోతూంది! దారుణమైన ఆవార్తలు చదవ డానికి యిష్టంలేక పేపరు చూడడంకూడా మానేసేను. వాళ్ళస్థితి, పడు తూన్నబాధలుచూస్తే గుండెలు నీరయిపోతాయి. కాని మీరు... ....శత్రువుల చేత జైళ్ళలో త్రోయబడి మగ్గుతూన్న మన సోదరుల్ని కలలోనైనా తలుచుగుంటారా మీరు? వాళ్ళ విషయమే అక్కరలేదు మీకు!"

"వాళ్ళ విషయం అక్కర లేదూ నాకు? యింక యెప్పుడూ మాత్రం యిలాంటి మాటలు అంటూండకండి. మిమ్మల్ని చూడగా కొంచెం మతి చలించినట్లు కనిపిస్తున్నారే! మాట్లాడితే కాల్చెయ్యాలి అంటారు, అదొక పెద్ద విషయంకాదు. — ఎవరుపడితే వాళ్ళే చెయ్యవచ్చు! ఏమాత్రం ప్రతి ఘటన కలిగినా మీరు తీవ్రంగా పోరాడుతారు. మన నీతిని బోధిస్తూ, ప్రచారం చెయ్యాలికాని అడ్డువచ్చిన వాళ్ళందర్నీ చంపేస్తానంటే యెల్లాగ? అసలు యింతవరకు వచ్చేవరకూ యెందుకు వూరుకున్నారు?"

"వూరుకున్నానా?

"ఆ—యేమీ అనుమానం లేదు. పరిస్థితులు విషమించేవరకూ కళ్లు మూసుకొని కూర్చున్నాము; యిప్పుడయినా దానికి తగిన ప్రతిక్రియ ఆలో

చించాలి కాని. కాల్చి చంపేస్తామంటే లాభంలేదు. అవసరం వచ్చినప్పుడు ఇదిపనిగా చేసేరు ఆ పని ఇప్పుడు యెంతసేపూ ప్రజలలో తీవ్రంగా ప్రచారం కావాలి. మీటింగుకి వెళ్ళిపోదాం పదండి: అప్పుడే ఆలస్యం అయింది; పశువుల్ని చంపకూడదని ప్రజలలో బాగా ప్రచారము చేయాలి."

"నిన్న రోజల్లా నేను ప్రతి యింటికీ వెళ్ళి వాళ్ళకి బాగా బోధించేను."

"అదీ చెయ్యవలసిన పని. మళ్ళీ యింకొకసారి వెడదాం. మనం అందరం కలిసి."

"మళ్ళీ వెడతారా. నిన్న వొకరి యింట్లోనుంచివస్తూ వాళ్ళకి బాగా నచ్చచెప్పేను. యింక పశువుల్ని చంపరు.' అనుకున్నాను. ఇంతలో ఆ యిల్లు దాటకుండానే వాళ్ళు చంపుతూన్న పంది అరుపు వినబడింది. అంత క్రితమే వాళ్ళకి ప్రపంచ విప్లవాన్ని గురించి; కమ్యూనిజాన్ని గురించీ బోధి చేను. యెల్లా మాట్లాడేననుకున్నారు! ఆ మాటలకి నాకే కళ్ళనీళ్ళు వచ్చేయి. అంత అల్లా చెప్పినా లాభం లేకపోయింది. బండియెద్దు ముల్లు కర్రతో చెపుతే వింటుందికాని నచ్చచెబుతే వింటుందా? వీళ్ళని నెత్తిమీద మొట్టి 'భాగ్యవంతుల మాటలు వినకురా గాడిదా! వాళ్ళలా ఆస్థి పోగుచేసుకోవాలనే దుర్బుద్ధి వొదిలెయ్యి. పశువుల్ని చంపేసేవంటే, చిత్రవధ చేస్తాను. జాగ్రత్త' అని చెప్పాలి. వాడు 'యెద్దునేకాదా చంపుతున్నాను' అనుకుంటాడుకాని నిజముచేత వాడు ప్రపంచ విప్లవాన్ని దూరము జేస్తున్నాడన్న మాట."

"కొంతమందిని శిక్షిస్తే మిగిలినవాళ్ళు సులువుగా లొంగుతారు." అన్నాడు దేవిడోవు.

వాళ్ళు వీధులోకి వచ్చేరు. దట్టంగా కురుస్తున్న మంచు కాళ్ళకింద పిసపిసలాడుతూంది. చీకటి గాఢాంధకారం. ఆచీకట్లోనే వాళ్ళు స్కూలు

దగ్గరకు వచ్చేరు. మీటింగుకి గ్రామస్తులలో సగంమంది మాత్రం వచ్చేరు. ప్రజలు బుద్ధిపూర్వకంగా చేసే జంతు వధను ఆపడానికి పీపుల్స్ కమిషార్లు నిర్ణయించిన శిక్షాస్మృతి రజ్మటోస్ప్ చదివి వినిపించేడు. అతని తరువాత దేవిడోవ్ మాట్లాడేడు. అతను ఉపన్యాసం అయిపోయిన తరువాత ఆఖరున యిల్లా అని చెప్పేడు:

"సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరడానికి కొత్తగా 26 గురు దరఖాస్తులు పెట్టేరు. రేపు మీటింగులో, భాగ్యవంతుల మాటలు విని మోసపోయి పశువుల్ని చంపేసినవారిని మేరి వారి దరఖాస్తులు కొట్టేసి, మిగిలిన వారిని మాత్రం చేర్చుకుంటాము."

"ఇంతక్రితమే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరినవాడు చంపుతాడనుకోండి; వాడిని యేం చేస్తారు?" అని అడిగేడు ల్యుబిష్కిన్.

"వాళ్ళనికూడా బయటికి గెంటేస్తాము!"

సభలో గుసగుసలు బయలుదేరేయి.

"అలాగ అయినట్లయితే సమిష్టి వ్యవసాయ క్షేత్రమే మొత్తెయ్యవలసి వస్తుంది. ఈ వూరు మొత్తంమీద అటువంటివాడు ఒకడ్డుకూడా లేడు" అన్నాడు బోర్షెవ్.

నగుల్నోవ్ పిడికిళ్లు బిగించి అతని మీదికి వురికేడు.

"నిన్ను యెవరూ మాట్లాడమనలేదు. నోరుముయ్యి! సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని గురించి నువ్వు మాట్లాడవలసిన అవసరం లేదు. నీసలహా అవసరం లేకుండానే మేము నిర్వహించుకోగలం. నీగిత్తదూడని నువ్వు చంపెయ్య లేదనుకుంటాను. అవునా?"

"నా దూడల్ని నాకు తోచినట్లు చెయ్యగలను."

"ఆ—అల్లాగా! రేపు నిన్ను ఖైదుకి పంపించినప్పుడు, అక్కడ నీ యిష్టం వచ్చినట్లు చేద్దువుగానిలే!"

"అంత తొందరా! ఒక్కొక్కప్పుడు విషమిస్తుంది జాగ్రత్త" అని యెవడో కేకేసేడు.

మీటింగుకి ప్రజలు చాలామంది రాకపోయినా చాలా గంద్రగోళంగా వుంది మీటింగు పూర్తి అయిన తరువాత అంతా నిశ్శబ్దంగా బయటికి వెళ్ళేరు. అక్కడ యెవరి యిళ్ళకి వాళ్లు వెడుతూ గుంపులు గుంపులుగా చేరి మాట్లాడుకొనడం మొదలెట్టేరు.

"తొందరపడి అనవసరంగా రెండు గొర్రెల్ని చంపేసేను." అని సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుడైన 'సైమియన్ కుయునోవ్' లుబిష్కిన్‌తో అన్నాడు

"అన్నీ తెలిసిన నేనుమాత్రం యేం చేసేను? ఒక మేకని చంపేసేసు" లుబిష్కిన్ నిట్టూర్పు విడిచేడు. "సభలో నిలబడడానికే చిన్నతనంగా వుంది దీనికంతకీ నా భార్యే కారణం. దీన్ని తగలెయ్య! 'చంపు' 'చంపు' అని వేధించుకు తినేసింది! మాసం తినాలని ఉందిట! దొంగముండ! ఇంటికి వెళ్ళనీ పళ్ళు వూడకొడతాను!"

"ఆడవాళ్ళకి యేం తెలుసును! నెమ్మదిగా బోధించాలి మనం" లుబిష్కిన్ మామగారు అకిమ్ బెష్లిబ్నోవు అతనికి సలహాయిచ్చేడు. "సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సభ్యుడవు. నువ్వు అలా చేయడం బాగుండదు."

"అకిమ్! నువ్వు మీ దోరయెద్దుని చంపేసేవుట కాదూ?" అన్నాడ అతని యింటిపక్కనే నివసించే డెమ్కా ఉషాకోవు.

"అవునోయ్—అబ్బాయి చంపేను అంతకంటె నేను యే( చెయ్యను చెప్పు! దాన్ని తగలెయ్యా అది కాలు విరగగొట్టుకుంది! కర అంటే అదే సుమా— వూరికే పుణ్యానికి యెక్కడో మూలవున్న పాత( గొయ్యి దగ్గరకు వెళ్ళి దాన్లోబడి కాలు విరగగొట్టుకుంది."

"తెల్లవారుఝామున నువ్వు, నీకోడలు, కర్రలు పుచ్చుకొని దాన్ని పాతరవైపు తోలడం నేను చూసేను......"

"ఆ—యేమిటి డెమ్కా — యేమంటున్నావు· ఎప్పుడూ అలాగంటి తెలిసీ తెలియని మాటలు చెప్పకే." ముసలి ఆకిమ్ తొట్రుపడి హఠాత్తుగా నడివీధిలో అలాగే నిలబడి కన్ను కానరాని కారుచీకట్లోకి రెప్ప లారుస్తూ చూస్తూన్నాడు

"తాతా, రావోయ్," అన్నాడు డెమ్కా. "మైలు రాయిలా నడివీధిలో అలాగ నిలబడ్డా వెందుకు? నీ అంటట నువ్వే యెద్దుని పాతర గోతిలోకి తోలి........"

"డెమ్కా! ఎద్దు దానంతట అదే వెళ్ళింది. అలాగంటిమాట లెప్పుడూ అనకు! మహా పాపం!"

శీతగాలి చెలరేగింది. నడికి యిరువైపులా దట్టంగా వ్యాపించి యున్న పాప్లారు చెట్లు, విల్లో చెట్లు, హోరుమని ధ్వనిచేస్తూ వుద్రూత లూగి పోతున్నాయి. ఎటు చూచినా చీకటి గాఢాంధకారం. కురుస్తూన్న మంచుకు హద్దూ—పద్దూ లేదు. శీతకాలం ఆఖరు సారి తన ప్రతాపమంతా చూపిస్తూంది.



# పదునారవ ప్రకరణము

## హఠాత్ ప్రయత్నము.

మీటింగు అయిపోయిన తరువాత దేవిదోవు, రజ్మట్నోవులు కలిసి బయటికి వచ్చేరు. మంచు దట్టంగా కురుస్తూంది. అక్కడక్కడ తలుపు

సందుల్లోనుంచి దీపాలు మినుకు మినుకుమని కనిపిస్తున్నాయి. యెక్కడో మోరయెత్తి అరుస్తున్న కుక్క అరుపు వినిపిస్తోంది. పొలాలమీద మంచు నిలకట్టడాన్ని గురించి యాకోవు లూకుచ్ చెప్పిన సలహా జ్ఞాపకంవచ్చి, దేవిదోవు నిట్టూర్పు విడిచేడు. "ఈ సంవత్సరానికి మనం అలాగ చెయ్యలేము. ఇటువంటి తుపాను పట్టిందంటే యెంత మంచు పడుతుంది నేలమీద? అంతాకూడా వృథాగా పోతుంది. ఏం జేస్తాం."

"తబేలా దగ్గరకు వెళ్ళి, గుర్రాలని వొకసారి చూచి వెళ్ళిపోదాం." అన్నాడు రజ్మత్నోవు.

"సరే, నడవండి"

వాళ్ళు వొక పక్క సందులోకి మళ్ళేరు. దూరాన్ని వెలుతురు కనిపించింది. తబేలాగా మార్చబడిన లాప్షినోవు పాకవెనుక వొక లాంతరు వేళ్ళాడుతూంది. ఇద్దరూ అక్కడికి వెళ్ళేరు. గుమ్మం దగ్గర పంచపారయేడు, యెనమండుగురు కోసక్కులు నిలబడివున్నారు.

"ఈ వేళ డ్యూటీమీద యెవరున్నారు?" అని అడిగేడు రజ్మత్నోవు. అక్కడ నిలబడియున్న కోసక్కులలో వొకడు సిగరెట్టుపారేసి కాలిబూటుతో రాసేసి. కోంద్రాట్ మైడనికోవు అని సమాధానం చెప్పేడు.

"ఇక్కడ ఇంతమంది మూగేరెందుకు? మీరంతా యేం చేస్తున్నారు ఇక్కడ?" అని దేవిదోవు అడిగేడు.

"కామ్రేడ్ దేవిదోవు .. ....వూరికేనే నిలబడి సిగరెట్టు కాల్చుగుంటున్నాము."

"ఇప్పుడే గడ్డి తీసుకువచ్చి పడేసి నిల్చున్నాము."

"సిగరెట్లు కాల్చుగుంటూ నిలబడి మాట్లాడుకుంటున్నాము. మంచు కురవడం తగ్గుతుందేమోనని చూస్తున్నాము వెళ్ళిపోవడానికి."

గుర్రాలు గడ్డి నములు చప్పుడు వినిపించింది. గుర్రపు లద్దెలు,—వుచ్చ వాసన కొడుతూంది. ఒకమూల కొయ్యలను గుర్రపు సామానులు వేళ్ళాడుతున్నాయి. నేల అంతటా తుడిచి వుంది.

"మైదనికోవ్!" అండ్రీ కేకేసేడు.

"ఆ—వస్తున్నా." తబేలాకో ఒక మూలనుంచి సమాధానము వినబడింది.

మైదనికోవ్ రాగోలు కర్రతో వట్టిగడ్డి తీసుకు వస్తున్నాడు. తలుపు దగ్గరనుంచి నాలుగవ అరలోనున్న నల్లగుర్రం దగ్గరకి వెళ్ళి మోకాలితో తన్ని లేవగొట్టి గాడిలో గడ్డివేసేడు.

"అల్లా నిలబడ్డావేమి?" అంటూ కునికిపాట్లు పడుతూన్న గుర్రాన్ని రాగోల కర్రతో కొట్టేడు. గుర్రం తత్తరపాటుతో డెక్కలు ఎత్తివేస్తూ సకిలించి గాడిలోకి తలపెట్టింది. కోంరాడ్ దేవిడోవు దగ్గరకువచ్చి పని చేత మోటువారిన చెయ్యి ముందరికి జాపేడు.

"కామ్రేడ్ మైదనికోవ్, పనులెల్లా జరుగుతున్నాయి."

"అన్నీ సవ్యంగానే జరుగుతూన్నాయి."

"బయట వాళ్ళందరూ చేరేరెందుకూ?"

"వాళ్ళనే అడగండి" అతని స్వరంలో ఒకవిధమైన అసంతృప్తి ప్రతిధ్వనించింది. "రాత్రి నేను గుర్రాలకి గడ్డివెయ్యడానికి రాగానే వాళ్ళంతా ఇక్కడకి చేరుతారు. వాళ్ళ గుర్రాల్ని పశువుల్ని సమిష్టి వ్యవసాయక్షేత్రం ఆధీనం జేసినా మనవి అనే వుద్దేశ్యం ఇంకా వదలలేదు వాళ్ళకి. బయట నిలబడ్డవాళ్ళంతా వాళ్ళ గుర్రాల్ని బాగా మేపుతానో లేదో అని చూడడానికి వచ్చినవాళ్ళే. వాళ్ళు వచ్చి "నా గుర్రానికి గడ్డివేసేరా?" "మా పందెపు గుర్రాన్ని బాగా మేపుతూన్నావా?" "మా ఆడగుర్రం చిక్కిపోలేదుకదా?"

అని వేధించుకు తినేస్తారు. వాటిని మేపక ముడ్డి యెండకడుతున్నామను కున్నారా? వాళ్ళకి సమాధానం చెప్పలేక చచ్చిపోతున్నాను 'గుర్రాలకి గడ్డి వెయ్యడానికి మేముకూడా సహాయం జేస్తాము. ఉండు, అంటూ వాళ్ళంతా వచ్చి తలొక సందెడు గడ్డి తీసుకుపోయి, యెవరి గుర్రాలకి వాళ్ళు చాలా గడ్డి వేస్తూంటారు. ఇల్లా అయితే బాగులేదు. అవసరం లేనివాళ్లు ఎవళ్లూ కూడ ఇక్కడికి రాకూడదని రిజల్యూషను ఒకటి ప్యాస్ చెయ్యాలి."

"విన్నారా?" ఆంద్రీ రెప్పలు ఆర్పుతూ దేవిదోవువైపు చూసేడు.

"వెంటనే వాళ్ళనందర్నీ వెళ్ళిపొమ్మని చెప్పండి." దేవిదోవు ఆజ్ఞా పించేడు. "అవసరమైనవాళ్ళు తప్ప పైవాళ్ళు యెవరూ ఇక్కడ ఉండడానికి వీల్లేదు. ఒక్కొక్క గుర్రానికి ఎంతగడ్డి వేస్తారు? తూచివేస్తూంటారా!"

"తూచడంలేదు. ఉజ్జాయింపుగా ఒక్కొక్క దానికి అరపూడు (సుమారు 18 పౌనులు) వేస్తూంటాను."

"అన్నిటికీ కూడా పక్కకి గడ్డి వేస్తున్నారా?"

"ఎందుకు వెయ్యడం" కోండ్రాట్ కోపంతో తల పంకించేడు. నల్లటిజుట్టు, మెడమీద చిరిగిపోయిన అతని కోటు మీదపడి చిందింది. "మన మేనేజరు ఆస్ట్రోవునోవు యాకోవు లూకుచ్ అన్నమాట, నాదగ్గరకి వచ్చి గుర్రాలుతిని దిగపెట్టినగడ్డి వాటి పక్కకి వేస్తూండు."అని చెప్పేడు. అది మంచి ఆజ్ఞయేనా? అతను చాలా తెలివైన వ్యవసాయదారు డనుకుంటున్నాము. చూడండి ఎల్లాంటి ఆజ్ఞలు ఇస్తున్నాడో!"

"ఏమి? దాల్లో తప్పేముంది?"

"కామ్రేడ్ దేవిదోవు! అది తప్పే. గుర్రాలు వదిలేసే గడ్డి అంతా మంచిదే. గొర్రెలకి, మేకలికి, వేస్తే ఒక్క పరకకూడా దిగపెట్టకుండా తినేస్తాయి. అల్లాంటి గడ్డిఅంతా గుర్రాలకి పక్క వెయ్యమన్నాడు. దీనిని గురించి ఆయనతో చెప్పేను. కాని నువ్వునాకు సలహా యివ్వవచ్చేవా అని కసరికొట్టేరు."

"మీరు చెప్పినదే బాగుంది. ఆగడ్డి పక్క వేయకండి. రేపు అతన్ని ఒక తట్టవరస చీవాట్లు పెడతాను." అన్నాడు దేవిదోవు.

"ఇంకొక విషయంవుంది. గడ్డి ఆ మూతివారనున్న మేటిలోనుంచి తీసివెయ్యమని చెప్పేరు. అలా ఎందుకో నాకు అర్థం అవలేదు."

"యాకోవు లూకుచ్. ఆగడ్డి అంత మంచిది కాదని చెప్పేడు. ఈ శీత కాలంలో ఆ గడ్డితో మేపి, తొలకరి దుక్కులనాటికి మంచి గడ్డి ఉంచుతే బాగుంటుందని చెప్పేడు."

"ఆ ఆలోచన బాగానేవుంది. కాని ఉపయోగించే గడ్డి పక్కకి వెయ్యమనడాన్ని గురించి మాత్రం చెప్పండి"

"ఓ తప్పకుండా చెబుతాను. ఈ లెనిన్‌గ్రాడు సిగరెట్టు కాల్చిచూడండి. చాలా బాగా ఉంటుంది." దేవిదోవ్ దగ్గేడు. "నా స్నేహితులు పంపించేరు.........గుర్రాలన్నీ సరియైన స్థితిలో ఉన్నాయి కాదూ?"

"వందనాలు. నిప్పుకూడా యియ్యండి మరి. గుర్రాలన్నీ బాగానే వున్నాయి. మన స్వారీగుర్రం – లాష్టినోవు దగ్గర తీసుకున్నది – అది మాత్రము రాత్రి జబ్బుచేసి లేవలేకపోతే వెంటనే మందులు పోసేరు. అది మినహాగా మిగిలినవన్నీ సరియైన స్థితిలోనే వున్నాయి. ఒక గుర్రపుపిల్ల రాత్రులు కూడా పడుకోకుండా నిలబడే వుంటోందిట. అసలు పడుకొనడమే లేదని చెప్పేరు. రేపు గుర్రాలకన్నిటికి ముందర కాళ్ళకి నాడాలు కొట్టించేద్దం. బాగా అరిగిపోయి కాళ్ళు జారిపోతున్నాయి. సరేవెళ్ళండి, అప్పుడే చాలా పొద్దుపోయింది. ఇంకా గుర్రాలదగ్గర నాకు చాలా పనుంది."

రజ్మట్నోవు దేవిదోవుతో కలసి తన ఇంటివైపు బయలుదేరేడు. కాని ఒక వీధి మలుపులో 'లూకా ఛిబాకోవ్' ఇంటి ఆవరణ దగ్గర రజ్మట్నోవు ఆగి దేవిదోవ్‌ని స్పృశిస్తూ అక్కడ చూడండి అన్నాడు నెమ్మదిగా.

వారికి మూడు వారల దూరంలో దడి గుమ్మం దగ్గర వొకమనిషి నీడ కనిపిస్తూంది. రజ్మటోన్నవు గభాలున అతనివైపు పరుగెత్తేడు. కుడి చేత రివాల్వరు పుచ్చుకొని, యెడమ చేతితో గుమ్మం పక్కని నిలబడి యున్న ఆమనుష్యుని పట్టుగున్నాడు.

"లూకా, నువ్వేనా?"

"ఆంద్రీ రజ్మటోన్నవు! ఇల్లా వచ్చేరేమిటి?"

"ఆ కుడి చేతిలో యేమిటి ఉంది ? అది యీలా యిచ్చెయ్యి త్వరగా!"

"హామేర్రిడ్ రజ్మటోన్నవు! యేమిటి యిదంతా?"

"ముందు అది యిచ్చెయ్యి లేకపోతే కాల్చేస్తా:"

ఈ మాటలు విని దేవిదోవు కూడా వచ్చేడు. "ఏమిటి అతన్ని ఇమ్మని అడుగుతున్నావు?" అని అడిగేడు.

"లూకా! యిచ్చెయ్యి. లేకపోతే కాల్చేస్తున్నాను!" రజ్మటోన్నవు తీవ్రంగా అన్నాడు.

"ఇదుగో, తీసుగో అంత కోపంగా వున్నావెందుకు?"

"చూడండి, గుమ్మం దగ్గర చేత, యేం పుచ్చుకొని నిలబడ్డాడో! ఇంత రాత్రివేళ కత్తి పుచ్చుకొని యెందుకు నిలబడ్డావు యిక్కడ! యెవరి కోసం కాచుకొని ఉన్నావు? దేవిదోవు కోసమా. ఏం మాట్లాడవేం, కత్తి పుచ్చుకొని యెందుకు నిలబడ్డావు? చంపడానికి చూస్తున్నావా? ఏమిరా ద్రోహీ ?"

దడివార నిలబడ్డవాని చేతులో కత్తి వుండడం రజ్మటోన్నవుకాక ఇంకొకడయినట్లయితే కనుక్కోలేకపోయి ఉండును. ఆకత్తి లాక్కొన డానికి రజ్మటోన్నవు. మీదికి వురికేడు. లూకా నిర్ఘాంతపోయి తెలివి తెచ్చుకొని తలుపు తెరచి,

"మీరు అపోహ పడుతూంటే యింక నేను వూరుకుంటే విషమిస్తుంది అసలు విషయం యేమిటో మీకే తెలుస్తుంది. ఆంద్రీస్టెఫనోవిచ్! నా వెనక రండి!"

"ఎక్కడికి?"

"గొఱ్ఱెల దొడ్లోకి"

"ఎందుకు?"

"రండి. కత్తి పుచ్చుకొని నేను గోడవార యెందుకు నిలబడ్డానో మీకే తెలుస్తుంది."

"నడవండి చూసివద్దాం" అంటూ దేవిడోవు లూకా దొడ్లోకి ముందుగా నడుస్తూ రజ్మెట్నోవుతో.

"నా వెనక రండి." అన్నాడు.

గొఱ్ఱెల పాకలో ఒక బల్లమీద లాంతరు వెలుగుతూంది. పక్కనే పిడకలపోగు వుంది. లూకా భార్య కూర్చుని యేదో చేస్తూంది. గుండ్రటి ముఖం, విశాలమైనకళ్లు, తీర్చి దిద్దినట్టున్న కనుబొమ్మలు, మొత్తంమీద ఆమె అందమైనదే. కొత్తవాళ్ళని చూడగానే ఆమె గభాలున లేచి నిలబడింది. ఆమె యెదుట రెండు బిందెల నీళ్ళు, పక్కన గోడవార నీళ్ళతో నున్న పళ్ళెము ఉన్నాయి. కుడిచేతివైపున మూలలో ఒక బలిసిన పంది గడ్డిమీద నిలబడి యెదుటనున్న పెద్ద తొట్టెలోని కుడితి తాగుతూంది.

"మూలకారణం యేమిటో యిప్పుడు చూడండి." లూకా ఒకమాటకీ ఒక మాటకి సంబంధం లేకుండా అని పందికేసి చూపించేడు. "ఈపందిని రహస్యంగా చంపెయ్యడానికి నిశ్చయించేము. నాభార్య దానికి కుడితి పోస్తూంది. నేను దానిని కిందపడతోసి చంపుదా మనుకుంటున్నాను. ఇంతలో వీథులో యెవరివో మాటలయేయి. వీథిలో యెవరైనా నేను పందిని చంపడం కనిపెడుతున్నారేమోనని అనుమానం కలిగింది. ఇప్పుడు

నేనున్నట్లే చొక్కా చేతులు పైకి తీసి, తుండుగుడ్డ వొకటి కప్పుకొని చేతిలో కత్తితో దగ్గరకు వెళ్ళేను. మీరు కనుపించేరు. నేను యెందుకు నిలబడ్డాననుకున్నారు అక్కడ? ఎవరినైనా చంపడానికి వెళ్ళేవాడు చేతులు యెగతీసి బట్ట కప్పుకొని వెడతాడా?" బూకా పైమీది తుండుగుడ్డ తీసేసి వెకిలినవ్వు నవ్వి, భార్యవైపు తిరిగి "యెందుకు యింకా అక్కడ నిలబడ్డావు?" ఆ పందిని బయటికి తోలెయ్యి." అన్నాడు.

"దీనిని చంపకు, ఇప్పుడే వొకమీటింగు అయి వస్తున్నాము; జంతువుల్ని వేటినీకూడా చంపడానికి వీలులేదు." అన్నాడు రజ్మటోన్నొవు.

"అల్లాగేలెండి ఇంక చంపను. నా మనస్సు తిప్పేసేరు........"
అక్కడినుంచి యింటికి వచ్చేవరకూ దోవపొడుగునా డేవిడోవు ఆండ్రీతో వేళాకోళం ఆడుతూనే వచ్చాడు.

"సమిష్టి వ్యవసాయ క్షేత్రపు చైర్మన్ ప్రాణాలు రక్షించేరు! ఒక విప్లవ వ్యతిరేకిని నిరాయుధునిగా చేసేరు! దెబ్బకి రెండు పక్షులు! ఓహొహో!!"

"పంది ప్రాణాలు కాపాడేను!" రజ్మటోన్నొవు పరిహాసంగా జవాబు చెప్పేడు.

---

## పదిహేనవ ప్రకరణము

### చికిత్స.

మరునాడుదయం గ్రిమాచీ 'నూక్లియస్' సమావేశమయింది. ఆ సమావేశములో, గ్రిమాచీ స్టాలిన్ సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల జంతువుల నన్నిటిని సమాజపరం చెయ్యాలని తీర్మానించ బడింది. పశువులు,

గుఱ్ఱాలు, గొఱ్ఱెలు మొదలయినవే కాకుండా కోళ్ళు, బాతులుకూడ సమాజ పరము చెయ్యాలని తీర్మానించబడింది.

మొదట కోళ్లు. మొదలయినవాటిని కూడ సమాజపరం చెయ్యాలనే తీర్మానాన్ని డేవిదోవు తీవ్రంగా ప్రతిఘటించేడు. కాని నగుల్నోవుయొక్క పట్టుదలవల్ల రజ్మెత్నోవుకూడ అతనిని సమర్థించడంవల్ల కొంతసేపటికి అంగీకరించేడు.

అంతేకాకుండా జంతువధ పూర్తిగా ఆపు చెయ్యడానికి పార్టీ సభ్యు లందరూ గ్రామములో ప్రతి యింటికి తిరిగి తీవ్ర ప్రచారం చెయ్యాలని కూడ నిశ్చయమయింది. ఎన్ని చెప్పినా వినకుండా జంతువులను చంపేవారి మీద అప్పటి మటుకు యేమియుచర్య తీసికొనక, ప్రచారంవల్ల ఎటువంటి ఫలితం కలిగినది నిరీక్షించి చూడడానికి నిశ్చయించేరు.

"ఇలా అయినట్లయితే పశువులు, కోళ్ళు, చంపడం తగ్గుతుంది. లేకపోయినట్లయితే వేసవినాటికి గ్రామంలో యెక్కడాకూడ ఒక్క ఆవు అరుపు గాని కోడి కూతగాని వినబడదు." అన్నాడు నగుల్నోవు ఉత్సాహంగా, తీర్మానాలు వ్రాసిన కాగితం మడత పెడుతూ.

పశువులు, గుఱ్ఱాలు, అంతక్రితమే సమాజపరంచేసి ఉండడంచేతను 'జంతువులనన్నిటిని సమాజ పరం చెయ్యాలి' అన్న తీర్మానంవల్ల ఒక్క పందులు, గొఱ్ఱెలుమాత్రం సమాజపరం చెయ్యవలసి రావడంచేత సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల సాధారణ సమావేశంలో ప్రతిఘటన లేకయే ఆ తీర్మానం ఆమోదించబడింది. కాని కోళ్ళనుకూడా సమాజపరం చెయ్యాలి అన్న సవరణమీదమాత్రం తీవ్రమయినచర్చ జరిగింది. ఆసవరణకి స్త్రీలు అందరూకూడ ప్రతికూలురే. చాల చర్చ జరిగినమీదట అతి కష్టంమీద వాళ్లుకూడ అంగీకరించేరు. దానివల్ల కలగే కష్టసుఖాలు బాగా నచ్చచెప్పి, ఆడవాళ్ళని అంగీకరింప జేసినవాళ్ళలో ముఖ్యుడు నగుల్నోవు.

"సోదరీ మణులారా! కోళ్ళమీద, బాతులమీద మీ మమకారం వదిలిపెట్టండి. ఇంతవరకూ మాకు ప్రోత్సాహం యిచ్చి ముందుకు నడిపిం

చినమీరు యికపైనికూడా అటువంటి ప్రోత్సాహం యిస్తారని తలుస్తాను. కోళ్ళనికూడ సమిష్టి వ్యవసాయక్షేత్రంలోనే వుండనియ్యండి. వచ్చే వేసవి నాటికి 'ఇంకుబేటరు' ఒకటి కొంటం; దానివల్ల కొద్దికాలంలో వందల కొలది కోడి పిల్లల్ని ఉత్పత్తి చెయ్యవచ్చు. ఆ 'ఇంకు బేటరు' అనేది కృత్రిమవేడి కలిగించి గుడ్లని పొదిగే ఒకవిధమైన యంత్ర సాధనం. అందుచేత మీరు పట్టుదల వదిలెయ్యమని కోరుతూన్నాను. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో ఉన్నప్పటికీ అవి యెప్పటికీ కూడ మీవే. కాని సమిష్టి వ్యవసాయ క్షేత్రంయొక్క సంరక్షణలో మాత్రం ఉంటాయి. అసలు యిప్పుడు మీకు కోళ్ళ వుపయోగం యేమివుంది? ఇప్పుడవి యెల్లాగా గుడ్లు పెట్టవు. వేసవివరకూ వాటితో మీరు యెంత బాధ పడాలో ఆలోచించండి; కొట్టంతా తిరుగుతూ యేం చల్లినా తినేస్తూంటాయి. ఎవరూ చూడకుండా యే మారుమూలనో గుడ్లు పెడతాయి. లేకపోతే యే మానుపిల్లేనా పొంచుని మీదపడి చంపెయ్యవచ్చు. ఒకటేమిటి, అనేక బాధలున్నాయి. ప్రతిరోజూ వాటి గూళ్ళలోకి చూసి యే కోడి గుడ్లు పెట్టిందో అని చూస్తూం డాలి. వాటికి గోమారు పట్టకుండా చూస్తూండాలి! వాటివల్ల శ్రమతప్ప మీకు యేమీ లాభం లేదు. కాని అవి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో యెల్లా జీవిస్తాయో తెలుసునా? మహా ఆనందంగా ఉంటుంది! మన 'అకిమ్ బెష్ క్లిబ్నోవు' వంటి యే ముసలివాడినో వాటిని చూస్తూండమని యేర్పాటు చేస్తాము. అతడు వాటిని మేపుతూ కాలక్షేపం చేస్తూంటాడు. బరువు పనులు చెయ్యలేని ముసలివాళ్ళకి అటువంటి తేలిక పనులు చెబితే మహా సంతోషంతో శ్రద్ధగా చేస్తారు. అందుచేత మీరంతా మా సవరణ అంగీక రించ వలసినదని కోరుతూన్నాను."

ఆడవాళ్ళంతా నవ్వేరు. వాళ్ళలో వాళ్లు కూడబలుకుకొని చివరకు అంగీకరించేరు.

సమావేశం పూర్తి అయిపోగానే నగుల్నోవు, దేవిడోవులు గ్రామంలో ప్రతి యింటికి వెళ్ళి చూడడానికి బయలుదేరేరు. వారి విచా

రణనిబట్టి ప్రతి యింట్లోను, కొద్దో, గొప్పో మాంసం వున్నట్లు తేలింది. ఆఖరికి వాళ్ళు ఘాకర్ ఇంటికి వచ్చేటప్పటికి మధ్యాహ్నం భోజనాల వేళ అయింది.

"ఇతడు మొదటినుంచీ సమిష్టి వ్యవసాయ క్షేత్రం కావాలని అన్న వాళ్ళలో ఒకడు ఇతడు పేటినీకూడా చంపి యుండడు." అన్నాడు నగు ల్నోవు, ఘాకర్ యింటి గుమ్మాలు యెక్కుతూ దేవిడోవుతో.

వాళ్లు లోపలికి వెళ్ళేటప్పటికి ఘాకర్ కాళ్ళు ముడుచుకొని వెల్లకితలా పడుకొని వున్నాడు. కోటు గడ్డం వరకూ పైకి మడిచేసివుంది. పెద్ద కుండపిడత నెరసిన వెంట్రుకలతోనున్న అతని పొట్టమీద బోర్లించి వుంది. పొట్టకి రెండుపక్కలా రెండు గ్లాసులు జలగల్లా అంటిపెట్టుకొని వున్నాయి. దేవిడోవు, నగుల్నోవులు రావడం అతడు చూడలేదు. ఒణుకుతూన్న చేతులు గుండెలమీద పెట్టుకొని చచ్చినట్లు పడియున్నాడు కళ్ళు గుంటలుపట్టి ఉన్నాయి. నగుల్నోవుకి ఆ యింట్లో శవం కుళ్ళిన వాసన వేస్తూన్నట్లు అనిపించింది. ఘాకర్ భార్య గడ్డిబొద్దులా స్టౌ పక్కని నిల బడియుంది. మడుభికా యేదో గొణుగుతూ మంచం చుట్టూ తిరుగుతూంది. ఆ జిల్లా అంతటా ఆమె పేరు యెరగని వాళ్ళు యెవరూ లేరు. విరిగిపోయిన యెముకలు అతగడంలోనూ, గాయాలు కుదర్చడంలోనూ, ఒకటేమిటి— అన్నివిధాల రోగాలు కుదర్చడంలోనూ, చాలా నేర్పరి. వీటి అన్నిటికంటెనూ, కడుపు దింపడంలో సిద్ధహస్తురాలు. అటువంటివి ఆమె చేతిమీదుగా యెన్ని అయేయో లెక్కలేదు. ఇప్పుడు ఘాకర్ రోగం కుదర్చడానికి వచ్చినది ఆమెయే.

దేవిడోవు యిల్లు నాలుగుమూలలా కలియచూసి "తాతా! క్షేమంగా వున్నావా. ఆ పొట్టమీద పెట్టింది యేమిటి?" అన్నాడు.

"అబ్బా! పొట్ట నరాలు బిగపట్టేయి. — చచ్చిపోతున్నాను." అని అతి ప్రయత్నంమీద సమాధానం యిచ్చేడు. వెంటనే సన్నని కంఠంతో

మూలుగుతూ "ఈ పిడత తీసెయ్యి! నిన్నే! ముసలిముండా! మాట్లాడవేం" అన్నాడు.

"అంత తొందరపడితే యెల్లాగ, ఒక్క నిముషం ఆగు." అని ఘాకర్‌తో నెమ్మదిగా చెబుతూ చర్మాన్ని గట్టిగా అంటిపెట్టుకొని యున్న కుండ పిడత లాగటానికి ప్రయత్నం చేస్తూంది.

కాని ఘాకర్ పెద్ద గోల పెడుతూ ఆమెని కాలితో తన్నిపారేసి, రెండు చేతులతోనూ కుండ గట్టిగా పట్టుకున్నాడు. దేవిడోవ్ అతని సహాయానికి గబ గబా వచ్చేడు; స్టౌ దగ్గర పడియున్న కర్ర తీసుకొని ఆ ముసలి దానిని గెంటేసి కుండమీద ఒక్క దెబ్బ కొట్టేడు. కుండ ముక్కలుముక్కలయిపోయింది. గాలి రయ్యిమని లోపల ప్రవేశించింది. ఘాకర్ ఒక్కసారి వెక్కి వెగరుస్తూ, "అబ్బ! బతికేను" అనుకున్నాడు. రెండు పక్కలనున్న గ్లాసులు లాగి పారేసేడు. దేవిడోవ్ పగిలిపోయిన కుండ పెంకులమధ్య ఎత్తుగా కనిపిస్తూన్న అతని బొడ్డుచూసి, పకాపకా నవ్వుతూ అక్కడనున్న బెంచీమీద కూలబడ్డాడు. కళ్ళ నీళ్లు కమ్మేయి. టోపీ కింద పడిపోయి నల్లటి అతనిజుట్టు నుదురుమీద పడింది.

తనకుండ బద్దలు కొట్టడంచేత మమిభికా వెర్రి ముఖంవేసి యేడవడం మొదలెట్టింది. ఘాకర్ కోటు సరి చేసుకొని మంచము మీదనుంచి లేచేడు.

"ఏమిరా! ముసలి పీనుగా!" ఆమె యేడుస్తూ మధ్య మధ్య తిట్టడం మొదలెట్టింది. "ఇవి అన్నీ యిల్లా బద్దలుకొడతావురా! నీవంటివాళ్ళకి ఉపకారం చెయ్యబోతే ఇంతకంటె యెక్కువ చేస్తావా!"

"ఇదిగో వెంటనే యిక్కడనుంచి వెళ్ళిపో!" ఘాకర్ వీధిగుమ్మం వైపు చూపించేడు. "ప్రాణం పోతుందేమో అనుకున్నాను అప్పుడు. ఆ కుండ నీ నెత్తికేసి బద్దలు కొట్టవలసింది. ఎందుకని ఊరుకున్నాను, నా

కళ్ళముందునుంచి వెళ్ళిపో. లేకపోతే చంపేస్తాను. నాకు కోపం రానంత సేపే. వచ్చిందంటే వెనకా ముందూ చూడను."

మషేఛికా వీధి గడప దాటగానే "ఏమిటి యిది అంతా ?" అని అడిగేడు.

"రెండురోజులనుంచి వీధిలోకి అడుగుపెట్టలేను. ఒక్కవరసని విరోచనాలు వెడుతూన్నాయి. పొట్టంతా అప్పడంలా అయిపోయింది. బాగా చిక్కిపోలేదూ నేను ?"

"మాంసం దిట్టంగా తిన్నావా ఏమిటి ?"

"మాంసం... ......"

"నీ గిత్త దూడని చంపేసేవా ?"

"ఆ దూడ చచ్చిపోయింది.........అది ఎందుకూ ఉపయోగించింది కాదు......"

మకార్ అసహ్యంతో ఘూకర్‌ని నిలువల్లా చూసేడు.

"అరి పిశాచమా ! చంపేసేవా ! ఆ కుండకాదు, పెద్ద పీపా పెట్టవలసింది నీ పొట్టమీద ; ఉబ్బర పూర్తిగా లాగేసును. తొందరపడకు - రేపే, సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో నీ సభ్యత్వం రద్దుచేసేస్తాం. ఎందుకోసం చంపేవు దూడని ?"

"మకార్ ! బుద్ధి గడ్డితింది. తెలియక చేసేను. మా ముసలిది నన్ను ప్రోత్సాహం చేసింది. ఈ ఒక్కసారికి దయవలుచు .... కామ్రేడ్ దేవిడోవ్ ! మన ఇద్దరికి ఎంతోస్నేహం. నన్ను సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి తొలగించరు కాదూ ? నేను చేసినపనికి ఫలితం యిదివరకే అనుభవించేను........"

"దేవిడోవ్ ! అతనితో మాట్లాడడంఏమిటి, రండి." నగుల్నోవు చెయ్యి విసిరేడు. "ఘూకర్ ! తుపాకికిపూసే కొవ్వులో ఉప్పుకలిపి తాగు,

నింపాదిగా ఉంటుంది. ఎప్పుడు చూసినా ఏదో రోగంతో బాధ పడుతూనే ఉంటావు."

"వేళాకోళం చేస్తున్నావా నన్ను ?" అన్నాడు ఘూకర్.

"అబద్ధంకాదు. నేను చెప్పేది నిజమే. పూర్వం మేము సైన్యములో పనిచేసేటప్పుడు కడుపునొప్పికి అల్లా చేసేవాళ్ళం."

"నేను మనిషిని కానుకుంటున్నావా ? జీవంలేని వెధవ తుపాకీని మెరుగుపెట్టే కొవ్వు మింగమంటున్నావా ? నాకు అక్కరలేదు ; చావనైనా చస్తానుకాని అదిమాత్రం మింగను !"

రోగం కుదిరి ఘూకర్ ఆ మరునాడే ఊళ్ళోకి బయలు దేరేడు. దోవలో కనపడినవాళ్ళందరితోను, దేవిడోవ్, నగుల్నోవ్ తనని చూడడానికి వచ్చేరని వేసవి చల్లికలను గురించి, సమిష్టి వ్యవసాయక్షేత్రపు ఇతర విషయాలను గురించి సలహాలు అడిగి వెళ్ళిపోయేరని అతి నమ్మకంగా కోసేడు. ఆఖరున ఒక్కనిముషం ఆగి నోటిలో సిగరెట్టుతీసి నిట్టూర్పు విడిచేడు.

ఈ మధ్య నాకు సుస్తీగాఉంది; అందుచేత చూడడానికి వచ్చేరు. నా సలహా లేకుండా ఒకనిముషం వ్యవహరించలేరు. నా జబ్బు తగ్గడానికి సలహా యిచ్చేరు. "తాతా అశ్రద్ధ చెయ్యక త్వరగా రోగం కుదుర్చుగో. ఈ వెధవ రోగం యిప్పుడు పట్టుగుందేమిటి ? నువ్వు లేకపోతే చెయ్యి తెగికొట్టినట్లుగా వుంది మాకు" అన్నాడు. 'మాక్లిన్' మీటింగుకి వచ్చి అవసరమైన సలహా లిమ్మనడం తప్ప, వాళ్ళు నన్ను అట్టే శ్రమపెట్టరు. ఎంత అవసరమో అంతే చెపుతాను కాని, డబ్బాలాగ వాగడం అంటే నాకు అసహ్యం. సాధారణంగా నా సలహా వాళ్లు తీసి పారెయ్యరు. నే నంటే మంచి గురివుంది." అని ఎదటివాళ్లు తనమాటలు ఎంతవరకు నమ్ముతున్నారా అన్నట్లు వాళ్ళ ముఖంలోకి చూసేడు.

# పదునెనిమిదవ ప్రకరణము

## గుడ్డల పంపకము.

'గ్రిమాచీలాగ్' లో సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఏర్పరచిన కొత్తలో ఉండే అల్లకల్లోలం మళ్ళీ ప్రారంభం అయింది. జంతువులను చంపడం కూడ ఆగిపోయింది. రెండురోజుల వరకు సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు, వారి గొర్రెలు, మేకలు, కోళ్ళు మొదలైనవాటినన్నిటిని తీసుకొని పోయి సమిష్టి వ్యవసాయ క్షేత్రముయొక్క అధీనంచేస్తూనే ఉన్నారు. గ్రామమంతా పశువుల అరుపులతోను, కోళ్ళ కూతలతోను దద్దరిల్లింది.

నూట ఇరువదిమంది రైతులవరకు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సభ్యులుగా చేరేరు. వారందరు మూడువిభాగాలుగా విభజింప బడ్డారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మేనేజిమెంటు కమిటీ, భాగ్యవంతుల నుంచి స్వాధీనము చేసుకొనిన దుస్తులన్నిటిని బీదకోసక్కులకు పంచిపెట్టడానికి యాకోవ్ లూకుచ్‌ను నియమించింది. దుస్తులు అవసరమున్న బీదకోస క్కుల జాబితా ఒకటి కమీషను చేత తయారుచేయ బడింది. దానినిబట్టి కావలసినవారికి అందరికి దుస్తులను సప్లయి చేయుటకు తగినన్ని లేవని తేలింది.

భాగ్యవంతుల దగ్గిరనుంచి స్వాధీనము చేసుకొన్న దుస్తులను, యాకోవు లూకుచ్ టిటాక్ ఇంటిదగ్గిర పంచిపెట్టడం ప్రారంభించేడు. ఉదయం మొదలు రాత్రి పొద్దుపోయేవరకు ఒక్కటే గోల. కోసక్కులు తమ చిరిగిపోయిన పాతబట్టలు, అక్కడే గాదిదగ్గర చాటుకువెళ్ళి విప్పేసి, మంచిబూట్లు, రంగురంగులకోట్లు, జాకెట్లు తొడుక్కొంటున్నారు. ముందు భారపుపనికి నియమింపబడిన బీదకోసక్కులకు, వారికి అవసరమైన మంచి మంచి దుస్తులు, బూట్లు ప్రత్యేకముగా సప్లయి చెయ్యబడ్డాయి. అటువంటి

వాళ్లు సంతోషంతో బుజాలు ఎగరేస్తూ తాము యేరుకొన్న దుస్తులు సంతృప్తితో ఇటు అటు తిరగేసిచూస్తూ, అక్కడే అంతమంది యెదుట, చిరుగులతోను, టాకీలతోను నిండియున్న పాతబట్టలు వదిలేసి మూటకట్టి, కొత్తవి తొడుగుతూన్నారు. లుబిష్కిన్‌కి జాకెట్లు, ట్రౌజర్లు, బూట్లు ఇవ్వవలసినదని దేవిడోవ్ యూకుచ్‌తో చెప్పేడు. యాకోవులూకుచ్ ధుమధుమలాడుతూ పెట్టెలోనుంచి ఒకమేలెడు బట్టలు తీసి లుబిష్కిన్ ముందుపడేసి "నీకు ఏం కావాలని ఉందో అవన్నీ తీసుగో!" అన్నాడు.

లుబిష్కిన్ పెదవులు అదిరేయి. ఆ బట్టలన్నీ తిరగేసి చాలాసేపటికి ఒక జాకట్టు ఏరేడు. అప్పటికి అతనికి ముచ్చెమటలూపోసేయి. జాకట్టు ఇటు, అటు తిరగేసి పోట్లు ఏమైనా ఉన్నాయేమోనని చూసేడు. అతనిచుట్టూ చేరి చూస్తూన్న జనంలో గడబిడ ప్రారంభమయింది.

"త్వరగా కానియ్యి; నీమనమలు కూడా తొడుక్కొనేవరకు ఉండాలి!"

"కళ్లు మూసుకొని చూస్తూన్నావా ఏమిటి! ఇంతక్రితం తిరగేసినదే కాదూ?"

"సాయంకాలానికేనా నీ ఏరడం పూర్తి అవుతుందా!"

"పావెల్! అదితియ్యి బాగుంది!"

"నేనివ్వను; ఇంకొకటి చూసుకో నువ్వు."

లుబిష్కిన్ ముఖం గీసిన కందగడ్డలా ఎర్రగాఉంది. మీసాలు కొరుకుతూ చుట్టూమూగిన జనంకేసి బెదురుచూపులు చూస్తూ కొంతసేపటికి రెండవ జాకట్టు ఏరేడు. తీరా, తొడిగి చూసేటప్పటికి సరిపోయింది కాదు. అందుచేత అదిపారేసి మళ్ళీ పోగుమీదపడి వెతకడం మొదలెట్టేడు. తీర్థంలో ఆటవస్తువుల దుకాణం పిల్లలు ఎంత ఆతురతగా, సంతోషంగా చూస్తారో అంత సంతోషంతో తన్మయుడై పోయి, చివరకు ఏదితీసుకో

డానికీ నిశ్చయం చేయలేకుండా ఉన్నాడు. మధ్యాహ్నానికి బూట్లు, బ్రౌజర్లు, ఏర్పడం అయింది. అవితొడిగి, లుబిష్కిన్ ముటముట్లాడుతూన్న యాకోవు లూకుచ్‌కేసి తిరిగి "రేపు ఉదయంవచ్చి మంచికోటు యేరుకుంటాను" అన్నాడు.

కిర్రకిర్ర లాడుతూన్న కొత్తబూట్లు, అందమైన బ్రౌజర్లు తొడుక్కునేటప్పటికి లుబిష్కిన్ అంతకంటె పది సంవత్సరాలు చిన్నవాడులా కనిపిస్తున్నాడు. అక్కడినుంచి తిన్నగా రాజవీధిలోకి వెళ్ళి వీధివెంటపోయే ప్రతివానిని ఆపి మాట్లాడుతూ నెమ్మదిగా యింటికి బయలుదేరేడు. కనిపించిన వాళ్ళందరితోను ప్రగల్భాలుకొడుతూ యింటికి వచ్చేటప్పటికి అతనికి మూడు గంటలు పట్టింది. ఆసాయంకాలానికి వూళ్ళోఅంతా "లుబిష్కిన్ సైన్యంలో చేరేముందు వేషం వేసినట్లు ఉన్నాడు. ఈ వేళ రోజంతా అతను బట్టలు మేసుకూనే వున్నాడు. మంచి బట్టలు, కొత్త బూట్లు తొడిగి యింటికి వెడుతూ, కొంగలా కులుకుతూ నడిచేటప్పటికి మూడు గంటల సేపు పట్టింది యింటికి వెళ్ళడానికి—కాళ్ళు నెప్పులు లేవోయేమిటో" అని చెప్పుకోడం మొదలెట్టేరు.

డెమ్కా ఉషాకోవు భార్య చైతన్యం లేకుండా పడిపోవడంచేత, లేవతీసి సేద తీర్చవలసి వచ్చింది. ఆమె పూర్వము టిటాక్ భార్యకు చెందిన ఊలు 'స్కర్టు' తొడుక్కొని ఉంది. కాళ్ళని కొత్త బూట్లు వున్నాయి. చాల ఖరీదుచేయు అందమైన ఉత్తరీయం ధరించింది. ఈ కొత్త బట్టలు ధరించిన తరువాత ఆమెని చూసినవాళ్ళు 'డెమ్కా భార్య అంత అందవికారమైనది కాదు. బాగానే ఉంటుంది.' అనుకున్నారు. అంత వరకూ కడుపునిండా తిండి, ఒంటినిండా బట్ట లేక గర్భ దరిద్రం అనుభవించిన ఆమె సమిష్టి వ్యవసాయ క్షేత్రపు సంపద చూడగానే ఆసంతోషం తట్టుకోలేక కొయ్యబారి పోయింది. యాకోవు లూకుచ్ ఆమెముందు చాల విలువైన బట్టలు పడేసి, కావలసినవన్నీ తీసుకోమని చెప్పినపుడు, తగిన

పోషణలేని ఆమె ముఖంలో రక్తం యెలా వుంటుంది? వరసగా ప్రతిసంవత్సరం కాన్పు రావడంచేత, తీరని దరిద్రంచేత ఆమె యవ్వనం, ఆరోగ్యం, అందం క్రమంగా నశించిపోయేయి. పిల్లల్ని చింకిరిగుడ్డలలో చుట్టబెట్టి ఆమె సంవత్సరం పొడుగునా పల్చటి, చిరిగిపోయిన ఒకే స్కర్టుతో కాలక్షేపం చేసేది. ఆ ఒక్క స్కర్టు ఉతికి ఆరేసుకొనినప్పుడు ఆ రోజు అంతా గుడ్డ లేకనే యింట్లో కూర్చుని ఉండేది.

"ఒక్కసారి ఆగండి. ఈషర్టు తీసుగోను నేను............యిది మార్చి......పిల్లలకి కావలసిన దుస్తులు యేవైనా...... మిష్టర్......... దునియా........" అని హీన స్వరంతో, అక్కడనున్న బట్టలపోగుకేసి ఆతురతతో చూస్తూ అంది.

అక్కడనే నిలబడియున్న దేవిడోవుకి ఆమెను చూసేటప్పటికి కడుపు తరుక్కుపోయింది. తిన్నగా ఆమె దగ్గరకి వెళ్ళి.

"ఏమమ్మా! మీకు యెంతమంది పిల్లలు?" అని అడిగేడు.

"ఏడుగురు." డెమ్యాక్ భార్య కళ్ళు పైకి యెత్తకయే నెమ్మదిగా సమాధానం చెప్పింది.

"పిల్లలకు పనికివచ్చే దుస్తులు యేవైనా ఉన్నాయా?" దేవిడోవు యాకోవు లూకుచ్ని అడిగేడు.

"ఆ—ఉన్నాయి."

"ఆమె పిల్లలకి కావలసినవి, ఆమె ఎన్ని అడుగుతే అన్నీ ఇయ్యి."

"అన్ని యిస్తే ఆమె భాగ్యవంతురాలై పోతుందే!"

"ఏమిటీ—అన్నావు? అనతగినమాటేనా అది?" దేవిడోవు కోపంతో మండిపడ్డాడు. యాకోవు మారు మాటాడకుండా పెట్టెతీసి వంగేడు.

డెమ్యాక్ ఉషాకోవు నిశ్శబ్దంగా ఆమె వెనక నిలబడి ఊపిరి బిగపట్టి యిదంతా చూస్తున్నాడు. దేవిడోవు ఆఖరున అన్నమాటలు వినగానే అతని

వైపు చూసేడు. ఆ మెల్లకళ్ళల్లోనుంచి గిర్రున నీళ్ళుతిరిగి రెండుచుక్కలు రాలేయి. అతడు అక్కడినుంచి బయలుదేరి చుట్టూచేరిన జనాన్ని ఎడమ చేతితో వొత్తిగిస్తూ కుడిచేతితో రెండు కళ్ళూ కప్పుకొని వీధిగుమ్మంవైపు బయలుదేరేడు. కళ్ళనీళ్లు కనబడకుండా చెయ్యి అడ్డంపెట్టి, యెక్కడా ఆగ కుండా పీపుల్లోకి వెళ్ళిపోయేడు. కాని అతని చెయ్యి తప్పించుకొని కన్నీటి చుక్కలు బొటబొట కారుతూనే వున్నాయి.

మధ్యాహ్నం బాగా పొద్దు వాలిపోయినతరువాత ఘూకర్ అక్కడికి వచ్చేడు. కాని అక్కడ ఆగకుండా సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయం లోకి వెళ్ళి హడావిడిగా "కామ్రేడ్ దేవిడోవు! యేం చేస్తున్నారు" అన్నాడు.

"రారా! నింపాదిగా ఉన్నావా?"

"నాకోచీటి వ్రాసి యివ్వండి."

"చీటీ యేమని?"

"నాకుకూడ బట్టలు ఇయ్యమని"

"ఎందుకు నీకు యివ్వడం?" దేవిడోవు పక్కని కూర్చునియున్న నగుల్నోవు కనుబొమ్మలెత్తి చూస్తూ అన్నాడు. "గిత్త దూడని చంపేసి చాలా శ్రమపడి వున్నావనా?"

"మకార్! వెనకటి సంగతులన్నీ తవ్వతారెందుకు? ఆ మాట యెత్తుకోకండి. ఎందుకు యివ్వడం అనడంలో అర్థంయేమిటి? ఆ 'టిటాక్' ని తరిమి ఆస్తి అంతా పూతిక పుల్లకూడా పోకుండా జాగ్రత్త పెట్టి చివరకు నానాబాధలు పడ్డవాడెవడు? నేను, కామ్రేడ్ దేవిడోవు మాత్రమే; ఆయనకి రేవునెత్తి బద్దలైంది అంతే; అదేమీ లెక్కలోనిది కాదు. ఆ కుక్క నా గొడ్డెత్తోలు ఏం చేసిందో చూడలేదూ? అలుకు గుడ్డకైనా పనికిరాకుండ పేలికలు చేసేసింది. సోవియటు ప్రభుత్వంకోసం,

సర్వం త్యాగంచేసిన నన్ను అనవలసిన మాటేనా అది ? ఆ గొాత్తెతోలు ప్రాణ ప్రదంగా చూసుకుంటున్నాను: అది నా భార్యది. ఇంతవరకూ దానికి చెప్పకుండా దాచేను. గాని లేకపోతే యీ పాటికి నన్ను ఏం చేసియుండునో?"

"అప్పుడు నువ్వు పారిపోకుండా మాతోటే వున్నట్లయితే నీ గొాత్తెతోలు ఆ కుక్క చింపెయ్యకుండా వుండియుండును."

"ఆ సమయంలో పరుగెత్తకపోతే యెల్లాగ ? ఆ రాక్షసిముండ టిటాక్ భార్య ఏం చేసిందో చూసేవా ? ఆ కుక్కని నా మీదికి వురిగొల్పి 'వాడిని పట్టుగో. ముక్కలు ముక్కలు చేసి పారెయ్యి. వీళ్ళందరికంటె యెక్కువవాడు వీడే ?' అని అర్చింది."

"ముసలితనం వచ్చినా యింకా అబద్ధాలు ఆడడం మానలేదు నువ్వు" అన్నాడు మకార్.

"కాప్రేచ్ దేవితోవు ? మీరు చెప్పండి."

"అది నాకేమీ గుర్తులేదు.... ...."

"ఆమె అల్లా అనడంమాట నిజమే, ఏమీ అబద్ధంలేదు ? ఆ కుక్క పిశాచంలా మీద పడడానికి వస్తూంటే నేను వీధులోకి వచ్చేసిన మాట నిజమే. సాధారణపు కుక్కా అది—పెద్దపులికూడా దానికంటె నయమే?"

"కుక్కని నీ మీదికి యెవ్వరూ వదిలిపెట్టలేదు. ఇదంతా వొట్టి కల్పన."

"మకార్ ! నీకేమీ జ్ఞాపకం లేదు. ఆ కంగారులో భయపడి మనస్సు చెదిరిపోయింది నీకు; ఎల్లా జ్ఞాపకం వుంటుంది ? క్రిందపడిపోయిన నా మీద పడ్డ ఆ కుక్క నన్ను దొడ్డిఅంతా యెల్లా యీడ్చింది ! ఆ విషయా లన్నీ నాకు జ్ఞాపకం వున్నాయి. అప్పుడు ఆ కుక్క కనక నన్ను పట్టు కొనకుండా వున్నట్లయితే టిటాక్‌ను అక్కడే చంపేసివుందును. ఇంకా

భూమిమీద నూకలు వున్నాయి. బతికిపోయేడు. శుద్ధ మొండివాళ్ళలో ఒకడినీ; వెనక ముందు చూడను కోపం వచ్చిందంటే."

నగుల్నోవు ముఖం చిట్లించి దేవిడోవుతో "వెంటనే అతనికి చీటి వ్రాసి యిచ్చి యిక్కడనుంచి పంపెయ్యండి" అన్నాడు.

కాని ఛూకర్‌కి బాతాఖానీ కొడుతూ కూర్చుందాం అనేకాని మొదట తను వచ్చిన పనిధోరణి పోయింది.

"మకార్! చిన్నతనంలో నేను యెల్లా వుండేవాడినో నువ్వ ఎరగవు: బొమ్మలాట వచ్చిందంటే........"

"చెవులు తడకలు కడుతున్నాయి. నీ వాగుడు చాలిద్దూ; నీ సంగతి అనేకసార్లు విన్నాను నేను. ఇనుపగిన్నె వొకటి ఇయ్యమని చెప్పమా: మళ్ళీ కడుపు నొప్పివస్తే కాచుకొనడానికి పనికొస్తుంది."

ఛూకర్ ముఖం చిన్నపుచ్చుకొని దేవిడోవు వ్రాసి యిచ్చిన చీటి పుచ్చుకొని వెడుతున్నాననికూడా చెప్పకుండా గబగబా వెళ్ళిపోయేడు. కాని యాకోవు లూకుచ్ అతని చీటి తీసుకొని మంచి గొర్రెచర్మం ఒకటి ఇయ్యగానే ఆముటముట్లాడడంపోయి వెనకటికళ మళ్ళీ వచ్చింది. చింతాకుల్లాంటి ఆ కళ్ళు సంతృప్తి వెలిబుచ్చుతున్నాయి. కోసక్కులందరి యెదుట ఆ గొర్రెచర్మం ఒకమూల పట్టుకొని పైకెత్తి చూస్తూ, కంఠం సవరించుకొని, "చూసేరు యెలాంటి గొర్రెచర్మమో: స్వయంగా కష్టపడి సంపాదించేను యిది. టిటాక్ ఆస్తి స్వాధీనం చేసుకొనడానికి వెళ్ళినప్పుడు అతడు దేవిడోవుని తలుపు గ్రంధి పుచ్చుకొని కొట్టడం మీ కందరికీ తెలియనే తెలుసును. దేవిడోవు చచ్చిపోయే డనుకున్నాను. అంతే, మరు క్షణంలో ఒక్కపరుగునవెళ్ళి టిటాక్‌ను కొట్టి తరిమేసి మా స్నేహితుని కాపాడేను. ఆ రోజున నేనే కనక లేకపోయినట్లయితే దేవిడోవు యీ పాటికి చచ్చిపోయి వుండును."

"అయితేనూ—ఊళ్ళో అందరూ నువ్వు కుక్క తరుముకొని వస్తే పారిపోయేవనీ, అది మీదపడి పందిని పీకినట్లు నీ గొఱ్ఱెచర్మం పట్టుకొని పీకి చింపేసిందని అనుకొంటున్నారే!" అని అడిగేడు పొకడు.

"అవన్నీ వట్టి అబద్ధాలు. వాళ్ళకి మంచీ—చెడ్డా—యేమైనా వుంటే కాదూ! నోటికి వచ్చినట్లల్లా వాగుతూంటారు. అశుద్ధం తినే వెధవ కుక్క నన్ను కరవడమా! తెలివితేటలు లేవు—ఒక అక్షరంకూడా రావు." షూకర్ తమాషాగా ఆ విషయం మార్చేసి వేరేవిషయంలోకి దింపేడు.

---

## పంధొమ్మిదవ ప్రకరణము

### ఆచరణలో చిక్కులు.

రాత్రి........

గ్రిమాచీలాగ్‌కు ఉత్తరదిశగా అనేక పర్వతాలు, లోయలు, మహారణ్యములు, నదులు దాటి అనేక వందల మైళ్ళదూరమున సోవియట్ యూనియన్ ముఖ్యనగరం ఉంది. పట్టణం అంతటా వేలకొలది ఎలక్ట్రిక్ లైట్లు వెలుగుతున్నాయి. నిశిరాత్రివేళ చంద్రకాంతినికూడ ధిక్కరిస్తూ చాలదూరము పైకి చిమ్ముతూన్న యెలక్ట్రికు లైట్ల కాంతి నేత్రానందంగా ఉంది.

మాస్కోనగరం గ్రిమాచీలాగ్‌కు ఉత్తరంగా తొమ్మిది వందలమైళ్ళ దూరమున వుంది. రైళ్ళ కూతలతోను, మోటార్ల హారన్ ధ్వనులతోను, ట్రాముల బరబర ధ్వనులతోను పట్టణమంతా ప్రశాంతంగా వుండవలసిన ఆ నిశిరాత్రి సమయంలోకూడ—అల్లకల్లోలంగానే కనిపిస్తూంది. లెనిన్ సమాధివెనుక క్రెమ్లిన్ ప్రాసాదం దగ్గర యెఱ్ఱజెండా ఆకాశంలో తటతట

కొట్టుగుంటూ ఎగురుతూంది. క్రిందనున్న ఎలక్ట్రిక్ లైట్ల కాంతి ప్రతి ఫలించి ఆ పతాకం రక్త రంజితంగా కనిపిస్తూంది. నిలుకడ లేకుండా వీస్తూన్న గాలికి నలుదిక్కుల యెగురుతూన్న ఆ జండా విప్లవజ్వాలలు నలుమూలలా రేగి వేయి నాలుకలతో ప్రజల్ని ప్రపంచ విప్లవానికి సిద్ధము కండని హెచ్చరిస్తూందా అన్నట్లు వుంది.

కోంద్రాట్ మైదనికోవ్ రెండు సంవత్సరాలక్రితం మాస్కోలో అఖిల రష్యా సోవియటుల సమావేశానికి వచ్చేడు. ఒకరోజు రాత్రి రెడ్ స్క్వేర్‌లోకి వెళ్ళేడు. అతడు లెనిన్ సమాధికేసి, చాలా యెత్తున ఆకాశములో యెగురుతూన్న యెర్రజండాకేసి విజయగర్వంతో చూస్తూ టోపీ తీసి చేత పట్టుకొని నిలబడ్డాడు. ఆ పొడుకునూలు జాకెట్టుతో వట్టి తలతో తన్మయుడై పోయి చాలాసేపటివరకూ అలాగే నిలబడిపోయేడు.

కాని, గ్రిమాచీ లాగ్‌లో రాత్రులందు గజగజలాడించే చలి, ప్రశాంతమైన ప్రకృతి తప్ప ఆ గంద్రగోళం ఉండదు. చుట్టూ కనుచూపుమేరవరకు, మంచుతో కప్పబడిన బీడుభూములు వెన్నెల రాత్రులందు తళ తళ లాడుతూంటాయి. ఎక్కడా నిలబడడానికి ఆస్కారం దొరకని చీకట్లు లోయల లోనూ, పర్వతాల పక్కన, చెట్లగుబురులలోనూ నిలబడి వున్నాయి. సప్తర్షి మండలం పశ్చిమాన అస్తమిస్తూన్నట్లుగా వుంది. గ్రామ సోవియటు దగ్గరనున్న పాప్లారుచెట్టు మసగగానున్న విశాల ఆకాశంలోకి చేతులుజాపి నిలబడియుంది. కరిగినమంచు, మర్మర ధ్వనులతో ప్రవహిస్తూ నదిలో పడుతూంది. ఆ నిశ్శబ్దంలో దుప్పి మేతమేస్తూ చిన్న కొబ్బనొకదానిని విరిచిన ధ్వని కూడ వినిపిస్తూంది. ఉండి యుండి చెట్లకొమ్మలనుంచి జారుతూన్న మంచుముక్కలు నేలమీదపడి అవుతూన్నధ్వని ఆ నిశీథ నిశ్శబ్దములో అంతరించిపోతూంది.

నిశ్శబ్దము.... ....

తూర్పు తెల్లవారేటందు మాత్రము ఉత్తరాన్నుంచి వీచే గాలితో బాటు క్రమ క్రమంగా ప్రకృతిలోకూడ చైతన్యం కలుగుతుంది. రాత్రి అయిపోయి పగలు వస్తున్నందుకు సంతోషిస్తున్నాయా అన్నట్లు నది పక్కన ఆకులు రాలిపోయి మోళ్ళలా నిలబడియున్న చెట్లు ఊగుతూన్నాయి. రాత్రి అంతా గడ్డిమేట్లదగ్గర గింజలు యేరుకు తింటూన్న పిట్టలు కలకల ధ్వనులతో యెగిరిపోతున్నాయి. తల్లుల దగ్గరకు వెళ్ళడానికి దూడలు 'అంబా' యని అరుస్తున్నాయి. కొత్తస్థలం అవడంచేత సమిష్టి వ్యవసాయ క్షేత్రపుకోళ్ళు, విధి విరామం లేకుండా కూస్తున్నాయి. ఇళ్ళమీద నుంచి పొగ చుట్టలు చుట్టలుగా లేస్తూంది.

గ్రిమావీ అంటుకూ రాత్రులందు కంటిమీద కునుకు లేకుండా మేలుకొని ఉండేవాడు కోంద్రాట్ మైదనికోవు వొక్కడే. పెద్ద చుట్ట నోటబెట్టి యెంతకీ తెగని ఆలోచనలలో తల బరువెక్కినా అలాగే ఆలోచిస్తూంటాడు.

అర్థరాత్రి కోంద్రాట్‌కి యెలక్ట్రిక్ లైట్లతో దేదీప్యమానంగా వెలుగుతూన్న మాస్కో నగరము, రక్త కాంతులీనుతూ క్రెమ్లిన్‌మీద యెగురుతూన్న యెర్రి జండా, సోవియటు యూనియన్ వెలుపలనున్న విశాల ప్రపంచం అంతటను దుర్భర దారిద్ర్యంతో కృంగిపోతూ బక్కచిక్కిన శరీరాలతో, కళ్ళనీళ్ళతో, దీనత్వం దోపిస్తూన్న కూలీలు, కళ్ళల్లో మెదులుతూన్నారు. చిన్నప్పుడు అతను యేడుస్తూంటే ఊరుకో పెట్టడానికి అతని తల్లి అన్న మాటలు జ్ఞాపకం వచ్చేయి.

"కోండ్రాట్ యేడవకు—దేవుడికి కోపం వస్తుంది. ప్రపంచం లోని బీదవాళ్ళంతా ప్రతిరోజూ యిల్లా యేడుస్తూ, సమస్తం కొద్దిమంది ధనవంతులు స్వాధీనం చేసుకొని తమబోటి మిగిలిన ప్రజాసామాన్యాన్ని అందర్నీ పీడిస్తున్నారని భగవంతుడికి మొరపెడుతూనే వున్నారు. కాని భగవంతుడు బీదవాళ్ళని ఓర్పు వహించి వుండమన్నాడు. అందుచేత బీదవాళ్ళూ, అన్నార్తులూ, యేడ్చినప్పుడు కోపం వచ్చి, వాళ్ళ కన్నీళ్ళన్నీ

పోగుచేసి పొగమంచుచేసి కన్నూ—మిన్నూ కనిపించకుండా సముద్రంమీద వదిలేస్తాడు. దారి తెలియక సముద్రం మీదనుంచి వెళ్ళే వోడలు ఆ మహా సముద్రంలో మూడు దారుల పడిపోయి, చివరకు యే కొండకో తగిలి బ్రద్ద లయి ప్రజలంతా చచ్చిపోతారు. ఒక్కొక్కప్పుడు ఆ కన్నీళ్ళని ఉప్పటి మంచునాచేసి పొలాల మీద కురిపిస్తాడు. అందుచేత ఆ పొలాన్నీ పాడైపోయి గొప్ప కరువులు, మహామ్మారి మొదలయినవి వచ్చి జన నాశనం అయిపో తుంది. తెలిసిందా—అందుచేత మనబోటి పేదవాళ్ళు యెప్పుడూ యేడవకూ డదు. ఏడుస్తే వానివల్ల నష్టం మనకే కదూ. .. ... కోంద్రాట్ భగవం తుడిని ప్రార్థిస్తాడు; ప్రార్థనలు చెప్పడం త్వరగా అలవరచుకుంటాడు' అంది.

"అమ్మా, మనం పేదవాళ్ళమా? నాన్నకూడా పేదవాడే?" చిన్న కోంద్రాట్ తల్లిని అడిగేడు.

"అవును నాయనా — మనం పేదవాళ్ళమే" అని అతని తల్లి జవా బిచ్చింది. కోంద్రాట్ సిలువదగ్గరకువెళ్ళి మోకరిల్లి భగవంతుణ్ణి ప్రార్థించి ఆయన కోపగిస్తాడేమోననే భయంతో కళ్ళనీళ్లు తుడిచేసుగున్నాడు.

కోంద్రాట్ ఒక దాస్ రైతుకు కొడుకు. ఇప్పుడు సమిష్టి వ్యవ సాయ క్షేత్రంలో సభ్యుడు: సమిష్టి వ్యవసాయ క్షేత్రం యేర్పాటుచేసిన ఆ మొదటి రోజులలో అతడు ఆలోచిస్తూ కూర్చుంటే ఆ రాత్రులు యెంతకీ తిరిగేవి కావు. అతని తండ్రి సైన్యంలో పనిచేసేటప్పుడు 'ఇవనోవో— వొజ్నసెన్స్కి'లో సమ్మె చేసిన మిల్లు కూలీలను గుర్రాలతో తొక్కించియు, సన్నీలతో పొడిచియు, అనేక విధాల బాధించి సమ్మె రూపుమాపి మిల్లు యజమానులకు సహాయం చేసేడు. అతని తండ్రి చచ్చిపోయేడు. కోంద్రాట్ పెరిగి పెద్దవాడయి, 1920 సం॥రం పోలిషు విప్లవవ్యతిరేకుల్ని నరికి పోగులు పెట్టేడు. మిల్లు యజమానుల ఆధిపత్యమును నిలబెట్టుటకు ప్రయత్నించే 'రాంగిల్' సైన్యాలతో పోరాడి, కూలీ ప్రభుత్వమైన సోవి యటు ప్రభుత్వాన్ని నిలబెట్టేడు.

కోంద్రాట్‌కి దేవుడంటే నమ్మకం చాలాకాలము క్రిందటేపోయింది. ఇప్పుడు ప్రపంచ ప్రజాసామాన్యాన్ని దాస్య శృంఖలాలనుంచి విడిపించి అభివృద్ధి మార్గానికి నడిపిస్తూన్న కమ్యూనిస్టు పార్టీని వొక్కదానినే నమ్ము తాడు. అతడు తన గుఱ్ఱము, ఎద్లు, ఆవు, చివరకు కోళ్ళనికూడ సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఆధీనం చేసేడు. కష్టపడి పనిచేసుకొనే ప్రతివ్యక్తికి జీవితావసరములకు లోపము లేకుండా సమాన స్వాతంత్ర్యము కలిగియుండ డమే అతని ముఖ్యాశయము. సోవియటు ప్రభుత్వానికి అతనికి అవినా భావ సంబంధం యేర్పడింది. కాని అతనికి రాత్రులు నిద్రయేలేదు. తన స్వంతఆస్తి అనుకునేవాటి నన్నిటిని సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి యిచ్చేసి నప్పటికి వాటిమీది ఆకాంక్ష వదలక పోవుటయే దీనికి కారణం.

అంతక్రితంవరకు అతనికి తెల్లవారుఝాము మొదలు చీకటి పడే వరకు ఊపిరి తిరగకుండా పని యుండేది. ఉదయాన్నే లేచి దూడలపాక బాగుచేసి అన్నిటికి గడ్డివేసి ఝాముపొద్దు యెక్కేక ఊరిబయట నదికి తోలుకుపోయి నీళ్ళుపెట్టి తోలుకువచ్చేవాడు. మళ్ళీ మధ్యాహ్నము మేటి లోనుంచి గడ్డి తీసుగువచ్చి వేసి పక్కలు తేలీలా మేపేవాడు. రాత్రికూడా మెలకువ వచ్చినప్పుడల్లా దూడల పాకలోకి వెళ్ళి అన్నిటి దగ్గర గడ్డి ఉందో లేదో చూసి చెదిరిపోయిన గడ్డిఅంతా పోగుచేసి వెడుతూండేవాడు. పశువుల్ని చూసుకొని అవ్యాజమైన ఆనందంతో అతని హృదయం ఉప్పొంగిపోయేది. కాని ఇప్పుడు అతని దొడ్డిఅంతా బావురుమంటూంది. సంరక్షణ చేసేటందుకు ఆ పశువులు యేమీ లేకపోవడంచేత యేమీ వుబుసు పోవడంలేదు. పశువుల కొట్టం ఖాళీగావుంది. ఆఖరికి రాత్రులందు వొక్క కోడికూతకూడా వినిపించడం లేదు. ప్రతి ఝాముకి కూత కూస్తూండే కోడి లేకపోవడంచేత అతనికి రాత్రి యెంత పొద్దుపోయినదీ కూడ తెలియక 'రాత్రి యెంతకీ తరగదేమి?' అనిపించేది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో పశువుల్ని సంరక్షణ చెయ్యడానికి ఆతనివంతు వచ్చినప్పుడు మాత్రం వెనకటి మాంద్యం అంతా వదలిపోయి నూతనోత్సాహం వచ్చేది. ఉదయాన్ని లేవగానే కళావిహీనంగా ఉన్నదొడ్డి విచారకరమయిన భార్యముఖము చూడకుండా తప్పించుకొనడానికి, బయటకి వెళ్ళిపోతూండేవాడు.

ఇప్పుడు అతనిభార్య పక్కని పడుకొని నిద్రపోతూంది. అతని కూతురు 'క్రిష్టిష్కా' వేరే మంచముమీద పడుకొని నిద్రపోతూ, "నాన్నా ........చూడు.........యెంత బాగుందో........."అని పలవరించింది అగ్గిపెట్టికి ఒకదానికి చక్రాలుపెట్టి బండిచేసి యిస్తే, ఆమె చిన్న బొమ్మని దాన్లో పెట్టి, బండి యీడ్చుగుంటూ, యెంతో మురిసిపోతుంది. ఆ రోజల్లా దాన్ని ఈడ్చుగుంటూ తిరుగుతుంది. ఆమర్నాడు మళ్ళీ ఇంకో కొత్తరకం ఆట వస్తువుయిస్తే కాలక్షేపం చేస్తూంటుంది.

కోంద్రాత్ ఆలోచనలు వేరు. ఆ ఆలోచనలకి అంతులేకుండా వలలో చేపలా కొట్టుగుంటున్నాడు. "ఎంత ప్రయత్నం చేసినా యీ మమకారం వదలడంలేదు. దీనికి కారణం యేమిటి? నేను ఒబేలాలోతిరిగేటప్పుడు అన్ని గుఱ్ఱాలని మామూలుగా చూస్తూ వెడతాను. కాని నా గుఱ్ఱం దగ్గరకు వెళ్ళి కత్తిరించిన దాని యెడమచెవి. నడ్డిమీదనుంచి తోక వరకున్న నల్లటి చారిక చూడగానే యెక్కడ లేని ఆనందం కలుగుతుంది. మిగిలిన గుఱ్ఱాలన్నిటికంటె, దానికి మంచి గడ్డి వెయ్యాలని అనిపిస్తుంది. ప్రతీవాళ్ళూ అంతే. వాళ్ళ గుఱ్ఱాలమీద వుండే ప్రేమ, శ్రద్ధ మిగిలిన వాటిమీద లవలేశమైనా ఉండదు. కాని నిజంచేత అవి 'ఇతరులవి' కావు. మనవి అందరివీను... .........అసలు చాల మందికి వాటి సంరక్షణే తెలియదు—యెన్నడేనా యెరిగి వుంటేనా! నిన్న కురునోస్కాపు వంతు వచ్చింది. అతను చుట్ట కాలుస్తూ కూర్చుని, గుఱ్ఱాలకి నీళ్ళు పెట్టడానికి

ముక్కుపచ్చలు ఆరని కుర్రవెధవని ఒకణ్ణి పంపించేడు. వాడు వొక గుడ్డముక్క తీసుకురావా లేకుండా యెక్కి, మిగిలినవాటి నన్నిటిని నది దగ్గరకు పరుగెత్తించేడు. గుర్రాలన్నీ నీళ్లు తాగేమో లేవో — ఇంతలో యేదో ఒక్కటి మునిగిపోయినట్లు వాటినన్నిటిని మళ్ళీకొట్టి తమవేళాకి తరుముకొచ్చేడు. ఇల్లా చేసేదని మొనవర్గరేనా అంటే పళ్లు బిగించి 'నీమాత్రం గ్రహించవా మాట మొదరికేనా' అంటాడు. మొనళ్ళమట్టుకు వాళ్ళే ఆస్తి పోగొట్టుకోవాలనుకొనవంలో వస్తుంది యీ పేచీ అంతా. పైవాళ్ళగుర్రాలు మెరిగిపోతే మనకెందుకు, అనేకుచ్ఛ్వాసపూర్తి సవరణ 'పిట్టబోర్డు' పెట్టి పెట్టడంతో మాలించిన అశ్రద్ధనిగురించి దేవదోవుకి చెప్పడం మరచిపోయాను. గుర్రాలని యింత అశ్రద్ధగా చూస్తే వేసవినాటికి యెందుకైనా పనికి ఉపయోగిస్తాయా? కోళ్ళవిషయం యేంచేస్తున్నారో రేపు వుదయం చూడాలి; అప్పుడే కొన్ని కోళ్లు చచ్చిపోయేయని చెబుతున్నారు ఆడవాళ్లు. ఇల్లా అయితే యేమేనా వుందా? ఇంత హడావిడిగా కోళ్ళనికూడా తీసుగు పెళ్ళడం యెందుకు? ఇంటికి వొకొక్క కోడినైనా వదిలెయ్య వలసింది గడియారం లేవిలోటు లేకుండా. క్రిస్టిషాక్ ఆ చిట్టిపాదాలకి బూట్లు లేకుండా తిరుగుతూంది. కొంచం అనుకుంటే కో ఆపరేటివ్ షాపులో ఏమీ లేవన్నారు. మనం యెల్లాగైనా కాలక్షేపం చెయ్యవచ్చుగాని చంటిపిల్లలకి మాత్రం తప్పకుండా వొక జత బూట్లు కొని ఇయ్యాలి దేవిడోవుని అడగడానికి మొహమాటం నాకు. సరే యీ శీతకాలం యెల్లాగో గడచిపోతే మళ్ళీ సంవత్సరాన్నుంచి యేమీ అవసరమే వుండదు."

పంచవర్ష ప్రణాళికను పూర్తి చెయ్యడానికి ప్రజలందరు యెంతటి శ్రమనైనను లెక్కచెయ్యక పనిచేస్తూండడం జ్ఞప్తికి వచ్చి, కోంద్రాట్ గుప్పెళ్లు బిగించి పశ్చిమదేశాలలోని కమ్యూనిస్టులుకాని కూలీలతో మనస్సులోనే వాదించడం మొదలెట్టేడు. "మీ యజమానులు చూపించిన కొద్ది లాభాలకు ఆశపడి మమ్మల్ని నట్టేట వదిలేశారు! మీ బాగు చూసుకొని

మమ్మల్ని దగా చేసేరు. మీరు సోవియట్ ప్రభుత్వం యెందుకు ఏర్పాటు చేసుకోలేరు? మీరు యింత వెనక పడి ఉండడానికి కారణం యేమిటి? మీ జీవితాలు కనక దుర్భరం అయినట్లయితే విప్లవం యీపాటికి తిరుగుబడ్డే యుండును. కాని కమ్యూనిజం యింకా బాగా మండడం లేదనిపిస్తుంది. సరే. తొందర పడకండి, కొద్దికాలంలో మీ యజమానులే తెరిపిస్తారు మీ కళ్ళు. ప్రపంచం అంతా మా మీద కత్తి కట్టి యుండడంచేత ఆర్థిక పునర్నిర్మాణములో యెంత శ్రమపడవలసి వస్తుందో చూస్తున్నారా? ఒకపక్క మాడుతూ ఒంటినిండా గుడ్డకూడా లేకుండా సగం చిరిగిపోయిన బట్టలతో వళ్లు వణకుతూ ఆరాగే పనిచేస్తున్నాము. ఇంత శ్రమపడి మేము సోషలిజం స్థాపించిన తరువాత, మీరు యేమి శ్రమలేకుండా అది అనుభవించడానికి రావడానికి మీకు సిగ్గులేదూ?"

ఇల్లా ఆలోచిస్తూనే కొంత సేపటికి నిద్రపోయేడు. నోట్లోని చుట్ట జారి చొక్కామీద పడడంచేత అది కాలి బొర్రి పడిపోయింది. నిప్పువేడి తగిలి అతడు ఉలికి పడి లేచి అతనికున్న ఆ వొక్క చొక్కా కాలిపోయినందుకు తిట్టుకుంటూ సూది, దారము కోసం చీకట్లోనే తడుములాడడం మొదలెట్టాడు. లేకపోతే ఉదయాన్ని 'ఆనా' ఆ బొర్రి చూసిందంటే రెండు గంటలవరకూ సాధించి చంపుతుంది. కాని యెంత సేపటికీ సూది దారము దొరకలేదు.

మళ్ళీ కొంత సేపటికి నిద్రపోయేడు.

ఉదయాన్నే లేచి, అతడు దొడ్లోకి వెళ్ళేడు. అకాస్మాత్తుగా పెద్ద గొడవ వినిపించింది సమిష్టి వ్యవసాయ క్షేత్రపు కోళ్ళనన్నిటినీ వొకేచోట ఉంచడంచేత అవి అన్నీ యెడతెరిపిలేకుండా కుయ్యడం మొదలెట్టేయి. కళ్లు బాగా విప్పారి చూస్తూ రెండు నిముషములు వివేకదృష్టితో వాటి కూతలు విని, చిరునవ్వు నవ్వుకుని "చెవులు ఘళ్ళుపడేలా యెల్లా కూస్తున్నాయో!" అనుకున్నాడు. 'బాండు వాయిద్యం వాయించినట్లే' ఆ చుట్టు

పక్కలవాళ్ళకి యెవరికీ రాత్రుళ్లు నిద్రవుండదు. వెనక అన్నీ తలొకసారి కూస్తూండేవి. ఇప్పుడు యెలా కూస్తున్నాయో!" అతను కాలకృత్యాలు తీర్చుగోడానికి వెళ్ళిపోయేడు.

ఉదయం భోజనం అయిన తరువాత అతడు సమిష్టి వ్యవసాయ క్షేత్రపు కోళ్ళ దొడ్డిలోకి వెళ్ళేడు. అక్కడ వున్న 'అకిమ్-బెష్లిక్బోన్నైవు:

"ఉదయాన్నే యిక్కడికి వచ్చేవేమి, దోవ తప్పిపోలేదు కదా!" అన్నాడు కొంచెం కోపంతో.

"ఒక్కసారి నిన్ను, కోళ్ళని చూసి పోదం అని వచ్చేను. ఎల్లా వుంది యేమిటి, యిక్కడ?"

"నరకంలో వున్నట్లు వుంది.........పని లేకపోయినాసరే. ఇక్కడ మాత్రం వుండలేను."

"అల్లా అంటున్నావేమి?"

"ఈ కోళ్ళు నా ప్రాణాలు తోడేస్తున్నాయి."

"ఎల్లాగ?"

"ఒక్కరోజు యిక్కడ వుండి చూడు. ఎల్లాగో నీకే తెలుస్తుంది! పీట్లని తగలెయ్యా. రోజంతా బొమ్మలాటతప్ప రెండోపనే లేదు వాటికి. విడిపించడానికి వాటివెనక పరిగెత్తలేం చస్తున్నాను. పుంజులేకాని పెట్టలు బొమ్మలాడవు అంటావు నువ్వు. కాని అవి ఒకదాని జుట్టు వొకటి పట్టుకొని దొడ్డి అంతా పడి కొట్టుకుంటూనే వున్నాయి. ఈ పనిమాత్రం నేను చెయ్యను. ఈ రోజునే దేవిదోవు దగ్గరకు వెళ్ళి తేనెటీగల పెంపకం నాకు వొప్పచెప్పమని అడుగుతాను."

"క్రమంగా అవే అలవాటు పడతాయి. విసుక్కుంటే యెల్లాగ?"

"వాటికి అలవాటు అయేటప్పటికి యిక్కడ నా పని అవుతుంది. నువ్వు యేమనుకున్నా సరే కాని, మగవాళ్లు చెయ్యవలసిన పనేనా యిది?

ముసలివాడిని అపుతేమాత్రం, కోసక్కాని నేను: టర్కీ యుద్ధంలో పని చేసేను. ఇక్కడ నాకు కోళ్ళపెంప సర్వాధిపత్యం యిచ్చేరు. ఈ పని మొదలెట్టి రెండు రోజులయిందో లేదో అప్పుడే ఊళ్లోవాళ్ళంతా వుడికించి చంపేస్తున్నారు. నేను యింటికి వెడుతూంటే, 'కోళ్ళ తాత' అనీ 'కోళ్ళ అకీమ్' అనీ పేర్లుపెట్టి పిలుస్తున్నారు. ఇంతవరకు నలుగురిలోనూ, గౌరవంగా బ్రతికి ఆఖరికి యీ ముసలితనంలో చచ్చీచెడీ 'కోళ్ళతాత' అని పిలిపించుకుంటానా? నాయెత్తు ధనం పోసినా యీ పని మాత్రము నాకు వద్దు"

"అకీమ్! ఆవిషయం వదిలెయ్యి. ఎవళ్ళో కొంటెవెధవలు అల్లా పిలుస్తే లెక్కేమిటి."

"పోనీ. కుర్రాళ్లు పిలుస్తే మాట్లాడక వూరుకొనే వుందును! ఆడవాళ్లుకూడా మొదలెట్టేరు! నిన్న మధ్యాహ్నం భోజనానికి వెడుతూంటే 'నాస్తియా-దొనిట్స్కీవా' నూతిదగ్గర నీళ్ళు తోడుకుంటూంది. 'తాతా కోళ్ళని బాగా చూస్తున్నావా?' అంది. 'ఆ_నాకు చేతనయినట్లు, చూస్తున్నాను' అన్నాను. 'ఏపేనా గుడ్లు పెడుతున్నాయా?' అంది. 'కొన్ని పెడుతూన్నాయి. కాని బాగా యెక్కువగా పెట్టడంలేదు' అన్నాను. పళ్లు ఇకిలించి యెల్లా నవ్వింది, వెధవ! 'ముక్కులనాటికి తక్కెడు గుడ్లేనా పెట్టేలా చూడు.' అంది. 'లేకపోతే కోడిపెట్టల్ని నీ చేత పొర్లిస్తాము జాగ్రత్త!' అటువంటి వేళాకోళాలు చేసేకాలం దాటిపోయింది నాకు; ఈ పని కూడా చాల విసుబు వేస్తుంది."

ఆతడు యింకా యేదో చెప్పబోతూన్నాడు. కాని యింతలో పాక మూల రెండుకోళ్లు దొమ్ములాడడం మొదలెట్టడంచేత అకీమ్ కర్ర వొకటి చేత పుచ్చుకొని వాటివైపు పరుగెత్తవలసి వచ్చింది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసు – యెందుచేతనోగాని – ఉదయముననే చాల రద్దీగా వుంది. వాకట్లో రెండు గుర్రాలు పూన్చిన స్లెడ్జి

బండి యొకటి, దేవిదోవుకోసం నిలబడియుంది. దేవిదోవు జిల్లా పట్టణానికి వెళ్ళడానికి సిద్ధం అవుతున్నాడు. లాషినోవు గుఱ్ఱం నేల దువ్వుతూ నిలబడియుంది. ఉడిప్కాన్ ఆ గుఱ్ఱానికి జీను అమరుస్తున్నాడు. 'ట్యుబ్యానోవ్కా' వెళ్ళి అక్కడనున్న సముష్టి వ్యవసాయక్షేత్రపు మేనేజరుతో వ్యవసాయయంత్రాలను గురించి మాట్లాడడానికి కోంద్రాట్ యొకటి గదిలోకి వెళ్ళేడు. పట్టణాన్నుంచి కొత్తగావచ్చిన గుమస్తా ఒకడు పుస్తకాలు తిరగేస్తున్నాడు. అతని యెదురుగా కూర్చొని యాకోవ్ లూకిచ్ యేదో వ్రాస్తున్నాడు. ఆ గదిలోనే సముష్టి వ్యవసాయ క్షేత్రములోని కూలీలు కొందరు నిలబడియున్నారు. ఒకమూల 'ఇప్పోలిట్-షాలీ' అను వడ్రంగితో ఆర్కాడీ, అగాఫన్, డుబ్ట్సేవులు మాట్లాడుతున్నారు. ఆ పక్క గదిలోనుంచి రజ్మద్నోవు మాటలు వినపడుతున్నాయి. అతను యెక్కడనుంచో అప్పుడే వచ్చి దేవిదోవుతో మాట్లాడుతున్నాడు.

"ఈ వుదయాన్నే నన్ను చూడడానికి నలుగురు ఆడవాళ్లు వచ్చేరు: మిష్కా ఇగ్నటియోనక్ తల్లి, ముసలి ఉల్యానా వాళ్ళకి నాయకురాలు. ఆమెను యెరుగుదురా ? ఎరగరూ, గాదిలా వుంటుంది. చెరుపుతే యుద్ధరపుతుంది. ముక్కుమీద వులిపిరికాయ వుంటుంది. అంతే — వాళ్ళు వచ్చేరు. ఆ ఉల్యానా కేకలెయ్యడం మొదలెట్టింది. ఎందుకో నాకేమ్మీ అర్థమయిందికాదు ! సోవియటు ఆఫీసులో నాచుట్టూ చాలామంది వున్నారు. ఆమె యెంతకీ వూరుకోకపోవడంచూసి 'అల్లాంటి మాటలు రాసెయ్యక నోరు మూసుగో. లేకపోతే ప్రభుత్వాన్ని నిందించిన నేరానికి నిన్ను జైలుకి పంపించవలసి వస్తుంది' అన్నాను. తరువాత 'యెందుకు అంత కోపంగా వున్నావు ?' అని అడిగేను. ఆమె 'మా బోటి ముసలి ముండల్ని బ్రతగనియ్యవల్చుగోలేదా ? 'నీకు యిలాంటి పాడు ఆలోచన యెందుకు పుట్టింది ?' అని సమాధానం చెప్పింది. అసలు విషయం యేమిటో కనుక్కునేటప్పటికి నాకు తలప్రాణం తోకకి వచ్చింది. వచ్చే

పేపరులో సమిష్టి వ్యవసాయక్షేత్ర మేనేజిమెంటు కమిటీ, గ్రామములో 60 సంవత్సరములు దాటి, పనిచేయుటకు అశక్తులైన ఆడవాళ్ళందరిచేత ..................." రజ్మనోవ్నా నవ్వలేక ఉక్కిరి బిక్కిరి అయేను. "...............గుడ్లని పొదిగేటందుకు తగిన యంత్రసామగ్రి లేక పోవడంచేత, ఆ పని వాళ్ళకి వొప్పచెప్పారుట! వాళ్ళకి కోపం పట్ట శక్యం గాకుండా వుంది. ఆ 'ఉర్యానా' కంఠం పోయేటట్లు తెగ తిట్టి పోసింది. ఏమిరా! పొంగనుంచా కోడనా! గుడ్లు పొదగమంటావుట్రా నన్ను? ఊరంతా చచ్చి మన్నుమూసినా సరే నాచేత ఆ పని చేయించ లేవు. చీపురుకట్ట తిరగేసి దగ్గరకు వచ్చిన వాళ్ళందర్నీ వీపు చిట్లగొట్టి, చివరికి దేన్లోనైనా పడి చచ్చిపోతాను." వాళ్ళందరికిందా గట్టిగా అరుస్తూ నేను అందుకున్నాను. 'ఉర్యానా! ఆ పనిమాత్రం చెయ్యకు. నువ్వు పడి చచ్చిపోయేటందుకు సరిపోయినంత నీరు లేదులే నదిలో. ఇవన్నీ అబద్ధాలు. భాగ్యవంతులు కల్పించేవి.' హామేన్ దేవుడోయ్! మా సేరా మెటు వంటి సన్యాసం వస్తేనో! మనుషుని ధ్వంసం చెయ్యడానికి యిటువంటి పుకార్లు పుట్టిస్తున్నారు. ఈ విషయం వాళ్ళకి యెవరు చెప్పేరో తెలుసు కొనడానికి అనేకసార్లు అడిగా. చివరకు ఆమె రెండురోజుల క్రితం మైస్కోవాయ్‌నుంచి వచ్చిన ఒక సన్యాసిని ఆ రాత్రి టిమోఫీ బోర్షేవు యింట మకాం చేసి, కోళ్ళని అన్నిటిని పట్నాలకి యెగుమతి చెయ్యడానికి పోగు చేస్తున్నారనీ, కొత్తరకపు కుర్చీలు తయారుచేసి వాటిలో గుడ్లుపెట్టి పైన గడ్డివేసి అరవై సంవత్సరములు దాటిన ఆడవాళ్ళందర్నీ వాటిలో బలవంతంగా కూర్చోపెట్టి గుడ్లు పొదిగిస్తారనీ, బలవంతంగా కూర్చో పెట్టినా విననివారిని కుర్చీలలో కూర్చోపెట్టి కట్టేస్తారనీ' చెప్పిందట"

"ఆ సన్యాసిని యెక్కడ ఉంది?" అని నగుల్నోవు ఆతురతగా అడిగేడు.

"దానికి తెలుసును ఆ మాత్రం! అంత తెలివి తక్కువది కాదు! అతి నమ్మకంగా అబద్ధాలుచెప్పి, రెండో కంటివాడికి తెలియకుండా పారిపోయింది."

"అలాంటివాళ్ళని పట్టుకొని వెంటనే జైళ్ళలో పారెయ్యాలి. నా చేతిలోంచి పారిపోయింది. దొరికినట్లయితే గుడ్డలు వూడతీసి, కొరడాతో. తోళ్లు వూడేటట్లు కొడుదును. సోవియటు చైర్మన్ అయియుండీకూడా, ప్రాన్స్కికి కొత్తవాళ్లు యెవరు వస్తున్నారో, యేం చేస్తున్నారో తెలుసుకొనకుండా అంతా గుడ్డిదర్బారులావుంది; ఈలా వున్నాయి పరిస్థితులన్నీ!"

"వస్తే రానీ; అస్తమానూ యెవరు కనిపెట్టుగుని చూడగలరు!"

డేవిడోవు పెద్దకోటు తొడిగి పైన గొర్రెచర్మం కప్పుకొని 'టేబులు' ముందు కూర్చుని, సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యులచేత ఆమోదింపబడిన, వేసవి చల్లికల 'ప్లాను' ను చూస్తున్నాడు. తల పైకి యెత్తకుండానే అతను ఇలా అన్నాడు.

"అపనిందలు మోపడం అనేది శత్రువులు మనమీద పూర్వంనుంచీ ఉపయోగిస్తూన్న ఆయుధమే. సోమరిపోతుల్లా యిలాగ తిరుగుతూ మన పని అంతా పాడుచెయ్యడానికి ప్రయత్నిస్తూంటారు. ఇప్పుడు మనం కోళ్ళ విషయంలో చేసినట్లు, అప్పుడప్పుడు తెలివితక్కువ పనులుచేసి వాళ్ళకి అవకాశాలు కలిగచేస్తూంటాము..........."

"కోళ్ళ విషయంలో యేం చేసేము!" అన్నాడు నగుల్నోవు ముక్కులు పెద్దవిచేసి.

"కోళ్ళనికూడ సమాజపరం చెయ్యాలనుకున్నాము."

"దాల్లో తప్పులేదు."

"అంతా తప్పే: ఏమీ సందేహం లేదు. అతి స్వల్పమైన దాని కోసం ప్రజలకు బాధ కలిగించేము. ముందు వేసవి చల్లికలకి కావలసిన

పన్నీ సిద్ధము చేసుకొనకుండానే తొందరపడి యీ కోళ్ళని సమాజపరం చెయ్యాలనడం బుద్ధి తెలివి తక్కువ. నన్ను నేనే నిందించుగోవాలి. నేను అక్కడికి వెళ్ళగానే జిల్లాకమిటీ మనం ఇవ్వవలసిన ధాన్యపుపన్ను యింకా యెందుకు యివ్వలేదని అడుగుతుంది.... ...."

"కోళ్ళని సమాజపరం చెయ్యడంలో తప్పేముందో చెప్పండి. సభ్యులంతాకూడ అంగీకరించేరు. అంగీకరించలేదూ ?"

"సభ్యులంతా అంగీకరించేరా, లేదా అన్నదికాదు మనకి కావలసింది." వేపిదోవ్ ముఖం చిట్లించేడు. "సమష్టి వ్యవసాయ క్షేత్రం బలపరచి, గ్రామములోని రైతులనందర్ని సభ్యులుగా చేర్చి. తరువాత వ్యవసాయం సాగించడంమీదే యిప్పుడు మన దృష్టి అంతా కేంద్రీకరించాలి గాని, కోళ్ళనికూడ సమాజపరం చెయ్యాలన్న చిన్న విషయంమీద చాలమందిని మనకు ప్రతికూలురనుగా చేసుకొనడం మంచిదికాదని మీకు తెలియదూ ? కోళ్ళవిషయమై మనం చేసినపని రాజకీయదృష్ట్యా తప్పటడుగని ఘంటాపథంగా చెప్పగలను. ముమ్మాటికీ పొరపాటే. నిన్నరాత్రి సమిష్టి వ్యవసాయ క్షేత్రమును గురించి వొక పుస్తకం చదువుతూంటే యీ విషయం తట్టింది. మన యీ సమిష్టి వ్యవసాయ క్షేత్రం కో-ఆపరేటివ్ అసోసియేషను అన్న విషయం జ్ఞాపకం ఉంచుకోండి. కాని దానిని యిప్పుడు 'కమ్యూన్' గా మార్చడానికి ప్రయత్నం చేస్తూన్నాము. ఆ మాట నిజమేనా ? అది అతివాద పద్ధతి. సావకాశంగా ఆలోచించండి. నేనే కనక మీ స్థితిలో వున్నట్లయితే (మీరే దీనిని తీర్మానమునకు పెట్టి మా అందరిచేత వొప్పించేరు.) చేసిన పొరపాటుని అంగీకరించి కోళ్ళు, బాతులు, యెవరివి వారికి యిచ్చేస్తాను. బోల్షివికు చేసిన పొరపాటు గుర్తించడానికి యెన్నడూ వెనుదీయడు. మీరు యీ పని చెయ్యకపోయినట్లయితే నేను పట్టణాన్నుంచి తిరిగి వచ్చిన తరువాత అయినా ఎవరివి వాళ్ళకి యిప్పించేస్తాను. ఇక నేను వెళ్ళాలి. సెలవు"

అతను టోపీ పెట్టుకొని భాగ్యవంతుల దగ్గరనుంచి స్వాధీనపరచు కొన్న పంచి గొఱ్ఱె చర్మం పొరటి, చలిగాలి తగలకుండా చెవులకంటూ కప్పుకొన్నాడు. డాక్యుమెంటుకేసు చేతపట్టుకొని రెండడుగులు వేసి ఆగి "దేశం అంతటా యిటువంటి దొంగ సన్యాసులు అనేకమంది తిరుగు తున్నారు. మనల్ని గురించి లేనిపోని అబద్ధాలు అన్నీ కల్పించి చెప్పి ఆడవాళ్ళని ముసలివాళ్ళని మనకి వ్యతిరేకుల్నిగా చెయ్యడానికి ప్రయత్నిం చడమే వాళ్ళ ఉద్దేశ్యము. ఇప్పుడు మనం ప్రారంభించిన సమిష్టి వ్యవ సాయక్షేత్ర నిర్మాణము అత్యంత ముఖ్యమైనది. ఇంకా బాల్యావస్థలోనే వుంది. ప్రజా సామాన్యమంతా మనకి సహాయం చేస్తేనేగాని ఆ పని జయప్రదంగా సాగదు. ముసలివాళ్ళు, ఆడవాళ్ళు, యెందుకని అశ్రద్ధ చేయరాదు వాళ్ళుకూడా మనవైపుని వుండేలా చూడాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో వాళ్ళ అవసరంకూడా వుంది. అందుచేత దానికి అనుకూలంగా మెల్లిగడలు పన్నుతూండాలి." అని పెద్దపెద్ద అంగలు వేస్తూ వెళ్ళిపోయేడు.

"మకార్! రా. యెవళ్ళకోళ్ళని వాళ్ళకి యిచ్చేద్దాం. దేవిదోవు చెప్పినదే సరిఐగా కనిపిస్తూంది." సమాధానంకోసం రజ్మెట్నోవు నగుల్నోవు వైపు చూసేడు. మకార్ కిటికీలో కూర్చుని, ఒక చేతితో కోటు బొత్తాలు వూడదీస్తూ, రెండవచేతి వేలిమీద టోపీ గిరగిరా తిప్పుతూన్నాడు. పెదవులు కదులుతూన్నాయి. ఇల్లా మూడు నిముషాలు గడచిపోయింది. మకార్ హఠాత్తుగా తలయెత్తి రజ్మెట్నోవుకేసి చూసేడు. ఇద్దరి దృష్టి యేకమయింది.

"రా, వెడదాం." అన్నాడు నగుల్నోవు. "మనం చేసినది పొరపాటే. ఏమీ సందేహంలేదు. యేమో అనుకుంటున్నాం — దేవిదోవు చాలా అసాధ్యుడు!"

దేవిదోవు స్లెడ్జి యెక్కేటప్పటికి కోంద్రాట్ మైదనికోవ్ అతని దగ్గరకు వెళ్ళి, చేతులు తిప్పుతూ తీవ్రంగా యేదో చెబుతూ నిలబడ్డాడు.

బండివాడు తొందరపడుతూ, కళ్ళేలు చేతపుచ్చుకొని, హార్బునే మొత్త కిందనున్న కొరడాకర్ర తీసేడు. దేవిదోవ్ పెదవులు కొరుకుతూ అంతా శ్రద్ధగా వింటున్నాడు. బిజ్మిడోప్కు బయటికి వచ్చేటప్పటికి అతనికి యీ క్రిందిమాటలు వినబడ్డాయి.

"అనవసరంగా ఆందోళన పడకండి! ప్రతి విషయం అంతతీవ్రంగా తీసుగోడం అనవసరం. ఇదే ప్రారంభదశ కనుక కొన్ని దోషాలు వుంటాయి. నిజమే. అవి క్రమక్రమంగా సవరించుకుందాం. కేవలం విధానం యేర్పాటు చేసి మే వినాలికి ఆ పరపు నాయకున్ని బాధ్యులుగా చేద్దాం సరే చెప్పండి."

ఒక్క కొరడాదెబ్బతో గుర్రాలు అదిరిపడ్డాయి. స్లెడ్జి గేటుదాటి వీధిలోకి వెళ్ళిపోయింది తెల్లటి మంచులో స్లెడ్జి వెళ్ళిన బాట మాత్రం కనిపిస్తూంది.

కోళ్ళ దొడ్డిలో వందలకొలది కోళ్లు తిరుగుతున్నాయి ముసలి అకిమ్ చేత కర్ర ఒకటి పుచ్చుకొని ఆ దొడ్లో వాటిని కాస్తున్నాడు. గాలికి అతని గడ్డం యిటు అటూ యెగురుతూంది. 'కోళ్ళరాత' దోవలో అడ్డం వచ్చిన కోళ్ళని కాలి ఫెల్టు బూట్లతో పక్కకి తోస్తూ, ఆ దొడ్లో తిరుగుతూ, అతని భుజంమీదనున్న సంచీలో సగంవరకూ వున్న ధాన్యపు గింజలు ధారగా పోస్తూన్నాడు. కోళ్ళన్నీ పరుగెత్తివచ్చి ఆ గింజల్ని యేరుకొని తింటూ, మధ్యమధ్య కూస్తూన్నాయి.

ఆ దొడ్లోనే గడ్డిమేటి దగ్గర యేర్పరచిన చిన్న ఆవరణలో బాతులు, గుంపులు గుంపులుగా చేరివున్నాయి. అవి రెక్కలు రెప రెప లాడిస్తూ, 'క్లక్' 'క్లక్' అని కూస్తున్నాయి.

పాకవార చాలమంది జనం గుమిగూడి వున్నారు. వందమూ గుండ్రంగా గుమిగూడి ముందరికివంగి, వారి మధ్యనున్న దానికేసి ఆతురతగా చూస్తున్నారు.

దుమ్మట్లోనే వు వాళ్ళ దగ్గరకు వచ్చి. అది యేమిటో చూడడానికి బొటన వ్రేళ్ళమీద లేచి ముందరకువంగి చూసేడు. వాళ్ళు అంతా రెప్ప వాల్చకుండా చూస్తూ నెమ్మదిగా యిల్లా అనుకుంటున్నారు.

"ఎర్ర పుంజు గెలుస్తుంది."

"ఏడిసింది. అది గెల్చేది యేమిటి ! చూడు దాని ముక్కు దగ్గర యెంత దెబ్బతగిలిందో."

"అది యెంత దెబ్బ కొట్టిందో చూసేవా ?"

"నోరు తెరిచింది ; అలిసిపోయినట్టే."

అప్పుడు ఘాకర్ మాట వినిపించింది :

"చాల్లే యీ పాటికి నోరు ముయ్యి. దాని సంగతి నీకేం తెలుసును ; వొక్క నిముషం ఆగి చూడు — యేం చేస్తుందో తెలుస్తుంది. వెధవ కబుర్లు చెప్పడం కాదు."

ఆ గుంపు మధ్య రెండు పుంజులు పోట్లాడుతున్నాయి. ఒకటి యెర్రటిది. రెండవది నలుపు – పూడా రంగు కలసినది. వాటి శరీరాల నిండా గాయాలుపడి రక్తం నల్లగా అట్టలు కట్టి వుంది. క్రింద నలుపు, యెరుపు రంగుల యీకలు పడివున్నాయి. రెండు పుంజులూకూడ అలిసి పోయేయి. వెనక్కి వెళ్ళి, మెడలు ముందుకు సాచి, వొకదాని వయిపు వొకటి వడుపువేసి చూస్తున్నాయి. అవి అలాగ ఆట్టేసేపు వుండలేవు. నల్లకోడి హఠాత్తుగా పైకి యెగిరింది ; దానితోపాటు యెర్రపుంజుకూడా యెగిరింది. ఒకదానిని వొకటి తన్నుకుంటూ, పొడుచుగుంటూ, చాలా సేపు దొమ్ములాడేయి.

ఘాకర్ బయటి ప్రపంచాన్ని అంతనీ మరచి తదేకదృష్టితో వాటి కేసి చూస్తున్నాడు. అతని దృష్టి అంతా యెర్రపుంజుమీద వుంది. ఆ కోడి మీద 'మూగడైమిడ్' తో పందెం వేసేడు. అందుచేత అది నెగ్గుతుందా

లేదా అని చూస్తున్నాడు. ఇంతలో యెవరో అతనిని చొక్కా పట్టుకొని వెనకకి లాగెయ్యడంచేత అతని దృష్టికి భంగం కలిగింది. షూకర్ తీవ్రకోపంతో వెనకతిరిగి తనని లాగినవాడి మీదకి వురకబోయేడు. కాని హఠాత్తుగా అతనికోపం పోయి, మందహాసం చేస్తూ తనని వెనక్కిలాగిన నగుల్నోవుని ఆహ్వానించేడు. నగుల్నోవు ఆ పుంజుల్ని రెంటినీ విడిపించి అక్కడవున్న వారి వయిపు తిరిగి "కోడిపందేలు కడుతున్నారా యిక్కడ? ఈ పాటికి మీ మీ పనుల్లోకి దయచెయ్యండి. లేకపోతే పేడ తీసుగుపోయి పొలాల్లో విరజిమ్మ రండి. మరో యిద్దరువెళ్లి ఊళ్ళో అందరితోను యింటి కోళ్ళను వాళ్ళని తీసుకొని పొమ్మని చెప్పిరండి." అన్నాడు.

"అయితే సమిష్టి వ్యవసాయ క్షేత్రపు కోళ్ళపొత్తి మూసేస్తారా?" కోళ్ళ దెబ్బలాట చూస్తూన్న వొకడు అన్నాడు. అతడు సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్మాణానికి వ్యతిరేకి. "దీనినిబట్టి కోళ్ళకి వర్గచైతన్యం లేనట్లు తెలుస్తూంది. అయితే, మకార్! సోషలిజం వచ్చినతరువాత కోళ్ళు యిల్లా దొమ్ములాడతాయా?"

నగుల్నోవు గుడ్లు యెర్రచేసి నిలువునా చూసేడు.

"చాలా వేళాకోళంగా ఉందే నీకు— నువ్వు యెవర్ని వేళాకోళం చేస్తున్నావో యెరుగుదువా?" అని అడిగేడు. "అనేకమంది మహామహులు సోషలిస్టు సమాజ స్థాపనకి ప్రాణాలు తృణప్రాయంగా అర్పిస్తూంటే కుక్కలా తోక ముడిచి కూర్చోడమేకాక పైగా ఆక్షేపణ కూడానా? ద్రోహీ! బయటికి నడు! ఇల్లాంటి వెధవ వేషాలు వేసేవంటే వొక్క గుద్దుకి చంపేస్తాను, జాగ్రత్త! నన్ను కూడా పరిహాసం చెయ్యడంవరకూ వచ్చిందీ!"

సిగ్గుపడి చిన్నపుచ్చుకొన్న కోసక్కులదగ్గరనుంచి వెళ్ళిపోయి వొక్కసారి దొడ్డిఅంతా కలయజూసి నిట్టూర్పు విడిచి బయటికి వెళ్ళిపోయేడు.

# ఇరువదియవ ప్రకరణము

## నిరంకుశాధికారి.

జిల్లా కమిటీ ఆఫీసు. సిగరెట్ల పొగ చుట్టలు చుట్టలుగా లేస్తూంది. 'టైపు రైటరు' వొకటి 'టక టక' లాడుతూంది. 'స్టౌ' వేడికి ఆ గదంతా ఉక్కగా వున్నట్లు వుంది. రెండు గంటలకి కమిటీ సమావేశం జరుగుతుంది. జిల్లాకమిటీ సెక్రెటరీ ఉక్కకి చెమట పట్టడంచేత చొక్కా బొత్తాలు వూడతీసి విసురుకుంటూ చాలా తొందరగా వున్నాడు. అతడు దేవిడోవ్‌ని కూర్చొనమని వొక కుర్చీ చూపించి ఆ రోజుననే క్షవరం చేసుకొనడంచేత నున్నగా తెల్లగానున్న గడ్డం తడుముకొంటూ,

"ఇంక అట్టే తీరుబడి లేదు. మీ పని పూర్తి చెయ్యండి త్వరగా. సరే, అక్కడ వ్యవహారాలు యెల్లా వున్నాయి? సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో యెంతమంది రైతులు చేరేరు? రైతులంతా చేరుతారంటారా? అతిక్లుప్తంగా తెమల్చాలి." అన్నాడు.

"అంతా చేరచ్చు; కాని అది కాదు మనం చూడవలసినది — సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పని యెల్లా జరుగుతూంది అన్నదే ముఖ్య విషయం. వేసవి వ్యవసాయాన్ని గురించిన ప్లాను తీసుగువచ్చేను: చూస్తారా?"

"అక్కర్లేదు." సెక్రటరీ గాబరాపడి కనుబొమలు ముడేసి చూస్తూ, జేబు రుమాలుతో నుదురుమీది చెమట తుడుచుగున్నాడు. "జిల్లా వ్యవసాయ సంఘములోని 'ఒపీటోవు' కి చూపించండి. ఆయన పరీక్షించి స్థిరపరుస్తారు. నాకు తీరుబడి లేదు. రీజియనల్ కమిటీనుంచి వొక కామ్రేడు వచ్చేడు. కొద్ది సేపటిలోనే 'బ్యూరో' సమావేశమవుతుంది. కాని మీరు అంత తొందరపడి భాగ్యవంతు లందరిమీద యెందుకు చర్య

తీసుగుని యిక్కడికి పంపేరు, మీతో యేమని చెప్పేను నేను? 'మాకు పైనుంచి స్పష్టమైన వుత్తరువులు వచ్చేవరకూ, ఆ విషయమై మీరు తొందరపడకండి.' అని నేను స్పష్టంగా చెప్పలేదూ? భాగ్యవంతుల ఆస్తులన్నీ జప్తుచేసి వాళ్ళని ప్రవాసం పంపించేరు కాని ముందుగానే సమిష్టి వ్యవసాయ క్షేత్రం యేర్పాటుచేసి తీవ్రకృషి చేసినట్లయితే యీ పాటికి ఆ పని పూర్తి అయిపోయి వుండును. విత్తనాలు యెంతవరకు పోగుచేసేరు? వెంటనే ఫండు యేర్పాటు చెయ్యవలసినదని జిల్లా కమిటీ నుంచి మీకు ఉత్తరువు వచ్చిందా? మరి వచ్చినట్లయితే ఆ వుత్తరువు నెరవేర్చక ఇంతవరకు యెందుకు అశ్రద్ధ చేసేరు? 'బ్యూరో' యీవాళ యీ రోజుననే కుమ్మర్లిన్, నగుల్నోవ్ని గురించి చర్చకు పెడతాను. ఈ విషయాన్ని గురించి మీ మీద తీవ్రమైనచర్య తీసుకోవలసివస్తుంది. అవమానం కూడాను! దేవుడో! ఇల్లా చూడండి. పై వుత్తరువులు నెరవేర్చక అశ్రద్ధ చేసేరంటే దానినుండి చాలా చిక్కులు కలుగుతాయి మీకు. ఇంతవరకూ మొత్తం యెంత విత్తనపు గోధుమ పోగుచేసేరు? ఆ కాగితాలు చూస్తాను వుండండి." బల్లమీదవున్న యీళ్ళ కాగితం తీసి చూసేడు. "అంతే నన్నమాట! పైగా వొక్క బస్తాకూడా లేదు. ఏం, మాట్లాడరేం?"

"మీరు మాట్లాడడానికి అవకాశం యిస్తేకాదూ నేను మాట్లాడడం! విత్తనాల విషయంలో యింతవరకూ మేము యేమీ చెయ్యనిమాట నిజమే. ఈ రోజున నేను వెళ్ళగానే ప్రారంభం చేస్తాము. ఇంతవరకూ మేము ప్రతిరోజూ మీటింగులు పెట్టడంలోనూ, సమిష్టి వ్యవసాయక్షేత్రం యేర్పాటుచేసి దాని సంబంధమైన పనులు చెయ్యడంలోనూ మునిగి వున్నాము. మీకేం! వెంట వెంటవే ఉత్తరవులు యిచ్చేస్తారు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు యేర్పరచమనీ, భాగ్యవంతుల్ని తరిమివెయ్యమనీ విత్తనాలు పోగుచెయ్యమనీ — అంతేకాని మేము చెయ్యవలసిన పని చూడరు. అన్నీకూడా నెరవేరుస్తాం! అంత తొందరపడితే యెల్లాగ? ఇంకా కావలసినంత కాలపరిమితి వుంది."

"తొందరపడితే యెల్లాగ అనడంలో అర్థంయేమేనా ఉందా? రిజియనల్ ప్రోవిన్షియల్ కమిటీలు యెంత ఒత్తిడి చేస్తున్నాయో మీకేం తెలుస్తుంది. విత్తనపు గోధుమ పోగుచెయ్యడం ఫిబ్రవరి 1 వ తారీఖుకు పూర్తి అవాలి. మీరు...."

"మేము 15 కి పూర్తిచేస్తాం; ఫిబ్రవరిలో చల్లికలు ప్రారంభంకావ నుకుంటాను. కాదూ? ఈవేళ మేనేజిమెంటుకమిటీ సభ్యుణ్ణి ఒకణ్ణి విత్తన ములు ఏరేయంత్రంకొరకు టుబ్యాన్‌స్కోకి పంపించేను. అక్కడ సమిష్టి వ్యవసాయ క్షేత్రపు చైర్‌మన్ శుద్ధతాగుమోతు. మేము ఆయనకి 'విత్త నపు ధాన్యంయేరే యంత్రము మాకు ఇప్పుడు పంపడానికి వీలవుతుందా?' అని వ్రాసి కనుక్కుంటే, "ముందు కొద్దికాలంలో' అని సమాధానం ఇచ్చేడు."

ఈ పిట్టకథలకేం లెండి—ముందు మీ మాటచెప్పండి."

"గ్రామస్తులంతా పశువుల్ని చంపడం ప్రారంభిస్తే, చంపవద్దనిప్రచా రంచేసి ఆపని మానిపించేము. కోళ్ళు మొదలైనవాటిని కూడ చంపేస్తా రేమోనని భయపడి, రెండురోజులక్రిందట, చిన్నజంతువుల్నికూడ సమాజ పరం చెయ్యాలని తీర్మానించేము. కాని ఈవేళ నేను వచ్చీముందే కోళ్ళ నన్నిటిని ఎవరివి వారికి ఇచ్చెయ్యమని నగుల్నోవుతో చెప్పి వచ్చేను."

"ఎందుకోసం అని?"

"కోళ్లు మొదలైన చిన్నజంతువుల్ని సమాజపరం చెయ్యడం పొర పాటని తోచింది. సమిష్టివ్యవసాయక్షేత్రాలలో ఇప్పుడు వాటిఅవసరంలేదు.

"సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల సమావేశంలో కోళ్ళని సమాజ పరం చెయ్యాలన్న తీర్మానం ఆమోదింప బడిందా?"

"ఆ—ఆమోదింప బడింది."

"అయితే దాల్లో తప్పేముంది?"

"కోళ్ళని జాగ్రత్త పెట్టే సాధనసామగ్రి ఇంకా రాలేదు. అదీకాక చాలమందికి అవి ఇష్టంలేనట్లుగా కనిపించింది. ఈమాత్రం చిన్నవిషయం కోసం, ఇష్టంలేనివాళ్ళని ఎల్లాగో నయాన్న, భయాన్న లొంగతీసి ఒప్పించడం కూడా మంచిపనికాదు. కోళ్ళనికూడ సమాజపరం చెయ్యవలసిన అవసరంలేదు. మనం యేర్పాటు చేసేది సమిష్టివ్యవసాయ క్షేత్రం కాని 'కమ్యూన్' కాదు.'

"అబ్బో చాలా గొప్పసిద్ధాంతమే! కాని సమాజపరం చేసిన కోళ్ళని తిరిగి ఇచ్చెయ్యడం యెందుకు? అసలు మీరు వాటిమాట తలపెట్టకుండానే ఉండవలసింది, కాని తలపెట్టి వెనకంజవెయ్యడంలో అర్థంలేదు. మీరు విత్తనపు గోధుమ వసూలు చెయ్యలేదు. పోనీ రైతుల్ని అందర్నీ సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో సభ్యులుగా చేర్చేరేమో అంటే అదీలేదు. చివరకు వ్యవసాయ పనిముట్లేనా మరమత్తు చెయ్యలేదు."

"పనిముట్ల మరమత్తు విషయమై ఈవేళే వడ్రంగితో చెప్పి ఏర్పాటు చేసి వచ్చేను."

"ఆ-అదిగో! నేనుచెప్పేదికూడ అదే. ఈపాటికి పూర్తి చెయ్యవలసిన పనులు ఇకపైన ప్రారంభిస్తానంటున్నారు. అక్కడికి ప్రచారక దళాన్ని ఒకదాన్ని తప్పకుండా పంపించ వలసినదే! ఎల్లా పనిచెయ్యాలో నేర్పుతారు."

"తప్పకుండాను! దానివల్ల చాలా వుపయోగం వుంటుంది."

"కాని ప్రస్తుతం అవసరంలేని పనిమాత్రం అతి తొందరగా చేసేరు. సిగరెట్టుఒకటి తీసుగోండి." శెక్రటరీ సిగరెట్టు పెట్టి దేవిదోవ్‌వైపు జాపేడు. "భాగ్యవంతుల్ని ఎక్కించుకొని మీ బళ్లు ఇక్కడికి వచ్చేటప్పటికి నిర్ఘాంతపోయేము. జఖర్‌చింకో జి. పి. యు నుంచి, 'వీళ్ళనందర్నీ నేను ఏం చెయ్యను? వీళ్ళవిషయమై నాకు పైనుంచి యేమీ వుత్తరువులు

రాలేదు. వీళ్ళనందర్నీ తీసుకువెళ్ళడానికి బళ్ళుకావాలి. ఎల్లాతీసుగు వెడ తాను, ఎక్కడికితీసుగు వెడతాను?' అనిరాసేడు. మీరు ఏంచేసేరో బోధ పడిందా? అలాచెయ్యమని మీకు ఉత్తరువులా యివ్వలేము, పైగా వారికోసం మేము ఏ యేర్పాటుచెయ్యలేదు........"

"నేను మాత్రం వాళ్ళని ఏంచేసుగోను?" దేవిడోవ్‌కి కోపం వచ్చింది. ఆకోపంచేత గట్టిగాను, తొందరగాను మాట్లాడడంప్రారంభిం చేడు. నాలిక పళ్ళమధ్యనున్న తొస్సిలో పడి మాట అస్పష్టం అయింది. "వాళ్ళని మెడకి కట్టుగుంటానా? ఖాపోర్విచ్ అనే బీదరైతుని ఆతనిభార్యని ఖూనీ చేసేరు."

"విచారణలో అది ఋజువు అవలేదు." సెక్రటరీ అతని మాటకి అడ్డంవచ్చేడు, "దానికి వేరే కారణం ఏదో ఉండి వుంటుంది."

"అట్టే సమర్థత లేని పరిశోధకుడు; అందుచేత ఏమీ ఆచోకీ తియ్య లేకపోయేడు. ఏదో 'ఇతరకారణాలు' వున్నాయి అంటారు. శుద్ధతెలివి తక్కువ. అది భాగ్యవంతులుచేసినపనే: సందేహంలేదు! సమిష్టివ్యవసాయ క్షేత్ర నిర్మాణానికి ఏవో అడ్డంకులు కలిపిస్తూ దాల్లోచేరవద్దని ప్రచారం చేస్తుండేవారు. అందుచేత వాళ్ళబాధ వదల్చుకోడానికి ప్రవాసంపంపించేము! ఇదంతా ఎందుకు పోగుచేస్తున్నారో అర్థంకాకుండావుంది. మీరు........"

"చాలా అసందర్భంగావుంది మీరు అనేది. కొంచెం ఆలోచించి మరీ మాట్లాడుతూండండి. అంతాకలిసి కూడపలుకుకొని ఒక నియమ ప్రకారం చెయ్యాలికాని, యెవరికితోచినట్లు వాళ్ళు ప్రవర్తించి కప్పల తక్కెడ చెయ్యడం పనికిరాదు. భాగ్యవంతుల్ని అందర్నీ గ్రామంలోనుంచి గెంటేసి మీసౌకర్యము మీరు చూసుగున్నారు, కాని దానివల్ల మాకు యెంతటి విషమసమస్య తెచ్చిపెట్టేరో ఆలోచించారా? ఎవళ్ళబాగు వాళ్ల చూసుగుంటారు అంతే; బళ్ళమీద వాళ్ళనితీసుగువచ్చి ఇక్కడ వది లెయ్యకపోతే, రీజియనల్ పట్టణానికి తీసుగువెళ్ళి దిగపెట్టకపోయేరా?"

"మాకు బళ్లు అవసరంగా కావలసి వచ్చేయి."

"నేను చెప్పేదికూడా అదే—నేను నాపిల్లలూ బాగుంటే మొగుడు లోకంతోపాటు. వాగానేవుంది: దానికేమిలెండి. ఇప్పుడుమీరు చెయ్యవలసినపనులేమిటంటే-ధాన్యప్రపంచం పూర్తిగా వోగుచెయ్యడం, చల్లికలనాటికి వ్యవసాయ పనిముట్లు సిద్ధంచెయ్యడం, రైతుల్ని అందరిని సమిష్టి వ్యవసాయక్షేత్రంలో సభ్యులుగా చేర్చండి. మీసమిష్టివ్యవసాయ క్షేత్రం ఒక్కటీ విడిగా వుంటుంది ఈజిల్లాకంతికీ మారుమూల అయిపోయింది. వేటితోను కలపడానికి అందుబాటులో లేదు." మోచేతులు టేబులుమీద ఆని రెండుచేతులలోను తల పెట్టి ఒక్క నిముషంపాటు నిశ్శబ్దంగా ఉండి మారుకంఠంలో మళ్ళీ చెప్పడం ప్రారంభించేడు:

"జిల్లావ్యవసాయ సంఘపు ఆఫీసుకి వెళ్ళి మీ ప్లానునిశ్చయంచేయించండి. అక్కడినుంచి భోజనశాలకు వెళ్ళి భోజనంచెయ్యండి. లేకపోతే మీరు భోజనానికి ఆలస్యముగా వెళ్ళినట్లయితే, అక్కడదొరకదు. అందుచేత తిన్నగా మాయింటికివెళ్ళి అక్కడతినండి. ఒక్కనిముషం ఆగండి చీటివ్రాసి ఇస్తాను."

అతడు గబగబా కాగితంమీద రెండు అక్షరాలుబరికి దేవిదోవ్‌కి ఇచ్చేడు. అంతటితో మళ్ళీ తనకాగితాలు తిరగేసిచూస్తూ, దేవిదోవు వైపు చెయ్యి జాపేడు.

"తరువాత వెంటనే గ్రిమాచీ లాగ్‌కి వెళ్ళిపొండి. సెలవు. మీ విషయమై బ్యూరో ఎవట తీసుకువస్తాను. ఏమో చెప్పలేను. బహుశా అల్లా చెయ్యనులెండి. పనులన్నీ కొంచెం చురుకుగా సాగించండి. లేకపోతే తీవ్రచర్యలకు లోనుకావలసి వస్తుంది మీరు!" అన్నాడు.

దేవిదోవు బయటికివచ్చి ఆ కాగితం విప్పిచూసేడు. ఊదా పెన్సిలుతో కలిపి వ్రాతలో ఇలా వ్రాయబడివుంది.

"లిజా! ఈ చీటి తీసుకొనివచ్చిన వారికి మారుమాటాడకుండా వెంటనే భోజనంపెట్టి పంపవలసినపని తెలియచేస్తున్నాను."

జి. కా ర్బి న్ స్కీ.

"ఛీ! తిండి తినకుండానైనా వెళ్ళిపోతాను కాని ఈ ఆర్డరు చూపించి భోజనం చెయ్యను." అనుకుంటూ డేవిడోవ్ జిల్లా వ్యవసాయ సంఘ కార్యాలయానికి వెళ్ళిపోయేడు.

---

## ఇరువదియొకటవ ప్రకరణము

### తొలకరికి ప్లాను

ప్లానుప్రకారము వేసవిలో 1180 ఎకరాలభూమి దున్నవలసి యుండి. ఇందులో 225 ఎకరాలబీడును సేద్యంలోకి తీసుకురావలసి వుంది. ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు నెలలలో ఆ వూరు రైతులు 1600 ఎకరాలభూమి సేద్యంచేసేరు. అందులో 440 ఎకరాల భూమిలో రై చల్లేరు — వేసవి సేద్యం చెయ్యడానికి అంచనా వేసిన భూమిలో 1670 ఎకరాలభూమి గోధుమకి, 440 ఎకరాలు 'రై' కి, 220 ఎకరాలు బార్లీకి, 125 ఎకరాలు 'ఓట్లు' కి, 165 ఎకరాలు మొక్కజొన్నకి, 420 ఎకరాలు జొన్నకి 110 ఎకరాలు సూర్యక్రాంతవిత్తులకి 32 ఎకరాలు జనుముకి నిర్ణయించబడింది. ఈ 3182 ఎకరాల భూమికాక 232 ఎకరాల యిసుకభూమి పుచ్చకాయలు పండించడానికి వేరు చెయ్యబడింది.

ఫిబ్రవరి 12 వ తారీఖున సమావేశమైన 'ఉత్పత్తి సమావేశము' లో 40 మంది సమిష్టి వ్యవసాయక్షేత్రపు సభ్యులు హాజరయేరు. విత్తనాలు 'పోగుచేయుట' పొలాల్లో పనిచేసే కూలీలకు రోజువారీగా

చేసేపని నిర్ణయము చేయుట, చల్లికల కాలంలో పనిముట్ల మరామతు వెంటనే జరిగే యేర్పాటు చేయుట మొదలైన విషయాలమీద సమగ్రమైన చర్చ జరిగింది.

ఆస్ట్రొప్నోవ్ సలహామీద ప్రతి ఎకరానికి 15 కుంచాల చొప్పున మొత్తం 1000 బస్తాలు విత్తనాలకి కేటాయింపు చెయ్యాలని దేవి డోవు ప్రపోజుచేసేడు. వెంటనే పెద్దగోల బయలుదేరింది. ఒకరిమాట ఒకరు వినిపించుకోనకుండగా టిటాక్ ఇంటికప్పు యెగిరిపోయేలా అరవ సాగేరు.

"అది చాలా యెక్కువ."

"అసలు అంత పోగుచెయ్యడం అసంభవం."

"ఇంతవరకు, బొండుయిసగ భూమిలోకూడ యెకరానికి అన్ని విత్తనాలు చల్లలేదు."

"ఎవరేనా వింటే నవ్విపోయేరు !"

"ఎకరానికి 10 కుంచాలయితే యెక్కువ."

"ఆగండి ! ఆగండి ! ఈగోలయేమిటి !" రెండోదళం నాయకుడైన లుబిష్కిన్ గట్టిగా కేకేసేడు. మాటవినబడకుండగా ఇల్లా గోలపెటితే యెల్లాగ ?"

"నీకు తోచినంతసేపు మాట్లాడు ; యెవరువద్దన్నారు !"

"నాభిదగ్గరనుంచి చించుకొని యెల్లా అరుస్తున్నారో ! ఇంత కంటె పళువులునయం. ఇగ్నాట్ ! ఎద్దులా రంకెవేస్తున్నావేమి ? చాలా శ్రమపడ్డావు; ఈపాటికి తగ్గు."

"నీతక్కువేముంది. చెవికోసినమేకలా నువ్వుమాత్రం అరవడం లేదు !"

"లుబిష్కిన్ని మాట్లాడ నియ్యండి."

"ఈ గోలకి చెవులు తడతలు కడుతున్నాయి."

చాలసేపటివరకు గోలతగ్గనేలేదు. కాని, కొంతసేపటికి బాగా అరిచేవాళ్ళకి ప్రాణంవిసిగి కొంచెంతగ్గేరు. వెంటనే దేవిదోవ్ విపరీతమైన క్రోధంతో గర్జించసాగేడు.

"సమావేశం యెక్కడేనా ఇల్లావుండడచూసేరా, ఒకరిమాట ఒకరికి వినబడకుండా అరుస్తే వుపయోగంయేమిటి? ఒకరితరువాత ఒకరు అంతా మాట్లాడండి. సంతగోల పెట్టినందువల్ల యేమీలాభంలేదు. కొంచెం మెదడు ప్రయోగించాలి." కొంచెం నెమ్మదిగా మళ్ళీ ప్రారంభించేడు. "పారిశ్రామిక కూలీలదగ్గరనుంచి మీరు మీటింగులు ఎల్లా జరుపుకోవాలో నేర్చుకోవాలి. మేము ఏ షాపులోగాని, క్లబ్బులోగాని మీటింగు జరుపుగుంటే ఎంత ప్రశాంతంగా సక్రమంగా జరుపుకుంటాము! ఒకరు మాట్లాడుతుంటే మిగిలినవాళ్ళంతా వింటూంటారు. కాని మీరు అంతా ఒక్కసారిగా మాట్లాడి ఒకరిమాట ఒకరికి వినబడకుండా చేస్తున్నారు.

"ఒకరు మాట్లాడుతున్నపుడు ఇతరులెవరైనా గోలపెట్టేరంటే ఈ కర్రతో బుర్ర పేలగొట్టేస్తాను జాగ్రత్త!" లుబిష్కిన్ నిలబడి చేతిలోని కర్ర వూపేడు.

"అల్లాఅయితే మీటింగుపూర్తి అయేటప్పటికి అందరిని ఆఖరు చేస్తావు." అన్నాడు డెమ్కాఉషాకోవ్.

అందరు విరగబడి నవ్వేరు. సిగరెట్లు వెలిగించి యెకరంకి ఎన్ని విత్తనాలు కావాలనే విషయమై చర్చకిదిగేరు. మొట్టమొదట యాకోవ్ లూకుచ్ మాట్లాడేడు.

"మీరంతా అనవసరపు గొడవచేసేరు. కామ్రేడ్ దేవిదోవ్ ఎకరానికి 15 కుంచాలు కావాలని యెందుకు ప్రపోజ్ చేసేడు? అదొక పెద్దప్రశ్న కాదు. మనము ఆ విత్తనాలని బాగుచేసి, శాస్త్రీయ పద్ధతులమీద జాగ్రత్త

పెడతామా ? ఆ, అందువల్ల పారేమైనా వుంటుందా ? తప్పకవుంటుంది. అదీకాక చల్లికలయేక అదనంగా యేమైనా మిగులుతే అవిపాడుచేస్తామా ? చెయ్యం ! ఇతరవిధాలుగా వుపయోగించుకుంటాము."

చివరకి అందరూకూడ యెకరానికి 15 కుంచాల ధాన్యం విత్త నాలకి వుండాలని అంగీకరించేరు. కాని ఒక అరకతో ఎంతభూమి దున్న వచ్చుననే విషయంమీద మళ్ళీ చర్చజరిగింది. ఇదంతా చూసి దేవిదోవ్ నిర్ఘాంతపోయేడు.

"ముందు తొలకరి ఏ విధంగావుంటుందో తెలియకుండా అరకకి ఇంత భూమిదున్నరామని ఏవిధంగా నిశ్చయించగలం !" మూడవ దళ నాయకుడు అగాఫన్ డుబ్ట్సోవ్ దేవిదోవ్‌ని అడిగేడు. "మంచు యెల్లా కరుగుతుందో, కరిగేక అడుగున భూమి యే మాదిరిగావుంటుందో మీరే మైనా చెప్పగలరా ?"

"అయితే మీరేమంటారు ?" అని అడిగేడు దేవిదోవ్.

"కాగితం పాడు చెయ్యద్దని నా సలహా. చల్లికలు ప్రారంభిస్తే మనకే తెలుస్తుంది."

"దళనాయకుడవై యుండి. ప్లానుకి వ్యతిరేకంగా ఇల్లాగేనామాట్లా డడం ? అయితే ప్లాను అవసరంలేదనే మీ వుద్దేశ్యం ?"

"ఎంత అనేవిషయం మనం ముందుగా నిర్ణయించడం సాహసమే." అనుకోనిదే యాకోవ్‌లూకుచ్ డుబ్ట్సోవ్‌ని సమర్థించేడు. "మీదిమంచి నడి వయస్సులోవున్న జతఅవచ్చు, నాది యింకా బాగా పనిచేతకాని లేత దూడలవవచ్చు. అటువంటప్పుడు మీతో నేను సమంగా దున్నడం సాధ్య మవుతుందా ? జన్మలో సాధ్యంకాదు."

ఇంతలో కోంద్రాట్ మైదనికోవ్ అందుకున్నాడు.

"మేనేజరయిన అస్ట్రోవ్నోవ్ నోటనుండే అటువంటిమాటలు రావడం చాల ఆశ్చర్యకరమైన విషయం. ఫలానాపని చెయ్యాలని , ఒక నిర్ణీతమైన ప్లాను లేవిదే యెల్లాగ ? భగవంతుడు రాసిపెట్టినట్లే జరుగుతుం దంటావా ? నేను మేడితోకవదలకుండా రోజంతా దున్నుతాను; నువ్వు హాయిగా ఎండలో చలికాగుతూ కూర్చుంటావు. ఇద్దరికీ ఒకేజీతమా ? అయితే బాగానేచేస్తావు యాకోవ్లూకుచ్."

"కోంద్రాట్ క్రిస్టోఫరోవిచ్ ! అయితేను. నీకుమంచి ఎడ్లజత వస్తుంది. నాకు నాసిరకం వస్తుంది. నీకు గరపభూమి, నాకు రేగడభూమి రావచ్చు. అటువంటప్పుడు యెల్లాగచెప్పు నీ తెలివితేటలు చూద్దాం."

ఎడ్లజతలలో మంచిచెడ్డలు, దున్నేభూమిలోసులువు బలువులు— ఎక్కువ—తక్కువ భూములు దున్నాలని నిర్ణయించడంలో సర్దుకుం టాము: నువ్వు నాకు పాఠంచెప్పకు !"

"ఉషాకోవ్ మాట్లాడతాడు." అన్నారు యెవరో.

"సరే, మాట్లాడచ్చు."

"నేను చెప్పేదేమిటంటే, ఇంకోనెలకు చల్లికలు ప్రారంభిస్తా మనగా బాగా మేపడం ప్రారంభించాలి. అదిమీకు చాలా చిన్నవిషయంలా కనిపించవచ్చు కాని........"

"ఆ విషయమై తరువాత చర్చిద్దాం." మధ్య దేవిదోవు అడ్డం తగి లేడు. "ఇప్పుడు ముందుమనం ప్రతీరోజూ ఎంతభూమి దున్నాలనే విషయం నిర్ణయించాలి. సోయర్ (విత్తనాలుచల్లే యంత్రంతో రోజుకి ఎంతభూమి అనే విషయంకూడ నిర్ణయించాలి."

"సోయర్లలోకూడ చాలా తేడాలున్నాయి. 17 వరసల సోయరుతో సమంగా 11 వరసల సోయరు చల్లడం కష్టం."

"నిజమే. అయితే మీరేమంటారు? ఏమండీ, మీరు యింతసేపటి నుంచి ఒక్కసారికూడ మాట్లాడలేదేమి? 'యాక్టివ్ మెంబర్లలో ఒకరై యున్నప్పటికీ, ఇంతవరకు మీరు మాట్లాడడం చూడలేదు నేను."

డైమిడ్ దేవిడోవ్‌కేసి విస్తుపోయి చూసి, బొంగురు గొంతుకతో యిల్లా అన్నాడు.

"నేనుకూడ అంగీకరిస్తాను."

"దేనికి?"

"మనం తప్పక దున్నాలని........చల్లికలుకూడ............"

"అంతేనా?"

"అంతకంటె నేను చెప్పేదేమీలేదు."

"ఇంతే?"

"ఊ"

"చాలాబాగుంది." దేవిడోవ్ చిరునవ్వు నవ్వేడు. మిగిలిన అతని మాటలు ప్రజలనవ్వు ధ్వనిలో వినబడలేదు. అప్పుడు ఛూకర్ లేచేడు.

"కామ్రేడ్ దేవిడోవ్, ఈ వూళ్ళో ఇతన్ని 'మూగడైమిడ్' అంటారు. సాధారణంగా యెప్పుడూ మాట్లాడడు. అందుచేతనే భార్య అతన్ని వదిలేసిందికూడాను. అంత మూర్ఖుడుకాడు. కాని కొంతవరకు తెలివి తక్కువవాడు అనవచ్చు. చిన్నప్పుడు అతను గోచీకూడ లేకుండా తిరుగుతూండడం నేను యెరుగుదును. అందరూ ఇతనికి యేకోశానా తెలివితేటలు లేవనుకొనేవారు. పెద్దవాడై నోరు కట్టుబాటులోకి తెచ్చుకున్నాడు. ఏమీ మాట్లాడడు. అందుచేత అనేకచిక్కులు వచ్చేయి అతనికి. టుబ్యాన్ స్కోయి మతగురువు సేక్రమెంటు యివ్వడానికికూడ నిరాకరించేడు. మతగురువు ఇల్లా అడిగేడు. "నాయనా! దొంగిలిస్తావా?"

డైమిడ్ మాట్లాడలేదు. "సిగరెట్లు తాగుతావా ?" అప్పటికీ మాట్లాడలేదు. కాని "ప్రభూ ! నేను మహాపాపిని." అని మాత్రం అన్నాడు........"

"చాల్లే ! ఈ పాటికి కట్టిపెట్టు." అనే మాటలు, వెంటనే నవ్వు విన వచ్చేయి వెనుకనుంచి.

"ఇదిగో, ఇంకొక్క నిముషం. ఆ తరువాత యేమయిందంటే గొర్రెలా వెర్రిచూపు చూస్తూ కూర్చున్నాడు. మతగురువు "ఎవని భార్య నేనా ప్రేమించేవా ? ఏ గాడిదగాని, దూడల్నిగాని ఎత్తుకొచ్చావా ?" అని అనేక ప్రశ్నలు వేసేడు. దేనికీ డైమిడ్ సమాధానం చెప్పలేదు."

"తాతా ! ఇదంతా అనవసరం. చాలించు యీ పాటికి: మనం మాట్లాడుకునే ప్రస్తుత విషయానికి నువ్వు చెప్పేదానికి యెక్కడా సంబంధం లేదు."

"అయిపోవచ్చింది. అసలు విషయానికే వస్తున్నాను. అంత తొందరపడితే యెల్లాగ ? మధ్య అడ్డం వచ్చేరు .... ఏం చెబుతున్నానో మరిచిపోయేను. పెద్దతనం వచ్చింది. ఇంకా జ్ఞాపకశక్తి యెక్కడ వుంటుంది. ఆ—తట్టింది" అని ఛూకర్ చూపుడు వేలితో బట్టతలమీద టక టక కొట్టుగున్నాడు. "ఎవరిని ప్రేమించినా డైమిడ్‌కి వుపయోగంలేదు. పోనీ యే గాడిదగాని, ఆవుగాని ఎత్తుకువద్దం అనుకున్నాడా ? కొంతవరకు అలా అనుకొనే అవకాశం వుంది. ఎందుకంటారా — దున్నుకొనడానికి అతనికి గుర్రంలేదు. కాని మనవూళ్లో గాడిద లేదు. మనవూరు ఇక్కడ యెప్పుడు పుట్టిందో, అప్పటినుంచి నేటివరకు యిక్కడ ఒక్కగాడిదకూడ లేదు............"

"నోరు మూసుగుని కూర్చుంటావా ? లేకపోతే బయటికి గెంటెయ్యమన్నావా ?" అని అడిగేడు నగుల్నోవ్.

"మేడే రోజుననువ్వు మధ్యాహ్నం మొదలెట్టి చీకటి పడేవరకు ప్రపంచ విప్లవాన్ని గురించి ఊకదంపుక్రింద దంచేవు; మకార్! మా అందరికి ప్రాణం విసిగిపోయింది. అయితే మాత్రం మే మెవరమైనా మాట్లాడేమా. నువ్వు చెప్పినదే మళ్ళీమళ్ళీ చెబుతూంటేను? ఆ బెంచీమీదే మాట్లాడకుండగా పడుకుని నిద్రపోయేను. కాని యిప్పుడు నువ్వు మాటి మాటికి పానకంలో పుల్లల్లా అడ్డం వస్తున్నావు. మాట్లాడకుండా. ఇందుకు నేను సహించను........"

"పోనీ యింక కొంతసేపు మాట్లాడనిద్దురూ; మునిగిపోయే దేముంది." అన్నాడు రజ్మద్మోషివ్. అతనికి యిలాంటి కబుర్లంటే చాలా సరదా. మొత్తంమీద ఘూకర్ మాట్లాడడానికి యింకో రెండు నిముషాలు యిచ్చేరు.

"బహుశా నోరు మెదపకుండా వుండడానికి అదేకారణం అయి వుంటుంది; ఆ మతగురువుకి యేమీ పాలుపోయిందికాదు "మూగవాడవా నువ్వు!" అని అడిగేడు. డైమిడ్ 'కాదు' అన్నాడు. డైమిడ్ వాలకం చూసి, ఆ మతగురువు కోపం ఆగిందికాదు.

"అయితే, మరి నూకరాయిలా మాట్లాడవేమి ?" అంటూ చేతిలో వున్న కొవ్వొవత్తితో నెత్తిమీద కొట్టేడు.

మళ్ళీ గొల్లున నవ్వేరు.

"అంతా అబద్ధం. అతను నన్ను కొట్టలేదు." అన్నాడు డైమిడ్.

"కొట్టినా, కొట్టకపోయినా, తప్పకుండా కొడతం అనైనా అను కొని వుంటాడు............"

"ఘూకర్! ఇంతటితోనైనా నువ్వు వూరుకుంటే మేమంతా చాలా సంతోషిస్తాము."

నవ్వులతో మళ్ళీ హాలంతా ప్రతిధ్వనించింది! ఛూకర్ కథమూలంగా మీటింగులో అసలు చర్చపోయి, వేళాకోళం, వెక్కిరింత క్రింద దిగింది. దేవిదోవు పెదవులమీది చిరునవ్వు నాపుకొని ఇలా అడిగేడు.

“ఇంక అసలు విషయానికి వద్దాం. అయితే, మీరు రోజుకి యెంతభూమి దున్నాలనే విషయమై ఏం చెబుతారు?”

“ఎవరు, నేనా?” అని ఛూకల్ చొక్కాచేతితో నుదుటిమీద చెమట తుడుచుగుంటూ రెప్పలార్చేడు.

“ఆ విషయమై నేనేమీ చెప్పదల్చుగోలేదు. డైమిడ్‌ను గురించి చెప్పదల్చుగున్నాను—చెప్పేను; అంతే.”

“ఇంక నువ్వేమీ మాట్లాడడానికి వీలులేదు యిక్కడ. నీ బాతాఖానీ అంతా బయట చెబుదువుగానిలే. కూర్చో.”

“రోజుకి రెండున్నర ఎకరాలు దున్నవచ్చు.” అన్నాడు ఇవాన్ బెటలశ్చికోవ్.

“మతిపోయిందా నీకు! ఇలాటి కబుర్లు ముసలమ్మల దగ్గిరచెప్పు. 24 గంటలు పనిచేసినా రెండున్నర యెకరాలు దున్నలేవు.”

“ఇదివరకు నేను దున్నేవాడిని. పోనీ కొంచెం తక్కువనుకో....”

“అదీ! కొంచెం తక్కువగా.”

“1.25 యెకరాలు దున్నచ్చు రోజుకి.”

చాలాసేపు చర్చ జరిగేక రేగడభూమి అయితే రోజుకి ఒకటిన్నర యెకరాలు, గరపభూమి అయితే రెండుయెకరాలు రోజుకి దున్నాలని నిర్ణయించబడింది. ఈ మాదిరిగానే విత్తనాలు చల్లడం విషయమైకూడ ఒక నిర్ణయం జరిగింది.

గ్రిమాచీలో మొత్తం 184 జతల ఎడ్లు, 73 గుర్రాలు వున్నాయి. దీనినిబట్టి వేసవిలో దున్నే భూమి అంతయెక్కువ కాదు. అందు చేత యాకోప్ లూకుచ్ ఇల్లా అన్నాడు.

"ఈ యేడు దల్లికలు త్వరగా అయిపోతాయి. లెక్కచూస్తే కాడి దూడలకి 11 యెకరాల వంతున వస్తుంది."

"టుబ్యాన్‌స్కోలో 20 యెకరాల చొప్పున వచ్చిందిట" అన్నాడు లుబిష్కిన్.

తరువాత విత్తనాలు 3 రోజులలో వసూలు చెయ్యాలని నిర్ణ యించబడింది. ఆ తరువాత వడ్రంగి ఇపోలిట్ షాలీ లేచేడు మాట్లాడ డానికి. అతనికి కొంచెం చెముడు వుండడంచేత గట్టిగా మాట్లాడేడు.

"పరమత్తు విషయమై మీరేమీచూడ నవసరంలేదు. నా మూలంగా మీ పని ఆగకుండా వుండే పూచీనాది. కాని, యినుము మాత్రం తెచ్చి యివ్వాలి నాకు. సహాయంగా ఇంకోమనిషి, కొంతబొగ్గుకూడ కావాలి. సమిష్టి వ్యవసాయక్షేత్రం నుంచి నాకు యెంతకూలి వస్తుంది?"

దేవిడోవు కూలివిషయం అతనికి నచ్చచెప్పి ఆ మరునాడే యాకోప్ లూకుచ్ ఇనుము, బొగ్గు తేవడానికి జిల్లాపట్టణానికి వెళ్ళాలని సూచన చేసేడు. ఆఖరున యాకోవులూకుచ్ మాట్లాడేడు.

ఆ తరువాత మరికొన్ని యితర విషయాలు చర్చించిన తరువాత వొక్కొక్కరే యింటిదోవ పట్టసాగేరు. దేవిడోవు, నగుల్నోవులు గ్రామ సోవియటు ఆఫీసు దగ్గరకి వెళ్ళేటప్పటికి బాగా దృఢంగావున్న యువకు డొకడు వారికి యెదురయేడు.

"జిల్లా పట్టణాన్నుంచిలావుందే" నగుల్నోవు పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"మీరు గ్రామసోవియటునుంచి వస్తున్నారా ?" అని ఆ యువకు డడిగేడు.

"మీకు యెవరు కావాలి ?"

"స్థానిక పార్టీ సెక్రటరీగాని, గ్రామ సోవియటు చైర్‌మన్‌గాని కావాలి."

"నేను పార్టీ సెక్రటరీని; ఈయన సమిష్టి వ్యవసాయ క్షేత్రపు చైర్‌మన్."

"ఓ ! బాగుంది. కామ్రేడ్స్. నేను ప్రచారక దళపు సభ్యులలో వొకణ్ణి. ఇప్పుడే వచ్చేము. మీ కోసం సోవియటు ఆఫీసుదగ్గర నిరీక్షిస్తూ. కూర్చున్నాము."

ఆ యువకుడు దేవిడోవ ముఖంకేసి చూసి నవ్వుతూ, "కామ్రేడ్, మీ పేరు దేవిడోవ కాదూ ?" అని అడిగేడు.

"అవును. నా పేరు దేవిడోవే."

ఇదివర కెక్కడో చూసేను మిమ్మల్ని. 15 రోజుల క్రితం రిజియనల్ కమిటీ ఆఫీసులో కలుసుగున్నామనుకుంటాను. అక్కడ నేను ఆయిల్ మిల్లులో పనిచేస్తున్నాను."



## ఇరువది రెండవ ప్రకరణము

### ప్ర చా ర క ద ళ ం

కురిమట్టంగా, పుష్టిగావున్నవ్యక్తి వొకడు సోవియట్ ఆఫీసు వరండాలో నిలబడియున్నాడు. రెండుపొరల నల్లతోలు చొక్కా తొడిగి,

నెత్తిమీద నల్లటి పూలుటోపీ వొకటి పెట్టుగున్నాడు. విశాలమైన వక్షస్థలం అతడు నిలబడియున్న గుమ్మానికి సరిపోయింది. కురచగా, లావుగావున్న కాళ్ళు యెడంగాపెట్టి నిలబడియున్నాడు. అతని బరువుకి బూట్లమడమలు నేలలోకి కొంచెం దిగిపోయేయి.

"ఆయనే, కామ్రేడ్ కోంద్రాట్‌కో, మా ప్రచారకదళానికి నాయకుడు." దేవిదోవు ప్రక్క పెద్దపెద్ద అంగలువేసి నడుస్తూన్న ఆ యువకుడు అన్నాడు. దేవిదోవు ముఖంలో చిరునవ్వు చూసి మళ్ళీ నెమ్మదిగా "వేళాకోళానికి 'బుట్టబొమ్మ' అని పిలుస్తుంటాము అతన్ని. పూర్వం 'లుగానస్కు' 'లోకమోటివ్ వర్క్స్' లో తరమైన పట్టివాడుగా పనిచేసేడు. చాలా ఉద్దండపిండంలెండి." అన్నాడు.

కోంద్రాట్‌కో యీ మాటల సందడివిని, తిరిగి చూసేడు. వాగా యెదిగియున్న బూడిదరంగు గడ్డంలో తెల్లటి అతనిపళ్లు మిలమిల లాడేయి.

"ఇక్కడి అధికారులు మీరే అనుకుంటాను." అన్నాడు.

"కామ్రేడ్! నేను సమిష్టి వ్యవసాయ క్షేత్రపు 'చైర్‌మన్' ని. ఈయన స్థానిక పార్టీ సెక్రటరీ." అని దేవిడోవ్ సమాధానం యిచ్చేడు.

"ఓ, యింకేమి! మా వాళ్ళంతా మీ కోసం యెదురు చూస్తున్నారు. రండి వెడదం. నేనే యీ ప్రచారక దళాధికారిని. అందుచేత వెంటనే మనం మాట్లాడుకోవచ్చు. నాపేరు కోంద్రాట్‌కో. బుట్టబొమ్మ అని కూడా పిలుస్తారని మా వాళ్లు మీకు చెప్పేవుంటారు. కాని వాళ్ళమాట మీరు నమ్మరేమోనని నేనే చెబుతూన్నాను." అంటూ అతడు లోపలికి దారితీసేడు.

ఓసిపిక్ కోంద్రాట్‌కో 20 సం॥ల వరకు దక్షిణ రష్యాలో పని చేసేడు. టెగాన్‌రాగ్‌లోను, రాస్టోవులోను, అటు తర్వాత 'లుగానస్కు' లోను పనిచేసేడు. లుగానస్కులో వుండగానే బోల్షివిక్ సైన్యాలలో చేరి

బాల్యావస్థలోనున్న సోవియటు ప్రభుత్వం తరపున యుద్ధం చేసేడు. 20 సం॥ లు రష్యనులలో మెలగడంచేత అసలు అతను యుక్రేనియా జాతీయుడైనప్పటికి వేషభాషలుచూస్తే రష్యనులా కనిపిస్తాడుగాని యుక్రేనియనులా వుండడు. 1918 సం॥ లో 'డానిట్జు' బొగ్గుగనుల కూలీలతో పాటు యితనుకూడ వారోషిలోవ్ ఆదిపత్యమున విప్లవవ్యతిరేకులకు ఆటపట్టయిన 'డాన్' పరగణా మీదుగా 'జారిట్జిన్' కి వెళ్ళేడు. ఇప్పటికికూడా అంతర్యుద్ధపు విషయం వచ్చినపుడల్లా గర్వంగా యిల్లా చెబుతూంటాడు. మా 'క్లిమెంటీ' కూడ లుగానస్కు నుంచి వచ్చినవాడే. మే మిద్దరం చాలా జోస్తీగా వుండేవాళ్ళం. మళ్ళీ యెప్పటికేనా కలుసుగోకపోము. నేను ఒకసారి చూసినవాడిని జీవితాంతం వరకూ మరిచిపోవడం అంటూ వుండదు. మేము జారిట్జిన్ దగ్గర విప్లవవ్యతిరేకులతో యుద్ధం చేసేటప్పుడు 'కోంద్రాట్ కో ! యింకా బ్రతికియున్నావా ?' అని వేళాకోళంగా అంటూంటే 'క్లిమెంటీ వారోషిలోవ్ ! బ్రతికేవున్నాను. ఈ విప్లవ వ్యతిరేకుల్ని అందర్నీ నాశనం చేస్తేకాని చావను' అనేవాడిని. మళ్ళీ మేము కలుసుగున్నప్పుడు వెంటనే గాఢాలింగనం చేస్తాడు."

అంతర్యుద్ధం అయిపోయింది. అతను లుగాన్స్కులోనే స్థిరపడి 'ఛెకా'యొక్క ట్రాన్సుపోర్టు డిపార్టుమెంటులో పనిచేసేడు. తరువాత పార్టీ పనికి మార్చబడి చిట్టచివరకు 'లోకమోటివు' వర్క్సులోకి పంపించబడ్డాడు. తరువాత పార్టీచేత తిరిగి పిలిపించబడి, గ్రామసీమలలో సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్మాణానికి తోడ్పడడానికి పంపబడ్డాడు. కొద్ది సంవత్సరములనుంచి అతడు బాగా బలిసిపోతున్నాడు. 1918 వ సంవత్సరంలో 'జారిట్జిన్' దగ్గర రాంగిల్ సేనానిచేత మెప్పుపొంది, బంగారుపూసిన కైజారు బహుమతి పొందిన వొక కెప్టెనుని, మరి నలుగురు కోసక్కులను రెండవవాని సహాయము లేకుండా వొంటరిగా చంపిన కోంద్రాట్ కోకి, యిప్పటి కోంద్రాట్ కోకి యేమీ పోలికేలేదు. ఇప్పుడు అతనిలో వార్ధక్య లక్షణాలు

కనిపిస్తూన్నాయి. ముఖంమీద నీలవర్ణపు రక్తనాళాలు స్పష్టంగా పుబికి కనిపిస్తూన్నాయి. చెంపలుకూడ నెరుస్తూన్నాయి. అతని సత్తువ, ఉత్సాహము, చొరవ, మాత్రం వార్ధక్యావస్థలో లేవు. ఎవరైనా అతని వయస్సుని గురించి, వొళ్లు రావడాన్నిగురించి యెత్తుతే 'టారాస్‌బుల్బా' నా కంటె కూడా లావుగా వుండేవాడు! అయినప్పటికి పోలండు సైనికుల్ని పూచ కోతకింద కోసేసేడు. ఇప్పుడు నేను మళ్ళీ యుద్ధం చెయ్యవలసి వచ్చినా వేటుకి వొక్కొ ఆఫీసరుని ఇద్దరుగా చెయ్యగల సత్తువవుంది! 50 సంవత్సరములు వస్తే అది ముసలితనమా? అంత క్రూరమైన జారు ప్రభుత్వం క్రింద మా తండ్రి 100 సంవత్సరములు బ్రతికినప్పుడు మన సోవియటు ప్రభుత్వం క్రింద నేను 150 సంవత్సరములు బ్రతకడంలో ఆశ్చర్యం యేముంది!" అని సమాధానం యిస్తాడు.

కోండ్రాటేకో సోవియటు ఆఫీసులోకి వెళ్ళేడు. "కామ్రేడ్స్! మీరంతా నిశ్శబ్దంగా వుండాలి. సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఛైర్‌మన్, స్థానికపార్టీ సెక్రటరీకూడా వచ్చేరు. ఇక్కడ పరిస్థితులన్నీ వివరంగా తెలియచేస్తారు. తరువాత మనం యేం చెయ్యవలసినది నిర్ణయించుకుందం. మీరంతా కూర్చోండి." అన్నాడు.

ప్రచారక దళసభ్యులు పదిహేనుమంది గదిలో చుట్టూ కూర్చున్నారు. మరి యిద్దరు గుర్రాలను చూడడానికి వెళ్ళేరు. దేవిదోవు వాళ్ళ ముఖాలకేసి చూసి అందులో జిల్లానుంచి వచ్చిన ముగ్గుర్ని గుర్తు పట్టేడు. అందులో ఒకడు అగ్రికల్చరల్ స్పెషలిస్టు. ఒకడు స్కూలు టీచరు. మూడవవాడు డాక్టరు. మిగిలిన వాళ్ళందరూ 'రిజియనల్' కేంద్రం నుంచి పంపబడ్డారు. వాళ్ళంతా కుర్చీలలో సర్దుకుంటూన్నారు. కొండ్రాట్కో దేవిదోవు దగ్గరగావచ్చి రహస్యంగా.

మన గుర్రాలకి గడ్డివెయ్యడానికి యెవరినైనా నియమించి, బండి తోలేవాళ్ళనికూడా అక్కడేవుండి వాటికి యేం కావలసినా చూడమని

చెప్పండి" అన్నాడు. "గుర్రాలకి పెట్టడానికి ఓట్లు యేమైనా వున్నాయా మీ దగ్గర ?"

"విత్తనాలకి సరిపోయినన్ని మాత్రమే వున్నాయి." అని దేవిదోవ్ సమాధానం చెప్పేడు. వెంటనే, ఆ మాత్రం స్వల్పవిషయానికికూడా అబద్ధం ఆడేమే అని మనస్సుకి కించకలిగింది. నిజానికి యింకా 20 బస్తాల ఓట్లు వున్నాయి. కాని వాటిని వేసవి చల్లికలు ప్రారంభం అయే వరకూ కదపకూడదనే వుద్దేశ్యంతో కోంద్రాట్‌కో కోరిక నిరాకరించేడు. యాకోవ్ లూకుచ్ కూడ, ఫారమ్ అడ్మినిస్ట్రేషన్ గుర్రాలకి, చాలాదూరం అలసి వచ్చినపుడు మాత్రం యిష్టంలేక తప్పనిసరిగా పెడుతూన్నాడు.

"ఆస్థిమీద ప్రేమ అనే నీచ ప్రకృతి మొలకలెత్తుతూంది ! ఎన్నడూ యెరుగని నాకుకూడా ఆ బుద్ధి కలుగుతూంది" అనుకున్నాడు దేవిదోవ్. "ఇంతవరకు యెన్నడూ అటువంటిది యెరగను. కొంచెం యిచ్చియుండ వలసింది. ఇప్పుడంటే బాగుండదు."

"బార్లీ గింజలుంటే అవి అయినాసరే" అని అడిగేడు కోంద్రాట్‌కో.

"బార్లీ గింజలూ లేవు."

ఆ మాట నిజమే. కాని కోంద్రాట్‌కో నవ్వడం చూసి దేవిదోవ్ "నేను చెప్పినదాల్లో అబద్ధం యేమీలేదు. మా దగ్గర బార్లీగింజలూ యేమీ కూడ లేవు" అన్నాడు తీవ్రంగా.

"ఎక్కడా కల్తీలేని వ్యవసాయదారులంటే మీరే." అన్నాడు కోంద్రాట్‌కో నవ్వుతూ. కాని, దేవిదోవ్ కోపంగా వుండడం చూసి కోంద్రాట్‌కో అతని రెండుబుజాలమీద చేతులువేసి "వూరికే పరిహాసానికి అన్నాను. లేకపోతే లేకపోనియ్యండి. కొద్దిగా వుంటేమాత్రం మీకు అవ సరం వుండవు ! సరే యింక అసలు విషయానికి వద్దాం. కామ్రేడ్స్, మీరంతా నిశ్శబ్దంగా వుండాలి." దేవిదోవ్, నగుల్నోవులవైపు తిరిగి "మీకు మా

చేతనయినంతవరకు సహాయం చెయ్యడానికి వచ్చేము యిక్కడికి ; అది మీకు తెలిసే వుంటుంది అనుకుంటాను. అందుచేత యిక్కడి పరిస్థితులు యెల్లా వున్నాయో చెప్పండి" అన్నాడు.

దేవిడోవు అంతవరకు జరిగిన సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణాన్ని గురించి, విత్తనపు ధాన్యపుఫండు వసూలు చెయ్యడాన్ని గురించి తెలియ చేసేడు.

అతను చెప్పినదంతా విని కోంద్రాట్ కో "అయితే మేము యిక్కడ చెయ్యవలసిన పని యేమీలేదు." అన్నాడు.

కంఠం సవరించుకొంటూ అతడు జేబులోంచి పొకనోటు బుక్కు, దేశపటము బయటికి తీసి ఆ పటముమీద వేలుపెట్టి జరుపుతూ, "మేము తిన్నగా టుబ్యాన్ స్కోకి వెడతాము" అన్నాడు. "ఆట్టేమారంకూడా లేదు. ఇక్కడ మీకు సహాయం చెయ్యడానికి ముగ్గుర్నిమాత్రం ఉంచుతాము. ధాన్యపు ఫండు త్వరగా వసూలవడానికి కొన్ని సలహాలు చెపుతాను వినండి. మొట్టమొదట ఒక సమావేశం యేర్పాటుచేసి, వర్కర్లకి ఆ విషయాన్ని గురించి బాగా అవగాహన అయేలా చెప్పి, తరువాత ప్రజలలో ప్రచారం ప్రారంభం చెయ్యండి."

దేవిడోవు అతను చెప్పినది చాల సంతృప్తితో విన్నాడు. అతనికి కోంద్రాట్ అక్కడక్కడ వుపయోగిస్తున్న యుక్రేనియన్ మాటలు అర్థం అవకపోయినప్పటికి, ధాన్యపు ఫండు వసూలు చెయ్యడంలో అతడు సూచించిన విధానం చాలా బాగుందని తోచింది. కోంద్రాట్ కో నెమ్మదిగా గ్రామములోని స్వంత వ్యవసాయదార్లు, కొంచెం భాగ్యవంతులు అని చెప్ప దగినవాళ్లు, యెన్నివిధాల నచ్చచెప్పినప్పటికి వినక ధాన్యపుఫండు చెల్లించ డానికి అంగీకరించకపోతే, వారిమీద యెటువంటి చర్య తీసుకోవలసినది చెప్పేడు. అతను అంతక్రితం ప్రచారం చేసిన గ్రామాల్లో యే విధానాలు జయప్రదం అయేయో ఆ విధానాలనే చెప్పేడు. ప్రతి విషయమూ కూడ

అతిస్పష్టంగా, సూక్ష్మంగా, యేవిధమైన అహంభావము లేకుండా తెలియ జేసేడు. మాట్లాడుతూ మధ్య మధ్య దేవిడోవువైపు, నగుల్నోవువైపు అంతక్రితమే వచ్చిన రజ్మటోన్నోవువైపు తిరిగి వాళ్ళ సలహాలుగూడ తీసు గుంటూ వచ్చేడు.

ఎర్రగా, రక్తనాళాలు వుబికియున్న కోంద్రాట్కో ముఖంకేసి చూస్తూ, దేవిడోవు "ఇతను చాలా తెలివైనవాడే! ఏమీ గర్వం లేదు. మనం యేర్పాటుచేసిన విధానాలని త్రోసి పారవెయ్యాలనే వుద్దేశ్యం మనస్సులో పెట్టుకోకుండా అతి నేర్పుగా సలహాలిస్తాడు. కాని అతను చూపించిన సక్రమ విధానాన్ని ప్రతిఘటిస్తే నిన్ను అతి సులువుగా తన మాదిరిగా ఆలోచించేటట్లు చేసెయ్యగలడు. ఇల్లాంటివాళ్ళని యిదివరకు చాలా మందిని చూసేను!" అనుకున్నాడు.

దేవిడోవుకి కోంద్రాట్కో మీదవున్న మంచి అభిప్రాయము ఇంకొక చిన్న విషయము చూడగానే దృఢపడింది. ఆ యుక్రేనియను తన ప్రచారకదళ సభ్యులందరితోనూ, బళ్లుయెక్కి వెళ్ళబోతూ, గ్రిమాచీలో దిగ పెట్టిన ముగ్గురు ప్రచారకులలో ఒకనిని పిలిచి కొద్దిసేపు మాట్లాడేడు.

"నీ పిస్టలు అందరికీ కనబడేటట్లు, అల్లా పెట్టేవెందుకు?" అని అడిగేడు. "వెంటనే అది తీసెయ్యి!"

"కామ్రేడ్ కోంద్రాట్కో, భాగ్యవంతులు....ఈ వర్గకలహం...."

"నాకే పాఠాలు నేర్పబోతున్నావా యేమిటి! భాగ్యవంతులు అంటావేమిటి? మీరు ప్రచారం చెయ్యడానికి వచ్చేరు యిక్కడికి. అంతేకాని భాగ్యవంతుల్ని యెదిరించడానికి పిస్టలు వుండాలంటే చొక్కా లోపలే పెట్టుగోండి. కాని చొక్కాపైన అందరికీ కనబడేటట్లు మాత్రం యెప్పుడూ ధరించకండి. చంటికుర్రాడులా ప్రవర్తిస్తున్నావు! అందరికీ బాగా కనపడే టట్లు పిస్టలు పయిన ధరించి వీధులవెంట షికార్లు కొడుతున్నావా! వెంటనే

తీసి జేబులో పెట్టుకో. లేకపోతే మన శత్రువులు ప్రజలలో యేమని ప్రచారం చేస్తారో తెలుసునా ! "పెన్సళ్లు మొదలయినవి వుపయోగించి కొత్త కొత్త పద్ధతులలో యెల్లా ప్రచారం చేస్తున్నారో చూడండి !" అనరూ ? ఇల్లాంటి తెలివితక్కువ పనులు యెన్నడూ చేస్తూండకండి !"

అతడు ఆ లావుపాటి శరీరం అతికష్టంమీద స్లెడ్జిబండిలోకి యెక్కించి దేవిదోవుని దగ్గరకి పిలిచేడు.

"మా కుర్రాళ్ళకందరికి పూర్తియైన శిక్షణ యిచ్చేను. పిశాచాలలా పనిచేస్తారు యిప్పుడు మీరుకూడా తీవ్రంగా పనిచేసినట్లయితే మనం అనుకున్నకంటె తక్కువకాలంలోనే పనిఅంతా పూర్తి అయిపోతుంది. నేను "టుర్యాన్‌స్కో" లో వుంటాను. విశేషాలు యేవేనా వుంటే తెలియ చెయ్యండి. అక్కడకి వెళ్ళగానే బహుశా యీ సాయంకాలమే ఒక ప్రదర్శనం యేర్పాటు చేస్తాం. ఇందాకా బార్లీగింజల విషయమై అల్లా అన్నానని మనస్సులో పెట్టుకోకండి. మీ మీద నాకు కోపంలేదు. ఊరికే వేళాకోళానికి అల్లా అన్నాను." అతడు చిరునవ్వు నవ్వుతూ చేతులు ప్రక్కలకి జాపి స్లెడ్జిమీద ఆనుకొని వెనక్కి జేరబడ్డాడు.

"అబ్బా ! యెంత లావుగా వున్నాడో ! ట్రాక్టరులా వున్నాడు." రజ్మట్నోవు పకపక నవ్వేడు. "ఒక్కణ్ణీ నాగలికి కట్టు. యెల్లా లాగుతాడోను ! మూడు జతల యెడ్లు కలసి వస్తాయి. ఎంత తిన్నా మనం యిల్లాగే వుంటాము— వాళ్ళకి యింతవొళ్ళు యెలా వస్తుందో ! మకార్— చూసేవా !"

# ఇరువది మూడవ ప్రకరణము

## విధ్వంసకుడు.

కెప్టెన్ పొలోవిట్సేవు, యాకోవు లూకుచ్ యింట్లోవుంటూనే వచ్చే వేసవిలో జరిగే తిరుగుబాటు ప్రయత్నాలన్నీ పూర్తిచేస్తున్నాడు. రాత్రులు కోడికూసే వేళవరకూ, ఏదో వ్రాసుగుంటూనో, పెన్సిలుతో దేశపటాలు గీస్తూనో, చదువుతూనో కూర్చుంటాడు. యాకోవు లూకుచ్ అప్పుడప్పుడు తలుపు సందులోనుంచి తొంగిచూచి, పొలోవిట్సేవు ఎదుటనున్న టేబులు మీదకి వంగి నిశ్శబ్దంగా పెదవులు మెదుపుతూ చదువుకొంటూండడం, ఒక్కొక్కప్పుడు తీవ్రాలోచనలోపడివుండడం కూడ చూస్తూండేవాడు. తీవ్రంగా ఆలోచిస్తూన్న సమయాల్లో పొలోవిట్సేవు టేబులుమీద రెండు చేతులు ఆని చేతులలో తలపెట్టుకొని వేళ్ళు జుట్టులోనికి పోనిచ్చి కూర్చుని వుండేవాడు. ఏదో నవులుతున్నట్లు దవుడలు కదులుతూ కన్నులు అర మోడ్చి వుండేవి. యాకోవు లూకుచ్ చాలాసార్లు పిలిచిన తరువాత అతడు తలయెత్తి కోపంతో గుడ్లు ఉరుముతూ "ఆ, యేం కావాలి ?" అని కేకే సేవాడు. అటువంటి సమయాల్లో యాకోవులూకుచ్ మనస్సులో అతనంటే విపరీతమైన భయము. గౌరవము కలిగేవి.

ప్రతిరోజు సమిష్టివ్యవసాయ క్షేత్రములోను, గ్రామములోనూ జరుగుతూన్న విషయాలనన్నిటిని యాకోవులూకుచ్ పొలోవిట్సేవుకి చెబుతూండాలి. ఆలాగే అతడు ప్రతివిషయం తెలియచేస్తూండేవాడు. కాని ఆ వార్తలవల్ల రోజురోజుకు పొలోవిట్సేవు ముఖంలోని విచార రేఖలు వృద్ధిపొందుతూన్నాయి.

భాగ్యవంతులంపరు గ్రామములోనుంచి వెళ్ళగొట్టబడినరోజు రాత్రి కెప్టెన్‌కి కంటిమీద కునుకుకూడా లేదు. రాత్రి తెల్లవారు వరకూ గదిలో

అతని అడుగుల చప్పుడు వినిపిస్తూనే వుంది. యాకోవ్‌లుకిచ్ నెమ్మదిగా మునివేళ్ళమీద అతను వుండే తలుపు దగ్గరకువెళ్ళి, తలుపు సందులో నుంచి చూసేడు. లోపల పొలోవిట్సేవ్ పళ్లు కొరుకుతూ "ఇక్కడ నిలవ వానికి కూడ అస్కారం లేకుండా చేస్తున్నారు. నరికి పారెయ్యాలి వాళ్ళని. ఏమీ దయతల్చకూడదు." అని కొంచెంసేపు నిశ్శబ్దంగావున్నాడు. తరువాత పెద్దవాళ్ళు పట్టుకున్నంత నెమ్మదిగా అడుగులు వేస్తూ, పచారుచేస్తూ గుండెలు తడుముకున్నాడు. మళ్ళీ "నరికి పారెయ్యి. నరికి పారెయ్యి!" అనుకున్నాడు. ఒకటెండు నెమ్మదిగా ఏడుపు స్వరంతో "భగవంతుడా! సహాయం చెయ్యి! మాకు మంచిరోజులు వొచ్చేటట్టు చెయ్యి! ప్రతీకారం చేసే అవకాశం త్వరలో కలగచెయ్యి—ప్రభో!" అన్న మాట వినబడింది.

తెల్లవారుతూండగా యాకోవ్‌లుకిచ్ మళ్ళీ తలుపు దగ్గరకి వెళ్ళి చెవి ఆనించి విన్నాడు. పొలోవిట్సేవ్ నెమ్మదిగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాడు. మెల్లగా మూలుగుతూ సాష్టాంగపడ్డాడు. తరువాత దీపం ఆర్పేసి పడుకున్నాడు. కాని అతను నిద్రలోకూడ "నరికి పారెయ్యండి........ వొక్కడినికూడా మిగల్చకండి." అని పలవరించేడు.

తరువాత కొన్ని రోజులకు వొకరాత్రి యాకోవ్‌లుకిచ్‌కి కిటికీ తలుపు చప్పుడుచేసిన ధ్వని వినబడింది. వెంటనే లేచి సావిట్లోకి వచ్చి,

"ఎవరు వారు?" అని అడిగేడు.

"తలుపు తియ్యండి!"

"ఎవరు మీరు?"

"అలెగ్జాండర్ అనిసిమోవిచ్‌ని చూడడానికి వచ్చేను." అన్నమాట తలుపు వెలుపలనుంచి నెమ్మదిగా వినపడింది.

"ఆ—యెవర్ని! ఆ పేరుగలవాళ్ళు యెవరూ యిక్కడ లేరు."

"అర్జంటు పనిమీద ఫార్మ్‌నుంచి వచ్చేనని చెప్పండి ఆయనతో."

యాకోవు లూకుచ్ ఒక్క నిముషం తటపటాయించి "యేమవుతే అవుతుంది" అనుకొని తలుపు తీసేడు. ముఖం కనబడకుండా ముసుగు వేసుకొనియున్న లావుపాటి మనుష్యుడు లోపల ప్రవేశించేడు. పొలోవిట్సీవు ఆతనిని తన గదిలోకి తీసుకొనిపోయి లోపల ఘడియ పెట్టేసేడు. సుమారు గంటన్నరసేపు వాళ్ళిద్దరూ మాట్లాడుకున్నారు. కాని స్పష్టంగా పైకి యేమీ వినబడలేదు. ఈ లోపుగా యాకోవులూకుచ్ కొడుకు కొత్తగా వచ్చిన ఆయన గుర్రానికి గడ్డివేసి నడ్డిపటకా వదులుచేసి కళ్ళెం తీసేసేడు.

అది మొదలు సాధారణంగా ప్రతిరోజు గుర్రపు వేగులు వస్తూనే వుండేవారు. కాని అర్ధరాత్రి సమయాల కాకుండా తెల్లవారు ఝామున మూడు లేక నాలుగు గంటలకి వస్తూండేవారు. బహుశా వాళ్ళు మొదటి మనిషి వచ్చినచోటుకంటె చాలా దూరాన్నుంచి వస్తూండివుంటారు.

ఆ రోజులలో యాకోవు లూకుచ్ రెండు రకాల జీవితం గడపవలసి వచ్చేది. ప్రతిరోజు వుదయం సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసుకి వెళ్ళి దేవిడోవుతోను, వద్రంగులు, దళనాయకులు మొదలైనవారితోను మాట్లాడుతూండేవాడు. దూడలపాకలు వేయించి వ్యవసాయ పనిముట్లు బాగు చేయిస్తూ, ఆ గొడవలోపడి మిగిలిన ఆలోచనలన్నీ మరిచిపోయేవాడు. స్వతహాగా ఒక్క నిముషంకూడ తీరుబడిగా కూర్చొనకుండా పనిచేసే స్వభావం కలవాడవడంచేత యెంతో వుత్సాహంతో పనిచేయిస్తూ, చలాకీగా వుండేవాడు. కాని అతని పూర్వజీవితానికీ యిప్పటి జీవితానికీ వొక్క తేడావుంది. వెనక స్వలాభానికి పనిచేసేవాడు; యిప్పుడు సమిష్టి వ్యవసాయ క్షేత్రంయొక్క లాభానికి పనిచేస్తున్నాడు. కాని అతడు యేదో ధోరణిలోపడి తలకి పాడు ఆలోచనలు రాకుండా వున్నందుకే సంతోషించేవాడు. పని చెయ్యడానికి వుత్సాహపడుతూ, యే పని యెల్లాచేస్తే బాగుంటుందో అని ఆలోచిస్తూ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాభివృద్ధికి ప్లానులు వేస్తూండేవాడు. పశువుల కొట్టాలు వెచ్చగా వుండేటట్లు తగిన బందోబస్తు

చేయించి కొత్తగా తబేలా వొకటి కట్టించేడు. చిన్న చిన్న గాదులు తీసే యించి పెద్దపెద్ద ధాన్యపు కొట్లు కట్టించేడు. కాని, సాయంకాలం యీ హడావిడి అంతా తగ్గి యింటికి వెళ్ళేవేళ అవగానే అతనికి శవంమీద వాలిన రాబందులా గదిలో వొంటరిగా విచారముతో కూర్చునియుండే పొలోవిట్సీవు మాట జ్ఞప్తికి వచ్చేది. దానితో మనస్సులో అవ్యక్తమైన బాధ బయలుదేరేది. విచారముఖంతో ఆలాగే కూర్చునేవాడు. ఇంటికి వెళ్ళగానే భోజనానికి ముందే పొలోవిట్సీవు దగ్గరికి వెడతాడు.

"ఈ వేళ విశేషాలు యేమిటి?" అని అడిగి కెప్టెను సిగరెట్టు వెలిగించి శ్రద్ధగా వినవానికి కూర్చునేవాడు. యాకోవు లూకుచ్ ఆ రోజున సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో తను చేసిన పనులన్నీ పూసగుచ్చినట్లు చెపుతూండేవాడు. సాధారణంగా పొలోవిట్సీవు నిశ్శబ్దంగానే వింటాడు. కాని యాకోవు లూకుచ్ భాగ్యవంతుల బట్టలు, బూట్లు, పంచిపెట్టిన విషయం చెప్పినప్పుడు మాత్రం అన్నాడు.

"భాగ్యవంతుల వస్తువులు తీసుకున్న ప్రతివాడిని రేపు వేసవిలో నరికి పారేస్తాము. అందర్నీ .............................ఆ వెధవల లిస్టు వొకటి తయారు చెయ్యి; విన్నావా?"

"ఆ లిస్టు నా దగ్గర వుంది."

"ఇప్పుడు వుందా?"

"ఆ–వుంది."

"ఇల్లా ఇయ్యి."

పొలోవిట్సీవు ఆ లిస్టు తీసుకొని పూర్తిగా అందరి పేర్లు వ్రాసుకొని వాటిముందు యే యే వస్తువులు తీసుకొన్నారో కూడ యెక్కించేడు.

పొలోవిట్సీవు మాట్లాడడం అయిన తరువాత యాకోవు లూకుచ్ భోజనానికి వెడతాడు. కాని, పడుకొనేముందు మళ్ళీ పొలోవిట్సీవు దగ్గరకు వచ్చి ఆ మరునాడు చేయవలసిన పనిని గురించి ఆజ్ఞలు తీసుకొంటాడు.

షొలోవిట్సీవు ప్రేరేపణమీద ఫిబ్రవరి 8 వ తారీఖున యాకోవు లూకుచ్ సమిష్టి వ్యవసాయక్షేత్రపు రెండవదళ నాయకుణ్ణి పిలిచి, నాలుగు స్లెడ్జిలు తీసుకొనివెళ్ళి నదిలోని యిసక తీసుకొని రమ్మని ఆజ్ఞాపించేడు. ఇసుక తీసుకు వచ్చేరు. యాకోవు లూకుచ్ యెడ్లని కట్టే పాకలన్నిటిని శుభ్రముచేసి తరువాత నేలంతటా పట్టుంగా ఇసుక చల్లమని ఆజ్ఞాపించేడు. ఆ పని అంతా పూర్తి అవవచ్చినది. అటువంటి సమయంలో దేవిడోవు రెండవదళం పనిచేస్తూన్న చోటికి వచ్చేడు.

"ఆ యిసుక యేమిటి చేస్తున్నారు ?" అతడు రెండవ దళపు యెడ్ల సంరక్షకుడైన 'డైమిచ్' ని అడిగేడు.

"నేలంతటా చల్లుతూన్నాము" అన్నాడు.

"ఎందుకు ?"

మాటాడలేదు.

"నిన్నే ; యెందుకని అడుగుతూన్నాను."

"నాకు తెలియదు."

"తెలియనిదే యేమని చేస్తున్నావు ?"

"మేనేజరు ఆజ్ఞాపించేడు."

"ఏమని ఆజ్ఞాపించేడు."

"పాకలన్నీ శుభ్రంగా వుండాలన్నాడు. ఊరికే కూర్చున్నామని యేదో కలిపిస్తూంటాడు, యెప్పుడూ యింతే !"

"ఆ ఆలోచన బాగుంది. నిజమే ! యీలా చేసినట్లయితే నేల అంతా శుభ్రంగా వుంటుంది. పేడ తియ్యకుండా వుంచినట్లయితే దోమలు ముసురుతూ వెధవ వాసనవేసి పశువులకి రోగాలుకూడా పట్టుగుంటాయి. వెటర్నరీ డాక్టర్లుకూడా చెబుతూనే వుంటారు. పశువులు వుండేచోటు

శుభ్రం చేస్తూండాలని. అనవసరపు పని అని నువ్వు అలా విసుక్కో కూడదు. ఈ యిసుక పోస్తే నేల అంతా యెంత శుభ్రంగా కనిపిస్తుందో చూడు. ఏం—బాగులేదూ?"

కాని డైమిడ్ మాట్లాడకుండా తట్టతీసుకొని వెళ్ళిపోయేడు. దేవి దోవ మేనేజరు ప్రజ్ఞకి మెచ్చుకుంటూ భోజనానికి వెళ్ళిపోయేడు.

సాయంత్రం ఐడిష్కిన్ గుండెలు కసుక్కుంటూ పరుగెత్తుకొని వచ్చి కోపంతో "అయితే మీరు ఈ వేళనుంచి పశువులపాకలో నేలమీద గడ్డి పరచటం మానేసి యిసుక పొయ్యాలా?" అని గద్దించి అడిగేడు.

"అవును, అదే పని."

"మీ ఆస్ట్రోవ్సనోవ్ కామా యీ ఆజ్ఞ యిచ్చింది? అతనికి మతి పోయిందా? ఇల్లా చెయ్యడం యిదివరకు యెవరేనా యెరుగుదురా? కామ్రేడ్ మీరుకూడా దీనికి అంగీకరించేరా?"

"ఐడిష్కిన్! అనవసరంగా కాళ్ల విరగదొక్కుకుని కంగారు పడ కండి. ఆస్ట్రోవ్సనోవ్ చేసినదాన్లో తప్పులేదు. శాస్త్రీయ పద్ధతులు అవలం బించడానికి అంత భయం యెందుకు? పాకలన్నీ పరిశుభ్రంగా వుంచుతే పశువులు యే రోగాలూ లేకుండా బాగా వుంటాయి."

"ఇదేనా శాస్త్రీయ పద్ధతి? పశువులు యెలా పడుకుంటాయి? అటు లోనూ యిప్పుడు మంచు యెల్లా కురుస్తూందో చూసేరా! గడ్డిలో పడు కున్నట్లయితే యెద్దుకి వెచ్చగా వుంటుంది. ఇసకలో మీరు పడుకొని చూడండి యెల్లా వుంటుందో!"

"ఇదిగో యిటువంటి అనవసర ప్రతిబంధకాలు కల్పించకండి. పశు సంరక్షణ విషయంలో యీ సనాతన పద్ధతులన్నీ కట్టిపెట్టాలి. ప్రతివిషయం శాస్త్రీయ పద్ధతులమీద చేస్తూండాలి."

"ఇప్పుడు మీరు చేసేపనికి శాస్త్రాధారం యేముంది ?" లుబిష్కిన్ టోపీ తీసి కాలినేసికొట్టి, జేవురించిన ముఖంతో విసవిసా వెళ్ళిపోయేడు.

ఉదయానికి 23 యెడ్లు లేవడానికికూడా శక్తిలేకుండా వున్నాయి. అసలే శరీరానికి తగులుతే జివ్వుమనే తడి యిసుక. దానికి తోడు రాత్రి అంతా యెడ్లుపోసిన ఉచ్చకి యిసక అంతా తడిసి ముద్ద అయిపోయి యెడ్లు ఆ చలికి బిర్రబిగిసి పోయేయి. కొన్ని అతి కష్టంమీద లేచి నిలబడ్డాయి. నాలుగింటికి తోకలు కొంకర్లు పోయేయి. మొత్తముమీద వొకట్టికూడా సరియైన స్థితిలో లేదు.

పొలోవిట్సేవ పుత్తరవులు నిర్వహించడంలో యాకోవ్ లూకుచ్ తనకే ముప్పు తెచ్చుగున్నాడు. యాకోవ్ లూకుచ్ యిసక తెప్పించి చల్లిం చిన క్రితంరోజే పొలోవిట్సేవ అతనికి "యెడ్ల నన్నిటినీ యెందుకూ పనికి రాకుండా చేద్దాం. వాళ్ళంతా మూర్ఖులు—ఒకడికీ బుర్రలేదు. నేల అంతా పరిశుభ్రంగా వుండడానికి యిల్లా చేసేవనుకుంటారు. కాని గుర్రాలని మాత్రం శ్రద్ధగా చూస్తూండు. అవసరమయితే యీ రోజుననే మనం వుపయోగించు కొనడానిక తగిన స్థితిలో వుండాలి" అని ఆజ్ఞాపించేడు. యాకోవులూకుచ్ అతని ఆజ్ఞ 'తూ. చా' తప్పకుండా నెరవేర్చేడు.

ఆ వుదయం దేవిడోవు అతనిని పిలిపించి లోపల తలుపులు బిగించి, నేలచూపులు చూస్తూ.

"నీ వుద్దేశ్యం యేమిటి ... ...." అని గదమాయించేడు.

"కామ్రేడ్ దోవిడోవు ! పొరపాటు చేసేను. నేను............ భగవంతుడు..................యిల్లా అవుతుందని అనుకోలేదు.............

"ఏమిరా ద్రోహీ ! యేమిటి నీ వుద్దేశ్యం ?" దేవిడోవు శరీరం కంపించింది. కళ్ళు చింత నిప్పుల్లా అయేయి. హఠాత్తుగా తలయెత్తి లూకుచ్ ముఖంలోకి చూసేడు. "ధ్వంసం చెయ్యడానికి తలచుగున్నావా?

ఇసుక పరిపించకూడదని తెలియదా? చలికి యెడ్లు కొంకరించుకొని పోతాయని యెరగవా?"

"ఎడ్లని పనికిరాకుండా చెయ్యాలనే దురుద్దేశ్యం లేదు............ దేవుడుతోడు, నేనెరగను .. ...."

"నోరుముయ్యి! నీవంటి వ్యవసాయదారుడుకి అమాత్రం చిన్న విషయం తెలియదంటే నమ్మను."

కళ్ళవెంట బొటబొటా నీళ్లు కారుతూ, ముక్కు యెగపీలుస్తూ, "పశువుల వొళ్లన్నీ పుష్ఠంగా వుంటాయని అల్లాచేసేను.............. పేడ, పచ్చుతో వాసన వేస్తూండకుండా ......నాకేమి తెలియదు, నేను చేసిన పని యిల్లా అవుతుందని అనుకోలేదు........"అని భయపడుతూగొణిగేడు.

"వెంటనే నీ పదవి 'ఉషాకోవ్'కి వప్పగించెయ్యి. ఈ విషయంలో నిన్ను విచారణ చేస్తాము."

"కామ్రేడ్ దేవిదోవ్........"

"ఛీ— నా యెదుటినుంచి బయటికి పో!"

లూకుచ్ వెళ్ళిపోయిన తరువాత ఆ సంఘటనను గురించి దేవిడోవ్ స్థిమితంగా మళ్ళీ ఆలోచించేడు. ఆలోచించగా యాకోవ్ లూకుచ్ ద్రోహం చేస్తూన్నాడని శంకించడం చాలా తెలివితక్కువతనం అని తోచింది. "ఇంతకీ ఆస్ట్రోవ్నోవ్ భాగ్యవంతుడు కాడు. ఎవరేనా అతన్ని అల్లా అనడం వ్యక్తిగత ద్వేషాలచేతనేకాని మరేమీ కాదు. ఆస్ట్రోవ్నోవ్‌ని మేనేజరుగా నియమించగానే లుబిష్కిన్ "ఆస్ట్రోవ్నోవ్ కూడా భాగ్యవంతుడుగానే వుండేవాడు పూర్వం." అన్నాడు. వెంటనే దేవిడోవ్ రికార్డు తిరగేసి పూర్వం యాకోవ్ లూకుచ్ భాగ్యవంతుడుగానే వుండేవాడనియు, కాని వరసగా 2 సం॥వ్యవసాయంలో దెబ్బ తినడంచేత ఆస్తి చాలాభాగం పోగొట్టుకొని సాధారణరైతు అయేడనీ తెలుసుగున్నాడు. దేవిడోవ్

తీవ్రంగా ఆలోచించేడు. చివరకు యాకోవులూకుచ్‌ని యీ విషయంలో నిందింపవలసిన పని లేదనియు యెంతసేపూ కొత్తపద్ధతులు కనిపెట్టాలనే వుబలాటంచేత శుభ్రంగా వుంటాయనే వుద్దేశ్యం చేతనే పశువుల పాకలలో ఇసుక చల్లించి వుంటాడనియు నిశ్చయించేడు. "అతడు ద్రోహం చెయ్య తల్చుకొని వున్నట్లయితే యింత శ్రద్ధగా పనిచేసి వుండడు. అదీకాకుండా పాపం అతని యెద్లుకూడా పాడవలేదూ!" అనుకున్నాడు దేవిడోవ్. "ఆస్ట్రోవ్నోవ్ సమిష్టి వ్యవసాయక్షేత్రం అభివృద్ధి కోరేవాళ్ళలో వొకడు. ఏమీ అనుమానం లేదు. ఈ యిసక పొయ్యడం విషయం యేదో తెలియక చేసిన పొరపాటయి వుంటుంది." అతను, యాకోవులూకుచ్ పశువుల పాకలు వెచ్చగా వుండేటట్లు యెంతబందోబస్తుగా కట్టేదో జ్ఞప్తికి తెచ్చుగున్నాడు. ఒకసారి సమిష్టి వ్యవసాయ క్షేత్రపు గుఱ్ఱాలకి మూడింటికి జబ్బుచేస్తే యాకోవులూకుచ్ రాత్రి తెల్లవార్లూ తబేలాలోనే వుండి వాటికి కడుపునొప్పితగ్గడానికి గంజాయి విత్తుల నూనెతో ఎనీమాలు చేసి యింకా అనేక మందులుపోసి శ్రమపడ్డాడు. ఆ గుర్రాలని వరసగా వారం రోజులు బార్లీ గడ్డితోమేపి ఆ రోగానికి కారకుడైన కృజనోవ్ని సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి తొలగించాలన్నది ఆస్ట్రోవ్నోవే! దేవిడోవ్‌కి తెలిసినంతవరకు, గుఱ్ఱాలని ఆస్ట్రోవ్నోవ్‌కంటె శ్రద్ధగా చూసినవాడెవడూ లేడు. దేవిడోవ్‌కి యివన్నీ జ్ఞాపకం వచ్చి యే ద్రోహం తలపెట్టనివాడిని అనవసరంగా శంకించి కోపపడినందుకు సిగ్గుపడ్డాడు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంకోసం పాటు పడేవాడు, మేనేజిమెంటు కమిటీసభ్యుడు, గ్రామస్తులలో గౌరవనీయుడు అయిన యాకోవు లూకుచ్‌ని చిన్నపొరపాటు చేసినందుకు ద్రోహి అని శంకించి చాల తీవ్రంగా కేకలేసినందుకు చాలా కించ పడ్డాడు. "ఎంత తెలివి తక్కువ పని!" దేవిడోవ్ జుట్టు పీక్కొని ఆందోళనతో కంఠం సవరించుగుంటూ బయటికి వెళ్ళిపోయేడు.

యాకోవ్ లూకిచ్ చేత తాళం చెవులగుత్తి పట్టుకొని కంపిస్తూన్న పెదవులతో 'బుక్-కీపరు'తో మాట్లాడుతూండడం డేవిడోవ్ చూసేడు.

"ఆస్ట్రోవ్నోవ్: యిలా చూడు" అన్నాడు డేవిడోవ్. "నీ పని ఉషాకోవ్‌కి వప్పగించకు. ఆ పని నువ్వే చేస్తూండు. కాని మళ్ళీ అలాటి పని చేస్తేమాత్రం... జిల్లా వెటర్నరీ డాక్టరుకి కబురుచెయ్యి. దళనాయకుల లోటి కొంకరించుకొని పోయిన యెద్దచేత యీ రోజు పనిచేయించ వద్దని చెప్పు."

ఆస్ట్రోవ్నోవ్ సమిష్టి వ్యవసాయ క్షేత్రం పాడుచెయ్యడానికి చేసిన ప్రయత్నంవల్ల దానికి ప్రమాదం కొద్దిలో తప్పిపోయింది. కెప్టెన్ యితర పనులతో మునిగి యుండడం చేత ఆస్ట్రోవ్నోవుని యింకా యిటువంటి పనులు చెయ్యమనలేదు. రాత్రి మామూలుగా వొకమనిషి అతని యింటికి వచ్చేడు. వెంటనే పొలోవిట్సేవ్ అతనిని తన గదిలోకి తీసుకొనిపోయి, ఆ చుట్టుపక్కలకి యెవరినీ రావద్దని ఆజ్ఞాపించేడు. తెల్లవార్లూ వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూనే వున్నారు. మరునాడుదయం పొలోవిట్సేవు ప్రతిరోజూ కంటె వుత్సాహంతో యాకోవ్ లూకిచ్‌ని తన గదిలోకి పిలిచేడు.

"లూకిచ్, యీయనకూడా మన పార్టీలో సభ్యుడే. లెఫ్టినెంటు వాట్‌స్లావ్ అగస్టొవిచ్ లటెవ్స్కీ యీయన పేరు. జాగ్రత్తగా చూస్తూండాలి మీరు. ఈయన నా అతిధి" అని కొత్తగావచ్చిన ఆయన వైపు తిరిగి "ఇతడుకోసక్కు. మన ఆప్తులలో వొకడు. సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మేనేజరు. సోవియటు ప్రభుత్వ వుద్యోగి" అన్నాడు.

లెఫ్టినెంటు పక్కమీదినుంచి లేచి దృఢమయిన తెల్లటి చెయ్యి లూకిచ్‌కేసి జాపేడు. 30 యేళ్ళవాడులా వున్నాడు. ముఖం కృశించిపోయి పచ్చగా వుంది. వెనక్కి దువ్విన వుంగరాలజుట్టు, చిరునవ్వుతోనున్న పెదవుల పయిన మెలికలు తిరిగిన మీసం. యుద్ధంలో దెబ్బ తగలడంచేత

గుడ్డిది అయిపోయిన యెడమకన్ను. ఆ కన్నుకింద చర్మం కొంతభాగం ముడతలుపడి బిగిసిపోయి జీవకళకూడా లేకుండా వుంది. ఆ గుడ్డికన్ను అతనిముఖానికి అందవికారం తీసుగురాలేదు. కాని పూర్వం అతని ముఖంలోవుండే హాస్యాన్ని వ్యక్తంచేస్తూంది.

ఆ రోజు పొలోవిట్సేవు బాగా వుత్సాహంగా వున్నాడు. యాకోవు లూకుచ్‌తో కూడా సరదాగా పిచ్చా-పాటి మాట్లాడుతూన్నాడు. కొంత సేపటికి ఆకథున్లు చాలించి యాకోవు లూకుచ్‌తో "లెఫ్టినెంటు లెటెవ్స్కీ రెండువారాలపాటు యిక్కడే వుంటాడు. కాని నేనుమాత్రం యీ రాత్రి వెళ్ళిపోతాను. వాట్‌స్లావ్ ఒగస్టొవిచ్‌కి కావలసినవన్నీ సప్లయి చేస్తూండు. ఆయన యిచ్చిన ఆజ్ఞలన్నీ నా ఆజ్ఞలే. తెలిసిందా?" పొలోవిట్సేవు లూకుచ్ రొడమీద చెయ్యివేసి మళ్ళీ ప్రారంభించేడు. "ఇంక కొద్దిరోజులలో ప్రారంభం చేస్తాం. అంతా సిద్ధం అవవచ్చింది. ఇక్కడ మన కోసక్కుల సందర్శి నిరుత్సాహపడవద్దని చెప్పు. ఇంక నువ్వు వెళ్ళచ్చు. ఇంకా కొంచెం మాట్లాడుకొనడం తరవాయి వుంది. పూర్తి చేసుకోవాలి."

పొలోవిట్సేవు 15 రోజులవరకూ, గ్రిమాచీలాగ్ వదలి వెళ్ళిపోవ డానికి యేదో అత్యవసరమైన పని ఉంటివుంటుంది. యాకోవు లూకుచ్ ఆవిషయం తెలుసుకోవాలని వుబలాటపడుతున్నాడు. అందుచేత వెనక తను దేవిడోవుతో మాట్లాడినపుడు పొలోవిట్సేవు దాగుకొని విన్న సాకిట్లోకివెళ్ళి నిలబడి, తలుపుసందుదగ్గర చెవిపెట్టి వింటున్నాడు. గదిలో అవతలమూల మాట్లాడుకుంటూన్నవారి మాటలు అస్పష్టంగా వినిపిస్తూన్నాయి.

"ఏమైనాసరే 'బికేడరోప్' తో సంబంధం యేర్పరచుకోవాలి." అన్న లటెవ్స్కీ మాటలు అతనికి వినబడ్డాయి. బహుశా మీకు అక్కడ చక్రవర్తిగారి దగ్గరనుంచి.........మంచి అనుకూల సమయం......... అది చాలా బాగుంది.........సాల్‌స్కు ప్రాంతంలో............ఆర్మర్డు ట్రెయిన్ - .........వోడిపోయీ పరిస్థితులు వస్తే..............."

"ష్—" అన్నాడు పొలోవ్ట్సేవు.

"మన మాటలు యెవరికీ వినిపించవు."

"అయినా సరే ......యెప్పుడూ జాగ్రత్తగానే వుండాలి.........."

ల్యాట్యేవ్స్కి యింకా నెమ్మదిగా మాట్లాడేడు. అందుచేత యాకోవ్ లూకుచ్‌కి వారి సంభాషణ అసలే అర్థం అయిందికాదు.

"ఒకవేళ......పరాజయము ......ఆఫ్ఘనిస్థాన్ ......వాళ్ళ సహాయముతో మనము............దాటిపోవచ్చు."

"కాని ...... ....జి. పి. యు .........." పొలోవ్ట్సేవు మాట్లాడిన మిగిన మాటలేమీ వినిపించేయి కావు.

"........సరిహద్దు దాటి ......మిన్స్కు... ....తప్పించుకొని,... ... ...... వాళ్లో అనుమానం లేదు.....................సరిహద్దు కావలా.... ... జనరల్ స్టాఫ్ డిపార్టుమెంటుకి అందచెయ్యవచ్చు.. ....ఒక కల్నల్. నేను అతని పేరు......... . తప్పనిసరివస్తు.........అంతకంటె మనకి కావలసిన దేముంది! అంతటి సహాయం... యెంత డబ్బుకావలసినాసరే."

"అతని ఉద్దేశ్యం యెలా వుంది?"

"సేనానాయకుడు తప్పకుండా ...... అనుకుంటున్నాడు............ కాని అంతా వొక్కసారిగా——దోచేసుకుని————వొక్క నిముషం కూడా వ్యర్థం——————నాతోస్వయంగా చెప్పేడు——————"

కంఠస్వరాలు అంతకంతకి తగ్గి చివరకు అసలే వినిపించలేదు. ఇంతసేపు విన్నప్పటికి యేమీ బోధపడక యాకోవు లూకుచ్ వొక్క నిట్టూర్పు విడిచి సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయానికి బయలుదేరి వెళ్ళిపోయేడు. కొద్దికాలం వరకూ ట్రిటాక్‌కి చెందిన సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయం దగ్గరకు వెళ్ళగానే రోజూమాదిరి అతనిదృష్టి—గ్రిమాచీలాగ్ వ్యవసాయ క్షేత్రము 'స్టాలిన్' అని వ్రాసి గోడని వ్రేలాడ గట్టబడియున్న బోర్డుమీదికి

వెళ్ళింది. వెంటనే అతని మనస్సులో పరస్పర విరుద్ధ మార్గాలకి యీడవ బడుతున్నామనే వూహ కలిగింది. కాని వెంటనే లెఫ్టినెంటు లటిస్కీ, కెప్టెన్ పొలోవిట్సీవులు, అతి నమ్మకంగా, "కొద్దిరోజులలోనే ప్రారంభం చేస్తాము" అన్నమాటలు జ్ఞాపకంవచ్చి ప్రతీకారం చేస్తామనే వుత్సాహంతో తనలో తనే "యెంత త్వరగా ప్రారంభిస్తే అంత మంచిది. లేకపోతే వాళ్ళకి, యీ సమిష్టి వ్యవసాయ క్షేత్రానికీ మధ్యపడి నలిగి చచ్చి పోతూన్నాను."

ఆ రాత్రే పొలోవిట్సీవు గుర్రానికి జీనువేసి అతని 'డాక్యుమెంట్లు' అన్నీ కోటుజేబులలో పెట్టుకొని, దోవలో తినడానికి కొద్దిగా ఆహార పదార్థాలు తీసుకొని, సెలవు తీసుగున్నాడు. గుర్రపు డెక్కల 'టక టక' ధ్వని క్రమక్రమముగా అస్పష్టమయి ఆ నిశీథనిశ్శబ్దములో అంతరించి పోయింది.

ఈ కొత్తగా వచ్చిన అతను పొలోవిట్సీవువలె తనపనితను చూసుకుంటూ, జాగ్రత్తగా కాలక్షేపం చేసేరకంకాదు అతనిలో సైనిక లక్షణాలే లేవు. రోజల్లా యింటిలో తిరుగుతూ, ఆడవాళ్ళతో పరిహాసం ఆడుతూ, నవ్వుతూ అందర్నీ విసిగించేసేడు. చుట్టపోగ అంటే కిట్టని లూకుచ్ తల్లికి యితన్ని చూస్తే పరమ అసహ్యం. ఎవరేనా పైవాళ్ళు చూస్తారేమోనని బెమరేనా లేకుండా యిల్లంతా యిష్టం వచ్చినట్లు తిరుగుతూంటే ఆఖరికి యాకోవు లూకుచ్ అతనికి చెప్పవలసి వచ్చింది.

"మీరు చాలా జాగ్రత్తగా వుండాలి ——— మీరు యిక్కడ వుండగా హఠాత్తుగా యెవరేనా వచ్చినట్లయితే చాలా ప్రమాదంవస్తుంది."

"మరేమీ భయంలేదు. నా జేబునిండా కావసినన్ని డాక్యుమెంట్లు ఉన్నాయి. పైవాళ్ళు చూడడం సంభవించి. ఆ డాక్యుమెంట్లుకూడా నమ్మకపోతే యీ ఆజ్ఞాపత్రం తీసి వాళ్ళకి చూపిస్తాను ఇది దగ్గరవున్నట్లయితే మన యిష్టం వచ్చినట్లు తిరగవచ్చు" శుక్రాచార్యులలా వొంటికన్నుతో

చూస్తూ, చిరునవ్వు నవ్వుకుంటూ, 'మౌజరు' (జర్మన్ మేగజైను రైఫిలు) ఒకటి పైకి తీసి చూపించేడు.

ఆసలే యాకోవు లూకుచ్‌కి లెఫ్టినెంటుమీద సరియయిన అభిప్రాయం లేదు. దానికితోడు వొకరోజు సాయంత్రం అతను యింటికి వచ్చి చూచిన సంఘటనతో లెఫ్టినెంటుమీద అదివరకు లేని అసహ్యం కలిగింది. అతనికి సావిట్లో గుసగుస. పకపక నవ్వులు, ముద్దొప్పులు వినబడినవి. అగ్గిపుల్ల వెలిగించి చూసేటప్పటికి వొకమూలనున్న తిప్పను బస్తాలవెనక లెఫ్టినెంటు నిలబడియున్నాడు. అతని పక్కనున్న యాకోవ్ కోడలు హడావిడిగా గౌనుక్రిందికి లాక్కుని నెత్తిమీదినుంచి వెనక్కి జారిపోయిన జేబురుమాలు సరిచేసుకుంటూంది. యాకోవు లూకుచ్ మాట్లాడకుండా వంటయింటిపైపు బయలుదేరేడు. లఫెస్కీ పరుగెత్తి వచ్చి, అతనిని అందుకొని బుజంమీదతట్టి "యాకోవ్ యీ సంగతి యెవరికీ చెప్పకు. నీ కొడుక్కి తెలిస్తే అనవసర గందరగోళం అవుతుంది. సైనికుల సంగతి నీకు తెలియదు కనకనా! చురుకుపాలు, సాహసంచేత చిన్నతనంతో అనేకం చేస్తూంటారు. అవన్నీ లెక్కచెయ్యకూడదు. సిగరెట్టు వొకటి తీసుగో. నువ్వుకూడా నీ కోడలితో వెదుతూనే వుంటావనుకుంటాను. అబ్బో! నువ్వుమాత్రం సామాన్యుడవా!" అన్నాడు రహస్యంగా.

యాకోవు లూకుచ్ నిర్ఘాంతపోయేడు. నోట మాట రాలేదు. అతడు సిగరెట్టు తీసుకుని లఫెస్కీ వెలిగించిన అగ్గిపుల్లనే అది కాల్చి నెమ్మదిగా వంట యింట్లోకి వెళ్ళేడు. లఫెస్కీ అగ్గిపుల్ల వెలిగించి యాకోవు సిగరెట్టు కాల్చుకోనడానికి యెత్తి పట్టుకొని "యెవరైనా మీకు సిగరెట్టు యివ్వడమో యేదో వుపకారం చేస్తాడనుకోండి. వెంటనే మీరు కృతజ్ఞత తెలపాలి. పాడు అలవాట్లు మీవి అన్నీ. సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మేనేజరుకూడా నట! పూర్వపు రోజుల్లో అయితే నేను మిమ్మల్ని నా నౌకరుగాకూడ తీసికొనియుండను!"

"పిశాచంలా యీ వెధవ యెక్కడ దాపరించేడు! తిన్నయింటి వాసాలు లెక్కపెట్టేరకం – వీణ్ణి తగలెయ్యా" అనుకున్నాడు యాకోవు లూకుచ్ తనలో.

లబెస్కీ మోటుప్రవర్తనకి అతడు నిర్ఘాంతపోయేడు. అతని కొడుకు యింటిపగ్గంలేడు. వెటర్నరీ డాక్టర్ని తీసుగు రావడానికి జిల్లా పట్టణానికి వెళ్ళేడు. యాకోవు లూకుచ్ అతనితో యేమీ చెప్పకూడదని నిశ్చయించేడు. కాని కోడల్ని చాటుకుండా గదిలోకి పిలిచి కొరడాకర్రతో వొళ్ళట్టినన్ని కొట్టి వొదిలి పెట్టాడు. ముఖంమీద కొడితే అందరికి కని పిస్తుందేమోనని నడ్డిమీద, పిర్రలమీద మాత్రం కొట్టేడు. సైమియన్ యింటికి వచ్చిన తరువాతకూడా యిది యేమీ కనిపెట్టనేలేదు. అతను వచ్చేటప్పటికి బాగా చీకటి పడింది. భార్య రాత్రి భోజనానికి అన్నీ సిద్ధం చేసి కూర్చునివుంది. సైమియన్ స్తబ్దులా కూర్చునియున్న భార్యనిచూసి, "అల్లా కూర్చున్నావేమిటి పరాయి దానిలా?" అన్నాడు.

"కాలి బొక్కలు యెక్కాయి." ఆమె కంగారుపడిలేచి నిలబడింది.

"రొట్టి, నీరుల్లి మెత్తగానూరి కట్టు; ఆ నీరు లాగేస్తుంది." అని స్టౌ దగ్గర కూర్చుని తాడు పేనుతూన్న యాకోవు లూకుచ్ సలహా యిచ్చేడు. అతని కోడలు వొక్కసారి అతనివైపు తిరిగి చూసి అతి మర్యాదగా "యేమీ అవసరంలేదు. అదే తగ్గిపోతుంది." అంది.

తరుచుగా వేగులు వుత్తరాలు తీసుగువచ్చి లబెస్కీకి యిస్తూనే వున్నారు. ఆ వుత్తరాలు చదివెయ్యగానే అతడు వాటిని కాల్చేసేవాడు. రాత్రులు త్రాగుడు ప్రారంభించేడు. యాకోవు లూకుచ్ కోడల్ని రహస్యంగా కలుసుకొనడానికి వీలు దొరకడంలేదు. ఎప్పుడేనా అటువంటి అవకాశం చిక్కినా ఆమె తప్పించుకుపోతూంది. అతనిలో వెనుకటి వుత్సాహము కలిసికట్టుతనము పోయింది. ఎప్పుడు చూసినా కోపంతో మాట్లాడుతూన్నాడు. బాగా త్రాగినప్పుడు రాజకీయ విషయాలు, మాట్లాడాలని

వుండేది. ఒకరోజున యాకోవ్లియాకుచ్‌ని తన గదిలోకి పిలిచి కూర్చోవ పని వొకగ్లాసులో వోడ్కా పోసి యిచ్చేడు.

"సమిష్టి వ్యవసాయ క్షేత్రం పాడుచేస్తున్నావా ?"

"లేదు. యెందుకు అలా చెయ్యడం ?" అన్నాడు యాకోవ్లుకాకుచ్ యేమీ తెరగనట్టు నటిస్తూ.

"అయినట్లయితే యే మార్గం అవలంబిస్తున్నావు?"

"అంటే—నా కేమి అర్థం అయిందికాదు."

"రోజూ యేం చేస్తూన్నావు నువ్వు? సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని ధ్వంసం చెయ్యడానికే వానిలో చేరేవు. అందుచేత నువ్వు యేంచేస్తూన్నావు? సైబ్‌రైన్ పెట్టి గుర్రాలని చంపుతూన్నావా. వ్యవసాయపు పనిముట్లు పనికిరాకుండా చేయిస్తూన్నావా. యేం చేస్తున్నావు?"

"గుర్రాలని చంపమని నాకు యెప్పుడూ చెప్పలేదు. పైగా వాటిని చాల జాగ్రత్తగా చూడవలసిందని పొలోవిట్సేవు అనేకసార్లు చెప్పేడు." అన్నాడు యాకోవు లూకుచ్. చాలకాలంనుంచి అతడు వోడ్కా త్రాగడం మానుకున్నాడు. అందుచేత వొక గ్లాసెడు త్రాగేటప్పటికే అతనికి బాగా కైపుచేసి మాట్లాడడానికి నోరు తెరచేడు. సమిష్టి వ్యవసాయ క్షేత్రం స్వయముగా నిర్మించి మళ్ళీ తనే నాశనం చెయ్యడానికి యెంత బాధపడు తూన్నదీ చెబుదం అనుకుంటున్నాడు. కాని లయెస్కీ అతనికి అవకాశం యిస్తేగా! లయెస్కీ గ్లాసు ఖాళీచేసి లూకుచ్‌కి యేమీ పొయ్యకుండా "అయితే మాతో యెందుకు చేరేవు? ఏమిరా చవటా! యెందుకు చేరే వంటా? నిన్నంటే యేం లాభం. నీవంటి గాడిదని చేర్చినవాడిననాలి. నేను, పొలోవిట్సేవు యింక చేసేది యేమీలేదు. ఎల్లాగా మా చావు మూడింది. నిజమే, చచ్చిపోతాం. మేము నెగ్గడం అసంభవం.......... అయితే మాత్రం కమ్యూనిస్టులు చెప్పినట్టు, పోతే ఈ సంకెళ్లుతప్ప మాకు

పోయేటందుకేముంది! కాని నీ మాటలు యేమిటి? నువ్వు చేసిన త్యాగం యేమీలేదు. దీనికోసం ఇంతవరకూ యెల్లా బ్రతికేవో ఆలాగే యికపైని కూడా కాలక్షేపం చెయ్యి. నీవంటివాళ్ళంతా సోషలిజం స్థాపిస్తే యింక వేరే చెప్పనక్కర్లేదు. ఒరేయ్! ముసలిగద్దా! యిప్పుడు తిరుగుబాటు యెల్లాగా తప్పదు. వెంటనే బోల్షివిక్కులు నిన్ను కత్తైడయితే పూర్చి పారెయ్యడమో లేకపోతే ఖైదీగా పట్టుకొని ఆర్కేంజిలు ప్రాంతానికి పంపించడమో చేస్తారు. అక్కడ నీ బ్రతుకు అంతా అడవులలో చెట్లు నరుకుతూ గడపుదువుగాని. ఆరి గాడిదా! తగుదునమ్మా అని ప్రతివాడూ తిరుగుబాటు చేస్తానని తయారవడమే! విప్లవం లేవతియ్యడానికి నావంటి జమీందారుకే చెల్లింది. మా తండ్రికి 15 వేల యెకరాల సాగుబడి భూమి, 2 వేల యెకరాల అరణ్యం వుండేది. అంత గొప్పగా బ్రతికిన నావంటి వాడిని దేశం వదలిపెట్టి, పరదేశాలలో ప్రవాసం చేస్తున్నా. మనవాళ్ళు చెమ టోడ్చి సంపాదించడం, అంటారు చూసేవు - అల్లా కష్టపడి సంపాదించు కొని బ్రతకడం అంటే సిగ్గుకూడాను. కాని నువ్వు? నీ లెఖ్ఖేమిటి, ఎద్దు ముడ్డి పొడుచుకు బ్రతికేవాడవు? పేడ పురుగు నయం నీకంటె! అంత ర్యుద్ధంలో యీలాంటివాళ్ళని కుక్కల్ని కాల్చినట్లు కాల్చి పారేశారు. కాని నీబోటి మాయముండాకొడుకులు కొంతమంది తప్పించుకున్నారు" అన్నాడు.

"పరిస్థితులు యీలాగేవుంటే యింక బతగలేము." అని యాకోవ్ లూకుచ్ అతని ధోరణికి అడ్డువచ్చేడు. "ఈ పన్నులు భరించలేకుండా పండినపంట కాస్తా పన్నులకి సరిపోతూంది. స్వేచ్ఛగా వ్యవసాయం చేసుకు బ్రతకడానికికూడా వీలులేకుండా చేస్తున్నారు. లేకపోయినట్లయితే మీ వంటివాళ్ళ అవసరం మాకు లేకపోవును. ఏమైనాసరే ప్రభుత్వాన్ని ప్రతిఘటించకపోయి యుందుము."

"పన్నులా! విదేశాలలో యెక్కడా లేనట్లు చెబుతావేమిటి? వాళ్ల యిక్కడికంటె యెక్కువ పన్నులు చెల్లిస్తున్నారు."

"అల్లా యెప్పుడూ వుండదు."

"కాదు. ఆ విషయం నేను స్వయంగా యెరుగుదును."

"వాళ్లు యెంత పన్ను చెల్లిస్తారో మీకెట్లు తెలుసును ?"

"ఎనిమిది సంవత్సరములు విదేశాలలో తిరుగుతే ఆమాత్రము తెలుసుగోలేము !"

"అయితే మీరు విదేశాలనుండి వచ్చేరా యిప్పుడు !"

"అదంతా నీ కెందుకు ?"

"ఊరికేనే అడిగేను."

"రహస్యాలు అన్నీ చెప్పేస్తే మమ్మల్నికూడా తలతన్నుతావు. వెళ్ళి యింకో కొంచెం వోడ్కా తీసుగురా."

యాకోవ్ లూకుచ్ వోడ్కా తీసుగు రమ్మని సైమియన్‌ని పంపి అక్కడ కూర్చొనదానికి విసుగు తోచి దొడ్లోకి వెళ్ళి గడ్డిమేటివార కూర్చున్నాడు. "ఆరి పీణ్ణి తగలెయ్యా ! ఆ వెధవకథుర్లు వినేటప్పటికి తలనొప్పి కూడా వచ్చింది. బహుశా నేను యేమంటానోనని అల్లా నటిస్తూన్నా డను కుంటాను. వాళ్ళకి వ్యతిరేకంగా మాట్లాడినట్లయితే అవన్నీ అలెగ్జాండర్ అనిసిమోవిచ్ వచ్చిన తరువాత అతనితో చెప్పి, ఖ్రాప్రోవుని ఖూనీ చేసినట్లు చెయ్యాలని వూహిస్తున్నాడు. ఒకవేళ వాడుచెప్పినవన్నీ నిజమేమో ! సాధారణంగా బాగా త్రాగినవాళ్లు అదివరకు వాళ్ళ మనస్సులలో నున్నవన్నీ పైకి వాగుతారంటారు. ఏమైతే మనకెందుకు—పొలోవిట్సీవు విషయంలో యేం కలగచేసుకోకుండా దూరంగా వుండవలసింది. ఒకటి, రెండు సం॥లు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరి గడిపేస్తే యేబాధా లేకపోను. ఈ గుంటచిక్కులన్నీ విప్పలేక ప్రభుత్వమే మళ్ళీ సం॥రం తిరగకుండా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలన్నీ యెత్తేస్తే నా బ్రతుకు నేను బ్రతుకుదును. అయ్యో ! యెంత తెలివితక్కువపని చేసేను, ఇంక యేం చెయ్యను ? ఆలో

చించలేక తల........అనుభవించ వలసిందే .. ....రోలులోతలపెట్టి రోకలి పోటుకి వెరవడం యెందుకు ?"

*  *  *  *

అర్ధరాత్రి అయింది. వైసొక్కా-వాయ్‌లోవున్న పొలోవిట్సీవు దగ్గర నుంచి వార్తావహుడొకడు వచ్చేడు. లెటిస్కీ- అతని దగ్గర వుత్తరం చదివి వంటయింట్లో పడుకొని నిద్రపోతూయున్న లూకుచ్‌ని లేపేడు.

"ఇదిగో !- యీ వుత్తరం చదువు." అని వుత్తరం చేతికిచ్చేడు. కళ్ళు నులుముకుంటూ యాకోవు లూకుచ్ వుత్తరం అందుకున్నాడు. చక్కని అక్షరాలతో నోటుబుక్కు-నుంచి చింపిన కాగితంమీద పెనిసిలుతో రాసివుంది ఆ వుత్తరం.

"లెఫ్టినెంటు"

"సమిష్టి వ్యవసాయ క్షేత్రాల చల్లికలకోసం బోల్షివిక్ సెంట్రలు కమిటీ రైతులందరి దగ్గరనుంచి ధాన్యం వసూలు ప్రారంభించిందనే విషయం నమ్మకమైనవారి ద్వారా తెలిసింది. కాని నిజానికి ఆ వసూలు చేసిన ధాన్యం యంత్రాలు కొనడానికి విదేశాలకి పంపుతారు. ప్రజలంతా తిండిలేక మాడిపోవలసి వస్తుంది. తన సర్వ వినాశనాన్ని గుర్తించిన సోవియటు ప్రభుత్వం దేశంలోని ధాన్యం అంతా అమ్మేసి రష్యానంతనీ కూడ నాశనం చెయ్యడానికి చూస్తూంది. అందుచేత సోవియటు ప్రభుత్వ ధాన్యసేకరణ విధానానికి వ్యతిరేకంగా గ్రిమాచీలాగ్ ప్రజలలో మీరు ప్రచారంచేసి కూడగట్టండి. ఈ వుత్తరంలో విషయాలన్నీ కూడ యాకోవు లూకుచ్‌కి తెలియచెయ్యి. సోవియటు ప్రభుత్వం ధాన్యం వసూలు చెయ్యడాన్ని యేవిధంగా అయినాసరే భగ్నం చెయ్యాలి."

మరునాడుదయం యాకోవు లూకుచ్ సమిష్టి వ్యవసాయ క్షేత్ర కార్యాలయానికి వెళ్ళకుండా రహస్య సంఘంలో తనుచేర్చిన 'బెనిక్' మొదలయిన రైతుల్ని కలుసుగున్నాడు.

---

## ఇరువది నాలుగవ ప్రకరణము

### ధాన్యపు వసూలు.

గ్రిమాచీలాగ్‌లో దిగబడిన ప్రచారకదళసభ్యులు ముగ్గురూ ధాన్యపు ఫండు వసూలు చెయ్యడం ప్రారంభించేరు. భాగ్యవంతులచేత విడువబడ్డ ఇళ్ళలో ఒకదాన్లో వారి మకాం ఏర్పరచుకున్నారు. వారిలో ఒకడైన 'వెటుష్కిన్' అను వ్యవసాయ నిపుణుడు వేసవి చల్లికలప్లాను విధానాలు ప్రచారం చెయ్యడంలోను, రైతుకుటుంబాలకు కావలసిన వ్యవసాయ సంబంధమైన విషయాలు చెప్పడంలోను మునిగియున్నాడు. మిగిలిన కాలంలో రైతులు పండిస్తూన్న విత్తనపు ధాన్యం పరీక్షించడం, జబ్బుపడ్డ ఏ ఎద్దుకో, గొర్రెకో మందు యివ్వడం చేస్తున్నాడు. మందిచ్చి పశువుల రోగాలు కుదిర్చినందుకు ప్రత్యామ్నాయంగా వాళ్ళ యిండ్లో భోజనం చెయ్యడమో ఒక్కొక్కప్పుడు ఒక కూజాడో పాలు, వుడుకపెట్టిన బంగాళా దుంపలు, తెప్పగోవడమో జరుగుతూంది. మిగిలిన యిద్దరిలో ఒకడు 'బుబ్నోవ్'. ఇతడు జిల్లాపట్టణములోని ప్రభుత్వపు పిండిమరలలో కూలీ. రెండవవాడైన 'ఇవాన్ నైడియనోవ్', వెజిటబుల్ ఆయిలు మిల్లులో పనిచేసే ఒక కమ్యూనిస్టు యువకుడు. వీరిద్దరూ వారి మకాములోనే యుంటూ రైతుల్ని అందర్ని పిలిపించి, వారు యెవరెవరు యెంత యివ్వాలో లెక్కలుచూసి, ఊరిలో తెమ్మని ప్రచారం చేస్తున్నారు.

మొదటినుంచీకూడ రైతుల దగ్గరనుంచి ధాన్యపు ఫండు వసూలు చెయ్యడం చాలా కష్టంగానే వుంది. పని యింత మందంగా జరిగినట్లయితే నియమిత కాలంలో పని పూర్తిచెయ్యడం అసంభవమని తోచింది వాళ్ళకి. ప్రచారక దళ సభ్యులు, స్థానిక కమ్యూనిస్టులుకూడ ధాన్యపుఫండు వసూలు చెయ్యడానికి అనేకవిధాల నయాన, భయాన చెప్పి, ప్రయత్నం

చేస్తూన్నారు. కాని సమష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుడు, కానివాడు అను భేదం లేకుండా యించుమించుగా అందరూకూడ యెవరెన్ని చెప్పినా వినక తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు. గ్రామం అంతటాకూడ వసూలుచేసిన ధాన్యం విదేశాలకి యెగుమతి చేసేస్తారనీ ఆ సంవత్సరం వ్యవసాయమే వుండదనీ, పరిస్థితులన్నీ యిప్పుడో యికనో యుద్ధం వస్తుందన్నట్లుగా ఉన్నాయని పుకార్లు బయలుదేరేయి. ప్రచారక దళ సభ్యుల సహాయంతో నగుల్నోవు ప్రతిరోజూ మీటింగులు యేర్పాటుచేసి పరిస్థితులన్నీ వివరంగా తెలియచేస్తూ, గ్రామంలో ప్రచారం అవుతూన్న పుకార్లు ఖండించి ఎవరైనా "ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం" చేస్తూన్నట్లు తెలిసినట్లయితే క్రూరంగా శిక్షిస్తారని తెలియచేసేడు. ఎన్నిప్రయత్నాలు చేసినా ధాన్యం మాత్రం త్వరగా వసూలు అవడంలేదు. కోసక్కులంతా చీకటితోటే లేచి యెక్కడికో పోయి కంటపడకుండా తప్పించుకు తిరుగుతున్నారు. ఆడవాళ్ళు కూడా పూర్తిగా మీటింగులకి రావడం మానుకున్నారు. ప్రచారక దళ సభ్యులుగాని, గ్రామ సోవియటు అధికారులుగాని యేదయినా అడిగినట్లయితే "మొగవాళ్లు యెవరూ యింటిదగ్గరలేరు. ధాన్యం యివ్వడం విషయం నాకేమీ తెలియదు." అనిచెప్పి తప్పించుగుంటున్నారు.

ఏదో వొక నిగూఢశక్తి ధాన్యపు ఫండు వసూలు అవకుండా అడ్డగిస్తూన్నట్లుగా వుంది.

ప్రచారక దళ సభ్యుల కార్యాలయములో ప్రతిరోజూ యీ క్రింది మాదిరి సంభాషణలు వినిపిస్తూనే వున్నాయి.

"మీరు యివ్వవలసిన ధాన్యం తీసుగు వచ్చేరా ?"

"లేదు."

"ఎందుచేత ?"

"నాదగ్గర ధాన్యం యేమీ లేవు."

" 'ధాన్యం యేసి లేపు' అనడంలో వుద్దేశ్యం యేమిటి ?"

" 'ఉద్దేశ్యం యేమిటి' యేమిటి ? నేను చెప్పినదే........విత్తనాల కని కొన్ని అట్టేపెట్టేను. కాని యిదివరకు ధాన్యపు వసూళ్ళకి, నాతిండికి సరిపోగా మిగిలిన ధాన్యం అన్నీ యిచ్చెయ్యడంచేత విత్తనాలకి అట్టేపెట్టిన ధాన్యంకూడా తినెయ్యవలసి వచ్చింది."

"అల్లా అయితే యీ సం॥రం వ్యవసాయం చెయ్యదల్చుకోలేదా ?"

"చెయ్యదల్చుకునే వున్నాను. కాని విత్తనాలేనా లేనిదే యేం చెయ్యను ?"

చాలామంది విత్తనపు ధాన్యం అన్నీ అంతక్రితం ధాన్యపు వసూళ్ళకే యిచ్చేసేమని చెప్పడం మొదలెట్టేరు. దేవిదోవు సమిష్టి వ్యవసాయ క్షేత్ర కార్యాలయంలోను, నైదియనోవు ప్రవాంతికవిళ కార్యాలయంలోను, ధాన్యపు వసూలు లిస్టులు, రసీదులు, అన్నీ తిరగేసి, తహవేలువేసి చూపి, వాళ్ళ మూర్ఖవాదాలన్నీ అబద్ధాలని రుజువు చేసేరు. ఒక్కొక్కప్పుడు యీ రుజువుకోసం క్రిందటి సం॥రం పండిన పంటయెంతో, దాన్లో వాళ్ళు ధాన్యపువసూలుకి యెంత యిచ్చేరో, యింక యెంత ధాన్యం వాళ్ళదగ్గర వుందో లెక్కలు తేల్చి చూపించవలసి వచ్చింది. ఆ విధంగా వాళ్ళదగ్గర మిగిలి వుందని తేల్చినప్పటికి యివ్వడానికి నిరాకరించేరు.

"మా దగ్గర యేమాత్రమో ధాన్యం వున్నాయనుకోండి. మీరు అయినట్లయితే సమిష్టివ్యవసాయ క్షేత్రంలో వొక నియమ ప్రకారం చూచి వాడుకుంటారు. కాని మేము అలాకాదు——యెన్ని కావలిస్తే అన్నీ వాడుకుంటాము. అందుచేత మీ ధాన్యపు వసూళ్ళకి పోగా మా దగ్గర రోజుకి యిన్ని అని లెక్కచూచి దిగపెట్టినవన్నీ. యెంతసేపూ ఆ రొట్టి తప్ప యింక యేమీ తినడానికి లేకపోవడంచేత, యేడాది లెక్కవేసి అట్టేపెట్టిన వన్నీ మాకు 5, 6 నెలలకంటె యెక్కువగా రాలేదు. మా దగ్గర యింక యేమీలేదు. మీకు నమ్మకం లేకపోతే వచ్చి సోదా చూసుకోండి."

ధాన్యం యివ్వనివాళ్ళ ఇళ్ళన్నీ సోదా చెయ్యాలని నగుల్నోవు పార్టీ మీటింగులో సూచించేడు. కాని మిగిలిన వాళ్ళెవరూ దానికి అంగీకరించలేదు. విత్తనపు ధాన్యం వసూలుచేసే సందర్భంలో యెవళ్ళ యిళ్ళూకూడ సోదా చెయ్యకూడదని జిల్లా కమిటీ సూచించిందికూడాను.

మొత్తం మూడు రోజులలోను సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల దగ్గరనుంచి 100 బస్తాలు, ఇతర రైతుల దగ్గరనుంచి 8 బస్తాలు ధాన్యం మాత్రం వసూలు అయేయి. వ్యవసాయక్షేత్రపు యాక్టివ్ మెంబర్లు వాళ్ళు యియ్యవలసినది అంతా మొదటి రోజుననే యిచ్చేసేరు. ఆ మరునా డుదయం యాకోవు లూకుచ్, అతనికొడుకు సైమియన్, రెండు స్లెడ్జిల మీద ధాన్యం కమ్యూనల్ గ్రేనరీ దగ్గరకు తోలుకువచ్చేరు. యాకోవు లూకుచ్ తిన్నగా కార్యాలయంలోకి వెళ్ళేడు. సైమియన్ ధాన్యపు బస్తా లన్నీ కమ్యూనల్ గ్రేనరీలోకి మోసుకువెళ్ళేడు. డెమ్కా అవన్నీ లెక్క పెట్టుకుని తూచేడు. సైమియన్ నాలుగు బస్తాలుక్రింద దిగపోసేడు. అయి దవ బస్తా మూతి విప్పుతూన్నాడు. ఇంతలో డెమ్కా అతనిమీద తుపా నులా విరుచుకుపడ్డాడు.

"మీనాన్న విత్తనాలకోసం జాగ్రత్తపెట్టిన ధాన్యం యివేనా?" గుప్పెడు ధాన్యం తీసి అతని ముఖం దగ్గరపెట్టి ఉరిమేడు.

"ఏం వాటికేమి?" సైమియన్ ఎదురుకున్నాడు. "గోధుమల్ని చూసి జొన్నలనుకుంటున్నావా యేమిటి! పాపం మెల్లకన్నుతో చూస్తే కనిపించలేనట్టుంది."

"నాకు మెల్లవున్నా అంత గోధుమలు, జొన్నలు తెలుసుగో లేకుండా లేనురా, చవటా! మీనాన్న యెలాంటి వ్యవసాయదారో మాకు తెలుసును! ఏమిటిది? ఇదేనా విత్తనాల ధాన్యం? పైగా నన్ను బుకా యిస్తున్నావా? నా ధాన్యంలో యివి తీసుగువచ్చి యెందుకు పోసేవు?"

డెమ్కా కాయలతోను, బెడ్డలతోనుయున్న ధాన్యం విసిరిపారేసి, "అందర్నీ పిలిచి చూపిస్తానుండు యీధాన్యం" అని బెదిరించేడు.

"తొందర పడకు!" అన్నాడు సైమియన్ కంగారుతో. "ఈ బస్తా పొరపాటున వచ్చియుండవచ్చు. దీని బదులు మంచిబస్తా వొకటి తీసుగొస్తాను. చాలా వింతగా వుందే! యీమాత్రం దానికి యింత హడావిడి చేస్తావెందుకు? మార్చేస్తానని చెబుతున్నాను కాదూ, యెక్కడో పొరపాటున వచ్చింది."

సైమియన్ తీసుగువచ్చిన పదునాల్గు బస్తాలలో డెమ్కా ఆరు తెరగ గొట్టేడు. ఆ బస్తాలని బుజానికి యెత్తమని సైమియన్ అడుగుతే ఆ మాట వినిపించనట్లు కాటాపైపు తిరిగి డెమ్కా మాట్లాడకుండా వూరుకున్నాడు.

"అయితే బస్తా బుజానికి యెత్తవన్నమాట?" అన్నాడు సైమియన్ కంపిత స్వరంతో.

"ఏమిటోయ్—నీ వుద్దేశ్యం? ఇంటిదగ్గిర నువ్వు వొక్కడవూ యెత్తుగో గలిగేవు. అక్కడ తేలికగా వుంది. యిక్కడికి వచ్చేటప్పటికి హఠాత్తుగా బరువెక్కేయిలావుంది. నేను మాత్రం సహాయం చెయ్యను. కావలిస్తే యెత్తుగో. లేకపోతే మానెయ్యి."

సైమియన్ అతి కష్టంమీద ఆ బస్తా స్వయంగానే యెత్తుకొని స్లెడ్జిలో పడేసేడు.

ఆ తరువాత రెండు రోజులలోనుకూడ విత్తనాలు యేమీ వసూలు అవలేదనే చెప్పచ్చు. నూక్లెస్ మీటింగులో రైతుల అందరి యిళ్ళకి వెళ్ళాలని నిశ్చయం అయింది. ఆ క్రితంరోజు సాయంకాలం, డేవిడోవ్, వానలు యెద్దడి అయినప్పటికి పంట జబ్బు ఇయ్యని కొత్తరకపు గోధుమ విత్తనాలు, తీసుకొని రావడానికి పక్కజిల్లాలోని వొక సమిష్ఠి వ్యవసాయ క్షేత్రా

నికి వెళ్ళేడు. క్రితం సంవత్సరం ఆ రకం గోధుమలు సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో మచ్చుచూడడానికి చల్లితే అద్భుతంగా పండింది. యాకోవ్ లూకుచ్, అగాఫన్ డుబ్సీవ్, కాలిఫోర్నియానుంచి దిగుమతి అయిన గోధుమలు, దేశవాళీ తెల్లగోధుమల సమ్మేళనవల్ల తయారయిన యీ కొత్త రకపు గోధుమలను గురించి చాలసేపు మాట్లాడుకున్నారు. ఈ మధ్య కొన్ని రాత్రులనుంచి అగ్రికల్చరల్ జర్నలులు చదవడంలో కాలక్షేపం చేస్తూన్న దేవిడోవ్ ఆ కొత్త రకపు విత్తులు తీసుకురావడానికి వెళ్ళేడు.

అతడు మార్చి 4వ తారీఖున తిరిగి వచ్చేడు. కాని అతడు రేపు వస్తాడనగానే గ్రిమాచీలో నగుల్నోవ్ వొక తొందరపాటు పని చేసేడు. ఆ రోజు వుదయం నగుల్నోవ్ రెండవ దళంలోచేరి లుబిష్కిన్‌తో ముప్పదిమంది కోసక్కుల యిళ్ళు చూసివచ్చేడు. మధ్యాహ్నము దేవిడోవ్, రజ్మట్నోవులు యిద్దరూకూడ లేకపోవడంచేత, అతను సోవియటు ఆఫీసులోనే వుండి ఉదయము తనకి కనిపించని కోసక్కుల్ని పిలిపించేడు. నలుగురితో మాట్లాడేడు. దానివల్ల ఫలితం యేమీ కనిపించలేదు. "మా దగ్గర విత్తనాలు యేమీలేవు" "ప్రభుత్వాన్నే సప్లయి చెయ్యమనండి." అనే చెబుతూన్నారు యెవరు చెప్పినా. నగుల్నోవ్ మొదట నెమ్మదిగా అనేకవిధాల చెప్పి చూసేడు. కాని తరువాత బల్ల గుద్దుతూ కోపముతో కేకలెయ్యడం ప్రారంభించేడు.

"మీ దగ్గర విత్తనాలుకూడా లేవంటే నమ్మడం యేలాగ? కాన్‌స్టాంటిన్ గేవ్రిలోవిచ్, నీ మాటే చూడు. క్రిందటి వేసవిలో నీకు 70 బస్తాలు అయేయి" అన్నాడు. "నువ్వు ప్రభుత్వానికి యెంత చెల్లించేవు?"

"ఏం—మాట్లాడవేం? ఎంత యిచ్చేవు?"

"23 బస్తాలు."

"మిగిలినదంతా యేం చేసేవు?"

"ఏం చేసేనో తెలియదూ?" తినేసేను!"

"తినేసేవా? అన్ని గోధుమలు తినేస్తే పొట్టబద్దలవకుండా యింకా యిల్లా ఉంటుందా! నీ కుటుంబంలో మొత్తం ఆరుగురున్నారు. ఆ ఆరుగురు 47 బస్తాలు తినడం అసంభవం. ఇల్లాంటి కథల్లు చెప్పక నువ్వు యివ్వవలసిన దేముందో యిచ్చెయ్యి. లేకపోతే నిన్ను వెంటనే సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి తొలగించేస్తాము."

"పోనీ తొలగించెయ్యండి. ఏమి చేస్తాం. నా దగ్గరమాత్రం యివ్వ వానికి యేమీలేదు! ప్రభుత్వానికే నష్టయి చెయ్యమనండి. వడ్డీ యిచ్చే షరతి..........."

"ఎంతసేపూ ప్రభుత్వం దగ్గరనుంచి లాగడం అనేకాని రెండో [illegible] లేమి లేదు. 'సోయరు, రీపరు' కొనేటందుకు క్రెడిట్ అసోసియేషను దగ్గర నువ్వు తీసుకున్న అప్పు చెల్లించేవా? అది మాత్రం వుండదు: ఆ డబ్బు వాడేసుకున్నావు. పండిన పంటంతా తిండికి కావాలంటావు. అంతేకాదా:"

"సోయరు, రీపరు, కూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రానికే వెళ్ళిపోయేయి. ఒక్కసారికూడా వాటిని వాడుకోనిదే ఆ అప్పు నే నెందుకు చెల్లిస్తాను?"

"ఈ కథల్లు కట్టిపెట్టి ముందు విత్తనాలు తెచ్చి యిచ్చెయ్యి. శుద్ధ మొండిరకం. సిగ్గేనా లేదు."

"మహారాజులా యిద్దును. కాని నా దగ్గర యేమేనా వుంటేకాదూ?"

నగులోన్వు వాళ్ళతో యెంత వాదించినా, భయపెట్టినా లాభంలేక పోయింది. వాళ్ళ నోటివెంట 'ఇస్తాము' అని అనిపించలేకపోయేడు. వాళ్లు బయటికి వెళ్ళిపోయి. కొంతసేపు యేదో గుసగుసలాడుకొని లేచి పోయేరు. తరువాత కొంతసేపటికి గ్రిగర్ జేనిక్ వచ్చేడు. సమిష్టి వ్యవ

సాయ క్షేత్రంలోచేరని రైతులలో యితనొకడు. అంతక్రితమే వెళ్ళిపోయిన సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యులు ఆ విషయం అంతా యితనికి చెప్పినట్లే తోస్తుంది. అతని పెదవులమీది తిరస్కారపూర్వకమైన ఆ చిరునవ్వు చూస్తూ నగుల్నోవు యెదుట బల్లమీదనున్న కాగితాలు తీసి చుట్టపెడుతూ,

"గ్రిగర్ మెట్వేచ్ ! యిలా కూర్చోవోయ్ ," అన్నాడు.

"అల్లాగేలెండి." అంటూ బేనిక్ కాళ్ళు యెడంగా పెట్టుకొని కూర్చున్నాడు.

"గ్రిగర్, నువ్వు యివ్వవలసిన విత్తనాలు యివ్వలేదేమి ?"

"ఎందుకు యివ్వడం—నేను ?"

"జనరల్ మీటింగులో అలా తీర్మానమయింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో సభ్యులయినవారు, కానివారు అందరూ కూడ యివ్వవలసిందే. నీ వగ్గర యేమైనా వున్నాయా ?

"ఆ—ఉన్నాయి."

నగుల్నోవు లిస్టు తిరగేసేడు. బేనిక్ పేరు యెదుట '1930 సంవత్సరపు వేసవిలో చల్లవలసిన భూమి' అను 'కాలమ్' లో 15 అంకె వుంది.

"అయితే యీ వేసవిలో 15 హెక్టార్ల (సుమారు 37 ఎకరాలు) భూమిలో గోధుమలు చల్లుతావా ?" అని అడిగేడు.

"అవును."

"మరి నీ దగ్గర 9 బస్తాల విత్తనాలు వున్నాయా ?"

"ఆ—వున్నాయి. అన్నీ శుభ్రంచేసి అట్టే పెట్టేను. బంగారంలా వున్నాయి."

"బాగుంది. చాలా గట్టివాడవోయ్, ఉదయాన్నుంచి చూస్తూన్నాను; ఆ మాత్రం మాట అన్నవాడెవడూ లేడు. అవన్నీ రేపు తీసుగురా—సమిష్టి

ధాన్యపుకొట్లకి. కావలసినట్లయితే నీ సంచులలోనే వుంచుగోవచ్చు. ఇతరుల విత్తనాలతో కలపడానికి యిష్టంలేని రైతులు, వాళ్ళ సంచులలో వేరే వుంచుకోనవచ్చు. అవి తీసుకువచ్చి డెమ్కా చేత తూకం వేయించు. అరపు నీ బస్తాలకి సీళ్ళువేసి, రసీదు యిస్తాము. నీ విత్తనాలన్నీ వేసవిలో యిచ్చేస్తాము. ఎవర్ని అడిగినా విత్తనాలుకూడా తినేసేసునే చెపుతూన్నారు. మా దగ్గర అయినట్లయితే జాగ్రత్తగా వుంటాయి."

"కామ్రేడ్ నగుల్నోవ్, మీరు అట్లాంటి ఆశ పెట్టుగోకండి!" బేనిక్ విషపు నవ్వు నవ్వి, గడ్డం సవరించుకున్నాడు. "మీ మాటలకి మోసపోయే రోజులు వెళ్ళిపోయేయి. నా విత్తనాలు మీకు యివ్వను."

"ఏం—యెందుకు యివ్వవు?"

"మీ దగ్గరకంటె నా దగ్గరవుంటేనే భద్రంగా వుంటాయి. అవి యిప్పుడు మీకు యిచ్చినట్లయితే వేసవిలో ఆ విత్తనాలు రాకపోవడం కాకుండా ఆఖరికి సంచులుకూడా తిరిగిరావు. మేము—అంత మూర్ఖులం కాదు. మాకుకూడా అన్నివిషయాలూ తెలుస్తూన్నాయి."

"సోవియటు ప్రభుత్వంమీదకూడా అపనమ్మకమేనా నీకు? అయితే నేను చెప్పినదేమీ నువ్వు నమ్మవు అన్నమాట?"

"ఆ—నమ్మను. ఈ నాటకం అంతా నాకు యిదివరకే తెలిసింది."

"నాటకం ఏమిటి? ఎవరు చెప్పేరు నీకు?" నగుల్నోవు ముఖంలో కోపం స్పష్టంగా కనిపిస్తూంది. నెమ్మదిగా లేచి నిలబడ్డాడు.

కాని బేనిక్ యిది యేమీ చూడనట్లు, పళ్ళు యిగిలించి నవ్వుతూనే వున్నాడు. అతని మాటలలో తీవ్రక్రోధము, తొట్రుపాటు ప్రతిధ్వనిస్తూన్నాయి.

"తిండికోసం అనీ, విత్తనాలకి అనీ, వీలయినన్ని ధాన్యం పోగుచేసి అవన్నీ రైళ్ళకి యెక్కించి విదేశాలకు ఎగుమతి చేసెయ్యడమూను –

అక్కడ మోటార్లుకొని పార్టీసభ్యులందరూ అందమైన ఆడవాళ్ళతో వాటిలో తిరుగుతూండడమూను. మీరు విత్తనాల పేరుచెప్పి యివన్నీ యెందుకు జోగుపేస్తున్నారో మాకు తెలుసును. అంతా సమానంగా అనుభవించాలనడం కధుర్లమటుకే కాని క్రియలో కనిపించదు!"

"నోటికి వచ్చినట్లు అల్లా వాగుతూన్నావు — మతిపోలేదుకదా? ఏమిటా పేలాపన?"

"తొందర పడితే యెల్లాగ!— మతిపోవడం యెవరికో తెలుస్తుంది. ఇదివరకు ధాన్యపు ఫండుకి 35 బస్తాలు యిచ్చేను. మళ్ళీ ఇప్పుడు యింకా తే తెమ్మంటే యెక్కడనుంచి తెస్తాను? నేను, నా పిల్లలూ తిండి తినకుండా చస్తామా?....... ...."

"ఛీ—నోరు ముయ్యి! ఒక్కమాట నిబద్ధిలేదు—ద్రోహీ" నగుర్నాపు బల్లమీద గుద్దుతూ వురిమేడు.

ఆ అదురికి 'అబాకస్' కింద పడిపోయింది. సిరాబుడ్డి తలక్రిందు లయిపోయింది. చిక్కటి నీలిసిరా బల్లమీదనుంచి ప్రవాహం కట్టింది. బేనిక్ గొర్రె బొచ్చు చొక్కా చివర పడింది. అతను చొక్కామీది సిరా చేతితో తుడుచుగుంటూ లేచి నిలబడ్డాడు. కనుబొమలు ముడేసి పొంగివస్తున్న కోపం ఆపుకొని, "యీ నోరు ముయ్యమంటే భయపడేవాడెవడూ లేడు యీ రోజులలో! పిడికిళ్లు బిగిస్తే భయపడడానికి నీ పెళ్ళాం ఒకిరియా అని అనుకుంటున్నావు లావుంది. ఇది 1920 వ సంవత్సరం కాదు అలా భయపడడానికి; తెలిసిందా? ఒక్క గింజకూడా నీకు యివ్వను. నీ యిష్టము వచ్చినట్లు చేసుగో!"

"ఆ—యేమిటీ అంటున్నావు?......నువ్వే యీలా అంటూంట? అరె ద్రోహీ! నా దగ్గరే అల్లా యెదిరిస్తూన్నావా! ఏమిరా వెధవా, సోషలిజం అంటే అంత నవ్వులాటగా వుందిరా? కాని యిప్పుడు........."

మకాన్‌కి యేమీ మాటలు రావటంలేదు. ఉచ్ఛ్వాస నిశ్వాసలు గట్టిగా విడుస్తూన్నాడు కాని, యేలాగో ఆ కోపం అణుచుకొని నుదుటిమీద చిరు చెమట తుడుచుకున్నాడు.

“నువ్వు యివ్వవలసిన విత్తనాలన్నీ రేపు తీసుకొస్తానని కాగితం వ్రాసి ఇయ్యి ముందు. తరువాత పొగమమోతు సమాధానం విషయం చూస్తాను.”

“కావలసినట్లయితే అరెస్టు చెయ్యండి. అంతేకాని నేను మాత్రం కాగితం వ్రాసి యివ్వటంకాని, విత్తనాలు ఇయ్యటంకాని మొన్నటిలా చెయ్యను!”

“ఏమ్! రాయమని చెబుతూన్నాను మళ్ళీ నోరెత్తకు!”

“ఒక్క నిమిషం ఆగండి.........”

“నీ మంచికోసం చెబుతూన్నాను వ్రాయి!”

చేనిక్ గుమ్మంకేసి వెళ్ళేడు. కాని అతనికి వొళ్ళు మండిపోతూంది. ద్వారబంధం కమ్మలు పట్టుకొని నిలబడి “యిప్పుడు వెళ్ళి ఆ విత్తనాలన్నీ పందులకి పోసేస్తాను. మీవంటి సోమరిపోతులకి దొబ్బపెట్టేకంటె వాటికి పోసినా నయమే!” అని కేకేసేడు.

“పందులకా? విత్తనాలు? రెండు వురకలలో ద్వారంవగ్గరకు వచ్చి జేబులో పిస్తలు లాగి, దాని మడమతో చేనిక్ రేవునెత్తి బద్దలయిలా ఒక్క దెబ్బ కొట్టేడు. చేనిక్ కళ్లు చీకట్లు కమ్మేయి. రెండుచేతులతోను తల పట్టుకొని క్రింద కూలపడ్డాడు. గాయంలోనుంచి నల్లటి రక్తము మేక ధారగాకారి జుట్టు అంతా తడిపేసి బట్టలమీద పడుతూంది. అతని ప్రక్క ఉగ్రుడయిపోయి నిలుచున్న నగుల్నోవు కోపం తీరేటట్లు కాలితో తన్ని కొంత సేపటికి వెనక తగ్గేడు. మెరకమీద పడ్డ చేపలా చేనిక్ వొకటి, రెండుసార్లు యిటు అటు కొట్టుకొని నెమ్మదిగా గోడ ఆసరా చేసుకొని

లేచేడు. అతను లేవగానే రక్తం యింకా యెక్కువగా కారడం మొద లెట్టింది. మారు మాట్లాడకుండా చొక్కా చేతులతో తుడిచేసుగున్నాడు. నగుల్నోవు అక్కడే వొక మూలనున్న కూజాలోనినీళ్లు అంచు కరిచి తాగేడు. లేచి నిలబడడానికి ప్రయత్నము చేస్తూన్న బేనిక్ కేసి ముఖం ఐమూలగాపెట్టి. కనుబొమలు ముడేసిచూసి. మళ్ళీ అతని దగ్గరకు వెళ్ళి గుత్తి పట్టుకొని, టేబులు దగ్గరకు లాక్కొనివెళ్ళి పెనిసిలు వొకటి అతని చేతి కిచ్చేడు.

"నేను చెప్పినట్లు వ్రాయి." అని ఆజ్ఞాపించేడు.

"రాస్తాను, కాని యిదంతా పబ్లికు ప్రాసిక్యూటరుకి చెబుతాను. పిస్టలుతో బెదిరిస్తే చెప్పినట్లల్లా రాయక యేంచేస్తాను. సోవియటు ప్రభుత్వం మీ యిష్టం వచ్చినట్లు కొట్టమనలేదు. అది.........ఆ పార్టీకూడ.... ............యింత ఘనకార్యం చేసేవని మెచ్చుగోదు." అని స్పష్టంగా బొంగురు గొంతుకతో అంటూ చేసేది లేక బెంచీమీద కూర్చున్నాడు.

నగుల్నోవు పిస్టలు చేతబుచ్చుకొని టేబులుకు అవతలివైపు బేనిక్ యెదురుకుండా కూర్చున్నాడు.

"ఆరి—విప్లవద్రోహీ! సిగ్గు లేకుండా యింకా సోవియటు ప్రభుత్వాన్ని. పార్టీని గురించికూడా మాట్లాడుతున్నావే! కోర్టులు కాదు నిన్ను విచారణ చెయ్యడం—నేను. నేను చెప్పినట్లు రాయకపోతే కుక్కని కాల్చినట్లు కాల్చిపారేసి. తరువాత అవసరం అయితే పది సంవత్సరములపాటు జైలులో వుండి వస్తాను. నా యెదుట సోవియటు ప్రభుత్వాన్ని అవమానిస్తే మాత్రం చూస్తూ వూరుకోను. రాయి. స్టేటుమెంటు రాయడం అయిందా? మళ్ళీ రాయి: 'వెనక విప్లవ వ్యతిరేకులతో చేరి రెడ్ ఆర్మీతో యుద్ధంచేసిన నేను.............రాయడం అయిందా? '............అఖిల రష్యా కమ్యూనిస్టు పార్టీని..........' ఆ మాటలు పెద్ద అక్షరాలలో వ్రాయి.

'..........సోవియటు ప్రభుత్వాన్ని నిందిస్తూ అన్నమాటలు ఉపసంహరించుకుంటున్నాను. వారిని యీ ప్రథమ తప్పిదం మన్నించవలసిందని కోరుతూన్నాను. ఇకపైన యెన్నడూ అటువంటి తప్పిదం చెయ్యను. నేను సోవియటు ప్రభుత్వాన్ని కూలత్రోయడానికి ప్రయత్నం చేస్తూన్న రహస్య విప్లవ వ్యతిరేక సంఘ సభ్యుణ్ణి ........"

"నేను అల్లా రాయను! యేమని రాయమని — బలవంత పెడుతూన్నారు?"

"రాయకేంచేస్తావు, మహారాజులా రాస్తావు! మరి యేమను కున్నావు? సోవియటు ప్రభుత్వంకోసం సమస్తం త్యజించి, విప్లవ వ్యతిరేకులచేత వావు దెబ్బలు తిని ఆరోగ్యం కోల్పోయిన నేను నిన్ను వొదిలి పెడతానా? నా యెదటే సోవియటు ప్రభుత్వాన్ని పరిహసిస్తూంటే చేతులు ముడుచుకొని కూర్చుంటానా? రాయి, లేకపోతే గుండెలు చీరేస్తాను."

డేనిక్ టేబులు మీదకి వంగేడు. అతని చేతిలోని పెనసలు అయిష్టంతో కాగితంమీద నడవడం మొదలెట్టింది. నగుల్నోవు గుర్రంపెడి వేలుపెట్టి, స్పష్టంగా, నెమ్మదిగా చెప్పి వ్రాయిస్తున్నాడు.

"అయినప్పటికీ, యీసోవియటు ప్రభుత్వాన్ని కూలదొయ్యడం నాకు యిష్టంలేదు. అనేక లక్షలమంది కూలీలు యీప్రభుత్వంకోసం తమ ప్రాణాలు తృణప్రాయంగా అర్పించేరు. అవసరం అయితే యింకా సిద్ధంగా వున్నారు. అటువంటి యీ సోవియటు ప్రభుత్వాన్ని యికమీదట యెన్నడూ నిందించను. కూలత్రోయడానికి ప్రయత్నించను. ప్రపంచ మంతటానున్న మావంటి విప్లవ ద్రోహుల్ని అందర్నీ నాశనంచేసే ప్రపంచ విప్లవంకోసం యెదురు చూస్తూన్నాను. సోవియటు ప్రభుత్వానికి అపకారం చెయ్యననేకాకుండా సమిష్టి వ్యవసాయ విధానానికి యేమి అడ్డం

కులు కల్పించననికూడా వాగ్దానం చేస్తున్నాను. రేపు, అనగా 1930వ సం॥రం మార్చి 4వ తారీఖున నేను ఇయ్యవలసిన........"

ఆ సమయమున వొక సోవియటు డెలిగేటు, ముగ్గురు సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు లోపలకి వచ్చేరు.

"ఒక్క నిముషం బయట ఆగండి" అని నగుల్నోవు వాళ్ళతో చెప్పి, జేనిక్ కేసి తిరిగేడు.

"........9 బస్తాల గోధుమ విత్తనాలు తెస్తాను, క్రింద సంతకము చెయ్యి."

జేనిక్ సంతకంచేసి నిలపడ్డాడు.

"మకార్ నగుల్నోవు! దీనికి సమాధానము చెపుదువుగానిలే...."

"మనం యిద్దరం కూడ చెప్పవలసివుంటుంది సమాధానం— చేసిన పనులకి. కాని రేపు గోధుమ విత్తనాలు 9 బస్తాలు తీసుగురాక పోయేవంటే చంపేస్తాను, జాగ్రత్త!"

నగుల్నోవు స్టేటుమెంటు మణిచి కాకిషర్టు లోపలి జేబులో పెట్టేడు. చేతులోని పిస్టలు టేబులుమీద పడేసి బయటకు వెడుతూన్న జేనిక్ వైపు చూస్తూ కూర్చున్నాడు. అతడు అర్ధరాత్రివరకు గ్రామ సోవియటులోనే వుండిపోయేడు. 'మిలీషియా మనుష్యుని' కూడా ఆగమని చెప్పి అతని సహాయముతో, విత్తనాలు యివ్వడానికి నిరాకరించిన ముగ్గురు సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల్ని పట్టుకొని కొట్టులోపెట్టి తాళం వేసేడు. అర్ధరాత్రి దాటిన తరువాత ఆరోజు రోజంతా అతి పరిశ్రమవల్ల అలిసిపోయి, ఆ టేబులుమీదే రెండు చేతులమీదా తలవాల్చి నిద్రపోయేడు. ఆ తెల్లవార్లూ కలలు వస్తూనే వున్నాయి. పర్వదినాలలోవలె విలువైన మంచి దుస్తులు వేసుకొని వేలకొలది జనం గుంపులు గుంపులుగా వెళ్ళిపోతూ

న్నారు. నేల యీనిందా అన్నట్లు ఆ జనంకి అంతేలేదు. మధ్య మధ్య గుఱ్ఱపు రౌతులు నడుస్తున్నారు. రంగు రంగుల ఆ గుఱ్ఱాలు పైప్పేమీద నడుస్తూంటే వాటి డెక్కల చప్పుడుకి దిక్కులు మారుమ్రోగుతున్నాయి. అకాత్తుగా మకార్‌కి దగ్గరగా ఆర్కెస్ట్రా మీద అంతర్జాతీయగీతం మధుర ధ్వనితో వినబడుతూంది. వేగంగా వెళ్ళిపోతూన్న ఆపకూలాల వెనక 1920వ సం॥లో 'రాంగెల్ సేనాని' సైనికులచేత చంపబడిన 'మిట్కా లోమావ్' అను అతని స్నేహితుడు కనిపించేడు. అతన్ని చూసేటప్పటికి మకార్ ఉత్సాహం పట్టలేక పటాలం అడ్డుపడి జనాన్ని తప్పించుకుంటూ 'మిట్కా, మిట్కా, ఆగు.' అని కేకేస్తూ, అతనికేసి వెళ్ళేడు. కాని, ఆతని కంఠధ్వని అతనికే వినబడలేదు. మిట్కా గుఱ్ఱం మీదనుంచే వెనుతిరిగి, యెవరినో అపరిచిత వ్యక్తిని చూసినట్లు చూసి గుఱ్ఱాన్ని ఆప కుండా దౌడుతీస్తూ వెళ్ళిపోయేడు. అతని తరువాత మకార్‌కి సైన్యంలో అతనిక్రింద పనిచేసి 1920వ సం॥లో క్రోవా యుద్ధంలో పోలిష్ బుల్లెట్లు వాతపడ్డ ట్యూలిన్ అను సార్జెంటుని గుర్తుపట్టేడు. ట్యూలిన్ నవ్వుతూ గుఱ్ఱాన్ని గేలప్‌మీద వదిలేసి మకార్ దగ్గరకువచ్చి కుడిచేతితో ఆతని గుఱ్ఱపు కళ్ళెం పట్టుగున్నాడు. ఆ గుఱ్ఱంకూడా తెల్లటికాళ్లూ, చిన్నతలా అదీ ట్యూలిన్ వెనకటి గుఱ్ఱమే. ఇంతలో ట్యూలిన్ మాయమైపోయేడు. గుఱ్ఱంమాత్రం మెడ పైకి యెత్తి, దౌడుతీస్తూ వెళ్ళిపోయింది.

గాలికి కిరకిరలాడుతూన్న కిటికీ షట్టర్లచప్పుడు తెల్లవార్లూ మకార్‌కి సంగీతంలా వినిపిస్తూనేవుంది. ఇంటికప్పుమీది యినుపరేకుల బడ బడచప్పుడు గుఱ్ఱపు డెక్కల టక టక ధ్వనిలా వినిపించింది. మరునా డుదయం ఆరుగంటలకి రజ్మట్నోవు సోవియటుకి వచ్చేటప్పటికి మకార్ యింకా నిద్రనుంచి లేవలేదు. పెదవులమీద చిరునవ్వు కనిపిస్తూంది. కను బొమలు చలిస్తున్నాయి. రజ్మట్నోవు అతన్ని తట్టి లేపుతూ,

"చెయ్యవలసిన పని కాస్తా చేసేసి, కలలుకంటూ హాయిగా పడుకుని నిద్దరోతున్నావా? జేనిక్‌ని యెందుకు కొట్టేవు? ఇంకా తూర్పు తెల్లారకుండానే 9 బస్తాల గోధుమలు స్లెడ్జిమీద తోలుకొచ్చి వప్పచెప్పేసి, అర్జంటుగా పట్నం వెళ్ళిపోయేడు. లుబిష్కిన్ పరుగెత్తుకొని వచ్చి, 'జేనిక్ నీమీద మిలీషియా యెదుట కేసు పెట్టడానికి వెళ్ళేడు, అని చెప్పేడు. కొట్టడం మాట నిజమేనా? దేవిదోవు వింటే యేమంటాడు?"

నగుల్నోవు ముఖం తుడుచుకుని యేదో ఆలోచనా పూర్వకంగా చిరునవ్వు నవ్వేడు.

"ఆంద్రీ!" అన్నాడు. "ఏలాంటి కల వచ్చిందనుకున్నావు యిప్పుడు; వాకటోరకం కల!"

"కలకి యేంకాని ముందు యెందుకు కొట్టేవో చెపుదూ."

"పొద్దున్నే అలాంటివెధవ మాట తలపెట్టకూడదు. గోధుమలు తీసుకు వచ్చేడనా అన్నావు; అలాగ అయినట్లయితే పనిచేసిందన్నమాటే. 9 బస్తాల గోధుమ విత్తనాలు; అదేమీ సాధారణ విషయం గాదు. ప్రతి విప్లవద్రోహినీ పిస్తలు తిరగేసి రేవునెత్తి పగిలేలా వొక్క దెబ్బ కొట్టగానే 9 బస్తాల గోధుమలు తెచ్చి యిచ్చినట్లయితే, నా జీవితకాలం అంతా అలాంటివాళ్ళని వెతిగి వెతికి కొట్టడంతోనే కాలక్షేపం చేద్దును. వాడు అన్నమాటలకి ఆ శిక్ష యింకా చాలదు! ఇంకా చంపెయ్యకుండా ప్రాణాలతో బయటికి వెళ్ళనిచ్చినందుకే సంతోషించవలసింది. వీడు జనరల్ మెమున్‌టోవు గుంపుకి చెందినవాడు. వాళ్ళని పూర్తిగా వోడించి నల్ల సముద్రంలోకి తరిమేదాకా మనతో యుద్ధం చేసేడు. మళ్ళీ యిప్పుడు మనకి ప్రతిబంధకాలు కల్పించి, ప్రపంచ విప్లవానికి అపకారం చెయ్యడానికి చూస్తున్నాడు. పార్టీని, సోవియటు ప్రభుత్వాన్నీ యెన్ని అన్నాడో లెక్కలేదు. వాణ్ణి నిలువునా చీరేద్దాం అని అనిపించిందంటే నమ్ము."

"అయితేమాత్రం—అలా కొట్టడం తప్పు. వెంటనే అరెస్టు చేసి యుండవలసింది."

"అరెస్టుకాదు, చంపేసియుండవలసింది!" నగుల్నోవు రెండు చేతులతోను అభినయించేడు. "ఎందుకు చంపకుండా వొదిలిపెట్టేనో నాకే తెలియదు. 'అయ్యో యెందుకు చంపేనుకాదు?' అని యిప్పుడు విచారంగావుంది!"

"ఎంతసేపూ కోపమేకాని మంచి, చెడ్డా, ఆలోచన లేదా యేమిటి? దేవిడోవు రాగానే యిది తెలిసిన తరువాత యేమంటాడో చూడు."

"అనడానికేముంది! చాల మంచిపనిచేసేవోయ్ అని మెచ్చుకుంటాడు. అతనుకూడా నీలాగే అనుకుంటున్నావా యేమిటి!"

రజ్మటోన్నోవు నవ్వి వేలుతో టేబిలుమీద కొట్టి, తరవాత మకార్ తలమీద కొట్టి "యేమీ తేదా లేదు" అన్నాడు. మకార్ అతని చెయ్యి తోసిపారేసి వొంకెని తగిల్చియున్న గొర్రె చర్మపు కోటు తీసి తొడుక్కుంటూ, బయలుదేరేడు. గుమ్మం దాటిన తరువాత తలుపు దగ్గరగా వేస్తూ. "ఆ పక్కగదిలో ముగ్గురు పెటీ బూర్జువాలు వున్నారు. వాళ్ళని వెంటనే గోధుమలు తీసుకురమ్మని చెప్పి వొదిలెయ్యి. నేను స్నానంచేసి వచ్చేటప్పటికి తీసుకు రాకపోతే మళ్ళీ అరెస్టు చేస్తాను." అని చెప్పి వెళ్ళిపోయేడు.

ఆ మాట వినేటప్పటికి రజ్మటోన్నోవు ఆశ్చర్యపోయేడు. సోవియటు పాత రికార్డులు జాగ్రత్త చేయబడ్డ గదివైపు గబగబ వెళ్ళి తలుపు తీసి చూసేటప్పటికి లోపల ముగ్గురు సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు వున్నారు. ఆ క్రితం రాత్రి అంతా వాళ్లు గదిలో క్రిందబడియున్న పాత పేపర్లమీద పడుకొని సుఖంగా నిద్దరోయేరు. రజ్మటోన్నోవు తలుపు తీసేటప్పటికి ఆ చప్పుడుకి మెలుకువ వచ్చి లేచి నిలబడ్డారు.

"మా మకార్ ........" అని ఆంద్రీ యేదో చెప్పబోయేడు. కాని 'క్రేస్నకోటోవ్' అను ముసలి కోసక్కు అతని మాటలకు అడ్డువచ్చి, "ఆంద్రీ స్టెఫినోవిచ్, వెనకటిదంతా తవ్వడం యెందుకు? మేము చేసింది తప్పు; యేమీ అనుమానంలేదు. మమ్మల్ని వొదిలేస్తే వెంటనే గోధుమలు తెచ్చి యిచ్చేస్తాము. ఆ తొందరలో ఆలా అన్నాం కాని, రాత్రి మేమంతా కూర్చుని ఆలోచించుకుంటే మాదే తప్పు అని తోచింది. దాపరికం యెందుకు, మా గోధుమ విత్తనాలన్నీ మా........"

మకార్ చేసిన తొందరపనికి క్షమాపణ చెప్పుకొని వాళ్ళని పంపించేద్దాం అని అనుకుంటూన్న రజ్మట్నోవు వాళ్ళ మాటలు వినగానే వెనకటి ధోరణిమార్చి "మీరు యిదివరకు యెప్పుడో తెచ్చి యుండవలసింది!" అన్నాడు అధికార సూచకస్వరంతో. "అందులోనూ సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులుకూడాను! మీరు యింత వరకూ యివ్వలేదంటే విన్నవాళ్లు కూడా నవ్వుతారు."

"మమ్మల్ని వొదిలెయ్యండి. వెనకటి సంగతులన్నీ మళ్ళీ యెందుకు........" ఆంటిప్ గ్రాబ్ సిగ్గుచేత చిన్నబుచ్చుకున్నాడు.

తలుపు బారుగా తెరిచేసి రజ్మట్నోవు టేబులు దగ్గరకి వెళ్ళేడు.

"మకార్ చేసినపనే సరి అయినదేమో. అలా చేస్తేకాని ప్రజలు లొంగనే లొంగరు. ఒక్క రోజులో మకార్ యెల్లా లొంగతీసేడో. ఈ పని మొదటే చేసినట్లయితే యీపాటికి గోధుమలన్నీ వసూలయిపోయి యుండును!" అనుకొనడం అతని ముఖంచూస్తే స్పష్టంగా కనిపిస్తుంది.

# ఇరువది ఐదో ప్రకరణము

## యువకుని ప్రచారం.

దేవిదోవు 8 బస్తాల కొత్తరకపు గోధుమ విత్తులు తీసుకొని, వెళ్ళిన పని జయప్రదంగా నెరవేరిందన్న ఉత్సాహంతో తిరిగివచ్చేడు. అతడు భోజనానికి కూర్చున్న తరువాత అతనున్న యింటియామె క్రితం రోజున మకార్, గ్రిగర్ దేనిక్‌ని కొట్టేడనీ, మరి ముగ్గురు సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యుల్ని పట్టుకొని పోయియటులోనే ఒక కొట్టులో పెట్టి, రాత్రి అంతా అట్టేపెట్టేడనీ చెప్పింది. అప్పటికప్పుడే యీ విషయం గ్రామం అంతటా పాకింది. దేవిదోవు హడావిడిగా భోజనం ముగించి, సమిష్టి వ్యవసాయ క్షేత్ర కార్యాలయానికి వెళ్ళిపోయేడు. అక్కడ వివరంగా ఆ విషయం అంతా తెలుసుగున్నాడు. "నగుల్నోవు మంచిపని చేసేడు. అలా చెయ్యవలసిందే" అని లుబిష్కిన్ మొదలయినవాళ్ళు కొందరు సమర్ధించేరు. "విత్తనాలు యివ్వనన్నంత మాత్రంచేత రైతున్ని కొట్టడం, అరెస్టు చెయ్యడం మంచిదికాదని ప్రచారక దళ సభ్యులు మొదలయినవాళ్ళు విమర్శించేరు. యాకోవ్ లూకిచ్ మాత్రం గుడ్లు మిటకరించి చూస్తూ కూర్చున్నాడేకాని పెదవులుకూడా కదపలేదు. కొంతసేపటికి మకార్ కూడా ఆఫీసుకు వచ్చేడు. ఆ రోజున అతడు మామూలుకంటె కరకుగాను, ముక్తసరిగాను వున్నాడు. అందరూ యెవరి పనులమీద వారు వెళ్ళిపోయిన తరువాత దేవిదోవు మకార్‌ని క్రితంరోజు విషయాలని గురించి అడిగేడు.

"నిన్న యెవ్వరినో కొట్టేరుట యేమిటి ?"

"మీరు విననే విన్నారు; నన్ను అడగడం యెందుకు ?"

"విత్తనాలు వసూలు చేయడానికి ప్రజలలో చేస్తూన్న ప్రచారం యిదేనా యేమిటి ?"

"అయితే నాదగ్గర యెప్పుడూ అలాంటి కారుకూతలు కుయ్యొద్దనండి! ఒక విప్లవద్రోహి— మన గర్భ శత్రువు— సోవియటు ప్రభుత్వాన్ని, పార్టీని అలా తూలనాడుతూంటేమాత్రం సహించి వూరుకోలేను!"

"కాని దానివల్ల ప్రజలకి మనమీద యెటువంటి ఉద్దేశ్యం యేర్పడుతుందో, రాజకీయ దృష్ట్యా చూస్తే యెంత తప్పో ఆలోచించేరా?"

"ఆలోచనకి అవకాశం లేకపోయింది."

"అదీ వొక సమాధానమేనా! ప్రభుత్వాన్ని తిట్టినందుకు వెంటనే అరెస్టు చెయ్యవలసింది. అంతేకాని కొట్టకూడదు. కమ్యూనిస్టులం అని అనుకుంటున్న మనం చెయ్యవలసినపని కాదది. ఈవేళ 'నూక్లియస్' మీటింగులో ఆ విషయం మనం అందరం కలసి ఆలోచించి యుంటుము. మీరు చేసిన అనాలోచితపు పనివల్ల మిగిలిన మా అందరికీకూడా యెంత చిక్కు వచ్చిందో చూడండి. మనమే అటువంటి పని చేస్తే యింక యేమైనా వుందా! ఇదిగో యిప్పుడే చెపుతూన్నాను — జిల్లా కమిటీ తీర్పు వచ్చేదాకా ఆగక యీ రోజుననే సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మీటింగులో పెడతాను యీ విషయం. దాన్ని గురించి విచారణ చెయ్యక వూరుకుంటే ప్రజలంతా— మనం అంతా వొకటే గుంపు అనీ, నువ్వు చేసినపని విచారణేనాచెయ్యకుండా వూరుకున్నామనీ అనుకుంటారు. ఆందుచేత చూసీచూడనట్లు, యెంతమాత్రం వూరుకోడానికి వీలులేదు. మీరు కమ్యూనిస్టులై యుండీకూడ 'జెండర్మ్'లా ప్రవర్తించేరు. చాలా విచారకరమైన విషయం."

కాని నగుల్నోవు మాత్రం తాను చేసింది తప్పు అని అంగీకరించలేదు. దేవిడోవు అతనికి అనేక విధాల చెప్పి అంగీకరింప చెయ్యడానికి చూసేడు; అటువంటి ప్రవర్తన రాజకీయంగా చాలా హానికరం; కమ్యూనిస్టు అనుకున్న వాడెవ్వడూ ఆలా చెయ్యకూడదు; అని యెన్ని చెప్పినా నగుల్నోవు వొక్కటే సమాధానం చెప్పేడు.

"వాడిని కొట్టడంలో తప్పు యెంతమాత్రంలేదు. సరిగా కొట్టనే లేదు. ఒక్క దెబ్బమాత్రం వేసేను. ఇంకా కొట్టియుండవలసింది. ఆ విషయాన్ని గురించి యెత్తకండి యింక! నేను 'పార్టిజాన్‌ని'; నాపార్టీని, అటువంటి తుచ్ఛులు యెదిరిస్తే, సంరక్షించుకోడం యెల్లాగో తెలుసును."

"వాడిని తగలెయ్యా, ఆ బేసిక్ మనవాడు అనడంలేదు నేను! నా వుద్దేశ్యం యేమిటంటే వాడిని కొట్టకూడదు. పార్టీని నిందించినట్లయితే వాడ్ని నేలనెట్టి రాసెయ్యటానికి అనేక మార్గాలున్నాయి. మీరు యింటికివెళ్ళి పోయి యీ కోపం తగ్గినతరువాత మళ్ళీ ఆలోచించండి. సాయంకాలం న్యూక్లియస్ మీటింగుకివచ్చి నేను చెప్పినదేరైటు అని వొప్పుకుతీరుతారు."

సాయంకాలం యింకా న్యూక్లియస్ మీటింగు ప్రారంభం అవలేదు. నగుల్నోవు కనుబొమ్మలు ముడేసి, గదిలోకి వచ్చేడు. వెంటనే డేవిడోవు అతనిని,

"బాగా ఆలోచించారా?" అని అడిగేడు.

"ఆ——"

"కొట్టడం మంచిదేనా,"

"ఇంకా కొట్టవలసింది——వెధవని! వాణ్ణి చంపినా దోషంలేదు!"

ప్రచారకదళ సభ్యులు ముగ్గురూ డేవిడోవ్ పక్షం వహించి, నగుల్నోవు బేసిక్‌ని కొట్టడం పుద్ద పొరపాటని వోటుచేసేరు. రజ్మట్నోవు తటస్థంగా వూరుకున్నాడు, ఆ మీటింగులో అసలు అతను మాట్లాడనే లేదు. కాని ఆఖరున నగుల్నోవు లేచి,

"మీరు యెవరు యెన్ని చెప్పినప్పటికి నేను నా వుద్దేశ్యమే సరి అయినదని నమ్ముతూన్నాను." అని చెప్పి వెళ్ళిపోతూంటే, రజ్మట్నోవు గభాలునలేచి గొణుక్కుంటూ వెళ్ళిపోయేడు.

వరండాలో ఆగి సిగరెట్లు వెలిగిస్తూన్నప్పుడు, అగ్గిపుల్ల వెల్తురులో డేవిడోవ్ వాడిపోయివున్న నగుల్నోవు ముఖంచూసి అనునయ స్వరంతో

"మకార్! మా మీద కోపగిస్తే యేం లాభం చెప్పు?" అన్నాడు.

"మీమీద కోపం యేం లేదు నాకు."

"మీరు పూర్వపు పార్టిజాన్ పద్ధతులు వుపయోగిస్తున్నారు. కాని అప్పటికి యిప్పటికి కాలం మారిపోయింది. ఇప్పుడు మనం కందకాలలో నిలబడి యుద్ధం చెయ్యాలి కాని గోరిల్లా యుద్ధం కాదు. కాని మనం అందరం అందులో ముఖ్యంగా నౌకాసైన్యంలో పనిచేసినవాళ్ళం యీ కొత్తవిధానానికి అలవాటు పడలేదు. మకార్! మీకు నరాల బలహీనత వల్ల కోపం యెక్కువేకాని ఆ కోపం కొంచెం అణుచుకోవాలి.—కాదూ! మన తరువాత తరం కుర్రాళ్ళని చూడండి. కమ్యూనిస్టు యువకసంఘాలకి చెందిన మన ప్రచారకదళ సభ్యులు అందులోనూ వేనియానైడియనోవ్ యెల్లా పనిచేస్తున్నాడో చూడండి. అతనివంతు వసూలు చెయ్యవలసిన విత్తనాలు యింకుమించుగా అప్పుడే వసూలు చేసేసేడు. చూడడానికి అమాయకుడులా కనిపిస్తాడు. వాళ్ళంతా మచ్చుబూ అతనూ 25 యేళ్ళు కూడా వుండవు. అయినప్పటికి అతను వొక్కడూ, మనం అందరం కలిసి చేసిన పనికంటె యెక్కువ పని చేసేడు. చలోక్తిగా మాట్లాడుతూ, అందరి యిళ్ళకి వెడతాడు. అతిపరిచయముగా రైతులందరితోనూ, కలిసి మెలిసి వుంటూ, తమాషా అయిన కథలు చెబుతూంటాడు. అతను వెళ్ళి అడగడం తడవుగా రైతులు మారు మాటాడకుండా అరెస్టులు, కొట్లాటలు, అవసరం లేకుండా వెంటనే తెచ్చి యిచ్చేస్తున్నారు. రేపు వొక్క రోజు అతనితో కూడావెళ్ళి, యేలా వసూలు చేస్తున్నాడో చూసిరండి. అతనితో కూడా వెళ్ళడం మీకు గౌరవభంగం అనుకోకండి. కుర్రవాళ్ళ దగ్గరనుంచికూడా మనం అనేక విషయాలు నేర్చుకోవలసివస్తుంది. మనకి, వాళ్ళకి చాల భేదం వుంది; వాళ్ళ సమర్థత మనదగ్గర లేనేలేదు........"

నగుల్నోవు అంతా శాంతంగా విన్నాడు.

మరునాడుదయం నగుల్నోవు నైడియనోవుని కలుసుకున్నాడు.

"ఈవేళ నాకేమీ పని లేదు. మీతోకూడావచ్చి కావలసినట్లయితే యేదేనా సహాయం చేస్తాను. ఇంక యెన్ని విత్తనాలు వసూలు చెయ్యాలి మీరు"

"ఇంచుమించుగా అన్నీ వసూలు చేసినట్లే—తప్పకుండా రండి వెళదాం. మనం యిద్దరం వుంటే యితా సరదాగా వుంటుంది."

ఇద్దరూ కలిసి వెళ్ళిపోయేరు. నైదియనోవ్ వాతులా వూగుతూ, వేగంగా వెళ్ళిపోతూన్నాడు. నగులోన్నోవ్‌కి అంత వేగంగా నడవడం అల వాటులేదు. తోకకోటు దారాలు వూడిపోయి గాలికి యెగురుతూంది. అతనిదగ్గర మంచి సర్‌ఫ్లోక్ సూనె వాసనవేస్తూంది. టోపీ బాగా ముందుకి వాల్చుకున్నాడు. వేవిడోవుచేత అంత అల్లా పొగడబడిన నైడియనోవ్ ముఖంకేసి పరీక్షగా చూడసాగేడు నగులోన్నోవ్. ఆ గుండ్రటి ముఖంలో శాంతము, ఉత్సాహము తొణికిసలాడుతూన్నాయి. మీసకట్టుకూడా సరిగా యేర్పడలేదు.

వాళ్ళు కోళ్ళ తాత అని పేరుపెట్టబడ్డ అకిమ్‌బెష్లిబ్నోవు యింటికి వచ్చేరు. వాళ్ళంతా వుదయం భోజనానికి అప్పుడే కూర్చున్నారు. ముసలి అకిమ్ బల్లకి వొక చివరగా కూర్చున్నాడు. అతని ప్రక్కనే అతనికొడుకు అకిమ్ కూర్చున్నాడు. మంచి నడివయస్సులో వున్నాడు. తండ్రి కొడుకు లది యిద్దరికికూడ వొకటే పేరు అవడంచేత అతనిని చిన్న బెష్లిబ్నోవు. అంటారు. చిన్న అకిమ్ భార్య, విధవ అత్తగారు అతని కుడివయిపున వున్నారు. ఆటుతరువాత పెళ్ళియీడు వచ్చిన యిద్దరు కూతుళ్లు, కూర్చున్నారు. మిగిలిన రెండువైపుల పిల్లలు కూర్చున్నారు.

"ఏమండి—నమస్కారం." నైడియనోవు టోపీ తీసి చేత పుచ్చుకొని, రెండవ చేతితో రేగిపోయిన క్రాపింగు సర్దుకుంటూ లోపలికి వెళ్ళేడు.

"నిజంగానే మాకు అభివందనాలయినట్లయితే ప్రత్యభివందనాలు." స్వతహాగా అతి పరిచయంగా మాట్లాడుతూ, వేళాకోళంగా వుండే స్వభావముగల చిన్న అకిమ్ అహ్వానించేడు.

నగుల్నోవే కనక అయినట్లయితే దానికి సమాధానంగా కనుబొమలు ముడేసి "నీతో వేళాకోళానికి రాలేను మేము యిప్పుడు. ఇంతవరకు నువ్వు గోధుమలు యెందుకు తీసుకు రాలేదు?" అని అనియుండును. కాని నైడియనోవు చిరునవ్వు నవ్వుతూ, వాళ్ళ ముఖాలలోని అయిష్టత గుర్తించనట్లు, "భోజనానికి కూర్చున్నట్టున్నారు!" అన్నాడు.

చిన్న అకిమ్ "సరిగ్గా భోజనాలకి కూర్చున్న సమయానికి వచ్చేరు. కొంతసేపు కూర్చోండి—లేకపోతే మళ్ళీ రండి" అని అనబోతున్నాడు, వాళ్ళని కూర్చోమని అయినా అనకుండానే. కాని నైడియనోవు అతనికి మాట్లాడతానికి అవకాశము యివ్వకుండా వెంటనే మళ్ళీ మొదలెట్టేడు.

"మాకోసం అని లేవనక్కరలేదు. కూర్చోండి. మాకుకూడా భోజనం పెడతానంటే మేముకూడా సిద్ధమే. ఈవేళ యింకా నా భోజనం అవలేదు. మన కామ్రేడ్ నగుల్నోవుది యీ పూరే అవడంచేత అప్పుడే దిట్టంగా పట్టించేవుంటారు. కాని మేము యింటిపట్టున వుండకుండా పక్షుల్లా తిరుగుతూ యే సాయంత్రమో ఆకలి తీరేందుకు పొట్టలో యింత పారేస్తాము."

"అయితే మీరు శ్రమపడి పంట పండించవలసిన అవసరం లేదులా వుంది—తిండి తినడమేకాని." చిన్న అకిమ్ నవ్వేడు.

"తిండి తిన్నా తినకపోయినా పక్షుల్లా యెప్పుడూ వుల్లాసంగానే వుంటాము." అంటూ నైడియనోవు కోటుతీసేసి టేబులుముందు కూర్చున్నాడు. అతని చొరవకి నగుల్నోవు ఆశ్చర్యపోయేడు. పిలువని పేరంటముగా వచ్చి చతికిలబడ్డ ఆ అతిధికేసి ముసలి అకిమ్ కోరచూపులు చూసేడు. కాని చిన్న అకిమ్ పకపకా నవ్వేడు.

"అదీ—చొరవ అంటే అలా వుండాలి. ముందుగానే మీరు భోజనం చెయ్యలేదని చెప్పేరు నయమే. లేకపోయినట్లయితే నేను, మీరు 'భోజనానికి కూర్చున్నారులావుంది.' అన్నప్పుడు 'అవును తొందరపని యేమీ లేకపోతే భోజనం అయ్యేదాకా కూర్చోండి.' అని అనబోయేను; పిల్లా : స్పూన్ వొకటి తీసుకురా."

ఒక ఆమెలేచి ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ అలమారు దగ్గ రకు వెళ్ళింది స్పూన్‌కోసం. స్పూన్ తీసుకువచ్చి అతి వినమ్రతతో నైదియనోవ్‌చేత వుంచింది. అంతా కులాసాగా కబుర్లు మొదలెట్టేరు. చిన్న అకీమ్ భోజనానికి నగుల్నోవ్‌నికూడా ఆహ్వానించేడు. కాని అతను నిరాకరించి పక్కనే గోడవారనున్న బావిపెట్టెమీద కూర్చున్నాడు. కను బొమల దగ్గరనుంచీ నెరసిపోయిన ముసలి అకీమ్ భార్య గ్లాసు వొకటి తీసుకువచ్చి యిచ్చింది. అంతక్రితం స్పూన్ తెచ్చి యిచ్చినపిల్ల లోపలి గదిలోకి పరుగెత్తివెళ్ళి, శుభ్రమైన తువ్వాలు వొకటి తీసుకువచ్చి నైదియ నోవు కాళ్ళమీద కప్పింది. చిన్న అకీమ్ యేమీ సంకోచం లేకుండా అతి కలిసికట్టుగాతనంవున్న నైదియనోవు ముఖంకేసి చూసి,

"కామ్రేడ్ ! మా పిల్ల మీదగ్గర ఎంత చనువుగా ప్రవర్తిస్తూందో చూసేరా ? ఇంతకాలం అయింది—అది యెన్నడూ నాకైనాకాని వొక్క పర్యాయంకూడ శుభ్రమైన తుండుగుడ్డ తెచ్చి యెరుగదు. మీకు చూడండి—యింకా కుర్చీమీద ముడ్డి మోపేరో లేదో అప్పుడే తెచ్చి అందించింది. కావలసినట్లయితే మీకు యిచ్చేస్తాం తీసుకుపోండి" అన్నాడు.

తండ్రి మాటలకి ఆమె సిగ్గుపడి, చేతితో ముఖం చాటు చేసుకొని, లేచి నిలబడింది.

"ముఖంనిండా మచ్చలూ నన్ను యెప్పుడూ పెళ్ళిచేసుగోదు. చీకటి పడ్డతరువాత కొంచెం అందంగా కనిపిస్తే అప్పుడు యెవరేనా అంగీక రించవచ్చు." అన్నాడు నైదియనోవు అకీమ్‌కి సమాధానంగా.

ఒక గిన్నెతో ఉడకపెట్టినపళ్ళు తీసుకువచ్చి అక్కడ పెట్టేరు. అంతా నిశ్శబ్దంగా తినడం ప్రారంభించేరు. నములుతూన్న చప్పుడు. కర్ర స్పూనులు గిన్నెకి తగిలి అవుతూన్న చప్పుడుమాత్రం వినిపిస్తూంది. బేరి పండు ముక్కకోసం వొక కుర్రాడు స్పూన్‌తో గిన్నెలు వెతగడం మొద లెట్టేడు. వెంటనే ముసలి అకిమ్ స్పూన్‌లోది పీల్చేసి, అది పుచ్చుకొని ఆ కుర్రాడి నెత్తిమీద కొట్టి,

"ఛీ ! వెధవా, మంచి ముక్కలన్నీ నీకేకాని యెవరికీ అక్కర లేదనుకున్నావుట్రా !" అన్నాడు.

"చర్చిలో వున్నట్లు నిశ్శబ్దంగా యేలా వుందో," అంది ముసలి అకిమ్ భార్య.

"చర్చిలోమాత్రం అస్తమానూ నిశ్శబ్దంగా వుంటుందా !" అంటూ వేనియా మాంసం కూర నోట్లో వేసుగున్నాడు. "మా వూళ్ళో 'ఈస్టరు' పండుగులముందు జరిగిన సంగతి యిప్పటికీ నాకు జ్ఞాపకం—మీరుకనక వున్నట్లయితే కడుపులు చెక్కలయ్యేలా నవ్వివుందురు."

యజమానురాలు టేబులు బాగుచెయ్యడం ఆపింది. చిన్న అకిమ్ సిగరెట్టు వెలిగించి సావకాశంగా కూర్చున్నాడు. ముసలి అకిమ్‌కూడ గర్రున తేన్చి క్రాస్ చేసుకొని చెవులు దోరపెట్టి వింటున్నాడు. నగు నొవ్వు "అసలుమాట యెంతకీ యెత్తడేం ? వీళ్ళేమి యిస్తారని తోచదు. తండ్రీ, కొడుకులు యిద్దరూకూడ వొకర్ని మించినవాళ్ళు వొకరు. మొండి పీనుగులలో మొదటి రకం, పోనీ జబర్దస్తీ చేద్దాం అంటే—యీ చిన్న అకిమ్ రెడ్ ఆర్మీలో పని చేసేడు. అందుచేత పూర్తిగా మన పక్షంవారు. అయినప్పటికి శుద్ధ పిసినికొట్టు అవడంచేత 'ఇవిగో మీకు యివ్వవలసిన గోధుమలు' అని తీసుగువచ్చి యివ్వడు. అంతవరకూ యెందుకు—విరిగిన వేలుమీద వుచ్చ్చకూడా పొయ్యడు. వాడి సంగతి యెరుగనూ !" అను కుంటూ ముళ్ళమీద వున్నట్లు కూర్చున్నాడు.

నైడియనోవు ఒక నిముషం ఆగి మళ్ళీ ప్రారంభించేడు.

"మాది టట్సీన్స్కి జిల్లా. వొక యేడు యీస్టరు పండుగరోజున మతంమీద నమ్మకం వున్నవాళ్ళందరూ పోగుపడ్డారు. మతగురువు ప్రార్థన మొదలెట్టేడు. పిల్లలంతా బయట ఆడుకుంటున్నారు. ఆ వూళ్ళో రెండేళ్ళ గిత్తదూడ వొకటి వుంది. అది మస్త పోట్లగొడ్డు. దాన్ని ముట్టుగుంటే చాలు తరుముకొచ్చి కిందపడేసి పొడిచి పొడిచి వొదిలిపెడుతుంది. అది చర్చిబయట దూరంగా యెక్కడో మేస్తూంది. యెవడో కొంటెవెధవ దాని దగ్గరకు వెళ్ళి యేంచేసేడో తరుముకొచ్చింది. ఆ కుర్రాడు హడలిపోయి పరుగు పరుగునొస్తున్నాడు. చర్చి దగ్గరికి వచ్చేటప్పటికి అది ఆ కుర్రాడిని సమీపించింది. వాడు చటుక్కున గేటుదాటి చర్చిలోకి పరుగెత్తేడు. దూడకూడ అంతటితో వొదిలిపెట్టక వెంటపడి చర్చిలోకి వెనక్కాలే తరుముకొచ్చింది. చర్చిలో సూది మోపడానికికూడా స్థలం లేకుండా కిటకిటలాడుతూ వున్న జనంలో పడి ఆ దూడ వాళ్ళందర్నీ చెల్లాచెదరు చేసేసి, ఆ కుర్రాడిని కొమ్ములతో యెత్తిపారేసింది. ఆ విసురుకి వాడు వెళ్ళి తలక్రిందులుగా వొక ముసలమ్మమీద పడ్డాడు. ఆమె పడిపోవడంలో తల గర్బిగోడకి గట్టిగా తగలడంచేత గట్టిగా అరుస్తూ "అయ్యో! వీడి అమ్మకడుపుమాడ! చంపేసేడర్రోయ్" అని తిట్టడం లంకించుకుంది. పక్కనే నిలబడియున్న ఆ ముసలమ్మ మొగుడు 'యేమిరా వెధవా! కళ్ళు కనిపించడం లేదట్రా, అల్లా మీద పడ్డావు? అంటూ చేతిలోనున్న కర్రతో వాడిని రెండు బాదేడు. ఆ దూడకూడ అంతటితో వూరుకోక ఆ ముసలి వాడిమీద పడి క్రిందపడేసి కుమ్మడం మొదలెట్టింది. అప్పుడున్న ఆ గందర గోళం మీరు చూసి తీరాలి. ఆల్టార్ దగ్గర వున్నవాళ్ళకి యీ గందరగోళం యెందుకో అర్థం అయిందికాదు. కాని, ద్వారం దగ్గరనుంచి కేకలు, పెడ బొబ్బలు, స్పష్టంగా వినిపిస్తూన్నాయి. అందుచేత వాళ్ళంతా కూడ ప్రార్థన మానేసి ఆ గోల యేమిటని వొకళ్ళ నొకళ్ళు అడుగుతూ కంగారు పడడం

మొదలెట్టేరు." వేనియా తన గ్రామస్తులంతా ఎలా భయపడ్డారో, వొకరితో వొకడు రహస్యంగా ఎలా మాట్లాడేరో అన్నీ ఆ కథ చెప్పడంలో చేతుల తిప్పుతూ, హావభావాలు చూపిస్తూ, నిజంగా అక్కడ జరుగుతూందా అన్నట్లు అతి చమత్కారంగా చెప్పేడు. చిన్న ఒకిమ్ పొట్ట చెక్కలయిలా వొక్కటే నవ్వు. "ఇంత గల్లంతు చేసింది దూడ, బాగుంది!" అన్నాడు.

వేనియాకూడా నవ్వుతూ మళ్ళీ కధ ప్రారంభం చేసేడు.

"వేణాకోళానికి వొకడు ఆ పక్కవాడితో యేకుక్క అయినా లోపల జొరబడి వుంటుంది" అన్నాడు. పక్కనేయున్న వొక ఆమె హడలిపోయి చర్చి అంతా ప్రతిధ్వనించేటట్లు 'యేమేవ్, అమ్మోయ్! యిల్లాగా కరచి చంపేస్తుంది' అని అర్చింది. లోపల వున్నవాళ్ళంతా వొకళ్ళ నొకళ్లు తోసుగుంటూ కిందా మీదా పడడంలో దీపం క్రింద పడిపోయి యేదో కాలిన వాసన వెయ్యడం మొదలెట్టింది. దీపాలు అరిపోవడంచేత చర్చిఅంతా చీకటికోణం అయింది. అప్పుడు యెవడో 'చర్చి అంటుగుంది!' అని అర్చేడు. దీపాలుకూడా ఆరిపోవడంతో మరీ గంద్రగోళం అయింది. "పిచ్చికుక్క!, కాలిపోతూంది నడవండి, నడవండి!' 'యేమిటి యీగోల అంతా?' 'కొంప మునిగింది, యేదో ప్రమాదం జరిగింది!' 'ఆ—యేదో ప్రమాదం వచ్చిందా, ఏమేవ్ నడు వెళ్ళిపోదం!' అనుకొంటూ వాళ్ళంతా గుమ్మాలవైపు తోసుగురావడం ప్రారంభించేరు. ఆ సమ్మర్దంలో మనిషి కదలడానికికూడా వీలులేకపోయింది. దీవపుసెమ్మా విరిగి కిందపడిపోయింది. దానిమీదనున్న 5 కోపెక్కులు క్రిందపడి దొర్లిపోయేయి. చర్చికాపలాదారు 'దొంగలు దొంగలు' అని అరుస్తూ పరవళ్లు తొక్కేడు. ఆడవాళ్ళందరూ గొర్రెలమందలా ఆల్టారు దగ్గరకు తోసుగు వచ్చేరు. అర్చకుడు చేతిలోనున్న హారతి పళ్ళెంతో వాళ్ళ నెత్తిమీద కొట్టి వెనక్కి తరుముతూ, 'ఇలా యెక్కడికి? లోపలికివచ్చి యివంతా

అపవిత్రం చేస్తారా - ఛీ అవతలకి పొండి. ఆడాళ్ళు యిక్కడికి రాకూడ దని తెలియదూ ?' అని కేకలేసేడు. ఆ రోజు గ్రామాధికారికూడా ఆ చర్చిలో వున్నాడు. అతడు లావుగా చిన్న పీటకకి కాళ్లు పెట్టినట్లు వుంటాడు. పొట్టకి అడ్డంగా గొలుసూ అతనూ, గునగునా నడుస్తూ యేలాగో కష్టపడి ద్వారందాకా వచ్చేడు. కాని అక్కడనుంచి యింక వెళ్ళ లేక 'ఏయ్ - నన్ను వెళ్ళనియ్యండి ; నేనూ - గ్రామాధికారిని ; తప్పు కోరేం ?' అని ఆర్భాటీ చేసేడు. అయితే మాత్రం ఆ గంద్రగోళంలో అతనిమాట వినేవాళ్ళు యెవరు ?"

అందరూ కడుపు చెక్కలయేటట్లు నవ్వుతూన్నారు.

"మా వూళ్ళో వొక దొంగవున్నాడు. గుఱ్ఱం కనిపిస్తేచాలు దాన్ని యెత్తుకుపోతాడు. దాల్లో అందెవేసిన చెయ్యి. వాణ్ణి పట్టుగోడానికి యెంత ప్రయత్నించినా దొరికేవాడుకాడు. చేసిన పాపాలన్నీ పోడానికి తరుచుగా ఆ చర్చికివచ్చి ప్రార్థిస్తూండేవాడు. ఆలాగే ఆరోజుకూడా చర్చికివచ్చేడు. లోపలనున్న జనం అంతా యీ వేళతో మనపని ఆఖరు !' 'యేదో ప్రమా దం జరిగింది !' అని కేకలేస్తూ, తొక్కిసలాటు పడడంచూచి ప్రార్థిస్తూన్న అతడు గబగబా వొక కిటికీవైపు పరుగెత్తేడు. కాని ఆ వూచలలోనుంచి వెళ్ళడానికి సాధ్యపడలేదు. మిగిలినవాళ్ళంతా గుమ్మం దగ్గర తోసుకుంటూం డడంచేత వాడు యెటు వెళ్ళడానికీ తోచక చర్చి అంతా కాలు కాలిన పిల్లిలా తిరగడం మొదలెట్టేడు. కాని యెటు వెళ్ళడానికీ వీలులేక పెర్రి మొహం వేసి నిలబడిపోయి చేతులు నలుపుకుంటూ 'అయ్యో. ఆఖరికి యిక్కడ పట్టుపడ్డామే ; చర్చిలో పట్టుబడిపోవలసి వచ్చింది.' అని వాపోయాడు."

చిన్న అకిమ్, అతని భార్య, యిద్దరు కూతుళ్లు పొట్టలు పుబ్బేలా నవ్వేరు. కళ్ళనీళ్లు వచ్చేయి. ముసలి అకిమ్‌కూడ బోసినోరు తెరచి నవ్వు

తున్నాడు. అతని భార్యమాత్రం కొంచెం చెముడు వుండడంచేత కథఅంతా వినబడక యెందుకో అకారణంగా యేడుస్తూ, కళ్ళనీళ్లు తుడుచుకుని,

"దొరికిపోయేడా పాపం ! అయితే ఆఖరికి వాణ్ణి యేంచేసేరు ?" అంది.

"ఎవర్ని ?"

"ఎవరేమిటి - ఆ పుణ్యాత్ముణ్ణి ?"

"ఏ పుణ్యాత్ముడు ?"

"ఇప్పుడు మీరు అన్న యాత్రికుణ్ణి."

"యాత్రికుడుమాట యేమీ రాందే !"

"అయితే నాకేం తెలియదు. కొంచెం చెముడు వుంది నాయనా నాకు. అందుచేత సరిగ్గా వినిపించదు..............."

దానితో మళ్ళీ నవ్వడం ప్రారంభించేరు. చిన్నఅకీమ్ కళ్ళుతుడుచు గుంటూ "ఆ దొంగ యేమన్నాడు ? అఖరికి యిక్కడ పట్టుబడ్డామే అన్నాడూ" అంటోస్తాడు, నవ్వుతోస్తాడు, వేనియా భుజం తట్టుతూ. కాని నైడియనోవు ఆ విషయం అంతటితో వదిలేసేడు. ముఖం గంభీరం అయింది. ఒక్క నిట్టూర్పు విడిచి,

"అవును, బాగానే వుంటాయి యీలాంటి కథలు. కాని సరదాగా కథలు చెప్పుగుంటూ కాలక్షేపం చెయ్యవలసిన రోజులు కావు యివి. ఈ వేళ పేపరులో వొక విషయం చూసేను. అబ్బా, చదివే టప్పటికి గుండెలు నీరయిపోయేయి..............." అన్నాడు.

"ఆ—యేదీ చెప్పండి విదం" అన్నాడు అకీమ్ మంచి సరదా అయిన కథ యేమైనా చెపుతాడేమో అనుకుని.

"అది పెట్టుబడిదారీ దేశాలలో ప్రభుత్వాలు ప్రజల్ని పెడుతూన్న బాధల్ని గురించి. రుమేనియాలో యిద్దరు కమ్యూనిస్టు యువకులు రైతు

లందరికి జమీందారుల భూములన్నిటిని స్వాధీనము చేసుకొని పంచుగో మని చెప్పి ప్రచారము చేస్తున్నారుట. పాపం అక్కడ రైతులు గర్భ దరిద్రములో మునిగిపోయి వున్నారు."

"అవును - ఆ మాట నిజమే. 1917 వ సం॥లో మా రెజిమెంటు రుమేనియా యుద్ధరంగంలో పనిచేసినప్పుడు స్వయముగా చూసేను." అన్నాడు ఆకిమ్

"రుమేనియాలో పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని పడగొట్టి మనదేశంలో లాగే సోవియటు ప్రభుత్వం యేర్పరచడానికి ప్రయత్నం చేస్తున్నారు. అంటుచేత పోలీసులు వాళ్ళనిద్దరిని పట్టుకొని, అందులో వొకడిని చావకొట్టి చంపేసి, రెండోవాడిని హింసించ సాగేరు. గుడ్డు రెండూ తీసేసేరు. జుట్టు అంతా పూడపీకేసేరు. సన్నటి యినుప పూచలు యెర్రగా కాల్చి గోళ్ళలోనుంచి గుచ్చేరు................"

"అబ్బ—వీళ్ళని తగలెయ్య!" అకిమ్ భార్య మెల్లగా నిట్టూర్పు విడిచింది. చేతులు నలుపుకుంటూ "గోళ్ళలోనే?" అంది.

"గోళ్ళలో గుచ్చి, 'నీ సూక్లియస్‌లోని యితర సభ్యులపేర్లుచెప్పు: ఇంక యెప్పుడూ కమ్యూనిజం ప్రచారం చెయ్యవుకదా?' అని అడిగేరు. 'మీరు యెంత బాధ పెట్టినాసరే నేను మాత్రం చెప్పను. కంఠంలో ప్రాణం వున్నంతవరకు, కమ్యూనిస్టు సిద్ధాంతాలు వొదిలిపెట్టను.' అని ఆ కమ్యూనిస్టు యువకుడు నిర్భయంగా జవాబు చెప్పేడు. ఆ సమాధానం వినేటప్పటికి తోక తొక్కిన త్రాచుల్లా లేచి అతని చెవులు కోసేరు. ముక్కు చెక్కేసేరు. 'చెపుతావా: చెప్పవా?' అని గద్దించేరు. 'చెప్పను. చావనైనా చస్తాను కాని మీకు మాత్రం చెప్పను. కమ్యూనిజానికి జయమగుగాక!' 'అరి దొంగముండాకొడకా! నీపని యీలాకాదు.' అంటూ పోలీసులు అతనిని దూలానికి వ్రేలాడతీసి అడుగున మంట పెట్టడం ప్రారంభించేరు."

"హృదయం లేదు వెధవలకి. ఎంత క్రూరులు! అలాంటివాళ్ళని పట్టుకుని చిత్రవధ చెయ్యాలి!" చిన్న అకిమ్ క్రోధం వెలిగక్కేడు.

"అలా కాల్చినాకాని అతడు కామ్రేడ్సు విషయమై వొక్క ముక్క కూడ చెప్పలేదు. 'శ్రామిక విప్లవం వర్ధిల్లుగాక! కమ్యూనిజం చిరస్థాయి అగుగాక!' అని అర్చేడు."

"అదీ, ధైర్యమంటే అలా వుండాలి! ధర్మంకోసం జీవితాన్ని కూడా యిచ్చెయ్యి. అంతేకాని పిరికి పందవై స్నేహితుల్ని బయట పెట్ట కూడదు. బైబిలులోకూడ 'స్నేహితుడికోసం ప్రాణాలు యివ్వడానికేనా వెనుతియ్యకు అవసరం వచ్చినప్పుడు.' అనివుంది." అంటూ ముసలి అకిమ్ బల్లగుద్ది కథ కానియ్యమన్నాడు.

"వాళ్ళు అతనిని యెన్నిబాధలు పెట్టాలో అన్నిబాధలూ పెట్టారు. కాని వొక్క ముక్కకూడా చెప్పించలేకపోయేరు అతని నోటివెంట. ఉదయం మొదలు సాయంకాలంవరకూ అలా జరిగింది. బాధ సహించలేక అతడు సొమ్మసిల్లినపుడు పోలీసులు ముఖంమీద నీళ్లచల్లి తేర్చి మళ్ళీ బాధ పెట్టడం ప్రారంభించేరు. ఆఖరికి వాళ్ళకి బాధపెడితే లాభంలేదని తోచి అతని తల్లిని అరెస్టుచేసి ఆఫీసులోకి తీసుకువెళ్ళేరు. 'చూసేవా! లొంగక పోతే యెల్లా బాధ పెడుతున్నామో నీ కొడుకుని. ఇప్పుడేనా తెలిసినదంతా చెప్పెయ్యమను. లేకపోతే చంపేసి కాకులకీ గద్దలకీ పారేస్తాము' అన్నారు. కొడుకుని చూసేటప్పటికి ఆమె నిలువునా కూలిపోయి మూర్ఛ పోయి కొంతసేపటికి తెలివివచ్చి లేచి కొడుకుమీదపడి కౌగిలించుకొని గాయాలతో నిండి, రక్తం కరుడు కట్టిన అతని రెండుచేతులు ముద్దు పెట్టు గుంది." వివర్ణమైన ముఖంతో నైడియనోవ్న వాళ్ళవైపు పరకాయించి చూసేడు. ఆడపిల్లలు యిద్దరూ నోళ్ళు తెరుచుకు చూస్తున్నారు. కళ్ళనీళ్లు కమ్మేయి. అకిమ్ భార్య పైమీది బట్టలోచీది వెక్కుతూ "కొడుకుని ముద్దుపెట్టుగుందా! అయ్యో!" అంది అస్పష్టంగా. హఠాత్తుగా చిన్నఅకిమ్

నిట్టూర్పు విడిచి పొగాకు సంచీ తీసి, ఆడావిడిగా చుట్ట చుట్టడం మొద లెట్టేడు. కావిడి పెట్టిమీద కూర్చున్న నగులోష్ణవు పైకిమాత్రం నిశ్చలంగా కూర్చున్నాడు. కాని నైడియనోవు కథ చెప్పడం ఆపిన తరువాతమాత్రం, ఆ కథ యాదార్థ్యం అనుమానిస్తూన్నట్లుగా ఉంది అతని ముఖచర్య.

"అయ్యో కొడకా! నన్ను చూసేనా వాళ్ళమాటలు విను నాయనా!" అని ఆమె కొడుకుని బ్రతిమాలింది. కాని అతడు తల్లి కంఠధ్వని గుర్తు పట్టి 'అమ్మా! యెప్పుడూ అల్లా చెప్పకు. ఏమైనాసరే రహస్యం వెళి బుచ్చను. వావుకి యిదివరకే తెగించాను. ఒక్కసారి ముద్దుపెట్టుకో. ప్రాణాలు సుఖంగా వదిలేస్తాను..........." అన్నాడు.

నైడియనోవు కంపితస్వరంతో, పోలీసులు పెట్టే బాధలు పడలేక ఆ కమ్యూనిస్టు యువకుడు ఎలా చచ్చిపోయేడో చెప్పి కథ ముగించేడు. ఒక్క నిమిషంవరకూ యెవ్వరూ మాట్లాడలేదు. తరువాత అకిమ్ భార్య కళ్ళనీళ్ళు కారుస్తూ "స్వార్థత్యాగికి వయస్సెంత?" అని అడిగింది.

వేనియా తడుముకోకుండా "పదిహేడు" అంటూ టోపీ సర్దేడు. "దీన ప్రజా సామాన్యాన్ని వుద్ధరించడానికి చేసే ప్రయత్నంలో చచ్చి పోయేడు—మన రుమేనియన్ కమ్యూనిష్టు కామ్రేడ్. అందుచేత అతను తలపెట్టిన పని పూర్తి చెయ్యవలసిన భారం మనమీద వుంది. వాళ్ళ దేశంలో కూడ పెట్టుబడిదారీవిధానాన్ని కూలద్రోసి కూలీ-రైతు ప్రభుత్వాన్ని యేర్పరచడానికి సహాయం చేయాలి. అందుచేత ముందు మనం సమిష్టి వ్యవసాయక్షేత్రాలు యేర్పరచుకొని మనయిల్లు మనం చక్కపెట్టు కోవాలి కాని యీ విషయాలు తెలియని మన రైతులు కొంత మంది శత్రువులకి సహాయము చేస్తూ, యేలాగైనా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు భగ్నం చెయ్యాలని ప్రయత్నం చేస్తూన్నారు...........విత్తనాలు యివ్వడానికి నిరాకరిస్తున్నారు. సరే, చాలా పొద్దుపోయింది. అసలు విష

యానికి వద్దం. ఇంతవరకు మీరు విత్తనపుగోధుమలు యివ్వలేదు. వెంటనే యిచ్చేయాలి. మీరు యివ్వవలసిన 16 బస్తాలు తీసుకురండి పోతాం."

"ఏమో : ఆ విషయం నాకేమీ తెలియదు............ఈ యేడు మాకే గటాగటీగా వున్నాయి." అన్నాడు అకిమ్ సంశయిస్తూ. కాని అతని భార్య అతని వైపు కోపంగా చూసి.

"నీళ్ళు నములుతూ ఆ సమాధానం యేమిటి ? వెళ్ళి గోధుమలు బస్తాలకెత్తి పంపించండి" అంది.

"16 బస్తాలు లేవనుకుంటాను. అదీకాకుండా వాటిని యింకా బాగు చెయ్యలేదు."

"అకిమ్, మారు మాట్లాడక తీసుగొచ్చి యిచ్చెయ్యి. ఈవేళో, రేపో యివ్వడం యేలాగా తప్పదు. అలాంటప్పుడు తిప్పడం యెందుకు?" అన్నాడు ముసలి అకిమ్.

"మాకేమీ నామోషీ లేదు. కావలిస్తే మేమే జల్లెడ వేస్తాము" అన్నాడు. వెంటనే వేనియా. "జల్లెడవుందా ?"

"ఉంది. కాని............కొంచెం బాగుచెయ్యాలి."

"స్వాములవారి పెళ్ళికి జుట్టు దగ్గరనుంచీ యెరువు అన్నట్లుంది. సరే బాగుచేద్దం తీసుగురండి. త్వరగా తెమల్చాలి. ఇంతసేపూ కబుర్లు చెపుతూ కాలక్షేపం చేసేము........"

ఒక అరగంటలో గోధుమలు బస్తాలకి పట్టడం పూర్తి అయింది. చిన్న అకిమ్ రెండు స్లెడ్జిలు తీసుకురావడానికి సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసుకి వెళ్ళేడు. వేనియా బస్తాల నన్నిటిని దొడ్డిపాకలోనుంచి వీధిలోనికి మోసుగు వస్తున్నాడు. ముఖంనిండా చెమట గుడ్లు పోసినట్లుంది.

"బంగారంవంటి ధాన్యం తీసుగువచ్చి యీ పాకలో పోసేరేమిటి ? పెద్దగాదికూడా వుండి చెత్తలా పాకలో వొదిలేసేరా !" అన్నాడు వేనియా చమత్కారంగా కనుగీటుతూ ఆకిమ్ కూతురుతో.

"ఏమో మా నాన్నగారు అలా యేర్పాటు చేసేరు" అంది ఆమె తత్తరపాటుతో.

వెస్లిక్ట్రోవ్ 16 బస్తాల గోధుమలు సమిష్టి ధాన్యపు కొట్లకి తోలుకుపోయిన తరువాత మకార్, వేనియా అక్కడనుంచి సెలవు తీసుకు బయలుదేరేరు. ఆ యిల్లు దాటిన తరువాత నగుల్నోవ్ బదలికగానున్న సైడియనోవ్ ముఖంకేసి చూస్తూ, వుత్సాహంతో

"ఆ కమ్యూనిస్టుని గురించి చెప్పినది కల్పన కాదూ ?" అన్నాడు.

"కాదు. ఎప్పుడో పేపర్లో చదివేను." అన్నాడు వేనియా పరధ్యాన్నంగా.

"మరి యీవేళే చదివేనన్నారు ?"

"ఏమి చెబితే యేమిటి ! అసలు నేను చెప్పినదంతా నిజమే. దాల్లోనే వుంది. అంతా." అన్నాడు.

"కాని వాళ్ళ మనస్సులు కరిగేటట్లు అక్కడక్కడ కొంత కల్పించి చెప్పలేదూ ?"

"అదికాదు మనకి ముఖ్యం" అంటూ వాన్యా కోటు బొత్తాలు పెట్టుగుంటూ "ప్రజలు పెట్టుబడిదారీ విధానాన్ని అసహించుకునేటట్లు, మనతో సహకారం చేసేటట్లు చెయ్యాలి. ఏలా అయితేనేమి—ధాన్యము తీసుకు వచ్చి యిచ్చేరు ; అదే మనకి కావలసింది. కాకపోయినా నేను చెప్పిన దంతా నిజమే ఆ పండు యెంత బాగుందనుకున్నావు ! నీ దురదృష్టం ; అక్కర్లేదన్నావు."

# ఇరువది యారవ ప్రకరణము

## పాటుకి తగ్గ ఫలితం.

10 వ తారీఖు సాయంత్రం గ్రిమాచీలో పొగమంచు విపరీతంగా పట్టింది. ఆ రాత్రి అంతా యిళ్ళకప్పులమీది మంచు కరిగి చూర్ల వెంట నీళ్లు కారుతూనే వున్నాయి. దక్షిణానవున్న కొండలనుంచి వెచ్చటి గాలి వీస్తూంది. బట్టతెర వేసినట్లు దట్టంగా పొగమంచుతో కప్పియున్న గ్రిమాచీలో వేసవి అడుగు పెడుతూంది. ఇంచుమించుగా మధ్యాహ్నం అయే వరకూ పొంగమంచుపోయి ఆకాశము, సూర్యుడు బాగా కనబడనేలేదు. దక్షిణాన్నుంచి తీవ్రంగా వీస్తున్న యీదర గాలితోపాటు పెద్దపెద్ద గోధుమ గింజలలా మంచుముక్కలుకూడా వచ్చి పడుతూండడంచేత ఇళ్ళకప్పులు, నేల అంతా,బూడిద రంగుగా కనిపిస్తూన్నాయి. సాయం సమయానికి సూర్యరశ్మికి గుట్టలమీదిమంచు అంతా కరిగి కొండవాగుల్లోనుంచి వేగంగా ప్రవహించడం ప్రారంభించింది.

మూడు రోజులలో శీతకాలం అంతా కురిసి పేరుకొనిపోయిన, మంచు కరిగిపోయి గుట్టలు బయలు పడ్డాయి. ఆ నీరు అంతా వెల్లువవచ్చినట్లు చేలమీదినుంచి ప్రవహించి, కోసుకుపోయి అగాధాలుగా యేర్పడ్డ వాగులలోనుంచిపోయి నదిలో పడుతూంది.

ఈ మంచు నీటిచేత గ్రిమాచీలాగ్ ప్రక్కని ప్రవహిస్తూన్నఏరు గట్లు వొరుసుకు ప్రవహిస్తూంది. ఏటి యెగువనుంచి యెక్కడన్నుంచో నీలవర్ణపు మంచుగడ్డలు, యెండకి కరిగి కొట్టుగువస్తున్నాయి. మలుపులలో ఆ మంచు గడ్డలు ప్రవాహపు వడినుంచి పక్కలకి చేరి అక్కడ ప్రవాహానికి యెదురు పెడుతూన్నాయి, ఒకొక్కచోట ప్రవాహవేగానికి ఆ మంచుగడ్డలు

పొదెక్కి, పక్క వాగులవెంట మెరెక్కి తోటలు. పొద్దు ప్రవేశించి. అడ్డువచ్చిన చిన్నచిన్న మొక్కలనన్నిటినీ తోసుకుపోతూన్నాయి.

గ్రామం చుట్టూ చేలన్నీ మంచు కరిగిపోవడంచేత నల్లగా కనిపిస్తు న్నాయి. సూర్యరశ్మికి నాగేటి చాళ్ళంపట ఆవిర్లు లేస్తున్నాయి. మధ్యాహ్న సమయం — స్టెప్పీ అంతా నిర్మానుష్యంగా వుంది. దున్ని అట్టేపెట్టిన చేలు. పైన నీలాకాశంలో పల్చటి పొగమంచులోనుంచి కనిపిస్తూన్న వేసవి కాలపు సూర్యుడు. వేసవికాలంతోపాటు తిరిగి వస్తూన్న భరద్వాజ పక్షుల కంఠకల ధ్వనులు, ఆకాశంలో పిండుకట్టి యెగురుతూన్న పోచెకొంగల కూతలు. హృదయానందంగా వుంది ప్రకృతి. అప్పుడప్పుడే నేల పచ్చ బడుతూంది. 'వింటర్‌రై' ఒకటీ - అరా ఆకులు వేస్తూంది. కాని స్టెప్పీలో యింకా పూర్తిగా చైతన్యం యేర్పడలేదు. శీతకాలం అంతా నిద్రపోతూండే 'మార్మాట్సు' యింకా మేలుకోలేదు. శీతకాలంముందు అరణ్యాలకి, వాగుల దగ్గరకి పారిపోయిన జంతువులు, యింకా తిరిగి రాలేదు. ఉండివుండి యే యెలకో వొక దుబ్బులోంచి యింకొక దుబ్బులోనికి చటుక్కున పరిగెత్తు తూంది; తిత్తిరి పిట్టలు ఆ లేమెండలో పట్టీలు కొడుతూ, తమగూళ్ళకి యెగిరిపోతూన్నాయి.

మార్చి 15 నాటికి గ్రిమాచీలాగ్‌లో విత్తనాల వసూలు పూర్తి అయింది. స్వంతంగా యెవరికివారే వ్యవసాయం చేసుకొనే రైతులంతా వారి విత్తనాలు ప్రత్యేకముగా నొక గాదిలో పోసుకున్నారు. దాని తాళం చెవిమాత్రం సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయంలో జాగ్రత్త వెట్టేరు. సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల విత్తనాలతో ఆరు పెద్దపెద్ద సమిష్టి ధాన్యపుకొట్లు నిండేయి. ఆ విత్తనాల బాగు రాత్రిం పగళ్లు విశ్రాంతి-విరామం లేకుండా జరుగుతూంది. రాత్రులందు మూడు లైట్లు వెలిగించి పని సాగి స్తున్నారు. షాలీ ఇవ్పోలిట్ కార్ఖానాలో రోజల్లా కొలిమి తిత్తులహోరు, సమ్మెట చప్పుళ్లు, దాగలిమోత వినిపిస్తున్నాయి. షాలీ వంచిన నడుము

యెత్తకుండా పనిచేసి, పనిచేసి మార్చి 15 నాటికి గుంటకలు, కరుకోలలు, నాగళ్ళు, పోవరులు అన్నీ బాగుచెయ్యడం పూర్తిచేసేడు. 16 వ తారీఖు సాయంత్రం సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల మీటింగు యేర్పాటుచేసి, అందరి యెదుటా దేవిడోవు, లెనిన్గ్రాడునుంచి తీసుగువచ్చిన పనిముట్లను యెర్రటి పట్టుగుడ్డలోపెట్టి షాలీకి బహుమతి చేసేడు. ఆ రోజుననే కొత్తగా క్షవరం చేసుకుని శుభ్రమైన పూలుషర్టు తొడిగి వచ్చిన అతడు వినమ్రంగా ఆ పనిముట్లు అందుకున్నాడు. సిగ్గుపడి వెనుతీస్తూన్న అతనిని రజ్మటోన్నొవు వేదికవైపు తోసేడు. దేవిడోవు ఆ కమ్మరివైపు తిరిగి,

"సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యులందరూ మన కమ్మరి ఇపోలిట్ సిడొరోవిచ్ షాలీవలె కష్టపడి పనిచెయ్యడం నేర్చుకోవాలి. అతనికి సమిష్టి వ్యవసాయ క్షేత్రపు మేనేజిమెంటు కమిటీ అయిన మేము యీ పని ముట్లను బహూకరిస్తున్నాము" అన్నాడు.

"ఈ రోజువరకూ కామ్రేడ్ షాలీ అతని దగ్గరకు వచ్చిన వ్యవ సాయపు పనిముట్లన్నీ బాగుచేసేడు. మొత్తముమీద 54 కరుకోలలు, 12 వివిధ రకముల నోయర్లు, యింకా అనేక యితర పనిముట్లు సరియయిన స్థితిలో పెట్టేడు. కామ్రేడ్, యీ చిన్న బహుమానం తీసుకోవలసినదని కోరుతూన్నాను. ఇకముందుకూడ యిట్లే యితరుల కందరికీ ఆదర్శ ప్రాయంగా ఉంటారని ఆశిస్తున్నాము. మిగిలిన గ్రామస్తులంతాకూడ యీలాగే శ్రద్ధగా పొలాలమీద పనిచెయ్యాలి. అలా అయితేనే మనసమిష్టి వ్యవసాయ క్షేత్రానికి పెట్టినపేరు సార్థకం అవుతుంది. లేకపోయినట్లయితే మన దేశస్తులందరిలోను నవ్వుల పాలవుతాము."

దేవిడోవు ఆ బహుమతులను 3 గజాల పొడవైన యెర్రటి పట్టు గుడ్డలోచుట్టి షాలీకి అందిచ్చేడు. అటువంటి సమయంలో కరతాళధ్వనులు చేసి, తమ సంతోషమును తెలియ చెయ్యాలను సంగతి గ్రిమాచీ ప్రజల

కింకా తెలియదు. షాలీ వణుకుతూన్న చేతులతో ఆ బహుమతీ అందుకో గానే ప్రజలలో కోలాహలం బయలుదేరింది.

"బహుమతీ అతనికి తగును: బాగా పనిచేసేడు."

"ఎందుకూ పనికిరాక మూలపడియున్న పనిముట్ల నన్నిటినీ వొకటో రకంగా బాగుచేసేడు."

"అతనికి పనిముట్లు, అతని భార్యకి మంచి గౌనుకి సరిపోయిన గుడ్డా కూడ వచ్చేయి!"

"బ్రహ్మరథం పట్టండి!"

"అలాంటి వెర్రిపనిమాత్రం చెయ్యకండి – విపరీతమైన శ్రమచేత యిదివరకే వొళ్లు తిరుగుతూంది."

ఈ కేకలన్నీ క్రమంగా పెద్దగోలగా మారిపోయేయి. కాని ఘాకర్ ఆంత గోలలోను వినపడేటట్టుగా.

"మూగనోము పట్టినట్లు ఆలా నించున్నావెందుకు? మాట్లాడు! సమాధానం చెప్పాలి." అని కేకేసేడు.

"లేకపోతే అతని బదులు మూగ డైమిడ్‌ని మాట్లాడమనండి."

"చూడు! కాళ్ళు యెలా వొణుకుతున్నాయో!"

"నీళ్లు నములుతావేమిటి?"

"మాట్లాడడం సమ్మెటదెబ్బ కొట్టడంలాంటిదికాదు."

"ఈ గోల యేమిటి?" అన్నాడు రజ్మటోన్లవు ప్రజల్ని గోల తగ్గించడానికి ప్రయత్నం చేస్తూ. "చప్పట్లు కొట్టాలి కాని యీ అర్పులు యేమిటి? దయచేసి పూరుకోండి. ఇంకొకరు మాట్లాడతారు." అతను ఇపోల్లిట్ కేసి తిరిగి అతనితో "లే. ధైర్యంగా నిలబడి మాట్లాడు. ఇప్పు డిది అంతా నీ విషయమయేకదూ యేర్పాటు చేస్త!...."

కాని, ఇప్పోలిట్ షాలీకి అంతమందిలో లేచినిలబడి మాట్లాడడానికి ధైర్యం లేకపోయింది. ఎప్పుడూ అలవాటు లేదుకూడాను అతనికి. ఎర్ర గుడ్డలో చుట్టబెట్టి చేతికిచ్చిన ఆ బహుమానాలు గుండెలకి చేర్చి పట్టుకుంటూంటే చేతులు వణికేయి. అంతదృఢమైనవీ అతని కాళ్లకూడ స్వాధీనం తప్పి వణక సాగేయి. చొక్కాచేతితో నుదుటిమీద చిరుచెమటలు తుడుచుకొని అతి ప్రయత్నంమీద యిల్లా అన్నాడు :

"మనకి యిలాంటి పనిముట్లు అవసరమే అనుకోండి. మనమెంతో కృతజ్ఞులం............ కార్యనిర్వాహకవర్గానికికూడా..........మీకుకూడా నా అభివందనాలు.... ..........ఇప్పటిలాగే నా జీవితాంతం వరకూ నేను సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుడుగా వుంటాను..............ఈ గుడ్డచూసి నా భార్యకూడా చాలా .........." అతను కిక్కిరిసియున్న అ హాలంతా వొక్కసారి కలయచూసేడు, భార్య వుందేమోనని. కాని ఆమె కనిపించలేదు. "ఈ పనిముట్లు..........గుడ్డ........యిచ్చినందుకు కామ్రేడ్ దేవిడోవ్‌కి, సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి నా అభివందనాలు."

షాలీ కంగారుపడుతూ యిస్తూన్న వుపన్యాసం ముగింపుకి వస్తూందన్న విషయం గ్రహించి రజ్మట్నోవ్ అతనికి యింకా మాట్లాడమని సౌజ్ఞలుచేస్తూ యెంతో తాపత్రయపడ్డాడు. కాని షాలీ అటువైపుకూడా చూడకుండా కృతజ్ఞతా సూచకంగా వంగి, బహుమతి చేతపుచ్చుకొని వేదిక దిగిపోయేడు.

నగుల్నోవ్ హడావిడిగా టోపీతీసి చేతపుచ్చుకొని చెయ్యివూపేడు. 'అంతర్జాతీయగీతం' మొదలెట్టేయి పక్కనేవున్న సంగీత వాయిద్యాలు.

దళనాయకులు డుబ్‌ట్సోవ్, లుబిష్కిన్, ఉషాకోవ్‌లు భూమి దున్నడానికి పదునుకి వచ్చిందో లేదోనని చూడడానికి ప్రతిరోజూ స్టెప్పీలోకి వెడుతూన్నారు. క్రమంగా వాతావరణం మారింది. మొదటి దళంవారు దున్నవలసిన యిసగ గరువు దున్నడానికి సిద్ధపడుతూన్నారు.

ప్రచారకదళ సభ్యుల్ని వచ్చి వైసొక్కా వాయ్‌లో మిగిలినవారిని కలుసుకొనవలసిందని కబురు వచ్చింది. కాని నగుల్నోవు కోరికమీద చల్లికలు అయేవరకూ దవిదోవు మాత్రం గ్రెమాచీలో ఆగిపోయేడు.

షాలికి బహుమతి యిచ్చిన మరునాడు నగుల్నోవు అనివార్య లుకేరియాతో విడిపోయేడు. ఆమె ఊరి చివరయున్న మేనత్త యింటికి వెళ్ళింది. రెండు రోజుల తరువాత ఆమెకి సమష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయం ఎదుటే దవిదోవు ఎదురయేడు.

"కామ్రేడ్ దవిదోవ్! యికపైన నా బ్రతుకు తెరవు ఎలాగ? మీరేమైన సలహా యిస్తారని వచ్చేను."

"అడిగినందుకు చెపుతాను సమాధానం. కాని, మేము కొత్తగా ఒక డైరీ నడపడానికి నిశ్చయించుకున్నాము. అందులో పనిచెయ్యడానికి అవకాశం వుంటుందా?"

"ఒక్కనమస్కారం మీకు; ఆ పనిమాత్రం అక్కర్లేదు. నాకు ఎవరూ పిల్లలులేరు. ఈ వయస్సులో ఇతరుల పిల్లల్ని పెంచడమా? చాలా మంచి ఆలోచనే!"

"లేకపోయినట్లయితే యేదో ఒక దళంతోవెళ్ళి పనిలో ప్రవేశించాలి మరి."

"నేను కూలిపని చేసుకొనే దాన్నికాదు. అందుచేత పొలంపని చెయ్యలేను నేను."

"ఆ పద్ధతిలో నేను యివ్వగలిగిన సలహా యేమీలేదు. వెళ్ళి తోచినట్లు చెయ్యొచ్చు. మాతో యేమిటంటే పనిచేస్తేనే తిండి."

లుకేరియా ఒక్కనిట్టూర్పు విడిచి, బూటు తడి యిసుకలోకి గుచ్చుతూ తల వేళ్ళాడేసింది.

"ఎక్కడో ఉత్తరదేశంలో 'కోట్లాస్' నుంచి టిమోఫే ఉత్తరం రాసేడు. త్వరలోనే వొస్తున్నానన్నాడు."

"అల్లాగనేం." దేవిడోవు మందహాసం చేసేడు. "అక్కడినుంచి తిరిగివస్తే మళ్ళీరాకుండా ఇంకా దూరంగా పంపుతాం ఈ పర్యాయం."

"అయితే యింక అతనికి విముక్తి లేదన్నమాటే ?"

"ఇంక అతన్ని గురించి ఆశ పెట్టుగోనక్కరలేదు." అని దేవిడోవ్ వెళ్ళిపోబోతూన్నాడు. లుకిరియా కొంచెం సిగ్గు అభినయిస్తూ అతన్ని ఆపింది.

"నాకు యింకో భర్త యెవరినైనా చూసిపెట్టగలరా ?"

"అల్లాటి పనులకి నాకు తీరుబడి యెక్కడ. శలవు."

"వెడుదురుగాని ఆగండి. యింకొక్క విషయం వుంది."

"నన్ను మీకు భార్యగా వుండడానికి అంగీకరిస్తారా ?"

ఆ ప్రశ్నకి దేవిడోవు యెంతో సిగ్గుపడ్డాడు. అతని దగ్గరనుంచి సమాధానం రాకుండానే లుకిరియా తిరిగి అందుకుంది.

"కామ్రేడ్ దేవిడోవ్! ఒక్కసారి నాకేసిచూడు. యెంత అందమైన దాన్నో. నా యే అవయవములోనైనాసరే వంకర యెంచలేవు చూడు........" అంటూ ఆకుపచ్చగౌను అంచులు రెండుచేతులతో పట్టుకొని నిర్ఘాంతపోయి చూస్తూండే దేవిడోవుముందు గిర్రునతిరిగి నిలబడింది. "ఏం, అందంగాలేనూ ? నిజంగా నీ మనస్సులో వున్నది చెప్పు........"

దేవిడోవు నిరసనగా టోపీ నెత్తిమీద పెట్టుగుని,

"నువ్వు చాలా అందమైన దానవే. అందులో సందేహంలేదు. కాని గుణం మాత్రం మంచిదిగా కనిపించడంలేదు." అన్నాడు.

"ఏం ? ఏం లోపం కనిపించింది ? పెళ్ళి చేసుకుంటావా అని అడిగినంత మాత్రంచేతనే చెడ్డదాన్నైపోయేనా ?"

"ఆ—"

"సరే. మీరు అక్కర లేదంటే పట్టుగు వ్రేలాడను. కాని ఎందుకో తెలియదు మిమ్మల్ని చూస్తే 'అయ్యో' అనిపిస్తుంది. మీరు నా కళ్ళల్లోకి

చూసినప్పుడు ఆ కళ్ళలో ఆశ ప్రతి ఫలించింది. కాని బయటికి వెల్లడించలేదు."

"నువ్వు..............చాల అసామ్యురాలవు. వెళ్ళాలి, చాలా పని వుంది అవతల .......... ఈ చర్లికలు అయిపోయేక నువ్వు యే దోపీలో వేసినా పడతాను. కాని అందుకైనా ముందుగా మకార్ అంగీకారము తీసుకోవాలి."

"మకార్ నానుంచి తప్పించుకొనడానికి ఎప్పుడూ 'ప్రపంచ విప్లవం' అంటూండేవాడు. మీరు చర్లికలు అంటూన్నారు. కాని యింక నేను వాటికోసం ఆగను. మీ వంటివారు కాదు నాకు కావలసింది. గాఢంగా ప్రేమించే వ్యక్తి కావాలి నాకు. మీ రక్తం అంతా నిరంతర పరిశ్రమవల్ల చప్పబడిపోయింది. ప్రేమ చచ్చిపోయింది మీలో."

పెదవులమీద చిరునవ్వుతో దేవిడోవు ఆఫీసులో ప్రవేశించేడు. ఆమెను గురించి యేదో ఆలోచిస్తూన్నాడు.

"మీ భార్యను వదిలేసేరా?" అని అడిగేడు సగుల్నోవును.

"ఆ విషయంతో మీకు సంబంధం లేదు." అన్నాడు చేతి గోళ్ళకేసి పరిశీలనగా చూస్తూ.

"కాని నేను..............."

"అవును. నేనుకూడా..............."

"అబ్బా! ఆ విషయమై నోరుకూడా మెదపనియ్యరే!"

"మొదటి దళం యీ పాటికి పని ప్రారంభించి యుండవలసింది. కాని వాళ్లు యేదో వంక చెప్పి ఆలస్యం చేస్తున్నారు."

"లుకిరియాను సరిఅయిన మార్గంలో పెట్టియుండవలసింది మీరు. ఒక్కతెను అలా వొదిలేస్తే తప్పక చెడిపోతుంది."

"ఆమెను గురించి యెత్తకండి నా దగ్గర. మొదటి దళం రేపు తప్పకుండా పని ప్రారంభం చెయ్యాలి."

"సరే, రేపు పంపుదం లెండి. అయితే ఆమె విషయం అంత చులకనగా వదిలెయ్యవలసినదనేనా మీ అభిప్రాయం? కమ్యూనిస్టు పద్ధతులమీద శిక్షణ యిచ్చి యెందుకు సంస్కరించలేము?"

"మొదటి దళంతో రేపు నేనుకూడా పొలాలకి వెడతాను. నేనే సంస్కారం లేనివాడినైతే నే నొకరిని సంస్కరించడం కూడానా! ఏమయితేనేం, విడిపోయేము. యింకెందుకు ఆ గొడవ. జలగలా పట్టుకువదలరేం! ఈ బేనిక్‌ని కొట్టిన పేచీతోటే చస్తూంటే పైగా మీరు వదిలేసిన పెళ్ళాన్నికూడా తీసుగు వస్తున్నారు."

దేవిడోవ్ యేదో సమాధానం చెప్పబోతూన్నాడు. ఇంతలో హారన్ చప్పుడయింది. గుంటలలో నీరు పక్కలకి చిమ్ముతూ, జిల్లా ఎగ్జిక్యూటివ్ కమిటీ ఫోర్డుకాద్దు వచ్చి నిలబడింది. జిల్లా కంట్రోలు కమీషను ఛైర్మన్ శమోఖిన్ కారు తలుపు తీసుకుని బయటికి వచ్చేడు.

"నా కోసమే వచ్చివుంటాడు." అంటూ నగుల్నోవు దేవిడోవుకేసి కోపంగా చూస్తూ అన్నాడు. "లుకిరియా సంగతికూడా యెత్తకండి. ఆ గొడవకూడా విచారణకి వస్తే సన్యాసం తీసుగోవలసిందే. శమోఖిన్! మీరు ఆట్టే యెరగరనుకుంటాను."

కేన్వాసు డాక్యుమెంటుకేస్‌తో గదిలో ప్రవేశించి కుశల ప్రశ్నే వెయ్యకుండా యీలా అన్నాడు.

"నగుల్నోవ్! నువ్వుచేసిన పనికి నేను యింతహడావిడిగా రావలవచ్చింది. ఈ కామ్రేడ్ యెవరు? దేవిడోవ్ కాదూ?" అంటూ వారిద్దతోను కరస్పర్శచేసి టేబులు దగ్గర కూర్చున్నాడు. "కామ్రేడ్ దేవిడోవ్ మే మిద్దరం మాట్లాడుకోవాలి, కొంచెంసేపు బయటికి వెడతారా?"

శమోఖిన్ హడావిడిగా డాక్యుమెంటు కేసులోనుంచి కాగితా తీస్తున్నాడు. దేవిడోవు "మీపని చూసుగోండి." అంటూ బయటికి వెళ్ళే

# ఇరువది యేడవ ప్రకరణము.

## తిరుగుబాటు ప్రయత్నం.

రాత్రి మూడవ జాము నడుస్తూంది: ప్రకృతి చైతన్య రహితంగా వుంది. వాకట్లో అడుగులచప్పుడు యాకోవ్ లూకిచ్‌కి వినబడింది. కాని నిద్రాబద్ధకంచేత లేవలేదు. అల్లా పడుకొని వుండగానే యేదో బరువుచేత పడి విరిగిపోయిన చప్పుడు, వెనువెంటనే ఖణేలుమని వినిపించి హడావిడిగా కిటికీ దగ్గరకు పరుగెత్తి తొంగిచూసేడు. ఆ గుడ్డివెలుతురులోనుంచి ఆజానుబాహు వొకడు వడిదాటి లోపలికి రావడం కనిపించింది. చంద్ర కాంతిలో తెల్లగా కనిపిస్తూన్న నెత్తిమీది టోపీనిబట్టి అతడు పొలోవిట్సీవు అయివుంటాడని నిశ్చయించుకున్నాడు. జాకట్టు వేసుకొని 'స్టౌ' మీదనున్న ఫెల్టుబూట్లు తొడిగి బయటికి వచ్చేడు. అప్పటికప్పుడే పొలోవిట్సీవు గుఱ్ఱాన్ని లోపలికి తీసుకువచ్చి, గేటు తలుపులు ఘడియ వేస్తున్నాడు. అతని చేతిలో కళ్ళెం యాకోవు లూకిచ్ తీసుకున్నాడు. గుఱ్ఱం శరీర మంతా చెమటతో తడిసిపోయి వుంది. ఉండి వుండి వొణుకుతూంది. యాకోవులూకిచ్ వేసిన కుశలప్రశ్నలకి సమాధానం చెప్పకుండానే పొలోవిట్సీవు బొంగురు గొంతుకతో రహస్యంగా,

“అతడు............లెటివిస్కీ వున్నాడా యిక్కడ?” అని అడిగేడు.

“నిద్రపోతూన్నారు. ప్రాణాలు కొరుక్కు తినేసేరు. అస్తమానూ 'వోడ్కా' తాగడం తప్ప రెండో పనే లేదు......”

“వాణ్ణి తగలేసిరిలే— గుడ్డిముండాకొడుకు! గుర్రం చాలా దూర ప్రయాణం చేసింది, భయంగా వుంది.”

పొలోవిట్సీవు స్వరంలో యెన్నడూలేని ప్రశాంతత తొణుకాడుతూంది. యాకోవు లూకిచ్‌కి అతిశ్రమ, విపరీతమైన మనోవ్యాకులత బడలిక ప్రతిధ్వనించేయి పొలోవిట్సీవు మాటలలో.

పొలోవిట్సేవు చిన్న గదిలోకి వెళ్ళి బూట్లు వదిలేసేడు. తడిసి పోయిన బ్రౌజర్లు తీసేసి, స్టౌమీద ఆరవేసి సంచీలోనుంచి నీలిరంగు కోసక్కు బ్రౌజర్లు తీసి తొడిగేడు. యాకోవు లూకుచ్ యిదంతా చూస్తూ గుమ్మంలో నిలబడ్డాడు. కెప్టెన్ స్టౌకి దగ్గరగా మంచంమీద మోకాళ్ళు ముణిచి కౌగలించుకొని పాదాలు కాచుగుంటూ కూర్చున్నాడు. మధ్యమధ్య కునుకుతూన్నాడు. కళ్ళు కూరుకుపోతూన్నాయి కాని బలవంతంగా కళ్లు తెరచి, నిశ్చింతగా నిద్రపోతూన్న లాటెవిస్కీవైపు తేరిపారచూసి,

"ఎప్పటినుంచి- యీ త్రాగుడు?" అని అడిగేడు.

"వచ్చినప్పటినుంచీకూడాను; ఆత్రాగుడికి హద్దూపద్దూలేదు. అందరూ చూస్తూండగా ప్రతిరోజూ వోడ్కా తీసుకురావడం చాలా అసహ్యంగా వుంది. వాళ్ళుఅనుమానపడచ్చుకూడాను."

"ఛీ—— వెధవపీనుగ!" పొలోవిట్సేవు పళ్లుకొరుకుతూ తన అసహ్యం అంతా వెలిగక్కేడు. మళ్లీ ఆ కూర్చున్నచోటనే కళ్ళు మూసుకుని కునకడం ప్రారంభించేడు. ఆలా కొంతసేపు కునికేప్పటికి చేతిపట్లు సడలిపోయి కాళ్ళు క్రిందికి జారిపోవడంచేత రెప్పలు బరువుగా యెత్తేడు.

"మూడు రోజులనుంచి నిద్రలేదు.........నదులన్నీ పొంగుతూన్నాయి. మీవూరుదగ్గర యీ నది యీదవలసి వచ్చింది."

"ఈ రాత్రికి పడుకొని పూర్తిగా విశ్రాంతి తీసుగోండి."

"ఆలాగే. యేదీ కొంచెం పుగాకువుంటేఇయ్యి. నాదగ్గరదంతా తడిసి పోయింది."

రెండు దమ్ములు పీల్చేక పొలోవిట్సేవు కొంచెం తేరుకున్నాడు. కునికిపాట్లు యెగిరిపోయేయి. కంఠం లేచింది.

"ఈమధ్య విశేషాలేమిటి? అని అడిగేడు.

యాకోవు లూకుచ్ టూకీగా అంతా చెప్పి,

"మన పనులెంతవరకు పూర్తిఅయేయి? ఇంతట్లో ప్రారంభం అవుతుందా?" అన్నాడు.

"అయితే వారంపదిరోజులలో. లేకపోతే........యింతట్లో లేదు. రేపు రాత్రి మనం యిద్దరం కలిసి మైహ్యావాయ్ వెళ్ళాలి. అక్కడనుంచి ప్రారంభం చేద్దాం. అక్కడికి జిల్లాపట్టణం చాలాదగ్గర. ఈమధ్యనే ప్రచారకరపత్రం కూడా ఒకటి వచ్చింది అక్కడికి. ముందు వాళ్ళపని పట్టించాలి. ఈ సారి నీఅవసరం చాలా వుంది. అక్కడి కోసక్కులు నిన్ను మెచ్చుకుంటారు. అందుచేత నీమాటవప్పుకుంటా రంటాను." హారోవిష్మేవు రొడ మీదికి ఎక్కిన పిల్లిని దువ్వుతూ, అస్వాభావికమైన మార్దవముతో మళ్ళీ మొదలెట్టేడు.

"ఊస్. ఊస్! ఎంత నల్లగా వుందో! లూకుచ్, పిల్లులంటే నాకు మహాసరదా. గుర్రాలొకటి, పిల్లులొకటి చాలిష్టంగా వుంటాయి. మాయింటిదగ్గర పెద్దసైబీరియా పిల్లొకటి వుండేది. అది యెప్పుడూ నాతోటే వుండేది. అదీ........" హారోవిష్మేవు ఆలోచనాపూర్వకంగా చూస్తూ, నవ్వి మృదువుగా పిల్లిని నిమిరేడు. "బూడిదరంగుగా వుండేది--అక్కడక్కడ తెల్లటి మచ్చలూఅవీ. చాలా బాగుండేది ఆపిల్లి. కాని నీకు పిల్లులంటే కిట్టవనుకుంటాను. అవునా లూకుచ్? మళ్ళీ నాకు కుక్క అంటే కిట్టదు. చూస్తేఅసహ్యం. నాచిన్నతనంలో—ఎనిమిదేళ్ళు ఉంటాయేమోననుకుంటా, అప్పుడు—చిన్న కుక్కపిల్ల ఒకటి వుండేది మా యింట్లో. ఎప్పుడూ దానితో ఆడుకుంటుండేవాడిని. ఒకరోజున ఆడుకుంటూంటే—ఒళ్లునొచ్చీలా దెబ్బతగిలిందేమో—మీదపడి చెయ్యిపట్టుగు పీకేసింది. వెంటనే నాకు కోపంవచ్చి కర్ర ఒకటితీసుగుని బాదడం మొదలెట్టేను. అది పారిపోయి గాదికిందదూరింది. కర్రపుచ్చుగు పొడిచి ఇవతలకిలాగి మళ్ళీ బాదడం మొదలెట్టేను. అక్కడినుంచి వెళ్ళి తోములో దూరేటప్పటికి ఇవతలకి పొడిచి కొడుతూ తరుముకు పోయేను. ఆఖరికి

కిందపడిపోయింది, ఆరవడంకూడ మానేసింది. అప్పుడు దాన్ని కొట్టడం మానేసి ఎత్తుగుని ఆదెబ్బలు చూసి జాలేసి యేడ్చేను. అవి మొదలు మళ్ళీ యెప్పుడూ కుక్కదగ్గరకి వెళ్ళలేదు. కాని పిల్లులంటే విపరీతమైన ఆసక్తి పిల్లలంటే—వాళ్ళు యేడుస్తూంటేమాత్రం చూడలేను. నీకు ఇవేమీ కిట్టవు కాదూ లూకుచ్?"

పొలోవిట్సేవ్ ఇటువంటి సర్వసాధారణ విషయాలను గురించి మాట్లాడలేదు యెప్పుడూ. అందుచేత అతనిమాటలు వినేటప్పటికి యాకోవ్ లూకుచ్ ఆశ్చర్యపోయేడు. పొలోవిట్సేవ్ గుండెలు తీసినబంటు. మహాక్రూరుడు. జర్మను యుద్ధకాలంలో పొలోవిట్సేవ్ కోసక్కులయెడల యెంతక్రూరంగా ప్రవర్తించేడో యాకోవ్ స్వయంగా యెరుగును. అతడు తలవూపి ఊరుకున్నాడు. పొలోవిట్సేవ్ ముఖం గంభీరమయింది.

"ఈమధ్య టపా సరిగ్గా వస్తూందా?" అన్నాడు పొలోవిట్సేవ్ ఖండితంగా.

"ఎక్కడ చూసినా వరదలే; దేశం అంతా నీటిమయం అయిపోయి వుంది. రోడ్లుకూడా అన్నీ మునిగి పోయేయి. పది రోజులనుంచి టపా రావడంలేదు."

"స్టాలిన్ ప్రకటన గురించి వూళ్ళో యేమీ అనుకోడం లేదూ?"

"ఏం ప్రకటన?"

"సమిష్టి వ్యవసాయ క్షేత్రాలని గురించి స్టాలిన్ చేసిన ప్రకటన. పేపర్లలో పడింది."

"ఏమో, మేమేమీ వినలేదు. ఆపేపర్లు యింకా యిక్కడికి వచ్చి యుండవు. అయితే—అనిసిమోవిచ్, యేమని ఆప్రకటన?"

"అబ్బే, యేమీలేదు..................మనకి పనికొచ్చే విషయంకాదు అయినా తెలుసునేమోనని వూరికే అడిగేను; ఈపాటికి వెళ్ళి పడుకో—

వాలా ప్రొద్దుపోయింది. ఇంకో మూడు గంటలు పోయినతరువాత మాత్రం గుర్రానికి నీళ్లపెట్టు. రేపు రాత్రి సమిష్టి వ్యవసాయ క్షేత్రపు గుర్రాలను రెండింటిని సిద్ధంచేసి వుంచు చీకటి పడగానే మైకొల్కావాయ్‌కి బయలు దేరుదాం. అప్పుడే మార్గం తేలికే."

మరునాడుదయం పొలోవిట్సెవు లతెవిస్కీతో చాలాసేపు మాట్లాడేడు. తరువాత లతెవిస్కీ గుసగుసలాడుతూ వంట యింటివైపుకి వచ్చేడు. యాకోవు లూకిచ్ అతనిని చూసి,

"కొంచెం వోడ్కా తీసుకురానా" అని అడిగేడు.

లతెవిస్కీ యేదో ఆలోచిస్తూన్నట్లు పైకి వాసాలకేసి చూస్తూ, "యేమీ అవసరం లేదు యిప్పుడు." అని మళ్ళీ గదిలోకి వెళ్ళిపోయేడు.

ఆ రాత్రి సమిష్టి వ్యవసాయ క్షేత్రపు గుర్రపుసాలల కాపలాదారు ఇవాన్ బెటలొక్కోవ్. యాకోవు లూకుచ్ ప్రోత్సాహంమీద 'దాన్ స్వాతంత్ర్య సమితి' లో సభ్యులుగా చేరినవాళ్ళలో యితనొకడు. అందుచేత యాకోవు లూకుచ్ అతని దగ్గరకి వెళ్ళి తను యేపనిమీద యెక్కడికివెడు తూన్నదీ చెప్పకుండానే "మన పనిమీదదగ్గరవూరికి వొకసారి వెళ్లి రావాలి." అని అతని ప్రశ్నకి సమాధానం చెప్పేడు. ఇవాన్ మారు మాటాడకుండా రెండు గుర్రాలని తీసుకువచ్చేడు. లూకుచ్ వాటిని తోలుకు పోయి చాటుకుంచా వొక చెట్లగుబురులో కట్టిపెట్టి, పొలోవిట్సేవును తీసుకు రావడానికి యింటికి వెళ్ళేడు. అతడు కెప్టెన్ గది దగ్గరకు వెళ్ళేటప్పటికి లతెవిస్కీ "అల్లా చూసినా కానీ మన అపజయం నిశ్చయం కావం టారా?" అంటూన్నాడు గట్టిగా. పొలోవిట్సేవు బొంగురుగొంతుకతో నెమ్మదిగా యెదో సమాధానం చెప్పేడు. ఇంతలో యాకోవు లూకుచ్ యేమి ఆపద వస్తుందోనన్న ఆలోచనలో పడి కొట్టుకుంటూ తలుపు తట్టేడు.

పొలోవిట్సేవు అతని గుర్రపుజీను తీసుకొని బయలుదేరేడు. త్వరగా వాళ్ళిద్దరూ ఆ గుర్రాల దగ్గిరకి వెళ్లి, యెక్కి వెంటనే బయలుదేరి వెళ్లిపోయేరు. ఊరు బయట అడ్డు వచ్చిన నదిని గుర్రాలమీదదాటి ఆవలి వొడ్డుచేరేరు. ప్రయాణం చేస్తూన్నంతసేపూ పొలోవిట్సేవు నోరుమెదప్ప లేదు. చుట్టలు కాల్చకూడదనీ, రోడ్డువదలి 20 గజాలు వొక ప్రక్కగా ప్రయాణం చెయ్యాలనీ ఆజ్ఞాపించేడు.

వాళ్ళకోసం వైస్కోవాయ్‌లో యెదురు చూస్తూనే యున్నారు. యాకోవ్‌కి పరిచయుడయిన వొక కోసక్కు భోజనాల సావడిలో సుమారు 20 మందివరకు పోగడ్డారు. వాళ్ళలో చాలమంది వయస్సు మళ్లినవారే. పొలోవిట్సేవు వారందరితోనూ హస్తచాలనం చేసి తరువాత అందులో ఒకనితో కిటికీదగ్గరికి వెళ్ళి కొంతసేపు నెమ్మదిగా ఏవో మాట్లాడు కున్నారు. మిగిలినవాళ్ళంతా పొలోవిట్సేవ్ కేసి, యాకోవ్ లూకుచ్ కేసి చూస్తూ కూర్చున్నారు. గుమ్మం దగ్గరగా కూర్చున్న యాకోవ్‌కి ముక్కు, ముఖంఎరగని ఈకొత్తవాళ్ళతో కూర్చోవడానికి ఎల్లాగోవుంది.

ఆ సావిడీ తలుపులన్నీ భద్రంగా మూసేసి, ఆప్రాంతానికి ఎవరూ రాకుండా ఇంటియజమాని అల్లుణ్ణి బయట కాపలా పెట్టేరు. ఇంతబందో బస్తుచేసినప్పటికి పొలోవిట్సేవ్ చాలనెమ్మదిగా మాట్లాడసాగేడు.

"........తిరుగుబాటు చెయ్యవలసిన సమయం వచ్చింది. మనం, దాస్యబంధనాలను నాశనంచేసి స్వాతంత్ర్యంపొందడానికి సిద్ధపడాలి. అందుకు కావలసిన యేర్పాట్లు అన్నీ పూర్తయేయి. ఎల్లుండి రాత్రినుంచి ప్రారంభం చేద్దాం. ఒకకంపెనీ ఆశ్వికసైనికులు వైస్కోవాయ్‌వస్తారు. మొట్టమొదటి తుపాకిమోత వినిపించగానే, మీరందరు వెళ్ళి ప్రచారకదళాన్ని వారిమకాం లోనే ఎదిరించాలి. ఒక్కణ్ణికూడా ప్రాణాలతో దాటిపోనివ్వకూడదు! మీ అందరికీ 'కార్నెట్ మారిన్'ని నాయకుడుగా యేర్పాటు చేస్తున్నాను.

బయలుదేరేముందు మీరంతా టోపీలమీద తెల్లటి రిబ్బనులు గుచ్చుకోండి; లేకపోయినట్లయితే చీకట్లో శత్రువెవరో మిత్రుడెవరో గుర్తించడం కష్టం. ప్రతివాళ్ళూ గుర్రాలు తెచ్చుకోవాలి. కత్తి, తుపాకి మొదలైనవి ఏవుంటే అవి మూడురోజులకు సరిపోయిన ఆహారపదార్థాలు తీసుకు బయలుదేరండి. మేము, ప్రచారకదళాన్ని, స్థానిక కమ్యూనిస్టుల్ని చంపేసినతరువాత, మీసహాయంకోసం పంపించిన కంపెనీతో చేరండి. అది మొదలు మీ మీద నాయకత్వం ఆ 'కంపెనీ' కమేండరుకి వెళ్ళిపోతుంది. అతని ఆజ్ఞప్రకారం ఎక్కడికి తీసుకువెడితే అక్కడికి వెళ్ళాలి."

పొలోవిట్సేవ్ బ్రౌజరు బెల్టుమీద చెయ్యితీసి, నుదుటిమీద పోసిన చెమట తుడుచుకున్నాడు.

"గ్రిమూచీలాగ్ నుంచి నాతోకూడ ఒక కోసక్కుని తీసుకు వచ్చేను. ఇతనిని మీరంతా ఎరిగేవుంటారు. యాకోవ్‌లూకుచ్ ఇతని పేరు. వాళ్ళ ఊళ్ళోకూడా ప్రజలంతా తిరగబడడానికి సిద్ధంగా ఉన్నారన్న విషయం ఎంతవరకు నిజమో ఆయనే చెబుతాడు. ఒక్క వాళ్ళఊరేకాదు— దాన్‌పరగణాలలోని కోసక్కులంతా ఈ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నాశనం చెయ్యడానికి ఎప్పుడెప్పుడని తహతహలాడుతున్నారు, అస్త్రోవ్‌నోవ్."

పొలోవిట్సేవ్ అతనిని లెమ్మన్నట్లుగా తలఊపేడు. యాకోవ్ లూకుచ్ స్టూల్‌మీదినుంచి లేచి నిలబడ్డాడు. అందరిదృష్టులు అతనివైపు తిరిగేటప్పటికి శరీరం బరువెక్కినట్లు అయింది. కంఠంలోయేదో అడ్డపడ్డట్లు తోచింది. ఏదో మాట్లాడబోతున్నాడు. కాని అంతలోనే ఒక ముసలికోసక్కు అందుకోడంచేత లూకుచ్ మాట్లాడడానికి అవకాశం చిక్కిందికాదు. ఆ కోసక్కు స్థానికచర్చి కౌన్సిలులో మెంబరు. మహాయుద్ధంవరకు పైస్కావాయి చర్చి స్కూలుకి గార్డియను. అతడుకూడ లూకుచ్‌తోపాటే లేచినిలబడి,

"ఏమండీ, నిన్ననే కొత్తవిషయం ఒకటి తెలిసింది. మీరు విన్నారా?" అని అడిగేడు. "ఇప్పుడు మీరు వచ్చేముందు వరకు మేమం

దరం ఆ విషయాన్ని గురించి మాట్లాడుకుంటున్నాము.............మంచి పేపరు ఒకటి వచ్చింది........"

"ఏమిటి ? ఏమిటితాతా అంటున్నావు ?" అని అడిగేడు పౌలో విట్సేవ్ నెమ్మదిగా బొంగురుగొంతుకతో.

"మాస్కోనుంచి పేపరు ఒకటి వచ్చింది. దాల్లో, కమ్యూనిస్టు పార్టీ ఛైర్‌మన్ చేసిన ప్రకటన పడింది........"

"సెక్రటరీ." అని అందులో ఒకడు సర్దుబాటు చేసేడు.

"అవును, పార్టీసెక్రటరీ కామ్రేడ్ స్టాలిన్. ఇదిగో పేపరు. ఈ నెల 4 వ తారీఖున అచ్చయింది." అంటూ ఆ ముసలి కోసక్కు, కోటు లోపలి జేబులోనుంచి, జాగ్రత్తగా మడచి పెట్టబడిన పేపరు ఒకటి పైకి తీసేడు. "మీరు వచ్చేముందు కొంతసేపు మాలో ఒకడు చదువుతూంటే మిగిలినవాళ్ళందరం విన్నాము.............అది విన్నతరువాత మీరు, మేము విడిపోయేము. మాకు, తిరుగుబాటు చెయ్యవలసిన అవసరం కనిపించ లేదు. ఈ పేపర్ని గురించి మాకు నిన్ననే తెలిసింది. ముసలితనంచేత ఓపిక తగ్గిపోయినా ఎల్లాగో కష్టపడి ఈవేళ ఉదయాన్నే గుర్రంమీద బయలుదేరి జిల్లాపట్టణం వెళ్ళేను. నేను ఎరిగిన ఆయనఒకడు ఈ పేపరు పట్టుగు వెడుతూంటే చూసి. ఇయ్యమని బ్రతిమాలేను. ఆఖరుకి 15 రూబుల్సు ఇచ్చి కొన్నాను ! తీరా ఆ పేపరుమీద చూస్తే దానిఖరీదు 5 కోపెక్కులు. కాని ఒక్కొక్కరు 10 కోపెక్కుల చొప్పున ఈ పేపరు ఖరీదు అందరూ భరించడానికి నిశ్చయించు గున్నాము. 15 రూబుల్సు కాకపోతే 20 రూబుల్సు చేస్తుంది ఇది............"

"ఏమిటి తాతా, అనేదినువ్వు ? కొత్తకొత్త విషయాలు మహా చెబుతున్నావే ! ముసలితనంచేత మతి తిరిగిపోయిందా యేమిటి ? ఇక్కడ యెవరు మాట్లాడమన్నారు నిన్ను ?" అంటూ పౌలోవిట్సేవ్ కోపంతో గద్దించేడు.

కుదిమట్టంగా ఉన్నకోసక్కు ఒకడు లేచి ఎదిరికి వచ్చేడు. వాలకం చూస్తే నలభై యేళ్ళవాడిలా ఉన్నాడు. కత్తెర వెయ్యబడ్డ బంగారు వర్ణపు గడ్డం, తప్పముక్కు. అతడు గోడవార గుంపుగా నిలబడియున్న వాళ్ళల్లోనుంచి తప్పించుకుని ముందుకువచ్చి, పొలోవిట్సీవ్‌తో కోపంగా తృణీకారంగా మాట్లాడసాగేడు.

"కామ్రేడ్, మీ బుకాయింపుకి భయపడేవాడెవడూ లేడు, అది కట్టి పెట్టండి ఇంక. ఎన్ని ఆటలు ఆడినా పూర్వం సాగేవి కాని యిప్పుడెక్కడ సాగుతాయి! నోరు కొంచెం సంబాళించుకుమాట్లాడుతూండండి. సోవియటు ప్రభుత్వం వచ్చినతరువాత వెనకటి జబర్దస్తీ పోయింది. ఇంకా ఆ సంగతి మీకు తెలియనట్లుంది. అతను చెప్పినట్లుగా మేము వచ్చేముందు మేము మా నిశ్చయం పునర్విమర్శ చేసిన మాటనిజమే. 'ప్రవదా' లో కామ్రేడ్ స్టాలిన్ ప్రకటన చూసినతరువాత మా నిశ్చయం మార్చుకున్నాము. ప్రభుత్వముమీద తిరుగబడదల్చుకోలేదు. ఇంక మీకూ మాకూ పొసగదు. అసలు యింతవరకు రావడానికి కారణం స్థానిక అధికారులే. మమ్మల్ని అందర్నీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో బలవంతంగా చేర్పించారు. సామాన్య రైతుల్ని చాలా మందిని భాగ్యవంతుల జాబితాలోచేర్చి వాళ్ళ ఆస్తులు జప్తుచేసేరు. మా సోవియటు ఛైర్మన్ తనకి వ్యతిరేకంగా యెక్కడా మీటింగులలో మాట్లాడ కూడదన్నారు. ఒకటేమిటి? వాళ్ళకి తోచినట్లల్లా చేసేరు. నోరెత్తుతే ఖైదులో పెడతామన్నారు. మమ్మల్ని యీలా అణచి పారెయ్యమని స్థానిక అధికారులకి మాస్కోనుంచి ఆర్డర్లు వచ్చియుంటాయనీ, యీ ప్రచారమంతా కమ్యూనిస్టుపార్టీ సెంట్రలు కమిటీ ఆజ్ఞలవల్లనే అనీ అనుకున్నాము. అందుచేతనే మీ సంఘంలోచేరి ప్రభుత్వం మీద తిరుగుబాటు చెయ్యడానికి నిశ్చయించేము. కాని యిప్పుడు స్టాలిన్ ప్రజలని బలవంతంగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేర్పించి, చర్చిలు అకారణంగా మూసేసి, నిరంకుశంగా ప్రవర్తించిన స్థానిక కమ్యూనిస్టుల్ని

అందరినీ వారి వారి పదవులనించి తొలగించేస్తున్నారు. ఇకపైనుంచి రైతు స్వేచ్ఛగా బ్రతకవచ్చు. ఇష్టంవుంటే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరచ్చు. లేకపోతే లేదు. అటువంటప్పుడు యింక మాకు యిబ్బంది యేముంది? హాయిగా యెవరిమటుకు వాళ్ళం చేతనయినంత భూమి దున్నుకుని బ్రతుకుతాం. మేము సంతకం చేసి యిచ్చిన ప్రమాణపత్రాలు మాకిచ్చేసి మీయిష్టం వచ్చినట్లు పోండి. మేముమాత్రం తిరుగుబాటు చెయ్యదల్చుగోలేము........"

పొలోవిట్సీవు కిటికీకి చేరబడి నిలబడ్డాడు. ముఖంలో కత్తివేటు వేసినా నెత్తురుచుక్కలేదు. చుట్టూవున్న కోసక్కులకేసి చూసి, "మోసం చెయ్యాలని చూస్తూన్నారా?" అని అడిగేడు.

"మోసం అనుకున్నా సరే, మరేమనుకున్నా సరే," అని యింకొక ముసలి కోసక్కు సమాధానం చెప్పేడు. "మేము ప్రభుత్వంమీద తిరుగుబాటుమాత్రం చెయ్యదల్చుకోలేము. ప్రభుత్వమే మాకు సహాయపడుతూన్నప్పుడు అది వొదిలేసి పైవాళ్ళని బ్రతిమాలడం యెందుకు? మొదట వాళ్ల అనవసరంగా నావోటు రద్దుచేసి పైగా ప్రవాసానికి పంపడానికి కూడా ప్రయత్నించేరు. కాని నా కొడుకు రెడ్ ఆర్మీలో పని చేస్తూండడంచేత పోయినవోటు తిరిగి సంపాదించుకోగలను. సోవియటు ప్రభుత్వానికి మేము వ్యతిరేకులం కాదు—ఈ చిన్న చిన్న అధికారుల దుర్నయాలను మాత్రము యెదిరించ నిశ్చయించుగున్నాము. కాని మీరు మమ్మల్ని ప్రభుత్వంమీదే తిరగబడ మంటున్నారు. అది మాకు యిష్టంలేదు. మా పేపర్లు మాకు యిచ్చెయ్యండి............"

నడి వయస్సులోనున్న యింకొక కోసక్కు లేచి వుంగరాలు తిరిగిన గడ్డం సవిరించుగుంటూ మాట్లాడసాగేడు.

"కామ్రేడ్ పొలోవిట్సీవు! యేదో తెలియక పొరపాటు చేసేము ........మీవంటివాళ్ళతో సంబంధం యేర్పరచుగోడం మాదే తప్పు. ఇప్పు

డైనా మించిపోయినదేమీ లేదు— మమ్మల్ని వొదిలెయ్యండి. క్రిందటిసారి అరచేతిలో స్వర్గం తీసుకొచ్చి పెడతామని ఆశ చూపించేరు. మాకే తక్షణం వేసింది ఇదంతా నిజమేనా అని ఒక్కసారి తిరుగుబాటు లేవదీసినట్లయితే పదేహానుంచి ఆయుధాలు, ఇతర సహాయం కొల్లలు కొల్లలుగా వస్తా యని చెప్పేరు. మేము చెయ్యవలసినదల్లా వొక్క కమ్యూనిస్టుల్ని చంపడం మాత్రమే. కాని తరువాత యిదంతా స్థిమితంగా ఆలోచించేము. ఆయుధాలు చవకకనక కావలసినన్ని సప్లయి చెయ్యవచ్చు. కాని వాళ్ళ స్వయంగా మనదేశం వస్తారా? ఒకవేళ వచ్చినాకానీ మళ్ళీవాళ్ళ యిక్కడ నుంచి కదలరు. 'ఏకై వచ్చి మేకై మిగిలేరని' సహాయంకోసం వచ్చి నట్టింట మనమీదే అధికారం చెలాయిస్తారు. అందుచేత వాళ్ళని పిలవం ఉంగా గెంటివేలని వస్తుంది. కమ్యూనిస్టులు మనకి యెంత విరోధులయి నప్పటికి వాళ్ళుకూడా మన స్వజాతీయులు. ఇంక ఆ విదేశీయులన్నారా— వాళ్ళని తగలెయ్యా వాళ్ళసలు మనదేశం కాదు, మన జాతికాదు, మన భాష కాదు. వాళ్ళు మేమేదో మనల్ని ఉద్ధరిస్తారన్నది వట్టిమాట. ఆఖరికి విరిగిన వేలుమీద వుచ్చయినా పొయ్యరు. 1920 లో నేను విదేశాలలో వున్నాను. ఆ రోజులలో 'గెలిపోల్లీ' లో ఫ్రెంచివాళ్ళ రొట్టె రుచిచూసేను. మళ్లీ స్వదేశం కళ్ళ చూస్తాననుకోలేదు. ఒకటేమిటి—అనేక దేశాలు తిరిగేను కాని మన రష్యనులంత మంచివాళ్ల దయార్ద్ర హృదయులు యెక్కడా కనిపించ లేదు. కాన్‌స్టాంటి నోపుల్, ఏథెన్సు, నగరాలలో వోడరేవులలో పనిచేసి నప్పుడు ఇంగ్లీషు, ఫ్రెంచి దేశస్తుల్ని యెరుగుదును. పెద్ద పెద్ద గడ్డాలు పెంచుకుని, మురికిగావుండే మనల్ని పురుగుని చూసినట్లు అతి అసహ్యంగా చూస్తారు. శుభ్రంగా షవరం చేసుకొని మంచిమంచి సూట్లు వేసుకొని తిరుగుతూ మనల్ని లెక్కచెయ్యరు. హోటళ్ళకి యెక్కడికేనా వెడితే వాళ్ళ నావికులు మనల్ని వేళాకోళం వెక్కిరింత క్రింద పట్టించి మాట్లా డుతే గుప్పెళ్లు బిగించి కొట్టబోతారు. మన డాన్ కోసక్కులికికూడా విదే

శాల అనుభవం కొంత కలిగింది." ఆ కోసక్కు నవ్వేడు. తెల్లటిపళ్ల ముత్యాలలా మిలమిలలాడేయి. "మావాడొకడు మామూలు రష్యను వేషంతో వొక రేవులో దిగేటప్పటికి వొక యింగ్లీషువాడు వెనకనుంచి వచ్చి కిందపడేసేడు. తిరగబడితే మనవాళ్ళముందు వాళ్లు యెందుకూ పనికి రారు. కాని దేశంకానిదేశం అవడముచేత, బట్టలు దులుపుకొని లేచిపోవ లసివచ్చింది. ఈ విదేశీయుల సంగతి మాకు బాగా తెలుసును. ఏదోవిధంగా యీ ప్రభుత్వంతోనే సఖ్యపడతాం కాని విదేశస్థుల్ని నమ్మకొని తిరుగు బాటుమాత్రం చెయ్యము. అందుచేత మా కాగితాలు మాకిచ్చెయ్యండి."

"వీడు హఠాత్తుగా యీ కిటికీలోనుంచి బయటికి వురికి పారిపోతే యిక్కడనేను పట్టుబడిపోవలసి వస్తుంది." అనుకున్నాడు యాకోవు లూకుచ్. "చూసి చూసి ఆఖరికి యిందులో పడ్డానేమిటి ? ఏ ముహూ ర్తాన్ని చేరేనో మొదటనుంచీ అన్నీ గండాలే; కళ్లు మూసుకుపోయేయి– ముందు ఆలోచన లేకపోయింది." యాకోవు లూకుచ్ పొలోవిట్సీవుకేసి చూస్తూ ఆలాగే నిలబడ్డాడు. కెప్టెన్ నిశ్చలంగా కిటికీలో చేరబడి యున్నాడు. వెనకటి వెలవెలబాటు పోయింది. కోపంచేత ముఖం జేవు రించింది. నుదురుమీది రక్తనాళాలు వుబ్బొంగేయి.

"సరే మీ యిష్టం. మాతో రావడానికి యిష్టం లేకపోతే నిర్బంధం యేమీలేదు. మిమ్మల్ని బ్రతిమాలడానికి రాలేదు మేము. కాగితాలుకూడా తిరిగి యివ్వను. అవి జనరల్ స్టాపు దగ్గర వున్నాయి. నాతోకూడా తీసుగురాలేదు. కాని మీరు వాటికోసం భయపడవలసిన పనిలేదు. జి. పి. యు. కి మిమ్మల్ని గురించి తెలియ చెయ్యను…………"

"ఆలా అయితే మాకు అంగీకారమే." అన్నాడు వొక ముసలి కోసక్కు.

"జి. పి. యు. కోసం కాదు మీరు భయపడవలసినది." అంత వరకూ నెమ్మదిగా శాంతంగా మాట్లాడుతూన్న పొలోవిట్సీవు అతితీవ్రంగా

పెద్దస్వరంతో మాట్లాడసాగేడు. "మమ్మల్ని చూసి భయపడవలసివుంటుంది. జాగ్రత్త! మిమ్మల్ని అందర్నీ కుక్కల్ని కాల్చినట్లు కాల్చిపారేస్తాము! దోవ ఇయ్యి. పక్కకి తప్పుగో! దూరంగా పొండి!" బెల్టులోని రివాల్వరు పూతలాగి మెదరకి చూపి పట్టుకొని గుమ్మంవైపు బయలుదేరేడు.

కోసక్కులంతా వాకళ్ళ నొకళ్లు తోసుగుంటూ అతనికి దోవ యిచ్చేరు. యాకోవు లూకుచ్ పొలోవిట్సేవుకంటె ముందుగా గుమ్మం దగ్గరికి పరుగెత్తి తలుపు బార్లా తెరిచి వరిచేలాలో బెద్దలా పీథులోపడ్డాడు.

ఆ చీకట్లోనే గుర్రాలమీదవచి గౌడు తీయిస్తూ వెళ్ళిపోయేరు. ఆ ఇంట్లోనుంచి రణగొణధ్వని బయలుదేరింది. కాని వొక్కడూ బయటికి రాలేదు. వాళ్ళని యిద్దరినీ పట్టుకొనడానికి ప్రయత్నించలేదు.

వాళ్ళిద్దరూ తిన్నగా గ్రిమాచీలాగ్‌కి వచ్చేసేక యాకోవ్ లూకుచ్ ఆ గుర్రాలని సమిష్టి వ్యవసాయ క్షేత్రపు తబేలాకి నడిపించుకు పోయేడు. పొలోవిట్సేవు యింట్లోకి రాగానే ఆఖరుకి చొక్కా అయినా విడవకుండా వెంటనే లచెవిస్కీని ప్రయాణానికి సిద్ధం అవమన్నాడు. అతను లేనప్పుడు వచ్చిన వుత్తరంవిప్పి చదువుకొని కాల్చేసి ప్రయాణ సరంజం చేస్తూన్నాడు.

యాకోవులూకుచ్ గుర్రాలని కట్టేసి వచ్చినతరువాత పొలోవిట్సేవు అతనిని గదిలోకి రమ్మన్నాడు. అతను వచ్చేటప్పటికి పొలోవిట్సేవు టేబులుముందు కూర్చుని యున్నాడు. లచెవిస్కీ రివాల్వరు యే భాగానికి ఆ భాగం విప్పేసి గ్రీజుజేసి, మళ్ళీ తొందరగా అమరుస్తూన్నాడు. తలుపు చప్పుడవగానే పొలోవిట్సేవు నుదురుమీద చేతులు తీసి తిరిగి చూసేడు. గుంటలుపట్టి యెర్రగా చింత నిప్పుల్లావున్న కళ్ళవెంట నీళ్లుకారి ముక్కు మీదినుంచి బొట్లు బొట్లుగా క్రిందపడుతూన్నాయి.

"మనం చేసినప్రయత్నాలన్నీ.........ప్రస్తుతంమటుకు విఫలము అయిపోయేయి కదా అని దుఃఖంగా వుంది."అన్నాడు పొలోవిట్సేవుగద్గద

స్వరంతో. నెత్తిమీది తెల్లటి వున్నటోపీ తీసి కళ్ళనీళ్ళు వొత్తుకున్నాడు. "డాన్‌లో స్వాతంత్ర్యపిపాసులు, శూరులూ అయిన కోసక్కులకే కరువ యింది. అంతామూర్ఖులు, పిరికిపందలు, ద్రోహులు. లూకుచ్! కొద్దిసేప ట్లోనే బయలుదేరి వెళ్లిపోతున్నాము. కాని మళ్ళా వొస్తాము. ఇప్పుడే యీ వుత్తరం అందింది......కోసక్కులు టుస్యాన్‌స్కోలోను. మాజిల్లా లోనూకూడా తిరుగుబాటు చెయ్యడానికి నిరాకరించేరుట. ఈసారి స్టాలిన్ వాళ్ళని తనవైపుకే తిప్పుకోగలిగేడు. ఇప్పుడు ముందు చెయ్యవలసిన పని వాడిని చంపడమే; అంతవరకు నాకు........" పొలోవిట్సేవు కంఠం గద్గదికమయిపోయింది. పళ్ళు కటకట లాడేయి. కండలు తిరిగియున్న చేతి వ్రేళ్ళు బిగిసిపోయేయి. ఒక్క నిట్టూర్పు విడిచేసు, గుప్పెళ్లు విడివడ్డాయి, చిరునవ్వు నవ్వేడు. "ఎంతటి మూర్ఖ ప్రజలు; వెధవలు!వీళ్ళని యేంచేసినా పాపంలేదు. స్టాలిన్‌చేసిన ప్రకటన అంతా కపట నాటకమనీ, అదొక రాజ కీయపుఎత్తు అనీ తెలియదు. చంటిపిల్లల్లా నమ్మేరు మంచీ చెడ్డా ఆలో చించకుండా. ప్రపంచంలో యింతటి మూర్ఖులు యెక్కడా వుండరు. రాజ కీయపు యెత్తులలో వీళ్ళనియెరగా వుపయోగిస్తున్నారు. ఇంకాబిగిస్తే కంఠం బిగిసి చచ్చిపోతారేమోనని కొద్దిగా వొదులు చేసేరు. బ్రతికివుంటే యెందు కేనా వుపయోగించుకోవచ్చని; అంతేకాని వీళ్ళమీద, నామీద దయచేత కాదు. ప్రజలు యెప్పటికోవొకప్పటికి ఈ విషయం తెలుసుగోకపోరు.కాని తీరా మించిపోయినతరువాత అప్పుడు యేం లాభం? లూకుచ్, మేం వెళ్ళి పోతూన్నాం. నీవు సాధ్యమైనంతలో మాకు అన్నిసదుపాయాలుచేసి చాలి శ్రమ తీసుగున్నావు. నీవుపకారంమరిచిపోలేము. సమిష్టివ్యవసాయక్షేత్రం లోనుంచి తప్పుగోక నీకు సాధ్యమైనంతవరకూ ధ్వంసం చేస్తూండు. ఇదే నీకు నా ఆఖరి ఆజ్ఞ. మన సంఘ సభ్యులందరితోటీకూడా నా మాటగా ప్రస్తుతంమటుకు చెదిరిపోవలసి వచ్చిందనీ, అంతమాత్రంచేత మన ఆశ యాన్నుంచి విరమించకూడదనీ చెప్పు. మళ్ళీ మేము తిరిగి వస్తాము.

మనల్ని, మన ప్రయత్నాలనీ ... ....మన మాతృభూమియైన 'డాన్'ని అంత ర్జాతీయ యూదు హంతకుల చేతులలోనుంచి తప్పించడానికి చేసే ప్రయ త్నాలను భగ్నంచేసి మనల్ని వదలి పారిపోయిన వాళ్ళనందర్నీ యింత టితో వదలిపెట్టం! కోసక ఖడ్గం వాళ పదనమే దానికి ప్రతి ఫలం."

"తప్పకుండా చెబుతాను." అన్నాడు యాకోవ్లు లూకుచ్. పొలో విట్సీవు మాటలు, కళ్ళ నీళ్ల చూసేటప్పటికి అతని హృదయం నీరయి పోయింది. కాని యీ పిశాచాలు యింతటితో వదలిపోరాయికదా అని అత నికి మనసులో సంతోషంగాకూడ వుంది.

"ఓ—తప్పకుండా చెబుతాను." అని మళ్ళీ అని "కాని, అలెగ్జాం డర్—యిప్పుడు మీరు యెక్కడికి వెళుతున్నారు?" అని సాహసముగా అడిగేడు.

"ఏం—ఆ విషయం నీ కెందుకు," అన్నాడు పొలోవిట్సీవు.

"ఏమీలేదు--మీకోసం యెవరేనావస్తే అవసరం అవుతుందేమోనని"

పొలోవిట్సీవు తల పంకించి లేచి నిలబడ్డాడు.

"ఆ విషయం నీకుచెప్పడానికి వీలులేదు" అన్నాడు."మళ్ళీబహుశా 20 రోజులలో యిక్కడికి వస్తాను. శెలవు," లూకుచ్‌తో హస్తచాలనం చెయ్యడానికి చెయ్యి జాపేడు.

అతను స్వయంగా జీను అమర్చి అంతా సిద్ధం చేసుకున్నాడు. ఈ లోపుగా లశెవిస్కీ పొలోవిట్సీవు లేకుండాచూసి, లూకుచ్ దగ్గర శెలవు తీసుకొని. రెండునోట్లు అతని చేతులో పెట్టేడు!

"మీరు నడిచి వెడతారా?" అని అడిగేడు లూకుచ్.

"అబ్బే--యెందుకూ! వీధులో కారు నాకోసం సిద్ధంగా వుంది." అన్నాడు లశెవిస్కీ పరిహాసంగా. పొలోవిట్సీవు గుర్రంమీద యెక్క

వరకూ లసెవిస్కీ రికాబు పట్టుకు నిలబడి "ఇంక యేమాత్రం వేగంగా పరుగెత్తుతావో పరుగెత్తు. నేను కాలినడకనే వస్తాను." అన్నాడు.

యాకోవ్ లూకుచ్ వాళ్ళిద్దరూ వెళ్ళిపోయేవరకూ చూస్తూ నిలబడి తరువాత బుజాలమీదినుంచి యేదో పెద్ద బరువు దిగిపోయినట్లు తెరిపినిపడ్డ ముఖంతో తలుపు వేసుకొని లోపలికి పోయేడు. లసెవిస్కీ యిచ్చిన నోట్లు ఆతురతగా జేబులోనుంచి తీసి ఆ ప్రాతఃకాలపు మసక చీకట్లో ఇటునటు తిరగేసి పరీక్షగా చూస్తూన్నాడు యేమి నోట్లో అని.

---

## ఇరవై యెనిమిదో ప్రకరణము.

### పార్టీ నిర్ణయము.

"విజయోన్మాదము" అనే పేరుతో స్టాలిన్ చేసిన ప్రకటన మార్చి 4వ తారీఖున పత్రికలలో ప్రకటిత మయింది. కాని వూళ్ళు, కోళ్లు యేక మయేటట్లు వచ్చిన వరదలవల్ల ఆపత్రికలు 20వ తారీఖు వుదయానికి పోష్టు ద్వారా గ్రిమాచీలాగ్ వచ్చేయి. మార్చి 4వ తారీఖున 'మొలాట్' పత్రిక ప్రతులు మూడూ ఆసాయంత్రమూ చేతులు మారుతూ వూరంతా తిరిగేయి. అంతవరకూ గ్రిమాచీలాగ్‌లో యే పత్రికాకూడా అంతమంది ప్రజలని ఆక ర్షించలేదు. అన్ని చేతులు మారలేదు. సాయంకాలం అయేటప్పటికి ఆపత్రి కలు మాసి చిరిగిపోయేయి. గ్రామస్తులు గుంపులు గుంపులుగా యిళ్ళలోను దొడ్లలోనూ, సంఘ గొందులలోనూ చేరి, వొకళ్లు చదువుతూంటే మిగిలిన వాళ్ళంతా నోళ్ళు తెర్రబెట్టి, పరధ్యాన్నంగా వుంటే యే ముక్క దాటి పోతుందోఅని చెవులు దోరపెట్టి వింటూన్నారు. ఎక్కడ చూసినా ఆ ప్రక టనను గురించిన చర్చలే. ఎవరికి తోచినట్టు వారు అర్థాలు తీస్తూ చాలా

బాగుందని చంకలు కొట్టుకుంటున్నారు. ఎక్కడయినా సరే నగుల్నోవు దేవిదోవులు కనిపిస్తే మాత్రం చదువుతూ చదువుతూన్న పత్రిక కంగారుగా మడిచేసి వొకరి చేతులలోంచి మరియొకరి చేతులలోకి దాటించి చివరికి యెవరి జేబులలోనో దాచేస్తున్నారు.

"పాపం—యింతా శ్రమపడి నిర్మించిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు పేక మేడలలా కూలిపోతాయి యీ దెబ్బతో" అన్నాడు దేనిక్ వెటకారంగా.

"ఎప్పటికీ అల్లా అవదు. నిగ్గు అక్కడేవుంటి మిగిలిన చెత్తఅంతా కొట్టుకు పోతుంది. అదేనయం." అని వెమ్కా ఉషాకోవు అతనికి జవాబు చెప్పేడు.

"తొందర పడకు, కొద్ది రోజుల్లోనే చూద్దువుగాని" అని యీసడింపుగా అక్కడనుంచి లేచిపోయి, తన మాటను ఆప్యాయంగావినే కోసక్కుల దగ్గర "మీరేదో వంక పెట్టి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి వచ్చెయ్యండి. ఒక్క నిముషం దాన్లో ఉండద్దు" అని గుసగుసలాడడానికి పోయేడు.

"ఇందులో చాలామంది బలవంత బ్రాహ్మణార్థంగా చేరిన రకం. ఎప్పుడు పోదామా అని ముళ్ళమీద నిలబడ్డట్లు వున్నారు." అంటూ ఐవి షిక్కున్ ఆర్కాడీకి వొకచోట గుంపుగా చేరి మాట్లాడుకుంటూన్న కొంత మంది సమిష్టి వ్యవసాయ క్షేత్రపు సభ్యులకేసి చూపించేడు.

ఆడవాళ్ళకి యీ విషయాన్ని గురించి యేమీ తెలియకపోయినప్పటికీ వున్నవీ, లేనివీ వొకటికి మూడు కల్పించి దీర్ఘాలు తీస్తూ నూతుల దగ్గరా అక్కడా చేరి చెప్పుకోడం మొదలెట్టేరు. ఊరంతా యెక్కడ చూసినా పుకార్లే.

"సమిష్టి వ్యవసాయ క్షేత్రాలన్నీ విడగొట్టేస్తున్నారట!"

"ఎవరి ఆవుల్ని వాళ్ళకి యిచ్చెయ్యమని మాస్కో-నుంచి యీవేళే ఆర్డరు వచ్చిందట."

"ప్రవాసాలకి పంపబడ్డ భాగ్యవంతులంతా యెవరి వూళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయి, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరుతున్నారట."

"వెనక వోటింగుహక్కు పోయినవాళ్ళకందరికి తిరిగి ఆ హక్కు యిచ్చే స్తూన్నారట."

"ఇదివరకు టువ్యాన్‌స్కో-లో మూసేసినచర్చి మళ్ళీ తెరవమని ఆర్డరువచ్చిందట. దానిలో జాగ్రత్త చేసిన గోధుమలన్నీ సమిష్టి వ్యవసాయ క్షేత్రసభ్యులికి పంచిపెడతారుట"

ఏవో గొప్ప మార్పులు వచ్చేలా వున్నాయి. అంతాకల్లోలంగా హడావిడిగా వుంది. ఆ రోజు సాయంకాలం పార్టీ నూక్లియస్ ప్రైవేటు మీటింగులో దేవిడోవు వుద్రేకంతో తడబడుతూ మాట్లాడుతూన్నాడు.

"కామ్రేడ్ స్టాలిన్ ప్రకటన సరిఅయిన సమయంలో వచ్చి చాలా మేలు చేసింది."

"ఈ విజయంతో మకార్‌కి తల తిరిగిపోయింది. అతనేకాదు కొంతవరకూ మనస్థితికూడా అలాగే అయింది. కామ్రేడ్స్! యింతవరకు మనం చేసిన వాటిలో ఫలానా పొరపాట్లు వున్నాయని యెవరేనా యెత్తి చూపించవచ్చు. దానిలో యేమీ తప్పులేదు. ఇంతక్రితమే కోళ్ళు, బాతులు మొదలయిన వాటిని సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోకి తీసుకుంటే దానివల్ల లాభంకంటె నష్టం యెక్కువని గుర్తించి వాటినన్నిటిని ఎవరివి వారికి యిచ్చేసేము. ఇప్పుడు మనం గొఱ్ఱెల్ని, పశువుల్ని యేం చెయ్యాలి? వాటిని యేంచేస్తే బాగుంటుందని అడుగుతూన్నాను మిమ్మల్ని? మనం కనక అతి జాగ్రత్తగా ప్రవర్తించకపోయినట్లయితే ............ జరిగేపని యెల్లాగా జరిగిపోతుంది. కాని మనకి మాటమాత్రం దక్కదు. ఎవరి దూడల్ని వాళ్లు బలవంతంగా తీసుకుపోతారు. సమిష్టి వ్యవసాయక్షేత్రం

మకార్ ఓరముఖంపెట్టి తీవ్రంగా అతనివైపు చూసేడు. కుడిచెయ్యి గుండెలకదుముకొని నిలబడి వెనకా, ముందూ సందర్భం లేకుండా తీవ్రంగా మాట్లాడడం ప్రారంభించేడు.

"ఆంద్రీ! నేవేమీ బాతాఖానీ కొట్టడంలేదు - నోటికొచ్చినట్లల్లా మాట్లాడగానే సరా! స్టాలిన్ ప్రకటన నా మనస్సుకి యెంతో కలవరపాటు కలిగించడంచేత నేను వోడ్కా త్రాగినమాట నిజం." మకార్ కంఠధ్వని కంపించి యింకా హీనం అయిపోయింది. "ఇక్కడపార్టీ న్యూక్లియస్‌కి నేను సెక్రటరీని—అవునా? అందర్నీ వొప్పించి సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేర్చడానికి యింటింటికీ తిరిగి యెంతప్రచారం చేసేను? సామ, దాన, భేద దండోపాయాలు నాలుగూ వుపయోగించి యెవరిదగ్గర యెట్లా చెప్పాలో చెప్పి పనిచేసేను. మనకి పూర్తిగా వ్యతిరేకులయిన వాళ్ళతో 'సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరవు అన్నమాట? అయితే దానికి అర్థం సోవియటు ప్రభుత్వానికి వ్యతిరేకం అన్నమాటే కాదూ? 1919 లో అంతర్యుద్ధంలో మాకు వ్యతిరేకంగా పోరాడేవు. ఇప్పటికీ ఆ శతృత్వం సాధిద్దామనిచూస్తూన్నావు—అంతే కదూ? సరే—దానికి తగ్గ ప్రతిక్రియ నాకూ తెలుసును; వీడేంచేస్తాడని అనుకుంటున్నావేమో, జాగ్రత్త! ఒక్కణ్ణి చిత్రవధచేస్తే, నీవంటి కుక్కలకందరికీ బుద్ధివస్తుంది.' అని చెప్పేను. ఇందులో అతిశయోక్తి యేమీలేదు. ఈలాగే ప్రచారం చేసేను; అవసరం అయినప్పుడు వొకొక్కచోట చెయ్యికూడా చేసుకోవలసి వచ్చింది. అది లేదనను, అయితే అందరి దగ్గరా అలా చెయ్యలేదు, మనకి పూర్తిగా వ్యతిరేకులయినవాళ్ళ విషయములో తప్ప. ఇప్పుడు నేను త్రాగి వొళ్ళు తెలియని స్థితిలో లేను. మీ కొక నమస్కారం. ఆ అనవసర ప్రస్తావన కట్టిపెట్టండి. ఆరునెలల యీమధ్య యిదే తాగడం—అదయినా యీ ప్రకటనవలన కలిగిన మనోవేదన తగ్గించుకోడంకోసం. ఏమిటి—ఆప్రకటన? మన కామ్రేడ్ స్టాలిన్ చేసిన ప్రకటన యిది. హృదయానికి శూలంలా గుచ్చుకుంది.

కాళ్ళక్రిందనేల అల్లలాడుతూందా అనిపించింది.... .. ....కామ్రేడ్సు ! కోళ్లు మొదలయిన చిన్న జంతువుల్ని సమాజపరం చెయ్యడంలో నేను కొంత వరకు దుడుకుగా ప్రవర్తించి పొరపాట్లు చేసినమాట నిజమే. కాని యెందు చేత అంత దుడుకుగా ప్రవర్తించేను ? మాటమాటకి నన్ను ట్రాట్స్కీయిస్టు అని యెందుకు చెప్పి పొడుస్తున్నారు అనవసరంగా ? మనకామ్రేడు దేవిదోవ్ మరీని. అస్తమానూ నేను అతివాదిననీ, ట్రాట్స్కీయిస్టుననీ అంటూంటాడు. నేను ట్రాట్స్కీలా లేను– అతని సిద్ధాంతాలు కిట్టవు కూడాను – మరి యెందుకు నన్ను అలా పిలుస్తున్నారో కాని ............ మనో వాన్కాయ కన్నులా పార్టీ ఆశయాలనేనమ్మి. రక్తం ధారపోసి పాటు పడుతున్నానేగాని పెద్దనాయకుడులా నా సిద్ధాంతాలు పార్టీమీద రుద్దడానికి ప్రయత్నించడంలేదు."

"మకార్ ! యెంతవరకు అవసరమో అంతవరకే మాట్లాడు. అనవసరపు గొడవఅంతా పెంచి కాలం వృథా చెయ్యడం యెందుకు ? అప్పుడే యెంత టైము వృథా అయిందో చూడు. మనం యేమి పొరపాట్లు చేసేమో, వాటిని యెల్లా సర్దుకుంటే బాగుంటుందో, నీ ఉద్దేశ్యం చెప్పు. అంతేకాని ట్రాట్స్కీలాగ 'నేను పార్టీకోసం పని చేసేను. నేను–పార్టీ' అంటూ యిదేమిటి ?"

"మాట్లాడుతూన్నప్పుడు మధ్యని అడ్డురాకండి." మకార్ కుడి చెయ్యి గుండెలకి యింకా అదుముతూ మునివేళ్ళ మీదలేచి యింకా గట్టిగా మాట్లాడడం మొదలెట్టేడు. "ఆ వెధవట్రాట్స్కీమాట యెత్తకండి నాదగ్గర ! అతనితో పోల్చుకోడం అంత అవమానమైనది ఇంకేదీలేదు. అతనిమాదిరి నేనేమీ ద్రోహిని కాదు. ఇపుడే చెపుతూన్నాను వినండి. ఎవడయినా నన్ను ట్రాట్స్కీయిస్టు అన్నట్లయితే పేగులుతోడి మెళ్ళో వేసుగుంటాను. ముక్కులకింద తెగగొట్టి చిత్రవధచేస్తాను. కోళ్ళవిషయంలో నేను కొంచెం తొందరపడ్డమాట నిజమే. ఎందుచేత—ప్రపంచ విప్లవం త్వరగా రావా

అన్న ఆతురతకొద్దీ; అంతేకాని ట్రాట్స్కీ పక్షంవాణ్ణి అవడంచేత కాదు. ఎవరికీ స్వంతఆస్తి లేకుండా చేసి పెట్టీ బూర్జువాలని యెంత త్వరగా నొక్కేస్తే ప్రపంచ విప్లవం అంతత్వరగా వస్తుందని అనుకున్నాను. ప్రపంచ పెట్టుబడిదారీ విధానంమీద తీసే ప్రతి దెబ్బ, దాని అంతాన్ని అంతకంతకి దగ్గరికి తీసుకువస్తుంది. తెలిసిందా? ఏం, మాట్లాడవేం? ఆ విషయం అలా వుంచుదాం. కామ్రేడ్ స్టాలిన్ చేసిన ప్రకటన దృష్ట్యా నేనెల్లాంటివాడిని. దానిలో మధ్య వొకచోట ఇల్లావుంది." మకార్ గొర్రె చర్మపు కోటు జేబులోనుంచి ప్రవదా పత్రిక తీసి, పేజీలు తిరగేసి నెమ్మదిగా చదవడం మొదలెట్టేడు. 'ఈ అపార్థాలు' సమిష్టివ్యవసాయక్షేత్ర నిర్మాణ వుద్యమంలో మనం చూపించే నిరంకుశ విధానము, రైతులమీద చేసే జబర్దస్తీలు, లాభించేది యెవరికి? ఎవరికీకాదు, మన శత్రువులకే; ఈ అపార్థాలవల్ల కలిగే ఫలితం యేమిటి? సమిష్టి వ్యవసాయ క్షేత్ర వుద్యమానికి అపఖ్యాతి కలిగించడం మన శత్రువులకి సందుయివ్వడం.' తీవ్రవాదులం అనుకుంటూ యీ తప్పుడు వ్యాఖ్యానాలు చేసేవాళ్ళంతా మితవాద, అవకాశవాదాలకి తావిస్తూన్నారని విశదమేకాదూ? దీనినిబట్టిచూస్తే నేను నిరంకుశంగా ఆర్డర్లు జారీచేస్తూ, పార్టీ పోలసీకి అపార్థాలు కలిగిస్తూ, సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణోద్యమానికి అపకీర్తి కలిగించి మితవాదులుచేసే దుష్ప్రచారానికి సాయపడుతున్నానన్నారు. వెధవ కోళ్ళమూలాన వచ్చింది, ఇదంతా! సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోచేరి దాన్ని ధ్వంసం చెయ్యడానికి ప్రయత్నించిన ద్రోహులమీద తీవ్రచర్య తీసుగోకూడదట. దానిలో యేమీ అర్థంకాదు. ఎంతో శ్రమపడి యేర్పాటుచేసిన సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్ని యింతటితోవదిలి, వచ్చిన దోవ పట్టమంటూంది యీ ప్రకటన. పోలులమీదికి, రాంగిల్ సేనానిమీదికి పటాలాలని నడిపించిన అనుభవంవుంది నాకు. శత్రువుమీదికి వొకసారి బయలుదేరిన తరువాత మధ్యగా యెప్పుడూ వెనక తిరగకూడదు."

"ఇప్పుడు నువ్వు పటాలాన్ని వెనకవదలి ఒంటరిగా శత్రువుల కేసి ముందుకి పోతున్నావు" అన్నాడు రజ్మనోవ్ ముఖం చిట్లిస్తూ. "మకార్ నీ ఉపన్యాసం యింక చాలిస్తూ; నీమూలాన్ని అసలు విషయా లన్నీ ఆడ్డే పుంతిపోయేయి. పార్టీ సెంట్రల్ కమిటీకి నువ్వు సెక్రటరీగా వచ్చినప్పుడు వెనుకంజ వెయ్యకుండా యెదురుకుందువుగానిలే. ఇప్పుడు నువ్వు మామూలు సైనికుడవు; పంక్తులు తప్పేవంటే జబ్బపుచ్చుకు లాగేస్తారు!"

"అంత్రీ—పానకంలో పుడకలా అడ్డంవస్తూండకు. పార్టీ ఆజ్ఞలన్ని టికీ ఒప్పుకొన్నాను. ఇప్పుడు నేను మాట్లాడుతూంట పార్టీ మంచికోరి గాని వాట్ని ఎదిరించడానికి కాదు. కామ్రేడ్ స్టాలిన్ కూడా, ఆ యా ప్రదే శాలలోని పరిస్థితులనుబట్టి పని చేస్తూండాలని వ్రాసేడు—లేదా? అటువం టప్పుడు ఆ ప్రకటన దాన్ని వ్యతిరేకిస్తూందని చెప్పలేము. మేము అనగం గేము : మకార్ సాంప్రదాయపద్ధ నిరంకుశుడు కాదు, పెద్దాయన లీస్తావేసే వాటిలో ఎటువంటివా లేదే? ఆ చిన్న మార్పయినా చాల్లా ఎట్టయిస్తాయి. కామ్రేడ్ స్టాలిన్ కనక గ్రియామీజాగ్ వచ్చినట్లయితే 'కామ్రేడ్ జోసెఫ్ విసారియోనివిచ్! మధ్యతరగతి రైతులకి వాత్తిని కలిగించడం మీకు యిష్టం లేదా? నెమ్మదిగా వచ్చి కూర్చోపెట్టి నయాన్ని వాళ్ళని ఒప్పించాలన్ని మాట. అయితే పూర్వం విప్లవ వ్యతిరేకులతో కలిసి పనిచేసిన సాధా రణ రైతు వొకడున్నాడనుకోండి—అతను స్వంత ఆస్తి వదలిపెట్టడానికి అంగీకరించడు. అటువంటివాణ్ణి మంచిమాటలవల్ల సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేర్చి ప్రపంచ విప్లవానికి అనుకూలుడుగా చెయ్యడానికి యెన్ని దేనా సాధ్యమవుతుందా? ఒకవేళ సమిష్టివ్యవసాయ క్షేత్రంలో చేరినా స్వంత ఆస్తియెడ మమకారం వదలిపెట్టలేడు. ఎంతసేపూ అతని పశు వుల్ని మిగిలినవాటికంటె బాగా చూసుకుంటూంటాడు' అని చెబుతాను. అక్కడికీ పరిస్థితులన్నీ చూసేకకూడా కామ్రేడు స్టాలిన్ నేను సమిష్టి

వ్యవసాయ క్షేత్ర నిర్మాణోద్యమానికి అపకీర్తి తెస్తున్నాననీ, అతి దుడుకుగా ప్రవర్తిస్తూన్నాననీ అన్న వుద్దేశ్యం మార్చుకోక పోయినట్లయితే "కామ్రేడ్ స్టాలిన్ ! నాకంటె బాగా పనిచేసేవాడి నెవడినేనా ఆ పనిలో నియమించండి. అంతర్యుద్ధంలో నా ఆరోగ్యమంతా పూర్తిగా చెడిపోయింది. అందుచేత యీపని నాసాధ్యంకాదు. నన్ను చీనా సరిహద్దు ప్రాంతానికి పంపించండి. అక్కడ పార్టీకి నా సహాయం చాలా అవసరమవుతుంది. గ్రిమాచీలో మన ఆండ్రీవుండి, యీ సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్మాణం సాగిస్తాడు. చేతులు నలుపుతూ వంకర దండాలు పెట్టడం అతనికి బాగా చేతనవును. అందుచేత పూర్వం మనతో పోరాడిన విప్లవ వ్యతిరేకుల దగ్గర అతి అణకువగా వుంటూ కాలక్షేపం చెయ్యగలడు.........ఆ విషయంలో మహానుభవం వుంది మనవాడికి' అని చెప్పేస్తాను"

"మకార్ ! నాసంగతి యెత్తకు, లేకపోతే వొకడోసు యివ్వవలసి వస్తుంది........"

"ఇవివరకుదే యెక్కువయింది అనుకుంటూంటే మళ్ళీ యింకో డోసు కూడానా ?– ఆపనిమాత్రం వద్దు." అంటూ దేవిడోవు లేచి తిన్నగా మకార్ దగ్గరకి వెళ్ళి "కామ్రేడ్ నగుల్నోవు ! కామ్రేడు స్టాలిన్ 'ఆర్టికిల్' సెంట్రలు కమిటీ అంగీకరించినదే; నువ్వు ఆ ఆర్టికిల్ అంగీకరించవా ?" అని అడిగేడు.

"నేను అంగీకరించను."

"పోనీ చేసిన పొరపాట్లు అంగీకరిస్తావా ? నామటుకునేను అంగీకరిస్తాను. బుకాయిస్తే లాభంలేదు. కోళ్ళు, చిన్నమాడలు. మొదలయిన వాటిని సమాజపరం చెయ్యడం తప్పు అని అంగీకరించడమే కాకుండా ఆ తప్పు సవరిస్తాను కూడాను నేను. మనం యెంతసేపూ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చాలామంది రైతుల్ని చేర్చడానికే ప్రయత్నించేము. కాని దానిని జయప్రదంగా నడిపించడానికి చేసిన ప్రయత్నం తక్కువ

ఇది ముఖ్యంగా డిస్ట్రిక్టు కమిటీ తప్పు అయినప్పటికీ మన లోపంకూడ లేకపోలేదు. కాన్ఫరెన్స్ నగుళోన్నవు! యిది నువ్వు అంగీకరిస్తావా?"

"ఆ—అంగీకరిస్తాను."

"అయితే నువ్వు అనేది యేమిటి?"

"ఆర్టికిల్ లో కొన్ని లోపాలు వున్నాయి........"

దేవిదాసు టేబులుమీది గుడ్డ సరిచేస్తూ వొకనిముషం పూరు కున్నాడు. అవసరం లేనిదే టేబులుమీదనున్న కాగితాలు మొదలయినవి అక్కడివి యిక్కడ. యిక్కడివి అక్కడా సర్దేడు. ఎంతదాచడానికి ప్రయత్నించినా ఆందోళన అతని ముఖంలో స్పష్టంగా కనిపిస్తూంది.

"శుద్ధ మొద్దులా వున్నావే! మరొకచోట అయినట్లయితే యిప్పుడు నువ్వు అన్నమాటలకి వెంటనే పార్టీలోనుంచి తొలగించేసి వుందురు! యేమీ సందేహం లేదు! మతి పోయిందా యేమిటి? వెంటనే.......... నీప్రాతికూల్యం విడిచిపెట్టు లేకపోయినట్లయితే మేము........ ...యేమీ అనుమానం లేదు! చాలావరకు ఓరిమి పట్టేము. దేనికైనా మితం వుంది. ఏమయినాసరే మాననంటావా? కానీ! పార్టీపోలసీని ప్రతిఘటిస్తున్నావని అధికారరీత్యా జిల్లా కమిటీకి తెలియచేస్తాము."

"చెయ్యండి. అంతకంటె యేంచేస్తారు? మీకంటె ముందు నేనే తెలియబరుస్తాను. దేనికొని కొట్టడానికి, అన్నిటికి యేకంగానే చెప్తాను సమాధానం."

అప్పటి మకార్ స్థితి, కంఠస్వరము చూసేటప్పటికి దేవిదాసు కోపం యెక్కడిదక్కడ పోయింది.

"మకార్ నువ్వు మాట్లాడేది నీకే తెలియదనుకుంటాను. వెళ్ళి పోయి శుభ్రంగా నిద్రపో — తరవాత మాట్లాడుదువుగాని. ఇప్పుడు మన సంభాషణవింటే వొకసారి నువ్వుచేసిన పొరపాట్లు అంగీకరిస్తానంటావు;

అంతలోనే మళ్ళీ స్టాలిన్ ఆర్టికల్‌లో కొన్నిలోపా లున్నాయంటావు. ఆర్టికల్‌లో లోపాలున్నట్లయితే యింక నువ్వు చేసిన తప్పులు వొప్పు కున్నట్లు యెలా అవుతుంది. అంతా కలగాపులగం చేసేసి గంద్రగోళ పడుతూన్నావు. యేమీ అనుమానంలేదు ! యింకోవిషయం. ఇంతవరకు పార్టీన్యూక్లెస్ సెక్రటరీ యెవరయినా తప్పతాగి న్యూక్లెస్ మీటింగుకి రావడం వుందా ? నగుల్నోవ్ ! అది యెటువంటిపనో యెరుగుదువా ! పార్టీకి మహా అపచారం అన్నమాట. పోనీ యేమీ తెలియని వాడవేమో అనుకోడానికి మళ్ళీ — చాలాకాలంనుంచి సభ్యుడుగా వుంటూన్నావు. రెడ్‌పార్టి జాన్ దళాలలో పనిచేసేవు. ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్ పతకాన్ని పొందేవు కూడాను ! అటువంటివాడవు అలాత్తుగా యిల్లా ప్రవర్తిస్తున్నావంటే యే మనుకోను ! .................. నైడియనోవు కూడా వున్నాడిక్కడ; నిన్నుచూసి యేమనుకుంటాడు అతను ? నువ్వు పార్టీ మీటింగులకి వచ్చేటప్పుడుకూడా త్రాగుతున్నావనీ, ఆయుధాలతో రైతుల్ని చంపుతానని బెదరించడమే కాకుండా, పార్టీపోలసీకి భిన్నంగా ప్రవర్తించి పైగా సమర్థించుగుంటున్నా వనీ, కంట్రోలు కమీషనుకి తెలిసిందంటే యేమవుతుందో తెలుసునా ? సెక్రటరీ పదవినుంచి తొలగించడమేకాదు. ఆఖరుకి మామూలు సభ్యుడుగా కూడా వుండనివ్వరు. యింకా నీకు తెలియదేమో ! యిదే చెప్పడం నీకు!" దేవిడోవు వేళ్ళ జుట్టులోకి జొనిపి చిందరవందరచేస్తూ, 'మకార్ మనస్సుకి నాఛేటట్లు బాగా మాట్లాడేను' అన్నట్లుగా అతనికేసి చూసేడు. "ఆ ఆర్టి కల్‌ను గురించి చర్చ పెట్టదల్చుగోలేదు. పార్టీపోలసీని వేలెత్తి చూపించ డానికికూడ అవకాశంలేదు. పార్టీ నీ సలహా యెన్నడూ అంగీకరించదు. కొమ్ములు తిరిగినవాళ్ళ అనేకమంది పార్టీని యెదిరించి శృంగభంగంపొంది చివరికి దోసిలొగ్గేరు. అటువంటప్పుడు నీ లెక్క యెంత !"

"అతని వాక్కడికోసం కాలం అంతా వృధా చేస్తూన్నారు. అప్పుడే గంటసేపటినుంచి మాట్లాడుతూన్నాడు. చెప్పినదే మళ్ళీ చెపు

పొందడం. వెళ్ళి నిద్దరపోనియ్యండి. మకార్! వెళ్ళిపో! అప్రతిష్ఠకూడాను! ఒక్కమాటు అద్దంలో చూసుకో యెల్లావున్నావో. నిన్ను చూసి నువ్వే భయపడతావు. మొహం అంతా వుబ్బిపోయింది. కళ్లు పిచ్చికుక్క కళ్ళలా వున్నాయి. ఏమిటి యీ వేషం అంతా ; వెంటనేపో!" రజ్మటోవ్ గభా లునలేచి మకార్ జబ్బ పుచ్చుకొని గట్టిగా గుంజేడు. మకార్ చెయ్యి విదలించుకొని నిర్లిప్తంగా కుప్పకూలి కూర్చున్నాడు.

అంతా నిమ్మకి నీరుపోసినట్లు కూర్చున్నారు. దేవిదోవు బల్లమీద వేళ్ళతో టకటకా వాయిస్తున్నాడు. చిరునవ్వునవ్వుతూ, నగుల్నోవ్ కేసి చూస్తూ కూర్చున్న వేనియా నైడియనోవు "కామ్రేడ్ దేవిదోవు, యెందుకు యీ కాలక్షేపం – ప్రారంభం చెయ్యండి." అన్నాడు.

"సరే. కామ్రేడ్సు. చిన్న చిన్న జంతువుల్నీ, ఆవుల్నీ యెవరివి వారికి, యిచ్చెయ్యాలని. నేను ఉపపాదిస్తూన్నాను. కాని, రెండేసి ఆవులు కాని, అంతకంటె పైగాకాని యిచ్చినవాళ్ళనిమాత్రం ఎల్లాగైనా వొప్పించి, ఒక్క ఆవునిమాత్రం సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి యిచ్చేలా చెయ్యాలి. మొట్టమొదట మనం చెయ్యవలసిన పని, రేపు వుదయాన్నే గ్రామస్థుల్ని అందరినీ సమావేశపరచి, ప్రస్తుత పరిస్థితి తెలియచెయ్యాలి. ఇప్పుడు మన శక్తిఅంతా ప్రజలకు నచ్చచెప్పడంలోనే వుపయోగించాలి. వ్యవసాయపు పనులు ప్రారంభించవలసిన రోజులుకూడా వస్తున్నాయి. అంతా కూడా సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యత్వానికి రాజీనామాలు యిచ్చి వెళ్ళిపోతారేమో అని భయంగావుంది నాకు. మకార్ ! నీ పస యేమేనావుంటే యిప్పుడు చూపించాలి, చేతనయితే భయపెట్టకొకుండా, మంచిమాటలు చెప్పి వాళ్ళని సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి విడిపోవద్దని ప్రోత్సహించు. సరే, నా ఉపపాదనమీద సమ్మతులు తీసుకుందామా ? అనుకూలు రెవరు ? మకార్ నువ్వు వోటుచెయ్యవా ? సరే. మినిట్సుబుక్కులో వొకడు తటస్థం అని నోటు చెయ్యండి."

మార్మాట్సు (పందికొక్కులు) ని చంపడం ఆ మరునాడే ప్రారంభించాలని రజ్మట్నోవు ఉపపాదించేము. అందుకోసం అని సముష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల్ని, తీరుబడిగా వున్నవాళ్ళని, బళ్ళమీద నీళ్లు పట్టించుకు వెళ్ళడానికి ప్రూక్ఫోని స్కూలు పిల్లల్ని, అందరిని పంపించి, కన్నాలలో నీళ్లుపోసి ఆ మార్మాట్సుని పైకి తెప్పించి చంపడంలో వాళ్ళకి సహాయం చేయించడానికి నిశ్చయం అయింది.

నగుల్నోవు విషయం యేమిచెయ్యడానికి దేవిదోవుకి తోచింది కాదు. సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్మాణంలో అతివాద ధోరణి అవలంబించి చేసిన పొరపాటు పనులు తిరిగి సర్దుబాటు చేసుకోనందుకు, స్టాలిన్ ఆర్టికల్‌ను యెదిరించినందులకు అతనిని పార్టీయెదుట సరియయిన సంజాయిషీ ఇయ్యవలసిందనే విషయం తీసుకురావాలా కూడదా; ఏది నిశ్చయించుకోలేక మీటింగు ముగిసేక నగుల్నోవు వయిపుచూసి, అతడు దిగాలుపడి, తెల్లముఖంవేసి కూర్చుండడం చూసి జాలిపడి, "పోనీ యీసారికి వూరుకుందం. క్రమంగా అతనే గుర్తిస్తాడు. చేసినది యెంత తప్పయినా, మన మనిషి. మూర్ఛవొస్తూంటుంది: ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది ఈ విషయం యెక్కడా యెత్తకుండా యింతటితో ఆపేస్తాను." అనుకున్నాడు.

మీటింగు పూర్తి అయిపోయేవరకూ మకార్ అలాగే నిశ్శబ్దంగా కూర్చున్నాడు మనస్సులోని ఆందోళనపైకి కనబరచకుండా దేవిదోవు వొకసారి అతనికేసి చూసేటప్పటికి, తొడలమీద వేసుకుకూర్చున్న అతని చేతులు వొణికిపోతూండడం గుర్తించేడు.

రజ్మట్నోవుని దగ్గరకిపిలిచి "మకార్‌ని యీరాత్రికి మీ యింటికి తీసుకుపోయి, తాగకుండా జాగ్రత్తగా చూస్తూండు." అని చెవులో చెప్పేడు. అంగీకార సూచకంగా రజ్మట్నోవు తల ఆడించేడు.

మాట్లాడకుండా యే మూలో కూర్చుంటూవచ్చిన సాధారణ రైతులే. వీళ్ళంతా, చేరకపోతే ప్రభుత్వం యేంచేస్తుందో అనే భయంచేతో, అంతా చేరుతూన్నారు మనం చేరుదాం' అనే వుద్దేశ్యంతోనో చేరేరుకాని, మన స్ఫూర్తిగా చేరినవాళ్ళు కారు.

రాజీనామా పత్రాలు చూడగానే దేవిడోవు వాళ్ళకి తొందర పడ వద్దనీ, మళ్ళీ ఆలోచించవలసిందనీ యెంతోదూరం చెప్పేడు. కాని వాళ్ళు ఆవేమీ చెవిని పెట్టకపోవడంచేత చివరకు ప్రాణం విసిగి,

"సరే—మీ యిష్టం. కాని, మళ్ళీ చేర్చుకోవలసిందని వచ్చినప్పుడు బాగా ఆలోచించండే చేర్చుకోము. ఆ విషయంమాత్రం జ్ఞాపకం వుంచు కోండి" అన్నాడు.

"మళ్ళీ మీదగ్గరకి వచ్చినప్పుడు అలాగే అందురుగానిలెండి. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేరవలసిన అవసరం రాదనే అనుకుంటున్నాము. ఇంతవరకూ యేలాగో గడుపుకొచ్చాము; తిండిలేక యెవరం మాడి చచ్చి పోలేదు. మా పాట్లు మేం పడుతున్నాము. ఆమాత్రం వ్యవసాయం చెయ్యడం మాకు తెలియకపోలేదు. ఎప్పుడూకూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరవలసిన అవసరం వుండదనే అనుకుంటూన్నాము. అందు కోసం యెప్పుడూ విచారించము" అన్నాడు యివాన్ బెటలిశ్చికోవు మిగి లినవాళ్ళ అందరి తరపునా.

"మీరు లేకపోతే మాకేమీ అడ్డము. 'అయ్యో వెళ్ళిపోతూన్నారే!' అని మీకోసం యెవరమూ బెంగపెట్టుకోలేదు. అవసరంలేని చెత్తవొదలి పోతేనే సుఖం." అని దేవిడోవు కుక్కకాటుకి చెప్పుదెబ్బలా సమాధా నము చెప్పేడు.

"అంతా అయిపోయిన తరువాత యిప్పుడుమనకి పేచీ యెందుకు లెండి. ఎవరిగోప్యం వాళ్ళు కాపాడుకుంటేనే మంచిది. మా పశువుల్ని మేము తీసుకుపోవచ్చా?"

"వీల్లేదు. మేనేజిమెంటు కమిటీ యీ విషయంలో ఆలోచిస్తాము. రేపటివరకూ ఆగండి."

"ఆగడానికి తీరుబడిలేదు. మీరు యిప్పుడు కాకపోతే యింకో నెల్లాళ్ళకి మొదలెడతారు దల్లికలు. మీకేం? రేపటినుంచే ప్రారంభించాలి మా పనులు. రేపు వొక్కరోజూ చూస్తాము. అప్పటికీ యివ్వకపోతే మా అంతట మేమే తీసుకుపోతాం."

దేవిదోవుకి ఆరికాలు మంట నెత్తికెక్కింది.

"మేనేజిమెంటు కమిటీకి తెలియకుండా యేలా తీసుకువెడతారో చేసూ చూస్తాను! ఇల్లాంటి వెర్రివెర్రి వేషాలేస్తే వాటిని అసలు యివ్వక పోవడమునరేకదా. పైగా మీరు కోర్టులో సమాధానము చెప్పవలసి వస్తుంది మీరు చేసిన పనికి."

"మా పొలాన్ని మేము తీసుకుపోయినందుకే?"

"ప్రస్తుతం మటుకు అవి సమిష్టి వ్యవసాయ క్షేత్రానివికాని మీవి కావు."

వీళ్ళు రాజీనామాలు యిచ్చినందుకు దేవిదోవుకి యేమీ అనిపించ లేదు. కాని 'మూగడైమిడ్' రాజీనామాపత్రం చూసినప్పుడుమాత్రం అతని మనస్సు కించపడింది. మధ్యాహ్నం బాగా ప్రొద్దు వాలిపోయిన తరువాత డైమిడ్ చెడత్రాగి వొళ్ళు తెలియని స్థితిలో వచ్చేడు. కాని ఆ స్థితిలోకూడ మౌనంమాత్రం అతనిని వదలిపెట్టలేదు. మాటా మంతీ యేమీ లేకుండా "సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యత్వానికి రాజీనామా యిస్తున్నాను." అని మూడే ముక్కలు వ్రాసియున్న కాగితం తీసుకువచ్చి దేవిదోవు ముందు పెట్టేడు.

దేవిదోవు. అతిముక్తసరిగా యున్న ఆ అప్లికేషన్ తిరగా బోర్లా వేసి చూసేడు.

"ఏమిటిది ?" దేవిదోవు కంఠస్వరంలో ఆశ్చర్యం, అసంతృప్తి ప్రతి ధ్వనించేయి.

"నేను వెళ్ళిపోతూన్నాను."

"ఎక్కడికి ? ఎందుచేత ?"

"సమిష్టి వ్యవసాయ క్షేత్రం బయటికి"

"ఎందుచేత వదలి వెళ్ళిపోతూన్నావు ? ఎక్కడికి వెడతావు ?"

డైమిడ్ మాట్లాడలేదు. రెండు చేతులు బార్లా చాపేడు.

"ప్రపంచం నాలుగు మూలలకీకూడా పోతావా ?" అన్నాడు రజ్మట్నోవు.

"ఆ—అది ! బాగా చెప్పేవు."

"కాని వెళ్ళిపోడానికి కారణం యేమిటి ?" దేవిదోవు గుచ్చి అడిగేడు, బాగా కష్టించి పనిచేసే బీదరైతు రాజీనామాకి విస్తుపోయి.

"అందరూ వెళ్ళిపోతూన్నారు..................వాళ్ళతోపాటు నేనూ వెళ్ళిపోతూన్నాను."

"మిగిలినవాళ్ళంతా పర్వత శిఖరంమీదనుంచి తలక్రిందులుగా పడితే నువ్వుకూడా పడతావా ?" అని రజ్మట్నోవు నవ్వుతూ అడిగేడు.

"నాకు తోస్తే సరి." డైమిడ్ విరగబడి నవ్వేడు.

"సరే, బాగుంది. అంతటితో చాలించండి." అన్నాడు దేవిదోవు. "ఆవునికూడా తీసుకుపోవచ్చు నువ్వు. చాలా బీదవాడవు కనక వెంటనే యిచ్చేస్తున్నాము. రజ్మట్నోవ్, యిచ్చెయ్యద్దూ ?"

"తప్పకుండా." అని రజ్మట్నోవు అంగీకరించేడు. కాని డైమిడ్ వురుము వురిమినట్లు పెద్దనవ్వు నవ్వి,

"ఆ ఆవు అవసరం యేమీ లేదు నాకు. సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి యిచ్చేస్తున్నాను." అంటూ బయటికి వెళ్ళిపోయేడు.

దేవిదోవ్ కిటికీలోనుంచి బయటకి తొంగిచూసేడు. డైమిడ్ వరండాలో నిలబడియున్నాడు. సాయంసమయపు నీరెండ తళుకులు తేలియున్న అతని నడ్డిమీద, బాగా బిగిసియున్న బూడిదవన్నెపు మెడమీద, భుజాలవరకూ వేళ్ళాడుతూన్న బంగారు వర్ణపు జుట్టుమీదా పడి, ప్రతిఫలిస్తూంది. ఆ దొడ్డి అంతటా సూర్యరశ్మికి కరగిన మంచునీళ్ళ మోరాలు లోతున వున్నాయి. వరండా దగ్గరనుంచి ధాన్యపు కొట్టువరకూ అంతా రొంపిగా వుంది. వీధి గేటు దగ్గరనుంచి వచ్చేవారే. కరుగుతూన్న మంచులోనుంచి ఎనుగు జాడలు పడ్డాయి. ఆఫీసులోకి వచ్చేవాళ్ళంతా గేటు దగ్గరనుంచి సరిక్రొత్త పట్టుకొని అవారే నడిచివస్తూన్నారు. డైమిడ్ యేదో ఆలోచిస్తూన్నట్లు కొంచెంసేపటివరకూ అలాగే నిలబడ్డాడు. ఉన్నట్టుండి అలాస్తగా ఆ నీళ్ళలోనుంచి ధాన్యపు కొట్టువైపు బయలుదేరేడు.

ఏం చేస్తాడోనని దేవిదోవ్ అతని వైపు చూస్తూన్నాడు. డైమిడ్ ధాన్యపుకొట్టు గుమ్మాల దగ్గర పడియున్న యినుపకడ్డీ చేతపుచ్చుకొని వీధి గేటువైపు బయలుదేరేడు.

"ఇంకా నయమే — అది తీసుగుని మనమీదికి వచ్చేడు కాదు." అన్నాడు అప్పుడే కిటికీదగ్గరకి వచ్చి చూస్తూన్న రజ్మట్నోవు. డైమిడ్ చాలా బలమైనవాడని, అతన్నిచూస్తే రజ్మట్నోవుకి గౌరవం.

డైమిడ్ గేటుతలుపులు తీసి చేతిలోని యినుపముక్క మంచుదిబ్బ మీదికి విసిరేటప్పటికి ఆ తాకుడికి పెద్దగడ్డ వూడి అవతల పడింది. ఆ ఖాళీలోనుంచి దొడ్లోని నీరు కాలవగట్టి వీధులోకి ప్రవహించింది.

"మళ్ళీ అతనొచ్చి యెల్లాగా జేస్తాడు." రజ్మట్నోవు దేవిదోవు భుజంమీద చెయ్యివేసి డైమిడ్‌ని చూపిస్తూ అన్నాడు. "చూసేవా, యిక్కడ నీరు నిలచి యిబ్బందిగావుందని తోచి, విడగొట్టేసి వెళ్ళిపోయేడు. అంటే అతని ఆత్మని యిక్కడ వదిలేసి వెడుతూన్నాడన్నమాట. కామా?"

స్టాలిన్ ఆర్టికల్ అచ్చుపడ్డ వార్తాపత్రికలు రాగానే, జిల్లా కమిటీ సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణానికి సంబంధించిన సమస్యలమీద గ్రామాలకి

పార్టీ న్యూక్లియస్‌కి విపులమైన సలహాలు పంపించింది. కాని బలవంతంగా సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో చేర్పించినందువల్ల కలిగిన దుష్ఫలితాల్ని పోగొట్టడానికి నిర్దిష్టమైన సూచనలేవీ యివ్వలేదు. స్టాలిన్ ఆర్టికిల్ జిల్లా కమిటీలో అందరికీ దిగ్భ్రమ కలిగించి యుంటుంది. అందుచేత వాళ్ళు కూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు యేలా పని చేస్తున్నాయో చూడడానికి కూడా రాలేదు. సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యత్వానికి రాజీనామా యిచ్చిన రైతుల ఆస్తి యేంచెయ్యాలనే విషయమై స్థానికవర్కర్లు అడుగుతే జిల్లా కమిటీగాని, జిల్లాఅగ్రికల్చరల్ యూనియనుగాని సమాధానం యివ్వలేదు. కాని, సెంట్రలు కమిటీ "సమిష్టి వ్యవసాయ క్షేత్ర నిర్మాణోద్యమంలో పార్టీపంథావదలి తప్పుదోవ పట్టిన వారిని సరిదిద్దడం" అనే తీర్మానం ప్రకటితమైనతరువాతమాత్రం జిల్లా కమిటీలో కదలిక పుట్టింది. ప్రవాసానికి పంపబడ్డ కులక్‌ల జాబితా పంపమనీ, కోళ్ళు, బాతులు, గొర్రెలు, పందులు మొదలయినవాటిని యెవరివి వారికి యిచ్చెయ్యమనీ, ఓటింగుహక్కు రద్దుచేసినవారి విషయమై పునరాలోచన చెయ్యవలసిందనీ గ్రిమాచీకి తాఖీదులు వచ్చేయి. అదేసమయంలో జిల్లాకమిటీబ్యూరో, జిల్లాకంట్రోలు కమీషను మార్చి 28 వ తేదీ 10 గం॥కు సమావేశమౌతాయనీ, ఆ సమావేశంకి హాజరు కావలసిందనీ నగుల్నోవుకి జిల్లాకమిటీ తెలియబరచింది.

---

## ముప్ఫయ్యో ప్రకరణము

### వి డా కు లు.

వారంనాటికి గ్రిమాచీలాగ్ సమిష్టి వ్యవసాయక్షేత్రంలో నుంచి సుమారు వందమంది రైతులు విడిపోయేరు. అన్ని దళాలలోకంటె రెండవ దళంలోవాళ్ళే చాలమంది వెళ్ళిపోయేరు. పోయినవాళ్ళు పోగా యింక ౯

దళంలో 19 మందిమాత్రం మిగిలేరు. ఆ దళనాయకుడు ఋబిష్కిన్ అన్నట్లు వీళ్ళలోనుంచికూడా యింకా కొంతమంది వెళ్ళిపోతారని అను కుంటున్నారు.

గ్రామం అంతా అల్లకల్లోలంగా వుంది. రోజు రోజూ మారు తూన్న పరిస్థితులు చూసేటప్పటికి దేవిడోవ్‌కి మనస్సు మనస్సులో లేదు. పశువుల్ని, వ్యవసాయ పనిముట్లని, యెవరివి వారికి వెంటనే యిచ్చె య్యాలా లేక వ్యవసాయపు అను అయినతరువాత ఇయ్యాలాఅన్న విష యాన్ని గురించి తెలియచెయ్యవలసిందని దేవిడోవు పై అధికారులకి యెన్నిసార్లు వ్రాసినప్పటికీ, జిల్లా అగ్రికల్చరల్ యూనియనూ, పార్టీకమిటీ కూడా సమిష్టి వ్యవసాయ క్షేత్రం యేలాగైనా నిలబెట్టవలసిందనీ, సాధ్య మైనంత హెచ్చుమంది సభ్యుల్ని రాజీనామాలు యివ్వకుండా ఆపవలసిం దనీ, వేసవివరకూ రాజీనామాలు యిచ్చినవాళ్ళ ఆస్తుల్ని యివ్వకుండా ఆపి వుంచవలసిందనీ తెలియచేసేరు.

ఆటుతరువాత రెండురోజులకు జిల్లా అగ్రికల్చరల్ కమిటీ ప్రధాన అధికారి, డిస్ట్రిక్టు కమిటీ బ్యూరోలో సభ్యుడు అయిన బెగ్లిక్ గ్రిమాచీ లాగ్ వచ్చేడు. అతడు ఆ వొక్క రోజులోనే చాలావూళ్ళు తిరగవలసి యుండడంచేత హడావిడిగా అక్కడి పరిస్థితులన్నీ తెలుసుగుని,

"ఎటువంటి పరిస్థితులలోనూకూడా మీరు రాజీనామా యిచ్చిన వాళ్ళకి వారి పశువుల్నీ, వ్యవసాయపనిముట్లనీ యింతట్లో ఇయ్యవద్దు. వేసవివరకూ జరపండి; తరువాత అప్పటి పరిస్థితులని బట్టి ఆలోచిద్దాం." అన్నాడు.

"ఇస్తారా - చస్తారా అని పీకమీద కూర్చున్నారు." అని దేవిడోవ్ తనకున్న యిబ్బందులు చెప్పబోయేడు. బెగ్లిక్ తలపంకించి చిరునవ్వు నవ్వేడు.

"న్యాయంగా ఆలోచిస్తే యెవరిఆస్థి వాళ్ళకి యిచ్చెయ్యవలసిందే." అన్నాడు. "కాని వర్గసిద్ధాంతాన్నిబట్టి చూస్తూ, కొందరు ప్రత్యేకవ్యక్తుల విషయాలలో తప్ప, ఎవరికీ ఇయ్యవద్దని రిజియనల్ కమిటీ ఉద్దేశ్యం."

"అంటే ?"

"బాగుంది. యీ 'అంటే'లు యేమీ అవసరం లేకుండానే అర్థము చేసుకోవలసింది మీరు. బీదవాళ్ళవి వెంటనే యిచ్చెయ్యండి. మిగిలిన వాళ్ళకి వేసవిలో యిచ్చేస్తామని చెప్పండి. ఇప్పుడు అర్థంఅయిందా ?"

"అయితే 'నీ యెడమ చెయ్యి తియ్యి. నాపుర్రచెయ్యి పెడతాను' అన్నట్లు అందర్నీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేర్చాలన్నదానికి, దీనికి భేదం యేమిటి ? సాధ్యమైనంత త్వరలో రైతుల్ని అందర్నీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేర్చాలని డిస్ట్రిక్టు కమిటీ తాఖీదులు పంపించడంచేత మేము యిష్టం వున్నవాళ్ళనీ లేనివాళ్ళనీకూడా హడావిడిగా చేర్చేసేము. ఇప్పుడు వెళ్ళిపోతామన్న రైతులకి వాళ్ళ పశువుల్ని యివ్వకపోయినట్లయితే వాళ్ళమీద వొత్తిడి తీసుగువస్తూన్నామన్న మాటే కాదూ ? ఏంపెట్టి వ్యవసాయం చేస్తారు ?"

"వాళ్ళు యేంచేసేదీ మీకు అవసరం లేదు. ఎంతసేపూ సమిష్టి వ్యవసాయ క్షేత్రపు విషయం తప్ప, ఏరైతు యెల్లాపోయినా మీకు అవసరం లేదు. పశువుల్ని అన్నిటినీ యెవరివి వారికి యిచ్చేస్తే మీరుమాత్రం యెల్లాచేస్తారు వ్యవసాయం ? అయినా యిది రిజియనల్ కమిటీ ఆజ్ఞకాని మనదికాదు. ఆజ్ఞలకి బద్ధులమై యుండవలసినదేకాని మనం మళ్ళీ మారు మాట్లాడడానికి వీలులేదు. 50% పశువుల్ని తిరిగి రైతులకి యిచ్చేసినట్లయితే, అనుకున్న అంచనాప్రకారం పని యెల్లా నెరవేరుతుందనుకుంటున్నారు ? ఇంక అలాంటివేమీ పనికిరావు. మన స్వాధీనంలోవున్న పశువుల్ని వేటినీకూడ వొదలకూడదు. ప్లాను ప్రకారం మీపని పూర్తిచెయ్యలేకపోతే యింక యేమేనావుంటా !"

బండిలో సర్దుకుని కూర్చున్నతరువాత ఆఖరు మాటలుగా యిల్లా అన్నాడు.

"మొత్తంమీద పరిస్థితులన్నీ చాలా విషమంగా వున్నట్లుగా తోస్తుంది మన డిస్ట్రిక్టు కమిటీవాళ్ళంతా నగుళ్ళోపుసిప మండిపోతూన్నారు. ఇంత పటకా రావడానికి అయిన నేంచేసేను ? ఎవర్నో వొక రైతుని కొట్టేడని, అరెస్టుచేసి, పిస్టలుతో బెదిరించేడని విన్నాను. ఇల్లాఅని సెమోఖిన్ చెప్పేడు నాకు. ఈ కేసును గురించిన కాగితాలన్నీ పోగుచేసి ఉత్తే పెట్టేను. అంతవరకూ మొత్తం నగుళ్ళోవుడి చెప్పే— యేం అనుమానం లేదు. అందుకూ యిప్పుడు అసలందే చేసా వున్నారో యెరుగుదురా ? వెంటనే పార్టీలోనుంచి బొలగించేస్తారు, నెలవు. పశువుల్నిమాత్రం వొదిలి పెట్టకండేం !"

బండి పైసొం—వాప్ వైపు వెళ్ళిపోయింది. ఇంతలోనే మూడవ దళానికి నాయకుడయిన అగాపవ్ మిట్కిన్. యేదో వుట్టి మునిగిపోయినట్లు గుండెలు కొట్టుకుంటూ పరుగెత్తుకొని వచ్చేడు.

"కామ్రేడ్ డేవిడోవ్ !" అన్నాడు వొగురుస్తూ. "గుర్రాల్ని పశువు లనీకూడా తోలుకుపోయేరు సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యత్వాలకి రాజీ నామాలు యిచ్చిన రైతులంతా వచ్చి. బలవంతంగా తోలుకుపోయేరుట "

"ఆఁ—తోలుకుపోవడం యేమిటి ?" అన్నాడు డేవిడోవ్ ఆందో ళనగా.

"పశువుల కుర్రాళ్ళని గడ్డిమేట్ల దొడ్లో పెట్టి తాళంవేసి యెద్దనీ గుర్రాల్ని విప్పేసి స్టెప్పీలోకి తోలుకుపోయేరు. మొత్తం 18 కాళ్ళయెద్లు. 7 గుర్రాలూను. ఇప్పుడు యేమిటిచేసేది మనం ?"

"అయితేనువ్వు.......నువ్వే యేమయేవు ? అప్పుడు యెక్కడ వున్నావు ? వాళ్లు తోలుకుపోతూంటే యెందుకు వూరుకున్నావు ? నిన్ను యెందుకోసం అని వుంచేం అక్కడ ?"

అగాఫన్ గంట్లమొహం కొంచెం యెఱ్ఱబడింది. కంఠస్వరంకూడా తీవ్రం అయింది.

"నేను దూడలపాకలో పడుకోవలసిన పని లేదు. మీరు నన్ను కేకలు వెయ్యవలసిన అవసరం లేదు. అమాత్రం ధైర్యం వుంటే, ఆ పశువుల్ని తిరిగి తోలుకురండి చూద్దాం. మాటలకీ చేతలకీ చాలాదూరం."

ఆ రోజంతా వాటికోసం అంతటా గాలించేసేరు. చివరకి సాయంకాలానికి దిట్టమైన కాపలాక్రింద ఆ పశువులు స్టెప్పీలో వొకమారుమూల మేస్తూండడం చూసేరు. లుబిష్కిన్, అగాఫన్, మూడవదళం తాలూకు మరి ఆరుగురు సభ్యులు కలసి గుఱ్ఱాలమీద స్టెప్పీలోకి వెళ్ళేరు. దూరాన్ని వొక వాలులో మేస్తూన్న యెద్లని చూడగానే లుబిష్కిన్ ఆగిపోయి తన దళాన్ని రెండు భాగాలుగా విభజించేడు.

"అగాఫన్, నువ్వు యీ ముగ్గురుతోనూ ఆ పల్లంలోనుంచి వేగంగా వచ్చి వాళ్ళ కుడివైపుకి కమ్ముకురా. నేను యెడమ వైపుకి వస్తాను. లుబిష్కిన్ తుమ్మెద రెక్కలలాంటి మీసాలు వదేస్తూ. "గుఱ్ఱాల్ని అదలించండి! నా వెనక్కాలే గేలప్‌మీద రావాలి!" అని ఆజ్ఞాపించేడు.

చివరకి పేచీ అవుతేగాని ఆ విషయం పరిష్కారం అవలేదు. ఎద్లని కాపలా కాస్తూన్నారు. లుబిష్కిన్ మేనత్తకొడుకు జఖార్ అనేవాడు, మరి ముగ్గురూ కలసి 'మిష్కా ఇగ్నటియోనక్'ని కాలు పట్టుగుని గుఱ్ఱంమీదినుంచి క్రిందకి లాగేసేరు. ఆ పడడంలో అతనికి వొళ్ళంతా కొట్టుకుపోయింది. ఇదిచూసి వ్యవహారం శ్రుతిమించుతూందని లుబిష్కిన్ చేతిలోనున్న కొరడాకొద్దీ జఖార్‌ని తోళ్ళూడేలా కొట్టేడు. మిగిలినవాళ్ళు కూడా ఆ గొడ్ల కాపలావాళ్ళని తరిమేసి పశువుల్ని అన్నింటినీ వూళ్ళోకి తోలుకుపోయేరు.

దేవిడోవు పశువులకొట్టాలు, గుఱ్ఱపుసాలలు, రాత్రులందు తాళాలు వేసి, వంతుల ప్రకారము సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు కాపలా కాస్తుండాలని ఆజ్ఞాపించేడు. ఇంత జాగ్రత్త తీసుకున్నాకాని మొత్తం రెండురోజులలో రాజీనామాలు యిచ్చిన సమిష్టి వ్యవసాయ క్షేత్ర సభ్యులు యేడుకాళ్ళ యెడ్లు, మూడు గుర్రాలను తీసుకొనిపోయేరు. ఊళ్ళో పెద్ద వాళ్లు కనిపించకపోతే యెవరు యెత్తుకుపోయినదీ తెలిసిపోతుందని చిన్న పిల్లల్ని యిచ్చి వాటిని స్టెప్పీలోకి దూరంగా తోలేసేరు.

పొద్దస్తమానూ రైతులు సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసులోనూ, గ్రామ సోవియటులోనూ, యెడతెరిపి లేకుండా వుంటూన్నారు. వాళ్ళు సమిష్టి వ్యవసాయ క్షేత్రపు భూముల్ని, బలవంతంగా ఆక్రమిస్తామని మేనేజిమెంటుకి బహిరంగంగానే చెప్పడం మొదలెట్టేరు.

"వెంటనే మాకు భూములియ్యండి. లేకపోతే యెవళ్ళ భూముల్ని వాళ్ళం దున్నుకుంటాము." అని దేవిడోవుని వత్తిడి చేసేరు.

"అందరికీ భూములిస్తాము; అంత తొందర పడితే యేలాగ? రేపటి నుంచి ప్లాట్లు యేర్పాట్లు చెయ్యడం ప్రారంభిస్తాము. ఇస్త్రోవ్నోవు దగ్గరికి వెళ్ళండి. ఈ విషయం అంతా అతడు చూస్తున్నాడు." అని దేవిడోవు వాళ్ళని కొంచెం శాంతపరచేడు.

"ఏలాంటి భూమి యిస్తారు,- అది యెక్కడ యిస్తారు?"

"ఎక్కడ ఖాళీగావుంటే అక్కడ."

"అయితే మాగ్రామపు పొలిమేరలో యెక్కడోగాని ఖాళీగా లేకపోతే?"

"కామ్రేడ్ దేవిడోవు, యేమిటి యిదంతా? ఊరుకి దగ్గరగావున్న భూములన్నీ పుచ్చేసుకుని యెక్కడో దూరంగా వున్న భూములిస్తారా?

ఎడ్లనివ్వకపోతే ఆవుల్ని కట్టుకుని వ్యవసాయం చేస్తామనుకున్నారా? పోనీ మా భూములేనా యిస్తారేమో అనుకుంటే అవన్నీ స్వాధీనం చేసేసుకుని యెక్కడో దూరంగావున్న భూములిస్తారా? ఆహా-ప్రజాస్వామ్యం అంటే యిదేలావుంది!"

సమిష్టి వ్యవసాయ క్షేత్రపు భూమి అంతా వొక్కచోట వుండాలి కాని ముక్కల ముక్కలక్రింద వుంటే వీలు వుండదనీ, అదీకాక అంత క్రితం చేసిన యేర్పాట్లన్నీ మార్పు చెయ్యడానికి వీలులేదనీ, డేవిడోవు వాళ్ళతో చాలసేపు వాదించి, విపులంగా చెప్పేడు. చివరకి చేసేది లేక వాళ్ళంతా ధుమధుమలాడుతూ లేచిపోయేరు. ఇంతలో మరో గుంపు లోపలికి తోసుకువచ్చింది.

"మా భూములు మా కివ్వక యీ జబర్దస్తీ యేమిటి? ఇల్లా చెయ్యడానికి నీకు యేమి హక్కుంది? అయితే మమ్మల్ని వ్యవసాయం చేసుకోనివ్వరన్నమాట. కామ్రేడ్ స్టాలిన్ చెప్పింది యిదేనా? మీరు మా పశువుల్ని తిరిగి యివ్వకపోవడమేకాక, పైగా భూములుగూడా ఆక్రమించుకొని కూర్చున్నారని పైకి తెలియచేస్తాము. మీ ధోరణి చూస్తే మేము బ్రతికి వుండడం మీకు యిష్టం లేనట్టుంది."

"యాకోవులూకుచ్! ఆ పాడుచెరువు అవతలనున్న భూమి ప్లాట్లు క్రింద విడతీసి అందరికీ యిచ్చెయ్యి. ఆలస్యం చెయ్యక ఆ విషయం రేపు వుదయాన్నే చూడు."

"రప్పా - రుద్రావున్న ఆ చిట్టడవేనా?" అన్నారు వాళ్లు.

"అది బీడు. చిట్టడవి యేలా అవుతుంది? పదిహేను సంవత్సరాల క్రితంవరకూ సేద్యంలోనే వుండేది." అన్నాడు యాకోవు లూకుచ్.

దావితో మళ్ళీ వాళ్ళు చెలరేగేరు.

పాడుభూమి మా కక్కరలేదు."

"ఆ భూమి అయినా యేంపెట్టి దున్నుతాం, ఏమిటి యీ ఖాగోతం అంతా!"

"మాకు సేవ్యంలోవున్న మంచిభూమి కావాలి."

"పోనీ ఆ భూమి అయినానరే వ్యవసాయం చేసుగుంటాము. మా దూడలను యిచ్చెయ్యండి."

"ఈ దౌర్జన్యమంతా స్వయంగా స్టాలినుకి తెలియచేద్దం రండర్రా!"

"మమ్మల్ని అందరినీ తిండి లేకుండాచేసి మాడ్చి చంపుదామనా?"

ఆడవాళ్లుకూడా కోపంతో వుడికిపోతూన్నారు. దానికి తగ్గట్టుగా కోసక్కులు వెనకనుంచి యెగసన దొయ్యడంతో మరీ రెచ్చిపోయేరు. అంతవరకూ వోపిక పట్టియున్న దేవిడోవుకికూడా కోపం ఆగక,

"ఉన్నవాటిలో మంచి భూములన్నీ మీకు యిచ్చెయ్యమంటారా? ఆదిమాత్రం యెన్నడూ జరుగదు. సోవియటు ప్రభుత్వం సమిష్టి వ్యవసాయక్షేత్రాల అభివృద్ధికి కావలసిన సౌకర్యాలు కలుగచేస్తుంది. కాని వాటికి వ్యతిరేకులయిన మీవంటివారికి కాదు. వెంటనే యిక్కడినుంచి లేచిపొండి. మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి." అని తీవ్రంగా అన్నాడు.

అక్కడా, అక్కడా కొంతమంది కోసక్కులు తమ భూములు దున్నుకోడం ప్రారంభించేరు. కాని లుబిష్కిన్ వాళ్ళనందరినీ బయటకి గెంటేసి సమిష్టి వ్యవసాయ క్షేత్రానికి స్వాధీనం చేసేడు. యాకోవు కొలతకి కావలసిన పరికరాలు తీసుకొని రెండురోజులలో పాడుచెరువు అవతల నున్న భూమి ప్లాట్లక్రింద విడతీసి యెవరిమటుకు వారే స్వంతంగా వ్యవసాయం చేసుకుంటానన్న వారికందరికి పంచి యిచ్చేడు.

మార్చి 25 న డెమ్కా ఉషాకోవుదళం యిసుకభూమి దున్నడానికి బయలుదేరింది. దేవిడోవు పనిచెయ్యడానికి సమర్థులయిన సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల్ని అందరిని దళనాయకుల ఆధీనం చేసేడు. ముసలి వాళ్ళలోకూడా చాలామంది అరక పట్టడం అంటే, గుంటక తోలడం

అంటే, మొదలయిన సులువైనపనులు చెయ్యడానికి వాళ్ళతోకూడా వెళ్ళేరు. మూడుకాళ్ళ ముసలి ఆకిమ్ బెష్కిన్ట్కోవుకూడా విత్తులు చల్లడానికి వెళ్ళేడు. దేవితోవు ఛూకర్‌ని సమిష్టి వ్యవసాయక్షేత్రపు ఆఫీసులో వుండడానికి నియమించేడు. అంతా సిద్ధం అయింది. కాని వర్షాలవల్ల పని ఆగిపోయింది. రెండు రోజులవరకూ గ్రిమాచీలాగ్‌లో యేళ్ళు, కోళ్లు యేకమయేలా వర్షం కొట్టికొట్టి చంపింది.

సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యత్వానికి రాజీనామాలు యిచ్చేవాళ్లంతా యిచ్చేసేరు. ఇంక స్థిరమయిన వాళ్ళెవరో వాళ్లమాత్రం నిలబడ్డారు. అందరికంటె ఆఖరున రాజీనామా యిచ్చినది ఆంద్రీభార్య మేరియా పొయారోక్వా. క్రమంగా, వాళ్ళిద్దరికీ మనస్పర్థలు కలిగేయి. మేరియాకి మతంమీద భక్తి హెచ్చింది. లెంటు 40 రోజులు ఉపవాసంవుండి మూడవ వారంనుంచి ప్రతిరోజు చర్చికివెళ్ళి వెనక చేసిన పాపం పోవడానికి దేవుణ్ణి ప్రార్థిస్తూ, ప్రసాదం తీసుకుంటూండేది. ఆంద్రీ యెన్నితిట్టినా లెక్కచెయ్యక మాట్లాడక వూరుకునేది. ఒకరోజు రాత్రి, ఆంద్రీ బాగా పొద్దుపోయి యింటికి వచ్చేటప్పటికి గదిలో దేవుడుపట్టి దగ్గర దీపం వెలుగుతూంది. వెంటనే తనుచేసేపని మంచిదా, చెడ్డదా అని ఆలోచన అయినా చెయ్యకుండానే ఆ గదిలోకి వెళ్ళి దీపం ఆర్పేసి, దానిలోని చమురు చేతులో వేసుకుని, కాలినున్న బూట్లకి పట్టించేసుకున్నాడు. తరువాత ఆ దీపపు పెమ్మా విరిచి అవతల పారేసేడు.

"మూర్ఖపు ముండలికి యిదంతా చాదస్తం అనీ, అదొక పిచ్చి అనీ యెన్నిసార్లు చెపుతే యేమిలాభం. వాళ్లమాత్రం ఆ కర్ర బొమ్మని పూజించడం, దీపాలుపెట్టి నూనె తగలెయ్యడం మాత్రం మానరు. ఆఖరికి దీన్ని పట్టుగుని చావకొడితేకాని మానేటట్టు లేదు. ఈ మధ్య రోజూ చర్చికి వెడుతూంది యేదో వుంది దీనిలో."

అతను అన్నట్లు నిజంగా యేదో వుంది! మార్చి 28 వ తారీఖున మేరియా తన సమిష్టివ్యవసాయక్షేత్ర సభ్యత్వానికి రాజీనామా యిచ్చేసింది. 'దానిలో వుండడం దేవుడికి అపచారం చెయ్యడం' అన్న మిషతో.

"అయితే నువ్వు ఆంద్రీతో కాపురం చెయ్యడం లేదూ? అది మాత్రం తప్పుపని కాదేమో?" అని అడిగేడు ఖబిష్కిన్ చిరునవ్వు నవ్వుతూ. "లేకపోతే అది శరీరావసరాలకోసం చేసేదికనక తప్పుకాదు కాబోలు?"

అప్పటికీ మేరియా మాట్లాడక వూరుకుంది.

ఇంతలో గ్రామ సోవియటునుంచి ఆంద్రీ అతికోపంతో పరుగెత్తుకు వచ్చేడు. చొక్కా చేతితో నుదుటిమీద చెమట తుడుచుకుంటూ, దేమ్యోష్క, యూరోష్క, బాబాయ్ అందరూ వుండగనే,

"మేరియా నన్ను నాశనం చెయ్యకు; నలుగురిలోను తలవంపులు తేకు! ఇప్పుడు నువ్వు యెందుకోసమని రాజీనామా యిస్తున్నావు? నిన్ను ప్రశ్నల్లో పెట్టి పూటిస్తున్నారే. వాళ్లు నీ ఆవుని యివ్వనే యిచ్చేసేరు.... ఇంకా యేం కావాలంటావు? రాజీనామా తీసేసుకో" అన్నాడు.

"ఇంక అలాంటి మాటలేమీ చెప్పనక్కరలేదు నా దగ్గర." అంది మేరియా కోపంగా. "నేను వొక్క నిముషంకూడా దానిలో వుండదల్చుకో లేదు. అందుచేత మళ్ళీ నన్ను అడగనక్కరలేదు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలో వుండడం నాకు యెంతమాత్రం యిష్టంలేదు. నా నాగలి, బండి అవీ పారెయ్యండి. వెళ్ళిపోతాను."

"మేరియా! తొందరపడకు, జాగ్రత్తగా ఆలోచించుకో. లేకపోతే మనం యిద్దరం విడిపోవలసి వస్తుందిసుమా!"

"ఛీ అవతలకిపో నీ దుంప తెగ! నిన్నరాత్రి ప్రక్కసందులో మలాష్కా ఇగ్నటియస్కీనాతో నిలబడత యెవరు, నువ్వుకాదూ? పైగా నన్ను వొదిలిపెడతానని బెదరిస్తూన్నావా! నువ్వు లేకుండా నేను బ్రతక

లేక పోయినప్పుడు చూస్తానులే. నీకు యీ వుద్దేశ్యం చాలా కాలంనుంచి వున్నదన్న సంగతి నాకూ తెలుసును."

"మేరియా అల్లాఅని యెవరు చెప్పేరు నీకు? నా జన్మలో యింత వరకు యెప్పుడూకూడ మలాష్కాతో పక్కసందులో నిలబడి మాట్లాడ లేదే! ఇంతకీ సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనుంచి విడిపోవడానికీ దానికీ సంబంధం యేమిటి?" ఇంక యేమి మాట్లాడడానికీ తోచక ఆంద్రీ రెండు చేతులతోను తలపట్టుగుని వెర్రిచూపు చూస్తూ నిలబడ్డాడు.

"ఆంద్రీ! ఆ రాక్షసిముండని బ్రతిమాలుతున్నావేమిటి!" అని లుబిష్కిన్ కలగచేసుకున్నాడు. " 'రెడ్ పార్టిజాన్' వు ఆ మాత్రం గౌరవం నిలపెట్టుకోవద్దూ? పైవాళ్లు యేమనుకుంటారు! వెర్రిమొహం వేసుకు చూస్తూ, దానికి యేదో నచ్చచెప్పబోతావేమిటి. ఊచి పుచ్చుకొని రెండు కొట్టక! చచ్చేలా కొడితే యీ యెగురు అంతా అణిగిపోను!"

దెబ్బతిన్న తాచులా మేరియా చర్రునలేచి చొక్కా చేతులు పైకి యెగతీస్తూ, లుబిష్కిన్ మీదకి వెళ్ళింది.

"ఏమిట్రా—నెలతక్కువ వెధవా, ప్రతి విషయంలోనూ నువ్వే కలగచేసుకుంటావేమిటి! ఒళ్లు కొవ్వుపట్టి యేదుస్తున్నావు! తీట వాచు లుస్తాను రా! బ్రిగేడు లీడరువుకదా అని యెవరికీ భయంలేదు యిక్కడ! నీవంటి చవటల్ని అనేకమందిని తక్కు తుక్కు చేసేసేను."

"ముందు నిన్ను [illegible] వేస్తానురా! ఒళ్ళుపొగరెక్కి యేదుస్తు న్నావు" అని లుబిష్కిన్ [illegible] గంభీరంగా అన్నాడేకాని పరిస్థితులు యేలా విషమిస్తాయో కావలాలో వుంటే మంచిదనే వుద్దేశ్యంతో వెనకతగ్గి గోడని చేరబడి నిలబడ్డాడు. టుబ్యాన్‌స్కో[illegible] మిల్లుదగ్గర మేరియా వొక దిట్ట మయిన కోసక్కుతో దొమ్ములాడడం లుబి[illegible]న్‌కి జ్ఞాపకం వచ్చింది. మిల్లులోనున్న వాళ్ళంతా చుట్టూచేరి సరదాగా చూ[illegible]ంటే, కొద్దిసేపట్లోనే మేరియా ఆ కోసక్కుని క్రిందపడత్రోసి గుండెలమీ[illegible] కూర్చుని లేవకుండా

నొక్కిపెట్టి "నాయనమ్మా. ఆడదానిమీద పడుకుని నువ్వు యేమీ చెయ్య లేవు!" అని వూపిరి తీసుగుని మళ్ళీ "నీవంటి ఊనాపి ఆడదానిక్రింద పడుకుని ఒగర్చడానికితప్ప యెందుకూ పనికిరాడు." అంటూ అతనిమీది నుంచి లేచి బొమ్మలాటలో రుమాలు వూడిపోవడంచేత చెదిరిపోయిన జుట్టు సవరించుకుంటూ పల్లెలోకి వెళ్ళిపోయింది. ఒళ్ళంతా దుమ్ము, పేడ పట్టుకున్న ఆ కోసక్కు నెమ్మదిగాలేచి చిన్నబుచ్చుకున్న మొహంతో వెళ్ళి పోవడం లుబిష్కిన్‌కి కళ్ళలో మెదిలింది. అందుచేత లుబిష్కిన్ తగు జాగ్రత్తలో నిలబడి పైకి మేకపోతు గాంభీర్యంగా,

"నామీదికి రావద్దు. నా ప్రేమమాత్రం మాటదక్కదు. జాగ్రత్త" అని అదమాయించేడు.

"ఒరేయ్—చచ్చు వెధవ! నాదెబ్బ యెప్పుడూ రుచి చూడలేదు లావుంది?" అంటూ మేరియా మహాకోపంతో గౌను పైకి లాగేసి లుబిష్కిన్ మీదకి వెళ్ళింది. ఆమె గులాబీరంగు మడమలు దృఢంగా మిస మిసలాడుతూ పచ్చగానున్న శరీరము లుబిష్కిన్ కళ్ళముందు తళుక్కు మంది. లుబిష్కిన్ కూడా అతనికాలంలో అనేకమంది ఆడాళ్ళని చూసేడు గాని మేరీనా శరీరపు జిగ జిగ, దారుఢ్యము చూసేటప్పటికి గుండెలు పీచు పీచుమన్నాయి. ఇంక అక్కడ నిలుచుంటే లాభంలేదని "ఆడదికాదు యిది రాక్షసి కాని! యెల్లావుందో దీన్ని తగలెయ్యా" అని తిడుతూ చల్ల చల్లగా బయటికి జారేడు.

దేవిడోవ్ కడుపు వుబ్బేలా నొక్కచేనవ్వు. లుబిష్కిన్ వెనక్కాలే రజ్మట్నోవు కూడ బయటకు వెళ్ళి భడేలున తలుపులేసేసి లేచి పోయేడు. ఇంక కోపంచేత నోళ్ళు తెలియకుండా కేకలేస్తూన్న మేరియాని సర్దుబాటు చెయ్యడానికి యాకోవు లూకిచ్ వొక్కడుమాత్రం మిగిలేడు.

"ఊరికే అలా కేకలేస్తావేమిటి సబబు. సందర్భం లేకుండా? ఎంత సిగ్గు! గౌను పైకి యెత్తెయ్యడమా! పోనీ పెద్దవాడిని నేను వున్నా ననేనా చూడద్దూ?"

"అట్టే వాగక నోరుముయ్యి!" అంది గుమ్మంకేసి వెడుతూ. "నీ పెద్దమనిషి తరహా నాకు తెలియదూ? క్రిందటివేసవిలో మనం గడ్డితెచ్చుకుంటూన్నపుడు నాతో యేమన్నావో జ్ఞాపకం లేదూ? అంతా అందరే మీరు. తోడి దొంగలు."

ఆమె విసవిసా నడుస్తూ వెళ్ళిపోయింది. యాకోవు లూకిచ్ తల పంకిస్తూ, మేరియా దృష్టి దాటిపోయేవరకూ ఆమెవైపే చూస్తూ నిలబడిపోయేడు. ఇంకో అరగంటకి మేరియా మెదటిదళం అధీనంలోనున్న తన నాగలి, గొర్రు మొదలైనవి బండిలో వేసుకుని పోలుకర్ర పట్టుకుని లాక్కునిపోవడం అతనికి కనబడింది. వర్షం రావడంచేత అప్పుడే చేలలోనుంచి తిరిగివచ్చిన దెమ్కా ఉషాకోవు అదిచూచి, ఆమె వెనక్కాలే కొంచెం దూరంగా తగు జాగ్రత్తలో వెళ్ళి,

"మేరియా! ఏయ్! నిన్నే. పొయ్యాలోస్తావా! మాట్లాడవేం! మేరియా. ఆ సామానంతా నా స్వాధీనంలో వుంది. అది నువ్వు తీసుకుపోవడానికి వీల్లేదు." అన్నాడు.

"ఆ—వీల్లేక యేం చేస్తుంది!"

"ఏం—తెలియలేదూ అవన్నీ సమాజపరం చెయ్యబడ్డాయని? అట్టే పేచీపెట్టక అవన్నీ యిలా యిచ్చెయ్యి. లేకపోతే నీమీద చోరీనేరంమోపి కేసు పెట్టవలసి వస్తుంది. జాగ్రత్త. దేవిడోవు అనుజ్ఞ లేనిదే నీకేమీ యివ్వడానికి వీలులేదు."

"వీలులేకపోవడానికి నిన్ను అడిగి యేడిసినవాళ్ళెవరు?"

దెమ్కా యేంచెయ్యడానికి తోచక చేతులు పిసుక్కుంటూ నిలబడ్డాడు. మేరియా తిరిగి అయినా చూడకుండా బండి లాక్కుపోయింది.

"దాన్ని గెంటేసి బండి లాక్కోవలసింది. ఆ పొగరుమోతుతనం వదిలిపోను. ఇప్పుడు ఆ బండి తీసుకురావడం యెలాగ? ఆ రాక్షసి

ముందని నిగ్రహించి బలవంతంగా లాక్కురాలేం." అనుకుంటూ యాకోవ్ లూకిచ్ పక్క సందులోకి మళ్ళేడు.

ఆ మరునాడే రజ్మెత్నోవ్ ఆతని రైఫిలు, తూటాలు మొదలయిన వస్తువులు తీసుకుని మేరియా యింటినుంచి వెళ్ళిపోయేడు. మేరియాని వొదిలి పెట్టడానికి చాలా కష్టంగానే వుంది కాని యేంచేస్తాడు ఏదో వ్యాపకం పెట్టుకుని ఆ విచారం మరచిపోవడానికి సాధ్యమయినంతవరకూ వొంటరిగా వుండడం మానేసేడు. అందుచేత పిచ్చాపాటీ మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యడానికి నగుల్నోవ్ దగ్గరకు బయలుదేరేడు.

చీకటి పడింది. వాన కురిసి వెలిసింది। చెదిరిపోతూన్న మేఘాలలో నుంచి బయటకు వచ్చిన చంద్రుడు నక్షత్రాకాశంలో దీపకళికలా వెలుగుతూన్నాడు. ప్రవాహపు చప్పుడుతప్ప అంతటా నిశ్శబ్దంగావుంది: మోకాళ్ళదాకా దిగిపోతూన్న ఆ బురదలో అతికష్టంగా నడుస్తూ, ఆంద్రీ యేదో ఆలోచిస్తూ వెళుతూన్నాడు.

---

## ముప్పయ్యొకటో ప్రకరణము

### ఛూ క ర్.

సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసులో శాశ్వతంగా బండి తోలే వాడుగా వుండడానికి ముసలి ఛూకర్ మహా సంతోషంగా అంగీకరించేడు. యాకోవులూకుచ్ అతనికి కులక్‌లనుంచి స్వాధీనం చేసుకొని, మేనేజి మెంటు కమిటీ సభ్యులు తిరగడానికి వుపయోగించుకుంటూన్న రెండు గుర్రాలను వప్పచెప్పి,

"వాటిని కంటికి రెప్ప కాచినట్లు కాయాలిసుమా! బాగా మేపుతూ యెక్కువగా పరుగెత్తించక జాగ్రత్తగా చూస్తూండు ఆ బూడిదరంగు గుర్రంవుంది చూసేవూ—అది అసలు టిటాక్‌ది. ఒకటోరకం గుర్రం. అదపా తదపా యెప్పుడోతప్ప వీటికి ఆట్టే పనివుండదు. అందుచేత వీటిని ఆడగుర్రాలమీద దాటిస్తూండచ్చు వీటి పూచీఅంతా నీది. జాగ్రత్త." అని చెప్పేడు.

"అన్నిసార్లు చెప్పేదియేమిటి!" అని ముసలిభూకర్ జవాబు చెప్పేడు. "గుర్రాలని సంరక్షించడం నాకు చేతకాదనుకున్నారా! నా జీవితంలో అనేకమయేయి యీలాంటివి. నా చేతులలోంచి యెన్ని గుర్రాలు వెళ్ళేయో హద్దూపద్దూ లేదు."

కాని నిజంచేత జన్మకల్లా శివరాత్రి అన్నట్లు ఆతని చేతులలోంచి రెండు గుర్రాలుమాత్రం వెళ్ళేయి. అందులో వొకదాన్ని ఆవుని పిరాయింపు యిచ్చి పుచ్చుగున్నాడు. ఇంక రెండవదాని విషయం.........ఇరవై సంవత్సరాల క్రితం బాగా తప్పతాగి నయొస్కోవాయ్‌నుంచి తిరిగివస్తూ, దోవలో వొక గిప్సీ దగ్గర 30 రూబుల్సుకి కొన్నాడు ఆ గుర్రాన్ని!

అతను కొనేముందు దాన్ని చూసేటప్పటికి ఆ గుర్రం బాగా పూటుగా పేదరంగు, పేలుచెవులు అదీ అతనికి బాగానే అనింది. "ఆ వాలకం అదీ మంచి వేగంగానే పోతుంది. ఏమీ అనుమానం లేదు." అనుకున్నాడు కడుపులో. భూకర్ దోవ పొడుగునా ఆ గిప్సీతో బేరం ఆడుతూనే వున్నాడు దానిని యేలాగయినా కొనాలని. బేరం ఆడడం, యిద్దరికీ మధ్యకువరక వాదిలెయ్యడం, మళ్ళీ బేరమాడడం—ఇలాగ నలభైసార్లేనా జరిగింది.

"బంగారంకావి గుర్రమాయిది! దీనిమీద కూర్చుని కళ్లు మూసుకున్నావంటే చెట్టూ, పుట్ట యేమీకనిపించనంత వేగంగా పరుగెత్తుతుంది. నా గుర్రమని నేను పొగడుకోడం కాదుకాని వాయువేగ మనోవేగాలతో

పోతుంది." అంటూ ఒట్లు పెట్టుగుంటూ గిప్సీ ఆ గుర్రాన్ని తెగ పొగిడేడు.

"దంతాలన్నీ పూడిపోయేయి. ఏమీ అంత అందగాడు మొహం కూడాకాదు. డెక్కలు బాగా అరిగిపోయేయి. పొట్టచూస్తే పొణకలా వుంది. ఏమిటో దీన్ని ఊం పొగడుతూన్నావు." అదేమీ మంచిదికాదని యేలాగైనా సాధ్యమయినంత తక్కువకి కొట్టెయ్యాలని ఘూకర్ వుద్దేశ్యం.

"పళ్ళు వుంటే యేమిటి- లేకపోతే యేమిటి! గడ్డి తక్కువ తింటుంది. అంతేకాని దానివలన నష్టంలేదు. మంచి నడివయస్సులోవుంది. ఏదో రోగంచేత పూడిపోయేయి కాని, పళ్లు – ముసలితనంచేత కాదు. అందగాడు మొహం కాదంటావు. గుర్రానికి పరుగుండాలికాని అందం యెందుకు- అమ్ముకు తినడానికి? డెక్కలు కూడా యికముందు యెదిగి బాగుంటాయి. ఇది యింట్లోవుంటేచాలు యింకేమీ అక్కర్లేదు. దాని పొట్ట పొణకలావుంది అన్నావు. అది బలంచేతకాని, మరేమీ కాదు. స్వారీ తీసిందంటే భూమి వొణకవలసిందే యేమనుకున్నావో!..............ఏయ్ తాతా! నువ్వు యిచ్చే 30 రూబుళ్ళకీ గొప్ప పందెపుగుర్రం రావాలని నీ ఆశ. కాని బ్రతికి వున్నదేదీ రాదు ఆఖరికి. చచ్చిపోయినదయితే దాని మాంసం పూరికేనే దొరుకుతుంది."

మొత్తంమీద యేలాగయితేం ఆగిప్సీ ఘూకర్‌ని బుట్టలో పెట్టేడు పీకులాడి పీకులాడి చివరకు 30 రూబుళ్ళకి గుర్రం యిచ్చేసి 'వొదిలి పోయిందిరాబాబూ' అని తల తడిమి చూసుకున్నాడు గిప్సీ.

ఘూకరు కళ్ళెం చేతపుచ్చుకునేటప్పటికి గుర్రంలో వుండే వెనకటి చురుకుతనం కాస్తాకూడా పోయింది. ఘూకరు దాన్ని గెంటి, కొట్టి యెంతో ఆర్భాటం చేస్తే ఆఖరికి ఆ గుర్రం అడుగులో అడుగేస్తూ,

ఈదురోమంటూ నడక ప్రారంభించింది. ఇదంతాచూసి పళ్ళికిలించి పకపకా నవ్వేడు.

"ఏయ్! తాతా, అల్లాటప్పా గుర్రం కాదది. నాదగ్గర 40 యేళ్ల పని చేసింది. అధమపక్షం యింకో అన్నేళ్ళైనా పని చేస్తుంది నీదగ్గర. అయితే— ఒక్కటుంది. వారానికి వొక్క రోజుకంటె యెక్కువ మేపు తూండకు; లేకపోతే దానికి పట్టపగ్గాలుండవు. మాతండ్రి రుమేనియా నుంచి యీ ప్రాంతానికి వలస వచ్చినపుడు దీనిమీదనే వచ్చేడు. అతనికి అది ఫ్రెంచి సైన్యాలు మాస్కోనుంచి తిరిగి పారిపోయేటప్పుడు దొరికింది. నీయెత్తు బంగారం పోసినా దొరకదు అలాంటి గుర్రం!" ఘూకరు గుర్రాన్ని యీడ్చుకుపోతూంటే ఆగిప్సీ యింకా యేమిటో అన్నాడు. గిప్సీ దగ్గర పక్కనేవున్న గుడారంచుట్టూ పిల్లలు గోలపెడుతూన్నారు. ఆడాళ్ల వొక్కటే నవ్వు. కాని ఘూకర్ యిదేమీ లెక్క చెయ్యక నెమ్మదిగా గుర్రాన్ని లాక్కుపోతూ "ఈ గుర్రం యెలాంటిదో కొంతసేపటికి నాకే తెలుస్తుంది. నాదగ్గర బాగా డబ్బున్నట్లయితే యీలాంటి గుర్రాన్ని కొనకపోదును. ఆగిప్సీ నాకుమల్లేనే సరదా అయినవాడు. వేళాకోళపు మనిషి. సరే, యేదో వొకటి. మొత్తంమీద గుర్రం అంటూ సంపాదించాము. రేపు ఆదివారం నేనూ, నా పెళ్ళాము కలసి యీ గుర్రంమీద జిల్లా పట్టణానికి సంతకి వెళ్ళివొస్తాము," అనుకున్నాడు.

కాని యింకా అతడు టూబ్యాన్స్కోకి వెళ్ళకుండానే వొకచిత్రం జరిగింది. ఏదాలాభాన వెనకతిరిగి చూచి, యేంచూసేడో విస్తుపోయేడు. అంతక్రితంవరకు పెద్దపొట్టాఆదీ మంచి బలిసివున్నగుర్రం డొక్కలు లోతుకుపోయి పొట్ట బాగా తీసిపోయి బక్కచిక్కిపోయి వుంది. అర గంట సేపట్లో గుర్రం సగం అయిపోయింది. "అఁ! యేమిటిది, ఆశ్చర్యంగా వుంది?" అనుకుంటూ కళ్ళెం జాలవిడిచి యెల్లా వున్నవాడు అలా నిలబడిపోయేడు. నిషా అంతా చేత్తో తీసేసినట్లు వొక్కసారిగా

దిగి పోయింది. గుర్రం వెనకకి వెళ్ళి చూసేక అంతగా చిక్కిపోవడానికి కారణం బోధపడింది అతనికి. బాగా మెలిత్రిప్పబడియున్న తోక క్రింద నుంచి, ముక్కలు బ్రద్దలయీలా దుర్వాసన, ఫ్రుర్ ఉస్ అని ధ్వనిచేస్తూ, పిచికారీలోంచి కొట్టినట్లు వస్తూంది. "అదీ కారణం." అంటూ రెండు చేతులతోనూ తలపట్టుగుని నిట్టూర్పు వదిలేడు. కాని వెంటనే లేని బలం తెచ్చుగుని గుర్రాన్ని ముందరకి లాక్కుపోవడం ప్రారంభించేడు. టుబ్యాన్స్కో వెళ్ళేవరకూ దోవపొడుగునా పారుతూనేవుంది గుర్రం విధి విరామం లేకుండా. ఛూకర్ నెమ్మదిగా యెల్లాగో గ్రిమూచీలాగ్ చేరుకొనే వుందునుగాని టుబ్యాన్స్కో దగ్గరకు వెళ్ళేక అవూళ్ళోవున్న తన బంధు వులు స్నేహితులు చూస్తూంటే గుర్రాన్ని కళ్ళెం పుచ్చుకు లాక్కుపోతే బాగుండదని తోచి ఆ కొంత దూరమయినా గుర్రంమీద యెక్కి నెమ్మ దిగా వెడదామనుకున్నాడు. అతనిలో విపరీతమయిన అహంభావం రేకెత్తి "ఛూకర్ యేమో బీదవాడనుకుంటున్నారు. స్వంతంగా గుర్రాన్ని కూడా సంపాదించేడే!" అని అందరు ఆశ్చర్యపోతూంటే తను దర్జాగా గుర్రంమీద వెడుతూ వాళ్ళకి తన గొప్పతనం అంతా చూపించాలను కున్నాడు. "ఛల్! ఛల్! నిన్ను తగలెయ్యా, అస్తమానూ పెంకితనమే!" అంటూ గుర్రాన్ని అదమాయించి తను యెరిగిన కోసక్కు వొకడు పక్క యింటి తలుపుతీసి బయటికి రావడం ఓరకంట పరకాయించి గుర్రం కళ్ళెం బిగలాగుతూ తన దర్జా అంతా ప్రదర్శించడానికి ప్రయత్నించేడు. కాని బాగా ముసలితనంవచ్చి అడుగుతీసి అడుగు వెయ్యలేని స్థితిలోవున్న ఆ గుర్రంకి పెంకితనం చెయ్యడానికి వోపిక వుంటేకదూ! ముడికాళ్ళు అదీ తల వ్రేలాడేసి నిలబడింది.

"ఇతని యెదుటనుంచి గుర్రాన్ని గేలప్ తీయిస్తూ, వెళ్ళిపోయి వుండవలసింది." అనుకున్నాడు ఛూకర్. ఎముకలన్నీ బయలుపడి అస్తి పంజరంలావున్న ఆ గుర్రం నడ్డిమీదకి వొక్క యెగురు యెగిరేడు. కాని

దురదృష్టవశాత్తు వెంటనే పెద్ద పరాభవమయింది. ఆ విషయాన్ని గురించి టుబ్యాన్‌స్కో ప్రజలేకాక జిల్లా జిల్లా అంతాకూడ యిప్పటికీ చెప్పుకుంటూంటారు ఛూకర్ పైకి యెగిరి గుఱ్ఱం నడ్డిమీద పొట్ట మోపేడో లేదో వెంటనే గుఱ్ఱం యిటూ అటూ వూగింది. కడుపులో గురగుర ధ్వనితో రయ్యమని పిచికారీలోనుంచి వొదిలినట్లు పారుతూ తెటిగిల పడింది. ఆ సందడిలో ఛూకర్ తొట్రుపడి, రోడ్డుమీద పడిపోయేడు. వెంటనే ఆ గుఱ్ఱాన్ని నిలువునా చీరెయ్యాలన్నంత కోపంవచ్చి గభాలున లేచేడు. కాని తనకు జరిగిన యీ పరాభవం అంతా ఆ కోసక్కు చూడడంచేత అతని దగ్గర యేలాగైనా తన ప్రతిష్ఠ నిలబెట్టుకోడానికి "ఛీ! నిన్ను తగలెయ్యా! వాళ్ళు కావ్వేక్కి యేడుస్తున్నావు. నీ రోగం కుదురుస్తానుండు" అంటూ గుఱ్ఱాన్ని రెండు కాళ్ళతోనూ గబగబ తన్నేడు. అది నెమ్మదిగా లేచి నిలబడి అంతక్రితం యేమీ జరగనట్లు రోడ్డుప్రక్కనున్న పచ్చగడ్డి రెండు నోళ్లు లాగి నమలడం మొదలెట్టింది.

ఇదంతా చూస్తూ నిలబడివున్న కోసక్కు శుద్ధ కోతలరాయుడు, హాస్యగాడూను. ఇంటి ఆవరణ దాటి ఛూకర్ దగ్గరకివచ్చి ముసిముసి నవ్వు నవ్వుతూ "ఛూకర్! క్షేమమా. ఇల్లా యెక్కడనుంచి వస్తున్నావు—ఈ గుఱ్ఱాన్ని కొన్నావా?" అన్నాడు.

"ఆ నురేనోయ్, శుద్ధ పెంకిరకం. ఎముకలు కొరికేస్తూంది. మనం దానిమీద కూర్చోబోతే చాలు. ఛమటుకుని పల్టీకొట్టి క్రింద పడతోస్తుంది. ఇంతమటుకు దీనిమీద యెక్కి స్వారీ చేసిన వాడెవడూ లేడనుకుంటాను."

ఆ కోసక్కు గుఱ్ఱంచుట్టూ రెండుసార్లు పరిశీలనగా తిరిగి, పళ్ళూ అవీ చూసి యేమీ యెరగనట్లు అతి అమాయికంగా,

"ఈ వాలకం అదీచూస్తే మంచి మేలుజాతి గుఱ్ఱంలా కనిపిస్తుంది. పళ్ళతీరునిబట్టి 50 యేళ్లు దాటుతాయనే తోస్తుంది. అయినా యిప్పటికీ అది లొంగలేదంటే ఆసలు ఆజాతి తరహా అల్లాంటిది" అన్నాడు.

కోసక్కు మాటలువిన్నాక ఛూకరుకి కొంచెం ధైర్యంచిక్కి "ఇగ్నటీ పోస్ఫరిచ్! అయితేను, యిది చూస్తూండగా అంతట్లోనే చిక్కిపోయింది దేనిచేత? నడిపించి తీసుకువస్తూంటే నాకళ్ళయెదుటే అత్యాశ్చర్యకరంగా మంచు కరిగిపోయినట్లు కరిగిపోయింది అంతవొళ్ళూ. ముక్కులు బిద్దలయిగా పెళవ పాడుకంపు కొడుతూ, దోవపొడుగునా కొద్దంతా తెగ పారింది." అన్నాడు.

"అసలు యెక్కడ కొన్నావు దీన్ని? గిప్సీలవగ్గర కాదుకదా?"

"అవును. వాళ్ళవగ్గరే. ఇక్కడే కొద్ది దూరంలో కొంతమంది మకాం చేసేరు."

"ఆ—అందేచేతనే అది చిక్కిపోయింది." అంటూ గుర్రాలని గురించి, గిప్సీలను గురించీ బాగా తెలిసిన ఆ కోసక్కు చెప్పడం ప్రారంభించేడు. "వాళ్ళు దీన్ని నీకు అమ్మేముందు బాగా గాలికొట్టివుంచేరు. ఏ గుర్రమైనా బాగా ముసలితనంచేత చిక్కిపోయి వున్నట్లయితే దాన్ని అమ్మేముందు ముడ్డిలో పొక కిక్కిసగొట్టంపెట్టి పక్కలు బాగా తేలి, బలిసిన గుర్రంలా కనిపించేటంతవరకూ ఒకరివెనక వొకరు వరసగా వూది, అప్పుడు ఆ గొట్టం లాగేసి, వెంటనే గాలిపోకుండా, గడ్డి మేలి పెట్టి కుక్కేస్తారు. నువ్వు కొన్న యీ గుర్రం అలాంటిదే. ఆగడ్డి దోవలో యెక్కడో వూడి పడిపోవడంచేత, యీలా చిక్కిపోయింది. వెనక్కి వెళ్ళి అది యెక్కడ పడిపోయిందో వెతిగి తీసుకురా, మనం యిద్దరం కలిసి బాగా గాలికొట్టి వెనకటికిమల్లే చేద్దం."

"అమ్మ—లంజకొడుకులు యెంత దగాచేసేరు." అంటూ ఛూకర్ ఆగిప్సీలని పట్టుకొనడానికి వెనక్కి పరుగెత్తేడు. కాని తీరా అతడు అక్కడకు వెళ్ళి చూసేటప్పటికి, ఆ గుడారాలూ లేవు, గిప్సీలూ లేరు. అంతక్రితం వాళ్లు వంట వండుకున్న చోటనుంచి బూడిదరంగు పొగ

యింకా లేస్తూనేవుంది. కాని, పూరాన, వేసవికాలం అవడంచేత బాగా కాలివున్న రోడ్డుమీదినుంచి ధూళిరేగి, గాలితాకుడికి నలుమూలలా చెదిరి మాయం అయిపోతూంది. గిప్సీలు అతిచిత్రంగా మాయం అయిపోయేరు. ఘూకర్ రాగాలెడుతూ వెనక్కి తిరిగి వచ్చేడు. ఇతని ధ్వని అవగానే ఇగ్నాటీపోర్ఫిరిచ్ యింట్లోనుంచి బయటికి మళ్ళీ వచ్చేడు. "నేను దాని పొట్టక్రింద చేతులుపెట్టి క్రిందపడిపోకుండా పట్టుకుంటాను. నువ్వు యెక్కు" అని సలహా యిచ్చేడు. సిగ్గు, విచారంచేత క్రుంగిపోయి వున్న ఘూకరు, ఆ కోసమక్కి సలహా అంగీకరించి, యేలాగో తంటాలు పడి దానిమీద కూర్చున్నాడు. ఈ పర్యాయం గుర్రం వెనకటిలా పడిపో లేదు. గేలప్ తీస్తున్నట్లు మొదట ముందరికాళ్లు రెండూ పైకి యెత్తి తరవాత వెనక కాళ్ళతో తన్నింది. ఈ మాదిరిగా ఘూకరుని ఆ వీధి చివర వరకూ తీసుగుపోయింది. కాని యీ గేలప్ తియ్యడంలో ఘూకర్ టోపీ కింద పడిపోయింది. కుదుపుకి వొళ్ళంతా నలగకొట్టినట్టయి, కడుపులో వికారము కలిగింది. "అయ్యబాబో! ఈ గుర్రంమీద కూర్చోడం నావల్ల కాదు." అనుకుని గుర్రందిగి పడిపోయిన టోపీ తీసుకోడానికి వెనక్కి వెళ్లేడు. కాని వొక సందులోనుంచి చాలమంది జనం తనకేసి పరుగెత్తు కొని వస్తూండడం చూసి టోపీ తీసుగోకుండానే వెనక్కి పరుగెత్తి గుర్రాన్ని గబగబా వూరిబయటకు లాక్కుపోయేడు. అయినప్పటికి పిల్లలు అతన్ని వొదిలిపెట్టక వెంటతగిలి గాలిమర వరకూ తరుముకుపోయి, అక్కడితో వదిలిపెట్టి వెనక తిరిగేరు. మళ్ళీ ఆ గుర్రాన్ని యెక్కాలన్న వాంఛే కలగలేదు ఘూకర్‌కి. గుర్రాన్ని యీడుస్తూ అడ్డపడి, గుట్టలు మెట్టలూ దాటి కొంతదూరం ప్రయాణం చేసేటప్పటికి అలుపు వచ్చి, కళ్ళెం వదిలేసి గుర్రం వెనకకివెళ్ళి తోలడము ప్రారంభించేడు. తను అంతా శ్రమపడి కొన్న గుర్రం గుడ్డిదన్న సంగతి అప్పటికికాని అతనికి తెలియనేలేదు. మిట్టలు, పల్లాలు, బోదులు యేవి అడ్డమువచ్చినా తప్పుకో

కుంటా అడ్డపడి మళ్ళమళ్ళ పడుతూ, లేస్తూ యిల్లాగే ప్రయాణం సాగిం చింది. ఈ నడకఅయినా ముక్కుకు సూటిగా నడవడంకాదు. తమాషాగా చక్కర్లు కొట్టడం మొదలెట్టింది. ఈ కొత్తవిషయం తెలుసుగున్నాక ఛూకర్ విస్తుపోయి దాన్ని దాని యిష్టంవచ్చినట్లు వదిలేసి చూస్తూ నిల బడ్డాడు. అది గానుగ యెద్దు తిరిగినట్లు విధివిరామం లేకుండా తిరగడము మొదలెట్టింది. ఈ తిరగడంచూసి అది దాని జీవితమంతా తిరుగుడుమోట లాగడంలోనే గడిపి ఆఖరికి ఆపనిలోనే గుడ్డిదికూడా అయిపోయి వుంటుం దని ఛూకర్ వూహించేరు.

ఇలాంటి గుర్రాన్ని తీసుకుని పట్టపగలు గ్రిమాచీలాగ్ వెడితే అంతా ఆక్షేపిస్తారని అక్కడా అక్కడా మేపుతూ సాయంత్రంవరకూ కాలక్షేపం చేసి, బాగా చీకటి పడ్డతరువాత చడీ చప్పుడూ లేకుండా తోలుకుపోయి దొడ్లో కట్టేసేరు. అలాంటి చచ్చుగుర్రాన్ని కొన్నందుకు ఛూకర్‌ని అతని భార్య బాగా దేహశుద్ధిచేసి బుద్ధిచెప్పి వుంటుందికాని ఆ చీకటిలో యెవరికీ మాత్రం కనిపించలేదు. క్రమంగా కొన్నిరోజులకి ఆ గుర్రానికి గజ్జి పట్టు కుని చర్మంఅంతా పాకి చూసేటందుకుకూడా అసహ్యం కలిగించేటంత వికృతంగా తయారయి చచ్చిపోయింది. ఛూకరు దాని చర్మం వొలిచి అమ్మేసి ఆ వచ్చిన కొద్దిసొమ్ముతో అతనూ అతని స్నేహితుడు లొకాటీవు కలిసి తాగేసేరు.

ఛూకర్ చేతులలోనుంచి యెన్ని గుర్రాలు వెళ్ళినవీ ఆతనిని బాగా యెరిగిన యాకోవులూకుచ్‌కి తెలుసును. అయినాకానీ ఛూకర్‌కి ఉగ్గుపాల నాటినుంచీ అలవాటయిన అబద్ధం ఆడడం, కోతలు కొయ్యడం మానలేక పోయేడు.

ఇవన్నీ యెందుకు మనకి—అది మొదలు ఛూకరుకి బండి తోల డం, గుర్రాలని కాయడం, రెండు వుద్యోగాలూకూడ వొక్కసారిగా లభించేయి. అతను ఆ వుద్యోగాలు రెండూ బాగా నిర్వహించలేదని చెప్ప

డానికి వీలులేదు. కాని బండితోలుతూ చీటికీమాటికీ ఆపుతూంటాడనీ, వేగంగా తోలలేడనీ నగుల్నోవు మాత్రం సాధించేవాడు. ఇద్దరూ బండి యెక్కి ఆఫీసు ఆవరణదాటి రోడ్డుమీదికి వచ్చేరోలేదో యింతలోనే "హావ్! హావ్!" అంటూ కళ్ళేలు బిగించి బండీ ఆపుతాడు. "ఏం, యెందుకూ ఆపేవు?" అని నగుల్నోవు అడుగుతే "ఆపకపోతే యెల్లాగ! గుర్రాలకిమాత్రం శ్రమకాదూ?" అని నగుల్నోవుకి విసుగెత్తి కొరడాతీసి గుర్రాలని వొక్కదెబ్బ కొట్టేవరకూ యీలవేస్తూ దర్జాగా కూర్చుంటాడు. ఆ వూళ్ళోకోసక్కులిద్దరిదగ్గర ఛూకరు "బండి తోలేవాడు ముందరిచెక్క మీద కూర్చుని బండి తోలుతూంటే, ప్రయాణీకుడు లోపల దిండ్లు అమర్చుగుని కులకడానికి యివేమీ జారుప్రభుత్వపు రోజులుకావు. చూడు-యిప్పుడు నేను బండి తోలుతూన్నాను. కాని దేవిడోవుతో సమానస్థాయీగా బండిలో కూర్చుంటున్నాను. ఎప్పుడేనా చుట్టకాల్చుకోవాలని వున్నప్పుడు చుట్టచుట్టుగుంటూ వొక్కసారి కళ్ళేలు పుచ్చుకోమని దేవిడోవుని అడుగుతాను. అతను కళ్ళేలు తీసుగుని అల్లా వొక అరగంటో, గంటో బండి తోలుతూంటే నేను ప్రకృతిని చూస్తూ హాయిగా కూర్చుంటాను." అని ప్రగల్భాలు కొడుతూంటాడు. ఎంత దిట్టంగా పొగమంచు పట్టివున్నా ప్రతిరాత్రీ విడవకుండా అప్పుడప్పుడు లేచి గుర్రాలను చూస్తూండాలని అక్కడే పడుకోడానికి వెడుతూండేవాడు. ఇల్లా వారం రోజులు అయిన తరువాత వొకరోజున అతనిభార్య, ఛూకరుని "ప్రతిరోజూ యెవరో ఆడాళ్ళు నీ దగ్గరికి వస్తున్నారట కాదూ?" అని అడిగి వొళ్ళు హూనమయీలా చావ కొట్టి వొదిలిపెట్టింది. ఎవరో కొంతమంది పిల్లలు చెప్పేరుట ఆమెకు యీ విషయం. కాని ఛూకరు అది నిజమనికాని అబద్ధమనికాని యేమీ అనక ఆరోజుమొదలు యింటిదగ్గరే పడుకుంటూ రెండు మూడుసార్లు వెళ్ళి గుర్రాలని చూసి వస్తూండేవాడు.

ఛూకరుకి బండికట్టడం వొక్కఅరగంట ప్రవణ. బండికి వున్న

దానికి గుర్రాలని రెంటినీ తీసుగు వచ్చేటప్పుడు అక్కడనున్న గుర్రాలేవయినా సకిలిస్తే వాటిని నడ్డిమీద తట్టుతూ "హావ్! హావ్! మిమ్మల్ని తగలెయ్య! యెందుకే అలా సకిలిస్తారు. అదీ మీకు మల్లే మొగగుర్రమేకాని ఆడదికాదు." అంటూ యేదో జాప్యంచేస్తూ, మొత్తంమీద ఎల్లాగయితేం - బండికట్టి. యెక్కిక "యేదో మన అదృష్టం బాగుంది కనక కడుపులో చల్ల కదలక్కర్లేకుండా హాయిగా కూర్చోడానికి వీలయినపని దొరికింది." అనుకుంటూంటాడు.

మార్చి 27 వ తారీఖున దేవిడోవు తను చెప్పిన ప్రకారం మొదటి సారి నాగటి వాళ్ళకి అడ్డంగానే కంప లాగుతూన్నారో లేక నిలువుగా లాగుతూన్నారో చూడడానికి బయలుదేరుదం అనుకుంటూన్నాడు. ఇంతలో 'సోయుజ్' ను నాకవానిని దాగుచెయ్యడానికి వెళ్ళిన ఇప్పోలిట్ హాపీ గబగబా సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసుకి పరుగెత్తుకు వచ్చేడు.

"మొదటిసారం వాళ్ళకి నిలువునా కంపలాగుతూన్నారు. పని వట్టి పండుగతప్ప దానివల్ల మేమి లాభంలేదు. ఇంకా కావలిస్తే మీరుకూడా చూడండి. సరిగ్గా పని చెయ్యమని మీరు చెబుతేగాని వినరు వాళ్ళు. నేను చెబితే వెధవ మెల్లకన్నా వాడూ ఆ ఉషాకోవ్ 'మహా తెలిసినవాడిలా ప్రతివాళ్లోనూ వేలెట్టకపోయి తిత్తి పూదుకో—నిన్నెవరేనా అడిగినప్పుడు చెపుదువుగానిలే సలహా—నయచెయ్యి' అన్నాడు. కుక్కకాటుకి చెప్పుదెబ్బ అన్నట్లు 'వెధవ మెల్లకన్నానువ్వూ మాటలు తిన్నగా రానియ్యి. మెడ గుళ్ళు విరిచేసిపోయేను' అన్నాను. దానితో చెయ్యీ చెయ్యీ కలుపుగోవం వరకూ వచ్చింది."

దేవిడోవు ఛూకర్‌ని కేకేసి బండి సిద్ధం చెయ్యమన్నాడు, కాని అతడు యెంతకీ తెమల్చక పోవడంచేత తనుకూడా వెళ్ళి సహాయం చేసేడు. ఇద్దరూ బండియెక్కి బయలుదేరేరు. ఆకాశం అంతా మబ్బులు

కమ్మేసేయి. ఉక్కచూస్తే యికనో యిప్పుడో వర్షం కురిసేటట్లు కనిపిస్తూంది. మొదటిదళం పనిచేస్తూన్న భూములు వూరుకి చాలా దూరంలో పొలిమేరదగ్గర వున్నాయి. ఊరుకి అక్కడికి 5, 6 మైళ్లు వుంటుంది. ఆ దళం వరి చల్లడానికి భూమి అంతా దున్ని సిద్ధం చేస్తూంది.

"తాతా! త్వరగా పోనివ్వాలి!" అన్నాడు దేవిడోవు. బాగా మూసుకుపోయిన ఆకాశంకేసి చూస్తూ.

"వేగంగానే తోలుతూన్నాను. అప్పుడే గుర్రం యెలా అలసిపోయిందో చూడండి."

ఎదర సొలోపుమీద ముందు మేస్టరు నడుస్తూంటే అతని వెనక వొక్కటే వరసలో స్కూలుపిల్లలు, వాళ్ళ వెనకాల నీటిపీపాలు తీసుకుపోతూన్న నాలుగు బళ్ళూ కనిపించేయి.

"అరుగో! పిల్లలంతా ఎలకల్ని చంపడానికి పోతూన్నారు." అని ఛూకరు వాళ్ళకేసి చూపించేడు.

సంతోషాన్ని వెలిగక్కుతూన్న కళ్ళతో దేవిడోవు వాళ్ళకేసి చూసేడు. బండి వాళ్ళ సమీపానికి వెళ్ళగానే అతడు ఛూకరుని బండి ఆపమని జోళ్ళేనా లేకుండా వట్టికాళ్ళతో నడుస్తూన్న యేడేళ్ళ కుర్రాడినొకడిని "ఏయ్, అబ్బాయి – మాట" అని పిలిచేడు.

"ఎందుకు?" అన్నాడు ఆ కుర్రాడు తలమీదనున్న టోపీ వెనక్కి సర్దుకుంటూ.

"ఎన్ని యెలకల్ని చంపేవు నువ్వు?"

"పద్దానుగు"

"నీ పేరెవరు?"

"ఫియోడోట్ డిమిడిచ్ ఉషాకోవు."

"సరదాగా బండిలో కూర్చుందువుగాని రా. నువ్వుకూడా రా." దేవి డోపు తలకి జేబురుమాలు చుట్టుకున్న ఓ పిల్ల కేసి చెయ్యి విసిరేడు. ఇద్దర్నీ బండిలో కూర్చోపెట్టుగుని భూకరుని బండిపోనిమ్మని ఆ కుర్రాడితో సంభాషణ మొదలెట్టేడు.

"ఎన్నోక్లాసు చదువుతూన్నావు ?"

"ఒకటో క్లాసు."

"ఒకటోక్లాసా ? అయితే శుభ్రంగా చీమిడి చీదుకోకుండా అలాగే వుంచడం ?"

"చీదుకోలేను. రొంప పట్టింది."

"చీదుకోలేకపోవడం ఏమిటి ?—నేను తీస్తాను యిలారా !" దేవి డోపు వ్రేళ్ల బ్రౌజరుకి తుడుచుగుంటూ నిట్టూర్పు విడిచేడు. "రేపో యెప్పుడో సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఆఫీసులో నా దగ్గరకిరా. ఛాకొలెట్లు పెడతాను. ఎప్పుడేనా ఛాకొలెట్లు తిన్నావా ?"

"లేదు."

"సరే, ఆఫీసుకి రా. అక్కడ మందుకూడా యిప్పిస్తాను."

"ఒస్తాను. కాని ఛాకొలెట్లు నాకు అక్కరలేదు."

"అక్కర్లేదా ? ఏం - ఎందుచేత ?"

"పళ్ళన్నీ కదిలిపోయి వూడిపోతున్నాయి. అప్పుడే కిందపళ్లు రెండు వూడిపోయేయి. చూడండి !" ఆ కుర్రాడు నోరు తెరచి వూడిపోయిన కిందపళ్లు రెండూ చూపించేడు.

"అయితే తొస్సివాడవు అన్నమాట నువ్వు."

"అవిగో మీ వీ తొస్సిపళ్ళే."

"అబ్బో, అసాధ్యుడవులా వున్నావే ! కవిపెట్టేవూ నువ్వు."

"నాకు మళ్ళీ కొత్తపళ్ళు వొస్తాయి. మీకు రావు."

"ఆ - నీకు తెలియదు ; నాకూ వొస్తాయి కొత్తపళ్ళు."

"ఉత్తది. అబద్ధం ఆడుతున్నారు. ముసలాళ్ళకి పళ్ళురావు. అడుగు పళ్లు లేకపోయినా నేను యెలా కరుస్తానను కున్నారు !"

"ఎల్లా కరవకలవు ?"

"అబద్ధం అయితే నా నోట్లో వేలుపెట్టండి, ఎల్లా కరుస్తానో చూపిస్తాను."

దేవిదోవు నవ్వుతూ చూపుడువేలు అందించేడు. వెంటనే "అబ్బ !" అంటూ వెనక్కి లాక్కున్నాడు. వేలు పైన పళ్లుదిగిన ఆనవాళ్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఫియొడోట్ ! నేను కరవకలనో లేదో చూడు." అన్నాడు దేవి దోవు. ఆ కుర్రాడు కొంచెంసేపు అనుమానించి గభాలున బండిలోనుంచి క్రిందికివురికి వొంటికాలిమీద నిలబడి, చప్పట్లు కొడుతూ "కరుస్తారేం మీరు ! యెల్లాకరుస్తారో కరవండి చూద్దాం" అన్నాడు.

దేవిదోవు పకాపకానవ్వుతూ ఆ పిల్లనికూడ నెమ్మదిగా బండిలో నుంచి దింపేసి, వాళ్ళకేసిచూస్తూ నిలబడ్డాడు. సంతోషంచేత అతని హృదయం తబ్బిబ్బు అయిపోయింది. కళ్లుచెమ్మగిలేయి. "ఇప్పుడు మనం పడే పాటంతా వాళ్ళ సౌకర్యంకోసమే." అనుకుంటూ ఆలోచించుకున్నాడు. "తండ్రి కోసక్కి టోపీ పెట్టుగుని పరుగెత్తుతూన్న యీ ఫియొడోట్ వొక్క యిరవై సంవత్సరాలలో యెలక్ట్రిక్ నాగలితో దున్నుతూంటాడు. తల్లి చచ్చిపోయింది మొదలు నేను చెల్లెళ్ళకి సంరక్షణచేస్తూ వంట వండు కుని తరువాత ఫ్యాక్టరీకి వెళ్ళి పనిచేసినట్లు యితడు అంతకష్టపడక్కర లేదు. మానవుడు సుఖం అనుభవించడం అంటూవుంటే యీ ఫియొడోట్ తరంనుంచి అనుభవిస్తారు. ఏమీ అనుమానం లేదు." దిగంతాలవరకూ

వ్యాపించినట్లెప్పి వొక్కసారి కలయచూసేడు. దూరాన దుక్కి బెడ్డలలో చూలుతూ దున్నుతున్న రైతు వొకడు కనబడ్డాడు. హృదయంలోని ఆవేదన, సానుభూతి ఆగక నిట్టూర్పు రూపంలో బయలుపడ్డాయి. "ఇలాంటి కష్టమయిన పనులన్నీ యంత్రాలే చేసేస్తాయి ముందుముందు. ఆ రోజులు వొస్తే ప్రజలు యిప్పటిలా శ్రమపడనక్కర్లేదు. అప్పటివరకూ నేను బ్రతికుండి చూస్తానా! దేవదోపు—అప్పుడే నడివయస్సుకూడా దాటిపోయిన నీకుకూడా యింకా అప్పటివరకూ బ్రతికివుండాలని వుందా? అప్పే-అంతవరకు బ్రతకవు. నీ స్మారక చిహ్నంగా గ్రిమాచీవాగ్ ప్రాంతాయ క్షేత్రంమాత్రం మిగులుతుంది. క్రమంగా అది అభివృద్ధిపొంది 'టూరిస్ట్'గా మారుతుంది. అప్పుడు వాళ్ళంతా దాన్ని ఫ్యాటిలోవ్ లాక్ స్టైమినస్ దేవదోపుపేర పిలుస్తారు........" అతని ఆలోచనలకి అతనికే నవ్వొచ్చింది.

"ఛూకర్! యింకా యింటి పోయేటికి వెడదాము."

"మూడో సారోపు వాయితే వెళ్ళిపోయినట్లే!"

"వృథాగా యెంతభూమి వృథాపడిపోయిందో చూడు. ఇల్లా అవుతే దేశానికి దరిద్రంకాక మరేముంటుంది. ఇంకో రెండు పంచవర్ష ప్రణాళికలు పూర్తి అయ్యేటప్పటికి ఇదంతా సేద్యంలోపెట్టి ఫ్యాక్టరీలు కడుతూంటాము. ఇక్కడ నువ్వు యింకోదశపాటు బ్రతికివుంటే యూనుగ్రప్పుబండి మూల పారేసి, మోటారు నడుపుతావు."

ఛూకరు పెదవి విరిచేసు.

"అంతయోగంకూడానా నాకు! 40 యేళ్ళక్రితం యే ఫ్యాక్టరీలోనో కూలివాడుగా చేరుతే నా జీవితం యింకోవిధంగా వుండియుండును. వ్యవసాయంలో అస్తమానూ దెబ్బతింటూనే వున్నాను. మొదటినుంచీ నాది

నష్టజాతకమే. దురదృష్టం నన్ను నేలనెట్టిరాసేసి మళ్ళీ తలయెత్తకుండా చేసేసింది."

"ఏం—అదేమిటి ?"

"ఆగండి, చెబుతాను, గుర్రాలు నెమ్మదిగా పోతూంటాయి. వాటిని ఆయాసపెట్టడం యెందుకు ? మీరు మంచివారు కనక వింటూన్నారు, లేక పోతే యెవరికి కావాలి యివన్నీ. నా జీవితంలో అడుగడుగుకీ గండాలే. పుట్టగానే యెఱుకలది నన్నుచూసి మా అమ్మతో "అమ్మా, కేటరీనా ! నీ కొడుకు మహా అదృష్టవంతుడవుతాడు. చూడండి. ముఖంలో ఆ కళ. చిన్ననుదురూ, గుమ్మడికాయలా తలా, పొణకలా ఆ పొట్టా, సన్నాని కీచు కంఠమూనూ" అంది. కాని కొద్దిరోజులలోనే అది చెప్పినవన్నీ అబద్ధం అని తేలిపోయింది. నేను పుట్టినరోజున యెన్నడూ లేనంత శీతలం వేసింది. నీళ్ళన్నీ గడ్డకట్టుకు పోవడంచేత గుక్కెడు నీళ్ళకికూడ కరువయింది. పక్షులు చలికి కొంకరించుకుపోయి యెక్కడివక్కడే దారున చచ్చిపోయే యని మా అమ్మ చెప్తూండేది. అలాంటప్పుడు నాకు మతం యిప్పించ డానికి టుబ్యాన్స్కో చర్చికి తీసుకువెళ్ళేరు. పోనీ మీరు చెప్పండి ; అలాంటి చలిలో చంటిపిల్లల్ని చన్నీళ్ళలో ముంచుతే యింకేమేనా వుందా, అందుచేత నీళ్లు కాచడం మొదలెట్టేరు. డీకనూ, ప్రీస్టూకూడా వొళ్ళెర క్కుండా తప్పతాగి వున్నారేమో, వొకడు సలసలా మరుగుతూన్న నీళ్లు తీసుగువచ్చి తొట్టెలో పోసేటప్పటికి రెండోవాడేనా ఆ నీళ్లు వేడిగానున్నా యేమోనని చూడకుండా, యేవో మంత్రాలు చదువుతూ నన్ను బుడుంగున ఆ నీళ్ళలో ముంచేడు. నా వొళ్ళంతా కమిలిపోయింది. మా వాళ్లు నన్ను ఇంటికి తీసుకువచ్చేటప్పటికి వొళ్ళంతా బొబ్బలు తేలిపోయేయి. అది మొదలు చాలాకాలంవరకూ యేదో రోగంతో తీసుగుంటూనే వున్నాను. కొంచెం పెద్దవాడినయి వీధులలో ఆడుకొనే వయస్సు వచ్చినది మొదలు దూడలు, కుక్కలు, వొకటేమిటి ఆఖరికి బాతులుకూడా తరుము కొచ్చి

బాధ పెడుతూండేవి ఒకరోజున గాడిద తన్నేటప్పుడికి స్పృహతప్పి పడి పోయేను. మావాళ్ళు నేను చచ్చిపోయేనని యేడ్చేరుకూడాను అప్పుడు. తొమ్మిదోయేడు దాటింది మొదలు అంతకంటె యెక్కువ ప్రమాదాలు సంభవిస్తోచ్చేయి. నా పదోయేటలావుంది గాలానికి చిక్కుకున్నాను...."

"ఏం గాలం?" అంతవరకూ పరధ్యాహ్నంగా వింటూన్న దేవి దోవు ఆశ్చర్యంగా అడిగేడు.

"మామూలుగా చేపలు పట్టుగునే గాలమే. అప్పుడు యీ వూళ్ళో 'కుపిర్' అనే ముసలితాత వొకడు వుండేవాడు. అతనికి బ్రహ్మచెముడు. శీతకాలంలో వుచ్చులుపోసి పిట్టల్ని పట్టుకొని వాటివల్లే బ్రతుకుతూ ఒక గుడారంలో కాలక్షేపం చేసేవాడు. వేసవిలో నదికిపోయి గాలాలువేసి, చేపలు పడుతూండేవాడు. ఆ రోజులలో యీ నది యింకా బాగా లోతుగా లాష్టినోవు మిల్లువరకూ వ్యాపించివుండేది. ఆ మిల్లు డామ్ క్రింద యెప్పుడూ వుంటూండే తియ్యనీటిచేపలు, పెద్దపెద్ద గండుమీనులు పట్టుగోడానికి గాలాలు వుచ్చుకుని వొక పొదవార కూర్చునేవాడు. అతను యెప్పుడూ గాలాలు తీసుగువచ్చి కొన్నిటికి యెఱ్ఱలను, మిగిలినవాటికి గండుమీనుల్ని పట్టుగోడానికి చినచిన్న చేపల్ని గుచ్చేవాడు. మేము కొంతమంది కుఱ్ఱాళ్ళం పోగడి అతని గాలాలు కొరికి యెత్తుకు పోతూండేవాళ్ళం. చెవులో బాకా వూదినా వినిపించనంత బ్రహ్మచెముడు — అతనికి. అందుచేత మేమంతా అతనికి దగ్గరగా నదివొడ్డున మరియొక రుప్పవార చేరి, బట్టలు విడిచేసి, యెవళ్ళమో వొకళ్ళం మెల్లిగా కెరటాలు రాకుండా నీళ్ళలో దిగి మునిగి అతని గాలాల క్రిందికి వెళ్ళి అందులో వొకటి పళ్ళతో కొరికేసి మళ్ళీ ఆ రుప్పవారకి వచ్చి తేలుతూండేవాళ్ళం. ఆ ముసలాడు కఱ్ఱపైకి యెత్తి చూసి గాలం లేకపోవడంతోటే నోరూనెత్తి మొత్తుకుని చేపలను తిట్టిపోస్తూండేవాడు. పాపం — అతడు యే గండుమీనో కొరికేసిందనుకొని వాటిమీద మండిపడు

తూండేవాడు; కాని మేమే చేసేమని యెరగడు. అతను ఆ గాలాలన్నీ షాపులో కొంటూండేవాడు. కాని యిల్లా కొనడానికి మా దగ్గర డబ్బు లేకపోవడంచేత అతన్ని మాయచేసి యెత్తుకుపోతూండేవాళ్ళం. ఒక రోజున మామూలుగా నేనోగాలం పట్టుకొని కొరికేసి రుప్పవారకి చేరేను. ఇంకో గాలంకూడా పట్టుకోవాలని తోచింది. అతడు హడా విడిగా యింకో గాలానికి యెర గుచ్చుతూండడం చూసి, మళ్ళీ నీళ్ళలో మునిగేను. నెమ్మదిగా వెళ్ళి ఆ తాడు నోట కరిచానో లేదో యింతలో హఠాత్తుగా గాలం పయికి లాగేసేడు. నా పళ్ళమధ్యనున్న తాడు జారి పోయి గాలం పై పెదవిలో గుచ్చుకుపోయింది. నేను గట్టిగా అర్చేను. అయితేమాత్రం వినిపిస్తేకదూ, గాలం నా బరువుచేత క్రిందికి దిగలాగు తూండడంచేత, అతను మరీగట్టిగా పైకి యెత్తడం మొదలెట్టేడు. బాధకి సహించలేక నేను కాళ్ళూ చేతులు గిలగిలా కొట్టుకున్నాను. నెమ్మదిగా నేను పైకి వెడుతూన్నాను. నా అడుగున కర్రవొకటి పెట్టినట్లు అనిపిం చింది. ఆఖరికి యెల్లాగయితేనేమి నన్ను నీళ్ళపైకి లాగేసేడు. ఆ ముసలాడి పై ప్రాణాలు పైనే యెగిరిపోయేయి. నోట మాట వచ్చిందికాదు. భయం చేత ముఖం నల్లగా మాడిపోయినట్లయిపోయింది. భయపడ్డాడంటే ఆశ్చర్యం యేముంది. మంచి గండుమీను తగులుకుందని తీరా పైకి లాగి చూసేటప్పటికి పిల్లాడు! అలాగే కొంతసేపు విస్తుపోయి చూస్తూ, నిల బడి ఆఖరికి ఆ గాలం క్రిందపారేసి పరుగు లంకించుకున్నాడు. ఇంక మళ్ళీ తిరిగేనా చూడకుండా పారిపోయేడు. గాలం ఆలా నానోట్లో ఉండ గానే నెమ్మదిగా యింటికి చేరుకున్నాను. మా నాన్న ఆ గాలం కోసి తీసేసి స్మృతి తప్పి పడిపోయేటట్లు చావకొట్టేడు. క్రమంగా కొన్నిరోజు లకి ఆ పెదవిమీద గాయం పోయింది. కాని 'ఘూకరు' అని పేరుమాత్రం మిగిలింది. అప్పటినుంచీ నా అసలుపేరు పోయి ఆ మారుపేరు శాశ్వ తమైపోయింది.

"ఆ మరుసటి సంవత్సరం వసంతకాలంలో వొకరోజున బాతుల్ని గాలిమర దగ్గరకు తోలుకుపోయేను. గాలిమర పని చేస్తూంది—ఆపక్కనే మా బాతులు మేస్తూన్నాయి. బాతులు బాగా కండపట్టినవిగా వున్నాయేమో డేగ వొకటి వాటిని మెప్పుడు యెత్తుకు పోదామా అని ఒడుపువేసి తిరుగుతూంది. కాని నేను జాగ్రత్తగా కాస్తూ, డేగని దూరంగా తరిమివేస్తూనే వున్నాను. "ఇంతలో మరికొంతమంది కుర్రాళ్ళు వచ్చేరు. మేమందరం ఆ గాలిమరరెక్కలమీద లేవడం మొదలెట్టేము. రెక్కమీద యెక్కుతూండడం రెండుగజాలపైకి లేచేటప్పటికి కిందికిదూకి లేస్తే దానితరువాత రెక్క నెత్తికితగులుతుందని అదికూడా దాటిపోయినతరువాత లేచి, అవతలకి వెళ్ళిపోతూండడం—యిలాచేసేం కొంతసేపు. కాని అంతటితో వూరుకున్నామా. రెక్కమీద యెవరు చాలాయెత్తుకుపోతే వాడిని రాజుగా చేసి మిగిలినవాళ్ళంతా వాడిని భుజాలమీద యెక్కించుగుని వూరువగ్గరకి మోసుగుపోవాలని అనుకున్నాము. ఎవరిమటుకు వాళ్ళకే రాజవాలని వుంది. నేనుకూడ అందరికంటె యెత్తుకిపోవాలని అనుకుంటూ హడావిడిలో బాతుల సంగతి మరిచిపోయేను. రెక్కమీద కొంతపైకిలేచి మేవాలాభాలి ఆలా చూసేటప్పటికి డేగ బాతునొకదానిని తన్నుకుపోవడానికి వొస్తూండడం కనిపించింది. బాతుపోతేయింటివగ్గర దెబ్బలుతగులుతాయన్న భయంచేత రెక్కమీద పైకిలేస్తూన్న సంగతి మరచిపోయి "వొరేయ్! డేగ బాతుని యెత్తుకుపోతూంది. తరిమెయ్యండి!" అని కేకేసేను. మళ్ళీ జ్ఞాపకం వొచ్చి చూచేటప్పటికి రెక్క బాగా పైకి లేచిపోయింది. అక్కడనుంచి వురకడానికా భయంవేసింది. పోనీ పైకి వెడదామా అంటే అంతకంటె భయంవేసింది. ఏమిటి చేసేది అప్పుడు? ఏమైపోతామో అనుకుంటూండగానే రెక్క వెళ్ళవలసినంత యెత్తు పయికివెళ్ళి మళ్ళీ క్రిందకి దిగడం ప్రారంభించింది. కాళ్ళపైకి తలక్రిందకి అవడముచేత పట్టుజారిపోయి పడిపోయేను. ఎంతసేపటికి నేలమీదికి పడ్డానో నాకేమీ తెలియదు.

పడగానే లేచి చూసుకునేటప్పటికి చేతి యెముకలు విరిగిపోయి గుత్తి దగ్గర చర్మం పొడుచుకుని పైకివచ్చేయి. విపరీతమయిన బాధగా వుండడంచేత బాతుల సంగతే మరిచిపోయేను. డేగ బాతు నొకదాన్ని యెత్తుగుపోయింది. కానివస్తూంటే సంధ్యామంత్రం అన్నట్లు చెయ్యివిరిగి బాధపడుతుంటే ఆగొడవ యెవడికి కావాలి. కట్లుకట్టిన కొన్నినెలలకి యెముకలు అతుక్కున్నాయనుకోండి. అయితేమాత్రం యేమిటి? మళ్ళీ అమరుసటి సంవత్సరమే అంతకంటె పెద్దగండం మరియొకటి సంభవించింది. సైంటు పీటర్సు పండుగ అయిన మరునాడే నేనూ మా అన్నా కలసి నండి ముగ్గారి పోయివున్న చేను కొయ్యడానికి వెళ్ళేము. నేను గుర్రాల్ని తోలుతూన్నాను. మాఅన్న పనలుకట్టి ప్లాట్ ఫారం మీదనుంచే కిందికి పారేస్తూన్నాడు. ఎండ మంచి తీక్షణంగా వుండడంచేత సీటులో నే వొక్క కునుకు తీదామా అనుకుంటూవున్నాను. ఇంతలో పక్కకి చూసేటప్పటికి, వాళ్ళలో పెద్దపక్షి వొకటి కనిపించింది. నేను గుర్రాల్ని ఆపేను. మాఅన్న కొడవలి పుచ్చుకుని దానికోసం బయలుదేరబోయేడు. కాని నేను "అబ్బే వాన్ని చంపకుండా పట్టుకుంటాను. నువ్వు రాకు." అని హఠాత్తుగా దానిమీదకి వురికి రెండుచేతులతోను కౌగలించి పట్టుగున్నాను. అది హడలిపోయి రెక్కలతో నాతలమీద కొడుతూ నెమ్మదిగా లాక్కుపోవడం మొదలెట్టింది. దానికి యేంతోచిందో తెలియదుకాని వెనకతిరిగి గుర్రాలు వున్నవైపుకేవచ్చి తిన్నగా వాటి కాళ్ళలో పడింది. గుర్రాలు బెదిరి నామీదనుంచి ఉరికి పరుగెత్తసాగేయి. ఒక్క నిముషం దాటుతే నేను గుర్రాలు లాక్కుపోతూన్న మరనాగలికింద పడి చచ్చిపోదును. వెంటనే మా అన్న లివరునొక్కి నాగళ్ళు పయికి యెత్తేసేడు. ప్లాట్ ఫారంక్రిందపడి, దానితోకూడా యీడ్చుకుపోయింది. ఒక గుర్రం కాలు యెముకలోకంటా తెగిపోయింది. నాకుకూడా వొళ్ళంతా గాయాలే. కొంతసేపటికి మా అన్నగారు యేలాగో తంటాలుపడి గుర్రాల్ని ఆపి అందులో వొకదానినివిప్పి నన్నుదానిమీద వూళ్ళోకి తీసుగువచ్చేడు. ఆ రోజుల్లా నాకు స్మృతి లేదు. ఇంతా శ్రమపడితే ఆఖరికి ఆ పక్షి దొరకనేలేదు. ఆ

పర్యాయం చాలాకాలంవరకు మళ్ళీ తేరుకోలేదు. ఆమినెలా తరువాత వొకసారి అవతర్ల యింటికి వెళ్ళి వస్తూంటే అంబోతు వొకటి యెదురయింది. నేను పక్కకి తప్పుకుని వస్తూంటే అది పోకయెత్తి మన కొమ్ముతూ మీదికి వచ్చింది. ప్రాణాలంటే యెవరికి తీపికాదు చెప్పండి. నేను గబగా పరుగెత్తేను. కాని అది నావెనక్కాలే పరుగెత్తుకువచ్చి, కొమ్ములతో పొడిచి దూరంగా పారేసింది. దానితో పక్క యెముకలు విరిగి పోయేయి. అందుచేత 21వయేట నన్ను సైన్యంలో చేర్చుకొనడానికి పరీక్ష చేసి అనర్హుడనని తోసేసేరు. ఒక్క ఆబోతులేకాదు పాములు కుక్కలు కూడా నన్ను చూస్తే నల్లేరుమీద బండిలా మీదికి వచ్చేవి. నా గ్రహచారం యేమిటో తెలియదు కాని యేకుక్కైనా గొలుసు తెంపుకుంటే అది నా మీదకే వచ్చేది. పోతే యేది యెక్కడుందానైనా అలా వెళ్ళేవాడిని. అంతే—యెదురు పడగానే మీదపడి బట్టలు చింపేసో లేకపోతే కాలు పుచ్చుగు పీకో వొదిలిపెట్టేది. ఒకసారి స్టెప్పిలో అడవిపంది మీదపడి చప్ప పీకేసింది. మరొకసారి యెద్దువొకటి తరుముకురావడంవల్ల నాబుజ్జి పోయేయి. ఒకరోజురాత్రి వీధిలోనుంచి వెళుతూన్నాను. దొనిట్‌సోక్వే యింటిదగ్గర ఆబోతుమళ్ళీ యెదురయింది. అది రంకెవేసి నేలదువ్వటం మొదలెట్టింది. ‘అబ్బో—యిది మీదపడేలావుందే.’ అనుకుంటూ తగు జాగ్రత్తలోవుండి యింటివారే నడుస్తూన్నాను. అదికూడా నావెనకే రావడం మొదలెట్టింది. నేను పరిగెత్తడం మొదలెట్టేను. దాని రంకెకూడ వెనక్కాలే వినపడింది. వీధివైపుకివున్న ఆయింటి కిటికీ తీసివుంటే దానిలోనుంచి యింట్లోపడి ప్రాణాలు దక్కించుకున్నాను. అందులో యెవ్వరూ లేరు. అందుచేత ‘ఆబోతు వెళ్ళిపోయినతరువాత చల్లగా అవతలకి పెట పోదం, వాళ్ళని లేపకుండా’ అనుకున్నాను. ఆ ఆబోతు పెద్ద రంకెలువేసి గోడఅంతా కొమ్ములతోతవ్వి కొంతసేపటికి వెళ్ళిపోయింది. నేనుకూడా కిటికిలోనుంచి వీధిలోకి దిగబోతూంటే యెవరిదో చెయ్యి నన్నుపట్టుగుని వెనక్కి లాగింది. ఆపట్టుకున్నది ఆయింటియజమాని దొనిట్‌సోక్వే

చప్పుడువిని చూడడానికి వచ్చి నేను కిటికీలోంచి క్రిందికి దిగుతూంటే వచ్చి పట్టుకున్నాడు. "ఏమిరా అబ్బాయి—యింత చీకట్లో యెందుకు వచ్చేవు యిక్కడికి?" అని అడిగేడు. "అబోతు తరుముకొస్తే యిలా పారిపోయి వచ్చేను." అన్నాను. "ఛీ–వెధవా! అబోతు తరుముకు వచ్చిందిరా నిన్ను! అంతా అబద్ధం—మాకోడలు వోల్యా కోసం అని వచ్చేవు నువ్వు." అంటూ కొట్టడం మొదలెట్టేడు. వయస్సుమళ్ళినా చాలా బలంగావున్నాడు. జబ్బపట్టుగుని వాళ్ళ కోడలుదగ్గరికి లాక్కుపోయేడు. ఆకొట్టడంలో కొన్నిపళ్ళుకూడావూడిపోయేయి నాకు. "ఇంక యెప్పుడూ మా వోల్యాదగ్గరకు రావుకదా" అన్నాడు. "రాను. యింక యెప్పుడూరాను. నీ వోల్యాని నీమెడకి కట్టుగో." "సరే, ఆ బూట్లు విప్పి యిచ్చెయ్యి ముందు." నాకువున్న వొక్కబూట్లజత యిచ్చెయ్యడానికి నాకు ప్రాణం వొప్పిందికాదు. ఆ తరువాత ౫ సంవత్సరాలవరకూ ఓల్యాపేరు జ్ఞాపకంవొస్తే అరికాలుమంట నెత్తికెక్కేది. నాది తాచుపాముపగ. మీరు, నేను టిటాక్‌ని అరెస్టు చేసేటప్పుడు ఆ కుక్క మిగిలినవాళ్ళ నందరిని వదిలేసి నామీదే యెందుకు పడింది? దానికి నాకంఠం దొరకనిచ్చేనుకాను. లేకపోతే యీపాటికి యేమయేవాడినో. ఇల్లాంటివి మనం అనేకం చూసేము. ఇంతకీ రివాల్వరు లేకపోవడంవచ్చింది. ఆ రివాల్వరేవుంటే యేమయి వుండును? శవాలు కుప్పలు–తిప్పలుగాపడవలసినదే. కోపం రానంతసేపే, వచ్చిందంటే అన్నిటికీతెగిస్తాను. అప్పుడు ఆకుక్కని, టిటాక్ భార్యనీ, టిటాక్‌నీకూడా చంపేసియుందును. హత్యానేరంమోపి నన్ను ఖైదులో పారేద్దురు. ఏపనీ లేకుండా గోళ్ళు గిల్లుకుంటూ ఖైదులో కూర్చోడం అంటే నాకు అసహ్యం. అదీకాక నేను చక్కపెట్టుకోవలసిన పను లున్నాయి. అనేకం.......... ఆ మంత్రసాని చచ్చిపోయిందికాని లేకపోతే నిలువునా చీరేద్దును. పెద్దపులితో చెలగాటం నాతో పనంటే. అదిగో మనదళం; వచ్చేసేము."

# ముప్ఫైరెండో ప్రకరణము.

## పార్టీలోనుంచి తొలగించడం.

రజ్మటోవ్నిప్ గుమ్మాల్లోనిలబడి బూట్లని పట్టుగున్న వాడి తుమతుమ గుని, నగుల్నోవ్ కిటికీలోంచి బయటికిపడుతూన్న లాంతరు వెలుతురు చూసి “ఇంకా నిద్దరపోలేదులావుంది; ఇప్పటిదాకా ఏంచేస్తూన్నాడు చెప్మా?” అనుకుంటూ తలుపుతీసి గదిలోకి వెళ్ళేడు.

టేబులుమీద ఒకమూల చిన్నలాంతరు వెలుగుతూంది. పుస్తకం ఒకటి తెరిచివుంది. మకార్ కుడిచేతిమీద గడ్డం ఆనుకుని కొంచెం ముందుకు వంగి తదేకదీక్షతో పుస్తకంవైపు చూస్తున్నాడు.

“ఏమోయ్, మకార్! ఇంతరాత్రిదాకా ఇంకాఏమిటీ—చేస్తున్నావు?”

నగుల్నోవ్ తలయెత్తి విసుగుదలతో రజ్మటోవ్నివు కేసిచూసేడు.

“ఏం వచ్చేవు?”

“ఊరికేనే; ఏమితోచకపోతే కొంతసేపు నీతో బాతాఖానీవేసి పోదం అని వచ్చేను; నీపనికి ఏమేనా అడ్డా?”

“అడ్డుఅవుతే అవుతుంది. కూర్చో. వచ్చినవాణ్ణి వెళ్ళిపొమ్మంటే బాగుండదు.”

“ఆ చదివేది ఏమిటీ?”

“ఏదో కాలక్షేపానికి.” మకార్ పుస్తకంచేతితో కప్పి ఆంద్రీకేసి చూసేడు.

“నేను మెరీనాను విడిచిపెట్టేసేను.........” ఆంద్రీ నిట్టూర్పు విడిచి దిగాలుపడి కూర్చున్నాడు.

“ఇంతక్రితంయెప్పుడో చేసి వుండవలసింది ఆపని నువ్వు.”

“ఏం?”

"ప్రతిదానికీ నిన్ను దిగపీకుతూందికనక. జీవితంలో అనవసరపు బాదరబందీ అంతా వదల్చుకోనవలసినస్థితులలో వున్నాం మనం ఇప్పుడు. మనబోటి కమ్యూనిస్టులు ఏవో ఇతర చిల్లరవిషయాలలో సరదాగా కాలం గడుపుతూ కూర్చోవలసిన సమయంకాదిది."

"మేమిద్దరం ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకున్నప్పుడు అది చిల్లర విషయం ఎల్లా అవుతుంది?"

"మీ ఇద్దరికీవున్న ప్రేమ ఏమిటది? అది మెడకి తగుల్చుగున్న గుదిబండగాని ప్రేమకాదు. నువ్వు ఎక్కడికేనా మీటింగుకి వెళ్ళేవంటే అది కూడా వెనకాలే తయారయి అస్తమానూ కళ్ళు నీమీదే పెట్టి కూర్చుని, నువ్వు ఆడవాళ్ళ నెవరినేనా చూస్తున్నావేమోనని కాపలాకాస్తూంటుంది. ఆంత్రీ! అది శిక్ష కాని ప్రేమకాదు."

"అయితే కమ్యూనిస్టుఅయినవాడెవడూ ఆడవాళ్ళని ప్రేమించ కూడదన్నమాట; బుడ్డకొట్టినయెద్దులా జీవితంఅంతా పనిచెయ్యడమే కాని ఇంకేమీ అక్కర్లేదు?"

"అయితే అదిసాధ్యంకాదంటావా? ఏదోయింతక్రితమే పెళ్ళిచేసుగున్నవాళ్ళనిఅల్లావదలిపెట్టి, ఇకపైనుంచి యువకులెవరూ పెళ్ళిళ్ళు చేసుగో కూడదని డిక్రీపాస్ చేద్దును అధికారమేకనక నాచేతిలోవుంటే, ఆడదాన్ని కట్టుగు వేళ్ళాడేవాడుచస్తే బోల్షివికు అవలేడు. ఈగ తేనెచూస్తే వదలలే నట్లు మనము ఆడవాళ్ళనిపట్టుగు వదలలేము, నేనుచెప్పేవి ఉత్తమాటలు కావు; ఎంతోఅనుభవంమీద చెబుతున్నమాటలు ఇవి; సాయంత్రం భోజనం అయినతరువాత, నేను ఏదోచదువుకుంటూ కూర్చుంటే, మాఆవిడ పోయి పడుకునేది. నాలుగుపంక్తులుచదివి నేనుకూడా పోయి పక్కవాల్చేటప్పటికి మూతిముడిచి అవతలవైపుకుతిరిగి పడుకునేది. దానితోనాకు ఒళ్ళుమండిపోయేది. ఆకోపంచేత ఎంతకీనిద్రపట్టక సిగరెట్టువిడిచి సిగరెట్టుకాలుస్తూ చాలా

రాత్రివరకూ అలాగే కూర్చుంటూండేవాడిని. అందుచేత నిద్రచాలక బడలికగావుండేది అనుకున్న పని సరిగా చెయ్యలేకపోయేవాడిని. పెళ్ళాం ఒకత్తె వుంటేనే ఇల్లావుంటే ఇంక పిల్లలుకూడా వుంటే వేరేచెప్పాలా! వాళ్ళు ఏదో సంసారం చూసుకుంటూ పిల్లల్ని సంరక్షించుకోడానికి తప్ప పార్టీకిఎందుకూ పనికిరారు. పూర్వం జారు ప్రభుత్వం రోజులలో నేను సైన్యంలోచేరే కొత్తయువకులకి బోధిస్తూండేవాడిని. బ్రహ్మచారులు మంచిఉత్సాహంగా తెలివైన ముఖాలతో కళకళలాడుతూండేవారు. కాని వాళ్ళే పడుచుభార్యలను ఇళ్ళలో వదలి సైన్యములోచేరడానికి వెళ్ళేక పెద్దమొహాలు వేసి ఈసురోమని వుండేవారు. అల్లాంటప్పుడు వాళ్ళకిమనం ఏమిచెప్పినా బుర్రకెక్కదు. మనం సమీపభవిష్యత్తుగురించి చెబుతూంటే వాళ్ళు అతిశ్రద్ధగావింటూన్నట్లు నిశ్చలంగాకూర్చుంటారు. వాళ్ళకళ్ళు మనవైపేచూస్తుంటాయి. కాని మనస్సులుమాత్రం పడుచుపెళ్ళాలమీదవుంటాయి. దానివల్లఏంలాభంచెప్పు? పూర్వం ఎవరుఎల్లాఏడ్చినా ఇబ్బందిలేకపోయేది. ఇప్పుడు అల్లావీలులేదు. పార్టీకోసంచేరేక అవిఅన్నీ వదిలిపెట్టాలి. ప్రపంచవిప్లవం వచ్చినతరువాత ఆడదానితో కట్టుకట్టుగుని ఎందులోనేనా దిగినాసరే ఎవరికీఅక్కర్లేదు. కాని ఇప్పుడుమాత్రం సమస్తశక్తులూ కేంద్రీకరించి విప్లవంకోసం పనిచెయ్యాలి."

మకార్ లేచి ఒళ్లువిరుచుకుని రజ్మట్నోవ్ భుజంతట్టేడు. "నీహృదయంలో విచారంఅంతా నాదగ్గిరవెళ్ళబోసి నాసానుభూతి పొందుదామని వచ్చేవు నువ్వు: అవునా! కాని, ఆండ్రీ! నేనుమాత్రం యీవిషయంలో సానుభూతిచూపించలేను. ఆసార్జంటు భార్యనిఒదిలేసేనంటే నాకు మహా సంతోషంగావుంది! దాని కొవ్వు అణిగేలా గట్టిగాదేహశుద్ధికూడా చెయ్యవలసింది. నేను లుకిరియాని ఒదిలేసేనుచూసుగో. ఏవిచారమూలేదు నాకు యిప్పుడు. ఇదివరకుఉండే అడ్డుకాస్తాకూడా తీరిపోయింది. చికిలీచేసిన కత్తిలా కమ్యూనిజాన్ని ప్రతిఘటించేవాళ్ళనందర్నీ చెలికెయ్యాలన్నంత

ప్రుత్సాహంగావుంది. పైగా స్వయంగా చదువుకుని జ్ఞానం అభివృద్ధిపరచు కోడానికి కూడా అవకాశం కలిగింది."

"ఏమిటి చదువుతున్నావు? ఏదేనాశాస్త్రమా?" రజ్మట్నోవ్ అయిష్ట తగా, ముక్తసరిగా అడిగేడు. మకార్ మాటలకి అతనికి బాగాకష్టంతోచింది. వివాహం విషయంలో మకార్ చెప్పినది సర్వాసహ్యంగా తోచింది. మకార్ తీవ్రంగా, ఉద్రేకంగా మాట్లాడుతూంటే. ఆంద్రీకి ఒకసారి "ప్రభు త్వాన్ని వీడిచేతుల్లోపెడితే ఇంకచెయ్యనిదేమేనా వుంటుందా? ఈవుద్దేశాలకి తగినట్లుగా జీవితంఅంతా తల్లకిందులు చేసేస్తాడు. ఆడాళ్ళమీది వ్యామో హంచేత కమ్యూనిజంకోసం సరిగా పనిచెయ్యరేమోనని మొగాళ్ళకందరికి పిచ్చెలు తీసెయ్యడానికికూడా సందేహించడు." అనుకున్నాడు.

"ఏం చదువుతున్నానంటా?" అంటూ మకార్ చప్పుడయేటట్లు పుస్తకం మూసి "ఇంగ్లీషు" అన్నాడు.

"ఏమిటి?"

"ఇంగ్లీషు. దీని పేరు ఇంగ్లీషుస్వబోధిని." నగుల్నోవ్ ఆంద్రీ కేసి తీక్షణంగా చూసేడు. అతనుహేళనచేస్తాడేమోనన్న బెదురుతో. కాని ఈ అనుకోని విషయం వినడంతోటే ఆంద్రీ ఆశ్చర్యపోయేడు. అతని ముఖంలో ఆశ్చర్యంతప్ప మరేమీ కనిపించిందికాదు మకార్‌కి.

"అయితే.........ఆభాషలో చదవడం రాయడంకూడా తెలుసునా?"

"అబ్బే. అప్పుడే! ఒక్కసారిగా చేతనవుతుందా. కాని, ఇప్పు డిప్పుడే కొద్దిగా చదవగలుగుతున్నాను. అప్పుడే నాలుగు నెలలనుంచి నేర్చుకుంటున్నాను."

"ఏం-బాగాకష్టంగా ఉంటుందా?" ఆంద్రీ ఉమ్మిగుటగేసి మకార్ నుంచి పుస్తకంకేసి గౌరవంగా చూసేడు.

రజ్మట్నోవ్, తనచదువువిషయమై ఆతురతగా వినడం చూసి, అంత వరకూలా ముక్తసరిగాకాక స్వేఛ్ఛగా దాపరికంలేకుండా మాట్లాడసాగేడు.

"చాలాకష్టం. ఈనాలుగునెలలలోనూ నాలుగుమాటలకంటె ఎక్కువ నేర్చుగోలేకపోయేను. కాని మొత్తంమీద మనభాష ఆభాషాకూడా ఒకటే పోలిక. కొద్దిరూపాంతరం పొందిన మనమాటలు అనేకంవున్నాయి వాళ్ళ భాషలో. నిజంచెప్పవలెనొస్తే, ఆభాష ప్రపంచంలో అన్నిదేశాలలోనూ కూడా చెల్లుబడి అవుతూంది."

"అయితే ప్రత్యేకంగా ఆభాషే చదువుతున్నావేమిః" మరాక్ చిరు నవ్వు నవ్వేడు.

"ఆంద్రీ, వెర్రిప్రశ్నలు మహావేస్తావే నువ్వు! నీ తెలివితక్కువ తనంచూస్తే నాకేఆశ్చర్యంవేస్తూంటుంది ఒకొక్కొక్కప్పుడు. నేను కమ్యూనిస్టుని. అప్పుడా ఇకముందు ఇంగ్లండులోకూడా సోవియట్ ప్రభుత్వం వస్తుందంటావా లేదాః ఒస్తుందంటావు. అయితే మనరష్యన్ కమ్యూనిస్టులలో ఇంగ్లీషుమాట్లాడగలిగినవాళ్ళు ఎంతమంది వుంటారంటావుః మహా వుంటే కొన్నివందలుండవచ్చు. ఈ ఇంగ్లీషు పెట్టుబడిదారులు ఇండియా మొదలైన అనేక దేశాల్ని ఇంచుమించు సగం ప్రపంచం ఆక్రమించుకుని నల్లజాతులవాళ్ళని అణిచేస్తూన్నారు. అదియేమంటంటావుః ఇంగ్లండులో సోవియట్ ప్రభుత్వంఏర్పడుతూంది—దాగానేవుంది. కాని చాలామంది బ్రిటిష్ కమ్యూనిస్టులకి, వర్గశత్రువుల అసలునగ్న స్వరూపం తెలియదు. అందుచేత వాళ్ళయెడల ప్రవర్తించవలసిన విధానంలో ప్రవర్తించరు. అప్పుడు నేను బ్రిటిష్ కమ్యూనిస్టులకి సరియైన శిక్షణ ఇవ్వడానికి వెడతాను. నాకు వాళ్ళభాషకూడా తెలిసియుండడంచేత, ఏమాత్రం ఆలస్యం లేకుండా వెంటనే పని ప్రారంభంచెయ్యొచ్చు. 'విప్లవం వచ్చిందా మీ దేశములోః' అని అడుగుతాను. 'కమ్యూనిస్టువిప్లవమేనాః అయినట్లయితే వెంటనే పెట్టుబడిదారుల్ని, సేనానాయకుల్ని పట్టుగోండి ముందు. 1917వ సంవత్సరములో రష్యాలో మేము తెలివితక్కువ ఆలోచనలుచేసి వాళ్ళని

ఒదిలేసేము. వెంటనే వాళ్ళుపారిపోయి మళ్ళీ మాపీకెలమీదికి తెచ్చేరు. వాళ్ళని చంపిపారెయ్యండి. విప్లవం జయప్రదం అవాలంటే మొట్టమొదట చెయ్యవలసిన పని అదే.' మకార్ ముక్కులు పెద్దవిచేసి, రెప్పలారుస్తూ ఆంద్రీకేసి చూసేడు. "ఇప్పుడు నేను ఇంగ్లీషు ఎందుకు నేర్చుగుంటూ న్నానో తెలిసిందా? రాత్రల్లా ఇదేపనినాకు నాశక్తిఅంతా దీనికోసం ధార పోస్తాను. కాని......... ...." పళ్ళు పటపటా కొరికేడు. "........ .. కాని ఏమైనాసరే ఈ భాష నేర్చుగుతీరుతాను. ప్రపంచవిప్లవ వ్యతిరేకులతో ఏమీ దయాదాక్షిణ్యాలు లేకుండా క్రూరంగా ఇంగ్లీషులో మాట్లాడుతాను! వాళ్ళని తగలెయ్యా ఆ ద్రోహుల్ని చావనీ నాకేం! మకార్ నగుల్నోవ్ తడాఖావాళ్ళకి చూపిస్తాను, ఏకోశానా దయాదాక్షిణ్యాలు చూపించకూడదు. 'అయితేనువ్వు మీ ఇంగ్లీషుకూలీలని, హైందవుల్ని, ఇంకా ఇతర అస్వా తంత్రజాతుల్ని రక్తం పీల్చి పిప్పిచేసేవుకామా? సరే—అల్లా గోడనిజేర బడి నిలబడరా ద్రోహీ. తోటిమానవుల శ్రమశక్తిని దోచుగున్న నీకు అదే సరియైనశిక్ష.' వాళ్ళతో నేను మాట్లాడేముక్కలు ఇవే ఆమాటలే ముందు నేర్చుగుంటాను—లేకపోతే అప్పుడు మాట్లాడడానికి తడుముకోవలసి వస్తుంది."

ఇంకో అరగంటవరకు వాళ్ళిద్దరూఏవోపిచ్చాపాటీ మాట్లాడుకున్నాక ఆంద్రీ యింటికి వెళ్ళిపోయేడు. నగుల్నోవ్ మళ్ళీ పుస్తకందగ్గిర కూర్చు న్నాడు. నిశ్శబ్దముగా పెదవులు కదుపుతూ, ఏదో కఠినవిషయం తెలుసు కొనుటకు ప్రయత్నిస్తూన్నట్లు కనుబొమలుముడేసి ఆలోచిస్తూ తెల్లవారకట్ల తెందున్నరవరకు ఇంగ్లీషు నేర్చుకుంటూ అల్లాగే కూర్చున్నాడు.

మరునాడు ఉదయాన్నే లేచి రెండుగ్లాసులపాలు తాగి సమిష్టి వ్యవసాయక్షేత్రపు తబేలాకి వెళ్ళేడు.

"మంచిబాగాపోయే గుర్రాన్ని ఒకదాన్ని ఇయ్యి." అప్పుడు డ్యూటీమీదఉన్న అతనిని అడిగేడు.

అతడు బాగా చింతపిక్కలా ఉన్న గుర్రాన్నొకదాన్ని తీసుగు వచ్చి ఎదటనిలబెట్టి.

"చాలాదూరంవెడుతున్నారా?" అని అడిగేడు.

"జిల్లాపట్టణానికి. ఎల్లాగైనా ఈరాత్రికి తిరిగి వచ్చేస్తానని చెప్పు దేవిదోవృతో."

"గుర్రంమీద వెడలారా?"

"అవును. జీనుకూడా తీసుగురా."

మకార్ గుర్రానికి జీనువేసి, మెడతాడు తీసేసి, కంటికినవరుగా బాగా కనిపిస్తూన్న టిటాక్ తాలూకు కళ్ళెం తగిల్చి మంచినేర్పుతో ఎగిరి గుర్రంమీదకూర్చున్నాడు. గుర్రంకదంతొక్కుతూ బయలుదేరింది. గేటు దాటుతూంటే అతాత్తుగా బోకారింది. కాని కిందపడిపోకుండా ఎల్లాగో నిల తొక్కుకుని లేచి నిలబడింది.

"ఏం–అంత కళ్ళుమూసుగు నడుస్తున్నావా ఏమిటి?" అంటూ మకార్ చబుకుతో చురుక్కుమని రెండు తగిలించేడు.

"క్రామేడ్ నగుల్నోవ్. ఒక్కసారికూర్చుని మరీ వెళ్ళు. అదుగులో హంసపాదు అన్నట్లు గేటుదాటుతూంటేనే అపశకునం అయింది." అంటూ మకార్ ఎదురవడంచేత దోవవదలి నిలబడ్డ ఛూకర్ అన్నాడు.

మకార్ఏమీ సమాధానంచెప్పకుండా బయలుదేరి వెళ్ళిపోయేడు. గ్రామసోవియటు దగ్గిర ఒక డజను మంది ఆడవాళ్ళు నిలబడి చేతులు తిప్పుగుంటూ దేనినిగురించో గంద్రగోళంగా మాట్లాడుకుంటూన్నారు.

"ఏయ్—దోవలో తప్పుగోండి; లేకపోతే మీదనుంచి పోనిస్తాను. గుర్రం." అంటూ మకార్ వేళాకోళంగా కేకేసేడు.

ఆడవాళ్ళు మాట్లాడకుండా పక్కకి తప్పుగున్నారు.

అతను దాటి వెళ్ళిన తరువాత ఎవరో మంచికోపంగా "ముందు నీ మాట చూసుగో, తరవాత మమ్మల్ని తొక్కిద్దువుగాని. నిన్నుతగలెయ్యా! ఏం చూసుగునో అంతమిడిసిపాటు—అంతా అణుగుతుందిలే వెళ్ళు." అనడం అతని చెవినిపడింది.

జిల్లాబ్యూరో సమావేశం పదకొండుగంటలకి ప్రారంభమయింది. ఎజండాలో జిల్లావ్యవసాయశాఖాధికారిబ్రైగ్లిక్—మొదటిఅయిదురోజులలోను జరిగిన చల్లికలనుగురించి ఇచ్చినరిపోర్టుకూడా ఉంది. బ్యూరో మెంబర్లే కాక డిస్ట్రిక్టుకంట్రోల్ కమీషన్ ఛైర్మన్ సెమోఖ్కినండ్, జిల్లాప్రోసిక్యూటరుకూడా హాజరయేరు ఆసమయానికి.

నిర్మాణశాఖాధికారి హరూమూటోవ్ నగుల్నోవుతో "అట్టేఎక్కడికీ వెళ్ళకు. నీవిషయమై కూడావస్తుంది యిప్పుడు." అన్నాడు.

బ్రైగ్లిక్ రిపోర్టుచదవడానికి అరగంటసేపు పట్టింది. అంతసేపూ సభ్యులు ఆతురతతో నిశ్శబ్దంగా కూర్చున్నారు. భూమి పదునికి వచ్చినప్పటికీ ఇంకా జిల్లాలో కొన్నిప్రాంతాలలో చల్లికలు ప్రారంభించనేలేదు. కొన్నిగ్రామసోవియటులు అవి వసూలు చెయ్యవలసిన విత్తనపుధాన్యం వసూలు చెయ్యలేదు. వయొస్కవాయ్‌లో రాజీనామాయిచ్చిన సమిష్ఠి వ్యవసాయక్షేత్ర సభ్యులందరూ ఎవరివివాళ్ళుపట్టుగుపోయేరు. ఓల్ఖోవట్స్కిలో స్వయంగా మేనేజిమెంటు కమిటీయే పంచిపెట్టేసింది. రాజీనామాయిచ్చిన సభ్యులకందరికీ. అతడు జిల్లాలో చల్లికలు యింతపాడుగా ఉండడానికిగల కారణాలు వివరంగా చర్చిస్తూ తన ఉపన్యాసం ఇల్లాముగించేడు.

"కామ్రేడ్సు, చల్లికలు వెనకబడడానికి కారణం, వెనకబడడమే కాదు బయలుదేరినచోటనే ఉండడానికికారణమనికూడా చెప్పచ్చు. చాలా గ్రామాలలోని సమిష్ఠివ్యవసాయ క్షేత్రాలు అక్కడ స్థానికవర్కర్ల తీవ్రమైన ఒత్తిడిచేత ఏర్పరచబడ్డం, మరికొన్నిగ్రామాలలో రివాల్వరుచూపించి

భయపెట్టికూడా సభ్యులుగా చేర్పించడం. అందుచేతనే సమిష్టివ్యవసాయ క్షేత్రాలన్నీ ఇప్పుడు పేకమేడల్లా కూలిపోతూన్నాయి. ఇక అల్లా కూలి పోకుండా మిగిలిన వాటిలోనైనా పని సరిగ్గా జరగడంలేదు."

డిస్ట్రిక్టుకమిటీ సెక్రటరీ హెచ్చరింపుగా చేతిలోని పెనిసిలుతో టేబులు మీద చప్పుడుచేసి,

"ఇంక మీటైము అయిపోయింది." అన్నాడు.

"ఆ—అయిపోవచ్చింది: ఒక్కనిముషం. క్షమించండి. ఇంక కొద్ది మాటలుచెప్పి ముగించేస్తూన్నాను. మొదటి 5 రోజులలోను మనకి చేరిన లెక్కలను పట్టిచూస్తే. మొత్తం మనజిల్లాఅంతటిలోనూ 850 ఎకరాలు మాత్రం చల్లికలయేయి. ఇటువంటి పరిస్థితులలో జిల్లాలోని యాక్టివ్ వర్కర్లు అందర్నీ పోగుచేసి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకి పంపించడంపోతే ఏమిలాభంలేదు. ఇప్పుడు మనం చెయ్యవలసినది ఏమిటంటే—మనకిచేత నయినంతవరకూ అన్నివిధాలా, సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల రాజీ నామాలు ఇవ్వకుండా చెయ్యడం. డైరెక్టరుమెంట్లు, సెక్షన్ సెక్ర టరీలు ప్రతీరోజూ తప్పనిసరిగా, సమిష్టివ్యవసాయక్షేత్ర సభ్యులతో, ప్రభు త్వం సమిష్టివ్యవసాయక్షేత్రాలకు ఇచ్చేవిరాళాలు, ఇతరసౌకర్యములు మొద లైనవానినిగురించి, సమిష్టి వ్యవసాయక్షేత్రాలవలన గలుగు లాభాలను గురించీ ప్రచారంచేసేటట్లుచూడాలి. సమిష్టివ్యవసాయ క్షేత్రాలకి ప్రభుత్వం ఎంతధనంక్రెడిట్‌గాయిచ్చిందో, వాటిలోని సభ్యులకి ఇతరరైతులకులేని సదుపాయాలు ఏమిటో మొదలైనవిషయాలు తెలియనివాళ్ళు అనేక మందిఉన్నారు ఇప్పుడుకూడాను. ఇంతేకాకుండా తెలివితక్కువతనంగా ప్రవర్తించి, పరిస్థితులను విషమావస్థకు తీసుగువచ్చి, చల్లికలు జరగక పోవడానికి కారకులైనవారిని మార్చి 15వ తారీఖు సెంట్రల్ కమిటీ తీర్మా నము ప్రకారం వెంటనే వారిపదవులలోనుంచి తొలగించి వారిచర్యలకి సమాధానంకోరాలి. ఇంతకంటె నేను చెప్పవలసిన దేమీలేదు."

"బైగ్లిక్ రిపోర్టుమీద ఎవరేనా మాట్లాడుతారా?" అంటూ డిస్ట్రిక్టు కమిటీ సెక్రటరీ అందరికేసి కలియచూసేడు.

"దానిమీద ఇంక మాట్లాడడానికేముంది? అంతా వివరంగా దాన్లోనే వుంది" అన్నాడు ఒకబ్యూరోమెంబరు. అతడు డిస్ట్రిక్టు మిలీషియాకి ప్రధానాధికారి అసలే పిడుగువంటిమనిషి. సైనిక దుస్తులలో ఇంకా డాబుగా కనిపిస్తున్నాడు—నున్నగా క్షవరంచేసిన తలనిండా ఎక్కడచూసినా గాయపుమచ్చలే.

"అయితే మననిర్ణయాలకి బైగ్లిక్ సూచనలు ఆధారాలుగా తీసుగుంటం. అది అందరికీ అంగీకారమేనా?" అని అడిగేడు సెక్రటరీ.

"ఆ—అంగీకారమే."

"ఇంక నగుల్నోవ్ విషయంచూద్దాం." మీటింగు మొదలెట్టినప్పటి నుంచీ, మకార్ కేసి చూడకుండా తప్పించుగున్న సెక్రటరీ మొట్టమొదటి సారి అతనికేసి కొన్ని సెకనులు తీవ్రంగాచూసేడు. "అతడు గ్రిమాచీ పార్టీన్యూక్లెస్ సెక్రటరీగావుంటూ పార్టీకి వ్యతిరేకంగా అనేక పనులుచేసే దన్న విషయం మీరందరూ ఎరిగినదే. డిస్ట్రిక్టుకమిటీ సమిష్టి వ్యవసాయ క్షేత్రనిర్మాణాన్ని గురించి, విత్తనాల వసూలునుగురించీ ఎప్పటికప్పుడుసూచ నలు ఇస్తూవచ్చినప్పటికీ అతడు అతి తీవ్రవిధానం అవలంబించేడు. సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోచేరని ఒకసామాన్యరైతుని పిస్టలుతో తల బద్దలుకొట్టేడు మరి నలుగురు సమిష్టివ్యవసాయక్షేత్ర సభ్యుల్ని ఒకరాత్రి అంతా గదిలోపెట్టి తాళంవేసేడు. కామ్రేడ్ సెమోఖిన్ స్వయంగా గ్రిమాచీ లాగ్ వెళ్ళి ఆవిషయాలన్నీ విచారణచేసి, పార్టీపోలసీకి వ్యతిరేకంగా నగు ల్నోవ్ చేస్తూన్న అక్రమాలన్నీ తెలుసుగున్నాడు. ఇప్పుడు, కామ్రేడ్ సెమోఖిన్! నగుల్నోవ్ను గురించి మీరు తెలుసుగున్నవన్నీ బ్యూరోకి వినిపించండి."

నగుల్నోవ్ డిస్ట్రిక్టుకమిటీ ఆఫీసుకి వెళ్ళగానే అక్కడి వాతావరణం అంతా తనకివ్యతిరేకంగా ఉన్నట్లు బోధించింది అతనికి. సెక్రటరీ వెనకటిలా కాకుండా అతిముక్తసరిగా రెండుమాటలు మాట్లాడి ఏదో పెద్దపని ఉన్నట్లు డిస్ట్రిక్టుఅగ్రిప్యాటిస్ ఫైరమన్‌కేసి తిరిగి మాట్లాడడం మొదలెట్టాడు.

"నా కేసు విషయం ఏలావుంది." అని అడిగేడు నగుల్నోవ్. అంతటితో ఒదిలిపెట్టక.

"బ్యూరోనిర్ణయిస్తుంది ఆవిషయం." అని సెక్రటరీ నిరసనగా సమాధానం యిచ్చేడు.

మిగిలినమెంబర్లు అంతాకూడా అల్లాగేఉన్నారు. బహుశా నగుల్నోవ్ విషయం, వాళ్ళలోవాళ్ళు అప్పుడే నిర్ధారణ చేసుగునేవుంటారు. డిస్ట్రిక్టు మిలీషియా అధికారి బలాషివ్ ఒక్కడుమాత్రం నగుల్నోవ్‌నిచూసి, సానుభూతితో చిరునవ్వునవ్వుతూ చెయ్యిఅందించేడు.

"నగుల్నోవ్! మరేంభయంలేదు. నువ్వుచేసింది తప్పుపనే; అయితే మనంఅంతా ఆమాత్రం తప్పుపనిచెయ్యకుండావుండడానికి గొప్పవేత్తలం కాము. గొప్పగొప్పవాళ్ళకేవుంటాయి పొరపాట్లు—అలాంటిది మనకో లెక్కా!" సాల గ్రామంలా నున్నగానున్న బుర్ర వంకించి మెడమీద చెమటతుడుచుగుంటున్నాడు. ఆమాత్రంసానుభూతితో మాట్లాడేవాడు దొరికేటప్పటికి నగుల్నోవ్ గుండెలు కొంచెం కుదుటబడ్డాయి "ఈసారికి వాగా మందలించి మహాఅవుతే నాసెక్రటరీపదవి తీసేస్తారు." అనుకున్నాడు సెమోఖిన్‌కేసిచూస్తూ. అందరికంటె, విడాకులంటే యిష్టంలేని ఆ సెమోఖిన్‌నుచూస్తేనే విపరీతమైనభయం నగుల్నోవ్‌కి. సెమోఖిన్ డాక్యుమెంటు కేసులోనుంచి పెద్దదస్త్రంపైకి తీసేటప్పటికి నగుల్నోవ్‌కి ఆందోళనపట్టుకుంది. గుండెలు వేగంగా కొట్టుకోవడం మొదలెట్టాయి, రక్తంతలలోకి

ఒక్కసారిగా వేగంగా ప్రవహించింది. కంఠంలో ఏదో అడ్డుపడ్డట్లు అయింది. ఇవన్నీ అతనికి మూర్ఛ వచ్చేముందు కనపడే చిహ్నాలు. "ఇదికూడా ఇప్పుడే రావాలి!" సెమోఖిన్ ఒక్కొక్క కాగితమే చూసి చదువుతూంటే నగుల్నోవ్ లోలోపల ఒణికిపోతూ వింటున్నాడు.

"డిస్ట్రిక్టు కమిటీ కంట్రోల్ కమీషన్ ఆజ్ఞమీద ఈ కేసు నేను స్వయంగా విచారించేను. నగుల్నోవ్‌ని, సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుల్నీ, అతనిచేత దెబ్బలుతిన్న రైతుల్నీ, స్వయంగా చూసిన మరికొంతమంది సాక్షుల్నీ పరీక్షించిన మీదట నేను ఈ క్రింది నిశ్చయానికి వచ్చేను. నగుల్నోవ్ అతని ప్రవర్తనవల్ల పార్టీకి తీరని అపకారం చేసేడు. ఉదాహరణగా మొన్న ఫిబ్రవరి నెలలో రైతుల్ని సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేర్చడానికి యింటింటికీ వెళ్ళి పిస్టలుతో బెదిరించి బలవంతంగా చేర్పించేడు. ఈ విషయం నగుల్నోవే అంగీకరించేడు........................"

"ద్రోహులలో ద్రోహులువాళ్ళు." అంటూ నగుల్నోవ్ కుర్చీలో నుంచి లేచేడు.

"మిమ్మల్ని ఎవరూ మాట్లాడమనలేదు యిప్పుడు. దయచేసి కూర్చోవాలి!" సెక్రటరీ తీవ్రంగా మందలించేడు.

"తరువాత విత్తనాలు వసూలుచేసేటప్పుడు. సాధారణ రైతు నొకణ్ణి సోవియట్ దెలిగేట్లు. సమిష్టివ్యవసాయసభ్యులు అందరూవుండగా స్పృహతప్పి కిందపడిపోయేవరకూ పిస్టలుతో కొట్టేడు. అలాకొట్టడానికి కారణం ఆరైతు వెంటనే విత్తనాలు తీసుగురావడానికి నిరాకరించడమే."

"సిగ్గు! సిగ్గు!" డిస్ట్రిక్టు ప్రాసిక్యూటరు గట్టిగా కేకేసేడు. నగుల్నోవ్ చేతితో కంఠం రాసుగున్నాడు. నిలువుచచ్చిపోయి మాట్లాడకుండా నిలబడ్డాడు.

కాని వాకబువల్ల అతనిప్రవర్తన అనుమానించడానికి ఏమీ సందేహం అవసరం లేదని తోచింది. లేకపోయినట్లయితే అతను భార్యని ఎందుకు విడిచిపెట్టాలి ? నగుల్నోవ్ ఉన్నయింటి ఆమె అతను ప్రతిరోజూ యింటికి బాగా పొద్దుపోయి వస్తూంటాడని చెప్పింది. అతను ఎక్కడికి వెళ్ళేదీ ఆమెకు తెలియదుకాని ఆ విషయం ఒకరు చెప్పనక్కరలేకుండానే తెలుసుకోవచ్చు ! భార్యని ఒదిలేసిన మొగాడు రాత్రులు ఎక్కడ కాలక్షేపం చేస్తాడో తెలుసుకోలేకపోడానికి అంత కుర్రాళ్ళంకాదు మనం. ఒకదాన్ని విడిచి మరియొకదాన్ని మచ్చుచూస్తూంటాడు, ఎవరు బాగుంటారో అని. ఏమీ అనుమానం అవసరంలేదు ! కామ్రేడ్స్ ! ఇదీ నగుల్నోవ్ చరిత్ర. దీనికి పర్యవసానం ఏమిటి ? ఇటువంటి ప్రవర్తనకి మూలకారణాలు ఏమై వుంటాయి ? కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు విజయోన్మాదంకాదు. మరి ఏమిటంటే మంచిచెడ్డలు ఆలోచించకుండా అతివాదధోరణి అవలంబించి పార్టీపోలసీని ఎదుర్కొనడమే. సామాన్య రైతుల్ని భాగ్యవంతులనిచెప్పి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరనివ్వకపోవడమే కాకుండా కోళ్ళు, బాతులు, గొఱ్ఱెలు మొదలైన చిన్నచిన్న జంతువుల్నికూడా సమాజపరం చెయ్యాలని రిజల్యూషన్ పాస్‌చేయించడంలోనే తెలుస్తూన్నాయి అతని తెలివి తేటలు."

"వాటినిగురించి డిస్ట్రిక్టు కమిటీదగ్గరనుంచి ఉత్తరువు ఏమీరాలేదు" అన్నాడు నగుల్నోవ్ శాంతంగా.

"క్షమించండి, అక్కడే మీరు పొరపాటు పడుతున్నారు." అని సెక్రటరీ అందుకున్నాడు. "ఫలానావిధంగా చెయ్యమని డిస్ట్రిక్టు కమిటీ తెలియచెయ్యకపోలేదు. తెలిసీతెలియకుండా తప్పు పైవాళ్ళమీదికి తోసేద్దామని చూడకండి ! లేబరింగు అసోసియేషన్ రెగ్యులేషన్లలోనుంచి ఆ మాత్రం విషయం గ్రహించకపోడానికి అంత తెలియనివాళ్ళుకారు."

"గ్రిమాచీ సమిష్టి వ్యవసాయక్షేత్రంలో ఆత్మవిమర్శన పూర్తిగా అణచివెయ్యబడింది." సెమోఖిన్ మళ్ళీ ప్రారంభించేడు. "నగుల్నోవ్ అందర్నీ హడలగొట్టేసి నోరెత్తకుండా చేసేడు. ప్రజలకి ప్రతివిషయం వివరంగా చెప్పి ఒప్పించడానికి బదులు కేకలేసి చిందులు తొక్కి మాట్లాడుతే పిస్తోలుతీసి బెదిరించడం మొదలెట్టేడు. అందుచేత గ్రిమాచీలాగ్ స్టాలిన్ సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యులలో అసంతృప్తి బాగా వ్యాపించి పోయింది. ప్రతిరోజు డజన్ల కొలది రాజీనామాలు ఇచ్చేస్తున్నారు. అక్కడ చల్లికలు మొన్ననే ప్రారంభమయేయి; కాని ఆ పని అసంపూర్తిగా ఆగిపోవలసివస్తుంది. పార్టీలోచేరి దాని నిర్మాణకార్యక్రమం అంతా భగ్నం చెయ్యడానికి ప్రయత్నంచేస్తూన్న అన్నితరహాల అవకాశవాదుల్ని పార్టీలో నుంచి తొలగించడానికి ఏర్పరుపబడ్డ డిస్ట్రిక్టు కంట్రోల్ కమీషను నేను చెప్పిన విషయాలలోని సారాంశం గ్రహించి నగుల్నోవ్ విషయం ఏమి చెయ్యవలసివున్నదీ నిర్ణయించుకొందురుగాక."

"పూర్తిఅయిందా?" సెక్రటరీ అడిగేడు.

"ఆ—అయింది"

"నగుల్నోవు లేచిమాట్లాడచ్చు. అతను తనచర్యల్ని ఎల్లా సమర్థిస్తాడో చూద్దాం. నగుల్నోవ్! లేచి మాట్లాడు."

సెమోఖిన్ మాట్లాడడం పూర్తి అయేటప్పటికి నగుల్నోవుకోపానికి అంతులేదు. కాని ఇప్పుడు హఠాత్తుగా అంతకోపముపోయి దానిస్థానే భయము, సంకోచము ఆక్రమించేయి. "నన్ను ఏం చేద్దాం అని చూస్తున్నారు? సర్వనాశనం చేద్దాం అని చూస్తూన్నట్టున్నారు?" అని ఆలోచించుకుంటూ టేబిలు దగ్గిరకి వచ్చేడు. సెమోఖిన్ మాట్లాడుతున్నంతసేపూ 'అతను చెప్పినవన్నీ తీవ్రంగా ఖండిద్దాం.' అనుకున్న నగుల్నోవ్ ఆలోచనలేమీ ప్లాట్‌ఫారంమీదికి వచ్చేటప్పటికి నిలబడలేదు. బుర్రఅంతా

ఖాళీ అయిపోయినట్లుగా అనిపించింది. మాట్లాడడానికి ఒక్క మాటకూడా తోచలేదు.

"కామ్రేడ్సు, నేను విప్లవం నాటినుంచీకూడా పార్టీలో వున్నాను...." అని నగుల్నోవు ప్రారంభించేడు. "రెడార్మీలో పనిచేసేను,........"

"ఆ విషయం మాకు తెలుసును! అసలు విషయానికి రండి!" సెక్రటరీ విసుగుదలతో అతనిమాటకి అడ్డం వచ్చేడు.

"శత్రువులతో అన్నియుద్ధరంగాలలోను పోరాడేను........ మొదటి ఆశ్వికదళంలో వున్నాను. నేను....ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్ పతకంకూడా,"

"ప్రస్తుత విషయాన్నిగురించి మాట్లాడండి!"

"ఇది మాత్రం దానికి సంబంధించినది కాదా?"

"నగుల్నోవు! వాదించినా లాభంలేదు. పూర్వం ఏవో ఘన కార్యాలు చేసేవంటే, అవేమీ లాభంలేదు ఇప్పుడు," అన్నాడు డిస్ట్రిక్టు ఎగ్జిక్యూటివ్ కమిటీ ఛైర్మన్.

"ఆ కామ్రేడ్ని మాట్లాడనియ్యండి. మాటమాటకీ అడ్డు తగులుతూంటారెందుకు?" అన్నాడు బలాబిన్ తీవ్రంగా. బట్టతలమీది రక్తనాళాలు ఉబికినాయి.

"అయితే అనవసరపు గొడవవదిలేసి ప్రస్తుత విషయం యెత్తుకుంటేసరి." నగుల్నోవు యెడమచెయ్యి గుండెలకి అదుముకొని అలాగే నిలబడ్డాడు. కంఠం పొడి ఆర్చుకుపోయింది. ముఖంమీద కత్తివాటువేస్తే నెత్తురుచుక్కలేదు. కుడిచేతితో కంఠం సవరించుకుంటూ అతికష్టంతో మళ్ళీ మాట్లాడడం ప్రారంభించేడు.

"నాకు తోచినది యేదో చెప్పనియ్యండి. మీరు నా మీద అంత శత్రుత్వం వహించడానికి అంత గర్భశత్రువునికాను. సైన్యంలో పనిచేసే టప్పుడు అనేక గాయాలు తగిలేయి.........." ఇంక నోటమాట వచ్చింది

"ఆ—అవును, అందుచేతనే" అని జవాబుచెప్పేడు మకార్ సీరియస్‌గా. "అవన్నీ నేనుచెప్పేను. అప్పటికీ ఇప్పటికీ; ఎప్పటికీకూడ విప్లవం జయంపొందాలని కోరేను. అనుసరించినమార్గం తప్పుఅయి ఉండవచ్చు.........నాకు ఆ విషయం తెలియదు. నాకంటె బాగా చదువుకున్నవాళ్ళు: మీరంతా. బాగాశిక్షణపొందేరు. పరిస్థితులన్నీ బాగా అవగాహన చేసుగోకల శక్తిఉందిమీకు. చేసినతప్పు కప్పిపుచ్చాలనే ఉద్దేశం లేదునాకు. ఇష్టంవచ్చినట్లు విచారణచెయ్యండి. కాని ఈ పనులన్నీ........" గుక్కతిరగక మాటమధ్యలో మింగేసి ఊరుకున్నాడు ఒక నిముషం. "పార్టీని నాశనంచేద్దామన్న దురుద్దేశం లేకుండా నా ఆత్మకు తోచినవే అనిమాత్రం మీరు గుర్తించకోరుతాను. నేను బేనిక్‌ని కొడత అతడు పార్టీని వెక్కిరించి, విత్తనాలు పందులకి పోస్తానన్నందుకు కాని, ధాన్యం వెంటనే ఇవ్వనందుకుకాదు.........."

"అదిగో, అల్లాచెప్పు!" సెమోశిన్ వేళాకోళం చేసేడు.

"అవును! జరిగినదేదో చెబుతున్నాను. వాణ్ణి చంపేసేనుకానని ఇప్పటికీ నాకు విచారంగావుంది. ఇంతకంటే నేను చెప్పవలసింది ఏమీ లేదు."

సెక్రటరీ కుర్చీలోనుంచి లేచి నిలబడ్డాడు. ఈ వ్యవహారం తెములుచ్చుకుని ఎప్పుడు బయటపడుదామా అని చూస్తున్నాడు.

"కామ్రేడ్స్, విషయం అంతా స్పష్టంగా కనిపిస్తూనేవుంది. అన్ని విషయాలు నగుల్నోవ్ స్వయంగా అంగీకరించేడు. మొత్తంమీద అతడు తప్పుకాదని తప్పించుగోచూసేడు కాని ఆ విషయంకూడ ధైర్యంగా చెప్పలేకపోయేడు. సాధారణంగా దోషి ప్రతివాడు, కొంత తను చెయ్యలేదనీ, కొంత మరియొకడిమీదికి తోసేసి, తప్పించుగోడానికి ప్రయత్నించడం మామూలే. సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణవిషయంలో పార్టీ నిర్ణయాలు అన్నీ అతిక్రమించినందుకూ, కమ్యూనిస్టు అయివుండీకూడ చెడుప్రవర్తన

కలిగియున్నందుకూ, నగుల్నోవ్‌ని పార్టీలోనుంచి తొలగించక తప్పదు. వెనకఎప్పుడో పార్టీకోసం చేసిన త్యాగంచూసి ప్రథమతప్పిదంకింద ఊరుకునే పరిస్థితులుకూడా దాటిపోయేయి. మిగిలినవాళ్ళకి కూడా బుద్ధివచ్చేటట్లు కఠినంగా శిక్షించాలి. పార్టీకి ద్రోహం తలపెట్టేవాళ్ళని, మారుదోవలకి ఈడ్చి నాశనంచెయ్య ప్రయత్నించేవాళ్ళనీ, దయతలచక బహు క్రూరంగా శిక్షించాలి. నగుల్నోవ్ విషయంలో సగం సగం శిక్షించివదలడానికి వీలులేదు అతనివిషయంలో చాలాకాలం చూపించేము ఓర్పు. క్రిందటి సంవత్సరం కో-ఆపరేటివ్‌లాండ్ లేబరు అసోసియేషన్లు నిర్మించేటప్పుడే పార్టీ అతివాదిగా ప్రవర్తించడం, వార్నింగు యివ్వడంకూడా జరిగింది. కాని అతని దృక్పథం ఏమీ మార్పుచెందలేదు. దానికి మనం చేసేదేముంది ? సమ్మతులు తీసుకొందామా ? బ్యూరో మెంబర్లు మాత్రమే వోటు చెయ్యాలి. నలుగురు అనుకూలురు-అంతేకాదూ ? కామ్రేడ్ బలాబిన్, మీరు వ్యతిరేకమా !"

బలాబిన్ పిడికిలితో బల్లమీద గుద్దేడు. కణతలదగ్గిర రక్తనాళాలు వుబికేయి.

"నేను ప్రతికూలంమాత్రమేకాదు; అతితీవ్రంగా ఎదిరిస్తూన్నాను." అన్నాడు. "మీరుచాలా పొరపాటు నిర్ణయంచేస్తూన్నారు."

"మీరు ఆ మాదిరివుద్దేశ్యం కలిగివుండవచ్చు." అన్నాడు సెక్రటరీ.

"నేను మాట్లాడడానికి అవకాశం యివ్వాలి మీరు."

"బలాబిన్, ఇప్పటికే చాల ఆలస్యమయిపోయింది. నగుల్నోవ్‌ని పార్టీనుంచి తొలగించడానికి యెక్కువమందిచేత అంగీకరించబడింది."

"ఆ వ్యక్తివిషయంలో మీరుతీసుకునే నిర్ణయం చాలా నిరంకుశంగా వుంది. ఈ విషయాన్ని నేను ఇంతటితో వదిలిపెట్టను. వెంటనే రిజియనల్ కమిటీకి తెలియచేస్తాను. ఒక పాతపార్టీసభ్యుణ్ణి, అందులోనూ 'ఆర్డర్ ఆఫ్ ది రెడ్‌బేనర్' బిరుదుపొందిన సభ్యుణ్ణి పార్టీనుంచి తొలగించడం....

కా(మేడ్స్. మతిస్థిరంవుండి చేసిన పనేనాయిది ? పార్టీనుంచి తొలగించ డంతప్ప ఇంకేమీ శిక్షలేకపోయిందా ?"

"ఒకవిషయం నిర్ణయం అయిపోయేక ఇంక తర్జన భర్జన లవ సరంలేదు. ఇంత(క్రితమే వోటుచేసేసేము"

"ఇటువంటి వోటింగుకి మిమ్మల్ని యేమిచేసినా పాపంలేదు." బలాబిన్ కోపంతో గట్టిగా అరవడంచేత కంఠం కీచుపోయింది. మెడ నరాలు ఉబికేయి.

"ఆ జబర్దస్తీ వ్యవహారం కట్టిపెట్టండి." అన్నాడు నిర్మాణ శాఖాధి కారి. "ఇది జిల్లాపార్టీకమిటీకాని జిల్లామిలీషియా ఆఫీసుకాదు."

"ఆ విషయం మీరు చెప్పనక్కరలేకుండానే తెలుసును. కాని నేను మాట్లాడేటందుకు అవకాశం యివ్వరెందుచేత ?"

"అవసరంలేదని తోచడంచేత." అన్నాడు సెక్రటరీ కోపంతో. "నేను జిల్లాపార్టీ సెక్రటరీని. ఇక్కడ మాట్లాడడానికి మీకు అవకాశం యివ్వను. అంతగా మాట్లాడవలెనుకుంటే బయటవరండామీదికి వెళ్ళి మాట్లాడండి."

"బలాబిన్, మీరుకూడా అంత రెచ్చిపోతే యెల్లా ! అసలు అంత కోపం దేనికి? మీ వుద్దేశ్యం రిజియనల్ కమిటీకి వ్రాతమూలకంగా తెలియ పరచండి. ఇంత(క్రితమే వోటుచేసేసేము. అంతా అయిపోయేక మీరు యెంతచెబుతేమాత్రం యేముంది." జిల్లా ఎగ్జిక్యూటివ్ కమిటీ ఛైర్మన్ బలాబిన్‌ను అనునయించడానికి ప్రయత్నించేడు. అతను బలాబిన్‌ను జబ్బ పట్టుకుని ఒక మూలకు తీసుకునివెళ్ళి నెమ్మదిగా యేదో మాట్లాడు తున్నారు.

ఈలోపుగా బలాబిన్‌తో పేచీమూలాన కోపంగావున్న సెక్రటరీ మకార్‌వైపు తిరిగి ఇలాఅన్నాడు.

"నగుల్నోవ్: ఈ వ్యవహారం ఇంతటితో ముగిసింది. నిన్ను పార్టీనుంచి తొలగించడానికి బ్యూరో నిశ్చయించింది. నీవంటివాడు పార్టీకి అవసరంలేదు. నీ పార్టీ మెంబర్‌షిప్‌కార్డు యిచ్చెయ్యి."

నగుల్నోవ్ ముఖాన కత్తివేటు వేస్తే నెత్తురుచుక్కలేదు. మనిషి నిలువుగా వణికిపోయేడు. "నా పార్టీకార్డు నేను యివ్వను." అన్న కంఠస్వరం అతనిది కాదు.

"నువ్వు యిచ్చేట్టు చేస్తాము."

"నగుల్నోవ్: కిటికునన్ కమిటీకి ఇవ్వు." అని బలావిన్ ఆ మూల నుంచి గట్టిగా కేకేసేడు. ఖైరేమన్‌తో మాట్లాడుతూ మాట్లాడుతూ అరాట్టుగా బయటికి వెళ్ళిపోయి తలుపులు ధడేలున వేసేసేడు బలావిన్.

"నా పార్టీ కార్డు యివ్వను." అన్నాడు తిరిగి మకార్. క్రమంగా కంఠస్వరం హెచ్చింది. ముఖంలోని వెనకటి రక్తహీనత పోయి క్రమంగా జేవురించింది. "పార్టీకి నేను యింకా వుపయోగపడతాను. పార్టీనుంచి వేరయిపోయి నేను జీవించలేను. నేను నీకు లొంగను. ఇదిగో ఈ కోటు జేబులో పార్టీకార్డు వుంది. చేతనైతే తీసుకో, దగ్గిరకి వస్తేమాత్రం జాగ్రత్త!"

"చివరకు విషాదాంతంగా పరిణమించేటట్లుంది ఈ వ్యవహారం" అన్నాడు జిల్లాప్రాసిక్యూటరు జబ్బలు కుదుపుగుంటూ. "ఈ ఉన్మత్తులు లేకుండగా.........."

ఆమాటలేమి లెక్కచెయ్యకుండా మకార్ సెక్రటరీకేసి చూస్తూ నెమ్మదిగా, కలలో మాట్లాడుతున్నట్లుగా మొదలెట్టేడు.

"పార్టీ వదిలేసి యింకనేను యెక్కడికి వెడతాను? అదీకాక నేను ఎందుచేతపోవాలి? పార్టీ కార్డుమాత్రం నేను యివ్వను. నేను నా జీవితం అంతా.........నా జీవితం అంతా.........." అకాస్తుగా జవసత్వాలు ఉడిగిపోయిన ముసలివానిమాదిరిగా టేబులుమీదకు వంగి మాటలు తడబడుతూ అవావిడిగా అస్పష్టంగా మాట్లాడుతూ ముగించేడు.

"ఈ పరిస్థితుల్లో మీరు.......... ఇంకనాకు జీవితంలో మిగిలిన దేమిటంటే చావు ఒక్కటే. ఇంకయేమీ తరవాయిలేదు. ఇంకనాకు జీవిత లక్ష్యం ఏమీలేదు. అందుచేత దానికికూడా మీరే స్వస్తి చెప్పండి.......... ఒకప్పుడు నా అవసరంవుంది...........ఇప్పుడు ముసలివాణ్ణి అయి పోయేను..........ఈ ముసలికుక్కని బయటికి తరిమెయ్యండి."

పెదవులు వణికేయి ఆఖరిమాటలు అంటూంటే. అతని జీవితానికి అంతకీ అదే ప్రథమపర్యాయం, కన్నీరు ఏకధారగా ప్రవహించింది.

"కళ్ళనీళ్ళు పెట్టుగుంటే లాభంలేదు. ఇందులోంచి బయటపడే మార్గం అదికాదు, కామ్రేడ్." అన్నాడు సెక్రటరీ.

"కామ్రేడువుకాదు నువ్వు.........." అని నగుల్నోవ్ మళ్ళీ గట్టిగా అందుకున్నాడు. "మానవరూపంలోవున్న తోడేలువు. ఇక్కడున్న మీరంతా విషపుచ్చాలు. అధికారం మీచేతిలోవుంది! నెమ్మదిగా మాట్లా డుతూ తడిగుడ్డతో గొంతుకకొయ్యడం బాగానేర్చుకున్నారు. హొమూ టోవ్! పళ్లు అలా ఇకిలిస్తావెందుకు? నాకళ్ళనీళ్లు చూస్తే నీకు సరదాగా వుందా? నువ్వు.......1921 సం॥లో ఫోమిన్ సైన్యం దేశంఅంతా ధ్వంసం చేస్తూంటే నువ్వు రిజియనల్ కమిటీకి రావడం గుర్తుందా, ఏం. మరిచిపోయేవేం? వచ్చి పార్టీ టిక్కట్టు యిచ్చేసి. ఇకనుంచి రాజకీయాలు వదులుకొని వ్యవసాయం చేసుకుంటానన్నావు..........ఫోమిన్‌కోసం భయపడి పార్టీటిక్కట్టు యిచ్చేసేవు! కాని ఆ తరువాత మళ్ళీ నెమ్మదిగా పార్టీలోని ఉన్నత స్థానానికి తుట్టపురుగులా యెల్లాగో పాకి చేరుకున్నావు. అటువంటినువ్వు నన్ను పార్టీలోనుంచి తొలగించడానికి వోటుచేస్తూన్నావా? చావుదెబ్బకొట్టి. విచారిస్తూంటే నవ్వుతూన్నావా?"

"చాలు, చాలు. నగుల్నోవ్, అట్టే కేకలేసి లాభంలేదు. ఇంకా ఇతరవిషయాలు చర్చించవలసినవి అనేకం వున్నాయి." అన్నాడు నిర్మాణ శాఖాధికారి హొమూటోవ్ వెనకటి పెంకితనంవదలి కొంచెం నెమ్మదిగా.

నగుల్నోవ్ అన్నమాటలకి అతనుయేమీ చిన్నబుచ్చుకోలేదు. ఇంకా చిరు నవ్వు వుండి వుండి అతని నల్లటి మీసాలలోనుంచి కనబడుతూనేవుంది.

"చాలులే! న్యాయం దొరికేవరకూ నేనూవదలను. సెంట్రలుకమిటీ వరకూ వెడతాను"

"అదిగో, అల్లాఅన్నావు—బాగుంది. తప్పకుండా వెళ్లు. అక్కడ ఒక్కనిముషంలో తేలుతుంది ఈవ్యవహారం అంతా. నీకోసం వాళ్లు యెదురు చూస్తూనేవున్నారు." పోలోమూదోవ్ నవ్వేడు.

మకార్ మాట్లాడకుండా వెనుతిరిగి గుమ్మందగ్గరికి వెళ్ళేడు. ద్వారం నెత్తికి తగిలి మూలిగేడు.

బయటికి వచ్చేటప్పటికి మకార్ పూర్తిగా అలసిపోయేడు. ఏ ఆలోచనా లేకుండా వెర్రివానిమాదిరిగా గుఱ్ఱందగ్గరికివచ్చి కట్టులాడు పూడతీసి, నడిపించుకుపోతూన్నాడు. వూరు దాటినతరువాత గుఱ్ఱం యెక్కడానికి నాలుగు సార్లు రికాబులోకాలు పెట్టబోయి తాగినవాడిలా తూలుతూ కాలు యెత్తే ఓపికకూడా లేక వూరుకున్నాడు.

ఊరిచివరనున్న యింటిదగ్గర వయస్సుముళ్ళిన ఒక వ్యక్తి కూర్చుని వున్నాడు. మకార్ తీరు అంతా శ్రద్ధగా చూస్తూ ఆఖరికి చిరు నవ్వు నవ్వేడు.

"బాగుందోయ్!" అన్నాడు. "ఇంకా బాగా పొద్దువాలలేదు. కాని కాలుయెత్తేశక్తికూడా లేదు. పట్టపగలే తాగడానికి కారణమేమిటి? ఈవేళ సెలవురోజుకాదే -అవునా?"

"కాకపోవడం యేమిటి." అన్నాడు. ఆ పక్కయింటిఅతను. "ఈవేళ సోమరిపోతులందరికి పర్వదినం."

"అది! అలాచెప్పు" అని ఆ ముసలివ్యక్తి నవ్వేడు. "సారాఅంత బలమైనదేదీ లేదుసుమా. చూడు అంతమనిషిని ఎలా లొంగతీసేసిందో."

మకార్ వాళ్ళనిచూసి పళ్ళు పటపట కొరుకుతూ డేగలా అతి వేగంగా ఎగిరి గుఱ్ఱంమీద కూర్చున్నాడు.

# ముప్పైమూడో ప్రకరణము.

## ధాన్యంకోసం దొమ్మీ.

సరిగ్గా అదేరోజు పుదయాన్న, 'యార్స్కీ' నుంచి ఇరవైమూడు బళ్లు వచ్చేయి, గ్రిమాచీలాగ్‌కి. గాలిమరదగ్గరకి వచ్చేటప్పటికి బేనిక్ యెదురయ్యేడు. కళ్ళెం బుజానవేసుకొని స్టెప్పీలోకి బయలుదేరేడు. కట్టు తెంచుకొని పారిపోయిన గుర్రాన్ని వెతకడానికి. మొదటిబండిదగ్గరికి వచ్చేక బేనిక్ మాటలు కలిపేడు బండివానితో. నల్లటి పెద్దగడ్డం ఆతనిగా ఆ బండి తోలుతూన్న కోసక్కు ఏదో సమాధానం చెప్పేడు.

"ఇల్లా యేవూరునుంచి?" బేనిక్ వాకబుచేసేడు.

"యార్స్కీనుంచి."

"మీ గుర్రాలకి వేటికీ తోకలే లేవేం? అలాకోసేసి అందవికారంగా చేసేరెందుకు?"

"మనపనికి అడ్డనప్పుడు తోకవున్నా లేకపోయినా ఒకటే. అందుకని తోకలుకోసేసి పట్నంలో మంచిఖరీదుకి అమ్ముకున్నాం. పట్నవాసపు ఆడవాళ్ళు వాటిని ఈగలు తోలుకోడానికి వుపయోగిస్తారు. మాదగ్గర పుగాకు అయిపోయింది. కొంచెంవుంటే పెడతారా?" ఆ కోసక్కు బండి మీదనుంచి కిందికి వురికేడు.

బళ్ళన్నీ ఆగేయి. తనదోవనిపోక వాళ్ళతో సంభాషణకి దిగినందుకు బేనిక్ విచారించేడు. ఇంకొక ఐదారుగురు కోసక్కులుకూడా బళ్ళువదిలి పేపరుకాగితాలు సిగరెట్లకింద చుడుతూవస్తూంటే వాళ్ళకేసిచూస్తూ బేనిక్ అయిష్టంతో నెమ్మదిగా పుగాకుసంచీ బయటికితీసేడు.

"నాపుగాకంతా అవగొట్టేలా ఉన్నారే మీరంతా కలిసి!" అని బేనిక్ మూలిగేడు.

"అది సమిష్టి వ్యవసాయ క్షేత్రానిది, ఇంకా మీరెరగర్లా? ప్రతి వస్తువూ సమాజపరం అవాలి." అన్నాడు నల్లగడ్డప్పకోసప్కు. ఆ ప్రాగాకు సంచీ తనదే అయినట్లు పెద్దముక్క ఒకటి ఏరి తీసుకున్నాడు.

వాళ్ళంతా సిగరెట్లు వెలిగించేరు. దేసిక్ ఇవానిచ్‌గా పొగాకుసంచీ ప్రాజపు చేతులో పెట్టేసి, చిరునవ్వు నవ్వుతున్నాడు. మొదట్లోనంతా కోసేసిన గుర్రాల మొండితోకలతేసి జాలిగా చూసేడు దేసిక్. వుండుండగా గుర్రాలువుండవాళ్ళ కిర్రు లేపిస్తున్నాయి. వాటిని తోలుకోవానికి నామమాత్రం బలాలుబోర్పున ఆ గుర్రాలు మొండితోకలు ఇటూ అటూ ఆడిస్తున్నాయి కాని ఏమీ ప్రయోజనం లేకుండాపోయింది.

"మొండితోకతో ఆ మైత్రికి చూపిస్తూంది. ఎక్కడికి?" అన్నాడు దేసిక్ మేరాకోవంగా.

"సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోకి. మీ గుర్రాల తోకలు కోసెయ్యటమూ ఇంతాసూ వాళ్ళ?"

"కొద్దిగా ఒకదెబ్బైకు ముక్కమాత్రం కోసేరు."

"మా సోషియస్ ఫైర్‌మన్ మొదట్లోకే గొయించేసేడు. అందు కోసం ఆయనకి బహుమానంకూడా వచ్చింది. కాని ఎండలు ముదిరేక వున్నాయి పీటిపాట్లు. మేము వచ్చేటప్పుడు పుగాకు తెచ్చుకోలేము. అందు చేత దోవపొడుగునా పిచ్చెత్తినట్లుగా వుంది, పాపం మేము అడగగానే లేదనకుండా ఇచ్చేరు మీరు. ఇంక వెడతాం."

"ఎక్కడికి వెళ్లాలి?"

"గ్రిసూచీ."

"అయితే మా ఊరికే అన్నమాట మీరు వెళ్ళేది. ఏం పనిమీద?"

"విత్తనాలకోసం"

"ఆ–ఎందుకూ?"

"విత్తనాలు మీ వూరునుంచి తెచ్చుకోవలసిందని జిల్లానుంచి ఆర్డరు వచ్చింది. 92 బస్తాలు కావాలి."

"ఆఖరికి అనుకున్నంతా అయింది!" అంటూ బేనిక్ వచ్చినదోవనే ఊళ్ళోకి పరుగెత్తేడు.

యార్స్కి-బళ్ల సమిష్టి వ్యవసాయక్షేత్ర కార్యాలయం చేరకుండానే వాళ్ళు విత్తనాలు తీసుకుపోడానికి వచ్చేరని గ్రామంలో సగంమందికిపైగా తెలిసిపోయింది అప్పుడే. బేనిక్ ఒగర్చుగుంటూ ఇంటింటికీవెళ్ళి చెప్పేడు.

వెంటనే ఆడాళ్ళు పక్క-సందులలోచేరి గందరగోళ పడసాగేరు.

"మన ఊళ్లో ధాన్యం అన్నీ పట్టుకుపోతున్నారుట కాదూ?"

"ఆఖరికి మనకి ఒక్క-గింజేనా మిగలదు."

"సమిష్టి వ్యవసాయ క్షేత్రపుగాదులలో ధాన్యం పోసుకోవద్దని మనవాళ్ళు చెప్పనేచెప్పేరు."

"కోసక్కులు మనమాటవినందే!"

"మనంవెళ్ళి ఒక్క-గింజకూడా ఇవ్వడానికి వీలులేదని చెబుదాం వాళ్ళతో."

"అవును-నడవండి వెడదాం! ఆలస్యంచేస్తే లాభంలేదు."

తరువాత క్రమక్రమంగా కోసక్కులుకూడా గుమిగూడసాగేరు. వాళ్ళధోరణికూడా స్త్రీలమాదిరిగానేవుంది. ప్రతివీధిలోని జనం సమిష్టి వ్యవసాయ క్షేత్రపు గాదులవైపు బయలుదేరేరు.

ఇదే సమయానికి దేవిడోవ్ డిస్ట్రిక్టు అగ్రికల్చరల్ యూనియన్ ఛైర్మన్ దగ్గరనుంచి యార్స్కి బళ్ళవాళ్ళు తీసుకువచ్చిన ఆజ్ఞాపత్రం చదువుతున్నాడు.

"కామ్రేడ్ దేవిడోవ్" అని వ్రాసేడు. "మీరు డిస్ట్రిక్టుకి 49 బస్తాల గోధుమలు ఇవ్వవలసివుంది. యార్స్కి సమిష్టివ్యవసాయక్షేత్రము తగి

నన్ని గోధుమవిత్తనాలు లేకుండావుంది కనక ఆ గోధుమలు వారికి ఇవ్వవలసిందని కోరుతున్నాను. ఈ విషయంలో నేను ఇదివరకే గ్రైన్ కో-ఆపరేటివ్‌తో ఖరారునామా వ్రాసుకున్నాను."

గోధుమలు వెంటనే తూకంవేసి యివ్వవలసిందని దేవిదోవ్ ఉత్తరువు ఇచ్చేడు. యార్స్కీ మనుష్యులు బళ్లు సమిష్టివ్యవసాయక్షేత్రపు ఆఫీసు నుంచి గాదుల కిందికి తోలుకువెళ్ళేరు. కాని అప్పటికే గాదులున్న వీధికి అడ్డంగా జనం గుమిగూడి వున్నారు. బళ్లు రావడంతోటే, ఆడాళ్ళ, కోసక్కులూ కలిసి రెండు మూడు వందలమంది వాటిచుట్టూ మూగేరు.

"ఇలా ఎందుకని వచ్చేరు?"

"మా గోధుమలన్నీ తీసుకుపోడానికి వచ్చేరా? మిమ్మల్ని పంపిన వెధవ ఎవడురా?"

"ఈ పాటికి వచ్చిన దోవనే దయచేయండి!"

"ఒక్క గింజకూడా ఇయ్యం!"

"మీరంతా ఇక్కడ గుమిగూడేరు ఎందుకని?" అని దేవిదోవ్ అడిగేడు వాళ్ళని.

"మా గోధుమలు ఎవళ్ళకో యార్స్కీవాళ్ళకి ఇస్తున్నారెందుకు? అవి అన్నీ వాళ్ళకి ఇవ్వడానికి ఇచ్చేమా మేము?"

"దేవిదోవ్! ఎవరిచ్చేరు ఈ అధికారం మీకు?

"ఈ ఏడాది మేము చల్లికలు ఏంచేస్తామనుకున్నారు?"

దేవిదోవు పక్కనేవున్న గాదిమెట్లమీద నిలబడి, తను గోధుమ విత్తనాలు ఇవ్వడంలేదని, డిస్ట్రిక్టు అగ్రికల్చరల్ యూనియను ఆర్డరు ప్రకారం ధాన్యపుపన్నుమాత్రం ఇస్తున్నానని చెప్పేడు.

"మీరు అంతభయపడవలసిన అవసరంలేదు." అన్నాడు అతడు. "మీ గోధుమలు ఏమీ ముట్టుకోము. అనవసరంగా ఇక్కడ మూగేకంటె,

పొలాలలోకిపోయి మీ మీ పనులు చూసుకుంటే మంచిది. బ్రిగేడ్ లీడర్లు పనిలోకి రానివాళ్ళ పేర్లు వ్రాసుకుంటారన్నమాట మరిచిపోకండి."

దేవిడోవు చెప్పినమీదట సంతృప్తిపొంది కొంతమంది కోసక్కులు వాళ్ళవాళ్ళ పనులమీద పొలాలలోకి వెళ్ళిపోయేరు. స్టోరుకీపరు గోధుమలు తూచుతూంటే దేవిడోవు ఆఫీసుకి వెళ్ళిపోయేడు. ఆడవాళ్లు అంతా అక్కడే నిలబడిచూస్తూన్నారు. యాకోవ్‌లూకుచ్ కోసక్కులతో "దేవిడోవు చెప్పేది అంతా అబద్ధం! ఇప్పుడువాళ్లు తూచేది విత్తనపు గోధుమలే. సమిష్టి వ్యవసాయక్షేత్రపు భూములన్నీ చల్లికలు పూర్తిచేసుకుని విడిరైతుల విత్తనాలు అన్నీ వాళ్ళకి తూచేస్తూన్నారు." అని రహస్యంగాచెప్పి వాళ్లని పురికొల్పేడు.

ఆడవాళ్ళలో ఆందోళన హెచ్చింది. బేనిక్, డైమిడ్, డొనిట్‌స్కో మొదలైనవాళ్లు మొత్తం ముఫ్ఫైమందివరకూ కొంతసేపు ఏదో మాట్లాడుకొని తరువాత కొటాదగ్గరికి వెళ్ళేరు.

"ఇక్కణ్ణుంచి ఒక్కగింజకూడా తీసుకువెళ్ళడానికి వీలులేదు, తప్పుగోండి," అన్నాడు డొనిట్‌స్కోవు వాళ్ళందరి తరఫునా.

"నిన్నెవడూ అడగలేదు దయచెయ్యి!" డెమ్కావుషాకోవు అతనిని వెనక్కిగెంటేడు.

దానితో సంఘర్షణ ప్రారంభం అయింది. యార్స్కినుంచి వచ్చిన బళ్ళవాళ్లు డెమ్కాపక్షానికి వచ్చేరు. బేనిక్ దగ్గరనుంచి పుగాకు తీసుకున్న ఆ నల్లగడ్డపు కోసక్కు బండిమీదలేచి నిలబడి నోటికి వచ్చినట్లల్లా చెడామడా తిట్టేడు.

"ఇప్పుడు మీరు ప్రభుత్వం ఆజ్ఞలు తిరస్కరిస్తూన్నారు ఎందుకని? మిడిఎండలో ముఫ్ఫైమైళ్ళు వెళ్ళాలిగదా మేము — ఎందుకని ఆటకాయిస్తూన్నారు. మమ్మల్ని త్వరగా పోనియ్యక? ఒగ్గాలేకపోతే మీకు

పట్టపగ్గాలు ఉంటాయా! ఇలాంటి వెధవల్ని సొలోవ్‌కా కాన్సెన్ట్రేషన్ కొంపులకి పంపిస్తేనేకాని ఈ పొగరుమోతుతనం అణగదు! మీకు అక్కర్లేదు, పైవాళ్ళకి కావలిస్తే తీసుకువెళ్ళనియ్యరు. పొలాలకిపోక ఇక్కడ నిలబడ్డారెందుకు? ఈ వేళ ఏమయినా పండుగా?"

"ఏం, మహా పేలుతున్నావు?" చిన్నఆకిమ్ అర్చేడు. "ఒళ్లుతీటగా ఉందా? ఏమేనావుంటే ఒమలుస్తాం ఇలారా. అదెంత సేపు!" అతను చొక్కా చేతులు పైకితీసుగుంటూ జనాన్ని వొత్తిగించుగుంటూ ముందుకు వెళ్ళేడు.

ఆ నల్లగడ్డపు యార్ప్కావాళ్ళకోసక్కా కిందికి వురికేడు. వెనకాముందూ చూడకుండా, వెంటనే అకిం మొహమ్మీద సాచి సత్తువకొలది దెబ్బకొట్టేడు. ఆకిమ్ ఆ దెబ్బకి తట్టుగోలేక కింద పడిపోయేడు.

దానితో పెద్దదొమ్మీ ప్రారంభమయింది. యార్ప్కావాళ్ళు చావు దెబ్బలుతిని రక్తాలు కారుకుంటూ, బళ్ళలోపటి జనంమీదనుంచి తొక్కించు గుంటూ, గుర్రాలు తోలుకుని పారిపోయేరు.

గ్రిమాచీలాగ్‌లో అంతవరకూ లోలోపల రవులుతూన్న విద్వేషాగ్ని ప్రజ్వరిల్లింది. డెమ్కాదగ్గరవున్న గాదుల తాళాలు లాక్కొనడానికి అతని కోసం వెతికేరు జనం. కాని అతడు అంతకుముందే చల్లగా తప్పించుగుని ఆఫీసుకి పరుగెత్తేడు.

"కామ్రేడ్ దేవిడోవ్, ఈ తాళంచెవులు ఏంచేద్దాం అంటారు! మనవాళ్ళు యార్ప్కావాళ్ళని చుట్టుముట్టి ఛావకొట్టేస్తూన్నారు. ఇంకో కొంతసేపట్లో మనమీదికి కూడా వచ్చిపడతారు."

"అవి నా చేతికి ఇయ్యి." అన్నాడు దేవిడోవ్ శాంతంగా.

అతడు తాళంచేతులు తీసుగుని, జేబులో వేసుగుని, తిన్నగా గాదుల దగ్గిరకి వెళ్ళేడు. ఈ లోపుగా ఆడాళ్ళు అంతా, గ్రామసోవియటు కోసున్న ఆంద్రీ రజ్మట్నోవుని పట్టుగుని బయటికి లాక్కొచ్చేరు. "మీటింగు ప్రారంభం చెయ్యి!" అని కేకలేస్తూ.

"ఇప్పుడు మీటింగులు అవసరంలేదు. చల్లికల రోజులలో మీటింగులు చేస్తూకూర్చుంటే ఎలాగ! కాకపోయినా ఇప్పుడు మీటింగు ఎందుకు?" రజ్మటోన్నోవ్ వాళ్ళని శాంతపరచడానికి ప్రయత్నించేడు.

కాని వాళ్ల అతని మాటలు వినలేదు. బెల్టు, జబ్బలు, చొక్కా పట్టుకొని ఆంద్రీని స్కూలుకు లాక్కుపోయేరు.

"మీటింగు ప్రారంభంచెయ్యి. లేకపోతే మా అంతట మేమే ప్రారంభించుగుంటాం."

"నీకు తెలియదంటేమాత్రం మేం నమ్మద్దూ; ఛైర్‌మన్‌వుకూడాను నువ్వు. నీచేతనవును."

ఆంద్రీ వాళ్ళనందర్నీ విదల్చి దూరంగా గెంటేసి, చెవులలో వేళ్ల పెట్టుగుని వాళ్ళకంటెగట్టిగా "ఛీ! మిమ్మల్నితగలెయ్యా. దూరంగాపొండి! ఇప్పుడు మీటింగు యెందుకు మీకు?"

"ధాన్యాన్నిగురించి నీతో మాట్లాడడానికి."

ఆఖరికి ఎల్లాఅయితేనేం వాళ్ళంతా బలవంతపెట్టి ఆంద్రీచేత సభ ప్రారంభం చేయించేరు.

"ముందు నేను మాట్లాడాలి." అంది యెకటెరినా గుల్యాశ్చాయా.

"ఆ ఉబలాటం అవుతుంది, రా మాట్లాడు!"

"అట్టే వాగేవంటే జాగ్రత.........మా ధాన్యంఅంతా ఎవరికో పంచిపెట్టడానికి నీకేం అధికారంవుంది? ఆ అధికారం యిచ్చినవా డెవడు? ముందు దీనికి సమాధానం చెప్పు." అంటూ సమాధానంకోసం అతనికేసి చూసింది.

"కామ్రేడ్ దేవిడోవ్ ఇందాక మీకు చెప్పేడు. అదీకాక ఇలాంటి విషయాలు మాట్లాడేటందుకు కాదు ఈ సభ ప్రారంభంచేస్త.........." ఆంద్రీ నిట్టూర్పు విడిచేడు.

"అంతా కలసి పందికొక్కులను చంపడానికి వెళ్ళవలసి ఉండడం చేత."

ఆంద్రీ వాళ్ళని మాయచేసి, మరిపించడానికి చూసేడు, కాని లాభం లేకపోయింది.

"పందికొక్కులేమిటి?"

"ఇప్పుడు పందికొక్కులు ఉన్నా చచ్చినా ఎవడికీ అక్కర్లేదు."

"మా ధాన్యం మా కిచ్చెయ్యి."

"పందికొక్కుల్ని చంపడానికి బయలుదేరుదువుగాని, ముందు మా ధాన్యంమాట ఏ మంటావు?"

"ఏముంది అనడానికి, ఏమీలేదు."

"ఏమిటీ! ఏమీలేదూ? ముందు ధాన్యంయిచ్చి మరీమాట్లాడు."

అంటూ గుల్యాశ్చాయా, మరికొంతమంది ఆడవాళ్ళు వేదికదగ్గిరికి వచ్చేరు. అక్కడే వేదికమీద దగ్గర నిలబడియున్న ఆంద్రీ వాళ్ళకేసి చిరునవ్వు నవ్వుతూ చూస్తూన్నా లోలోపల అతనికి గాభరాగానేవుంది. ఆడవాళ్ళవెనక దూరంగానిలబడ్డ కోసక్కులుకూడ చాలాతీవ్రంగానే వున్నారు.

"శీతకాలం, వేసవికాలంకూడా నీవు మంచిఖరీదైన బూట్లు తొడుక్కునేఉంటావు; మాకు మాత్రం అవేమీ అక్కరలేదులావుంది." అంది ఒకతె.

"కమీసారు అయిపోయేడు!"

"మెరీనా మొగుడు ట్రౌజర్లు తొడగటం మానేసేవు ఎంతకాలం నుంచి?"

"బట్టలు లాగేద్దంరండి!"

చెవులు గింగురుమనీలా ఒక్కటేగోల. ఆడాళ్ళంతా వేదికచుట్టూ మూగేరు. ఆంద్రీ వాళ్లనందర్నీ శాంతపరచడానికి ఎంతో ప్రయత్నించేడు కాని లాభంలేకపోయింది. ఆ గోలలో అతనిమాటలు వినబడలేదు.

"ముందుగా బూట్లులాగేద్దం; అంతా ఒక్కసారిగా వెశదంరండి!"

అంతా ఒక్కసారిగా వేదికఎక్కి ఆంద్రీఎడమకాలు పట్టుగున్నారు. అతడు కాలువిదుల్చుగోడానికి చాలా ప్రయత్నించేడు. కాని ఇంతలో ఎవరో బూటు కాలినుంచిలాగేసి జనంపైనుంచి గిరవటేసేరు. ఆ బూటు ఎవరికి అంకుతే వాళ్ల పట్టుగుని ఇంకా వెనక్కి పారేస్తూ పకపకనవ్వడం మొదలెట్టేరు. వెనకనుంచి మగవాళ్ళ కంఠాలుకూడా వినిపించేయి.

"గుడ్డలు లాగెయ్యండి ?"

"దిసమొలతో ఒదిలెయ్యండి ?"

"రెండోబూటుకూడా లాగెయ్యండి !"

"చూస్తారేం కిందపడతోసి........"

వాళ్ల ఆంద్రీ రెండోబూటుకూడా లాగేసేరు. అతని కాళిపట్టీలు తీసేసి "కావలిస్తే ఇవికూడా తీసుగోండి ! ఎవరేనా ముక్కుతుడుచుగునేందుకైనా ఉపయోగిస్తాయి !" అన్నాడు.

అంతవరకూ వెనక నిలబడిచూస్తూన్న కుర్రాళ్లు కొంతమంది వేదిక వైపుకి తోసుగువచ్చేరు. వాళ్లలో ఇఫిమ్రుబేఖావ్ ఒకడు. తండ్రి అతమాన్ రెజిమెంటులో పనిచేసేడు. ఇతనుకూడ ఆరడుగులకి తక్కువయుండడు. నీగ్రోవాళ్లలా తుట్టపెదవులు. ఆడాళ్లని వొత్తిగించుగుని వేదిక మీదికి ఎక్కేడు.

"కాలికిచుట్టుగున్నగుడ్డపీలికలు ఎవడికీ అక్కర్లేదు." అన్నాడు నవ్వేతూ "కాని ఆట్రౌజర్లుమాత్రం నువ్వు యివ్వకపోయినా లాక్కుంటాము."

"అవును. ట్రౌజర్లు చాలా అవుసరం! చాలామంది ట్రౌటర్లులేక ఎంతో చిక్కుపడుతూన్నారు. మొన్న భాగ్యవంతులదగ్గరనుంచి తీసుగున్నవి అందరికీ సరిపోలేదు." అంటూ అతనికంఠె కొంచెం కురచగాను

వయస్సులోకూడా లేతగానూ కనిపిస్తూన్న ఇంకొకడు అందుకున్నాడు. ఆ బాలకంచూస్తే శుద్ధ గడేకారులా వున్నాడు.

ఉంగరాలుతిరిగి, సంస్కారం ఏమీయెరగని రుప్పలాంటిజుట్టు కోసకు టోపీక్రింపనుంచి కనిపిస్తూంది. ఇతనిని "స్మోకీ" అని మారు పేరుతో పిలుస్తూంటారు అందరూ. ఇతనితండ్రి జర్మనీయుద్ధములో చచ్చిపోయేడు, తల్లి టైఫాయిడ్ జ్వరంచేత చచ్చిపోయినది; అందుచేత చిన్నప్పటినుంచీ మేనత్తపోషణలోనే పెరిగేడు. జ్ఞానంవచ్చింది మొదలు ఎక్కడ ఏదికనబడినా ఎత్తుకుపోవడమే అతనివృత్తి. పెద్దవాడయినతరువాత దొంగతనానికితోడు జారత్వంకూడ ప్రారంభించేడు. గ్రిమాచీలో ఈడేరిన ఆడపిల్లలున్న ఏ తల్లీకూడ ఇతనిని చూస్తే అసహ్యించుకోనిది లేదు. అతడుకనక వీధులోనుంచి వెడుతూ కనిపిస్తేచాలు "ఛీ. పోకిరివెధవకి చిత్తకార్తికుక్కలా వీధులంట తిరగడమేపని అస్తమానూ." అని తిట్టుగుని కూతుళ్ళకేసితిరిగి "ఏమమ్మా. అంతదీక్షగా ఆలా చూస్తూన్నావెందుకు? ఏంపనివుందని, కిటికీదగ్గరనిల్చున్నావు? ఆఖరికి యెప్పుడో మనమడిని తీసుకొస్తావులావుంది నాకు. పీకపిసిగి అవతలకు గిరవేస్తాను. ఏమనుకున్నావో! వెళ్ళి గట్టెడు పిడకలు ఏరుకురా, పొయిలోకి ఏంలేవు. ఆలానిలబడకపోతే ఆవుదగ్గిర గడ్డి వున్నదోలేదో ఓసారి చూడకూడదూ." అంటాదు.

కాని స్మోకీమాత్రం చింకిరిబూట్లూఅతనూ, నిశ్శబ్దంగా అడుగులు వేసుగుంటూ ఈలవేస్తూ దొడ్డిగుమ్మాలకేసి, కిటికీలకేసి చూస్తూ వెళ్ళడం మాత్రం మానడు. ఎక్కడేనా ఆడపిల్ల కనిపిస్తే ఊరికే ఒదిలిపెట్టేవాడుకాడు. "ఫెక్టినా! కనుచీకటిపడగానే మీ దొడ్డివెనక్కాలకి వస్తాను. రాత్రి ఎక్కడ పడుకుంటావు నువ్వు?" "చాల్లే! ఎవరేనాచూస్తే నవ్విపోయేరు!" అని ఆ పిల్ల అడావిడిగా వెళ్ళిపోయింది.

స్కోకీ చిరునవ్వుతో ఆమెవైపు చూస్తూ వెళ్ళిపోతాడు. సాయంకా లానికి నెమ్మదిగా కమ్యూనల్ గ్రేనరీ దగ్గిరికి చేరి ప్రవాసం పంపబడ్డ అతని స్నేహితుడు టిమోఫీ అకార్డియన్ వాయించుకుంటూ కూర్చుంటాడు. చీకట్లు నాలుగుమూలలా కమ్మి గ్రామం కొంచెం సర్దుకుణుగుతూంది అన గానే నిర్భీతిగా పక్కసందులపడి ఫెక్టినాదొడ్డివెనకకి చేరుకుంటాడు.

పై గుణాలేకాక తాగుడుఅలవాటు రౌడీతనముకూడా ఉంది అత నికి. ఎక్కడ దొమ్ములాటజరిగినా అతడు వుండకుండావుండడు. మొదట దూరంగా చూస్తూ నిలబడతాడు. కాని, చివరకి లోపలనుంచి తన్నుకు వస్తూన్న ఉద్రేకం ఆపుకోలేక అతడుకూడా కలియబడతాడు. 20 సం॥లు వచ్చేటప్పటికి ఎలాగయితేం అతడు ఒక అరడజను పండ్లవరకు ఊడ గొట్టించుగున్నాడు. అనవసరంగా ఇతరుల దెబ్బలాటలలో కలుగచేసు గుంటేనేమి, ప్రణయసంబంధాలలోనై తేనేమి, అనేకసార్లు చావుదెబ్బలు తిన్నాడు. మళ్ళీ కోలుకునేవరకు నెలరోజులపాటు ఇంట్లోనే పడివుండి, మళ్ళీ యథాప్రకారంగా ఈలలువేసుగుంటూ తిరుగుతూంటాడు.

అతనులేని విషయమేవుండదు. యంగ్ కమ్యూనిస్టురీగులోనుంచి తొలగించబడి, ఇళ్లు, గడ్డివాములు మొదలైనవి అంటించినందులకు శిక్షించ బడ్డాడు. ప్రతీవాళ్ళతోనూ నిర్హేతుకంగా పేచీలకి దిగినందుకు రజ్మట్నోవ్ అతనిని అనేకసార్లు సోవియట్ షెడ్డులలోపెట్టి-రాత్రిమట్టుకు తాళంవేస్తూ వచ్చేడు. అందుచేత రజ్మట్నోవ్ అంటే స్కోకీకి తీరనిద్వేషం. అందుచేత ఇప్పుడు ఆకసి తీర్చుకోడానికి వేదిక ఎక్కేడు.

క్రమంగా దోవచేసుగుని ఆంద్రీదగ్గరకి వెళ్ళేడు. కాళ్ళు వణక సాగాయి.

ఆ ట్రౌజర్లు మనకు అవసరమవుతాయి; చూస్తూ అలానిలబడతారేం. విప్పేద్దంరండి!" అన్నాడు.

జనంవొత్తిడికి వేదిక దడదడలాడింది. అంతా ఆంద్రీ చుట్టూమూగి అతను ఎటువెళ్ళడానికి వీలులేకుండాచేసేరు.

"నేను సోవియట్ ఛైర్మన్‌ను. నన్ను చేసే ఈ అవమానమంతా సోవియట్ ప్రభుత్వానికి చేస్తూన్నారన్నమాట. జాగ్రత్త తప్పుకోండి! మిమ్మల్ని ధాన్యంమాత్రం పట్టుగువెళ్ళనివ్వను. ఇంతటితో మీటింగుమూసేసేను. వెళ్ళిపోండి మీరంతా." అన్నాడు ఆంద్రీ పెద్దగొంతుకతో.

"నువ్వు ఇచ్చేది ఏమిటి, మేమేతీసుగుంటాము."

"అయితే మనం మళ్ళీ తెరుద్దం!"

"దేవిడోవ్‌పని పడితేకాని లాభంలేదు. రండర్రా!"

"రండి! ఆఫీసుకి వెడదం రండి!"

"ముందు రజ్మట్నోవ్‌ని ఖైదుచెయ్యండి!"

"ఓ దరువు పట్టక చూస్తారేం, కుర్రాళ్ళు!"

"ఇంకా వెర్రిముఖాలేసుగు నిలబడతారేం?"

"స్టాలిన్‌కి వ్యతిరేకుడు వీడు!"

"ఖైదులో పారెయ్యండి!"

ఒకఆమె టేబులుమీద పరిచియున్న గుడ్డలాగి, వెనకవైపునుంచి రజ్మట్నోవ్ ముఖంమీద ముసుగువేసింది. దుమ్ముతోనిండియున్న ఆ గుడ్డ తీసిపారెయ్యడానికి అతడు పెనుగులాడుతూంటే, స్మోకీవచ్చి పొట్టలో ఒక్కపోటు పొడిచేడు. ఆంద్రీ బాధచేత ఒగరుస్తూ ప్రాణరక్షణకోసం జేబులోని పిస్టలు పైకిలాగేడు. ఆడవాళ్ళంతా హాహాకారాలు చేస్తూ పరుగెత్తేరు. కాని స్మోకీ మరిముగ్గురుకోసక్కులూ కలిసి అతకి చేతులోని పిస్టలు ఊడలాక్కున్నారు.

"అరివెధవ! పిస్టలుతో కాల్చిపారేద్దంఅనే!" అంటూ ఒకకోసక్కు గుళ్ళులేని వట్టిపిస్టలు పైకియెత్తుతూ అన్నాడు.........

గాదులదగ్గరనుంచి సముద్రపుహోరులా పెద్దగోల వినిపిస్తూంది. డేవిడోవ్ గమనవేగం తగ్గించి నిలబడ్డాడు. ఆ గోలనంతను మించి ఒకస్త్రీ ఆర్తనాదం చెవులలో గింగురుమంది.

"గాదులు బద్దలుగొట్టి ధాన్యం పట్టుకుపోతారేమో, రెండోబ్రిగేడు కోసం కభురుపంపేస్తేనయం. ఎందుకైనామంచిది." అనుకున్నాడు. డేవిడోవ్ గాదుల తాళంచెవులు దాచరానికై తిరిగి ఆఫీసుకి పోవడానికి నిశ్చయం చేసుగున్నాడు. అక్కడికి వెళ్ళేటప్పటికి గేటుదగ్గిర డెమ్కా-వుషాకోవ్ ఆందోళనతో నిలబడివున్నాడు.

"కామ్రేడ్‌డేవిడోవ్, తాళంచెవులకోసం నన్ను వెతుక్కుంటూ వస్తారు ఇప్పుడు. ఎక్కడికోపోయి దాంకుంటాను." అన్నాడు.

"సరే నీయిష్టం. నైడియనోవు ఇక్కడ వున్నాడా ?"

"లేడు. రెండోబ్రిగేడుతో వెళ్ళేడు."

"రెండోబ్రిగేడు వాళ్ళు ఎవరూలేరూ ఇక్కడ ?"

"కోంద్రాట్ మైదినికోవ్ ఉన్నాడు."

"ఏడీ ? ఏంచేస్తున్నాడు ?"

"విత్తనాలు పట్టుగువెళ్ళడానికి వచ్చేడు. అదుగో !"

మైదనికోవ్ హడావిడిగా పరుగెత్తుకుంటూ వాళ్ళకేసివచ్చి "ప్రజలంతా ఆంద్రీజర్మట్నోవుని పట్టుకుని కొట్టులోపెట్టి, గాదులదగ్గిరకి వెడుతున్నారు. కామ్రేడ్ డేవిడోవు ఎక్కడేనాదాంకోండి, లేకపోతే హానికలుగవచ్చు...................జనం అంతా వెర్రెత్తినట్లు ఉన్నారు." అన్నాడు ఆతురతతో.

"నేనుమాత్రం దాంకోను. మతిపోయిందా ఏమిటి నీకు ? ఈ తాళం చెవులు తీసుగో. వెంటనే బ్రిగేడుదగ్గిరికి వెళ్ళి లుబిష్కిన్‌తో, 15 మందిని గుర్రాలమీద అర్జంటుగా రమ్మన్నానని చెప్పు. పరిస్థితులు ఎంత విషమంగా వున్నాయో నువ్వు చూడనేచూసేవు. దేనిమీదవచ్చేవు నువ్వు ?"

"బండిమీద."

"అయితే ఒకగుర్రాన్నివిప్పి, దానిమీదవెళ్ళి, జనాన్ని ఇక్కడ వున్నట్లుగా పంపించాలి."

"ఇప్పుడు ఒచ్చెయ్యనా!" మైతనికోట్ తాళంచెవులు జేబులో వేసుగుని పక్కసందంపట పరుగెత్తేడు.

దేవిడోవు నెమ్మదిగా గాదులదగ్గిరికి వెళ్ళేడు. అతను రాగానే అంతా సద్దుమణిగి చూస్తూ నిలబడ్డారు. "అదుగో ఒస్తున్నాడు!" అంది ఒకామె వేలెత్తిచూపిస్తూ, ఆవేశంతో.

కాని అతడు నదురు బెదురు లేకుండా వాళ్ళఅందరికీ కనబడేటట్లు ఎదరికివచ్చి నిలబడి, గాలివాలుకుతిరిగి, అగ్గిపుల్లగీసి సిగరెట్టు ముట్టించేడు.

"సిగరెట్టు తరువాత కాలుద్దువుగానిలే—రా! రా!"

"ఇక్కడకాదు, పైలోకంలో కాలుద్దువుగాని!"

"తాళంచెవులు కూడా తెస్తున్నావా, లేవా?"

"సాధారణంగా లేకుండారాడు."

పొగ చుట్టలుచుట్టలుగా వొదులుతూ జేబులలో చేతులు పెట్టుగుని తాపీగా జనందగ్గరగా వచ్చేడు. అతనిగుండె దిటవు ఏదోవిధంగా ప్రజల మీద పనిచెయ్యకపోలేదు. వెనక ఆసరాలేకపోతే ఇంతధైర్యంగా రాడని కొంతమంది అనుకున్నారు. వర్షం కురిసినట్లు ప్రశ్నలు కురిసేయి.

"తాళం చెవులు ఇచ్చెయ్యి."

"అంతా కట్టకట్టుకు తగులడండి! ఎవడు రమ్మన్నాడు మిమ్మల్ని ఇక్కడికి?"

"మా విత్తనాలు మాకు ఇచ్చెయ్యి!"

"మేము వ్యవసాయము చేసుగోకుండా అడ్డురావడానికి నువ్వెవ డవు ?"

ఉత్తరాన్నుంచి వీస్తూన్న పిల్లగాలికి ఆడవాళ్ల నెత్తికి చుట్టుగున్న రుమాళ్ళకొసలు ఎగురుతూన్నాయి. గాదులపైన వేసిన రెల్లుకర్రలు పైకి లేస్తూన్నాయి.

"ఏమిటి ఈ హడావిడంతా ? సోవియట్ ప్రభుత్వపు ఆజ్ఞలు నెర వేర్చక పోవడానికి కారణం ఏమిటి ? యార్స్కీ సమిష్టి వ్యవసాయక్షేత్రా నికి ధాన్యం పట్టుగువెళ్ళకుండా అడ్డగించేరెందుచేత ? దీనికోసమూ, వసంత ఋతువు చల్లికలు జరగకుండా చేసినందుకూ మీరు కోర్టులో సమాధానం చెప్పవలసివుంటుందని తెలియదూ ? సోవియటు ప్రభుత్వం ఇటువంటి పనులుచేసే వాళ్ళని ఎన్నడూ క్షమించదు."

"ఇంకా సోవియటుప్రభుత్వం ఎక్కడ? అయిపోయింది దానిపని." అన్నాడు ఒకరైతు. పొట్టిగా, కుంటికాలూ అతనూ.

ఎవరో నవ్వేరు. బేనిక్ ఎదటికి వచ్చి నిలబడ్డాడు.

"ఇప్పుడు మీరు చేస్తూన్నపనులుఏమీ సోవియటుప్రభుత్వం చెయ్య మనలేదు. నువ్వు, మకార్ నగుల్నోవ్ ప్రారంభించిన ఈ సోవియటు ప్రభు త్వానికి మేము లొంగివుండం. రైతుల్ని భూములు దున్నుకోనివ్వకపోవ డం కాకపోతే ఏమిటిది ?"

"అయితే మిమ్మల్ని చల్లికలు చల్లుకోనివ్వకుండా అడ్డుపెట్టేమా మేము ?" అని అడిగేడు డేవిడోవ్.

అవును, లేదా ?"

'నీ విత్తనాలు ఉమ్మడికొట్టులో జాగ్రత్త పెట్టడానికి ఇచ్చేవా ?"

'ఆ—ఇచ్చేను."

"వాటిని మళ్ళీ మీ కిచ్చేసేరా?"

"ఇచ్చేసేరు. అయితే ఏమిటి?"

"అయితే నువ్వు చల్లుకోకుండా అడ్డుపెట్టినవారెవరు? అసలు ఇక్కడికి ఎందుకు వచ్చేవు నువ్వు?"

ఏమి చెప్పడానికీ తోచక బేనిక్ కొంచెం తత్తరపడ్డాడు. "ఇప్పుడు నేను తంటాలుబడుతూంట సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యత్వానికి రాజీనామాయిచ్చి. వాళ్ళచూడలు. ధాన్యం తిరిగి పొందనివాళ్ళకోసంకాని నాకోసంకాదు. అదీకాకుండా, నాకుఇచ్చినభూమి ఎల్లాంటిది? ఊరికి దగ్గరగా ఉన్నభూమిలాక్కొని. ఎక్కడో దూరంగావున్నభూమి ఎందుకుయిచ్చేరు?"

"వెంటనే ఇక్కడినుంచి అవతలికిపో!" దేవిదోవ్‌కి కోపం ఆగిందికాదు. "నీతో తరవాతమాట్లాడుతాలే! సమిష్టివ్యవసాయక్షేత్ర విషయాలలో నువ్వు ఆట్టేజోక్యం కలగచేసుగోకు. లేకపోతే మాటదక్కదు. జాగ్రత్త! దీనికంతకీ మూలకారకుడవు నువ్వే! అవతలకి పొమ్మని చెబుతూన్నాను, మళ్ళీ చెందోసారి!"

సణుక్కుంటూ బేనిక్ వెనక్కితప్పుకున్నాడు. కాని, ఇంతలో ఆడవాళ్ళువచ్చి అతనిస్థానం ఆక్రమించేరు. దేవిదోవ్ మాటవినపడకుండా గట్టిగా అరవటంమొదలెట్టేరు. అతను ఎలాగైనా లుబిష్కిన్ వచ్చేవరకు కాలం గడుపుదామని చూసేడు. కాని, ఆడవాళ్ళు చెవులు బద్దలయేటట్లు గోలపెడుతూ. అతన్ని చుట్టుముట్టేరు. కోసక్కులంతా వెనక మాట్లాడక నిలబడి చూస్తూన్నారు.

దేవిదోవ్ చుట్టూ కలయచూసేటప్పటికి మెరీనాపాయాస్కోవా కనబడింది అతనికి. ఆమె బుజాలు కట్టుగునిలబడి కొంతమంది ఆడవాళ్ళతో ఉద్రేకంగా మాట్లాడుతూంది. కనుబొమలు ముడిపడ్డాయి. ఆ పక్కనే డైమిద్‌తో గుసగుసలాడుతూన్న యాకోవ్‌లూకిచ్ కనబడ్డాడు.

"తాళంచెవులు ఇచ్చెయ్యి! నీ మంచికోసమే చెబుతూన్నాం, విను." ఒకతామె దేవిడోవ్ జబ్బపట్టుకుని, ట్రౌజరుజేబులో చెయ్యిపెట్టింది తాళాల కోసం.

దేవిడోవు ఆమెను ఒక్కతోపు తోసేటప్పటికి వెనక్కి వెల్లకితలా పడిపోయి. "అయ్యో, వీడిఅమ్మకడుపుమాడా, చంపేసేడు! చూస్తూ ఊరుకుంటారేం!" అంటూ గోలపెట్టింది.

"ఏమిటది!" అన్నాడు వెనకనుంచి యెవరో, కంపితస్వరంతో తీవ్రంగా. "కొట్టడంకూడానా? సరే అయితే, ఏమాత్రంకొడతాడో అదీ చూద్దాం నడవండి!"

పడిపోయినఆమెనులేవతియ్యడానికి దేవిడోవ్ ఒంగోబోతూన్నాడు. ఇంతలో ఎవరో అతనినెత్తిమీదిటోపీ ఎగరకొట్టేరు. గబగబా అయిదారు దెబ్బలు నెత్తిమీద, ముఖంమీద పడ్డాయి. వాళ్ళు అతనిచేతులు రెండూ గట్టిగా పట్టుకున్నారు. జబ్బలురెండూ విదల్చుకొని, అతను కొట్టడానికి వస్తూన్నవాళ్ళని గెంటిపారేసేడు. కాని వాళ్ళు గొల్లుమని గోలపెడుతూ మళ్ళీ అతనిమీదపడి షర్టుచింపేసేరు. జేబులురెండూ వెతిగేరు కాని ఏమీ కనిపించలేదు.

"దగ్గిరలేవు తాళంచెవులు!"

"ఎక్కడ దాచేవు?"

"ఇచ్చేసెయ్యి! లేకపోతే తాళాలు బద్దలకొడతాం."

హద్దు-పద్దులేకుండా ఛడతిడుతూ మిష్కాఇగ్నటియోనక్‌తల్లి దేవిడోవుదగ్గిరికి తోసుగువచ్చి, అతని ముఖంమీద ఉమ్మేసింది.

"దేవుడు లేడనే నీవంటి నాస్తికవెధవలకి చేసే గౌరవం ఇదే!"

దేవిడోవ్ నిర్ఘాంతపోయేడు. వాళ్ళ చేతులలోనుంచి విడిపించుకొనడానికి, శక్తినంతనూ ఉపయోగించి ఆఖరిప్రయత్నంచేసేడు. కాని ఏమీ

లాభంలేకపోయింది. కొంతమంది కోసక్కులు ఆడవాళ్ళకి సహాయంగా వచ్చి, రెండుజబ్బలువిరిచి వెనక్కి పట్టుగున్నారు. అందుచేత విడిపించు గునే ప్రయత్నం ఒదులుకున్నాడు. అక్కడ వున్నవాళ్ళెవరూ తన సహాయానికి రారని తెలుసుగుని కొత్తపంథా అవలంబించాలనుకున్నాడు.

"గాదులతాళంచెవులు నాదగ్గిరలేవు. అవి.........." అని మధ్యలో ఆగేడు: వాటిని తనదగ్గిర ఉంచుగోలేదని చెప్పటం అనుకున్నాడు. కాని మళ్ళీ అలాచెప్పినట్లయితే వాళ్ళంతా దెమ్యానుష్కాకోసం పరుగెత్తి పట్టుగుంటారని తోచింది. దెమ్యాన్కనక దొరికినట్లయితే చంపెయ్యడానికి కూడా వెనుతియ్యరు. "వాటిని ఇంట్లోపెట్టేనని చెప్పి, అక్కడ వెతుకుతూ కాలక్షేపం చేస్తాను కొంతసేపటిక, కనిపించలేదని చాపకబురు చల్లగాచెబుతాను. సాధారణంగా నన్ను చంపేటంత సాహసంచెయ్యరు. ఈలోపుగా ఐదిస్కీన్ రావేరావచ్చు. పిశ్చనితగలెయ్యా పిశ్చిరోగం అలా కుదర్తాం!" అనుకున్నాడు. నిశ్చబ్దంగా, దవడమీదనుంచి కారుతూన్న రక్తం జబ్బతో తుడుచుగుని, "తాళంచెవులు నా బసలోవున్నాయి, కాని మీకుమాత్రం యివ్వను. అంత తాళాలు బద్దలకొడతామంటారా, తరువాత దానికి ఫలితం అనుభవిద్దురుగాని." అన్నాడు.

"మీయింటికి తీసుగువెళ్ళు. వెతిగి మేమేతీసుగుంటాము." అంది ఇగ్నటియోనక్ తల్లి. ఆమె ఆందోళనకి ముడతలుపడి వేళ్ళాడుతూన్న చవడలు, ముక్కుమీది ఉలిపిరికాయ ఊగిసలాడేయి. చెమట ప్రవాహం కట్టి కారుతూంది. ఆమె దేవిదోవ్ని గెంటడంతోటే, అతను ఇష్టంలేనట్లుగా నడుస్తూ నెమ్మదిగా అతనియింటికేసి నడవడం ప్రారంభించేడు.

"నిజంగా అక్కడ తాళంచెవులు ఉన్నాయా? మరచిపోయేవేమో జ్ఞాపకంచేసుగో." అంది బేనిక్ భార్య అప్డాకియా.

"జ్ఞాపకంవుంది; అక్కడే పెట్టేను." అని అతినమ్మకంగా అని చిరునవ్వు వాళ్ళకు కనిపించకుండా తలవంచుకున్నాడు.

నలుగురు అతని జబ్బపట్టుగున్నారు. ఒకామె దృఢమైనకర్ర చేత పుచ్చుకుని వెనకవస్తూంది. అతని కుడివైపున ఇగ్నటియోవక్ తల్లి మొగాళ్లా నడుస్తూ వస్తూంది. ఎడమవైపున మిగిలిన ఆడవాళ్ళంతా కేరింతాలుకొడుతూ, మాట్లాడుకుంటూ గుంపులు గుంపులుగా బయలుదేరేరు. కోసక్కులంతా అక్కడే నిలబడ్డారు తాళంచెవులకోసం.

"చేతులు ఒదిలెయ్యండి; ఎక్కడికీపారిపోను మరేంభయంలేదు." అని అడిగేడు దేవిడోవ్.

"నువ్వు పారిపోతేమాత్రం ఏమిటిచేసేది."

"అబ్బే-ఎక్కడికీ పారిపోను."

"కూడావస్తే ఏబాధావుండదు మాట్లాడక రద్దూ!"

వాళ్ళంతా అతని ఇంటికివెళ్ళేరు; వీధిగేటు తోసుకుని లోపలికి జొరబడ్డారు అంతా.

"లోపలికివెళ్ళి తాళంచెవులు వెతిగితీసుగురా. తీసుగురాకపోయేవంటేమాత్రం మాటవక్కడు; కోసక్కుల్ని పిలిపించి రెక్కలువిరిచి కట్టి పొడిపిస్తాను జాగ్రత్త!"

"సోవియటుప్రభుత్వం సంగతి మరిచిపోయేరులావుంది అప్పుడే! కాని అది మిమ్మల్ని త్వరగా మరిచిపోదు ఈ పనికి."

"చావుఅంటూ ఎన్నిమాట్లుందేమిటి, ఎప్పుడోఒకప్పుడు చస్తాము. ఈఏడు ఇంతవరకూ వ్యవసాయం ఏమీలేదు; ముందులో తిండిలేకచస్తేం, ఇప్పుడుచస్తేం. ఈపాటికి వెళ్ళి అవిపట్టుకురా ఆట్టేకబుర్లుచెప్పక."

దేవిడోవ్ గదిలోకివెళ్ళేడు. బయటనుంచి వాళ్ళంతా చూస్తూండడం చేత వెతుగుతున్నట్లు నటించసాగేడు. సూట్‌కేసులోనివి టేబులుమీదికి అన్నీ తిరగబోర్లావేసి వెతిగేడు. కాగితాలన్నీ చిందరవందరగా పడేసేడు మంచంకింద దూరికూడా వెతికేడు.

కొంతసేపటికి బయటికివచ్చి "తాళంచెవులు దొరకలేదు." అన్నాడు.

"అయితే ఏమయేయి?"

"నగుల్నోవ్ తీసుకువెళ్ళేడేమో అనుకుంటాను........" అన్నాడు.

"అతను ఊరికివెళ్ళేడులావుంది."

"వెడితేమాత్రం? వెళ్ళేటప్పుడు తాళంచెవులు ఇంటిదగ్గిరపడేసే వెళ్ళివుంటాడు. రెండోబ్రిగేడుకి విత్తనాలుకూడా ఇయ్యవలసివుంది ఈవేళ. తాళంచెవులు తప్పకుండా ఇచ్చివెళ్ళిపెడతాడు ఏమీసందేహంలేదు."

అక్కడినుంచి వాళ్లు దేమిదోవ్ని నగుల్నోవ్ ఇంటికి తీసుకువెళ్ళేరు. దోవలో అతన్ని కొట్టడం మొదలెట్టేరు. మొదట తిట్టడంతో సరిపెట్టేరు కాని అతడు నవ్వుతూ వేళాకోళం చెయ్యడం మొదలెట్టేటప్పటికి వాళ్ళకి ఒళ్లుమండి కొట్టసాగేరు.

"చేతులతో కొట్టడంచాలక పైగా కర్రతోకూడా కొడతారేం?" అంటూ లేనినవ్వు తెచ్చిపెట్టుకున్నాడు. కాని వాళ్ళు నిర్దాక్షిణ్యంగా చావ కొట్టేరు. అన్ని దెబ్బలుతింటున్నా వేళాకోళాలు నవ్వులుమాత్రం మానలేదు.

"మీరు ఇన్నిదెబ్బలు కొట్టేరుకదా మరి వాటికి నేను బదులు తీర్చుకోవద్దూ?"

"ఆరి—నీ మొహంమండా, నీది నూకరాయికాని ఒళ్లుకాదురా!" అంది నస్టియాదొనిట్స్కోవా రెండుచేతులా దేమిదోవ్నడ్డిమీద కొడుతూ. నాచేతులు నెప్పెట్టాయి కాని వాడికి చీమకుట్టినట్లు కూడా లేదు........"

ముక్కులోనుంచి రక్తం కారుతూంది. పెదవులు బద్దలయేయి. మెలి తిప్పడంచేత చెవులు కందిపోయి ఎర్రగావున్నాయి. అయినా కాని అతడు తొస్సిపన్ను బయటపడేటట్లు నవ్వుతూ బాగా కొట్టేవాళ్ళని నెమ్మదిగా పక్కకి గెంటేసేడు. వాళ్ళ అందరిలోను ఇగ్నటియానక్తల్లి పళ్ల

కొరుకుతూ విధీవిరామం లేకుండా కొడుతూంది. ఒళ్లు బాగా నొచ్చడానికి పిడికిలి బిగించి ముడుసులతో ముక్కుమీద, కణతలమీదా కొట్టింది. అడ్డం వున్నవాళ్ళని పక్కకితోసి, ఒగరుస్తూ అతనిముందరికి వెళ్ళి "ఎంతసేపు వోర్చుగుంటాడోచూద్దాం, మీరంతా పక్కకి తప్పుకోండి. చెబుతాను" అంది.

"తొందరపడకు, రాక్షసిముండా! నీపని చెబుతాను, లుబిష్కిన్ రానీ!" అనుకుంటూ ఆమెదెబ్బలు తగలకుండా పక్కకి తొలగిపోయేడు.

ఎంతసేపు చూసినా లుబిష్కిన్ జాడ కనబడలేదు." ఇంతలో వాళ్లు దేవిదోవ్‌ని నగుల్నోవ్ ఇంటికి లాక్కుపోయేరు. ఈసారి ఆడవాళ్ళు దేవిదోవ్‌తో కూడా లోపలికివెళ్ళేరు. పుస్తకాలు, కాగితాలు, బట్టలూ అన్నీ చిందరవందరగా పారేసి గది అంతా గాలించేసేరు. ఆ యింటివాళ్ళు ఉన్న భాగంకూడ పూర్తిగా వెతిగేరుకాని తాళంచెవులు ఎక్కడా కనబడలేదు. అందుచేత వాళ్లు దేవిదోవ్‌ని బయటికి లాక్కుపోయి "తాళంచెవులు ఏంచేసేవో చెబుతావా లేకపోతే చంపెయ్యమన్నావా!" అని మీదపడ్డారు.

"ఆస్త్రోవ్‌నోవ్ దగ్గిరఉంటాయి." అని సమాధానం చెప్పేడు దేవిదోవ్. గాదులదగ్గిరనవ్వుతూ నిలబడ్డ ఆ వ్యవసాయక్షేత్రపు మేనేజరు ముఖం జ్ఞప్తికి తెచ్చుకుని.

"అంతా అబద్ధం! అతన్ని మేము యిదివరకే అడిగేము. నీ దగ్గిర ఉంటాయని చెప్పేడు."

ఏదో జ్ఞప్తికి తెచ్చుగుంటూన్నట్లుగా బాగా వాచిపోయివున్న ముక్కు తడుముకుంటూ చిరునవ్వు నవ్వేడు. "ఇంతసేపటినుంచి వృధాగా కొట్టేరు నన్ను! ఆఫీసులో నా టేబులులో ఉన్నాయి తాళంచెవులు! ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది."

"ఆటకింద పట్టించేవు మమ్మల్ని!" అంది ఎకతెరినాగుల్యాళ్చాయా

"అక్కడికి తీసుకువెళ్ళండి: నిజమో అబద్ధమో మీకే తెలుస్తుంది. కొట్టడం మాత్రం వద్దు. ఆ ఒక్క ఉపకారం మాత్రం చెయ్యండి." దేవిదోవ్ వీధిలోకి దోవతీసేడు. అతనికి నోరు ఇగిరిపోయింది; ప్రతిష్ఠ కోసం అని ఎల్లాగో నిలబడివున్నాడు. దెబ్బలుతినడానికి యిదే మొదటి సారి కాదుకాని ఇంతవరకు ఆడవాళ్ళచేత యెప్పుడూ దెబ్బలు తినివుండని వాడవడంచేత, మనస్సు మనస్సులోలేదు. "ఏమైనాసరే లొంగుబాటు చూపించకూడదు. లేకపోతే ఇంకా వెర్రెత్తి ఆఖరికి చంపేస్తారుకూడాను! ఆఖరికి నీచపుచావు చావనా!" అనుకుని ఆశాపూరిత దృష్టితో దూరాన్న నీలంగా కనబడుతూన్న గుట్టలవైపు తేరిచూడసాగేడు. కాని యెక్కడా గుర్రపురౌతుల జాడకాని, గుర్రపుడెక్కల ధ్వనికాని కనబడలేదు. ఆ ప్రాంతంలో కంటికి ఆనినంతవరకు యెక్కడా మనుష్యసంచారంలేదు. వీథులుకూడా అల్లాగే వున్నాయి. గ్రామంలో ఆబాలగోపాలం గాదులదగ్గర చేరారు.

ఆఫీసుదగ్గరకి వచ్చేటప్పటికి, వాళ్ళు కొట్టేదెబ్బలకి దేవిదోవ్ ఇంక నిలబడలేకపోయేడు. పరిహాసంగా మాట్లాడడం మానేశాడు. తల రెండు చేతులా పట్టుకుని, తరచుగా తూలిపడిపోతూ, "చాలు! వృథాగా ఎందుకు కొట్టిచంపుతారు! తాళంచెవులు నాదగ్గరలేవు! తలమీదమాత్రం కొట్టకండి. సాయంత్రంవరకు కొట్టినాసరే పడతానుకాని నా దగ్గరమాత్రం తాళంచెవులు లేవు!"

"సాయంత్రంవరకూ కొట్టినా పడతావేం?" అంటూ అంతా మళ్ళీ దేవిదోవ్‌మీద పడి, కొట్టి, తన్ని, పీకి, నానాహింసాపెట్టారు.

ఆఫీసు ఆవరణకి యెదురుకుండా రోడ్డుమీద చతికిలపడ్డాడు దేవిదోవ్. అతని కేన్వాసుషర్టు అంతా రక్తంతో తడిసిపోయింది. మోకాళ్ళ వరకూ మాత్రం ఉన్న ట్రౌజర్లు చిరిగిపోయాయి; పేలికలు అయిపోయిన షర్టులోనుంచి గుండెలు, నడ్డి, బాగా కనబడుతున్నాయి. దీర్ఘ నిశ్వాసాలు వదుల్తూ, చూడడానికి జాలిగొలుపుతున్నాడు.

"చతిగిలపడ్డావేం లేవక!" అంటూ ఇగ్నటియోనక్ తల్లి కాలితో తన్నింది.

"పిశాచంముండల్లాలా, మీకోసమే మేం పనిచేస్తూంట! అల్లాంటి వాణ్ణి నన్ను చంపుతూన్నారు!" అంటూ మెరుస్తూన్న కళ్ళతో వాళ్ళకేసి చూస్తూ శక్తికొలదీ గట్టిగా అర్చేడు. "తాళంచెవులు మీకు ఇవ్వను. తెలిసిందా? అర్చి చచ్చినాసరే ఇవ్వను! ఏం?"

"కోసక్కులు తాళాలు బద్దలుకొట్టి ధాన్యం పంచేస్తూన్నారు—త్వరగా రండి!" అని కేకేస్తూ ఒకఆమె పరుగెత్తుకు వచ్చింది.

వాళ్ళంతా దేవిడోవ్‌ని అక్కడే ఒదిలేసి, గాదులదగ్గిరికి పరుగెత్తేరు. దేవిడోవ్ ఒక్కసారిగా లేనిబలం తెచ్చుకుని లేచి నిలబడి ఆఫీసు ఆవరణలోకివెళ్ళేడు. ఎండకి గోరువెచ్చబడ్డ బాల్చీ-నీళ్లు వరండామీదికి తీసుకువెళ్ళి కడుపుపట్టినన్ని నీళ్ళుతాగేశాడు. తరవాత ఆ నీళ్ళన్నీ నెత్తిమీద పోసుకున్నాడు. మూలుక్కుంటూ ముఖంమీద, మెడమీద నున్న రక్తం కడిగేసుకుని, ఆవరణ గోడమీద ఆరేసివున్న గుడ్డపెట్టి తుడుచుకుని కూర్చున్నాడు.

ఎక్కడా మనుష్యసంచారం లేదు. పెంటకుప్ప కెక్కరిస్తూ కోడిపెట్ట ఒకటి 'క్లక్, క్లక్' అంటూంది. స్టెప్పీమీద నుంచి 'మర్మాట్లు' చేసే కీచుధ్వని గాలివాలుకి వినిపిస్తూంది. దూదిపింజల్లా చిన్న చిన్న మేఘాలు సూర్యుణ్ణి కప్పేసినప్పటికీ ఎండవేడిమి తీవ్రంగానే ఉంది. దొడ్డి అంతా 'బుర్రు' మని చప్పుడుజేస్తూ తిరుగుతూండే పిచ్చికలు చడీచప్పుడూ లేకుండా, తలలు జాపుకుని చూస్తూ పడుకొని, మధ్యమధ్య రెక్కలు అల్లాడుస్తూ ఉన్నాయి.

గుర్రపుడెక్కల చప్పుడు వినపడి దేవిడోవ్ తలయెత్తి చూసేడు. జీనుతోనున్న గుర్రం ఒకటి ఫుల్‌గేలప్‌మీద గేటులోనుంచి పరుగెత్తుకు వచ్చింది. నోటంపట తెల్లటి నురగపిసళ్ళు, కాలివున్న నేలమీద పడు

తూంటే సకిలిస్తూ దొడ్డిచుట్టూ రెండు చక్కర్లుకొట్టివచ్చి, తిన్నగా గుర్రపు సాల ఎదట ఆగి నేల మూచూడటం మొదలెట్టింది. కళ్ళెం నేల జీరాడుతూంది. జీను పక్కకి వొరిగిపోయింది; డొక్కలు ఎగరేస్తూ, ఉఛ్వాస నిశ్వాసలు తీవ్రంగా విడుస్తూంది.

దేవిదోవ్ గుర్రంకేసి, విస్తుపోయి చూస్తూన్నాడు. ఇంతలో తలుపు తీసినధ్వని వినబడి ఆవైపు తిరిగేటప్పటికి ఛూకర్ తల బయటికి పెట్టి చూస్తూ కనబడ్డాడు. ఒక నిముషంసేపు చూసి, ఛూకర్ జాగ్రత్తగా చప్పుడు అవకుండా తలుపుతెరచి, నాలుగువైపులా భయంతో చూస్తూ బయటికి వచ్చేడు. చమటచేత తడిసి ఒంటినంటిపెట్టుకున్న చొక్కా నిండా గడ్డిపరకలు అంటుకుని వున్నాయి. ముఖం కందగడ్డలా ఎర్రబడి ఉంది. ఆ చూపుల్లో విపరీతమైన భయం ద్యోతకం అవుతూంది. నుదురంతా చెమటపట్టి, ప్రవాహాలు కారుతూన్నాయి.

"కామ్రేడ్ దేవిడోవ్ !" చప్పుడు అవకుండా యెత్తియెత్తి అడుగులువేస్తూ, దేవిడోవ్‌కేసి వచ్చాడు. "త్వరగా దాగుకోండి - లేకపోతే ప్రాణాలుదక్కవు. వాళ్ళు చూచేరంటే వెంటనే నిలువునా ప్రాణాలు తీసేస్తారు. ఎల్లాకొట్టేరు మిమ్మల్ని; ముఖంకూడా గుర్తుపట్టడానికి వీలులేకుండా ఉంది ! గడ్డిలోమారి తప్పించుకున్నానుకాని లేకపోతే నాపనికూడా అంతే అవును.........ఊపిరి సలిపిందికాదు. ఒళ్ళు అంతా ఒకటే చెమట. మీ మనోధైర్యంమాత్రం ఆశ్చర్యంగా ఉంది ! ఈ గడిబిడి తగ్గేదాకా యెక్కడైనా దాక్కుందాం వస్తారా ? ఒక్కడినీ ఉండలేక చచ్చాను....నిష్కారణంగా చావు కోరితెచ్చుకొనడం యెందుకు ? ఎల్లా గోలపెడుతూన్నారో చూడండి. వాళ్ళను తగలెయ్య ! నగుల్నోవ్‌ని చంపేసినట్టున్నారే ?.... ఆ - ఏం అనుమానంలేదు. అదిగో అతని గుర్రం పారిపోయివచ్చింది. పొద్దుటే ఈ గుర్రంమీద జిల్లా పట్టణానికి బయలుదేరాడు. 'అడుగులోనే హంసపాదు' అన్నట్లు రోడ్డు యెక్కకుండగానే బోకారింది. 'మకార్ !

శకునం మంచిదికాదు. ఒక్కసారి ఆగి మరీవెళ్ళు' అన్నాను కాని అల్లా చెబుతే వినీరకమా అతను! అతని జన్మలో యెరుగడు. బుద్ధికి యెంత తోస్తే అంతా చెయ్యడమే. ఆఖరికి వాళ్ళచేత చావుమూడింది. అప్పుడు నామాటవిని వెనక్కి వచ్చేవున్నట్లయితే, నాతోపాటు దాగుకొని, చావు నుంచి తప్పించుకునే ఉండును."

"అయితే ఇంటిదగ్గిర ఉన్నాడేమో" అన్నాడు దేవిదోవు.

"ఇంటిదగ్గిరా? అయితే గుఱ్ఱం యిల్లా ఎందుకు పరుగెత్తుకు వస్తుంది అతను లేకుండాను? కాకపోయినా గుఱ్ఱం శవాన్ని పసికట్టినట్లు నేల వాసన చూడడాన్నిబట్టి అక్షరాలా నేను అన్నంతపనీ అయివుంటుంది. అనుమానంలేదు. జిల్లా పట్టణాన్నుంచివచ్చి, ప్రజలంతా యెవరికి తోచి నట్లు వాళ్ల గాదులు బద్దలుకొట్టి. ధాన్యం పట్టుకుపోవడంచూసి, అడ్డగిం చేడు. అందుచేత వాళ్లు చంపేసేరు!"

దేవిడోవ్ ఏమీ మాట్లాడలేదు. గాదులదగ్గిరనుంచి రణగొణ ధ్వని వినిపిస్తూంది. బళ్లు వస్తూపోతూవున్న ధ్వని అతనిచెవిని పడుతూంది. "గాదులు బద్దలుకొట్టి ధాన్యం పట్టుకుపోతున్నారు. అయితే ఘకార్ యేమయిపోయేడో? నిజంగా అతన్ని చంపివుంటారా? వెళ్ళిచూడాలి" అనుకుంటూ దేవిదోవు లేచాడు.

ఘూకర్, దేవిడోవు తనతోకూడా దాగుకొనడానికి నిశ్చయించి లేచేడని ఊహించి, అతన్ని యింకా తొందరపెట్టసాగేడు.

"త్వరగా రండి: ఒక్క నిమిషంకూడా ఆలస్యం చెయ్యడానికి వీలు లేదు. వాళ్ళ కంటపడితే చచ్చేమన్నమాటే! గడ్డిమేటిలో దాగుకొనడానికి వీలుగానే ఉంది. ఎవరేనా తిండి తెచ్చిపెడుతూంటే, ఎన్నిరోజులైనా దాన్లో ఉండకలను నేను. ఇందాకా మేకఒకటి కంగారుపెట్టింది. నిలువునా చంపెయ్యాలన్నంత కోపంవచ్చింది! ఆడవాళ్ళందరూ మిమ్మల్ని పట్టుకుని బాధించడం నేను చూస్తూనే వున్నాను. ఆదెబ్బతో నా పనికూడా అయిపో

ఉంచనుకున్నాను. ఎందుచేతనంటారేమో — విప్లవ ప్రారంభంనుంచీ ఒక్కలా పనిచేస్తూన్నది మీరూ నేనూ మాత్రమే అనీ, ఈ ఊళ్ళో సమిష్టి వ్యవసాయక్షేత్రం ఏర్పాటుచేసినదికూడా మనమేననీ అందరికీ తెలుసును. అటువంటప్పుడు మనం దొరుకుతే ఒదిలిపెడతారా! మన రోజులేమీ బాగులేవు. ఎవరికీ కనబడకుండా దాగుకోవాలి. లేకపోతే దేవిడోవుని చంపేసి తరువాత నాపని పడతారు. తీరా, నేను చచ్చిపోతే దేవిడోవుని ఫలానా వాళ్లు చంపేరని సాక్ష్యం ఇచ్చేవాడెవడు? అనుకొని వెంటనే గడ్డిలోదూరి, కనబడకుండా పైనకూడా గడ్డివేసుకుని అల్లాగే పడివున్నాను హుసలుపోతూ. ఇంతలో గడ్డిమీదికి ఎవరో ఎక్కుతూన్న చప్పుడయింది. ఆ గాలి ముక్కుల్లోకి దూరడంచేత తుమ్మాడు. నన్నుకూడా పట్టుకుని చంపడానికి వెతుకుతున్నారేమోనని తోచి, ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకు కూర్చున్నాను. ఆ గడ్డిమీద తిరిగితిరిగి ఆఖరికి నాపొట్టమీద పడింది కాలు. అల్లాగే పడిఉన్నాను! భయంచేత గుండెలు ఆగిపోయేయేమోకూడాను; అయినప్పటికీ ఎటుపోవడానికీ గత్యంతరంలేక అల్లాగే పడివున్నాను. పోనీ అంతటితో అయిందా; ఇంకో నిముషానికి ఆ కాలు తిన్నగా నా ముఖంమీదే పడింది! చేతితో తడిమి చూస్తునుకదా గిట్టలూ, బొచ్చుచేతికి తగిలాయి! నాపై ప్రాణాలుపైనే ఎగిరిపోయేయి. ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఆగిపోయేయి. ఏ బ్రహ్మరాక్షసోవచ్చి మీదపడింది అనుకున్నాను. 'ఇక్కడఉంటే యిది ఎల్లాగా బ్రతకనియ్యదు. ఇంతకంటె ఆడవాళ్ళచేతుల్లో చావడమేమంచిది.' అప్పుడు నిజంగా అంతభయం వేసింది! మరొకరెవరైనా ఆ పరిస్థితుల్లో అయినట్లయితే గుండె బేజారెత్తి చచ్చును. నేను కొంచెం భయపడ్డా పస్తాయించి అల్లాగే పడుకుని వున్నాను. తరువాత కొంతసేపటికి గొఱ్రెవాసన వేస్తూండడం పసికట్టేను. వెంటనే టిటాక్ గొఱ్రె ఆ ప్రాంతాన తిరుగుతూండే విషయం జ్ఞప్తికి వచ్చింది. జాగ్రత్తగా బయటికి పొంచిచూసేను. తీరా చూస్తునుకదా అచ్చంగా అదే! అప్పుడులేచి దానికి తగిన శాస్తి

చేసేను. 'గ్రామం అంతా తిరుగుబాటుచేసిన ఇప్పుడా నీకు ఈ గడ్డిలో షికారు చేసేందుకు సమయం దొరికింది ! అనవసరంగా ఇల్లా వచ్చినందుకు తగిన శిక్ష అనుభవించు' అని దానిగడ్డం ఊడపీకి డొక్కలో మరినాలుగు పోట్లు పుచ్చుకున్నాను.........అయితే, కామ్రేడ్ దేవిదోవ్, ఇప్పుడు ఎక్కడికి వెడతావు ?"

సమాధానం ఏమీ చెప్పకుండా దేవిదోవ్ తిన్నగా వీధులోకి బయలు దేరేడు.

"ఎక్కడికి ?" అని మళ్ళీ అడిగాడు ఛూకర్ భయపడుతూ. సగం తెరిచియున్న కర్రగేటుదాటి దేవిదోవ్ తూలుతూ, సమిష్టివ్యవసాయక్షేత్రపు గాదులవైపు వెళ్ళిపోయాడు.

---

## ముప్పైనాలుగో ప్రకరణము.

### పాడుదిబ్బ.

రోడ్డుకి పక్కనేవుంది ఒక పాడుదిబ్బ. అచ్చటచ్చట నున్న చిన్న చిన్న రుప్పలు గాలికి అల్లల్లాడుతూన్నాయి. దిబ్బ అంతా ఎండిపోయిన రెల్లుగడ్డితో నిండివుంది. ప్రపంచం అంతా నూతనశోభతో కలకల్లాడే వసంతరుతువులో కూడా అది కళాకాంతి, లేకుండా జీర్ణావస్తని వెలిబుచ్చు తూంటుంది. ఆ కాలంలో మాత్రం పూర్తిగా మంచుతో కప్పబడిఉంటుంది.

వేసవిలో సంధ్యాసమయాల్లో రాబందు ఒకటి రెక్కలల్లారుస్తూ వచ్చి వాలుతూంటుంది. రెండు అడుగులువేసి, రెక్కలు ముడుచుకుని, జోగుతూన్నట్లుగా అల్లాగే నిలబడి, ఎరకోసం ఒడుపువేసి నిలబడి చూస్తూంటుంది.

శీతకాలపుగాలి విసుళ్ళకి అది ఎక్కడికిపోతుంది ? కాకేషియన్ పర్వతసానువులకా ? మగానస్కు-స్టెప్పీలకా ? లేక పర్షియాకో, ఆఫ్గని స్థానానికోనా ?

కాని శీతకాలంలో ఆ దిబ్బ అంతా మంచుమయమై ఉన్నప్పుడు, తూర్పున రేఖలు తెల్లవారుతూంటే నక్క ఆ దిబ్బపైకి ఎక్కి నిలబడు తూంటుంది. బూడిదరంగు రాయి మల్చిన విగ్రహంలా, నిలబడి, దృష్టి సారించి చూస్తూంటుంది.

అనేక శతాబ్దాలక్రిందట యుద్ధంలో చనిపోయిన పొలోవిట్సియన్ యువరాజుని బ్రహ్మాండమైన సైనికమర్యాదలతో అక్కడ సమాధిచేసి, అతని భార్యలు, ఇతర బంధువులు, సేనానాయకులు అంతా తలొక పారెడు మట్టి పోసినది మొదలు, ఎండకి ఎండుతూ, వానకి తడుస్తూ, ఇప్పటి వరకూ అల్లాగే ఉంది.

ఈ దిబ్బ, గ్రెమాచీలాగ్‌కి 5 మైళ్ళలోనున్న గుట్టలవరుసలలో వుంది. పూర్వం ఎప్పుడో, గాయపడిన కోసక్కు ఒకడు ఈ దిబ్బదగ్గిరికి వచ్చేటప్పటికి చచ్చిపోవడంచేత అప్పటినుంచీ దానిని చావుదిబ్బ అని పిలుస్తారు.

నగుల్నోవ్ జిల్లాపట్నం దగ్గిర ఎక్కిన గుర్రాన్ని ఎక్కడా దిగకుండా 15 మైళ్ళు గేలప్‌మీద వచ్చి, ఈ పాడుదిబ్బదగ్గర ఆగేడు. అక్కడ గుర్రం దిగి దాని మెడమీద చెమటతుడుస్తూ నిలబడ్డాడు.

ఎండ మలమల మాడ్చేస్తూంది. కంటికి ఎక్కడా ఒక్క పిట్ట కూడా కనిపించడంలేదు. దూరాన్న ఉన్న నీటిపట్టునుంచి, బాతులు, నీటి కోళ్ళూ, కొంగలూ అరుపులు గాలివాలున వినిపిస్తూన్నాయి.

మకార్ గుర్రంనోటిలోని కళ్ళెం తీసేసి, జీనుతాళ్ళు ఒదులుచేసి, మేతకి ఒదిలేసేడు. అదీ, ఆతురతగా కురచగానున్న గడ్డిచిగుళ్లు కొరుకుతూ ముందుకు పోసాగింది.

అడవిబాతుల పిండు ఒకటి రొదచేస్తూ ఆ పాడుదిబ్బమీదుగా ఎగురుతూ వెళ్ళి నీటిపట్టున వ్రాలింది. మకార్ వాటికేసి పరధ్యాన్నంగా చూస్తూ నిలబడ్డాడు. ఇవి అక్కడ వాలగానే అంతవరకు అక్కడనున్న కొంగలు పెద్ద రొదచేస్తూ ఆకాశంలోకి లేచాయి.

స్టెప్పీ అంతా నిర్మానుష్యంగా ఉంది. మకార్ ఆ దిబ్బమీద చాలా సేపు కూర్చున్నాడు. కొంతసేపటివరకు గుర్రం సకిలిస్తూ ఆ చాయల తిరుగుతూ మేస్తూండడం అతని చెవిని పడుతూనేవుంది. కాని దూరాన్న వున్న కొండలోయలో గడ్డి బాగా యెదిగియుండడంచేత క్రమంగా అటు పోయింది.

"ఇంటికి వెళ్ళగానే ఆంద్రీ. దేవిదోవ్‌ల దగ్గిర సెలవు తీసుకొని, పోలిష్ యుద్ధరంగాన్నుంచి వచ్చేటప్పుడు నేను తొడుగుకొన్న దుస్తులు ధరించి కాల్చుకు చచ్చిపోతాను. ఈ జీవితంలో యింక నాకు యేవిధమైన ఆశా లేనప్పుడు యెందుకింక ! నేను లేకపోతే ప్రపంచ విప్లవం ఆగిపోదు: దానికోసం పనిచేసేవాళ్ళు అనేకమంది ఉన్నారు. నావంటివాడు యెవడో ఒకడు పోతేమాత్రం లెక్కేమిటి ?" మకార్ బోర్లాపడుకుని పక్కనవున్న రుప్పలకేసి చూస్తూ అనుకుంటున్నాడు. "నేను చచ్చిపోయినతరువాత దేవిదోవ్. నగుల్నోవ్‌ని పార్టీలోనుంచి అనవసరంగా గెంటేశాం పాపం; ఒకటోరకం కమ్యూనిస్టు. అతను చచ్చిపోయినంతమాత్రాన ఊరుకోకూడదు. అతను దేనికోసం రాత్రింబగళ్లు అదే ధ్యానంగా పలవరించేదో ఆ ప్రపంచ విప్లవంకోసం యింకా తీవ్రంగా పోరాడి సాధిస్తాము అనుకుంటాడు బహుశా." తను చచ్చిపోయింతరువాత ప్రజలంతా చేరుతారని, వాళ్ళలో బేనిక్ మీసాలు ఒడేస్తూ 'మంచిపని అయింది. ఇల్లాంటివాడికి ఇంతకంటె యెక్కువ చావు దొరుకుతుందా ? ఈడ్చేవాళ్ళైనా లేకుండా కుక్కలా దిక్కులేని చావు చచ్చేడు !' అంటాడని ఊహించుకున్నాడు.

"ఒరేయ్ ! నేను అప్పుడే చస్తాననుకుంటున్నావేమో ? అల్లా యెప్పటికీ చావను ! ముందు నీవంటి వెధవలపని పట్టించి మరీచస్తాను." అను

కొంటూ మకార్ పళ్లు కొరికాడు. హఠాత్తుగా లేచి నిలబడ్డాడు. బేనిక్ జ్ఞప్తికి వచ్చేటప్పటికి అతని వెనకటి ఆలోచనలన్నీ యెగిరిపోయాయి. “అటువంటి తెలివితక్కువపని యెప్పుడూచెయ్యను. నీవంటివాళ్ళనందరినీ నాశనం చేసితీరుతాను. తరువాత నేను యేమైనాసరే! నేనుచస్తే చంకలు కొట్టుకుని ఆనందిద్దామనుకుంటున్నారేమో, అలా యెప్పటికీ జరగదు. పార్టీ సెక్రటరీ బహిష్కరించగానే అయిందా? ఈ చర్చలయిపోగానే రిజియనల్ కమిటీకి అప్పీలుచేస్తాను. అక్కడా న్యాయం జరగకపోతే ప్రావిన్షియల్ కమిటీకి వెడతాను: అదీకాకపోతే మాస్కోవుంది! వాళ్ళు కూడా నన్ను పార్టీలో చేర్చుకోకపోయినట్లయితే, బయటవుండే విప్లవ ద్రోహుల్ని అందర్నీ నాశనం చెయ్యడానికి నా శక్తివంచన లేకుండా పాటు పడతాను!” అనుకుంటూ గుర్రంకోసం చూసేడు.

అతనికి పని మొదట అనుకున్నంత సుళువుగా లేదనితోచింది. గుర్రం కనిపించకపోవడంచేత ఆ దారినిగా కొండలోయకేసి పరుగెత్తేడు. అతని అడుగుల చప్పుడువిని పొదచాటున కూర్చున్న తోడేలు ఉలికిపడి లేచింది. ఒక నిముషంసేపు అతనికేసిచూసి చెవులు రిక్కించి, తోక ముడిచి, లోయలోకి పరుగెత్తింది.

మకార్ దగ్గిరకి రాగానే గుర్రం తలెత్తిచూసింది. ముందరికాళ్ళకి కట్టిన కళ్ళెం పుటుక్కున తెగిపోయింది.

“దా! దా!” అంటూ మకార్ నెమ్మదిగా దాన్ని పట్టుకోడానికి వెనకనుంచి వెళ్ళాడు. కాని అది అతనికేసిచూస్తూ ముందుకి చకచకా అడుగులు వెయ్యసాగింది. మకార్ దానివెనక పరుగెత్తాడు. కాని అది అందకుండా పరుగెత్తుతూ మధ్యమధ్య వెనకకాళ్ళతో తన్నుతూ ఊరివైపు పోవ సాగింది.

మకార్ తిట్టుకుంటూ దానివెనకాలే వెళ్లేడు. దోవ తెన్ను లేకుండా అలాగే ఆ స్టెప్పీ అడ్డపడి గ్రామానికి దగ్గరగానున్న దున్నిన చేలదగ్గిరికి చేరుకున్నాడు.

గుబ్బం తిప్పలు పెట్టడంచేత అతికోపంతో పొలాలు అడ్డపడి గబ గబాపోతూ, మకార్ వంగి గుప్పెడుమన్ను చేత తీసుకున్నాడు. చచ్చిపోయిన తుంగమొక్కలూ అదీ ఆమన్ను ఎండకి వేగిపోయి వేడిగావుంది. ఆభూమి చాలాకాలంనుంచి బీడుపడివుంది. అందుచేత ఆయేడు నాలుగైదుచాళ్ల బాగా లోతుగా దున్ని, గుంటకతోలి అట్టేపెట్టేరు

"అదును దాటిపోతూంది! ఆఖరికి ఇంతపనీ వృధా అవుతుం దేమో!" అనుకొంటూ అంతా కలయజూశాడు. ఇంకో రెండురోజులు ఇలా ఊరుకుంటే ఎందుకూ పనికిరావింక. (అంతా అత్తీసరుపదును ఇది) ఆవు ఎదోయినప్పుడు వెంటనే ఆబోతుని దాటించినట్లుగానే ఇదికూడా. అదునుచూసి విత్తనాలు చల్లకపోతే అంతావృధా. వెంటనేవెళ్ళి అందర్నీ చల్లికలకి తరమాలి; ఒక్కవ్యక్తినికూడా వృధాగా కూర్చోనియ్యకూడదు. పెద్దపెద్ద అంగలువేసుకుంటూ గబగబానడుస్తూ, మధ్యమధ్య పరుగెత్తుతూ నగుల్నోవ్ గ్రామాచీచేరాడు.

---

## ముప్ఫైఅయిదో ప్రకరణము.

### సహాయము.

నగుల్నోవ్ ఊళ్ళోకి వచ్చేటప్పటికి ప్రజలంతా ధాన్యం ఇళ్ళకి మోసుకుపోవడంలో మునిగిఉన్నారు. లుబిష్కిన్ అతని బ్రిగేడుతోకూడా ఎక్కడో పొలాల్లో పనిచేస్తున్నాడు. గాదులచుట్టూ జనం తీర్థప్రజలా ఉన్నారు. ధాన్యం బస్తాల్లోకి పట్టడం, కాటావేసి లాగెయ్యడం నిమిషాల మీద జరిగిపోతూంది. వచ్చేబళ్ళూ - పోయేబళ్ళూ వీధి అంతా ఒక్కటే ఆడావిడి. ఆడ మగ భేదంలేకుండా ఎవరు మొయ్యగలిగినన్ని వాళ్లు బస్తాల తోనూ, తట్టలతోనూ, ఆఖరికి గుడ్డలలో పోసుకుని మోసుక పోతూన్నారు.

ఈ దృశ్యం చూసేటప్పటికి నగుల్నోవ్‌కి పరిస్థితులన్నీ అర్థం అయాయి. జనాన్ని తోసుకుని కొటాపైపుకి వెళ్ళాడు.

సమిష్టివ్యవసాయక్షేత్ర సభ్యత్వానికి రాజీనామాయిచ్చిన ఇవాన్ బెటల్ష్చికోవ్ కొటా దగ్గర నిలబడి ధాన్యం తూకంవేస్తున్నాడు. అపో లన్ పెస్కోవాట్స్కోవ్ దగ్గరే నిలబడి అతడికి సహాయం చేస్తున్నాడు. ఆ ప్రాంతంలో ఎక్కడా దేవిదోవ్ కాని, రజ్మట్నోవ్ కాని ఆఖరికి బ్రిగేడు దళ సభ్యులు కాని ఎవ్వరూ కనబడలేదు. ఒక గుంపులో యాకోవ్ లూకిచ్ ముఖం కనబడిందికాని వెంటనే ఆ బళ్ళచాటున ఎక్కడో నక్కిమరుగై పోయాడు.

"ఈ ధాన్యం పంచుకోడానికి ఎవరు పర్మిషన్ ఇచ్చేరుమీకు?" అంటూ నగుల్నోవ్ బెటల్ష్చికోవ్‌ని పక్కకి లాగేడు. ప్రజలంతా నిశ్శబ్దంగా అతినిరేసి చూస్తున్నారు. "ఈ ధాన్యం అన్నీ తూకంవేసి పట్టుకుపొమ్మని ఎవరుచెప్పేరుమీకు?" అదే తీవ్రతతో బెటల్ష్చికోవ్‌ని అడిగేడు.

"............ ........"

"దేవిదోవ్ ఎక్కడున్నాడు?"

"ఏమో ఎవరికి తెలుసును: అదేపనా ఏమిటినాకు?"

"అయితే మీకు పర్మిషన్ ఇచ్చినవాడెవడు?"

కొటాదగ్గరే నిలబడ్డ డెమిడ్ చిరునవ్వునవ్వి చెమటతుడుచుకుంటూ "పర్మిషన్ ఒకరు ఇచ్చేదేమిటి: మాఅంతట మేమే తీసుకుంటున్నాము!" అన్నాడు పెడసరంగా.

"మీఅంతటమీరే, అదీ - అల్లాచెప్పు!" రెండు అంగల్లో గాది మెట్ల మీదికి వెళ్ళి నిలబడ్డాడు. గాదిలోనుంచి ధాన్యం తోడుతున్నవాడిని ఒక్కపక్కపోటుతో ఎగరగొట్టి, తలుపుమూసేసేడు. "వెళ్ళిపోండి! ఎవ్వరూకూడా ధాన్యం తీసుకువెళ్ళడానికి వీల్లేదు. ఎవడైనా ఈ ప్రాంతాన్ని నిలబడితే వాణ్ణి సోవియటు ప్రభుత్వం శత్రువుగా ఎంచుతాను."

"అబ్బో!" అన్నాడు వెటకారంగా, బండిలో బస్తాలు సర్దుతూన్న స్మోకీ.

అక్కడ ఉన్న కోసక్కులెవ్వరూ నగుల్నోవ్ అల్లా అంతట్లో వస్తాడని అనుకోలేదు. అతడు ఉదయం బయలుదేరి వెళుతూంటే, ఊరంతా, బేనిక్‌ను కొట్టినందుకు నగుల్నోవ్‌ని విచారణచేస్తారనీ, అతన్ని పదవినుంచి తొలగించడమే కాకుండా ఖైదుకూడా వేస్తారనీ ప్రచారమయింది. నగుల్నోవ్ ప్రయాణం సంగతి తెలియగానే బేనిక్ చంకలుకొట్టుకుంటూ "నగుల్నోవ్ మళ్ళీరాడుఇంక. పెద్దశిక్షపడుతుందని ప్రాసిక్యూటరు నాతో చెప్పేడు. వెళ్ళనీ; ఈ ఈమాటుతో పీడవదిలిపోతుంది. పార్టీలోనుంచి బయటికి గెంటేస్తే అప్పుడు తెలుస్తుంది. రైతుల్ని కొట్టటం అంటే ఏమిటో. పూర్వంకిమల్లే ఇప్పుడెక్కడ సాగుతుంది ఈజబర్దస్తీ" అంటూ చాటేడు.

అందుచేత, మకార్ రావడంతోటే అంతా విస్తుపోయేరు. కాని అతను గాదిమెట్లు ఎక్కి తలుపుని జేరబడి నిలబడేటప్పటికి వాళ్లు ఒక నిశ్చయానికి వచ్చేరు. స్మోకీ మాటవెంబడే నాలుగుమూలలనుంచీ నలుగురూ అందుకున్నారు:

"నీ సోవియటు ప్రభుత్వం పని అయిపోయింది?"

"ప్రజాప్రభుత్వం!"

"ఇంకామూస్తూ నిలబడతారేం!"

వస్తాదులా జబ్బలు ఊపుకుంటూ స్మోకీ అందరికంటె ముందు నగుల్నోవ్ వైపు దారితీసేడు. అతని వెనకాలే చాలమంది కోసక్కులు బయలుదేరారు. యాదాలాభాల వెడుతూ వెడుతూ రాయి ఒకటి చేత తీసుకున్నాడు ఓ కోసక్కు.

నగుల్నోవు ట్రౌజరు జేబులోనుంచి పిస్టలు బయటికిలాగి ఎదరికి ఎత్తేడు. స్మోకీ ఆగిపోయి, ముందుకి వెళ్ళడానికి తటపటాయిస్తున్నాడు.

మిగిలినవాళ్ళంతా కూడా ఆగిపోయేరు. నగుల్నోవు పిస్టలు ఎత్తుతే కాల్చ డానికి వెనుదియ్యడన్న విషయం వాళ్ళందరూ ఎరుగుదురు. అందుకు తగ్గట్టుగా మకార్ వాళ్ళని "ఏడుగురిప్రాణాలు బలిపుచ్చుకుంటే కాని మిమ్మల్ని ఈగాది దగ్గిరికి రానియ్యను. తెలిసిందా, ముందెవరు ? రండి !" అన్నాడు.

ప్రాణాలు ఒడ్డడానికి సిద్ధపడ్డవాళ్ళు ఎవరూలేరు అక్కడ. తటపటా యిస్తూ అంతా ఆలాగే నిలబడ్డారు. ముందరికి అడుగు వెయ్యడానికి ధైర్యం లేక స్మోకీ ఆలోచిస్తూ నిలబడ్డాడు. నగుల్నోవు పిస్టలు కిందకిదింపేడు:

"ఎవ్వరూ నిలబడవద్దు ఇక్కడ ! వెంటనే వెళ్ళిపోవాలి. లేకపోతే కాల్చడం ప్రారంభిస్తాను."

ఆ మాట పూర్తి అయిందోలేదో; దయ్‌మని ఇనపచీల ఒకటివచ్చి అతని నెత్తిమీదనుంచి దూసుగుని, వెనకనున్న గాది తలుపుకి తగిలింది. మకార్ తలకి గురిచూచి స్మోకీ స్నేహితుడు యిఫిమ్ట్రుబాచోవు విసిరేడు అది. కాని గురితప్పిపోవడంతో వెంటనే గభాలున కూర్చుని బండివెనక నక్కేడు. ఆ వెనువెంటనే గుంపులోనుంచి రాయికూడా ఒకటి తనవేపుకి రావడం చూసి నగుల్నోవు గాలిలోకి ఒకసారుకాల్చి మెట్లుదిగి గుంపువేపు పరుగెత్తేడు. గుంపు చెదిరిపోయింది. ఒకరినొకరు తోసుకుంటూ, కింద పడిపోయినవాళ్ళని తొక్కుకుంటూ పరుగెత్తేరు.

"పరుగెత్తకండి ! ఇంక ఆరుగుళ్ళే ఉన్నాయి." అంటూ అప్పుడే ఎక్కడనుంచో వచ్చిన బేనిక్ పారిపోతూన్నవాళ్ళకి ధైర్యం చెప్పేడు.

మకార్ మళ్ళీ గాదిదగ్గిరికి వెళ్ళిపోయి గాదులన్నీ దృష్టికి అందు బాటులో ఉండేటందుకు క్రిందే నిలబడ్డాడు.

"ఎవ్వరూ దగ్గిరికి రావద్దు !" అని నెమ్మది నెమ్మదిగా కొటూదగ్గిరకి వస్తూన్న 'స్మోకీ' నీ, వాళ్ళనీ హెచ్చరించేడు. "దగ్గిరకి రావద్దని చెబుతూ న్నాను ! వచ్చేరంటే కాల్చేస్తాను జాగ్రత్త !"

జనం అంతా గాదులకి 50 గజాల దూరంలో చుట్టూ నిలబడ్డారు. ఏదో మాయచేసి మకార్‌ని పట్టుకోవాలని ఇవాన్ బెటల్శికోవ్, అట్మంచుకోవ్, మరిముగ్గురు కోసక్కులు ముందుకు పదిగజాల దూరంలో వచ్చి నిలబడ్డారు.

"కామ్రేడ్ నగుల్నోవ్! పిస్టలు ఎత్తక ఒక్కసారి ఆగి నేను చెప్పేది వినండి." అన్నాడు బెటల్శికోవ్.

"ఇక్కడ నిలబడవద్దంటే ఎందుకు వచ్చావు? అవతలకి పో!"

"ఇదిగో వెళ్ళిపోతున్నాము; అనవసరంగా అంత కోపపడతావెందుకు? మేము యీ ధాన్యం యెవ్వరితోను చెప్పకుండా పట్టుకుపోవడం లేదు........"

"అయితే యెవర్ని అడిగి తీసుకువెడుతున్నారు?"

"ఎవరోకాని రిజియన్.........రిజియనల్ ఎగ్జిక్యూటివ్ కమిటీ నుంచి వచ్చి, పట్టుకుపొమ్మని చెప్పారు."

"ఆ మనిషియేడీ? దేవిడోవ్, రజ్మట్నోవ్, యెవరూ లేరేమి యిక్కడ?"

"వాళ్ళంతా ఆఫీసులో వున్నారు."

"అంతా శుద్ధ అబద్ధం! ముందు యిక్కడనుంచి వెనక్కి వెళ్ళి మరీ మాట్లాడు!

"మామాటలు నమ్మకం లేకపోతే యింకా వెళ్ళి కనుక్కోండి. మీకే తెలుస్తుంది. మీరు వెళ్ళనంటే వాళ్ళని యిక్కడికే తీసుకొస్తాము. లేకపోతే, కామ్రేడ్ నగుల్నోవు మీ బెదరింపులకి జడిసే వాడెవడూ లేడు యీ రోజుల్లో."

"ఆట్టే దగ్గరకురాకు, అడుగు ముందరికి వేసేవంటే మాట దక్కదు. జాగ్రత్త! ఈ కామ్రేడూ గీమ్రేడూ తీసెయ్యి! ప్రభుత్వపు ఆస్తిని దోసుకొనడం ఎప్పుడైతే ప్రారంభించావో అప్పుడే నాకు గర్భ

శత్రువుపన్నమాట. నా కంఠంలో ప్రాణంవున్నంతవరకూ సోవియటు ప్రభుత్వాన్ని యెవరేనా అవమానిస్తూంటే ఊరుకోను."

బెటలశ్చికోవు యింకా యేదో చెప్పబోతూన్నాడు సరిగ్గా ఆ సమయంలో గాదులవెనుకనుంచి దేవికోవు వచ్చేడు. ఒళ్ళంతా కముకుదెబ్బలతో, గాయాలతో, కరుడుకట్టిన రక్తముతో కుంటుకుంటూ నెమ్మదిగా వచ్చిన అతన్ని చూడగానే నగుల్నోవుకి అంతా అర్థం అయి, "ఆరి దొంగవెధవ! నన్ను మోసంచేద్దాం అనుకుంటున్నావా? కొడతావేం మమ్మల్ని ?" అంటూ వాళ్ళమీదికి ఉరికేడు.

బెటలశ్చికోవ్, ఆట్మంచుకోవ్ యెగిరిపోయారు. నగుల్నోవ్ వాళ్ళమీదికి రెండుబార్లు వదిలేడు కాని తగల్లేదు స్మోకీ దదికర్ర ఒకటి ఊడపీకి సిద్ధం అవుతూన్నాడు. మిగిలినవాళ్ళు కూడా యెవరూ పారిపోక నిలబడి గుసగుస లాడుతూన్నారు.

"నేను ఉన్నంతకాలం మీరు సోవియటుప్రభుత్వాన్ని యేమీ చెయ్యలేరు. మిమ్మల్ని అందర్నీ కుక్కల్ని కాల్చినట్లు కాల్చిపారేస్తాను యేమను కున్నారో!" అని కేకేస్తూ మకార్ వాళ్ళవైపు పరుగెత్తాడు.

"చూస్తారేం!"

"ఒక్క ఆయుధం కనక ఉన్నట్లయితేనా!" యాకోవ్ లూకుచ్ చేతులు నలుపుకుంటూ వాపోయాడు.

"ఇంతమంది మొగాళ్లు వున్నారు యెందుకు. ఒక్కణ్ణి పట్టుకోలేక పోయినతరవాత!" మెరీనాపొయార్కోవా. వెనక జరుగుతూన్న కోసక్కులని, మకార్‌ని పట్టుకోమని ముందుకుతోసి, డైమిడ్‌ని జబ్బపట్టుకుని "భయపడ్డావా? యెందుకింక నీ మొగతనం?" అంది.

కోసక్కులందరు చెదరిపోయి నాలుగుమూలలనుంచి కమ్ముకుని వచ్చి మకార్‌మీద పడడానికి సిద్ధపడుతున్నారు. "మిలీషియా! మిలీషియా!" నాస్టియాడొనిట్‌స్కోవా ఒక్కతే వెర్రికేకవేసింది. అతివేగంగా గుర్రాల్ని

పరుగెత్తించుకుంటూ గ్రామంవైపు వస్తూన్న రౌతులు యెదర గుట్టలమీద కనబడ్డారు. గుర్రపుడెక్కల తాకిడికి ధూళి చినచిన్న మేఘాల్లా పైకి లేస్తూ వుంది. అయిదు నిమిషాలయేటప్పటికి గాదులదగ్గిర దేవిడోవ్, మకార్ తప్ప ఒక్క పిట్టకూడలేదు. గుర్రపు డెక్కలధ్వని ప్రస్ఫుటంగా వినబడు తూంది. రౌతులంతా స్పష్టంగా కనబడుతూన్నారు. అందరికంటె ముందుగా పావెల్ లుబిష్కిన్ తుమ్మగసిగ చేతపుచ్చుకుని లాష్లినోవ్ గుర్రంమీద వస్తున్నాడు. అతని పక్కనే విపరీతమైన ఉద్వేగంతో అగాఫన్ డుబ్ట్సోవ్ ఉరకలమీద వస్తూన్నాడు. వాళ్ళవెనక మిగిలినవాళ్ళంతా అనేక రకాల గుర్రాలమీద రెండు, మూడు బ్రిగేడులకూలీలంతా అనుసరించి వస్తున్నారు.

సాయంకాలానికి జిల్లా పట్టణంనుంచి మిలీషియా మనుష్యుడు వచ్చాడు. ఊరిబయట స్టెప్పీలో యెక్కడో తిరుగుతూండగా ఇవాన్ బెట లిశ్చికోవ్‌ని, ఎఫ్సోలన్ పిస్కావట్స్కోవుని, ఇఫిమ్ ట్రుబాఛోవుని. అరెస్టు చేసేడు. ఇగ్నటియోనవ్‌ని ఆమె యింటిలోనే అరెస్టుచేసేడు. వాళ్ళ నందర్నీ సాక్షులతోసహా జిల్లాకి పంపించారు. స్యోకీ స్వయంగా గ్రామ సోవియటు ఆఫీసుకివచ్చి లొంగిపోయాడు.

"ఇదేమిటి - ఈవేళ! ఏదోవుంది" అన్నాడు రజ్మట్నోవు.

స్యోకీ వెర్రినవ్వు నవ్వుతూ రజ్మట్నోవు కళ్ళలోకి చూశాడు.

"అవును. ముసుగులో గుద్దులాట ఎందుకింక - అమీ తుమీ తేల్చేసుకోక ? ఇప్పుడు ఎక్కడికి తీసుకువెడతారు నన్ను ?"

"జిల్లా పట్టణానికి."

"మిలీషియా ఏడీ ?"

"అంత కంగారుపడకు. ఇప్పుడే ఒక నిమిషంలో వస్తాడు. సోవియట్ ఛైర్‌మన్‌ని కొట్టడం ఏమిటో కోర్టులో తేలుతుంది తొందరపడకు."

"సరే దానికేం" అని స్యోకీ ఆవలిస్తూ "రజ్మట్నోవు! కళ్ళమూసుకు వస్తున్నాయి. మిలీషియా వచ్చేదాకా ఏదేనా కొట్టులోపెట్టి తాళంవెయ్యి. హాయిగా పడుకుని నిద్రపోతాను.'' అన్నాడు.

ఆ మరునాడు, ఎవరెవరు ధాన్యం ఎత్తుకుపోయినదీ కనుక్కొని దానికి ఆచోకీ తియ్యసాగేరు. మకార్ నగుళ్ళోని ప్రతి ఇంటికి వెళ్ళి కనుక్కోసాగేరు.

"నువ్వు ధాన్యం ఏమైనా తీసుకువెళ్ళేవా ?"

"తీసుకువెళ్ళేను."

"అవి మళ్లీ ఇస్తావా ?"

"ఆ. ఇస్తాను."

"సరే-తీసుకురా." అని చరచర ఆ ఇల్లు వదిలి మరొక ఇంటికి దారితీసేరు.

సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యత్వాలకి రాజీనామాలు ఇచ్చేసినవాళ్లు వాళ్ళకి రావలసినదానికంటే ఎక్కువ ధాన్యం తీసుకుపోయేరు. మళ్ళీ అవి అన్నీ వసూలుచేసినప్పుడు 20 పూడులు తీసుకుపోయినవాడు, 10, 15 పూడులకంటె ఎక్కువ ఇవ్వలేదు. పైగా ఆడవాళ్లు, పిల్లలు దాచుకుంటూ తీసుకుపోయినవి 100 పూడుల వరకు ఉంటాయి.

సాయంకాలానికి ఏమాత్రమో తప్ప ఇంచుమించుగా అన్నీ వసూలు చేసేసేరు. 20 పూడుల బార్లీ, ఏమాత్రమో జొన్నలూ మాత్రం అందు దొరకలేదు. ఆ సాయంకాలమే రైతులందరికీ ఎవరి విత్తనాలు వాళ్ళకి ఇచ్చేసేరు.

రాత్రి భోజనాలయేక గ్రామస్థులందర్నీ పిలిచి పెద్దసభ ఏర్పాటు చేసేరు. గ్రామం అశేషజనం పోగడ్డారు. దేవిదోవు లేచి ఒక గంటసేపు మాట్లాడేడు.

"సోదరులారా! నిన్న కొంతమంది పెద్దమనుష్యులు ఎలా ప్రవర్తించేరో చూసేరా ? దీనినిబట్టి చూస్తే వాళ్ళు కులకులవైపు మొగ్గుతున్నారన్నమాట! విత్తనాలకోసం అని జాగ్రత్తపెట్టిన ధాన్యం నిన్న ఎవరికి వారు అందినన్ని పట్టుకుపోయీ, బూడిదలో రిమ్మేసీ, నానాగత్తరి చేయడం

చాలా సిగ్గుపడవలసిన విషయం. మీరందరూ, నన్ను చావకొట్టవలసిందని, ఆడాళ్ళని ఉసుకొల్పేరు. ఎంతకొట్టినా నేను ఏడవకపోవడంచూసి ఒకఆమె పాపం ఎంతో వాపోయింది!" దేవిడోవు గోడని జేరబడి నిలుచున్న ఏనిమా డొనిట్‌స్కోవాకేసి చూసేడు. దేవిడోవు తనపేరు ఎత్తేటప్పటికి చిన్న బుచ్చుకుని ముఖం చాటుచేసుకుంది. "ఎవరో కాదు, నువ్వే నన్ను తెగబాది, నేను ఎంతకీ నిన్ను ప్రాధేయపడకపోవడంచూసి, "ఎంతకొట్టినా మొద్దులా మాట్లాడడు!" అన్నావు."

సభలో అందరి దృష్టులు ఆమెమీదికి తిరిగేయి. ఆమెసిగ్గుపడి నిలువునా చచ్చిపోయింది.

"ఏం, అట్లాచూస్తావేం!" దేమ్కా ఉషాకోవుకి అరికాలుమంట నెత్తికి ఎక్కింది.

"నడ్డి గోడనిపెట్టి రాసి వెల్లంతా పాడుచేస్తూంది!" అని అగాఫన్ దుబ్సీవుకూడా తన కోపాన్ని వెల్లడించేడు.

"సిగ్గుపడి వెళ్ళిపోకు! కొట్టే సాహసం ఉన్నదానవు మీటింగులో నిర్భయంగా నిలబడలేవూ!" అన్నాడు లుబిష్కిన్.

దేవిడోవు ఎక్కడా ఆగకుండా చెప్పుకుపోతూనే వున్నాడు.

"నాచేత 'దాసోహం' అనిపించాలని ఆమెఉద్దేశం. కాని బోల్షివిక్కులం, అల్లా లొంగుతామా. వెనక, అంతర్యుద్ధంలో 'జెంకర్లు' ఎన్నో బాధలుపెట్టారు. కాని నాదగ్గరనుంచి ఒక్కమాటకూడ లాగలేకపోయేరు! బోల్షివిక్కులు ఇంతవరకూ ఎవ్వరికీ భయపడి లొంగలేదు. ముందుకూడ అటువంటి పనిచెయ్యరు!"

"నిజం! నిజం!" అన్నాడు మకార్‌నగుల్నోవు.

"శ్రామికవర్గ శత్రువుల్ని లొంగతియ్యడమే మాపని. దాల్లో మేము నెగ్గితీరుతాం!"

"ఒక్క మనదేశంలోనేకాదు. ప్రపంచంలో అంతటా కూడాను." అని మకార్ మళ్ళీ అడ్డంవచ్చాడు.

"నిన్న మీరు మన శత్రువులతోచేరి వాళ్ళకి మద్దత్తు ఇచ్చేరు. గాదుల్లో ధాన్యం దోచుకొని, నన్ను పట్టుకుబాది, రజ్మటోన్నివుని నానా అవస్థల పాలుజేసిన మిమ్మల్నేమనాలి ? రజ్మటోన్నివుని పట్టుకులాక్కుపోతూంటే మైకేల్ ఇగ్నటియోనవు 'అడుగో నాస్తికుణ్ణి లాక్కుపోతున్నారు. పిశాచపు పీనుగ !' అంది. ఆ ఆడాళ్ళు అంతా కలసి క్రాసు ఒకటి అతనిమెళ్ళో కట్టబోయేరు. కాని రజ్మటోన్నివు దానికంగీకరించక వాళ్ళని తన్నీ, గుద్ది, ఎదిరించి, ఆ తాడు తెంపేసేవాకా వాళ్లు అతన్ని వదలిపెట్టలేదు. ఈపని చెయ్యడంలో మీ ఉద్దేశం ఏమిటి ? అది ముమ్మాటికి తిరుగుబాటే ! కోర్టు విచారణచేసి మైకేల్ ఇగ్నటియోనవు తల్లివంటివాళ్ళందరికి తగినశిక్ష విధిస్తుంది."

"మా అమ్మ చేసినదానికి నేనేం చేస్తాను ! ఎన్నిచెప్పినా ఆవిడ నా మాట వినదు. అందుకు ప్రతిఫలం అనుభవించనియ్యండి." అన్నాడు ముందరవరసల్లో కూర్చున్న మైకేల్ ఇగ్నటియోనవ్.

"కామ్రేడ్, చర్చిలు మూసేసినందుకు గోలచేస్తూన్నవాళ్ల నన్నాను కాని, ఇందులో నీ విషయం ఏంలేదు. మనం మతం నాశనంచేస్తూన్నామని వాళ్ల ఉద్దేశం. ఆ ఉక్రోషంకొద్దీ కమ్యూనిస్టుమెళ్లో క్రాసు ఒకటికట్టి వాళ్ల కడుపు దుగ్ధ తీర్చుకున్నారు కాని దానిలోఏముంది ! ఈ అల్లరికంతకీ కారకులైనవాళ్లు అరెస్టు అయ్యేరు. కాని వాళ్ల ననుసరించినవాళ్లందరూ మాత్రం ఇకపైన అయినా బాగా ఆలోచించుకొని ప్రవర్తించడం మంచిది. ఎవరో ఇక్కడ 'నిన్న ధాన్యం తీసుకుపోయినవాళ్ల నందర్నీ అరెస్టుచేసి, ప్రవాసానికి పంపించి, వాళ్ల ఆస్తి ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుందన్న మాట నిజమేనా ?' అని చీటీ వ్రాసిపెట్టేరు! అది అంతా వట్టి పుకారు. అలా ఎప్పటికీ జరగదు. బోల్షివిక్కులు అంత క్రూరులుకారు. ఒక్క శత్రువుల్ని మాత్రమే క్రూరంగా శిక్షిస్తారు. కులకులమాట విని మీరు సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోనుంచి వెళ్ళిపోయి, మమ్మల్ని కొట్టి ధాన్యం

పోచుకుపోయినప్పటికీ మిమ్మల్ని మా శత్రువులుగా భావించము. ఇంకా ఏమిచెయ్యడానికీ తోచక తటపటాయిస్తూ, తప్పటడుగు వేసిన మధ్యరకపు రైతులు మీరంతా. మీకళ్ళు తెరిపిస్తాముకాని శిక్షలు విధించం ఎప్పుడూ.''

హాలంతా గుసగుసలు బయలుదేరాయి.

"మీ రెవ్వరూ భయపడవలసిన అవసరంలేదు. ఇలా తలెత్తి చూడండి. నిన్న నన్ను కొట్టినందుకు ఏమీ అననుకాని, రేపటినుంచి మనం చల్లికలకి పొలాలికి పోయినప్పుడు మీరు కనక సరిగ్గా పనిచెయ్యకపోతే మాత్రం ఊరుకోను.''

అంతా పకపకా నవ్వేరు.

"భూమి అంతా మంచి పదునుమీద ఉంది. ఇటువంటి సమయంలో ఒక్కనిమిషంకూడా వృథా చెయ్యకూడదు చల్లికలు అయేయంటే అంతా తీరుబడే మనకి. ఒక్కముక్క చెబుతావినండి. సోవియట్ ప్రభుత్వానికి అనుకూలురంతా రేపే పొలాలకిపోయి పనులు ప్రారంభించాలి. వ్యతిరేకులు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవచ్చు. కాని రేపు వ్యవసాయపు పనులకి పోనివాళ్ల భూములు సమిష్టి వ్యవసాయక్షేత్రము స్వాధీనపరచుకుని వ్యవసాయ పనులు ప్రారంభిస్తుంది.''

దేవిడోవు వేదిక వెనక్కిదిగి తన స్థానంలో కూర్చున్నాడు.

"దేవిడోవు! నీ హృదయంలోనూ, మాటల్లోనూకూడా అమృతం ఉందోయ్. క్రోధానికీ, ప్రతిక్రియకీ చోటేలేదు నీ మనస్సులో.... ఇక్కడి వాళ్ళంతా సిగ్గుపడి నిలువునా చచ్చిపోయేరు......... ఇంతటి ఉదార స్వభావుడిమీద దౌర్జన్యం తలపెట్టేమని తలలెత్తుకోలేకుండా వున్నారు. ఆవాళ్ళ మనస్సులుకూడా మార్చేసేవు'' అన్నారు యెవరో అత్యుత్సాహంతో.

మర్నాడు ఉదయం 57 మంది సమిష్టి వ్యవసాయదారులు తిరిగి తమని చేర్చుకోవలసిందని దరఖాస్తులు పెట్టుకున్నారు. తెల్లవారుఝామునే సమిష్టి వ్యవసాయక్షేత్ర దళాలు, ఇతర రైతులు అంతా యెవరి పనుల మీద వారు పొలాలకి వెళ్ళేరు.

గాదులదగ్గర ఒకరిని విడిచి ఒకర్ని నిత్యమూ కాపలావుంచాలని సలహాయిచ్చేడు. "ఆ - అవసరంలేదు" అంటూ నవ్వేసేడు దేవిదోవ్.

నాలుగురోజుల్లో సమిష్టి వ్యవసాయ క్షేత్రపు ఓటుమన్ని సగము పైకు చల్లడం అయిపోయింది. ఏప్రియల్ 2 వ తారీఖునుంచి సమిష్టి క్షేత్రపు 3 వ దళము మరొకచోట దున్నడం ప్రారంభించింది. మొత్తం యిన్నిరోజులకి దేవిదోవ్ ఒక్కసారిమాత్రం ఆఫీసుకి వచ్చేడు. పని చెయ్యకలిగినవాళ్ళ నందర్నీ కూడా పొలాలకి పంపేసేడు. బఖలికి బండి తోలే ముసలి షూకర్ని కూడా రెండోదళంలో పంపేసేడు. అతను ఆ సాయంత్రము ఒకదళం దగ్గరనుంచి, మరొకదళం దగ్గరికి వెళ్ళి, వాళ్ళు పనిచేస్తూన్నదీ లేనిదీ అజమాయిషీచేసి యెప్పుడో అర్ధరాత్రివేళకి ఇంటికి చేరుకునేవాడు.



## ముప్పై ఆరో ప్రకరణము.

### ఆదర్శము.

సమిష్టివ్యవసాయక్షేత్ర కార్యాలయం ఆవరణఅంతా గడ్డితో పచ్చగా కన్నుల పండువుగా ఉంది. మధ్యాహ్నపుఎండ తీవ్రంగా కాస్తూన్నా, గాదినీడనున్న గడ్డిమీది మంచుబొట్లు ఇంకా తళతళలాడుతూనే ఉన్నాయి.

మేక ఒకటి కాళ్ళు ఎడంగాపెట్టి నిలబడివుంది. చిన్న మేకపిల్ల మోకాళ్ళమీద వంగి ఆతురతగా పాలుతాగుతూంది.

లూబిష్కిన్ చిన్న గుర్రపు తట్టుమీద దొడ్లోకి వచ్చేడు. గాదివగ్గిర నుంచి వెడుతూ, పైన కప్పుమీద నిలబడిచూస్తూన్న మేకని చేతిలోని కొరడాతో ఒక్కవిసురు విసిరి "అస్తమానం కప్పుఎక్కి తగలేస్తున్నావు- నిన్ను తగలెయ్యా! దిగవేం!" అన్నాడు. అతను ఎక్కిన గుర్రపుతట్టు

మెడలోని చిరుగంట గణగణలాడుతూంది. అతనికాళ్లు ఇంచుమించుగా నేలకు తగులుతున్నాయి.

వరండామీద నిలబడి. లుబిష్కిన్‌ని చూస్తున్న డెమ్కా నవ్వుతూ "లుబిష్కిన్ ! అచ్చంగా నువ్వు గాడిదమీద ఎక్కి జెరూసెలం ప్రవేశించిన క్రైస్తులా ఉన్నావోయ్ ! ఏమీ తేడాలేదు !" అన్నాడు.

ముందు నువ్వొకగాడిదలా ఉన్నావు !" అంటూ లుబిష్కిన్ వరండాదగ్గరకి వచ్చేడు.

"కాళ్ళు నేలకి తగులుతున్నాయి. మోకాళ్ళలోకి తీయించేసుకోలేక పోయేవా !"

లుబిష్కిన్ అతనిమాటలు వినిపించుకోనట్లుగా గుర్రందిగి, కళ్ళెం పక్కనే స్తంభానికికట్టి, "దేవిడోవ్ లోపల ఉన్నాడా ?" అన్నాడు.

"ఆ, నీకోసమే కనిపెట్టుకు కూర్చున్నాడు. మూడురోజులనుంచి నిద్రాహారాలులేకుండా, 'లుబిష్కిన్ ఏడీ అతను లేకపోతే ఈ ప్రపంచమే శూన్యంగా ఉంది !" అని నీకోసం ఒక్కలా పలవరిస్తూన్నాడు."

"వాగుడు అంతకంతకు మితిమీరుతూంది. ఈమాటు నాసంగతి ఎత్తు ! ఎముకలు విరిచేస్తాను జాగ్రత్త !"

చరచర లోపలికి పోతూన్న లుబిష్కిన్ చేతిలోని కొరడాకేసిచూసి డెమ్కా కిక్కురుమనకుండా ఊరుకున్నాడు.

దేవిడోవ్, రజ్మట్నోవ్, మరికొంతమంది ఆడవాళ్ళు కూర్చుని. క్రెచీ ఏర్పాటుచెయ్యడం విషయమై అప్పుడే ఒక నిర్ణయానికి వచ్చేరు. ఆడవాళ్లు బయటికి వెళ్ళిపోయేవరకు లుబిష్కిన్ బయటనే నిలబడి తరువాత లోపలికి వెళ్ళేడు. బెల్టు బిగించకుండా, దుమ్ముతో కొట్లాడుతున్న అతని క్యాలికోషర్టు చెమటవాసన కొడుతూంది.

"నేను......" అని లుబిష్కిన్ ఏదో ప్రారంభించబోతున్నాడు.

"ఏం వచ్చేవు !" అన్నాడు దేవిడోవ్ కనుబొమలుయెత్తి.

"మా బ్రిగేడులో పనిచేసేవాళ్ళు 28 గురు ఉన్నారు. కాని ఒక్కడూ పనిచెయ్యడు. ఒకడు యేటికితీస్తే, మరొకడు కోటికితీస్తాడు.........వాళ్ళ చేత యెలా పనిచేయించాలో నాకు అర్థం అవకుండావుంది. పంద్రెండు నాగళ్లుమాత్రం దున్నుతున్నాయి. వాళ్ళని నిర్బంధించి పనిచేయించవలసి వస్తూంది. అంతమందిలోను కోంద్రాట్ మైడియనోవ్ మాత్రం ఒళ్ళు వొంచి పనిచేస్తాడు. మిగిలినవాళ్ళు అందులోనూ అకిమ్ బెష్లిబ్నోవ్, షేమోకాకుడుస్కోవ్, అటమంచుకోవు మొదలైనవాళ్ళు ఏమీ చెయ్యడం లేదు. నా ప్రాణాలు తీస్తున్నారు. ఒక్క కొండ్రమున్నీ, చుట్టలు కాల్చు కుంటూ చతికిలబడతారు. ఇంక వాళ్ళని కదపడం మన తరంకాదు.

"రోజుకి నువ్వు యెంత దున్నుతూన్నావు ?"

"మైదనికోవు, నేనుమాత్రం రెండు ఎకరాలవరకు దున్ను తున్నాము. కాని మిగిలినవాళ్లు ఒకటింపాతికకంటె దున్నడంలేదు. ఇలాగే పనిసాగుతే మన చల్లికలు యెప్పటికి పూర్తి అవుతాయి ?"

దేవిడోవు మాట్లాడకుండా చేతిలోని పెనిసిలు తిరగేసి బల్లమీద వాయించేడు.

"అయితే యిప్పుడు నువ్వు యెందుకు వచ్చినట్లు ? వీలయినంత పనే చెయ్యండి అని మాచేత అనిపించుకుని వెడదాం అనా ?" దేవిడోవు కళ్లు కోపంతో మెరిసేయి.

"అందుకని రాలేదు" అని సమాధానం యిచ్చేడు. "ఇంకా మను ష్యుల్ని, అరకల్ని యిస్తారని వచ్చేను. ఈ వేళాకోళం చెయ్యడంకేం - అందరికీ తెలుసును."

"ఆ మాట నిజమే నాకూ తెలుసును. కాని పనిచెయ్యడం మాత్రం తెలియదు. మళ్ళీ బ్రిగేడు లీడరు (దళనాయకుడు) వు కూడాను ! సోమరి పోతుల్ని యెలా అదుపులోవుంచాలో తెలియదు. వాళ్ళకి తోచినట్లు వది లేసి క్రమశిక్షణ యేర్పాటుచెయ్యకపోతే యెలా లొంగుతారు ?"

"ఆ క్రమశిక్షణ నువ్వు యేర్పాటుచేద్దువుగాని చూస్తాను. ఈ గొడవంతా ఆటమంచుకోపు లేవతీస్తున్నాడు. చాటుగా అందర్నీ నామీదకు ఉసికొల్పి, సమిష్టి వ్యవసాయక్షేత్రాన్ని వదిలెయ్యమని పురికొల్పుతున్నాడు. పోనీ అతన్ని తరిమేద్దాం అంటే మిగిలినవాళ్ళనికూడా తీసుకుపోతాడు. ఈ విషయాలన్నీ చూడగా, తప్పు నామీదపారెయ్యడం! పట్టి పోమగిపోతుర్ని, తుంటరుల్ని నాకు వప్పచెప్పి, పనిచెయ్యలేదంటే యెలాగ? ముసలి ఘూకర్ యెందుకు? ఆ ముసలివాగుడు పిట్టని అరక దున్నడానికంటె పిట్టల్ని తోలడానికిపెడితే నయం. కాని వాణ్ణి నాకు అంటగట్టేవు. ఎందుకు? అరక దున్నలేడు, బండి తోలలేడు, అతనుతోలుతే ఎడ్లు ఒక్క అడుగుకూడ ముందుకు వెయ్యవు. అరకతో ఒక చుట్టు తిరిగివచ్చేటప్పటికి నాలుగుసార్లయినా పడతాడుక్రింద. బూట్లు సరిగా కట్టుకొనడానికని, ఏ కాలుకిగాని, చేతికిగాని, గాయం తగులుతే చూసుకొనడానికని, ఎంకపెట్టి నిలబడుతూంటాడు. ఆ చుట్టుపట్ల జనం అంతా అతనిచుట్టూ మూగుతారు. అదేనా పని? కాలికి దెబ్బతగిలిందని నిన్న అతనిని వంటపనికి నియమించేము. అందుకూ వుపయోగంలేదు అతను. మాంసం కొంత యిస్తే అది అతను వండుకుతినేసి, అన్నింటిలోనూ ఉప్పు ఎక్కువవేసి పాడుచేసి, పైగా యేదోతీసుకువచ్చి వండేడు. అలాంటివాడితో నేను ఏంచెయ్యను?" లుబిష్కిన్ పెదవులు చలించేయి. "ఈ పదవినాకు అక్కరలేదు. ఇటువంటి వాళ్ళచేత పనిచేయించడం నావల్ల కాదు."

"తీసెయ్యవలసివస్తే మేమే తీసేస్తాములే నిన్ను. ప్రస్తుతం నీ పనిలోకి వెళ్ళు. ఈ సాయంకాలానికి 30 యకరాల దున్నేటట్లుచూడు. వాళ్ళచేత పనిచేయించడం నీకు చేతకాకపోతే కంగారుపడకు. ఇంకో రెండు గంటల్లో నేను వచ్చిచూస్తాను. ఇంకవెళ్ళు!"

లుబిష్కిన్ తలుపు జేరవేసి, వరండామీదికి వెళ్ళేడు. ఒక్క నిమిషం నిలబడి, గుర్రం యెక్కేడు.

"కామ్రేడ్ లుబిష్కిన్, యేమాత్రం దున్నేరు?"

"ఎంతో కొంత దున్నేము-నీకెందుకు?"

"అవునులే, నాకు అవసరంలేదు........ఇలా చూడు, నీకు ఒక్క పర్యాయం గట్టిగా బుద్ధి చెబుతేకాని లాభంలేదు."

లుబిష్కిన్ గుర్రంమీద కూర్చునే వెనకతిరిగి, పిడికిలి బిగించి బెదిరించేడు.

"దగ్గరకిరా, ఆ బుద్ధి నీకే చెబుతాను. మహబాగనుగా వుంచి నీపని."

డెమ్కా తుఘుక్కని వుమ్మేసేడు.

"ఒకడాక్టర్ని తీసుకువస్తాను, కొంచెం చికిత్సచేయించు మీవాళ్ళకి త్వరగా దున్నేటందుకు" అన్నాడు.

లుబిష్కిన్ మాట్లాడకుండా గుర్రాన్ని దౌడుతీయించి వెళ్ళిపోయాడు. ఇంతలో దేవిడోవ్ వరండా మీదికి వచ్చి డెమ్కాతో తొందరగా,

"నేను రెండవదళంతోకూడా వుంటాను కొద్దిరోజులు. నువ్వు చూస్తూండు యిక్కడి పనులు. క్రెచీ నిర్మాణం యెలాజరుగుతూందో చూస్తూండు. మూడవదళానికి 'ఒట్లు' ఏమీ యివ్వకు, తెలిసిందా? అవసరం అయితే వెంటనే నాకు కబురుచెయ్యి. గుర్రాన్ని ఒకదాన్ని సిద్ధంచేసి రజ్మట్నోవ్‌కి కబురుచెయ్యి. నా బసలో వుంటాను."

"మా దళంకూడా లుబిష్కిన్‌దళంకి సహాయంగావెళ్ళి పని త్వరగా ముగించుకువస్తే వీలుగావుంటుందనుకుంటాను." అన్నాడు డెమ్కా.

"వాళ్ళకి సహాయంగా యెవ్వరూ వెళ్ళొద్దు. వాళ్ళు పూర్తిచేసుకోవలసిందే. ఇప్పుడు నేను వెళ్ళి తొందరపెట్టి ప్లానుప్రకారం పనిపూర్తి అయేటట్లు చూస్తాను."

'డ్రోజ్కీ' (బండి) తోలుకుని రజ్మట్నోవ్ దేవిడోవ్‌ని యెక్కించుకు వెళ్ళడానికి అతని బసదగ్గరకి వచ్చేడు. అప్పటికప్పుడే దేవిడోవ్ చంకలో ఏదో కట్టపెట్టుకుని గుమ్మంలో నిలబడి వున్నాడు.

"ఎక్కడ, చంకలోది ఏమిటి!"

"గుడ్డలు"

"ఎందుకు ?"

"ఎందుకేమిటి ? ఒకజత బట్టలు తెస్తున్నాను"

"ఇప్పుడు తిరిగివచ్చేదానికి అవియెందుకు ?"

"బండిపోనియ్యి: ఇంకా చూస్తావెందుకు ? దున్నడం పూర్తి అయే వరకు దళాలతోకూడా వుంటాను. ఒక్కజత గుడ్డలయినా లేకపోతే యెల్లాగ ?"

"మతి చలించలేదుగదా, నీకు ? దుక్కిపూర్తిఅయేవరకు అక్కడ యేంచేస్తావు ?"

"నేనుకూడా దున్నుతాను"

"ఆఫీసుపని అంతా వదిలేసి దున్నడానికి వెడతావా ? చాలాబాగుంది"

"త్వరగా పోనియ్యి"

"అంత హడావిడి యెందుకు ?" రజ్మటోన్నోవ్‌కి అంతా అగమ్యగోచరంగా వుంది. "నువ్వులేకపోతే అక్కడ పని అడ్డుతుందా ? వాళ్ళచేత పని చేయిస్తూ, సలహాయిస్తూ నడిపించాలికాని, నాగలిపడితే యేమవుతుంది ? సమిష్టి వ్యవసాయక్షేత్రపు ఛైర్‌మన్‌వుకూడాను నువ్వు............"

"వేగంగా పోనియ్యి. నాకు నీ సలహా అవుసరంలేదు. మొదట కమ్యూనిస్టునీ, తరువాత ఛైర్‌మనునీను నేను. దుక్కిసరిగా జరగడంలేదు. చూస్తూ ఆఫీసులో కూర్చోనా నేను ?"

"సరే, నీకు తోచినట్లుచెయ్యి! నాకెందుకు ? ఏం - కదలవేం : కునికిపాట్లు పడుతూన్నావా ?" రజ్మటోన్నోవ్ గుర్రాన్ని రెండుకొట్టాడు. గుర్రం అకాత్తుగా వేగం హెచ్చించడంతో దేవిడోవ్ వెనక్కి తూలేడు. మోచెయ్యి కమ్మికి తగిలి 'అబ్బా' అన్నాడు.

వూరుదాటివెళ్ళాక రజ్మటోన్నోవ్ బండి వేగం తగ్గించేడు.

"డేవిడోవ్, చదవెయ్యగా వున్న మతికూడా పోయినట్లుందే నీ వ్యవహారం ?" అని మళ్ళీ ప్రారంభించేడు. "వాళ్ళను కొంచెం అదమాయించి, పనిసాగేటట్లుచూచి లేచిరా, దున్నడం పెద్ద గగనంకాదు. సేనానాయకుడు యెప్పుడూ యెదర వుండకూడదు. వెనకనుంచి తెలివితేటలు వుపయోగించి నడిపిస్తూండాలి; అదీ నా సలహా."

"నీకొక్క నమస్కారం, అంతటితో కట్టిపెట్టు. ఎలా పని చెయ్యాలో చేసి చూపించాలి వాళ్ళకి. అదీ నడిపించడం అంటే. మొదటి దళం, మూడోదళం వాటి వాటి పనులు పూర్తిచేసేసేయి. రెండోదళం వెనకపడిపోయింది. ఉబిష్కిన్‌కి చేతకాకపోయింది. అటువంటి పరిస్థితుల్లో మనం దగ్గరవుండి వాళ్ళచేత పనిచేయించాలి; అంతేకాని ఆఫీసులో కూర్చొని అర్డర్లు జారీచేస్తే లాభంలేదు. అందుచేతనే నేను వెడుతూన్నది కూడాను."

"మొదటిదళం పని పూర్తి అయిందికనక రెండునాగళ్లు పంపు, సకాలంలో పని పూర్తి అయేటట్లు."

"మనుష్యులు మరీ ?"

గుట్టలవరకూ యెవరూ మాట్లాడలేదు. ఆకాశంమీద మేఘాలు అక్కడక్కడ చేరుతున్నాయి. క్రమంగా సూర్యుడు మేఘాలచాటున మరుగుపడ్డాడు.

స్టెప్పీలో ఒక గడ్డిపరకకూడా లేక అంతా నల్లగావుంది. వర్షం కావాలి, యిప్పుడు. అతాత్తుగా గాలిదుమారం ప్రారంభమయింది. క్రమంగా చినుకులు పడసాగేయి. వర్షపుచినుకులకు రోడ్డుమీది దుమ్ము తడిసి బండి చక్రాలకు అంటుకుంటూంది. మేఘాల క్రిందుగా గాలివాలున రెక్కలుజాపి కాకి యెగురుతూంది. తటుక్కున మెరిసిన మెరుపుకు ఆ కాకి అరుస్తూ, నిటారుగా భూమివైపు తిరిగింది. నేల వందగజాలు వుందనగా మళ్ళీ యెవరకి తిరిగి రెక్కలు ఆడిస్తూ వెళ్ళిపోయింది. అప్పుడే పెద్ద వురుము ఒకటి వురిమింది.

దూరంగా రెండవదళం మకాం పాకలు కనిపిస్తున్నాయి. ఇంతలో యెదర సొలోపులో వాళ్ళవైపు ఒకవ్యక్తి కంగారుగా వస్తూండడం కనిపించింది దజ్మట్నోవుకి. ఆతను దోవవదలి అడ్డంగా పరుగెడుతున్నాడు. ఆంద్రీ గుర్రాన్ని అతనివైపు తిప్పేడు. కొంతదూరాన వుండగానే అతనిని ఛూకర్‌గా గుర్తించేడు. ఛూకర్ కూడ బండివైపు వచ్చేసు. అతని వాలకం చూస్తే యేదో సంఘటన జరిగినట్లు తోస్తుంది. ఒళ్ళానికి అతనిజుట్టు తలకి అంటుకుపోయింది. ముఖంలో భయోద్వేగాలు కనిపిస్తూండడంచూసి, రెండోదళంలో యేదో గలభా జరిగివుంటుందనుకున్నాడు దేవిదోవు.

"ఏమిటి సంగతి ?"

"ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకు పరుగెత్తవలసివచ్చింది." ఛూకర్ ఒగర్చేడు. "చంపెయ్యడానికి సిద్ధపడ్డారు………"

"ఎవరు ?"

"లుబిష్కిన్ - వాళ్ళూ"

"ఎందుకు ?"

"ఏమో యెందుకో! భోజనంచేస్తూ పులుసునుగురించి కేకలు ప్రారంభించేరు. కోపం ఆగక నేను యెదురుకున్నాను. లుబిష్కిన్ పెద్ద కత్తి తీసుకొని మీదపడ్డాడు. నిజంగా వాళ్ళకు దొరకకుండా పారిపోయి వచ్చేసేనుకాని, లేకపోతే ముక్కలక్రింద నరికేసివుందురు."

"సరే. వూళ్ళోకివెళ్లు; తరువాత చూద్దాం" అని దేవిదోవు ఒక్క నిట్టూర్పు విడిచాడు.

కాని, అరగంట క్రితం నిజంగా జరిగినది యిది. అంతక్రితం రోజు సాయంకాలం ఛూకర్ వంట పాడుచేసేడు. ఇకనుంచి బాగావండి 'రెడ్‌మార్కు' తెచ్చుకోవాలనుకున్నాడు. రాత్రి వూళ్ళోకి వచ్చేసేడు. వుదయాన్నే యింటిదగ్గరనుంచి సంచి తీసుకుని బయలుదేరేడు. దోవలో క్రాస్నోకుటోవు దొడ్లోకిదూరి గడ్డి మేటివార యెవరికీ కనబడకుండా

దాగేడు. అతను వేసినప్లాను యిది? గింజలు యేరుకుతినేటందుకు యే కోడి అయినా అటువస్తుందనీ, వెంటనే దానిని పట్టుకొని, పీకినొక్కి, సంచిలో దాచేసి, తీసుకుపోయి పులుసు వండిపెట్టి, రెండవసారి ఆశ్చర్యం మెప్పుపొందాలని, గాలికూడా గట్టిగా వదలకుండా అతను అలాగే కూర్చున్నాడు చాలసేపు. కాని ఒక్క కోడిపిల్లకూడా అతనికి అందుబాటులోకి రాక దూరదూరంగా తిరుగుతున్నాయి. ఇంకలాభంలేదని ఘూకర్ "ట్వీట్ ట్వీట్! ట్వీట్!" అని పిలువసాగేడు. ఆ ప్రాంతంలోనేవున్న క్రాస్నోకుటోవ్ అది విని చూడడానికి వస్తున్నాడు. కోళ్ళుకూడా ఘూకర్ వున్నచోటికి వచ్చేయి. ఎవరిదో ఒకచేయి ఒక కోడిపెట్ట కాళ్లుపట్టుకుని లాగెయ్యడం కనుపించింది క్రాస్నోకుటోవ్‌కి. రెప్పపాటుకాలంలో ఘూకర్ దాని పీక నొక్కేసి సంచిలో పెట్టేసేడు. "ఏంచేస్తున్నావిక్కడ?" అని అడిగేడు క్రాస్నోకుటోవ్. అతనిని చూడగానే ఘూకర్ కంగారుపడి చేతిలోసంచి వదిలేసేడు. నెత్తిమీది టోపీతీసి "అఫనాసీ పెట్రోవిచ్, ఆరోగ్యంగా వున్నావా!" అన్నాడు అసందర్భంగా. "ఆ, నీ దయవల్ల. కోళ్ళనిచూస్తున్నావా?" అన్నాడు క్రాస్నోకుటోవ్. "ఆఁ, అవును. దోవను పోతూంటే ఆ కోడి కనబడింది. ఎన్నిరంగుల ఈకలు వున్నాయోదానికి! పరిశీలనగా దగ్గిరనుంచి చూద్దాం అని వచ్చేను. పట్టుకుని చూడాలనుకుంటున్నాను. అంత అందమైనదానిని యెప్పుడూ చూడలేదు నేను."

క్రాస్నోకుటోవ్ దగ్గర ఘూకర్ తెలివితేటలు పనికివచ్చేయికావు. "ఈ మాయలు నాదగ్గరా! చూడడానికివస్తే పట్టుకుని సంచిలో పెట్టడం యెందుకు? ఎవరికోసం యెత్తుకుపోతున్నావో చెప్పు వాటిని." ఇంక గత్యంతరంలేక అంతా చెప్పేసేడు ఘూకర్. "సరే తీసుకెళ్లు; అందులో తప్పేముంది? ఆ ఒక్కటీ చాలకపోతే యింకొకటికూడా తీసుకుపో. దీన్ని తీసుకువెళ్ళకు, గుడ్లు పెడుతూంది; అదిగో దాన్ని తీసుకుపో. ఎవరికీ కనబడకుండా త్వరగా వెళ్ళిపో. చూస్తే చిక్కొస్తుంది."

ఈ మాటలు వినేటప్పటికి పట్టరాని ఆనందం కలిగింది అతనికి. ఇంకోబాన్నికూడా పట్టుకుని తీసుకుపోయేడు. ఇంకో రెండు గంటలలో రెండవపళం మకాముకి చేరేడు. లుబిష్కిన్ వూళ్ళోనుంచి వచ్చేటప్పటికి పులుసు ఉడుకుతూంది. కళపెళలాడుతున్న పులుసులో మాంసపుముక్కలు పైకి కిందికి తిరుగుతున్నాయి. ఘూకర్ ప్లాను చక్కగా నెరవేరింది; కాని ఆతను ఒక్కడానికి భయపడుతున్నాడు. మంచినీళ్ళకి దూరం వెళ్ళలేక దగ్గరలోవున్న గుంటలో నీళ్ళతో వండుతున్నాడు పులుసు. పసరుపట్టి వున్న నీళ్ళవల్ల పులుసుకూడా వాసన వేస్తుందనుకున్నాడు. భోజనం చేసే టప్పుడు పులుసు బాగులేదని యెవ్వరూ అనలేదు సరికదా చాలా బాగుం దని కళాయిలో పులుసు అంతా అవగొట్టేసేరు దళనాయకుడు లుబిష్కిన్ "నా జీవితంలో యెప్పుడూ యిలాటిపులుసు తినలేదు. అందరితరుఫున నేను ఘూకర్‌ని అభినందిస్తున్నాను" అన్నాడు.

పులుసు అంతా అయిపోవచ్చింది. ఇంకా తృప్తితీరక కొంతమంది అడుగునవున్న ముక్కలకోసం గరిటెతో వెతుకుతున్నారు. ఆ వెతక డంలో లుబిష్కిన్‌కి ఒకముక్క దొరికింది. దానిని అతను తినబోతూ నోటివరకూ వెళ్ళేక అతాత్తుగా ఆగి ఆ ముక్కకేసి తేరి పారచూసేడు.

"ఘూకర్, ఏమిటిది ?" బాగా వుడికిన తెల్లటి మాంసపుముక్కను చూపిస్తూ లుబిష్కిన్ కోపంతో అన్నాడు

"బహుశా. రెక్క అయివుంటుంది." అన్నాడు ఘూకర్ ప్రశాం తంగా. లుబిష్కిన్ ముఖం కోపంచేత క్రమంగా జేవురించింది.

"రెక్కా యిది! ఏదీ చూడు."

"ఏమిటో గోళ్ళలావున్నాయి–బాబోయ్!" ఒక ఆమె చూసి అంది.

"నోటికివచ్చినట్లల్లా అసహ్యంగా మాట్లాడకు రెక్కకి గోళ్ళు యెల్లావుంటాయి ?" అంటూ చేతిలో స్పూను క్రిందపడేసి చూసేడు. ఒణుకుతూన్న లుబిష్కిన్ చేతిలో చిన్నచిన్న వేళ్ళలావున్న మాంసపు ముక్క ఒకటి వుంది.

"కప్ప అయివుంటుంది." అన్నాడు అకిమ్‌బెష్కి బ్కోవ్. ఆమాట వినేటప్పటికి ఒకామెకి అసహ్యంచేత వాంతి రాబోయేటప్పటికి నోటికి చెయ్యి అడ్డంపెట్టుగుని బయటికివెళ్ళిపోయింది. మైకనికోవు తెల్లబోయి చూస్తూన్న ఛూకర్ కేసి చూస్తూ కడుపు చెక్కలయిూలా నవ్వసాగేడు. "ఓహో! ఎల్లాంటి వంటవాడు దొరికేడండీ. మనకి. మన అదృష్టం" అన్నాడు. "నవ్వుతావెందుకు? ఛూకర్‌కి గట్టిగా బుద్ధిచెప్పాలి ఒకసారి!" అన్నాడు అకిమ్‌బెష్కి బ్కోవ్.

"పులుసు కళాయిలోకి కప్ప యెల్లావచ్చింది?" లుబిష్కిన్ ఆశ్చర్యంగా అన్నాడు.

"ఈ పక్కనేవున్న గుంటలో నీళ్ళు తెచ్చివుంటాడు. దాల్లో ఏవి వుందోకూడా చూడలేదు.

"ఛీ! ఎన్ని యేళ్ళువచ్చేయి నీకు! కప్పలు పులుసువండి పెడతావా!" అంది అనిష్కా. "ఇప్పుడు నేను కడుపుతోవున్నాను. నువ్వు చేసిన ఈ పనికి ఏమైనా తేడావస్తే........" అంటూ ప్లేటులో మిగిలిన పదార్థం ఛూకర్ ముఖాన వేసికొట్టింది.

వెంటనే పెద్దగోల బయలుదేరింది. ఆడవాళ్ళంతా కొట్టేటట్లు ఛూకర్ మీదికి వచ్చేరు.

"ఆగండి! అది కప్పకాదు. క్రైస్తుసాక్షిగా అది కప్పకాదు."

"అయితే అదేమిటి?" అని అడిగింది అనిష్కా.

"ఏమీ కాదు. వూరికే అల్లా కనిపిస్తూంది అంతే మీకు." అని తప్పించుకో చూసేడు. కప్ప కాకపోతే తినమని లుబిష్కిన్ యిస్తే అంగీకరించలేదు. బహూశా ఆ విషయం అంతటితో ఆఖరయే వుండును. ఛూకర్ మాట్లాడక వూరుకుంటే.

"అది ఓస్టెర్ కాని కప్పకాదు. ఒక్కరుకూడా తెలుసుకోలేకపోయేరు."

"ఏమిటి ?" అంది ఒకామె

"ఓస్టెర్, నిజంగా చెబుతూన్నాను. కప్ప తినకూడదుకాని, ఓస్టెర్ చాలామంచివి. మా బంధువు ఒకడు జనరల్ ఫిలిమోనోవ్ దగ్గర ఆర్డర్లీగా వుండేవాడు. అతడు చెప్పేడు. వందలకొలది తినేసేవాడట ఫిలిమోనోవు. బతికివున్న వాటినికూడా మింగేసేవాడట. మీ అదృష్టంచేత దొరికిందికాని, జమీందార్లు, ధనవంతులు తినేది మీకు దొరుకుతుందా ! ఎంత తంటాలుపడ్డానో దానికోసం."

ఈ వాగుడుచూసి లుబిష్కిన్ కోపం పట్టలేకపోయేడు. దగ్గరనే వున్న పులుసుగరిటెతీసి లేచేడు.

"ఏమిటి ! కప్పలువండిపెట్టి పైగా పేలుతున్నావు ? అక్కడ నిలబడి." అన్నాడు.

ఘూకర్ లుబిష్కిన్ చేతిలోవున్నది కత్తి అనుకున్నాడు. అక్కడ నిలబడితే ప్రాణాలుదక్కవని భయపడి వెనకతిరిగికూడ చూడకుండా పరుగెత్తేడు.

దేవిదోవు ఘూకర్‌ని పంపేసి, తొందరగా పోనిమ్మని రజ్మట్నోవుకి చెప్పేడు. రెండవదళం మకాందగ్గరకు వచ్చేటప్పటికి అక్కడ యెవ్వరూ లేరు. వర్షం విడవకుండా కురుస్తూనేవుంది. గ్రిమాచీనుంచి దూరానవున్న కొండలవరకు ఆకాశంలో యింద్రధనస్సు వ్యాపించివుంది. రజ్మట్నోవుని అక్కడే దిగవిడిచి దేవిడోవు రెండవదళం పనిచేస్తున్నచోటికి బయలుదేరేడు. అరకలు వదిలేసిన యెడ్లు మేస్తున్నాయి. మకాములోకి వెళ్ళడానికి బద్ధకించి, అకిమ్‌బెస్లిక్లెట్నోవు నెత్తిమీద కోటు కప్పుకొని పడుకున్నాడు. దేవిదోవు అతనిని తట్టి లేపి యెందుచేత దున్నడంలేదని అడిగాడు.

అకిమ్ తప్పదు అన్నట్లుగా లేచి, ఆవలించాడు.

"కామ్రేడ్ దేవిడోవు, వర్షంలో దున్నకూడదు. ఆ విషయం మీరు యెరగరా ? మెడమీద వర్షంపడి కాడి రాపాడుతే పుండు పడుతుంది భుజం

అంతా. దానితో యెద్దు యెందుకూ పనికిరాకుండాపోతుంది.'' దేవిడోవు అనుమానంగా చూస్తుంటే ఆ విషయం ఆపేసి, యిలా సలహాయిచ్చాడు : "అక్కడ వాళ్ళు యిద్దరూ కొట్టుకుంటున్నారు. వెళ్ళి విడతియ్యండి. కోంద్రాట్ అరక వదిలెయ్యమంటాడు. అటమంచుకోవు "దగ్గరకు రాకు. నా యిష్టంవచ్చినట్లు చేస్తాను. చెప్పడానికి నీవెవరు ?'' అంటాడు. అందు కని పేచీపడుతున్నారు ''

దేవిడోవ్ అకిమ్ చూపించినవైపు చూసేడు. చూస్తుంటే ఏదో గందరగోళం జరుగుతున్నట్లే కనబడింది. మైదనికోవ్ చేతిలో యినప పూచవుంది. అటమంచుకోవ్ అతనిని ఒకచేతితో యెడ్లదగ్గరనుంచి వెను కకు గెంటుతూ, రెండవచెయ్యి పిడికిలి బిగించి నడ్డివెనుక పట్టుగున్నాడు. చాలా దూరాన వుండడంచేత వాళ్ళమాటలు వినపడడంలేదు. వేగంగా అటు వైపు పరుగెత్తి ఇంకా దూరంగా వుండగానే కేకేశాడు.

"ఏయ్ ! ఆగండి; ఆగండి !"

"దేవిడోవ్, చూడండి ఏంచేస్తున్నాడో ! వర్షంలోకూడా దున్నుతా నంటున్నాడు. 'ఎడ్ల మెడలు పుళ్ళుపడతాయి వద్దు,' అన్నా వినడంలేదు. పైగా తిడుతున్నాడు." అంటూ కోంద్రాట్ ఇనపపూచ అటమంచుకోవ్ మీదకు యెత్తాడు.

అంతక్రితం వాళ్ళిద్దరూ కొట్టుకున్నట్లున్నారు. మైదనికోవ్ నుదురు మీద దెబ్బ కనుపిస్తూంది. అటమంచుకోవ్ కోటు చిరిగిపోయింది. అతని పెదవికి దెబ్బతగిలి రక్తం కారుతూంది.

"సమిష్టివ్యవసాయక్షేత్రానికి నష్టం కలిగిస్తూంటే నేనుచూస్తూ వూరు కోను." అంటూ మైదనికోవ్ లేచేడు. దేవిడోవు రావడంవల్ల ధైర్యంగా "సమిష్టివ్యవసాయక్షేత్రానివి కాని అతనివికావట ఆ యెడ్లు. అయితే మాత్రం వాటిని చేతులారా పాడుచేస్తావా ? దూరంగావుండి మాట్లాడు." అన్నాడు.

"నువ్వెవరు చెప్పడానికి ? కాడిమీద చెయ్యివేసేవంటే మాట దక్కదు. నేను దున్నవలసినంతభూమి దున్నుతేనే కాని యెడ్లను వద

లను. నాపని చేసుకోనియ్యకుండా అడ్డంవస్తున్నావు జాగ్రత్త." అని కేక లేస్తూ అటమంచుకోవు ఎడమచేతితో గుండెలమీద కాలరుఅంచులవగ్గరగా చేర్చి పట్టుకున్నాడు. "వర్షం కురుస్తూంటే దున్నచ్చా?" అన్నాడు దేవిడోవు కోంద్రాట్ చేతిలో ఇనపపూచ లాగిపారేసి.

"స్వంతం అయితే దున్నుకోము. సమిష్టివ్యవసాయక్షేత్రానిది కనుక దున్నవలసిందే."

"ఎందుచేత?"

"ప్లానుప్రకారం పని పూర్తిచెయ్యవలసి వుండడంచేత. పని పూర్తి కాకపోతే లుబిష్కిన్ రోజస్తమానూ సాదిస్తూనే వుంటాడు."

"నిన్న వర్షంలేకుండా వుందికదా ఎంతనేల దున్నావు?"

"శక్తివంచనలేకుండా చేతనయినంత దున్నాను."

"6 కుంచాల భూమికూడా దున్నలేదు నిన్న" అంటూ మైదనికోవు అన్నాడు. "ఎంతమంచి ఎడ్లో చూడండి. చెయ్యియెత్తినా కొమ్ములు అందవు. ఇల్లాంటి దూడలతో మక్కి యెంత అందంగా దున్నుతున్నాడో చూడండి" అంటూ దేవిడోవు చెయ్యిపట్టుకుని నాగలి చాలుదగ్గరకి తీసుకువెళ్ళేడు.

"ఏడుఅంగుళాల లోతుకు తక్కువకాకుండా దున్నాలనుకున్నాము. చూడండి, ఎంతలోతు దున్నేడో మీరే కొలవండి" దేవిడోవు వంగి నాగలి చాలులోకి చెయ్యి పోనిచ్చాడు. మొత్తం మూడు అంగుళాలకంటే లోతుకి దిగలేదు."

"ఇల్లాగేనా దున్నడం? నేల గోకడంగాని, దున్నడంకాదు ఇది. ఈవేళ వుదయాన్నే బుద్ధిచెబుదాం అనుకున్నాను అసలు. అతను దున్నినంతనేల—ఎక్కడచూడండి అంతకంటె లోతులేదు."

"ఇల్లారా, నువ్వు; నిన్నే!" అని పిల్చేడు దేవిడోవు. అటమంచు కోవు ఎడ్లని వదిలేసి తాపీగా దేవిడోవువైపు వచ్చేడు.

"ఇల్లాగేనా దున్నడం?" అని అడిగేడు దేవిడోవు.

"ఇంక యెల్లామన్నాలి ; పదహారు అంగుళాలలోతు దున్నాలా ?" కోపంతో అటమంచుకోవు కనుబొమలు ముడేసి చూసి, జోడినెత్తిపెడి టోపీతీసి చేతపట్టుకున్నాడు. "ఇంకా లోతుగా కావలసివుంటే మీరు దున్నుకోండి. కబుర్లుచెప్పడమే కాని పనిచెయ్యడం అంటూ చేతనవును కనకనా మీకు !"

"సమిష్టి వ్యవసాయక్షేత్రంలోనుంచి గెంటేస్తాను జాగ్రత్త !"

"ఓ ! తప్పకుండాను : అంతవరకు అవసరంలేకుండా నేనే వెళ్ళిపోతాను. రోజస్తమానం ఇక్కడ చాకిరీచెయ్యవలసిన అవసరంలేదు నాకు ఇంతాచేస్తే యేమైనా వుపయోగంవుంది కనకనా !" అంటూ ఈలవేసుకుంటూ వెళ్ళిపోయేడు.

సాయంకాలానికి రెండవదళ సభ్యులంతా క్యాంపుకి చేరేరు. డేవిడోపు వారినందరినీ సమావేశపరచేడు.

"మిమ్మల్ని ఒక్కప్రశ్న అడుగుతాను. సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యుడనని చెప్పుకునే ఆవ్యక్తి సోవియటు ప్రభుత్వాన్నీ, సమిష్టి వ్యవసాయక్షేత్రాన్నీ కూడా మోసం చేస్తూన్నాడు. అందరూ 7 అంగుళాల లోతు దున్నుతూంటే అతను 3 అంగుళాల లోతు దున్నుతూన్నాడు. వర్షంలోకూడా దున్ని చేతులారా ఎడ్లని పాడుచెయ్యడానికి చూస్తూన్నాడు. అందరూ చేసినపనిలో సగంకూడ చెయ్యడంలేదు. అతనిని యేం చెయ్యవలసినదీ మీ నిర్ణయానికి వదిలేస్తూన్నాను."

"బయటికి గెంటెయ్యండి" అన్నాడు లుబిష్కిన్. ఇంచుమించుగా అందరూ, ముఖ్యంగా ఆడవాళ్ళు ఆ వుద్దేశాన్ని బలపరచేరు.

"మనలో సమిష్టి వ్యవసాయక్షేత్రాన్ని నాశనంచేద్దాం అనే వుద్దేశంతో చేరిన ద్రోహులు కొంతమంది వున్నారు. అందుకు ఉదాహరణగా ఆయన ఒకడు." డేవిడోవు దూరంగా కూర్చునియున్న అటమంచుకోవుని చూపించేడు. "రెండవదళ సభ్యులంతా యిక్కడేవున్నారు. పై విష

యాన్ని ఓటింగుకి పెడుతున్నాను. అటమంచుకోవు సభ్యత్వాన్ని రద్దు చేయాలనేవారు యెవరు ?"

అక్కడవున్న 27 గురులోను 23 రు చేతులుయెత్తేరు. దేవిడోవు చేతులు రెండుసార్లు లెక్కపెట్టి అటమంచుకోవువైపు తిరిగేడు.

"బయటికి వెళ్ళిపో! నీ సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యత్వాన్ని రద్దుచేసేము. అవసరమయితే తిరిగి ఒక సం॥రం పోయినతరువాత ఆలోచిస్తాము. నీ ప్రవర్తనలో మార్పుయేమైనా కనుపిస్తే తిరిగి చేర్చుకుంటాం. కామ్రేడ్సు, మీ అందరికీ ముఖ్యమైన విషయం ఒకటి చెబుతున్నాను వినండి. ఇంచుమించు మీలో అందరూ కూడ సరిగా పనిచెయ్యడం లేదనే చెప్పవచ్చు. మైడనికోవు మినహాగా యెవ్వరూ వారి వారి బాధ్యతలను నిర్వర్తించడంలేదు. రెండవ దళానికి ఇటువంటి చెడుపేరు రావటం చాల విచారకరమైన విషయం. వెంటనే మేలుకొని పరిస్థితులు చక్కబరచుకోక పోతే 'బ్లాక్-లిస్టు'లో యెక్కుతాము. ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రానికి స్టాలిన్ పేరుపెట్టినందుకయినా మనం దానిగౌరవం కాపాడవలసియుంది."

"మనశక్తికి మించినపని అది, ఎడ్లుకూడా దున్నలేవు." అన్నాడు అకిమ్‌బెష్లిక్కోవు.

"శక్తిమించినపనా ? ఎడ్లుకూడా చెయ్యలేవూ ? కాదు. కాదు! మైడనికోవు, అతనియెడ్లు యెల్లా చెయ్యగలుగుతూన్నాయి ? నేను మీదళంలోనే వుంటాను. అటమంచుకోవు ఎడ్లు తీసుకుంటాను. రోజుకి మూడు, మూడున్నర యెకరాలు కూడ దున్నడం సాధ్యం అవుతుందో, లేదో చూపిస్తాను."

"కామ్రేడ్ దేవిడోవు ! అదొక పెద్ద కష్టమైనపనికాదు." అన్నాడు కుఘునోక్కవు గడ్డం గుప్పెటలో పట్టుకుని. "అటమంచుకోవు ఎడ్లతో ఎంత దున్నినా దున్నవచ్చు! వాటిని నాకు యిస్తే రోజుకి $2\frac{1}{2}$ ఎకరాలు దున్నుతాను...."

"నీ యెడ్లతో దున్నలేవా ?"

"ఎన్నటికీ సాధ్యపడదు."

"సరే అల్లా అయినట్లయితే మనం యిద్దరం ఫిరాయింపు చేసుకుందాం. అటమంచుకోవు యెద్దు నువ్వుతీసుకో; నీవి నాకు ఇయ్యి, బాగుందా ?"

"సరే, చూద్దాం." అన్నాడు కుదునోక్కోవు కొంచెం ఆలోచించి.

ఆ రాత్రి దేవిదోవుకి సరిగా నిద్రపట్టలేదు. అతను పడుకున్నది రేకుపాక అవడంచేత గాలికి చప్పుడయి తరుచు నిద్రాభంగం కలుగుతూనే వుంది. చలికూడా హెచ్చుగానేవుంది. పీటికితోడు నల్లులబాధ ఒకటి.

తెల్లవారగట్ల మైదనికోవు లేచేడు. అప్పటికప్పుడే రెండవపళంలో వారినందరినీ లేపేసేడు. పశ్చిమాకాశంలో చుక్కలు మినుకుమినుకుమంటున్నాయి చంద్రవంక తూర్పునుంచి కొంత యెక్కుతూంది. దేవిదోవు ముఖం కడుక్కుంటూంటే కోంద్రాట్ పక్కన నిలబడ్డాడు.

"రోజుకి 2½ ఎకరాలు పైగా దున్నడం అంటే బరువైనపనే. అటువంటిది 3 ఎకరాలవరకూ దున్నుతామన్నారు, దున్నకలమా అని...."

"అంతా మన చేతుల్లోనే వుంది; భయపడతావేం?" అని ధైర్యం చెప్పేడు. కాని తనలో ఆలోచించుకుంటున్నాడు. "పని పూర్తి అయేవరకు చచ్చినాసరే కదలను. రాత్రి దీపం పెట్టుకొని అయినాసరే 3 ఎకరాలు దున్నితీరుతాను. అన్నంతా చెయ్యవలసిందే; లేకపోతే నాకేకాదు, శ్రామికవర్గాని కంతకూ అప్రతిష్ట."

దేవిదోవు ముఖం తుడుచుకుంటూంటే కోంద్రాట్ ఎడ్లను తోలుకు వచ్చి నాగళ్ళకు కట్టేడు. ఇద్దరూ బయలుదేరి వెడుతూంటే కోంద్రాప్ అరక దున్నడంలోని మెలుకువలు దేవిదోవుకి బోధించసాగేడు.

"మొదట భూమిని ముక్కలుముక్కలుగా కొలిచి, విడగొట్టి, యెవరిభాగం వాళ్ళు దున్నుకోవాలనుకున్నాం. కాని, లుబిష్కిన్, కుదునోవు, బెష్చిట్నోవు, అటమంచుకోవులు నాగలివెనుక నాగలిపెట్టి అంతా

కలసి దున్నాలనుకున్నారు. అల్లాగే ప్రారంభంచేసేరు. నేను దానికి అంగీకరించలేదు. మొదటినాగలి ఆగితే మిగిలినవన్నీ కూడా ఆగుతూండాలి. పని చురుకుగా సాగను. అందుచేత 'అందరికంటె యెవరి నా నాగలి వుండనియ్యండి. లేదా ఎవరికివారు వేరే దున్నుకుందాం' అన్నాను నేను. కలసి దున్నితే యెవరు యెంత దున్నినదీ తెలియనుకూడాను. ఆఖరుకు లుబిష్కిన్ వేరువేరుగా దున్నుకొనడానికి అంగీకరించేడు. రెండున్నర యెకరాల ప్రతులుగా భూమి అంతా కొలిచి విడదీసేము. 370 గజాల పొడుగు. 35 గజాల వెడల్పు.''

"అయితే, అడ్డం, నిలువూ రెండూ యెందుకు దున్నరూ?'' అన్నాడు దేవిడోవు దున్నిన భూమికేసి చూసి.

"ఇదివరకు దున్నడం అలవాటువుందా. ఇదే ప్రారంభమా?''

"ఇదే ప్రారంభం. ఎల్లా దున్నాలో చెబితేసరి మీరు. త్వరగా గ్రహించగలనులెండి.''

"నాగలిపన్ని. ఎడ్లనికట్టి నాలుగుమట్లు దున్నిచూపెడతాను. దానిని బట్టి మీరే గ్రహించవచ్చు క్రమంగా.''

కోంద్రాట్ దేవిడోవు నాగలికి ఎడ్లుకట్టి, నాగలి ఏడు అంగుళాల లోతుకు దున్నేటట్లు అమర్చి, నాగలి దున్నడంలోని సులువు బలువులు దేవిడోవుకి చెప్పేడు.

"సరే: ప్రారంభంచేద్దామా?"

"నేను సిద్ధంగానే వున్నాను." అనూట్లా ఎడ్లని తోలుతూ అన్నాడు.

శతాబ్దాలతరబడి బీడుబారియున్న ఆ భూమిని క్రమంగా నాగళ్ళు బ్రద్దలుచేస్తూ పోతున్నాయి. గడ్డి తిరగబడి పోతూంది. సాయంకాలానికి దేవిడోవ్ చాలా అలిసిపోయేడు. నడుము నొప్పకూడా ప్రారంభించింది. ఎంతదున్నేడో కొలిచేడు. ఒకరోజులో $2\frac{1}{2}$ ఎకరాలు దున్నేడు దేవిడోవ్.

"ఎంత దున్నేరు?" అని అడిగేను కురుపునోవ్ చిరునవ్వు నవ్వుతూ, కాళ్లు ఈడ్చుకుంటూవచ్చిన దేవిడోవ్‌నిచూసి.

"చెప్పుకో, చూద్దాం!"

"ఎకరంపైచిల్లర దున్నివుంటావు; అవునా ?"

"బాగా చెప్పుకున్నావు. రెండున్నర యెకరాలు దున్నేను."

కాలికి దెబ్బతగిలినచోట నూనిరాసుకుని కుఝునోవ్కా వు ఎంత దున్నేడో చూసిరావడానికి వెళ్ళేడు. ఒక అరగంటలో తిరిగివచ్చి మాట్లాడకుండా నెగడుకు దూరంగా కూర్చున్నాడు.

"కుఝునోవ్కా! మాట్లాడకుండా కూర్చున్నావేమి ?" అని అడిగేడు దేవిడోవు.

"కాలిగాయం సలుపుతూంది .... కాకపోయినా మాటాడేటందుకేముంది ? రెండున్నర ఎకరాలూ దున్నేరు ...అంత దున్నగలుగుతాడను కోలేదు." అని కోటుసరదుకుని నెగడువద్దరకువచ్చి పడుకున్నాడు.

"నోరు పడిపోయింది. ఇంక అట్టే యెగరడు." అని కోంద్రాట్ నవ్వేడు. విననట్లు కుఝునోవ్కా వు మాట్లాడక వూరుకున్నాడు.

దేవిడోవుకూడా పడుకుని కళ్లుమూసేడు. పగలంతా నడవడంచేత కాళ్లు పీకుతున్నాయి. ఎటు తిరిగి పడుకున్నా వీలు కుదరకపోవడంచేత ఇటునటు దొర్లుతూనేవున్నాడు. ఆ రోజు పనిఅంతా స్మృతిపథానికి వచ్చింది. ఏమీతోచక, కళ్ళుతెరచి కోంద్రాట్ ని కేకేసేడు.

"నిద్రపట్టడంలేదా ?" అని అడిగేడు కోంద్రాట్.

"నిద్రరావడంలేదు. పగలుచేసిన పని జ్ఞాపకంవచ్చి ఆ ఆలోచనలే బుర్రలో తిరుగుతున్నాయి............"

"అందరికీ అల్లాగే వుంటుంది." అన్నాడు కోంద్రాట్. అతని స్వరంలో సంతోషము. సానుభూతి ప్రతిఫలిస్తున్నాయి. "దున్నేటప్పుడు మీరు కాళ్ళకేసి క్రిందికే చూస్తూన్నారు పగలంతా. అందుచేత తల తిరుగుతూన్నట్లుగా వుందిమీకు. రేపటినుండి కిందికి చూడక ప్రక్కలకి, యెవరికి చూస్తూండండి."

ఆ రాత్రి డేవిడోవుకి గాఢంగా నిద్రబట్టింది. నల్లులు కుట్టడంగాని, దగ్గరగుట్టలమీద అడవికోళ్ళగల అర్పులుగాని, గుర్రాల సకిలింతలుగాని యెరగడు. తిరిగి తెల్లవారుఝామున మెలకువవచ్చింది. కోంద్రాట్ కోటు తొడుగుకొని ఎక్కడినుంచో వస్తూండడం చూసేడు.

నిద్రబద్ధకంతో తలయెత్తి "ఎక్కడనుంచి వస్తున్నావు?" అని అడిగేడు.

"మన యిద్దరి యెడ్లని చూసివద్దాం అని వెళ్ళేను. బాగా మేస్తూ న్నాయి. ఆ గుట్టలమధ్య బాగా గడ్డివుంటే అక్కడ వదిలేసేను." అంటూ కోంద్రాట్ మళ్ళీ యెక్కడికో వెళ్ళేడు. డేవిడోవు మళ్ళీ పడుకుని నిద్రపోయేడు.

ఆ రోజు సాయంకాలానికి డేవిడోవు రెండున్నర యెకరములపైగా దున్నేడు. లుబిష్కిన్ సరిగా రెండున్నర యెకరాలు దున్నేడు. కుధ్యున్కోవు రెండున్నర యెకరాలకు కొంచెం తక్కువగా దున్నేడు. అన్నిటి కంటె ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఎప్పుడూ అందరికంటె వెనక పడివుండే అంటిప్‌గ్రాజ్ అందరికంటె హెచ్చుభూమి దున్నేడు. అతనికి టిటాక్ బక్క యెడ్లు వచ్చేయి. వుదయం అకరలు వదిలిపెట్టేక అతడు యెంత దున్నినదీ యెవరికీ చెప్పలేదు. భోజనం అయాక అంటిప్ భార్య ఎడ్లకి గడ్డివేసి మేపుతూంది. గ్రాజ్ తినగా మిలిన రొట్టెముక్కలు కూడా తీసుకువెళ్ళి ఎడ్లకు పెట్టమని భార్యకు యిచ్చేడు. లుబిష్కిన్ అది చూసి నవ్వేడు.

"అంటిప్! చాలా పట్టుదలగా వున్నట్టున్నావే!"

"ఆ–అంతే! పనిచెయ్యడం అంటూవస్తే మా కుటుంబం యెవరికీ తీసిపోదు." నిజంగా, క్రియారూపంగా చూపించేడు కూడాను ఆ విషయం, ఆ సాయంకాలానికి అతను మూడుయెకరాలు దున్నేడు.

కాని, కోంద్రాట్ చీకటిపడ్డాక కాని యెడ్లని తోలుకునిరాలేదు.

"ఎంత. ఈవేళ?" అని అడిగేడు దేవిడోవ్.

"మూడున్నర యెకరాలకి ఒక కొండ్ర రకు్కవగా వుంటుంది. కొంచెం పుగాకువుంటే యిస్తారా.........పుదయాన్నుంచీ చుట్ట కాల్చనే లేదు." అంటూ అతడు దేవిడోవువైపు చూసేడు.

రాత్రిభోజనాలు అయేక దేవిడోవ్ ఆ రోజువరకు జరిగిన పని సమీక్ష చేసేడు.

"కామ్రేడ్స్, సోషలిస్టుపోటీ ప్రారంభమయేక మనము ఊంచపరకు వూహించడానికికూడా సాహసించనంత పని చేస్తున్నాము. పని చాలా సంతృప్తికరంగా సాగుతూంది. మీ రెండవదళం చేస్తున్న పనికి మేనేజిమెంటు తరఫున అభినందిస్తున్నాను. కామ్రేడ్స్! మనం వెనకపడతామన్న భయంలేదు యిప్పుడు. అందరికంటే బాగా ఆదర్శప్రాయంగా పని చేస్తూన్న Shock-worker కామ్రేడ్ మైదనికోవుకి ప్రత్యేకఅభివందనాలు."

ఆడవాళ్లు పాత్రలు కడుగుతూన్నారు. ఎడ్లని బీళ్ళకి తోలేసి మగవాళ్ళు నడుములువాల్చేరు. అతని భార్య పనులు ముగించుకు వచ్చేటప్పటికి కోండ్రాట్‌కి నిద్రపట్టింది. నెమ్మదిగా లేపి అడిగింది.

"కోండ్రాట్! దేవిడోవ్ మిమ్మల్ని ఏదో.........పొగుడుతూన్నట్లు అర్థమయింది నాకు....Shock-worker అంటే యేమిటి?"

ఆమాట కోండ్రాట్‌కూడా చాలాసార్లు విన్నాడు. దాని అర్థం అతనికే తెలియదు సరిగా. "దేవిడోవుని అడగాలి." అనుకున్నాడు లోలోపల. కాని భార్యతో ఆ మాటకిఅర్థం తెలియదంటే గౌరవభంగం అనుకున్నాడు.

"ఆడవాళ్ళ తెలివితక్కువతనం నీలోకూడా వుందనిపించుకున్నావు మొత్తంమీద! ఆ మాటకే అర్థం తెలియదు! ఏమిటంటే.........సమిష్టి వ్యవసాయక్షేత్రంలో ప్రధానమైన వ్యక్తిని అల్లా అని పిలుస్తారు. తెలిసిందా? మాట్లాడకుండా పోయి పడుకో. నాకు నిద్రవస్తూంది."

## ముప్పైఆరవ ప్రకరణము.

### మార్పులు

మే 15వ తారీఖు నాటికి మొత్తంమీద జిల్లా అంతటా వరిచల్లికలు పూర్తి అయేయి. ఆ తారీఖు నాటికి గ్రిమాచీ 'స్టాలిన్' వ్యవసాయక్షేత్రం చల్లికలు పూర్తి చేసింది. పదవతారీఖున మిగిలియున్న 20 ఎకరాలలో జొన్న. సన్‌ఫ్లోర్ మూడవదళం చల్లేసింది. వెంటనే దేవిదోవ్ చల్లికలను గురించిన రిపోర్టు జిల్లాకమిటీకి పంపించేడు.

గోధుమచేలలో మొలకలు బాగానే వస్తున్నాయి. కాని, రెండవ దళం మే మొదటివారంలో చల్లిన క్యూబాన్ గోధుమ 250 ఎకరాలు వెలి పదును అవడంచేత కొంచెం జబ్బుయిచ్చేటట్లు వుందని దేవిదోవు, లుబి ష్కిన్‌లు భయపడ్డారు. కాని, యాకోవ్‌లూకుచ్ మాత్రం ఇల్లా అన్నాడు.

"ఏం లాభంలేదు. బయలుదేరడం కష్టమే. కాలంకానికాలంలో చల్లితే యెల్లా బయలుదేరుతుంది? ఈజిప్టులో సంవత్సరానికి రెండు పంటలు పండిస్తారుట. అయితేమాత్రం కామ్రేడ్ దేవిదోవ్, ఈజిప్టులో పండినట్లు గ్రిమాచీలో పండుతుందా? మనం చల్లుకునేకాలంలో మనం చల్లుకోవాలి."

"ఏమిటి, అంత నిరుత్సాహంగా మాట్లాడుతావు?" దేవిదోవుకి కోపంవచ్చింది. అవసరంవస్తే మనమూ పండించాలి. ఈ భూమి మనది. మన అవసరానికి కావలసినది ఆ భూమిలోనుంచి మనం పిండుతాము. సందేహంలేదు."

"కుర్రవాడు మాట్లాడినట్లు మాట్లాడుతూన్నారు."

"సరే, చూద్దాం. ఆస్ట్రోవ్‌నోవ్, నీ మాటలు మితవాద దృక్పథాన్ని వెల్లడిస్తున్నాయి. ముందుముందు అది చాల ప్రమాదకరమైన పరిస్థితుల లోకి తీసుకువస్తుంది. జాగ్రత్త."

"నేను ఈ భూమివిషయం మాట్లాడుతున్నానుకాని మితవాద, అతివాద దృక్పథాలు నాకేమీ తెలియవు."

క్యూబాన్ గోధుమ మొలుస్తుందని దేవిదోవు పైకి అంటున్నా లోపల అతనికీ అనుమానం లేకపోలేదు. అందుచేత ప్రతిరోజు గుర్రం మీద బయలుదేరి చేలు చూసివస్తున్నాడు.

భూమి పదును త్వరగా లాగేసింది. ఎండలు బాగా కాస్తున్నాయి. గోధుమ మొలకలు సాఫీగా రావడంలేదు. దేవిదోవ్ గుర్రందిగి, మోకాళ్ళ మీద వంగి గుప్పెడు మట్టితీసి, ఆ గోధుమ మొలకలు పరీక్షగాచూసి జాలి పడతాడు. వర్షం కావాలి. ఒక్కవర్షం కురిసిందంటే చల్లిన గింజలన్నీ ఒక్కటికూడా బీరుపోకుండా మొలిచి బాగా బయలుదేరుతాయి. కాని, వర్షం కురవలేదు. కలుపు బాగా పెరిగిపోయింది.

ఒకరోజు సాయంకాలం వూళ్ళో ముసలివాళ్ళంతా దేవిదోవుదగ్గిరకి వచ్చేరు మాట్లాడడానికి.

"మేమంతా ఒక్కవిషయమై మిమ్మల్ని కోరడానికి వచ్చేము." అన్నాడు ముసలి అకిమ్ : ఆ గదిలో శిలువ యెక్కడేనావుంటే దానికి మోకరించాలని నలుమూలలా చూస్తూ.

"ఏమి మాట్లాడాలని ? ఇక్కడ శిలువలేదు. తాతా. చూసి లాభం లేదు."

"సరే ;.........వూళ్ళో పెద్దవాళ్ళ దగ్గరనుంచి........"

"అసలు విషయం ఏమిటో త్వరగా చెమల్పండి."

"రెండవదళం పనిచేస్తూన్న చేలు మొలవడంకూడాలేదు. అంతవరకూ నిజం."

"అయితే ;"

"ఇప్పుడు వర్షం కురవాలి."

"అవును కావాలి."

"వర్షంకోసం ప్రార్థించడానికి, ఒక మతగురువును తీసుకురావడానికి (మనసహస్ర ఘటాభిషేకంమాదిరి) అనుమతించండి."

"అల్లా అయితే వర్షం కురుస్తుందా ?"

"భగవంతుడికి అనుగ్రహంకలుగుతే తప్పకుండా వర్షంకురిపిస్తాడు."

"సరే. ఆ విషయం అంతటితో చాలించి దయచెయ్యండి. ఇంక ఆ విషయమై నా దగ్గిర ఒక్కమాటకూడ మాట్లాడవద్దు."

"ఏమి ? ఈ చేలు మావికావా ?"

"సమిష్టి వ్యవసాయక్షేత్రానివి."

"కామ్రేడ్, ఆ విషయం మాకు తెలుసు. భగవంతుణ్ణి నమ్మరుమీరు. కాని, మాకు నమ్మకంవుంది కనక మమ్మల్ని ప్రార్థించుకోనిస్తేనేమి ?"

"నేను అంగీకరించను. సమిష్టి వ్యవసాయక్షేత్రసభ్యులు మిమ్మల్ని పంపించేరా ?"

"లేదు. మా అంతట మేమే వచ్చేము"

"అయితే వినండి, చెబుతాను. మనం శాస్త్రీయపద్ధతుల్లో వ్యవసాయం చెయ్యాలి. కాని మతగురువుల సహాయంతో కాదు."

దేవిడోవు వాళ్ళకి నచ్చచెప్పడానికి చాలాసేపు ప్రయత్నించేడు. వాళ్లు మాట్లాడలేదు. ఇంక వెళ్ళిపోయేముందు నగుల్నోవు వచ్చేడు. వర్షం కురవడానికి మతగురువులచేత ప్రార్థన చేయించడానికి కొంతమంది దేవిడోవు దగ్గరికి వెళ్ళేరని విని నగుల్నోవు పరుగెత్తుకుని వచ్చేడు. ఏమి జరుగుతుందో చూద్దాం అని.

"అలా అయితే వీలులేదంటారా ?" అన్నాడు ముసలి ఆకిమ్.

"అ-నిస్సందేహంగా. కురుస్తే వర్షం దానంతటదే కురుస్తుంది ; ప్రార్థన అవుసరంలేదు."

వాళ్ళు బయటికి వెళ్ళిపోయేరు. నగుల్నోవు వారివెనుక వెళ్లేడు.

"ఏయ్, ఇల్లా వినండి. మీరు యెందుకు వచ్చేరో తెలిసింది. ఎన్నిచెప్పినా మీ పద్ధతులు మీరు వొదలడంలేదు. వూరుకుంటే మీరు యేం

చేసినా చెయ్యగలరు. ఆ మతగురువుని తీసుకువొస్తారేమో జాగ్రత్త — వాడి రోజులు బాగుంటే రాడు."

అని అతను దేవిడోవ్ దగ్గరికి వెళ్ళి, ప్రక్కనవున్న కర్రపెట్టెమీద చతికిలపడ్డాడు.

"వాళ్ళతో ఏమిటి మాట్లాడుతూన్నావు?" అని అడిగేడు దేవిడోవు.

"అబ్బే—మరేంలేదు. ఏదో లోకాభిరామాయణం విదేసేము."

"అంతేనన్నమాట."

"మతగురువుని తీసుకువచ్చే ప్రద్దేశం వదులుకున్నారు."

"ఇంకా యేమన్నారు?" పెదవులమీది చిరునవ్వు కనబడకుండా ముఖం మరియొకవైపుకి తిప్పేసుకున్నాడు.

"వారికి మతంమీద, దేవుడిమీద గల భక్తిఅంతా పట్టి మూఢ నమ్మకం తప్ప మరేమీ కాదని కూడ అంగీకరించేరు....అయితే, సైమియన్, ఈ కూపీఅంతా తీస్తున్నావు, యెందుకు? జలగలా పట్టిన పట్టు వదలవు నువ్వు. వాళ్ళతో నేను యేమని మాట్లాడేననా? ఏదోమాట్లాడేను. వాళ్ళకి మనం నచ్చచెప్పడానికి ప్రయత్నించేమంటే ప్రోత్సాహమిస్తూన్నామన్నమాట వాళ్ళకి. అదికాదు వాళ్ళకి చేప్పేవిధానం. జబర్దస్తీ ఒక్కటే వాళ్ళదగ్గిర పనికొస్తుంది."

దేవిడోవు నవ్వి. నిరాశాసూచకంగా చెయ్యి వూపేడు. ఇంక మకార్‌ని సరిదిద్దడం అసంభవం.

మకార్ రెండు వారాలపాటు పార్టీలోనుంచి తొలగించబడ్డాడు. కాని ఆ కాలంలోనే జిల్లాపార్టీ నాయకత్వంలో మార్పులువచ్చేయి. సెక్రటరీయైన కార్చిన్‌స్కీ, ఆర్గనైజేషన్ డిపార్టుమెంటు అధికారియైన హోమాటోవులు వారి పదవులలోనుంచి తొలగించబడ్డారు. నగుల్నోవు కేసును పునర్విచారణ చెయ్యవలసిందని రిజియనల్ కంట్రోలు కమీషనునుంచి కొత్తజిల్లా పార్టీశక్రటరీకి తాఖీదు వచ్చింది. అతడు, నగుల్నోవు మీద నేరములు కొన్ని రుజువుకానందువల్లనున్ను, ప్రవర్తననుబట్టి చూసినా

అంతశిక్ష పనికిరాదనియూ నిర్ణయించి, వెనుకటిశిక రద్దుచేసి వట్టి మంద లింపుతో వదిలిపెట్టేడు. అంతటితో ఆ విషయం వదిలిపోయింది.

గ్రిమాచీపార్టీ శెక్రటరీ విధులు తాత్కాలికంగా నిర్వహిస్తూన్న దేవిడోవు ఆ పదవిని తిరికి నగుల్నోవుకి వప్పగించేడు.

"ఇప్పటికైనా గ్రహించేవా? ఇంకా తప్పుమార్గాలు తొక్కుతావా?"

"ఖణ్ణంగా గ్రహించేను! తప్పుమార్గం తొక్కింది నేనో జిల్లా కమిటీయో తెలియలేదు?"

"ఇద్దరూ కూడా తప్పుదోవే తొక్కేరు."

"కాని, రిజియనల్ కమిటీ కూడా కొద్దిగా తప్పుదోవ తొక్కుతూం దేమోనని వుందినాకు."

"ఏం....ఎందుచేత?"

"సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యత్వానికి రాజీనామా యిచ్చిన రైతుల పశువుల్ని తిరిగి వారికి యిచ్చేయాలని యెందుకు ఆర్డరు యివ్వలేదు? అది మాత్రం రైతుల్ని నిర్బంధించడంకాదూ? తప్పకుండా అవును! ఇక్కడ రైతులు ఇష్టంలేకపోతే వాళ్ళ సభ్యత్వంకి రాజీనామాయిచ్చి వెళ్ళి పోవచ్చు; కాని వ్యవసాయం చేసుకొనడానికి పశువులుకాని, పనిముట్లు కాని వుండవు. అందుచేత గతిలేక తిరిగి సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోనే చేరుతారు."

"కాని, పశువుల్ని తిరిగి యెవరివి వారికి యిచ్చేయడానికి 'రూల్సు' అంగీకరించవు."

"ఇష్టంలేనిదే రైతుని బలవంతంగా అందులో సభ్యుడుగా వుంచే టప్పుడు ఆ 'రూల్సు' యెందుకు? వాళ్ళ ఆస్థి వాళ్ళ మొఖానపారేసి మీ యిష్టం వచ్చినట్లు పొండి అని యెందుకు చెప్పరు? నేనయినట్లయితే వాళ్ళని యీ ప్రాంతానికికూడా చేరనిచ్చియుండను. సమయానుకూలంగా యెల్లాపడితే అల్లా తిరిగే యీ రైతులు క్రమంగామారి వాళ్ళే మంచి తెలి వైన సమిష్టి వ్యవసాయరైతులు అవుతారని అనుకుంటున్నావు, అదే

పొరపాటు! బయటికి పోనియ్యకపోతే ఇందులోనేవుంటారు. కాని, ఈ జన్మలో వాళ్ళ శత్రుత్వంమాత్రం వదలరు. ఎప్పుడైనా అవకాశం దొరుకుతే ఈ సమిష్టి వ్యవసాయ విధానం నాశనంచేసి, వ్యక్తిగతంగా వ్యవసాయం చేసుకుని, జీవించడానికే ప్రయత్నిస్తారు. వాళ్ళని నేను యెరుగుదును. వాళ్ళ ఆస్తిపాస్తులు యివ్వకపోవడం అతివాదదృక్పథం. వెళ్ళిపోయిన వాళ్ళని తిరిగి సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యులుగా చేర్చుకొనడం మితవాద దృక్పథం. కామ్రేడ్! అప్పటికీ, ఇప్పటికీ రాజకీయంగా నాలో చాలా అభివృద్ధి కలిగింది. అంత సులువుగా కొంటిపడకు యిప్పుడు."

"ఈ వ్యవసాయక సం॥రం పూర్తి కానిదే రాజీనామా ఇచ్చిన సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యులతో మనకుగల యకౌంట్లు ముగింపుకు రావనే విషయం తెలుసుకోలేకపోవడమే నువ్వు రాజకీయంగా యెంత అభివృద్ధి పొందేవో తెలుస్తూంది."

ఇల్లాగే చాలసేపు మాట్లాడుకున్నారు; కాని, ఇద్దరూ ఒక నిర్ణయానికి రాలేక తలొకదారినీ వెళ్ళిపోయేరు.

ఆ రెండువారాలలోను గ్రిమాచీలాగ్‌లో అనేక మార్పులు జరిగేయి. మేరియా పొయారోక్వా 'మూగదైమిడ్'ని వివాహం చేసుకుంది. అతని కున్న కొద్ది సామానులు బండిమీదవేసుకుని ఒక రాత్రి పొయారోక్వా యింటికి బస మార్చేడు.

"మేరియాకి తగిన 'ఉద్దా' దొరికింది!" అనుకున్నారు ప్రజలంతా.

ఈ విషయం తెలియగానే ఆంద్రీ విభ్రాంతపోయేడు. అనేక సం॥లు తన భార్యగావున్న మేరియా మరొకనిని పెళ్ళిచేసుకున్నందుకు అతనికి యెంతో కష్టంగావున్నా మొదట కొంచెం నిగ్రహించుకున్నాడు. కాని క్రమంగా ఆ విచారం మరచిపోవడానికి త్రాగుడు ప్రారంభించేడు. దేవిదోవుకి కనబడకుండా తప్పుకు తిరగసాగేడు. దేవిదోవు ఈ విషయమంతా గ్రహించి ఒకరోజున మందలించేడు.

"ఆంద్రీ! నీ వ్యవహారం ఏమీ బాగులేదు. ఒక పార్టీసభ్యుడు చెయ్యవలసిన పనికాదు అది."

"ఇంక మానివేస్తాను. సైమియన్, నాకు చాల చిన్నతనంగా వుంది. నన్ను వదిలి ఆ తుంటరిపెధవనా పెళ్లిచేసుకోనడం? నన్ను యెందుకు వదలినట్లు?"

"అది ఆమె యిష్టం."

"కాని నాకు అగౌరవం కాదూ?"

"అవుతే అవచ్చు. కాని, గ్రాగుడు ప్రారంభించడం యెందుకు? త్రాగి తందనాలాడేందుకు సమయంకాదు. కలుపుతీతలు వస్తున్నాయి."

మేరియా తరచు రజ్మట్నోవ్‌కి కనిపిస్తూనేవుంది. వెనుకటి కంటె వుత్సాహంగాను, తృప్తిగాను వున్నట్లే కనిపించింది.

డైమిడ్ పొలంపనులు, ఇంటి మరామతులు ఇరవైనాలుగుగంటలూ చేస్తున్నాడు వొళ్ళువంచుకొని. మేరియా అతనినికూడ యెంతో ప్రేమగా చూస్తూ ఇరుగుపొరుగువాళ్ళదగ్గిర అతని పనిని గురించి, బలాన్ని గురించి పొగడుతూంటుంది.

"ఉంటే అలాంటి మొగుడే వుండాలి. ఏనుగుబలం! అస్తమానూ టబడబ వాగకపోతే యేమి? మేము యెప్పుడూ పోట్లాడుకోము........"

డైమిడ్ భర్తగా దొరికినందున ఆమె సంతృప్తిగానే వుందని తెలిసి ఆంద్రీ తనలో తను ఇల్లా అనుకున్నాడు.

"మేరియా! డైమిడ్‌మాత్రంపని నేను చెయ్యలేనూ? నా జీవితం అంతా నాశనం చేసేవు."

తులక్‌గెయీవ్ ప్రవాసంనుంచి తిరిగి వచ్చేడు. ఎలక్టరోల్ రైట్సు కమీషను అతని పౌరసత్వహక్కులు తిరిగి సంక్రమింపచేసింది. పిల్లల్ని అందర్నీ వెంటబెట్టుకొని వూళ్లోకిరాగానే దేవిదోవు అతనిని సమిష్టి వ్యవసాయక్షేత్రపు ఆఫీసుకి పిలువనంపేడు.

"గెయీవ్! ఇకముందు యేమిచేద్దాం అనుకుంటున్నారు. వెనుకటి మాదిరిగా స్వంతవ్యవసాయమా, సమిష్టి వ్యవసాయక్షేత్రంలో చేస్తారా?"

"సమిష్టివ్యవసాయక్షేత్రంలోనే చేరవలసి వుంటుందనుకుంటాను."

"అయితే వెంటనే అప్లికేషను ఒకటి రాసి ఇయ్యండి."

"మరి నా ఆస్థి విషయం ఏం చేస్తారు?"

"మీ పశువులు, వ్యవసాయపనిముట్లు సమిష్టివ్యవసాయక్షేత్రంలోనే వున్నాయి. ప్రజలకి పంచిపెట్టిన సరుకులు కొన్నిమాత్రం తిరిగి యిచ్చి గలుగుతాము. మిగిలిన వాటికి ఖరీదు యిస్తాము."

"నా తిండికి ఆట్టేవుంచుకున్న గోధుమ అంతా వాడేసేదు?"

"దానికేమీ కష్టంలేదు. మేనేజరు దగ్గరికి వెళ్ళండి. మీ రాత్కాలి కావసరాలకి సరిపోయేటట్లు 2, 3 బస్తాలు యిస్తాడు."

"దోవనుపోయే జనాన్ని కూడా సమిష్టివ్యవసాయక్షేత్ర సభ్యులుగా చేరుస్తున్నాడు." అన్నాడు ముకార్. దేవిదోవ్ కులక్‌గెయీవ్ సభ్యత్వ దరఖాస్తు తీసుకున్నాడని విని, "ప్రవాసానికి పంపేసిన జనాన్ని అందర్నీ కూడా సభ్యులుగా చేర్చుకుంటామని పత్రికల్లో ప్రచురిస్తేసరి. కావలసినంత మంది చేరుతారు." అన్నాడు ఆంద్రీరజ్మట్నోవుతో.

చల్లికలు పూర్తిఅయేక గ్రిమాచీ పార్టీసభ్యత్వం రెట్టింపుకి పెరిగింది. పావెల్‌లుబిష్కిన్, నెష్టర్‌శాశ్చిలిన్, డెమ్కా ఉషాకోవులు కేండిడేట్లుగా అంగీకరించబడ్డారు. లుబిష్కిన్ మొదలయిన వాళ్ళని పార్టీమీటింగులో, తీసుకొనడానికి అంగీకరించిన నాడే నగుల్నోవ్ కోండ్రాట్ మైకనికోవ్‌తో ఇల్లా అన్నాడు.

"కోండాట్! నువ్వుకూడా పార్టీలోచేరు. నీ దరఖాస్తును నేను సంతోషపూర్వకంగా తప్పక బలపరుస్తాను. వెనక సైన్యంలో నువ్వు నాక్రింద పనిచేసేవు. అప్పుడు నువ్వు యుద్ధంలో యెల్లా పేరుపొందేవో, అల్లాగే ఇప్పుడు సమిష్టివ్యవసాయక్షేత్రంలో మంచి వ్యవసాయదారు వని పేరుపొందేవు. నువ్వు యింకా పార్టీలో చేరలేదంటే నాకు ఆశ్చర్యంగా

వుంది. ప్రపంచం అన్ని దేశాల్లోనూ కార్మికవిప్లవాలు వచ్చేరోజులు వచ్చేయి. పార్టీలో చేరడానికి నువ్వు యింకా ముందుకురాకపోవడం బాగు లేదు. వెంటనే దరఖాస్తుపెట్టు."

కోంద్రాట్ ఒక్క నిట్టూర్పు విడిచేడు.

"కామ్రేడ్ నగుల్నోవ్, పార్టీలో చేరడానికి ఇంకా నా అంతరాత్మ అంగీకరించడంలేదు. అవసరం అయితే సోవియట్ ప్రభుత్వంకోసం తిరిగి యుద్ధంచేస్తాను, సమిష్టివ్యవసాయక్షేత్రంలో కూడా నా శక్తివంచన లేకుండా పనిచేస్తాను. కాని పార్టీలో చేరడానికిమాత్రం అంగీకరించను...."

"ఏం—ఎందుచేత ?"

"సమిష్టివ్యవసాయక్షేత్రంలో చేరినప్పటికి స్వంతఆస్తి అంటే వుండే అభిమానం నాలో యింకా చావలేదు." అతని పెదవులు వణికేయి. "నా యెడ్లనుగురించి యెంతో విచారంగావుంది....వాటికి తగిన సంరక్షణ జరగడంలేదు. అకిమ్‌బెష్లిబ్నోవ్ నా గుఱ్ఱంచేత దాని ఈడుకి తగని బరువు పని చేయిస్తున్నాడు. ఇది న్యాయమేనా ? నేను చేరకపోవడానికి అదీ కారణం. ఆ ఆస్తిమీది అభిమానం చావనంతకాలం పార్టీలో చేరకూడదని నా వుద్దేశం."

మకార్ ఒక్క నిముషం ఆలోచించేడు.

"అవును, నువ్వు అన్నది చాలా సబబుగావుంది. కొద్దికాలం ఆగి ఆ తరువాతనే చేరు. సమిష్టి వ్యవసాయవిధానంలోవున్న లోపాలన్నీ సరిదిద్దడానికి పాటుపడదాం. స్వంత ఆస్థిమీది మమకారం చావనిదే పార్టీలో చేరడం అనవసరం. పార్టీలో చేరిన వ్యక్తికి ఒక్కటే ఆలోచన, ఆదర్శం వుండాలి: అది ప్రపంచ ప్రజావిప్లవం. మా తండ్రికి కొద్దో గొప్పో ఆస్థి వుండేది. చిన్నతనంనుంచీ నేను వ్యవసాయమే చేస్తుండేవాడిని. కాని యెన్నడూకూడ ఆ స్వంత ఆస్థిమీద అభిమానంలేదు. నాలుగుజతల ఎడ్లు, వ్యవసాయం, సుఖమైన జీవితం వదలి కూలిపనికి సిద్ధపడ్డాను. నువ్వు కూడా ఆస్తిమీది అభిమానం వదిలేకే చేరుదువుగానిలే."

లుబిష్కిన్, ఉషాకోవ్, లోశ్చిలిన్‌లు పార్టీలో చేరుతున్నారన్న వార్త గ్రిమాచీలో తెలిసేక ఒక కోసక్కు హాస్యానికి ఘూకర్‌తో యిల్లా అన్నాడు.

"నువ్వు పార్టీలో చేరడానికి దరఖాస్తు పెట్టలేదేమి? ఈ పార్టీలో చేరేవాళ్ళంతా నీకంటె ఎక్కువవాళ్ళా? పార్టీలోచేరావంటే ఏదో వుద్యోగం ఒకటి పారేస్తారు. డాక్యుమెంటుకేసు ఒకటికొని చంకని పెట్టుకొని పోతూంటే దర్జాగా వుంటుంది."

ఘూకర్ ఆలోచించేడు. ఆరోజు సాయంకాలం చీకటిపడ్డాక నగుల్నోవ్ దగ్గరికి వెళ్ళేడు.

"మకార్, ఏంచేస్తున్నావు?"

"ఏం - చీకటిపడ్డాక వచ్చేవు?"

"చాలామంది పార్టీలో చేరుతున్నారని...."

"అయితే ఏం చెయ్యమంటావు?"

"నన్నుకూడా చేర్చుకోండి. గుర్రాలనిచూస్తూ, బంతితోలుతూజీవితం అంతా యిల్లా గడపడం నాకు యిష్టంలేదు, వాటికి నేను పుస్తికట్టేనా?"

"నీ వుద్దేశం ఏమిటో నాకు అర్థంకాలేదు."

"పార్టీలో చేరడానికి వచ్చేను. నాకుకూడా యేదో ఒక ఉద్యోగం యివ్వండి.........దరఖాస్తు యెల్లా రాయాలో కొంచెం చెప్పు."

"అయితే నువ్వు పార్టీలోచేరి యేదో వుద్యోగం సంపాదించాలని వచ్చేవన్నమాట!"

మకార్ కోపం ఆపుకుని సంభాషణ మార్చేడు.

"మొన్న ఈస్టరుకి మతగురువు వచ్చేడా మీయింటికి?"

"ఆఁ. – రాకేం!"

"ఏమైనా ముట్టచెప్పేవా?"

మనకున్నంతలో యేదో యిచ్చేను, రెండు కోడిగుడ్లు, ఒక పౌను పంది మాంసము."

"దేవుడిమీద నమ్మకంవుందా నీకు?"

"ఏదో కొంచెం వుండకపోతుందా. ఏదేనా జబ్బుచేసినప్పుడు, కష్టాలువచ్చినప్పుడు, బాగా ఉరుముతేనూ, తప్పకుండా దేవుణ్ణిప్రార్థిస్తాను"

సంభాషణ ప్రారంభించినప్పుడు మకార్ మంచిమాటలచేత ఘూకర్‌ని అతను పార్టీలోకి యెందుకు చేరడానికి వీలులేదో చెబుదాం అనుకున్నాడు. కాని సంభాషణ కొంతదూరం నడిచేక ఆతనికి కోపం ఆగిందికాదు.

"ఛీ. అవతలకిపో. మతగురువులకి కోడిగ్రుడ్లు, మాంసం యిస్తూన్నావా? పార్టీలో వుద్యోగంకూడా కావాలానీకు! నీవంటివాళ్ళంతా పార్టీలో చేరుతే పార్టీబాగానే ముందుకి వస్తుంది. వేళాకోళం అనుకున్నావా పార్టీలో చేరడంఅంటే? మారుమాటాడక నా యెదరనుంచిపో. వెడతావా వెళ్ళవా?"

"నేను వచ్చినవేళ మంచిదయిందికాదు. భోజనంఅయి స్థిమితంగా వున్నప్పుడు రావలసింది." అనుకుంటూ ఘూకర్ వెళ్ళిపోయేడు.

ఈ 15 రోజుల్లోను గ్రిమాచీప్రజల్ని ముఖ్యంగా ఆడపిల్లల్ని కలవరపెట్టిన మరియొకవార్త 'స్కోకీ' చావునిగురించి.

యెషిమ్ట్సుబఛోవ్, బెటలశ్చికోవ్‌లు ప్రజా కోర్టుచేత కఠినశిక్షలు విధించబడి ప్రవాసం పంపబడ్డారు. వాళ్ళే 'స్కోకీ' మరణాన్నిగురించి గ్రిమాచీకి వ్రాసేరు. అతనిని గ్రిమాచీనుంచి తీసుకునిపోయేటప్పుడు పారిపోవడానికి ప్రయత్నించేడు. అతనినికూడ తీసుకుపోతూన్న సైనికుడు 'ఆగు!' అని మూడుసార్లు హెచ్చరించేడు. కాని అతడు లక్ష్యపెట్టక వంగుని దగ్గరనేవున్న అడవివైపు పరుగెత్తసాగేడు. ఇంకో 40 గజాలు వెడితే స్కోకీ దుప్పలచాటునుంచి తప్పించుకుపోయి వుండును. కాని ఆ సైనికుడు తుపాకి గురిచూచి మూడవదెబ్బతో అతని ఆయుర్దాయం ఆఖరుచేసేడు.

ఒక్క అతని ముసలిమేనత్త తప్ప అతనికోసం విచారించేవారెవరూ లేరు. అతనితో పరిచయంవున్న ఆడవాళ్ళెవరేనా కొంచెం విచారించినా అదెంతోకాలం నిలవదు.

# ముప్పైఎనిమిదో ప్రకరణము.

## సమర్థుడైన మేనేజరు

రైతులకి ఊడ్పులదగ్గరనుంచి కోతలవరకు రెండుమాసములు ఇంచుమించుగా పనివుండదు. మొట్టమొదటిసారిగా 1930 సం॥ సమిష్టి వ్యవసాయం ప్రారంభించిన మొదటి సం॥రం. ఆ రెండుమాసాలూకూడ పూర్తిపని తగిలిందిరైతులకి. అంతవరకు పాతపద్ధతులమీద వ్యవసాయము చేసేటప్పుడు చల్లికలు అయినవెంటనే రైతులు కుప్పనూర్పులు వచ్చేవరకు ఖాళీగావుండేవారు. పశువులు బీళ్ళలోమేస్తూ కోలుకునేవి కోసక్కాలు బళ్ళు. కోతపనిముట్లు బాగుచేసుకునేవారు. మే మాసపు మండుటెండలో యెవరో కాని దున్నేవారుకాదు. గ్రామాలన్నీ నిశ్శబ్దంగా వుండేవి. తీరికరోజులవడంచేత కోసక్కాలు బంధువుల్ని చూడడానికి యితరగ్రామాలకి వెళ్ళడం గాని, పిచ్చాపాటి మాట్లాడుతూ కూర్చోవడంగాని చేసేవారు.

కాని, సమిష్టివ్యవసాయ విధానం ప్రారంభించిన మొదటి సంవత్సరమే గ్రిమాచీరైతులకి ఈ రెండునెలలుకూడ పూర్తిపని తగిలింది. చేలు మొలిచిన కొద్దిరోజులకే కలుపుతీతలు ప్రారంభమయేయి.

"ఈ సం॥రం సమిష్టి వ్యవసాయక్షేత్రపు చేలలో మూడుసార్లు కలుపులు తియ్యాలి మనం. ఒక్క కలుపుమొక్కకూడా మిగలకూడదు." అన్నాడు దేవిదోవు మీటింగులో.

అందుకు యాకోవ్‌లూకుచ్ చాల బాగుందన్నాడు. స్వతహాగా కూర్చునే స్వభావంలేని వాడవడంచేత ఈ ఆలోచన అతనికి నచ్చింది. "సోవియటు ప్రభుత్వం పట్టినదల్లా బంగారం అవుతూంది. కానీ, పవ్యవసానం యెలా తేలుతుందో చూద్దాం. ఇప్పుడు కలుపుతీతలు, బీడుభూములు సేద్యంలోకి తీసుకురావడం, వ్యవసాయపనిముట్లు మరామతుచేసుకొనడం. పశువుల్ని, గుర్రాలని మేపడం, అయితే ప్రజలు పనిచేస్తారా ? కలుపు

తీతలకి ఆడవాళ్లు వస్తారా? ఇదివరకు యెన్నడూ విననైనాలేదు. ఈ 'డాన్' నదీ ప్రాంతంలో ఇంతవరకు యెన్నడూ కలుపులు తియ్యడం యెరగం. కాని కలుపులు తియ్యకపోవడం అంత తెలివితక్కువలేదు. పంట బాగా పండుతుంది. నా చేలల్లో యెప్పుడూ కలుపులు తీసుకోలేదు - యెంత తెలివి తక్కువ! ఈ ఆడపీనుగులు అస్తమానూ కూర్చుని కబుర్లుచెబుదాం అనే కాని యిల్లాంటి పనులు చేసుకుందాం అని ఉంటేనా!" అనుకుని, తను స్వంతంగా వ్యవసాయం చేసుకొనేటప్పుడు కలుపులేనా తీసుకొనకుండా వ్యవసాయం చేసినందుకు యెంతో బాధపడ్డాడు.

"కామ్రేడ్ దేవిడోవ్, ఈ యేడు మనకి యెంత పంట అయినా పండుతుంది. పూర్వం అంతాకూడా విత్తనాలుచల్లి కూర్చునేవారు చేలు కోతకి వచ్చేవరకు. వరిమొక్కలతోసాటు భూమిమీదవున్న యెక్కడి కలుపు మూసుకువచ్చేది చేలల్లో. చేలు బాగా పండేయనే అనుకునేవాళ్ళు. కాని తీరా చూసేటప్పటికి ఎకరానికి 4 బస్తాలకంటే సాధారణంగా యెక్కువ పండేవేకావు." అన్నాడు.

ప్రజలు యెవర్నీ అడగకుండా విత్తనపుధాన్యం యెవరికి కావలసినవి వాళ్ళు గాదులు బద్దలుకొట్టి పట్టుకొనిపోయినప్పటినుంచీ ఆస్ట్రోవ్‌నోవ్‌ని మేనేజరు పదవినుంచి తొలగించాలనే చూస్తున్నాడు దేవిడోవ్. ధాన్యం తీసుకొనిపోవడానికి అప్పుడు పోగుపడ్డ జనంలో లూకిచ్ ముఖం కనబడి నప్పటినుంచీకూడా అనుమానంగానే వుంది. అందుచేత ఆ మరునాడు దేవిడోవు అతనిని గదిలోకి పిలిచి, మిగిలినవాళ్ళందర్నీ బయటికి వెళ్ళి పొమ్మన్నాడు. వారిద్దరూ నెమ్మదిగా మాట్లాడుకున్నారు.

"నిన్న గాదులదగ్గర నువ్వు యేంచేస్తున్నావు?" అని అడిగేడు దేవిడోవ్.

"కామ్రేడ్ దేవిడోవ్, ప్రజలకి నచ్చచెప్పి నెమ్మదిగా పంపెయ్యడానికి ప్రయత్నించేను. సమిష్టి వ్యవసాయక్షేత్రపు ఆస్తి లూటీచేస్తే చాలా

ప్రమాదంవుందనీ, తొందరపడవద్దనీ చాలదూరం చెప్పేను" అన్నాడు యాకోవ్ లూకుచ్ తడుముకొనకుండగా.

"అయితే ఆడవాళ్లు........? గాదుల తాళంచెవులు నాదగ్గర వున్నాయని వాళ్ళతో యెందుకుచెప్పేవు ?"

"అది అంతా వట్టిది. భగవంతుడుసాక్షిగా చెబుతూన్నాను. ఆ మాట నేను యెవ్వరితోను అనలేదు."

"నన్నుపట్టుకొని తీసుకుపోయేటప్పుడు వాళ్ళుచెప్పేరు ఈవిషయం"

"అంతా కల్పితం. ఘంటాపథంగా చెబుతాను. పచ్చి అబద్ధాలు. యెల్లాగయినా నన్ను నాశనంచెయ్యాలని చూస్తున్నారు."

దేవిడోవుకి యేమిచెయ్యడానికీ పాలుపోలేదు. కాని, తరువాత లూకుచ్ మేనేజిమెంటులోను, కలుపు తీతలలోను, పశువుల మేత విషయంలో చేసిన యేర్పాటులు, ఇంకా అనేక కొత్తకొత్త ప్లానులువేసి సమిష్టి వ్యవసాయాభివృద్ధికి పాటుపడడంలోను చూపిన తెలివితేటలు, వుత్సాహం చూచి దేవిడోవుకి అతనిమీది అనుమానం పూర్తిగా తొలగిపోయింది. ఈ పర్యాయంకూడా లూకుచ్ దేవిడోవు కళ్ళలో దుమ్ము కొట్టగలిగేడు.

లూకుచ్ వేర్వేరు ప్రాంతములలో నూతులు తవ్వించాలన్నాడు. వర్షపునీరు వృధాపోకుండా అడ్డుకట్టలుకట్టి చేలకు వుపయోగపడేప్లాను తయారుచేసేడు. కొత్తనూతులు త్రవ్వించినందువల్ల అదునురోజుల్లో పశువులను వాటి మకాములలోనుంచి నీళ్ళకోసం ప్రతిసారి 2 మైళ్ళదూరం తోలుకువెళ్ళవలసిన అవస్థ తప్పిపోతుంది. అందువల్ల యెంతోపని కలిసి వస్తుంది. అందుచేత వెంటనే ఆ పని ప్రారంభించబడింది.

అంతేకాదు, అంతవరకు 100 ఇటిక $4\frac{1}{2}$ రూబుల్సు యిచ్చి 20 మైళ్ల దూరంనుంచి బళ్ళచార్జీలు పెట్టి మోసి తెచ్చుకోవలసివస్తూంది. అందుచేత ఇక్కడే ఇటుకలు తయారుచేసి, దూడల పాకలకు, సమిష్టి వ్యవసాయ క్షేత్రపు యిళ్ళకు కావలసిన యిటుక అంతా కొనవలసిన అవసరం

లేకుండా చవకగాగిట్టే ప్లాను తయారుచేసేడు. మూడవ బ్రిగేడు పనిచేసే భూమిలో 'వాగు' ఒకటి మంచి సారవంతమైన భూమిని ప్రతియేడూ కోసేస్తూంది. అందుచేత వాగుకి అడ్డుకట్టవేసి, రెండు గట్లు కొయ్యకుండా పాప్లార్, విల్లోచెట్లను పాతవలసిందని సలహా యిచ్చేడు.

వీటి అన్నిటివలన సమిష్టి వ్యవసాయక్షేత్రంలో ఆస్ట్రోవ్‌నోవు స్థానం బలపడింది. దేవిడోవు అతనిని యే పరిస్థితులలోనూ మేనేజరు పదవి నుంచి తొలగించకూడదనుకున్నాడు. క్రమంగా ఆస్ట్రోవునోవుమీద నగు ల్నోవు అభిప్రాయం కూడా మారింది. "అతని వుద్దేశాలు యెల్లావుంటే మనకేమి — ప్రస్తుతం మనకి బాగా వుపయోగిస్తున్నాడు." అన్నాడు న్యూక్లెస్ మీటింగులో, "మనవాళ్ళలోనుంచి అంత సమర్థుణ్ణి తయారుచేసు కొనేవరకు ఆస్ట్రోవునోవునే వుంచాలి మేనేజరుగా. మన పార్టీకి అసమాన మైన తెలివితేటలు వున్నాయి. లక్షలకొలది వ్యక్తులచేత నడిపించబడు తూండడంచేతనే యింత కట్టుదిట్టముగా నడుస్తూంది. సోవియట్ ప్రభుత్వ వ్యతిరేకి, ద్రోహి అయిన ఇంజనీరు ఒకడు వున్నాడనుకోండి. సామాన్య దృష్టిలో అతనిని తుపాకితో కాల్చి చంపాలి. కాని మనపార్టీ యేం చేస్తూంది ? అతనికి ఒకపని పురమాయించి 'నువ్వుచదువుకున్నావు. నీకు కావలసిన డబ్బు యిదిగో. మస్తుగాతిను. నీకు తోచినట్లు ఖర్చుపెట్టుకుని సుఖపడు. కాని నీ తెలివితేటల్ని ప్రజలకోసం, ప్రపంచవిప్లవంకోసం ఇంజనీరింగు పనిద్వారా వుపయోగించు.' అని చెబుతారు; అతడు చేస్తాడు. అతని మనస్సు పూర్వపుజీవితంకోసం కలలుకంటూండవచ్చు; కాని అతను పని చేస్తూనేవుంటాడు. అతనిని చంపినందువల్ల లాభంయేమిటి ? వీసం యెత్తుకూడా లేదు. పని చేయించుకొనడం ద్వారా వేలకొలది ప్రజలకి వుపయోగపడేటట్లు చెయ్యవచ్చు అతనినే. మన ఆస్ట్రోవునోవు విషయంలో కూడా అంతే. వాగులకి అడ్డుకట్టలు కట్టనియ్యండి. అవసరమైనచోట్ల నూతులు త్రవ్వమనండి. అదంతా సోవియట్ ప్రభుత్వ పురోభివృద్ధికే. ప్రపంచవిప్లవాన్ని ఇంకా త్వరగా తీసుకురావడానికే.

అస్త్రోవ్‌నోవ జీవితంలోని ఒడుదుడుకులు కొంచెం తగ్గేయి. పొలోవిట్సేవ, అతని వెనుకనున్న సోవియట్ వ్యతిరేకశక్తులు తాత్కాలికంగానైనా అపజయం పొందేయని గ్రహించేడు. ఇంక సోవియటు ప్రభుత్వం మీద తిరుగుబాటు జరిగే అవకాశం లేదనీ, కోసక్కులకు సోవియటు ప్రభుత్వంమీద గల విద్వేషంకూడ క్రమంగా నశిస్తూందనీ గ్రహించేడు. "పొలోవిట్సేవ, లెటెస్కీలు విదేశాలకి పారిపోయి వుంటారు." అనుకున్నాడు. సోవియటు ప్రభుత్వాన్ని కూలద్రోసే మంచి అవకాశం జారిపోయిందనే విచారంవున్నా, తన వునికికి ప్రమాదం కలిగించేవ్యక్తులు పోయేరనే సంతోషం కూడా అతనికి కలిగింది. గ్రిమాచీలాగ్‌కు వచ్చే 'మిలీషియామెన్' ను చూసి అతను భయపడడంలేదు యిప్పుడు. వెనకనల్లటి మిలీషియా యూనిఫారం చూసేటప్పటికి గజగజలాడేవాడు.

"నాయనా, ఈ నాస్తికప్రభుత్వం పోయి మన ప్రభుత్వం ఎంతకాలంలో వస్తుంది ?" అని అడిగింది ఒకరోజున అతని తల్లి.

అప్రస్తుతమైన ఆ ప్రశ్నకి చాల కంగారుపడి అతను తల్లిని కేకలేసేడు.

"అమ్మా. ఈ గొడవలన్నీ నీ కెందుకు ?"

"అందరికీ కావాలి. వాళ్ల చెర్చిలు మూసేసేరు. మతగురువుల్ని 'కులక్' లు అని తరిమివేసేరు. న్యాయమేనా అది ?"

"నీకు బాగా ముసలితనం వచ్చింది. భగవంతుణ్ణి ప్రార్థించుకో.... ఈ ప్రపంచవిషయాలన్నీ వదిలెయ్యి !"

"అయితే, ఆ ఆఫీసర్లు యెక్కడికి వెళ్ళేరు ? నువ్వు నన్ను ఆశీర్వదించమని, తిరిగి ఈ ప్రభుత్వంక్రిందే వుద్యోగం చేస్తున్నావేమి ?"

"ఆఖరికి నా కొంప ముంచీలావున్నావు నువ్వు. ఇంక ఈవిషయం యెప్పుడూ యెత్తకు. ఆ గొడవలన్నీ నీ కెందుకు ? ఇప్పుడు నా దగ్గర అన్నట్టే మరొకరిదగ్గర అంటావు. దానితో నా పని ఆఖరు. 'భగవంతుడు ఏం చేసినా మనమేలుకే' అని మాట్లాడక వూరుకో. తిండికీ, బట్టకీ లోటు లేదుకదా ! అంతటితో సంతోషించి వూరుకో."

తల్లితో ఈ సంభాషణ అయిన తరువాత భయము. కంగారుతో బయటికివచ్చి కొడుకుని, కోడల్ని, భార్యని పిలిచేడు.

"దాన్ని ఓ కంట చూస్తూండండి" అన్నాడు. "శనిగ్రహంలా దాపరించింది. మన యింటికి కొత్తవాళ్లు యెవరయినావస్తే వెంటనే దానిని గదిలోపెట్టి తాళం వెయ్యండి."

అప్పటినుంచీ ఆమెను రాత్రింపగళ్లు గదిలోపెట్టి తాళంవేసి నిర్బంధించి వుంచుతుండేవారు. ఆదివారంనాడు మాత్రం స్వేచ్ఛగా వదిలేవారు. తన వయస్సు ముసలమ్మల దగ్గరకువెళ్ళి తన కష్టాలన్నీ వెళ్ళబుచ్చుకునేది.

"నా కొడుకు, కోడలు మునుపటిలాకాదు యిప్పుడు. గదిలోపెట్టి తాళం వేస్తున్నారు. పాడుతిండి పెడుతున్నారు. కాని ఆ మధ్య ఆఫీసర్లు వచ్చి మా ఇంట్లోవున్న రోజుల్లో యెంతో బాగా చూసేవారు నన్ను. యెందుకో నేనంటే కుండిపడుతున్నాడు యిప్పుడు. ఇదివరకు ఈ నాస్తిక ప్రభుత్వాన్ని నాశనంచేసే ప్రయత్నంలో నా ఆశీర్వచనంకోసం వచ్చిన కొడుకు యిప్పుడు ఈ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఒక్కమాట అంటే మండిపడతాడు యెందుకో."

---

# ముప్పైతొమ్మిదో ప్రకరణము.

## లుకిరియా.

నగుల్నోవ్ వెనుకటిభార్య లుకిరియా చల్లికలనాటినుంచీ కూలిపని చేస్తూంది. మూడవదళంలో కలిసి పనిచెయ్యమన్నారు ఆమెను. అందుకు అంగీకరించి వాళ్ళతోనే వుంటూంది. పగలల్లా యేదో పనిచేసి, రాత్రి భోజనాలయినది మొదలు తెల్లవారుఝామువరకు ఆమె 'బాలలైకా. (ఒక విధమైన సంగీతవాయిద్యం) వాయిస్తూంటే. వయస్సులోవున్న స్త్రీ పురుషులు పాడుతూ, నాట్యంచేస్తూ మహోత్సాహంగా వుండేవారు. మొత్తం మీద దీనినంతను నడిపించేది ఆమె.

కులాసాగా గడపడంతప్ప ప్రపంచ విషయాలు యేమీ ఆమెకు పట్టవు. మూడవదళంలోని యువకులంతా ఆమెచుట్టూ చేరసాగేరు. విసీల ఆకాశంక్రింద, చంద్రకాంతిలో ఆమెచుట్టూ చేరి కోసకు యువకులు నాట్యం ఆడుతూంటే నేల తాపటం అయిపోయేది. ప్రతివాడూ ఆమె అనుగ్రహం సంపాదించాలని చూస్తూ దగ్గరికి చేరడంలో వారిలో వారికి పేచీలు ప్రారంభమయేయి. ఆమె యెవరినీ కాదనదు. అందరికీ అందుబాటులో వుంటుంది. పూర్వం ఆమెతో సంబంధంవున్న టిమోఫీ ప్రవాసం పంపబడ్డాడు. భర్త వదిలేసేడు. అందుచేత ఆ స్థానానికి ప్రతివాడూ ఆశించడంలో ఆశ్చర్యం యేముంది ?

అగాఫన్ డుబుస్టీవ్ ఈ విషయమై ఆమెను కొంచెం మందలింప చూసేడు కాని లాభంలేకపోయింది.

"నాకు నియమించినపని నేనుచేస్తున్నాను; అటువంటప్పుడు నన్ను నాట్యం చెయ్యొద్దు అనీ, ఇతరులని ప్రేమించవద్దని అనడానికి యెవరికీ అధికారంలేదు. ఆగాఫన్! కోప్పడకు యిల్లా అన్నానని. ముసుగుతన్ని సుఖంగా నిద్రపో. నీకూ రావాలనివుంటే – రా; మా అభ్యంతరంలేదు. ప్రతివాళ్ళూ రావచ్చు."

వెంటనే అగాఫన్ గ్రిమాచీవచ్చి దేవిడోవుకి రిపోర్టు చేసేడు.

"కామ్రేడ్ దేవిడోవ్, మీరు చేసిన యేర్పాట్లు యేమీ బాగులేవు." అనడంతోనే ప్రారంభించేడు రావడంతో. "ముసలి ఘూకర్‌ని లుబిష్కిన్ దళంలోను, లుకిరియా నగుల్నోవాని నా దళంలోనూ వేసేరు మిగిలినవాళ్ళుకూడా పనిచెయ్యకుండా చెయ్యడానికి కాకపోతే వాళ్ళెం దుకు ? ఒక రాత్రివచ్చి చూడండి ! క్యాంపులో యేం జరుగుతూంద తెలుస్తుంది. లుకిరియా మా దళంలోవాళ్ళ నందర్నీ చెడకొడుతూంది దానికోసం అందరూ కోడిపుంజుల్లా దెబ్బలాడుతూన్నారు. రాత్రి తె వార్లూ ఒక్కటేగోల, నాట్యం చేస్తున్నారు. చుక్కపొడిచేకకూడా మ క్యాంపు దగ్గిరనుంచి సంతగోలలా ఒక్కటేగోల వినబడుతూంటుంది

జర్మనీతో యుద్ధంలో నాకు గాయంతగిలి ఖార్కోవ్ హాస్పటల్‌లో వున్నప్పుడు నర్సులు నన్ను 'ఒపేరా' కి తీసుకువెళ్ళేరు. ఎప్పుడు వచ్చేస్తానా అన్నంత అసహ్యంగా వుండేది. దాన్ని మించిపోయింది మా క్యాంపులో గోల. రాత్రి అంతా అల్లా కాలక్షేపంచేసి పగలు యేంపని చెయ్యగలుగుతారు? లుకిరియాని మా దళంలోనుంచి తీసివేసినాసరే. లేదా సరిగా ప్రవర్తించమని మందలించినాసరే."

"ఏమిటి - ఈ గొడవ అంతా? దీనికి నేనేం చేస్తాను? సరిగా పనిచెయ్యకపోతే వెంటనే బయటికి గెంటెయ్యి. అంతేకాని ప్రతి విషయానికి నా దగ్గిర ఫిర్యాదు చేస్తూండకు. 'ఎద్దుకు కాలునొప్పి పెట్టిందనీ' 'నాగలి విరిగిపోయిందనీ' ప్రతివిషయం నా వరకూ యెందుకు? బాధ్యత తీసుకుని పనిచెయ్యడం ఎప్పుడు నేర్చుకుంటావు? ఎంతకాలం నేను సహాయం చేస్తాను? ఇంక యెప్పుడూ నా దగ్గిరకిరాకు—పో."

అగాఫన్ అసంతృప్తితో వెళ్ళిపోయేడు. దేవిడోవు వరసగా రెండు సిగరెట్లు త్రాగి, తలుపులు బిగించేసి కూర్చున్నాడు.

డుబ్‌స్ట్రోవ్ రిపోర్టు అతనిని వ్యాకులపరచింది. బ్రిగేడు లీడర్లు వాళ్ళ స్వంతబాధ్యతమీద పనిచేయించే చొరవలేదనిగాని, సలహాలకోసం అస్తమానూ వచ్చి వేధిస్తూన్నారనికాదు డుబ్‌స్ట్రోవును కేకలు వేసింది. అతను 'లుకిరియా అందరితోను యిష్టం వచ్చినట్లు తిరిగి పాడుచేస్తూంది' అన్నాడని కేకలేసేడు.

లుకిరియా అతనికి ఆఫీసుయెదుట కనబడి భర్తను చూసిపెట్టడంగాని, లేక తనే పెళ్ళిచేసుకోవడంగాని, చెయ్యవలసిందని అడిగినప్పటినుంచీ ఆమెయెడల అంతక్రితంవున్న అభిప్రాయం క్రమంగా మారింది. తరుచుగా ఆమెను గురించిన ఆలోచనలు బుర్రలోకి వస్తూన్నాయి.

లుకిరియా రూపం అతనిని ఆకర్షించింది. ఆ వసంతకాలంకూడా కొంతవరకు దేవిడోవుమీద పనిచేసివుంటుంది ఈ విషయంలో. తరుచుగా

ఆతడు రాత్రులు నిద్రపట్టక సిగరెట్లు కాల్చిపారేస్తూ, ఇటునటు పచారు చేసి, చివరకు రగ్గు కప్పుకుని ఏదో ఆలోచిస్తూ పడుకునేవాడు.

లుకిరియా చల్లికలు పూర్తిఅయేవరకూ ఆ దళంతోనే వుంది. ఆ దళం వూళ్ళోకి తిరిగి వచ్చినరోజు సాయంకాలం ఆమె దేవిదోవును చూడడానికి వెళ్ళింది.

అతనూ భోజనంఅయి గదిలోపడుకొని 'ప్రవదా' చదువుతున్నాడు. తలుపు దగ్గిర ఏదో చప్పుడయింది.

"లోపలకి రావచ్చా?" అన్న స్త్రీ కంఠధ్వని వినబడింది.

"ఆ." అని దేవిడోవ్ పక్కమీదనుంచిలేచి జాకెట్టువేసుకున్నాడు.

లుకిరియా లోపలికివచ్చి, నెమ్మదిగా తలుపులు వేసింది.

"మిమ్మల్ని ఒక్కసారిచూసి వెడదాం అని వచ్చేను .. ...."

"ఇల్లావచ్చికూర్చో" అని దేవిడోవు స్టూలుఒకటి యెదరికిలాగేడు. జాకెట్టుబొత్తాలు పెట్టుకుని అతను పక్కమీద కూర్చున్నాడు. అయాచితంగా ఆమె వచ్చినందుకు లోపల సంతోషంగావుంది అతనికి.

"ఏంచేస్తూన్నారు?" అని ఆమెయే సంభాషణ ప్రారంభించింది.

"చేసేందుకేముంది—యేదో నడుస్తూంది."

"పెళ్ళివిషయం ఏమాలోచించేరు?"

"ఆ విషయం ఆలోచించేందుకు కూడా తీరికలేదు."

"పోనీ, యిప్పుడైనా కొంచెం తీరికగా నావిషయమై ఆలోచిస్తారా?"

గంభీరమైన దేవిడోవు ముఖం కొంచెం తెల్లబోయింది. ఆమె అతినమ్రతగా రెప్పలువాల్చి కూర్చుంది. పెదవులమీద చిరునవ్వు తొణుకాడుతూంది.

"...... ...... ...... ......"

"నేనంటే యిష్టంలేదా?

"దానికేం—ఆ విషయం తరువాతచూద్దాం. నువ్వు వచ్చినపనేమిటి."

"నేనా..........పత్రికావిశేషాలేమిటి ? విదేశాలలో విప్లవాలు వచ్చే సూచనలు యేమైనా వున్నాయా ?" అని లుకిరియా ఆ సంభాషణకి అను గుణ్యంగా ముఖం 'సీరియస్‌గా' పెట్టింది.

"పత్రికలో చాలా విశేషాలుంటాయి..........అయితే, నువ్వు వచ్చిన పనేమిటి ?" దేవిడోవ్ కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు. ముళ్ళమీద కూర్చున్నట్లు వుంది అతనికి. పక్కనున్న గుమ్మంచాటునుంచి ఆ యింటి ఆమె ఈ సంభాషణ అంతా వింటూంటుంది. తెల్లవారకుండా ఆమె ఇంటిం టికివెళ్ళి రాత్రివేళ లుకిరియా దేవిడోవుగదికి వెళ్ళిందనీ..........ఏదేదో చెబు తుంది. పల్లెటూళ్ళలో ఇటువంటిప్రకార్లు పడ్డాక యింక చెప్పేదియేముంది ! సందుల్లోను, నూతులదగ్గిర, వన్నెలు, చెన్నెలు పెట్టి చెప్పుకుంటారు. అంతవరకు యెంతో గౌరవంగా చూసిన సమిష్టి వ్యవసాయక్షేత్ర సభ్యులు అతన్ని చూసి నవ్వుతారు. లుకిరియా లొంగతీసేసిందని రజ్మట్నోవు యెదురుగుండానే వేళాకోళంచేస్తాడు. ఆఖరుకు యిది జిల్లాకుకూడా తెలు స్తుంది. వ్యవసాయడిపార్టుమెంటు అధికారులకి తెలుస్తే, వాళ్ళు "అందు చేతనే 10 వ తారీఖువరకూ చల్లికలు పూర్తిచెయ్యలేకపోయేడు ; ప్రేమ వ్యవహారాల్లో అతనికి చల్లికలు అనుకున్నరోజుకు పూర్తిఅయేటట్లు చూసే టందుకు తీరికయెక్కడ !" అంటారు. రిజియనల్‌కమిటీ సెక్రటరీ సమిష్టి వ్యవసాయక్షేత్ర నిర్మాణకార్యక్రమం కొనసాగించడానికి తరిఫీదుయిచ్చిన వర్కర్లకు వీడ్కోలుయిచ్చేటప్పుడు వారితో "కార్మికవర్గాధికారానికి అప్ర తిష్ఠ తేకండి. పల్లెటూళ్ళలో అప్రతిష్ఠ మీ చేతలమీద ఆధారపడుతుంది. కామ్రేడ్స్, మీరు మామూలుగా ప్రవర్తించేకంటె రెండురెట్లు జాగ్రత్తతో ప్రవర్తించాల్సి వుంటుంది. పెద్దపెద్ద విషయాలసంగతికాదు నేను చెప్పేది. దైనందిన కార్యక్రమంలో సాధారణంగా మనం చేసే ప్రతిచిన్నవిషయం లోనూ జాగ్రత్త, దూరదృష్టి వుండాలి."

లుకిరియా తరుచుగా వస్తూంటే అందువల్ల మునుముందు కలిగే ఫలితాలు ఆలోచించేటప్పటికి అతనికి శరీరం కంపంయెత్తింది. ఆమెమాట

లకి యెదురుచెప్పలేక మొహమాటపడి అంగీకరించే పరిస్థితి వచ్చింది అత నికి: కాని, లుకిరియా ఏమీ యెరగనట్లు ప్రశాంతంగా కూర్చుంది. అతను కంగారుచేత తడబడుతూ ఇల్లా అడిగేడు.

"నువ్వు యిక్కడికివచ్చిన పనియేమిటి? నీతో వాతాఖానీచేస్తూ కూర్చోడానికి తీరుబడిలేదునాకు నీపని యేదోచూసుకుని వెళ్ళిపో."

లుకిరియా అతని కంగారు గ్రహించింది.

"సరే, అల్లాఅయితే, మంచిమంచి విషయాలుండే పత్రిక ఒకటి ఇయ్యండి. అంతకంటే మరేమీ పనిలేదు మీతో. శ్రమ కలిగించినందుకు క్షమించండి........"

ఆమె వెళ్ళిపోయింది. బుజాలమీదనుంచి పెద్దబరువు దిగిపోయి నట్లుగా 'అమ్మయ్యా!' అనుకున్నాడు. ఆ మరుక్షణమే టేబులుదగ్గర కూర్చుని తల రెండుచేతులలోను పెట్టుకుని, జుట్టులోకి వేళ్ళను పోనిస్తూ ఆలోచించసాగేడు "ఎంత పిరికివాణ్ణి! సాహసం చెయ్యలేకపోయేను. ఒక స్త్రీ వచ్చి మాట్లాడుతే తప్పేముంది నేనంత భయపడటానికి? అదీ కాక, సన్యాసినా నేను? మేమిద్దరం మాట్లాడుతే పైవాళ్ళకేంసంబంధం? ఆమె అంటే నేను యిష్టపడతాను: అటువంటప్పుడు నాకు తోచినంతసేపు మాట్లాడుతూ కూర్చుంటాము! నావిధి నేను నిర్వర్తిస్తూన్నంతకాలం యెవ్వరినీ లక్ష్యపెట్టనవసరంలేదు. ఆమె యింకరాదు. చాలా పరుషంగా మాట్లాడేను. నేను భయపడుతూన్నాననే సంగతికూడా గ్రహించింది...."

కాని, దేవిడోవు భయపడనవసరంలేదు. లుకిరియా అనుకున్న పని సాధిస్తేకాని, వదలదు. ఆమె దేవిడోవ్‌ని లోబరచుకోవాలనుకొంది. గ్రిమాచీలో మరి యెవరినైనా పెళ్ళిచేసుకోలేకపోదు కాని, వుపయోగం యేముంది? చాకిరీతో సరిపోతుంది జీవితం అంతా. సుఖం వుండదు. దేవిడోవు దృఢమైనవాడు: మంచివాడు, నిరాడంబరమైనవాడు. మకార్ మాదిరిగా అస్తమానూ 'ప్రపంచవిప్లవం' అని కలలుకంటూండడు. ఒక్క లోపంమాత్రం వుంది. యెదరపన్ను ఒకటి పోయింది. కాని, అది అంత

లెక్కపెట్టదగిన విషయంకాదు. లుకిరియా అంత పెద్దవయస్సు లేక పోయినా, ఆమె అనుభవంలో ఒక వ్యక్తిని యెంచుకొనేటప్పుడు వళ్ళు అంత ముఖ్యవిషయంగా పరిగణించకూడదని తెలుసుకుంది.

ఆ మరునాడు సాయంకాలం ఆమె మరల వచ్చింది. క్రితం రోజు కంటె బాగా విలువైన బట్టలువేసుకుని ముస్తాబయి వచ్చింది. పత్రిక యిచ్చెయ్యడానికని నెపంపెట్టి వచ్చింది.

"మీ పత్రిక యిదిగో. ఇంకొకటి యిస్తారా ? మంచి పుస్తకాలు యేమీలేవు, మీ దగ్గర ? ఉత్సాహం కలిగించేపుస్తకాలు చదవాలని వుంది.... ప్రేమనిగురించి."

"పేపరుఒకటి తీసుకువెళ్లు. పుస్తకాలు యేమీలేవు. లైబ్రరికాదుగా యిది।" అన్నాడు.

అతను ఆహ్వానం చెయ్యనవసరంలేకుండానే కూర్చుని సంభాషణ ప్రారంభం చేసింది. చల్లికలలో తను పనిచేసిన మూడవచళాన్ని గురించీ కొత్తగా యేర్పరచి నడుపుతూన్న 'డైరీ' లో వున్న లోపాలను గురించీ అతనితో తర్కించింది. అతనికి యెందులో అభిరుచి వుందో ఆ విషయ మయ్యే మాట్లాడుతూ క్రమంగా అతన్ని సంభాషణలోకి దింపి పరిచయం వృద్ధిచేసుకొనాలని ఆమె యెత్తు.

మొదట దేవిడోవు ఆమె మాట్లాడే విషయాలు అంత శ్రద్ధగా వినలేదు. కాని, క్రమంగా ఆ సంభాషణ సాగినకొలదీ అతను విదేశాలలో అవలంబిస్తూన్న నూతన పద్ధతులనుగురించి, పాలు అభివృద్ధిచేసే విధానా లనుగురించి చెప్పేడు. ఆఖరుకు యిల్లా అని ముగించేడు.

"వీటి అన్నిటికీమూలం డబ్బుకావాలి మనకి. చాలా పాలు యిచ్చే సాంప్రదాయంగల ఆవుదూడలు, ఎన్నిక అయిన ఆబోతులు .... యెంత త్వరగా సంపాదిస్తే అంతమంచిది. 'డైరీ' సరియైన పద్ధతులలో నడిపించి నట్లయితే చాలా లాభంవస్తుంది. ఇప్పుడు మన 'డైరీ' లో వెన్నతీసే యంత్రం బహు పురాతనపుది వుంది. అదైనా వుపయోగించదు. పాలు

విరిగిపోతున్నాయన్నావు. ఎందుచేత, పాత్రలు పరిశుభ్రం చెయ్యడంలో వున్న లోపంచేత."

"అనేక లోపాలున్నాయి లెక్కపెట్టడం ప్రారంభిస్తే" అంది ఆమె.

"నేను చెప్పేదికూడా అదే. అందుచేత ఆ 'డైరీ' ని నడిపే బాధ్యత నువ్వుతీసుకుని అభివృద్ధిలోనికి తీసుకురా. మేనేజిమెంటు నీకు అన్నివిధాలా సహాయపడుతుంది. పాత్రలు పరిశుభ్రంగా వుంచకపోవడంచేత పాలు తరుచుగా విరిగిపోతున్నాయి. ఈమధ్య ఒకామె పాలుపితకడం చూసేను; ఆవు పగ్గిరకూర్చుంది. పొదుగు కడగలేదు. నాలుగు చన్నులూ పేడతో వున్నాయి. ఆఖరికి ఆమె చేతులయినా కడుక్కోలేదు, ఇటువంటివాళ్ళు వున్నారు 'డైరీ' లో యిప్పుడు. అప్పుడు తీరికలేక ఆ విషయంలో కలుగ చేసుకోలేదు. ఇంక తగిన శ్రద్ధతీసుకోవాలి. సీతాకోకచిలకలా ముస్తాబయి వీధులు తిరిగేకంటే 'డైరీఫారం' మేనేజిమెంటు తీసుకుంటే బాగుంటుంది నువ్వు. నిన్ను మేనేజరుగా చేస్తాము. పైకివెళ్ళి చదువుకుని 'డైరీఫారం' నడిపించడం నేర్చుకుందువుగాని."

"వద్దు. వాళ్ళనే తంటాలు పడనియ్యండి. నాకంటే సమర్థులైన వాళ్లు అనేకమంది దొరుకుతారు మీకు. నాకు మేనేజరుపదవి అవసరంలేదు. ఎక్కడికికో వెళ్ళి ట్రైనింగు పొందడం అసలేవద్దు. అనేక చిక్కులున్నాయి అందులో, ఎద్దులా శ్రమపడి పనిచేసేపనులు నాకువద్దు. ఏదో కొద్దిగా పనిచేస్తూ మిగిలినకాలం సుఖంగా గడపాలని నా ఆశయం. నా దృష్టిలో కష్టించి పనిచేసేవాళ్ళు మూర్ఖులు."

"మళ్ళీ నీ పాతధోరణి ప్రారంభించేవు" అన్నాడు దేవిషోవు కోపంగా. ఆ విషయమై ఇంక తర్కించలేదు ఆమెతో.

కొద్దిసేపటికి ఆమె వెళ్ళిపోడానికి లేచింది. లుకిరియా యిల్లుచూడ డానికి అతనుకూడ బయలుదేరేడు. చాలసేపు ఒకరితో ఒకరు మాట్లాడ కుండావెళ్ళారు. లుకిరియాయే తిరిగి సంభాషణ ప్రారంభంచేసింది. అతని అభిరుచుల్ని ఆమె బాగా యెరుగును,

"ఈవేళ క్యూబాన్ గోధుమ యెల్లావుందో చూశారా ?"

"ఆ ప్టే బాగులేదు. ఈవారంలోపుగా వర్షాలు కురవకపోతే చేలు యెండిపోతాయి. అంతటితో అవదు. సంతోషించేవాళ్ళున్నారు వూళ్ళో చాలమంది. "వర్షంకోసం భగవంతుణ్ణి ప్రార్థించకపోతే యెందుకు కురుస్తుంది ? మంచిబాగా అయింది" అంటారు ముసలివాళ్ళంతా. వర్షం కురవడం వాతావరణ పరిస్థితుల్నిబట్టి వుంటుందని వాళ్ళకి తెలియదు. కాని, వర్షం కురవకపోతే వాళ్ళమూఢనమ్మకం ఇంకా ధృఢపడుతుంది. అందుకు మన మేంచేస్తాం ; మనలోపంకూడా కొంత లేకపోలేదు. అన్నిటికంటె ముందుగా గోధమచల్లి వుండవలసింది." అని దేవిడోవ్ చెప్పుకు పోతున్నాడు. లుకిరియాకి విసుగుకలిగింది.

"ఆ విషయం వదిలిపెట్టండి ఇంక." అంది ఆమె. ఇక్కడ కూర్చుని కొంచెం విశ్రాంతి తీసుకుందాం." చంద్రకాంతిలో దగ్గరలో కనిపిస్తూన్న ఏటవాలు ప్రదేశంకేసి చూపించి.

అక్కడికివెళ్ళి నిలబడి గౌను అంచులు దగ్గరగాచేర్చి పట్టుకొంది.

"మీ కోటు పరవండి, నేలమీద. దానిమీద కూర్చుందాం. లేకపోతే నా గౌను బాడి అవుతుంది........"

ఆ కోటుమీద ఇద్దరూ దగ్గరగా కూర్చున్నారు. ఎందుకో నవ్వు కుంటూన్న అతని ముఖం దగ్గరగా ముఖంపెట్టి ఇల్లా అంది.

"వ్యవసాయంగొడవ యెత్తకండి యింక. ఇటువంటి సమయంలో మాట్లాడుకోదగిన విషయంకాదు. పాప్లారుచెట్ల చిగుళ్ళవాసన యెల్లా వేస్తూందో !"

అంతవరకు దేవిడోవ్ మనస్సుని బాధిస్తూన్న సందేహాలన్నీ యెక్కడివక్కడపోయేయి. ఒక దృఢనిశ్చయానికి వచ్చేడు. లుకిరియా అందానికి వ్యామోహం కలిగినా తన పదవికి, గౌరవానికి లోపం ఏమో అని భయపడ్డాడు........

తరువాత కొంతసేపటికి అతనులేచి నిలబడ్డాడు లుకిరియా చేతు జాపుకొని ... తలావడుకొని, కళ్ళుమూసుకొనివుంది. అందుకో యెవరూ

మాట్లాడలేదు. ఆమె అతాత్తుగాలేచి కూర్చుని చేతులు మోకాళ్ళకు చుట్టేసి నవ్వసాగింది. ఎవరో కితకితలు పెడుతూన్నట్లు తెగనవ్వింది.

"ఎందుకు, అల్లా నవ్వుతావు ?" అని అడిగేడు దేవిదోవ్ ఆశ్చ ర్యంగా.

ఎంత అతాత్తుగా నవ్వు ప్రారంభించిందో అంత అతాత్తుగాను ఆపేసి కాళ్ళుబారజాసి, చేతులతో తొడలమీద కొడుతూ "ఇప్పుడు యెంతో తేలికగావుంది........" అంది.

"రెండు ఈకలుగుచ్చుకో యెగరవచ్చు"అన్నాడు దేవిదోవ్ కోపంగా.

"కంగారు పడకండి........ఇప్పుడు యెంతో సుఖంగా వుంది. అందుచేత నవ్వేను. ఇటువంటి సమయంలో నవ్వక, యేడవాలా ? కూర్చోండి. లేచి నిలబడ్డారెందుకు ?"

దేవిడోవు అనుమానిస్తూ కూర్చున్నాడు. "ఇప్పుడు ఈమెతో యేమిటి చేసేది ? ఇదో గడ్డుసమస్య అయేలావుంది. ఇంతవరకూ యే బాదరబందీలేకుండా వున్నానుకాని, ఇకనుంచి కావలసినన్ని !" అను కుంటూ, చంద్రకాంతిలో ఇంకా అందంగా కనబడుతూన్న లుకీరియా ముఖంకేసి ఓరగా చూసేడు.

ఆమె చేతులు నేలమీద మోపకుండగనే లేచి నిలబడింది.

"అందంగా కనిపించడంలేదూ, నేను ?" అంది.

"లేకపోతే యింతవరకూ యెందుకు వస్తుంది ?" దేవిదోవ్ ఆమె రెండుభుజాలూ పట్టుకొని దగ్గరగా చేర్చుకొన్నాడు.

---

## నలభయ్యో ప్రకరణము.

### పునరావృత్తి

ఆ మరునాడు యాకోవ్‌లూకుచ్ అడవికి వెళ్ళేడు. వాగుకు డాము కట్టడానికి కావలసిన కలపకోసం మూడవదళం వస్తుంది. ఏ యే చెట్లు కొట్టవలసినదీ ఇతను గుర్తుపెట్టాలి.

యాకోవ్ లూకిచ్ వుదయాన్నే బయలుదేరేడు. అంత క్రితంరాత్రి బాగా వర్షం కురవడంచేత నేల అంతా బాడిగావుంది. నెమ్మదిగానే పోనిస్తున్నాడు గుర్రాన్ని. కళ్ళెంవదలి సిగరెట్టు వెలిగించి నలుమూలలా చూసేడు. "ఆ తొస్పిముండాకొడుకు వాన కురుస్తుంధన్నాడు. అల్లాగే కురిసింది. ఈ వర్షంతో చేలు యెల్లాపడితే అల్లా వస్తాయి. ఈ ప్రభుత్వం వచ్చేక కాలమానంకూడా బాగుంది. అంతకుపూర్వం ప్రతిసంవత్సరం ఏవో ఈతిబాధలవల్ల దేశంలో కరువుకాటకాలు యేదో ప్రాంతంలో వుంటూనే వుండేవి. దానంతటదే పోయేటట్లుగాలేదు ఈ పాడుప్రభుత్వం. ఈ కమ్యూనిస్టుల్ని విదేశాల సహాయంలేనిదే మనం ఒక్కళ్ళం యేమీ చేయలేము. పొలోవిట్సేవులు ఎంతమందివున్నా లాభంలేదు. ప్రజలకి ఒకరిమీదవొకరు చాడీలు చెప్పడమేపని. 'నన్ను తప్పించి వూరంత పిడుగుపడు' అని తన బాగుచూసుకుని మిగిలినవాళ్ళు యెల్లాపోయినా సరే అని చూస్తూంటారు. బ్రతుకే కష్టం ఈ పరిస్థితుల్లో, నా రోజులు బాగుండబట్టికాని, లేకపోతే పొలోవిట్సేవుతో నాకుగల సంబంధానికి ఈ మెడమీద తలకాయ వుండక పోను. ఇంతటితో తెమిలినందుకు అదృష్టవంతుణ్ణి. మనం చెయ్యగలిగిన దేమీలేదు. చూస్తూ కూర్చోవడంతప్ప" అనుకున్నాడు.

అడవిదగ్గరికి వచ్చేటప్పటికి మధ్యాహ్నం అయింది. నోట్లోనుంచి కళ్లెంతీసి గుర్రాన్ని మేతకి వదిలేడు. బెల్టులోనుంచి చేగొడ్డలితీసి ఓకుచెట్లు కొట్టవలసిన వేవో యెంచి గుర్తుపెట్టడానికి బయలుదేరేడు. అడవి అంచునే బాగా యెదిగియున్న ఆరుచెట్లు గుర్తుపెట్టి ముందుకు బయలుదేరేడు. నిటారుగా బాగా యెత్తుయెదిగి బాగా విస్తరించిన ఓకుచెట్టు ఒకటి కనబడింది. మ్రాను లావునుబట్టిచూసి దానికి తన వయస్సే వుంటుందని వూహించి, దానిని కొట్టెయ్యాలికదా అనుకున్నాడు.

దానిమ్రానుమీద గ్రి. స. షే. అని బెరడుచెక్కేసిన స్థలంలో పెనిసిలుతో వ్రాసి, సిగరెట్టు కాల్చుకొనడానికి కూర్చున్నాడు. "నువ్వు యెంత కాలం జీవించినా నీమీద పెత్తనం చెలాయించేవాళ్లు యెవరూలేరు!"

అనుకున్నాడు ఆ చెట్టుకేసిచూస్తూ. "కాని, ఇప్పటికి నీ రోజు వచ్చింది. వాళ్లువచ్చి మొదలుకొట్టి, కొమ్మలునరికి, తుంతెతుండెములుగా నరికి తీసుకుపోయి వాగుకు అడ్డకట్టకోసం వుపయోగిస్తారు. క్రమంగా బిలికిపోయి, ప్రవాహానికి కొట్టుకుపోయి నామరూపాలులేకుండా నశిస్తావు."

ఆ ఆలోచన యెందుకో అతనికి బాధకలిగించింది. రోజూమాదిరిగా లేదు అతని మనస్సు ఆ రోజున. "నిన్ను కొట్టనియ్యను. ఈ సమిష్టి వ్యవసాయక్షేత్రం బారి పడకుండా కొంత కాపాడినా మంచిదే. చిరకాలం జీవించు. ప్రపంచంలోని యీ బాధలు నిన్ను అంటవు. నీకు పన్నులులేవు. సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో చేరవలసిన పనిలేదు. ఆ భగవంతుడు యెల్లా పుట్టించేడో అల్లాగే నిర్విచారంగా పెరుగు."

హడావిడిగాలేచి నిలబడి పట్టెకు బాడితీసి బెరడుచెక్కేసినచోట ఆ చెట్టు మ్రానుకుపూసి ఆనవాలు కనబడకుండాచేసి కొంత సంతృప్తితో అక్కడినుంచి ముందుకు వెళ్ళిపోయేడు.

మొత్తం 67 ఓకుచెట్లు గుర్తుపెట్టి, యాకోవ్‌లూకుచ్ గుర్రం యెక్కి వెనక తిరిగివస్తున్నాడు.

"యాకోవ్‌లూకుచ్, కొంచెం ఆగు" అని యెవరో పిలిచినట్లు అయింది. ఒకరుప్పచాటునుంచి నల్లటిటోపీ, బొత్తాలులేని జాకెట్టుతో ఒక వ్యక్తి బయటికివచ్చేడు. అతని ముఖం అంతా మాడిపోయి నల్లగావుంది యెండదెబ్బకి. కళ్ళు గుంటలుపట్టేయి. తెల్లటి పెదవులపై నల్లటిమీసాలు తెలుపుమీద మసిబొగ్గుతో గీసినట్లున్నాయి.

"నన్ను గుర్తుపట్టలేదూ?" అతను టోపితీసేసి, జాగ్రత్తగా నల వైపులాచూస్తూ యెదరికివచ్చేడు. యాకోవ్‌లూకుచ్ అతనిని ఫ్రోల్ కొడుకు టిమోఫీ అని గుర్తించేడు.

"ఎక్కడనుంచి వచ్చేవు?" అన్నాడు యాకోవ్ ఆశ్చర్యంగా అతని స్వరూపంకూడా గుర్తుపట్టడానికికూడా వీలులేనంతగా మారిపోయింది. అతినికృష్టంగా వున్నాడు.

"రావడానికి అసంభవమైనచోటనుంచి........ప్రవాసంనుంచి........కోట్లాస్‌నుంచి........"

"తప్పించుకు పారిపోయి రాలేదుకదా ?"

"అవును. తప్పించుకువచ్చేసేను. యాకోవ్! తినడానికి యేమైనా వుందా నీదగ్గర ? రొట్టెకాని మరి యేదయినాసరే!"

"ఆఁ – వుంది."

"వుంటే యిద్దూ. యెంతోపుణ్యం వుంటుంది నీకు. నాలుగురోజుల నుంచి....ఆకులు, బెరడుతిని ప్రాణాలు నిలబెట్టుకుంటున్నాను" ఆహారం వుందనగానే నోరూరి గుటకవేసేడు. లూకుచ్ రొట్టెతీస్తుంటే కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుచూస్తూ నిలబడ్డాడు. పెదవులు చలించేయి.

ఎన్నడూ తిండి యెరగనివానిలా అత్యాసతో ఆడావిడిగా ఆరొట్టె టిమోఫీ నమలకుండా తినేస్తూంటే యాకోవ్‌లూకుచ్ నోరు తెరచుకుని చూస్తున్నాడు. ఆఖరిముక్క కూడా తినేసేక తాగినవానిలా టిమోఫీ యాకోవ్‌వైపు చూసేడు.

"పాపం, నీకు చాల రోజులనుంచి తిండి లేనట్లుందే!" అన్నాడు లూకుచ్.

"ఈవేళకి అయిదురోజులయింది తిండితిని. ఆకులలములు తిని ఈడ్చుకువచ్చేను. ఒక్కొక్కచోట అవికూడాలేవు. కొంచెం చిక్కిపోయి వుంటాను."

"నీ తండ్రి బాగున్నాడా ? మీవాళ్ళంతా యేంచేస్తున్నారు ? అంతా క్షేమమా ?" అని లూకుచ్ కుశలప్రశ్నలు వేస్తూన్నాడు. కాని అతను గుర్రం దిగకుండా యెవరేనా వస్తున్నారేమోనని నలువైపులా భయంతో చూస్తున్నాడు.

"మా తండ్రి చచ్చిపోయేడు జబ్బుచేసి. తల్లి, చెల్లెలుమాత్రం బ్రతికి వున్నారు. కాని ఇక్కడి వ్యవహారాలు యెల్లావున్నాయి ? లుకిరియా నగులోవ్నా యేంచేస్తూంది ?........"

"భర్తనుంచి విడిపోయింది...."

"అయితే యిప్పుడు యెక్కడవుంది ?"

"మేనత్తదగ్గర వుంటూంది...."

"యాకోవ్ ఇల్లాచూడు. నువ్వు పూళ్ళోకి వెళ్ళగానే ఆమెతో ఈవేళ ఇక్కడికి తిండి తెచ్చిపెట్టమన్నాననిచెప్పు. వూళ్ళోకి వచ్చేందుకు కూడా శక్తిలేదు నాలో యిప్పుడు. ఇక్కడేవుంటి కొంచెం విశ్రాంతి తీసుకుంటాను. 120 మైళ్ళు నడక....దోవ-తెన్ను యెరగనిదేశం....అందులోను రాత్రిపూట....యెంతకష్టమోచూడు. తప్పకుండా ఏదైనా తెచ్చి పెట్టమను. కాస్త బలంచేరగానే వూళ్ళోకి వస్తాను."

"ఇకనుంచి నువు యెల్లా జీవిస్తావు ?" అని అడిగేడు లూకుచ్. టిమోఫిని కలుసుకొనడంతో అతనికి మళ్ళీ వెనకటి భయం పట్టుకుంది.

"యెల్లాగంటావా ? ఇప్పుడు కొంచెం విశ్రాంతి తీసుగుంటాను" తరువాత వూళ్ళోకివస్తాను. దాచివుంచిన నా తుపాకీతవ్వి బయటికితీస్తాను. దానితో నా జీవితం గడుపుతాను. ఒక్కటేవుంది నేచేసేది. వాళ్ళు నన్ను శిక్షించేరు; దానికితగిన ప్రతీకారంచెయ్యాలినే. ముందుముందు వింటారు నన్నుగురించి. ఒకరిద్దర్ని బలిపుచ్చుకుని వేసవివరకూ ఈ ప్రాంతంలోనే వుండి ఆ తరువాత క్యూబాన్‌కిగాని, మరి యే యితర ప్రాంతానికిగాని పోతాను. ఇంతదేశం వుంది. నా బోటివాళ్లు అనేకమంది దొరుకుతారు సహచరులుగా."

"లుకిరియా సమిష్టివ్యవసాయక్షేత్రపు ఛైర్‌మన్ దేవిదోవ్‌తో తిరుగుతూన్నట్లు తోస్తుంది" అన్నాడు లూకుచ్ దేవిదోవ్ యింటికి ఆమె వెడుతూండడంచూసి

టిమోఫీకి కడుపులో పోటువచ్చి మూలుగుతూ క్రింద కూలబడ్డాడు.

"అందరికంటె ముందు దేవిదోవ్‌నే చంపుతాను .. చచ్చినవాడిక్రింద జమకట్టండి యింక వాణ్ణి....లుకిరియాకి నేనంటే చాలాప్రేమ. ఈ జన్మలో ఆ ప్రేమ నశించదు దానిహృదయం నేనెరుగుదును. దానిని వశపరచుకో

గలను. ఎందుచేతనో పొట్టలో పోట్లువస్తున్నాయి. ఒకీరియాతో....చాల రొట్టెలు తీసుకురమ్మని చెప్పు."

ఆ మరునాడు అక్కడికి చెట్లు కొట్టడానికి వస్తారనీ, జాగ్రత్తగా వుండమనీ చెప్పి వెళ్ళిపోయేడు. అక్కడనుంచి తిన్నగా రెండవదళం పనిచేసే చేలవైపు వెళ్ళేడు. అక్కడ చల్లిన క్యూబాన్ గోధుమ బాగానే వస్తూంది. అంతవరకు నల్లగా కనబడేనేల పచ్చబడుతూంది. చీకటిపడ్డాక వచ్చేడు లూకుచ్ వూళ్లోకి. గుర్రాన్ని నమిష్టిశబేలాలోవదిలేసి ఇంటికివచ్చేడు. టిమోఫీని కలుసుకొన్నప్పటినుంచీ ఎందుకోకాని మనిషిదిగులుగావున్నాడు. తీరా యింటికి వచ్చేటప్పటికి 'పులిమీద పుట్ర'లా యింకొకటి వచ్చింది. లోపలికి వెళ్ళేటప్పటికి కోడలు అడావిడిగా వచ్చి ఇల్లా అంది;

"మనయింటికి యెవరో అతిధులు వచ్చేరు ......"

"ఎవరు వారు?"

"పోలోవిట్సేవు, ఆయనతోకూడా వున్న యింకొకరూను. చీకటి పడుతూండగా వచ్చేరు అత్తగారు, నేను పాలు పితుకుతున్నాము. అప్పుడు............గదిలోవున్నారు వాళ్ళు. ఇద్దరూ బాగాత్రాగి ఒళ్ళు తెలియని స్థితిలో వున్నారు. గుడ్డలన్నీచిరిగి పేలికలు అయిపోయాయి."

అతిధులిద్దరూ వున్న గదిలోనుంచి మాటలు వినబడుతున్నాయి. లెటెస్కీవి ఆ మాటలు.

"........సరే, బాగానేవుంది. అయితే తమరు యెవరు? నీకు తెలియకపోతే నేను చెబుతాను విను. ఏం—అంతేనా? మాతృభూమిలేని దేశభక్తుడవు, సైన్యంలేని సేనానాయకుడవు, ఈ రెండూ బాగులేకపోతే ఇంకొకటి చెబుతాను, చేతిలో యెర్రటి యాగానికూడాలేని పెద్ద జూదగాడవు." అందుకు సమాధానంగా పోలోవిట్సేవు యేదో చెబుతున్నాడు. అదేదీ వినిపించుకోకుండా లూకుచ్ పక్కనే వున్న గోడనానుకొని రెండు చేతులతోను తలపట్టుకున్నాడు.

కథ అంతా తిరిగి ప్రారంభం అయింది.

---